# స్వీయ చరిత్రము

ఇది

రావుబహదూర్ కందుకూరి వీరేశలింగము గారిచే

రచియింపఁ బడినది.



ప్రకాశకులు:

హితకారిణీ సమాజము :: రాజమండ్రి



[వెల 8—0—0

తృతీయ ముద్రణము

1000 ప్రతులు.

నవంబరు, 1954

ఇందు మొదటి రెండు ఫారములు, చివరి పదుఫారములు
అవంతీ ప్రెస్సు నందును, మిగిలిన భాగమంతయు
బాకన్సు ప్రెస్సునందును ముద్రింపబడినది.

వీరేశలింగ రచనలు కావలసినవారు ఈ దిగువ చిరునామాకు వ్రా.

**హితకారిణీ సమాజము,**

రాజమహేంద్రవరము

తూర్పు గోదావరి.

# పరిచయం



ఈ స్వీయచరిత్రము ప్రప్రథమమున కీ॥ శే॥ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారిచే విజ్ఞానచంద్రికాగ్రంథమండలి ద్వారా రెండు భాగములుగ ప్రచురింపబడినది. ఇందలి ప్రథమభాగము 1911 సంవత్సరములో వెలువడినది. దానిని శ్రీ పంతులుగారు తమ సహధర్మచారిణి అగు కీ॥ శే॥ రాజ్యలక్ష్మమ్మగారికి అంకితము చేసిరట. ద్వితీయ భాగము 1915 సంవత్సరములో వెలువడినది.

ద్వితీయ ముద్రణము శ్రీ పంతులుగారి రచనలన్నిటియొక్క ప్రచురణాధికారము గల హితకారిణీ సమాజము వారిచే 1936 సంవత్సరములో ప్రచురింపబడినది.

1936 సంవత్సరము మొదలుకొని 1948 సంవత్సరము వరకు శ్రీ పంతులుగారి రచనలేవియు అచ్చుపడినట్లు కనబడదు. చాలవరకు పుస్తకములు అమ్మకమునకు లభించకపోవడం జరిగినది. 1947 సంవత్సరములో హితకారిణీ సమాజమునకు నూతనకార్యనిర్వాహక వర్గము ఏర్పడినది 1918 సంవత్సరములో దంగేటి నారాయణస్వామిగారు గౌరవ కార్యదర్శిగ ఎన్నుకోబడిరి. 1949 – 53 సంవత్సరముల మధ్య వీరేశలింగ గ్రంథముల నన్నింటిని అధికవ్యయ ప్రయాసలతో పునర్ముద్రించడం జరిగినది. వాటిలో ఆఖరున 1952–53 సంవత్సరముల మధ్య ముద్రింపబడినది ఈ స్వీయచరిత్రము.

1953 ఆగస్టు 15 తేదీని వచ్చిన బ్రహ్మాండమైన గోదావరి వరదలో, వరదకు గురియైన ప్రాంతములోనున్నట్టి శ్రీ వీరేశలింగాస్తికోన్నత పాఠశాలాభవనములో నిలువచేయబడిన పంతులుగారి గ్రంథములన్నియు వరదలో మునిగి అధికనష్టము సంభవించినది. ఈ స్వీయచరిత్రయొక్క ప్రతులు ఆనాటికి అచ్చుఆఫీసులోనే యుండి వరదకు గురికాకుండా దక్కినవి.

1953 సంవత్సరం, సెప్టెంబరులో శ్రీ దంగేటి నారాయణస్వామిగారు అనారోగ్యకారణంగా, కార్యదర్శి పదవినుండి విరమించుకోగా ఆ స్థానములో నేను ఎన్నుకోబడడం జరిగినది. వరదదెబ్బనుండి తేరుకొని తిరిగి గ్రంథప్రచురణ కార్యక్రమమునకు పూనుకొనుటకు సుమారు 7, 8 మాసములు వ్యవధిపట్టినది.

అప్పటికే అచ్చు పనిపూర్తి అయియున్న స్వీయచరిత్రకు, విషయానుక్రమణికను తయారుచేయించి, ఈ ముద్రణకు పీఠికను వ్రాయించి, వాటిని అచ్చు వేయించి, బైండు చేయించుట, మార్కెట్టులో పెట్టుట మాత్రమే నా వల్ల జరిగినది.

విషయానుక్రమణికను తయారుచేయుటకు కొందరు 5, 6 మాసముల వ్యవధి కావలయునని తెలిపియుండిరి. కాని కోరినవెంటనే ఆ కార్యభారమును వహించి ఒక్క నెలరోజులలో దానిని అకారాదిక్రమములో తయారుచేసి ఇచ్చినందులకు మిత్రులు మహీధర జగన్మోహనరావుగారికి నా కృతజ్ఞత తెలుపుచున్నాను. తృతీయ ముద్రణకు పీఠిక వ్రాసియిచ్చిన చారిత్రక పరిశోధకులు శ్రీ భావరాజు వేంకట కృష్ణారావుగారికి నా వందనములు. ఈ తృతీయ ముద్రణలో శ్రీ పంతులుగారికి సంబంధించిన సంస్థలయొక్కయు, వ్యక్తులయొక్కయు ఫొటోబ్లాకులను అచ్చువేయింపవలయునని తలంచితిని. కాని వ్యవధిలేక జరగలేదు. వచ్చే ముద్రణలోనైనా వాటిని చేర్చి, అచ్చు తప్పులులేకుండా నిర్దుష్టముగ ముద్రించుటకు ప్రయత్నిస్తాము. ఆంధ్ర మహాజనులు ఈ గ్రంథమును విరివిగాకొని ఆదరిస్తారని ఆశిస్తున్నాము.

ఇట్లు,

రాజమహేంద్రవరము
16—11—1954

యాసంరెడ్డి వెంకట్రావు,
గౌరవ కార్యదర్శి,
హితకారిణీ సమాజము.



నవ్యాంధ్ర నిర్మాత, యుగపురుషుడు

రావుబహద్దూర్ కందుకూరి వీరేశలింగం పంతులుగారు

జననం : 16–4–1848 నిర్యాణం : 27–5–1919

# తృతీయముద్రణ పీఠిక

వీరేశలింగం పంతులుగా రొక మహావ్యక్తి. ఆయన యొక యుగపురుషుడు. ఆయన ప్రభావము నేటివఱకు సంఘమందు, సాంఘికజీవనమందు, భాషయందు, వాఙ్మయమందు, నిత్యవ్యవహారమునందు, ఇక్కడ నక్కడ యననేల ప్రతీ విషయము నందును, ప్రస్ఫుటముగా కనబడు చున్నది. అట్టి మహనీయుని స్వీయచరిత్ర నిక్కముగా నాంధ్రులకు రంజకమయినది. అట్టి ప్రాశస్త్యము దానియందుండుటచేతనే గాబలయును అది మూడవ ముద్రణభాగ్యమును నోచుకొన్నది

వీరేశలింగము పంతులుగారి జీవితములో మూడుపంతులకు మించిన భాగము పందొమ్మిదవ శతాబ్దమున గడచిపోయెను. ఆయన యుగపురుషుడనుటకు మూల కారణమందే యున్నది. గోలకొండ కుతుబుశాహిరాజవంశ మంతరించినది మొదలు కొని రెండు శతాబ్దములకాల మాంధ్రభూమి, ఆంధ్రప్రజలు మత, సాంఘిక, రాజకీయ వ్యవహారములందు ఊపిరాడనివ్వని గొప్ప తుఫానువంటి విప్లవమునందు చిగుల్కొని యుండిరి. స్వాతంత్ర్యము పోయి పారతంత్ర్యము ఆంధ్రులపాలబడెను. పారతంత్ర్యము పాలబడిన ప్రజలదుస్థితి వర్ణింపనలవిగానిది. ఆంధ్రభూమి విచ్ఛిన్నమయి పోయెను. ఆంధ్రభాష, వాఙ్మయము, సంస్కృతి, తేజస్సు, మహిమ, ప్రభావము, శక్తి, ప్రతిభ అన్నియు నొక్కసారిగా తెఱమఱుగునకు బోయినట్లయ్యెను. ఆంధ్రజాతిని మరల నుద్దీపింపఁజేసి ఉద్ధరింపగల మహామతి యవతరింపకపోయెను. అంతలో బ్రిటిషు పరిపాలనము భరితభూమిని సుస్థిరమగుట సంభవించెను. ఒక మహావిప్లవము ఒక మహాసంఘర్షణము ఇంకను చల్లారకముందే పాశ్చాత్యనాగరికతా సంపర్కము, దానివలన వాటిల్లిన సంఘట్టన, విరోధభావములు ఆంధ్రజాతిని ముంచెత్తివేసెను. దేశమొక అయోమయ స్థితిలోనికి బోయెను. అట్టి విచిత్రసంధియుగమున ఆంధ్ర భూమిని యవతరించెను శ్రీ వీరేశలింగముపంతులు.

వీరేశలింగం పంతులు ధీశాలి; దేశమును తన ప్రజను ఉద్ధరించవలెనని సంకల్పముగల మహిమగలవాడు. పాశ్చాత్యనాగరికత పంతులుగారిని పూర్తిగా ముగ్ధుని చేసివైచెను. ఐరోపియను జాతుల నాగరికత సంస్కృతియందుగల దోషములకంటె అత్యధికముగ గుణములే వారిని ఆకర్షించెను. దానితో వారి ఆవేశమే మారిపోయెను. పంతులుగారి స్వభావమునందితరుల యందు తఱచు గానబడని ఉత్తమ గుణములు కొన్ని మూర్తీభవించుటయేగాక, కొన్నియతీత నిశితములయి యుండెను. పంతులుగారు తాను సంకల్పించినది, తనకు ధర్మసంబుద్ధిగలదని తోచినపుడు ఆ సంకల్పమును ఏ రీతిగానైనను ఆచరణలోపెట్టి, సంకల్పసిద్ధిబొందగల శక్తి సామర్థ్యములు గలవారు. ఇది ఆయన స్వీయచరిత్రయందు ప్రతి పుటయందును ప్రతి వాక్యమునందును తేట తెల్లముగ గానవచ్చును.

శ్రీ పంతులుగారు తన జీవితము నంతయు తన తోటియాంధ్ర ప్రజల నుద్ధరింప దలపడిన మహనీయులు. వారి ప్రధానము సాంఘిక జీవనమునందెంతగలదో వాఙ్మయమునందంతయును గలదు. ఆయన అభినవగద్య వాఙ్మయ ధురంధరుడు. అది వీరేశలింగం పంతులుగారితో నారంభమయ్యెను. ఆంధ్రవాఙ్మయమునందు పత్రికా ప్రచురణము వ్యాసరచనమును వారి తెలుగు గద్యరచన తేటతెల్లమైనదయినను ఒక్క దోషము మాత్రమందు గానవచ్చును. ఆంగ్లభాషా సంపర్కము పంతులుగారి రచనలందు తెలుగు నుడికారముకంటె ఎక్కువగా ముందుకు త్రోసికొని వచ్చుచుండును.

పంతులుగారి స్వతంత్ర రచనలలో ప్రధానమైనది ఆంధ్రకవుల చరిత్ర. తనకు తెలియవచ్చిన విషయముల నన్నింటిని క్రోడీకరించి, వితర్కించి, విశ్వాసార్హమయిన వానిని నిశిత విమర్శనాబుద్ధితో, కాలక్రమ నిర్ణయ దృష్టితో పరిశీలించి గ్రంథము వ్రాసినారు శ్రీ పంతులుగారు. ఆంధ్రకవుల చరిత్ర ఆంధ్రభాషయందొక యుత్తమ గ్రంథము. దానితో తుల్యమయినది. అనుపమానమయినది స్వీయచరిత్ర. భారతీయ భాషలలో వీరేశలింగం పంతులుగారి స్వీయచరిత్రవంటి గ్రంథము మొదట వెలువడిన రణమున అద్వితీయమైన, అసమానమయిన, అపూర్వమయిన ఉత్తమ గ్రంథము. యచరిత్ర వ్రాయువారికి రెండు అపూర్వములయిన గుణములుండవలెను. అందొకటి

సత్యప్రియత్వము. రెండవది తనగురించి లోకులన్న దానిని విమర్శించుటయో, సమర్థించుట, లేక సహన్వయించుటకు సహనబుద్ధి గలిగియుండుట. ఈ రెండు విశేష గుణములను శ్రీ పంతులుగారి స్వీయచరిత్రయందు గాననగును. శ్రీ వీరేశలింగం పంతులుగారి కంటె యన్యుఁడొకడీ యాంధ్రభూమిని స్వీయచరిత్ర పటిమతో వ్రాసి ప్రకటింపగల మహామహిమాన్వితుడు గానరాడు. ఆయన కాయనమే సాటి. ఆయన ప్రథముడు — పంతులుగారి స్వీయచరిత్ర ఒకవిధముగా ఆంధ్రుల సాంఘిక చరిత్ర.

రాజమహేంద్రవరము
1—11—1954

భావరాజు వేంకటకృష్ణారావు

# ద్వితీయముద్రణ పీఠిక

సంస్కృత వాఙ్మయమునందుఁ గాని యాంధ్ర సారస్వతమునందుఁ గాని చరిత్రములు లేవనుట సత్యమునకు దూరము గాదు. స్వీయచరిత్రములమాట చెప్పనక్కఱయే లేదు. గీర్వాణభాషలో హర్షచరిత్రము, కాదంబరి యను రెండు మహావచన కావ్యములు వ్రాసి 'బాణోచ్ఛిష్టమ్ జగత్సర్వమ్' అని ప్రఖ్యాతిగాంచిన బాణమహాకవి తన ప్రఖ్యమైన హర్షచక్రవర్తి చరిత్రము రచియించి యందు మొదట తన చరిత్రము కొంత లిఖియించెను. అది పేరునకు మాత్రమే స్వీయచరిత్రము గాని నిజముగా నట్టిది గాదు. ఏల యన నది మహాద్భుత మహిమలతో డను, నసాధారణవర్ణనముల తోడను, నతిశయోక్తులతోడను నిండియున్నది. బిల్హణమహాకవి తాను రచించిన 'విక్రమాంకదేవ చరిత్రము' అను పద్యకావ్యమునఁ దుట్టతుదను తన చరిత్రము కొంత లిఖియించెను. అదియు నాత్మకథ యని పరిగణించుటకు వీలు లేనట్లేయున్నది. ఆంధ్రమహాకవులు కూడ స్వీయచరిత్రములు వ్రాసుకొనలేదు. ఆంధ్రసారస్వతలక్ష్మికి నుపన్యాసములు, నాటకములు, ప్రహసనములు, జీవచరిత్రములు, ప్రకృతిశాస్త్రములు, నవలలు మొదలగు ననేక నూతనాలంకారములు సమర్పించి తెనుఁగునాడునకు నవీన యుగకర్త యని ప్రసిద్ధి వడసిన రావుబహద్దూరు కందుకూరి వీరేశలింగమహాకవి యాంధ్రవాఙ్మయదేవికి స్వీయచరిత్రమను సువర్ణమయాభరణమును గూడఁ దెచ్చి పెట్టి యావెలితి దీర్చి ధన్యుఁడయ్యెను. ఈ స్వీయచరిత్రమునందు వీరేశలింగ మహాశయుని జీవితకథయే గాక యాకాలమునందలి యాచారములు, కట్టుబాటులు, న్యాయస్థానముల వ్యవహారములు, దేశస్థితి మొదలయినవెన్నో తేటతెల్లముగఁ దెలియును. అందుచేత నిది యాంధ్రదేశముయొక్క సాంఘికచరిత్రమని చెప్పవచ్చును. మహావీరుఁడు, కార్యశూరుఁడు, ఆస్తికమతావలంబకుఁడు, సంఘసంస్కర్త, వచనరచనా పితామహుఁడు, శతాధిక గ్రంథకర్త, మహాదాత, మహాకవియైన వీరేశలింగ మహామహుని చరిత్రమును, నాంధ్రదేశమందు జనించిన ప్రతిపురుషుఁడు, ప్రతి స్త్రీయుఁ, జదివి యందుఁగల పెండలకొలఁది నీతిపాఠములు నేర్చుకొని ధన్యులగుదురుగాక. ప్రబంధములకన్న, నవలలకన్న, నాటకములకన్న, దేశములను, సంఘములను నుద్ధరించి మహితకార్యములకు మార్గదర్శకులైన మహామహుల యుత్తమచరిత్రములే దేశమునకు, జాతికి, మహోపకారము జేయునన్నమాట పాఠకలోకము

మఱువకుందురుఁగాక! ఈ పుణ్యచరిత్రుఁడు చూపినదారిని నేఁటికవులు, సంస్కర్తలు, మహోద్యమములు నడపి, యుపయోగకరములైన తమ జీవితచరిత్రములను వ్రాసి, దేశమిత్రులై తాము తరించి తోడి మానవులను తరింపఁజేయుదురుగాక!

ఈ స్వీయచరిత్రము మొట్టమొదట విజ్ఞానచంద్రికామండలివారు ముద్రించి ప్రకటించిరి. ఆ ప్రతులన్నియు విక్రయింపబడిపోవుటచేతను, తాను ఏ గ్రంథము వ్రాసియున్నను పలుమాఱు వ్రాయుచుండుటచేతను వీరేశలింగము పంతులుగారిచే నెలకొల్పఁబడిన హితకారిణీసమాజము రెండవ ముద్రణమును జేయించి ప్రకటింపఁ గలిగినది. ఈ గ్రంథమందలి మొదటిభాగమును ఆంధ్ర విశ్వవిద్యాపీఠమువారు బి. ఏ. పరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నిర్ణయించినందుకు హితకారిణీసమాజమువారు విశ్వవిద్యాపీఠమువారికిఁ గృతజ్ఞులై యున్నారు.

రాజమంద్రి.
22—1—37.

చిలకమర్తి లక్ష్మీనరసింహము,
వీరేశలింగ మహాశయుని శిష్యపరమాణువు.

# విషయసూచిక

## మొదటి భాగము



## రెండవ భాగము

# అవతారిక

పనిచేసి చూపవలయునన్న చింతయేకాని నను(గూర్చి నేను చెప్పుకోవలయు
నన్న యభిలాషము మొదటినుండియు నా కంతగా లేకుండెను. 1888-వ సంవత్స
రమున వేసవికాలపు సెలవులకు ముందు నా ప్రాణమిత్రులయి యుండిన బసవరాజు
గవర్రాజుగా రొకనా(డు నాయొద్దకువచ్చి యింగ్లీషుభాషలో నా జీవితమును తాను
వ్రాయ నుద్దేశించుకొన్నట్టు చెప్పి దానికి( గావలసిన సాధన సముదాయమును తన
కియ్యవలసినదని నన్నడిగిరి. నేనాయన యుద్యమమును బ్రోత్సాహపఱుపక "శ్వాస
కాసాది రోగపీడలచే దుర్బలశరీరు(డనయి యున్న నేను చిరకాలము జీవింపననియు,
దృఢగాత్రులయియున్న మీరు చిరకాలము జీవింతురు గనుక నా మరణానంతరమున
నా జీవితచరిత్రము వ్రాయ(దగినదిగా తో(చినపక్షమున నప్పుడు వ్రాయవచ్చుననియు"
చెప్పి, నా మిత్రుని నప్పటి ప్రయత్నమునుండి మరలించితిని. ఈశ్వరచిత్త మెవ్వరి
కిని మనఃపరిగ్రాహ్యమైనది. ఏమిమాయయోకాని వ్యాధిబాధితమగుచున్న దుర్బలకాయము
గల నేనిప్పటికి నీ ప్రకారముగానే యుండ(గా, దృఢకాయముగల యాత(డే యల్ప
కాలములో నాకస్మికముగా నకాలమరణము పొందుటచే నాతని జీవచరిత్రమును నేనే
వ్రాయవలసిన యవస్థ నాలుగు మాసముల లోపలనే తటస్థమయ్యెను. తరువాత కొన్ని
సంవత్సరములకు మా ముద్రాశాలలో కార్యనిర్వాహకు(డుగా నుండిన తోలేటి వేంకట
సుబ్బారావుగారు నాకు తెలుపకయే నా చరిత్రము నొకదానిని వ్రాసి వేసవికాలపు సెల
వులలో నేను చెన్నపురికి(బోయి యుండినప్పుడు 1891-వ సంవత్సరమునందు
మా ముద్రాశాలలోనే దానిని ముద్రింపించెను. అటుతరువాత కొన్ని సంవత్సరములకు
నేను చెన్నపురి నివాసముగా నేర్పఱచుకొని యచ్చటనున్న కాలములో నా మిత్రు
లనేకులు స్వీయచరిత్రమును వ్రాయవలసినదని నన్ను నిర్బంధపఱుప(జొచ్చిరి. వారి
నిర్బంధమును మానుపుకో(జాలక నా కంతగా నిష్టము లేకపోయినను 1903 వ సంవ
త్సరమునందు స్వీయచరిత్రమును వ్రాయ నారంభించి వ్రాసినదాని నెప్పటికప్పుడే 11
పటములు మా చింతామణి ముద్రాయంత్రములోనే ముద్రింపించితిని. ఇంతలో నను
ప్రోత్సాహపఱుచుచు నిర్బంధపఱుచుచు వచ్చినవారిలో ముఖ్యులయిన నా మిత్రు(

శ్రీ పరబ్రహ్మణేనమః

# ఈశ్వర ప్రార్థనము

ఓ పరమేశ్వరా! ఓ దయాసత్యధర్మస్వరూప! ఓ సుజనహృదయ ప్రమోద సంధాయకా! నీకు నమస్కారము. మిత్రులనేకుల ప్రోత్సాహముచేత నేనిప్పుడొక్క దుష్కరకార్యమును బైని వేసికొని, ఏతత్కార్యసమంజస నిర్వహణశక్తికొఱకు నిన్ను హృదయమునందు నిలుపుకొని వినయపూర్వకముగా నొక్క ప్రార్థనమును జేయుచున్నాను. నీవుఁ దక్షైన నాయెడలఁ గరుణించి నాయభీష్టసిద్ధిని గావింపుము. లోకములో నెవ్వరికైన నొకచరిత్రమును వ్రాయఁబూనుటయే యెంతో కష్టము. ఆ వ్రాయఁబూనుకొన్నది పరులది గాక స్వీయచరిత్రమయినచో నప్పటికష్ట మెంతయో యనిచెప్పుటకు శక్యముకాదు. మొట్టమొదట నెవ్వఁడైనఁ దన చరిత్రమును జెప్పుకొనుట కుపక్రమింపఁగానే లోకు లాతనిని గర్వియనియు నాత్మశ్లాఘాప్రియుఁడనియుఁ బ్రఖ్యాతికాముఁడనియు నానావిధముల భావింతురు. ఈ చరిత్రమును వ్రాయఁబూనుకొనుటలో నా యంతరంగమునం దట్టి దురుద్దేశములేవియుఁ జొరకుండును గాక! ఓ భక్తవత్సలా! ఆత్మశ్లాఘాపరత్వమును నా మనస్సునుండి దూరము చేయుము. నా హృదయమునందు సదా సత్యమును వినయమును నెలకొలుపుము. పవిత్రీభూతమయి పరమార్థచింతతోఁ దప్పఁ బ్రసిద్ధికయి నే నేపనిని జేయకుండునట్లు నా చిత్తమును శాసింపుము. దేహవిద్యాబుద్ధులయం దత్యంత దుర్బలుఁడనైన నా జీవనచరితము బహుజనాదర పాత్రమయి విశేషోపయుక్తమగునది కాకపోయినను, ఘనుల మహాకార్యప్రకటనమువలెనే సామాన్యుల యల్పకార్యప్రకాశనము కూడ సభివృద్ధికి సహకారియగు నన్న యార్యోక్తి నిజమయ్యెనేని యీ యవిశ్రుతచరితము సహితము కొందఱికిఁ గొంత ప్రయోజనకర మగునుగాక!

# స్వీయ చరిత్రము

## మొదటిప్రకరణము — బాల్యదశ

క్రీస్తుశకము 1848 మొదలుకొని 1860-వ సంవత్సరము వఱకు

భరతఖండమునందలి పురాతనము లయినపట్టణములలో నొక్కటియయి, రాజరాజనరేంద్రాది చాళుక్యచక్రవర్తులకు రాజధానియయి ఆంధ్రకవితా కల్పలత కాలవాలమయి, నన్నయభట్టారకాది కవిగ్రామణులకు వాసభూమియయి, గోదావరీతీరమందు సర్వవిధములఁ బ్రసిద్ధికెక్కియున్న రాజమహేంద్రవరమునందలి యస్మత్పితామహార్జితమైన స్వగృహమునందు కీలకనామ సంవత్సర చైత్రశుద్ధత్రయోదశీ భానువారమునాడు (అనఁగా క్రీస్తుశకము 1848-వ సంవత్సరము ఏప్రిల్ నెల 16-వ తేదీని) సూర్యోదయానంతరమున మూఁడుగడియలకు నేను జననమొందితిని. మాయిల్లు రాజమహేంద్రవరములో నున్న పెద్దయిండ్లలో నొకటి. దానితో సమానమయిన యిండ్లాపట్టణములలో రెంటిమూఁటికంటె నధికముగా లేకుండెను. నా పెదతండ్రిగారును నేనును సమభాగములుగాఁ బంచుకొన్నను, నాపాలికివచ్చిన యర్ధభాగమే రాజమహేంద్రవరములోని బహుగృహములకంటె మిక్కిలి పెద్దదిగా నున్నది. నేను జన్మించినగది నాపాలికి వచ్చిన మేడయింటిలోనే యుండి నాయధీనము లోనే యున్నది. ఆగదికిని మాగృహములోని యొక చావడికిని నడుమఁ గలగోడను దీసివేసి యేకముగా నొకవిశాల భోజనశాలనుగా మార్చి మే మిప్పుడు దానిని భోజనగృహముగా వాడుకొనుచున్నాము. నా రాజశేఖరచరిత్రమునందలి రాజశేఖరుఁడు

మైన యంత విశాలభవనమును గలిగియుండుటయే కొంతవఱకు మా పూర్వు లున్నతస్థితిలో నున్నవారిని తెలుపవచ్చును. ఆగ్రహారాజము నుగట్టించిన మాతాతగారు మహాసుప్రసిద్ధులయి కొంత కాలము సంస్థానాధిపతులయొద్ద దివానుగా నుండిరి. మాపూర్వులు సహితము సంస్థానాధిపతులును "దేశపాండ్యా"లును నయి పెక్కుకావ్యములనుముఖ్యముగా శైవగ్రంథములను గృతుల నందినవారయి యుండిరి. స్వయోగ్యత లేకయే పూర్వుల గొప్పతనమునుబట్టి తమకు గౌరవము కలుగవలయునని భావించెడు మనీషికోటిలోని వాఁడనుగాకపోవుటచేత వారి యుత్కృష్టతను వర్ణించుటకు నే నిందుఁ బ్రయత్నింపను. మా తాతగారగు వీరేశలింగముగారు మిగుల ధర్మాత్ములనియు, భూదానాదులు చేసి కీర్తివడసినవారనియు చెప్పుటమాత్ర మిప్పటి కథాంశమునకుఁ జాలియుండును. అయినను నాబుద్ధిచాపల మేమో కాని మాతాతగారి ఖ్యాతినిగూర్చి స్వానుభవమువలన నే నెఱిఁగిన యొక చిన్నయంశము నిచ్చట సంక్షేపరూపమున నైనను జెప్పకమానఁజాలకున్నాను. ఇరువదియైదుసంవత్సరముల క్రిందట నేను ధవళేశ్వరములో నాంగ్లో దేశభాషాపాఠశాలకుఁ బ్రధానోపాధ్యాయుఁడనుగా నుండి మండువేసవికాలములో నాసహపాఠియు బాల్యసఖుఁడును నగు నొక మిత్రునిఁ జూచుటకయి కాకినాడకుఁ బోయి యచ్చటినుండి పడవలో నెక్కి మరల వచ్చుచుంటిని. అప్పుడు కాకినాడకాలువలోఁ దగినంతనీరు లేదు. పడవవాండ్రెంతో ప్రయాసపడి మోకాలిలోఁతు నీటిలో పడవ నీడ్చుచుండిరి. ఇట్లు పడవ మెల్లఁగా నొకగ్రామసమీపమునకు వచ్చునప్పటికి మిట్టమధ్యాహ్నమయ్యెను; దుస్సహమయిన యెండవేఁడిమిచేత నిప్పులు చెరుగుచు వడగాడ్పులు వెచ్చగా నొకచెవినుండి యొకచెవికిఁ గొట్టుచుండెను; తీక్ష్ణాతపతాపముచేతఁ బడవలోనున్నవారికి తడియాఱి నోళ్లెండుచుండెను; ఆఁకలికిఁ దాళఁజాలక మలమలమాడుచు శిశువులు

విలపింపఁజొచ్చిరి; సాయంకాలమగునప్పటికిఁగాని పడవ ధవళేశ్వరము చేరునట్టు కనఁబడలేదు. ఇట్టిస్థితిలోఁ బడవవాండ్రను బతిమాలుకొనఁగా వాండ్రు గ్రామములోనికిఁబోయి భోజనముచేసి వచ్చువఱకును పడవ నక్కడ కట్టిపెట్టి యుంచుట కొప్పుకొనిరి. మావారు నన్ను గారాబముతోఁ బెంచి మొదటినుండియు పని చేయనీయకుంటుటచే వ్యర్థుఁడనైనవాఁడ నగుటచేత వంట చేసికొనుట యైనను నాకుఁ జేతకాకుండెను. భోజనము పెట్టినచోఁ దాను వంట చేసిపెట్టెదనని పడవలోని బ్రాహ్మణుఁ డొకఁడు నాతోఁ జెప్పెను. నే నాబ్రాహ్మణుని వెంటఁ బెట్టుకొని నిప్పులు గురియుచున్న యాయెండలో పావుక్రోసుదూరములోనున్న యాయూరికి నడచి కరణముయొక్క యిల్లుచేరితిని. ఆయూరి పేరిప్పుడు నాకు జ్ఞప్తికి రాలేదు. ఆయూర నొక్కకరణముయొక్క యిల్లుదక్క వేఱు బ్రాహ్మణగృహము లేదఁట. ఆయెండలో నట్లో యాగృహమునకు దేహములు చేరవైచి, రామాయణపారాయణము చేయుచున్న గృహపతిని జూచి భోజనార్థమై వచ్చితిమని చెప్పితిమి. వారియింట నింకను భోజనములు కాకపోయినను తాము డబ్బుపుచ్చుకొని యన్నము పెట్టువారము కామనియు, ఊరక పెట్టుటకు వలనుపడదనియు, ధనము గైకొని భోజనము పెట్టు పూటకూటియిల్లు తమ గ్రామమున లేదనియు, చెప్పి శీఘ్రముగా నింకొకయూరికిఁ బొండని మాకాయన హితోపదేశము చేసెను. కోమటియింటికిఁ బోయి బియ్యము మొదలయినవి కొని తెచ్చుకొనెద మనియు, కొంచెము తావుచూపి పాకముచేసికొనుటకు పాత్రసామగ్రియైన నియ్యవలసినదనియు, మేమాగృహస్థుని వేఁడుకొంటిమి. అతఁడు వలసినచో మృణ్మయపాత్రములను దెచ్చుకొని యొకపంచను వంట చేసికొనవచ్చునని యనుజ్ఞ యిచ్చెను. అప్పుడేమిచేయుటకును తోఁచక యాలోచించుచున్న నన్నుఁజూచి కుండలములు వేసికొని యొకపీటమీఁదఁ గూరు

చుండి వాల్మీకిరామాయణమున కర్థము చెప్పుచున్న యొకవృద్ధబ్రాహ్మ
ణుఁడు "మీయింటిపేరేమి?" అనియడిగెను. "కందుకూరివారు" అని
నేను బదులుచెప్పితిని. "మీపేరెవరు?" అనియాయనమరల ప్రశ్న
వేసెను. నాపేరు చెప్పితిని. అప్పుడాయన మాతాతగారిపేరు చెప్పి "మీ
కాయన బంధువులా?" అనియడిగెను. "ఆయన మాతాతగారే" యని
చుట్టఱికమును దెలిపితిని. ఆమాట వినఁగానే యాయన పీటమీదినుండి
లేచి నాకుపీటవేసి, యంతవఱకును నిలువఁబడియున్న నన్నుఁగూర్చుండ
వేఁడికొని, గౌరవముచూపి, మాతాతగారిని బహువిధముల శ్లాఘించి
తనకాయన మాన్యమిచ్చి సత్కరించినవార్తను కరణముగారితోఁ
జెప్పెను. ఆయన తాను పారాయణముచేయుచుండిన రామాయణ
మును పీటపైఁబెట్టి తక్షణమే లోపలికిఁబోయి యేమేమో యేర్పాటు
చేసి యయిదారు నిమిషములలో మరలవచ్చి, నాయెడల నతిమా
త్రాదరమును జూపుచుఁ దానెఱుఁగక చేసిన యవజ్ఞను క్షమింపుమని
నన్ను వేఁడుకొనెను. ఈసంభాషణమునకు ఫలముగా మాకు గంటలోప
లనె కమ్మని యావునేతితోను గట్టి పెరుగుతోను రెండుకూరలతోను
పిండివంటతోను సుఖభోజనము లభించెను. భోజనానంతరమున నేనా
గృహపతికిని ముసలిబ్రాహ్మణునకును నమస్కారములుచేసి నాకృతజ్ఞ
తను దెలిపి సెలవుగైకొనిపోయి పడవయెక్కి సాయంకాలమునకు ధవ
ళేశ్వరముచేరి గృహము ప్రవేశించితిని. నేను పుట్టుటకొకసంవత్స
రము పూర్వమే లోకాంతరగతులగుటచేత నాతాతగారిని నేనెఱుఁగక
పోయినను, అటువంటి పితామహునకుఁ బౌత్రుఁడనన్న గర్వ మీ
వృత్తాంతము స్మరణకు వచ్చినప్పుడెల్ల నిప్పటికిని నామనస్సులోఁ
గలుగుచుండును.

నావివాహము మొదలైన శుభకార్యములకు ముందెల్లను నా
పెదతండ్రిగారు నాజన్మపత్రమును జ్యోతిష్కులకెల్లఁ జూపుచు నుము

హూర్తములు పెట్టించుచు వచ్చినను, జ్యోతిశ్శాస్త్రములోని ముహూర్తజాతక భాగముల యందలి నమ్మకము నాకు చిరకాలము క్రిందటనే చెడినందున నేను స్వతంత్రుఁడనయిన తరువాత నాజన్మపత్రమును జూచుటకైనను నేనెన్నఁడును ప్రయత్నము చేసి యుండలేదు. నాజన్మపత్రిక నాయొద్దనున్నదనికూడ నేనెఱుఁగకుంటిని. కొన్నిసంవత్సరముల క్రిందట నొకపనికయి మాయింటనున్న ప్రాఁతకాగితములను వెదకుచుండఁగా నా పినతండ్రిగారి మామగారయిన బుద్ధిరాజు కనకరాజుగారి చేత వ్రాయఁబడిన నాజన్మపత్రికయొకటి యాకస్మికముగా నాకంటఁబడెను. దాని ఫలవిషయమయి నాకేంతమాత్రమును విశ్వాసము లేకపోయినను సత్యాన్వేషుల విమర్శకయి యుపయోగపడవచ్చునని నా జాతకచక్రము నిందుఁ బొందుపఱుచుచున్నాను — నేనారంభదశలో జ్యోతిశ్శాస్త్రమునం దత్యంతవిశ్వాసము కలవాఁడనైయైనను, జన్మపత్రికలలో దీర్ఘాయుష్మంతులగుదురని చెప్పఁబడిన




వారనేకు లల్పాయుష్కులగుచుండుటయు, మహాధనాఢ్యులగుదురని చెప్పఁబడిన వారనేకులు దరిద్రులగుచుండుటయు, సంతానవంతులగుదురన్న వారనేకులు సంతానహీనులగుచుండుటయు, చిరకాలసువాసిను లగుదురన్న కాంతలు పలువురు బాలవితంతువు లగుచుండుటయు, సుముహూర్తములు పెట్టుకొనిచేసిన కార్యములు పెక్కులు భగ్నము

లగుచుండుటయు, చూచుచు వచ్చినకొలఁదిని నాకీ జ్యోతిషవిషయమయి యంతకంతకు నమ్మకము తగ్గి లోకానుభవ మధికమయినతరువాత పూర్ణముగా నశించెను. నా నమ్మకము చెడుటకుఁగల కారణములను వివరించుట కిది సమయము కాదు. స్థూలముగా నొక్కయంశమును విచారింపుఁడు. మనదేశములో వివాహములకు మంచి ముహూర్తములు పెట్టుకొనని వారెవ్వరుందురు? వధూవరులజాతకములను బరీక్షించి చూచుకొనక లగ్ననిశ్చయము చేయువారెవ్వరుందురు? సుముహూర్తములను బెట్టుకొని జన్మపత్రములనుబట్టి దీర్ఘాయుష్మంతులయినవరుల నేర్పఱుచుకొని వివాహకార్యములు నడపునప్పుడు వివాహితలలో లక్షలకొలఁది బాలవితంతువు లేల కావలెను? అట్టిచోట్ల నెల్ల జాతకబల మేమగును? ముహూర్తబలమేమగును? జ్యోతిశ్శాస్త్రవిశ్వాసము లేని పశ్చిమఖండ వాసులలోని వివాహములకంటె జ్యోతిశ్శాస్త్రమర్యాద నతిక్రమింపక చేయఁబడు మనలోని వివాహము లేవిషయమున నధికసుఖప్రదములుగా నున్నవి? జన్మపత్రములలో వ్రాయఁబడిన ఫలములలోఁ గొన్ని కాకతాళీయములుగాఁ గలుగుట తటస్థించినను, గొన్నియైనను దప్పిపోవుచుండుటచేత నట్టి శాస్త్రము విశ్వాసయోగ్యమైనది కాదని నాదృఢనిశ్చయము.

పూర్వోదాహృతమయిన మత్పితామహుని నామధేయమును బట్టియు నాపేరినిబట్టియు మాపూర్వులు శైవులై నట్లూహింపఁదగి యున్నదిగదా? అస్మత్ప్రపితామహునివఱకును మాపూర్వులందఱు లింగధారులయి వీరశైవులయియే యుండిరి. కేవల వీరశైవులగుటయే కాక మాపూర్వులలోని శైవమతోన్మాదు లయినవారు కొంద ఱధికారప్రాబల్యమునుబట్టి స్మార్తుల కనేకులకు బలవంతముగా లింగములు గట్టి వారిని శైవమతప్రవిష్టులను జేసిరి. మాపూర్వులు శైవబ్రాహ్మణులలోని యాఱువేల నియోగిశాఖలోఁ జేరినవారు. అందుచేత వారు

స్మార్తులయిన నియోగులతో సంబంధబాంధవ్యములను జేసికొనుచుం
డిరి. నాముత్తాతగారయిన చంద్రమౌళిగారికి స్మార్తులలోని శ్రీచూర్ణ
ధారుల (నిలువుబొట్టువారి) కన్య నిచ్చుట తటస్థమైనది. ఆదంపతుల
కుదయించిన మత్పితామహులగు వీరేశలింగముగారు వైష్ణవమతాభి
మానులైన మేనమామల ప్రోత్సాహముచేతనో మతి స్నేహితవు
చేతనో తాము లింగధారణమును మానివేసి సంస్కారమునకు మొ
దట దారితీసిరి. పితామహాగతమగుటచేతఁగాఁబోలును వారి పేరింటి
వాఁడ నగు నాకును బాల్యమునుండియుఁ దత్సంస్కారవాసన యిం
చుక సోఁకినది. మా తాతగారి జన్మభూమి యేలూరు. అక్కడనే
వారికిఁ బూర్వార్జితములయిన భూములును గృహములును నుండెను.
మాయింటిపేరునుబట్టి మాపూర్వు లాదియందు నెల్లూరుమండలము
లోని కందుకూరుపురనివాసులయి యుండినట్టును, అటుతరువాత మహా
మ్మదీయులకాలములో నుద్యోగధర్మమునుబట్టి యేలూరునకు వచ్చిన
ట్టును, దెలియవచ్చుచున్నది. మహమ్మదీయప్రభుత్వముయొక్క క్షీణ
దశతోనే మాపూర్వులయధికారప్రాబల్యము సహితము క్షీణించినది.
తరువాతఁ బ్రభుత్వమునకు వచ్చిన యింగ్లీషుదొరతనమువారు మహ
మ్మదీయుల కాలములో సంపాదించి మా పూర్వులనుభవించుచుండిన
చిన్న జాగీరులను గైకొని వారికిఁ గొన్ని తరములవరకును నుపకారవే
తనములనిచ్చుచు వచ్చిరి. ఇట్లుపకారవేతనము లనుభవించినవారిలోని
కడపటివాఁడు నేను పెద్దవాడ నయినతరువాతనే కాలధర్మము నొం
దెను. మావారిలోఁ గొందఱిప్పటికిని గొన్నిగ్రామములను గలవారయి
యున్నారుగాని యప్పులపాలయి యుండుటచేత వారి ప్రస్తుతస్థితి
యంత బాగుండలేదు. మా సన్నిహితజ్ఞాతులింకొకరు గంజాముమండల
ములో సంస్థానాధిపతులుగ నున్నారుగాని యా సంస్థానము వంశపరం
పరాగతమయినదిగాక యిటీవల సంపాదింపఁ బడినదని వినుచున్నాను.

కాదు. ఆయన పని పోయి యార్జనము లేక యున్నకాలములోనే పూర్వమంత వైభవముతో వివాహముచేసిన ప్రథమకుమారునికి కళత్రవియోగము తటస్థించెను. కుమారునకు మరల వివాహము చేయవలెనన్న ప్రయత్నములో నుండఁగానే యొకనాటి రాత్రి భోజనముచేసి శయనించినతరువాత గుండెలలో నొప్పి వచ్చి తెల్లవారునప్పటికి మా తాతగారు ఆకస్మికముగా స్వర్గస్థులయిరి. మరణకాలమునం దాయనకు జననియైన యక్కమ్మగారును, భార్యయైన రామమ్మగారును, జ్యేష్ఠపుత్రుఁడు వేంకటరత్నముగారును, ద్వితీయపుత్రుడు సుబ్బారాయఁడుగారును ఉండిరి. నేను ద్వితీయ పుత్రుని పుత్రుఁడను. నా పెదతండ్రిగారికి వయస్సప్పు డిరువదియైదేండ్లు. తమ్ముఁ డన్నగారికంటె మూఁడునాలుగు సంవత్సరములు చిన్నవాఁడు. సిరి చచ్చినను చిన్నెలు చావవన్న లోకోక్తి యున్నదేకదా! విత్తమంతగా లేకపోయినను సాధారణముగా గొప్పయింటఁ బుట్టినవారికుండెడు గర్వమును మేము పనినిమిత్త మితరుల నాశ్రయించుటకు నొప్పని దురభిమానమును మాత్రము మాతండ్రులను విడిచినవి కావు. మా పెదతండ్రిగారిద్వితీయవివాహముతో నున్నవిత్తము కొంతయు ఖర్చయినది. తరువాత గృహవ్యయములనిమిత్తమయి మా తండ్రులు మొట్టమొదట మా తాతగారిల్లు పెంపు చేయుటకొఱకు నిలువయుంచిన కలపను విక్రయించివేసిరి; పిమ్మట దొడ్డిలోనుండు మట్టెపై భూమి కొంతభాగ మమ్మివేసిరి; అటుపైని వెండిబంగారువస్తువులను విక్రయము చేయసాగిరి. ధనదేవత పలాయనమయిన తరువాత దానిని విడిచి గర్వ మొంటిగా చిరకాలము నిలిచియుండ నేరదు. గర్వము తమ్మువిడిచి పోవఁగానే వారు దురభిమానమును విడిచి మాతండ్రు లుద్యోగములనిమిత్తము కృషిచేయ నారంభించిరి. అన్నదమ్ము లిద్దరును సంస్కృతమునఁ బంచకావ్యములను ముగించిరి; తెలుఁగునందు మంచి

సాహిత్యముకలవారయి యొకవిషయమునుగూర్చి చక్కఁగా వ్రాయుటకును ఎట్టి వ్రాఁతనైన ననర్గళముగాఁ జదువుటకును సమర్థులయి యుండిరి; ఇంగ్లీషుభాషయందును గొంతజ్ఞానము కలవారయి చదువుటకును వ్రాయుటకును మాటాడుటకును నేర్చియుండిరి. వారుభయులలో మా పెదతండ్రిగారు కోపస్వభావము గలవారు; మా తండ్రిగారు శాంతస్వభావముగలవారు. మొట్టమొదట మా తండ్రిగారికి కాకినాడలోని మండలకరగ్రాహి కార్యస్థానమునందు పీఠాపురసంస్థానసంబంధమున స్థిరమైన లేఖకోద్యోగము దొరకినది. మా పెదతండ్రిగారి కప్పుడప్పుడు పత్రికావహన కార్యస్థానమునందు యంత్రకారశాఖయందును స్వల్పకాలికములయిన పనులగుచుండెను.

చిన్నతనములోనే మా తండ్రిగారికి మేనత్తకొమారిత నిచ్చి వివాహముచేసిరి. మా తాతగారి చెల్లెలు స్త్రీ శిశువును గని కాలము చేసినందున, పున్నమ్మ యనెడి యాచిన్నదానిని ముత్తవ యగు వర్ధమ్మగారును మేనమామయగు మా తాతగారును పెంచి పెద్దదానిఁ జేసిరి. ఈడు తగదనియు నెదురుమేనరికము కూడదనియు కొందఱు కొన్ని యాక్షేపణలుచేసినను పాటింపక పెంచినప్రేమచేత విడిచి యుండలేకయు జననియొక్క యాజ్ఞను ద్రోసివేయలేకయు వయస్సునం దొక్కయేఁడుమాత్రమే చిన్నదయినను మా తాతగారా చిన్నదానిని తమద్వితీయపుత్రుఁడయిన మా తండ్రిగారికే యిచ్చి పెండ్లిచేసిరి.

ఈదంపతులే నాకు జననీజనకులు; ఆకాలమునం దెల్లవారికిని దయ్యములయందలి విశ్వాస మత్యధికము. స్త్రీలలో నొకప్పుడును దయ్యముపట్టనివా రెక్కడనో కాని లేకయుండిరి. ఎవ్వరికే వ్యాధి వచ్చినను వైద్యునియింటికి మారుగా ముందుగా భూతవైద్యుని యింటికో సోదెచెప్పువాని యింటికో పరుగెత్తుచుండిరి. ఏయింట నేపురుషుఁడు

మరణమును నొందినను, పతియుని మరణము నొందినను, దయ్యమయి తిరుగుచుండు నని స్త్రీపురుషసామాన్యముగా నెల్లవారును నమ్ముచుండిరి. అందులోను మాతల్లికిట్టిపిచ్చినమ్మక మమితమయినందునఁ దఱుచుగా నామె తన్నేదో దయ్యమావహించి పీడించుచున్నదని భ్రాంతి నొంది నిద్రాహారములు సరిగా లేక శుష్కించి బాధపడుచుండెనఁట! మా తాతగారు కొందఱెందఱనో భూతవైద్యులను మంత్రశాస్త్రవేత్తలను రప్పించి చికిత్స లెన్ని చేయించినను మారణహోమము లెన్ని చేయించినను ప్రాఁతభూతము విడువఁగానే క్రొత్తభూత మొకటి యావేశించుచు వచ్చుటచేత నామె కృశించుచునే యుండెను. కాని భూతము లామె నెప్పుడును బూర్ణముగా విడిచిపోలేదఁట! ఇటువంటి దుర్బలయువతిగర్భమున జనించినవాఁడ నగుటచేత శిశుదశలోసహితము నేను దుర్బలుఁడనుగానే యుంటినఁట! అట్టి నాస్వాభావిక దేహదౌర్బల్యమునకుఁ దోడు పురిటిలోనే దగ్గొకటి పట్టుకొని యప్పటినుండి యిప్పటివఱకును నన్ను విడువక బాధించుచున్నది. పురిటి దినములలోఁ దాను జేసిన యపథ్యదోషము నాదగ్గునకుఁ గారణమని నాతల్లి నాతో నెన్నియోసారులు చెప్పి నేను కాసబాధచే శ్రమపడుచున్నప్పుడు నన్నుఁగూర్చి పరితపించుచుండెను. ఈదగ్గిట్లుండఁగా నాఱునెలల ప్రాయమప్పుడు నాకు స్ఫోటకము వచ్చినది. ఏఁబదిసంవత్సరములకు మునుపు వచ్చినస్ఫోటకపుమచ్చలు కొన్ని యిప్పటికిని స్పష్టముగా నాముఖముమీఁదఁ గనఁబడుచున్నవి. అప్పుడది యెంత యుగ్రమయినదిగా నుండెనో చెప్పనక్కఱలేకయే దీనినిబట్టి యెల్లవారికిని విశదము కావచ్చును. అప్పుడెల్లవారును నాజీవితముదెస నిరాశ చేసికొనిరఁట! కన్నులు మూఁతపడఁగా నొకదినమెల్ల నేను కాలుచేయిసహితమాడింపక నిర్జీవప్రతిమవలె నుంటినఁట! చచ్చితి ననుకొన్న నే నట్లు మృతుల బ్రతుకఁ గలిగితినో తనకే యాశ్చర్యము కలిగించెనని; పలు

కుచు నా జనని తానప్పుడు నాసిమిత్తమయి పడిన మనోవేదనయు క్రొక్కొత్త్తొన్న క్రొక్కొలును మసూరిరోగము వచ్చినవారిని గూర్చిన ప్రసంగము వచ్చినప్పుడు తోడివారితోఁజెప్పి నన్ను వారికిఁ జూపుచు వచ్చెను. ఇటువంటి ప్రకీమాలిన దుర్బలమానవునిచేతఁ గూడ గొంత పని చేయింపవచ్చునని చూపుటకుఁ గాఁబోలును బరమకృపాళుఁడైన పరమేశ్వరుఁడు మాప్రార్థనల నాలకించి నన్ను భూమిమీఁద నిలువ ననుగ్రహించెను. నాలుగైదుసంవత్సరములప్రాయమువచ్చువఱకును నన్నుఁగూర్చి చెప్పఁగోవలసిన దేదియు నాకు స్మరణకు రాలేదు. అన్నమెంత యెక్కువగాఁ దిన్న నంతబలియుదురన్న నమ్మకము కలదయి యజ్ఞానముచేత నాప్రియమాత నన్ను శీఘ్రముగా బలిపింపవలె నన్న యుత్కంఠతోను సచ్చింతతోను నాకన్న మెక్కువగాఁ బెట్టి నోటిలోనిముద్దను మ్రింగకున్నప్పుడు మిరెపుకాయలగుండ నా నాలుకకు రాచుచుండుటయు నోటిలోనిముద్ద మ్రింగి కారముచే నే నేడ్చినప్పుడు నెత్తిమీఁద మొట్టుచుండుటయు నెందుచేతనో కాని నేఁడు జరిగిన ట్లుగా నామనస్సున దృఢముగా నాటుకొని యిప్పటికిని మఱపునకు రాకున్నవి. బిడ్డలయందలి యతిప్రేమచేతఁ దల్లు లెప్పుడు నిట్టియవివేక కార్యములను జేయకుందురు గాక!

నాకు నాలుగేండ్లప్రాయమప్పుడు మాతండ్రిగారు ప్రాయస్థలము నందు కురుపువేసి కాకినాడలో పరమపదించుట సంభవించినది. అప్పుడు నాకు మరణమనఁగా నేమో తెలియదు. మాతండ్రిగారి శవమును గాని శవమును ప్రేతభూమికిఁ గొనిపోవుటగాని నన్ను చూడనియ్యక శ్మశానవాటికనుండి మా పెదతండ్రిగారు మఱల వచ్చువఱకును మావారు నన్ను మఱియొకరియింటికిఁ బంపివేసిరి. నే నింటికి వచ్చి నప్పుడు నన్నుఁజూచి మాయింట నున్నవారేడ్వఁదొడఁగుటచూచి మొగము చిన్నచేసికొని వారితో నేనును నేడ్చితినే కాని వారేల

ఱేడ్చుటతో నేనేల యేడ్వవలయునో నేనప్పుడెఱుఁగను నెఱుఁగమి ఏడుపు చాలించినతరువాత నేలయేడ్చితిరని మావారి నడిగి వారిని మరల నేడిపించుటయే కాని వారివలన నాప్రశ్నమున కుత్తరమును గానక యావలకు వచ్చి మావారేల యేడ్చెదరని యచ్చట నున్న వారి నడిగితిని. మీనాన్నగారు పోయినారని యొకరు చెప్పఁగా 'ఎక్కడకుఁబోయినారు? మరల నెప్పుడువత్తురు?' అని నేనెఱుఁగని ప్రశ్నలు వేయుఁదొడఁగితిని. మాతండ్రిగారిని "నాన్న" యనియు, పెదతండ్రిగారిని "బాబాయి" యనియు పిలుచుట నాకు వాడుక. నాకు నాతండ్రిగారికంటె పెదతండ్రిగారివద్దనే చనవెక్కువ. అందుచేత నాకప్పుడు పితృవియోగ దుఃఖము మనస్సున నాటలేదు. నా పెదతండ్రిగారు నన్నెప్పుడును క్రింద దింపక యెత్తుకొని తానెక్కడికిఁ బోయినను వెంటఁ గొనిపోవుచు, అంగళ్ళవాడకుఁ గొనిపోయి నాకు చిఱుతిండి కొనిపెట్టుచుండెడివారు. ఆయన యొక్కదినము కంటఁబడకపోయిన పక్షమున నేను బెంగపెట్టుకొని యాయననిమిత్తమేడ్చుచుండెడివాఁడను. మాతండ్రిగారి యుత్తరక్రియలయిన తరువాత మేమందఱమును కాకినాడ విడిచి రాజమహేంద్రవరము చేరితిమి.

ఆకాలమునందు గోదావరికాలువలు క్రొత్తగా త్రవ్వుచుండిరి. అప్పుడు కాలువలపై నధికారము వహించియుండిన యొకదొరవద్ద నా పెదతండ్రిగారికి లేఖకోద్యోగము దొరికినది. ఆయన మొట్టమొదట నొంటిగాఁ బోయి కొన్నిమాసములున్నమీఁదట కుటుంబమును దన యొద్దకు తెప్పించుకొనుటకయి మనుష్యులను బంపెను. మా తాతగారి తల్లి పట్టెంటఁ బడి కాలు విఱుఁగఁగొట్టుకొన్నందున, ఆమెయుపచారార్థముగా కోడలామెవద్ద నుండవలసినదయ్యెను. అందుచేత మా తాత తల్లిని మాతండ్రితల్లిని గృహమున నట్టెయుంచి, మానిమిత్తము వచ్చినమనుష్యుల వెంట బయలుదేఱి యయిదేండ్లవాఁడనయిన నేనును

ఆయన మాటలను జూచి వెక్కిరించుచు వచ్చుటచేత నాకట్టి దురభ్యాసము పట్టుపడియుండును. ముక్కుతో మాటాడుట మానివేయవలసిన దని తరువాత నా పెదతండ్రిగా రనేకపర్యాయములు నాముక్కు నలుపుచు వచ్చుట నాకిప్పటికిని మఱవునకు రాదు. చిన్ననాఁటి యీముక్కు మాటలు నాకు మఱికొన్ని సంవత్సరములకుఁగాని పూర్ణముగాఁ బోలేదు. ఏదురభ్యాస మయినను మొదట వచ్చుట సులభము గాని తరువాతఁ బోవుట యంత సులభము కాదు. ఆలోచనలేని బాల్యదశయందు దురభ్యాసము లవలీలగా నలవడును. కాబట్టి బాలురు కా మే దురభ్యాసములను జేసికొనక మిగుల జాగరూకులయి యుండవలెను. ఆరంభదశలో నత్యల్పమయిన దనుకొన్న దురభ్యాసమే కాలక్రమమున బలపడి కొంతకాలమునకు స్వభావమయి కడపట మార్చుకొనుట కెంతో కష్టసాధ్యమగును. బాలురు తోడివా రేమి చేయుదురో దానిని దామును జేయఁ జూతురు. పొడుమును, పొగచుట్టయు నలవాటగుట యీవిధముగానే. ఈయనబడిలో నే నక్షరములును, గుణితమును, ఎక్కములును నేర్చుకొని పుస్తకము పట్టియుందును. అల్పకాలములోనే యీయయ్యవా రిహలోకయాత్రను విడిచినందున తదనంతరము మాయింటికి సమీపమున తిరుమెళ్ళవారిలోపల నున్న సోమరాజుగారి బడికి మావారు నన్నుఁ బంపిరి. గూనివాఁ డగుటచేత నీయనను గూడ సోమరాజుగారని సాధారణముగాఁ బిలిచెడివారు. ఈయన మొదటి పంతులవలెఁగాక తెలుఁగునందుఁ గొంత పాండిత్యము గలవాఁడయి పిల్లలచేత పెద్దపుస్తకము (పురాణము)ను గూడఁ జదివించి యర్థము చెప్పుచు వచ్చెను. నాచేతఁ బ్రథమమున నర్థసహితముగా బాలరామాయణమును నమరనిఘంటువును చదివించిరి గాని యీ సంస్కృతగ్రంథపఠనమువలన నాకప్పుడంతగా లాభము కలుగలేదు. అటుతరువాత వాచకమును వ్రాఁతయుఁ గాక రుక్మిణీకల్యా

ణమును, సుమతీశతకమును, కృష్ణశతకమును, ఆంధ్రనామసంగ్రహమును, నాచేత కంఠపాటగా వల్లెవేయించిరి. నేను వీధిబడులలో నేర్చుకొన్న దంతయు నింతే. ఇంతటితో దెలుఁగు చదువు పూర్తియైనదని మావారు నన్ను బడి మాన్పించి రాజకీయోద్యోగమునకుఁ గావలసిన పనిని నేర్చుకొనుటకయి తాలూకా కచేరీలో గుమాస్తాగానున్న మా బంధువులగు పోతరాజు రఘురామయ్యగారియొద్ద నప్పగించిరి. నేను ప్రతిదినమును మధ్యాహ్నమున మావీధి చివరనే యున్న తాలూకా కచేరికిఁ బోయి యాయన చెప్పిన పని చేయుచుంటిని. ఈప్రకారముగా సంవత్సరమో రెండుసంవత్సరములో వ్యర్థము లయినవి. ఈకాలములో దూరి సోమయాజులుగారు ప్రాతఃకాలమునందు మాయింటికివచ్చి నాకు రఘువంశమును జెప్పుచుండిరి; సాయంకాలమునందు మా పెదతండ్రిగారే నాకింగ్లీషక్షరములను, గుణితమును, మాటలను నేర్పుచుండిరి. ఆకాలమునందుఁ బరీక్షలు లేనందున, దొరతనమువారికొలువు నపేక్షించువారు రాజకీయ కార్యస్థానములకుఁ బోయి పని నేర్చుకొనుచు నధికారుల ననుసరించి తిరుగుచుండెడివారు. ఇంతలో హిందూదేశ రాజ్యనిర్వహణభారమును తూర్పిండియా సంఘమువారినుండి తప్పించి శ్రీమహారాజ్ఞిగారే స్వయముగా వహించిన తరువాత దేశభాషలలోను నింగ్లీషుభాషలోను సామాన్యపరీక్షలును విశేషపరీక్షలును గొన్ని యేర్పఱుపఁబడినవి. అటుతరువాత నల్పకాలములోనే 1860-వ సంవత్సరమున మావారు నన్ను దొరతనమువారి మండల పాఠశాల కింగ్లీషు నేర్చుకొనుటకయి పంపిరి.

నే నింగ్లీషు పాఠశాలలోఁ బ్రవేశించునప్పటి కయినను దేహము దృఢపడి కండపుష్టిఁ గలవాఁడనై యుండక పెద్దగాలి వేసిన నెగిరిపోవునట్లు సన్నముగా పూచికపుడకవలె నుండెడివాఁడను. ఇట్లుండుటకుఁ

గొంతవఱకు మావారికి నాపయిఁ గల యతిప్రేమయే కారణమని చెప్పవచ్చును. అతిదయచేతనే నాతల్లియుఁ బెదతండ్రియు నాకన్నము నుచిఱుతిండియు నధికముగాఁ బెట్టి నాజీర్ణాశయమును గొంతవఱకు దుర్బలపఱచినారు; అతిదయచేతనే నా పితామహియు ప్రపితామహియు నన్ను గడప దాఁటనీయక చదువు విషయమున।నా తల్లి యొకతిట్టు తిట్టినను నా పెదతండ్రి యొక దెబ్బకొట్టినను జగడమాడి యెత్తుకొనిమోచి నాశరీరమును దుర్బలపరచినారు. అందుచేత నాకప్పడజీర్ణవ్యాధిచిహ్నములు పొడచూపుటయేకాక పీనసరోగ మొకటి క్రొత్తగా నన్నాశ్రయించినది. పడిసెముచేత దినమునకు వేయి తుమ్ములు తుమ్ముచుండెడివాఁడను. ఈపీనసపిశాచి ప్రియతముఁడనైన నన్నీవార్ధకదశయందును విడిచి పోఁజాలకున్నది. మొత్తముమీఁద మావారందఱును స్వభావదుర్బలమగు నాశరీర మెండ సోఁకినఁ గందిపోవు ననియు, ఆటలాడిన నలసిపోవుననియు, పనిచేసిన బడలి చిక్కిపోవుననియుఁ దలఁచి, దేహపరిశ్రమమున కవకాశ మియ్యక యాటలకయినను విడువక సదా యిల్లు కదలనీయక యేదో వ్రాయుమనియో చదువుమనియో పనిచెప్పి యొకచోట నన్నుఁ గూరుచుండఁ బెట్టుచు వచ్చిరి. నిర్బంధించి చేయించుపనియం దెప్పుడును శ్రద్ధానురాగము లుండవు గనుకను, విరామములేక సదా యొక్కపనినే చేయుచుండుట విసుగును బుట్టించును గనుకను, నాకునియమింపఁబడిన పనియందు నేను శ్రద్ధాళువనుగాక యుపేక్షాపరుఁడనై యుత్సాహశూన్యుఁడనై సర్వదా పనిచేయుచున్నట్లే నటించుచు నెట్లో ముగించెడివాఁడను. చదువ నియమించిన పాఠము రెండుమూఁడుసారులు చదువునప్పటికే వచ్చినను, వ్రాయ నియమించిన కాగితములు గంటలోనే ముగింపఁ గలిగినను, దినమంతయు చదువుచున్నట్టును వ్రాయుచున్నట్టును నటించుచు, చేతిలోపుస్తకమునో తొడమీఁద కాగితములనో

పెట్టుకొని మాటల కారంభించెడివాఁడను. నాతో మాటాడువారెవ్వ రందు రేమో వినుఁడు. యథేచ్ఛముగా మాటాడుకొనుటకు బాలురకు బాలురే కావలసియుండుటకదా? మాయింట నితర బాలురు లేరు. అందుచేతఁ బ్రథమ బాల్యావస్థలోనున్న నేను వార్ధక్యమనెడు ద్వితీయ బాల్యావస్థలోనున్న నాప్రపితామహి పరుండు గదిగుమ్మమువద్దఁ జేరి మెల్లఁగా నామెతో నేవో మాటలు వేయుచుండెడివాఁడను. కాలువిఱిఁగి సదా మంచముమీఁద నే పరుండియుండెడి యామెయు కాలము జరుగక నాతో నేదో పుక్కిటిపురాణము వేసి ప్రొద్దు పుచ్చుకొనుచుండెడిది. ఈప్రసంగమధ్యమున మాయమ్మ యక్కడకువచ్చి మేము కథలు చెప్పుకొనుచుండఁగాఁ జూచినపక్షమున, పాఠము నుపేక్షించుచున్నందునకు నన్నుఁదిట్టి మాటలు పెట్టినందునకు ముత్తవమీఁద కోపపడి, పోవుచుండును. ఆమె దాఁటిపోఁగానే మరల మేము మాలో కాశీరామాయణమును మొదలు పెట్టెడివారము. నే నింగ్లీషు నారంభించుటకు ముందే సంభవించిన యామె కైలాసప్రాప్తితో మా బాలవృద్ధకథా కాలక్షేపములు పరిసమాప్తి నొందినవి. బ్రాహ్మణాచారానుసారముగ గర్భాష్టమువందనఁగా నేడవయేట నే నాకుపనయనము జరిగినది. నేను బ్రహ్మోపదేశమును బొందినది మొదలుకొని త్రికాలములయందును యుక్తసమయమునందు సంధ్యావందనము చేయుచు గాయత్రి నెంతో శ్రద్ధతో శతవారములు ప్రతిదినమును జపించుచుంటిని. సహస్రగాయత్రి చేసిన దినములును గొన్ని కలవు. అప్పుడప్పుడు సాయంకాలముల గోదావరికిఁ బోయి యస్తమించుచున్న సమయములో సూర్యున కర్ఘ్యప్రదానము చేసి సంధ్యవార్చి ప్రదోషకాలమున మార్కండేయస్వామి యాలయమునకును వెనుక, వేణుగోపాలస్వామియాలయమునకును బోయి వచ్చుచుండుదును. త్రిరేఖలుదీర్చి దట్టముగా ముఖముమీఁదను ఱొమ్ముమీఁ

దను భుజములమీఁదను విభూతిపెండెకట్లు సవరించి, శుద్ధశ్రోత్రియుని వలె బిళ్ళగోచి పెట్టి బట్ట గట్టుచుంటిని. ఒక్కప్రొద్దులును నుపవాసములును నుండ లేకపోయినను, ఏకాదశినాఁటిరాత్రి ప్రొద్దుపోయినదాఁక మేలుకొనుటయే కాక యొకసంవత్సరము శివరాత్రినాఁడు జాగారము సహితము చేసితిని. ఏవాన కాలపు చదువో యింట రఘువంశములో నైదుసర్గములు చదివియుండుటచేతను గూని సోమరాజుగారి బడిలో నాంధ్రనామసంగ్రహమును జదివి పురాణముల యర్థమును వినుచు వచ్చుటచేతను గొంచెమర్థజ్ఞానము కలవాఁడనయి, మాయింటనున్న ప్రాఁతతాటాకుల పుస్తకములనుదీసి చదువ నారంభించితిని. ఆకాలమునందు యుద్ధములను గూర్చియు తపస్సులను గూర్చియు చదువుట నా కెక్కువ యిష్టముగా నుండెను. ఋషులయొక్క మహిమలనుగూర్చి చదువునప్పుడు వారివలెఁ దపస్సు చేసి మహిమలు సంపాదింపవలెనని పలువూఱు నాకు బుద్ధి పుట్టుచుండును. భారతములో నాకత్యంత ప్రియములగు భాగములు విరాటపర్వములోని యుత్తరగోగ్రహణమును భీష్మద్రోణకర్ణ శల్యపర్వములును, శ్రీమద్భాగవతములోని సప్తమస్కంధమును దశమస్కంధమును నాకు ప్రియతమములయినవి. మా పెదతండ్రిగారికి మునసబుకోర్టులో స్థిరమయినపనియయి యాయన గ్రామాంతరములయందుండుచు వచ్చుటచేత నింట నొంటిగా నున్న నాకీగ్రంథపఠనాదుల కవకాశము కలిగినది. కాఁబట్టి నే నింగ్లీషారంభించుటకుముందే నాకు ఛాందసవృత్తి బలియ నారంభించినది. నేను భక్తుఁడ నగుచున్నాఁడనని సంతోషించి నాతల్లి మొదలయినవారు నన్ను నిష్ఠాపరత్వమునుండి మరల్పఁజూడక ప్రోత్సాహపఱుచుచు వచ్చిరి. ఎవ్వనికైన నొకవిషయమున నొకన్యూనత యున్నపక్షమున నింకొకవిషయమున నాధిక్యమును గలిగించి యీశ్వరుఁ డాలోపమును

పూరించునని విద్వాంసులు చెప్పుదురు. ఈసత్యమును నాదృష్టాంతము చేఁ గొంతవఱకు స్థాపింపవచ్చును. ఆకాలమునందు నాకు దేహబల మెంత తక్కువగానుండెనో బుద్ధిబల మంత యెక్కువగా నుండెనని చెప్పవచ్చును. నాకా పిన్నవయస్సునఁ గల గ్రహణధారణశక్తు లసాధారణములయినవి. అయినను నాకు వానివలన విశేషలాభము కలుగుటకు మాఱుగాఁ గొంతవఱకు నష్టియేకలిగినదని చెప్పవచ్చును.

# రెండవ ప్రకరణము - విద్యార్థిదశ

క్రీస్తుశకము 1860 మొదలుకొని 1870 వ సంవత్సరమువఱకు.

వేసవికాలపుసెలవులయిన తరువాత రెండవ యర్ధసంవత్సరమునందే పాఠశాలలో నేను బ్రవేశించినను సంవత్సరాంతమునఁ బరీక్ష జరుగునప్పటికి తోడిబాలుర నందఱిని మించి చక్కఁగాఁ బరీక్షయందుఁ దేఱి మాతరగతిలో మొదటిబహుమానమును బొందితిని. ఆసంవత్సర మాకస్మికముగా మాపాఠశాలామందిరము పరశురామప్రీతియయిపోయినందున నాయగ్రబహుమానపుస్తకము సహిత మగ్నిహోత్రునకే యర్పితమయిపోయినది. అప్పటినుండి కడవఱకును పాఠశాలలో నేను బహుమతి పొందని తరగతిలేదు. పాఠశాల కాలిపోయినతరువాత నూతనభవనము నిర్మింపఁబడువఱకును గొంతకాలము పాఠశాల చిత్రవస్తుప్రదర్శనశాలలోఁ బెట్టఁబడినది. అక్కడ నేను రెండవ తరగతిలోఁ జదువఁ జొచ్చితిని. అప్పటికే నాకుఁ దెలుఁగు పుస్తకములయం దభిలాష హెచ్చినది. అందుచేతఁ బాఠశాలకుఁ బోయియుండిన కాలమునందుఁ దప్ప మిగిలిన కాలమునందంతటను మాయింటఁ గల తాటాకుపుస్తకములనే చదువుచుండసాఁగితిని. ఇట్లు తాటాకులపుస్తకములను మఱఁగి యింగ్లీషుపుస్తకముల నుపేక్షించుచుండుటచూచి పెక్కుతడవలు నాతల్లియు ముత్తవతల్లియు నన్ను నయమున భయమున మందలించి కార్యముగానక మాయింటికి సమీపమునందే వాసము చేయుచుండిన కానుకొలను రామచంద్రుఁడుగారను పేరుగల మాయుపాధ్యాయునియొద్దకుఁ బోయి నే నింట నింగ్లీషు పుస్తకములను ముట్టుచుండుటయే లేదనియు నన్ను శిక్షింపవలసినదని

యు నొకనాఁ డాయనను వేఁడుకొనిరి. నే నింగ్లీషుపాఠ మొప్పగింపని దిన మొక్కటియు లేదనియు, నేను నాతరగతిలోఁ బ్రతిపాఠమునందును మొదటివాఁడనుగానో రెండవవాఁడనుగానో యుందు ననియు, చక్కఁగాఁ జదువుచు నల్లరి యెట్టిదో యెఱుఁగనివాని నెట్లుదండింతు ననియు, అయినను మీవానిమీఁద నిఁకముందొక కన్నువేసి చూచుచుండెదననియు చెప్పి యాయన వారిని బంపివేసెను. ఆయన చెప్పినట్లు నే నల్లరిచేయక, అయోగ్యముగాఁ బ్రవర్తింపక, పాఠశాలలో నుపాధ్యాయులకెల్లఁ బరమవిధేయుఁడ నయియే యుండెడివాఁడను, అది పోనిండు. పయియట్లుభయులలో నెవ్వరు చెప్పినదియు నసత్యము కాదు. నే నింటికడ నింగ్లీషుపాఠములను జదువకుండుటయు సత్యమే; పాఠశాలలోఁ బాఠములఁ జక్కఁగా నొప్పగించుచుండుట సత్యమే; ఏకసంధాద్విసంధాగ్రాహులకుండు బుద్ధివిశేషము కొంత కలవాఁడ నగుటచేత నే నింటినుండి పాఠశాలకుఁ బోవుచు నొకసారియో రెండుసారులో దారిలోఁ బాఠమును జూచినంతమాత్రముననే నాకది ముఖస్థమయి యప్పటికి తప్పులులేక యప్పగింప శక్తుఁడ నగుచుంటిని. ఇట్లు నాప్రతిభావిశేషమే నా కశ్రద్ధను, సోమరితనమును నేర్పి, యీవఱకు సూచించినట్లు కొంతవఱకుఁ నన్నుఁ జెఱిచినది. నే నప్పుడు చదివిన పాఠము నప్పటి కప్పగింపశక్తుఁడ నగుచుండినను, చదివిన చదువు దృఢముగా మనసునఁ బట్టక కొన్నిదినము లగునప్పటికిఁ జదువనట్టే యుండి మరల మొదటికి వచ్చుచుండెడివాఁడను. ఏకరీతిని స్థిరముగాఁ బాటుపడక సోమరిగానుండు సూక్ష్మబుద్ధికంటె నిరంతరము నేకరీతిని బాటుపడుచు, అనలసుఁడుగా నుండు మందబుద్ధియే లోకమునకును దనకును నెక్కువమేలును జేయఁగలవాఁడగును. లోకమునకు మహోపకర్తలయి ప్రసిద్ధికెక్కిన మహాపురుషులందఱును నిరం

తర కర్మతూరులయిన సామాన్యధీశాలులుగాని కేవల ప్రతిభామాత్ర
మాన్యులయినవారుగారు. బుద్ధిసూక్ష్మత కుద్యోగశీలత తోడుపడిన
పక్షమున నత్యధిక ప్రయోజకరము కావచ్చును. నేను కొన్నిసమయ
ములయందు దారి నడచునప్పుడు పాఠములు చదువలేకపోయినను,
నావంతు మొట్టమొదటనే రాక యొకరిద్దఱొప్పగించిన తరువాత
వచ్చినపక్షమునఁ బాఠము నిర్దుష్టముగా నొప్పగింపఁ గలగెడివాఁడను.
చదువనినాఁ డెప్పుడైన నుపాధ్యాయుఁడు మొదటనే నప్పగింపుమనిన
యెడల నేను వెంటనే పుస్తకము చేతఁబుచ్చుకొని దిగువకుఁ బోయి
చదివి యైదునిమిషములలోపలఁ దప్పులులేక యొప్పగింపఁ గలిగెడి
వాఁడను.

ఈకాలములో నాకుఁ బురాణములు చదువు పిచ్చి యంతకంత
కు ముదురఁ జొచ్చినది. విశ్వామిత్రుఁడు బ్రహ్మసృష్టికిఁ బ్రతిసృష్టి
చేసినట్టును, అగస్త్యుఁడు సముద్ర మాపోశనము గొన్నట్టును, కపి
లుఁడు దృష్టిమాత్రన సగరపుత్రుల నఱువదివేవుర భస్మరాసులఁ జేసి
నట్టును, తపోమహత్త్వములనుగూర్చి చదువుచున్నప్పు డెల్లను నాకుఁ
జిత్తోద్రేకము గలిగి నే నెప్పుడు తపస్సునకుఁ బూనుదునా యెప్పు
డామహాత్ములను మించినమహిమలను బొందుదునా యని తహతహపడు
చుందును. చెట్టులేని దేశములో నాముదపుచెట్టే మహావృక్షమనఁ
బరఁగినట్టు మూఢులయిన నా యీడుబాలురలో నేనేమో తెలిసిన
వాఁడ నయినట్టు పరిగణింపఁబడుచుంటిని. అందుచేత నా వెఱ్ఱి యూహ
లఁ గొన్నిటి నితరబాలుర తలలకుసహిత మెక్కింపఁ గలిగితిని. పిన్నల
లోను పెద్దలలోనుగూడ నేవెఱ్ఱికిఁ దగిన యావెఱ్ఱివా రేకాలమునం
దును నుండకమానరు. ఈ తపోవర్ణన లన్నియు దివాస్వప్నము లను
కొక సత్యములని నమ్మి నేను భ్రమపడి యితరులను నా భ్రమలలోఁ
బడవేయఁ దొడఁగితిని. నా భ్రమలో ననాయాసముగాఁ బడినవారు

నా సహపాఠులయిన రాచర్ల వెంకటరామయ్యగారును కవుత్రి లక్ష్మయ్యగారును హోతా వీరభద్రయ్యగారును. వారు ముగ్గురును వయస్సుచేత నాకంటెఁ బెద్దవారు. తపోమహిమయొక్క ప్రాశస్త్యమును వారికి బోధించి, హిమవత్పర్వతముమీఁదఁ దపస్సు చేయువట్లు పథక మేర్పఱిచి, వారిని ముగ్గురిని బ్రయాణము చేసితిని. వీరిలోఁ గడపటి యతఁడు హిమగిరియందలి సంజీవనౌషధములను సువర్ణకరణమూలికలను సహితము సంపాదింపవలయునని యుపదేశించెను. మానసక్షేత్రములయందు నేను నాటిన భ్రాంతిబీజము లంకురించి తీఁగలు సాగి యల్లుకొని తలకెక్కి వెఱ్ఱులను జేయఁగా, వారల్పకాలములోనే యుత్సాహమునందు నన్ను మించినవారయి యచిరతపోమహిమాధ్యులు కాఁగోరి, ప్రయాణ మెప్పుడెప్పుడని కాలవిలంబాసహిష్ణులయి నన్నే త్వరపెట్ట మొదలుపెట్టిరి. దేహదౌర్బల్యమునుబట్టి దూరదేశయాత్రకు సాహసము చేయలేక హృదయ మిట్టట్టులూఁగ నేనిదిగో నదిగో యని జాగుచేయసాగితిని. ఒకనాఁటి సాయంకాలమున వారిలో నిద్దరు నాయొద్దకు వచ్చి రేపె ప్రయాణమని చెప్పిరి. నేను వారివెంట రాఁజాలనంటిని. అంతట వారు నాతో మరల మాటాడక, యింటివద్దఁ బాఠశాలకుఁ బోయెదమని చెప్పి భోజనములుచేసి పుస్తకములు పట్టుకొని పాఠశాలదారినే తపోగమనప్రారంభులయి యుత్తరాభిముఖముగా వెడలిరి. సాయంకాలము వేళకు వారిండ్లకు రాకపోఁగా బంధువులు వెదక నారంభించి మూడవయతనిని పిఠాపురమువద్దనే పట్టుకొని యింటికిఁ గొనివచ్చిరి. విజయనగరము వఱకును బోయినతరువాత రెండవయతఁడు మొదటియాతనితోఁ దగవులాడి మురుగు లమ్ముకొని వెనుకకుమరలెను. మొదటియతఁడు కొంతదృఢమనస్కుఁడయి ముందుకుసాగి దారిబత్తెమునకయి వెండిమొలత్రాడమ్ముకొని జగన్నాథము

మఱఁకను బోయి యాత్రచేసికొని పోయినదారినే మరలి వచ్చెను. ఈ ప్రకారముగా నామానసికయాత్రతోను మిత్రుల దేశాయాత్ర తోను మా తపోయాత్రావ్రత ముద్యాపన మయినది. అంతటితో నాకుఁ దపశ్శక్తియందలి విశ్వాసము చెడలేదు గాని తపోవనగమ నోత్సాహము మాత్రము భగ్నమయినది.

నా కావలెనే వివాహమునకుఁ గన్యనిచ్చెదమనివచ్చి పలువురు గృహస్థులు తిరిగిపోవ నారంభించిరి. అనేకకన్యలను జూచి తుదకు నాతల్లియు పెదతండ్రిగారును గలిసి యాలోచించి మాపట్టణమునకు రెండుమైళ్ళదూరములో నున్న కాతేరను గ్రామమునందున్న యద్దంకి వారి పడుచును నాకు వివాహము చేయుటకయి యేర్పాటుచేసిరి. వరుఁడు వధువును, వధువు వరునిఁ జూచి తమయిష్టము వచ్చినవారి నేర్పఱచుకొనక తమయావజ్జీవసుఖదుఃఖములతో సంబంధించిన పెండ్లి యేర్పాటును పూర్ణముగా నితరులకేల విడువవలయునని హిందూ దేశ బ్రాహ్మణాచారప్రభావ మెఱుఁగనివారికి సందేహము తోఁచ వచ్చును. ఏమీ! స్వయంవరణభాగ్యమా! అట్టి మహాభాగ్యము హిందూదేశములోని బ్రాహ్మణులకు స్వప్నావస్థయందునులేదు. ఒక వేళ ముందెన్నడైనఁ గలుగవచ్చునేమోకాని యిప్పటికిలేదు. మా లోని విద్యావిభూషితులగు మహానుభావులు వివేకదీపమువంకనైనఁ జూడ నొల్లక కన్నులు మూసికొని పూర్వాచారమహాభూతమునకే సేవ చేయుచు వచ్చుచున్నంతవఱకు మనదేశమున కట్టిపుణ్యము ముందును గలుగదు. పండితపామరభేదము లేక మావారెల్లరును నాచారమునకు దాసులు. ఆచారపిశాచ మావేశించినచో వారికి దయయు ధర్మమును సత్యమును సత్కర్మమును సర్వమును పరిత్యాజ్యములు; పూర్వులాదియందు బాల్యవివాహమన్న పేరే యెఱుఁగియుండరు;

వేదములయం దతిబాల్యవివాహమన్నమాటయే యదృశ్యము. అస్వాభావికమైన యీ యతిబాల్యవివాహపీడ యాచారపిశాచావేశమువలన నేత వచ్చినదేకాని విధివిహితమయినది కాదు. మావారు వివాహనిశ్చయము చేయునప్పటికిఁ బండ్రెండేండ్లవాఁడనైన నాకు వివాహోద్దేశమే తిన్నఁగాఁ దెలియదు. నాకంటెను నాలుగేండ్లు చిన్నదయిన నాభార్యకు మొదలే తెలిసియుండదని వేఱుగఁ జెప్పవలయునా! నాకుఁ బదమూఁడవయేఁటను నాసహధర్మచారిణికిఁ దొమ్మిదవయేటను బొమ్మలపెండ్లివలె మావివాహమహోత్సవము నడచినది. పిండివంటలు తినుటయు వాద్యములు వినుటయు వేశ్యలనృత్యమును గనుటయు మాకప్పు డాహ్లాదకరములుగానే యుండియుండును. సర్వానర్థమూలకమయిన బాల్యవివాహమువలన మాకుమాత్ర మనర్థములంతగాఁ గలుగక యీశ్వరానుగ్రహమువలన మాదాంపత్యము సంతోషదాయకమే యయినది. వివాహమయిన సంవత్సరములోపలనే నాభార్యకు స్ఫోటకము వచ్చెనుగాని యాచెడురోగమువలన వంగపై కల్యముగాని తిరుగంటి పులి యూడించినట్లు మొగమునిండ గుంటలు పడుటగాని కలుగలేదు; వివాహమయిన రెండవసంవత్సరమునందే నాకును ప్రాణము పోవలసినంతవ్యాధి వచ్చెనుగాని ప్రాణాపాయము కలుగలేదు. మా యిరువురకు నిట్టియాపదలు తప్పుట భగవదనుగ్రహమువలనఁగాని బాల్యవివాహవ్యవహారకర్తల యొక్క శుభచింతనమువలనఁగాదు. నాపెండ్లిలో మావా రేవ్యయములను తగ్గించినను భోగముమేళమున కగు వ్యర్థవ్యయమును మాత్రము చేయక మానినవారుకారు. వేశ్యలు లేకున్న వివాహమునకు శోభయే లేదఁట! గృహస్థుల గౌరవమునకు భంగము కలుగునఁట! పలువురిలో తలవంపులఁట! మౌఢ్యదాస్యములయిన యిట్టి[illegible]

విత్తమిచ్చి వేడుకకయి వేశ్యలను గొనివచ్చి పవిత్రములయిన యిట్టి శుభకార్యములను కులటాసాంగత్యముచే నపవిత్రముచేసెడియీదురాచారము రూపుమాపెడు భాగ్యము భరతఖండమునకెప్పుడుకలుగునో! సంతతసత్ఫలదాయకమయిన పాతివ్రత్యకల్పతరువృద్ధికి మూలమయిన వివాహబంధ మెక్కడ? పాతివ్రత్యదివ్యపాదపమూలచ్ఛేదమునకు వేరుపురుగు లనఁదగిన వేశ్యాంగనల సంబంధ మెక్కడ? నాపెండ్లి యొక్కటి కాదు. మావా రొకటియు మాయత్తవారొకటియు రెండు భోగముమేళములను బెట్టిరి. నాభార్య యద్దంకి పట్టాభిరామయ్యగారి కొమారిత. తల్లి చిన్నతనములోనే కాలముచేసినందున మేనమామయు కాశేరికరణమును నగు వెన్నేటి వెంకటరత్నముగారే యాచిన్నదానిని పెంచి నాకిచ్చి వివాహముచేసిరి. సంతానము లేనివారయినందునఁ దమ మేనకోడలియందు దామునయు భార్యయుఁ దమ కడుపునఁ బుట్టిన సంతానమునం దుండుదానికంటెను నెక్కువప్రేమగలవారయి పెంచిన మోహముచేత పెట్టుపోఁతలయం దేలోపమును గలుగనీయక దయ చూపుచుండిరి. ఆచిన్నది పల్లెలలోనే పుట్టిపెరిఁగినదయినను మేనమామగారు బడికిఁ బంపుచుండుటచేతఁ బెండ్లినాటికే తెలుఁగు కొంత చదివినది. వివాహదినములలో వేడుకకయి మాయిరువుర నొక్కచోటఁ గూరుచుండఁబెట్టి మాచేత రుక్మిణీకళ్యాణములోని పద్యములను జదివించుట నాకిప్పటికిని స్మరణకు వచ్చుచున్నది. వివాహనిమిత్తమయి క్రొత్తనగలు కొన్ని చేయించినను నాతల్లి నాలుగైదువందల రూపాయలువెలగల తననగలను కోడలికిఁబెట్టినది. నాభార్యకు జననీజనకులు పెట్టిన పేరు బాపమ్మ యయినను వివాహమయిన తరువాత మాతల్లి యాపేరుమార్చి రాజ్యలక్ష్మియని తనతల్లిపేరు పెట్టినది. ఈప్రకారముగా ద్వాదశవర్షపూర్తి యయినతరువాత నేను

బ్రహ్మచర్యాశ్రమమును విడిచి 1861 వ సంవత్సరమునందు గృహస్థాశ్రమమునందుఁ బ్రవేశించితిని.

నా పెండ్లి యయినతరువాత నా పెదతండ్రిగారి భార్యకును నాతల్లికిని తగవులాట లారంభమయినవి. ఇరువురకును మనస్తాపము లావఱకే యుండినను నావివాహానంతరమునఁగాని యవి రగులుకొని ప్రజ్వరిల్లి ప్రకాశము కాలేదు. ఒకయింట నూఱు జుట్లిముడునుగాని రెండుకొప్పు లిముడవన్న సామెత యందఱు నెఱిఁగినదేకదా. ఇద్దఱాడువా రొక్కచోటఁ జేరినచోఁ బనిలేనిపాటగా నేదోయొకవిషయమున శుష్కకలహములు పొడచూపక మానవు. ఇప్పటి మనదేశపు స్త్రీలలోఁ గానఁబడుచున్న యీకలహప్రియత్వమునకుఁ బ్రధానకారణము స్వప్రయోజనపరత్వముచేత దూరాలోచన మట్టుపడినవారు తమ తరుణీమణులను విద్యాగంధవిహీనురాండ్రనుగాఁ జేయుటవలన వారి నాశ్రయించియున్న మౌఢ్యభూతావేశదోషమే కాని సహజకోమలమైన స్త్రీస్వభావము కాదు. స్త్రీలహృదయము లజ్ఞానాంధకారబంధురములయి మౌఢ్య మహారాక్షసదుష్పరిపాలనమునకు లోఁబడియున్నంతవఱకు నానావగుణపిశాచము లచ్చటినుండి తొలఁగిపోవు. గృహము మహారణ్యసదృశము గాక భూతలస్వర్గమువలె నుండఁగోరిన యెడల పురుషులు గృహిణులను విద్యావతులనుగాఁ జేసి జ్ఞానదీపప్రభావముచేత నజ్ఞానతిమిరము తొలఁగించి దుర్గుణదురాచార సర్పశార్దూలసంచారములకు వారిహృదయ కుహరములయందుఁ జోటు లేకుండఁ జేయవలెను.

ఈగృహచ్ఛిద్రములకు మూలకారణ మెవ్వరని యడిగినచో వీరేయని నిర్ధారణము చేయుట సుసాధ్యము కాకపోయినను మొత్తముమీఁద నాతల్లిదే యెక్కువ తప్పిదమని చెప్పవచ్చును. గడనలేని వారిని వారిబిడ్డలను తమభర్తలు పోషించుచున్నప్పుడు వారియెడఁ

భర్తలెంత యనురాగము గలవారయినను భార్యలెంత యసూయ గలవారయి యట్టి యనుపోష్యులయెడ ననాదరము చూపుటయు వారినిజూచి విసుగుకొనుటయు నెంత మంచివారిలోనైనఁ గొంతవఱకు సహజముగా నుండును. నాపెద్దతల్లి యిట్టియసహనచిహ్నముల నేమాత్రము కనఁబఱిచినను నాతల్లి యోర్చుకొని యూరకుండునది కాకుండెను. తనకుమారుఁడు పెద్దవాఁడయి విద్యాబుద్ధులఁ బడసి సంపాదించిపెట్ట శక్తుఁ డగువఱకును కష్టములకోర్చుకొని యడఁగి యుండి నెమ్మదిగా కాలము గడపుకోవలెనన్న దూరాలోచనయు శాంతస్వభావమునులేనిదయి మత్సరమే ప్రధానముగాఁ గైకొని నా తల్లి యితరులు తన్నొక్కమాట యన్నతోడనే తా నితరులను పది మాటలని కలహమును బెంచుచు స్వతంత్రప్రకృతిని జూపునదిగా నుండెను. నాతల్లి కోపస్వభావమును స్వతంత్రబుద్ధియు వాక్పారుష్యమును గలదయినను, దయార్ద్రహృదయమును పరోపకారచింతయు సత్యశీలతయు ధైర్యశాలిత్వమును పూనిన కార్యమునందలి స్థిరప్రవృత్తియయి నామె కలంకారములుగా నుండెను. అందుచేత నామెదీర్ఘక్రోధము కలదిగాక యొకవేళ నెవ్వరిమీఁదనైనను దురాగ్రహపడి తిట్టినను, అచిరకాలములోనే యాకోపమునుమఱచి వారిని పలుకరించి వారితో మరల మంచిమాటలాడుచుండును; తనకు విరోధులుగా నుండినవారికైనను కష్టమువచ్చినయెడల పిలువకయేపోయి తోడుపడుచుండెను; తనకడుపుకట్టుకొనియైనను తనకున్నదానిలోనేయన్నార్తులయివచ్చిన బీదలకుఁ బెట్టుచుండెను. తల్లిగుణములు బిడ్డలకువచ్చునని పెద్దలుచెప్పిన మాట యసత్యము కాదుగదా. ఆమె గుణములలోఁ గొన్ని నాకును బట్టుపడినవి. ప్రకృతిచేత నేనును కోపస్వభావము గలవాడనే; సాధారణముగానే నెంత శాంతచిత్తుఁడనుగాఁ గానఁబడినను నాకు కోపము

తీవ్రముగా వచ్చును; ఒరులు చెడుపని చేసినప్పుడు నాకు కోపమాగదు; నే నప్పుడు పరుష భాషణములు సహితము పలుకుదును. నే నన్నిసారులు పశ్చాత్తాపపడి యాదుర్గుణమును మాన్పుమని యీశ్వరుని బ్రార్థించినను మానవలెనని ప్రయత్నించినను నన్నీ యవగుణము నేటికిని విడిచిపెట్టకున్నది. వయస్సెంత వచ్చినను బుద్ధి యెంత హెచ్చినను స్వభావము మారదు కాఁబోలును! కాఁబట్టియే బాహ్యశత్రువులను వేవురనైనను నిరాయాసముగా జయింపవచ్చును గాని యొక్క యంతశ్శత్రువును నిర్జించుట యతిప్రయాసముమీఁదఁ గాని శక్యము కాదని బుద్ధిమంతు లనేకులు చెప్పియున్నారు.

నీవు కార్యార్థినివిగాన మాటకు మాఱుమాటాడక మౌనము వహించి కలహమును జంపివేయవలసినదని యెవ్వ రెన్నివిధముల హితము చెప్పినను నాజనని హితులమాటలు చెవిని బెట్టక తన పట్టిన పట్టును విడువక "కుటుంబద్రవ్యములో నర్థభాగమునకు కర్తయయిన కొమారుఁడు నాకుండఁగా నొరులచేత రోఁతమాటలు పడుచు వారికి దాసిలియొగ్గి దైన్యము వహించి యస్వతంత్రజీవనము చేయవలసినగతి నాకేమిపట్టినది?" అని వీరాలాపములు పలుకుచు ఖడ్గవాదిని యయి పోరాటమునకు వెనుకంజ వేయకుండెను. ఆహా! మూర్ఖతాపిశాచావేశపరవశలయి యుండువారికి వివేకముండదుగదా! ఇట్లుకొంత కాలము వఱకు నా పెదతండ్రిగారు తమయుద్యోగ కార్యనిర్వహణానంతరము సాయంకాల మింటికి రాఁగానే యాయన చెవిని బడునవి తఱచుగా మనస్తాపకరములైన గృహకలహవార్తలుతప్ప మఱి యేవియు లేకుండెను. ఆయన కారణములేని యీశుష్క కలహములను వారించుట కొంత నయమున భయమున సర్వవిధములఁ బ్రయత్నముచేసి చూచెను గాని దానివలనను కార్యము లేకపోయెను. భార్యపైని కోపపడిన

భార్యకు కోపము; మఱదలిపైని కోపపడిన మఱదలికి కోపము. ఈ యుభయకోపములకు నడుమ నాయనకు మనస్తాపము. ఇటువంటి విషమసంధిలో కార్యనిర్వాహకులైన గృహయజమానులకుఁ గలుగు మనోవైకల్య మింతయంతయని చెప్ప శక్యముకాదు. తగవులాడెడి యిరువురును తమదే న్యాయపక్షమనియు తప్పిదమంతయు నెదుటి వారిదే యనియు భావింతురు. అందుచేత వారెవ్వ రెంత చెప్పినను వినక పురుషుఁ డింట నున్నంతవఱకును లోలోపల రాఁజుచున్న కోపాగ్నిని పైకి వెడలనీయక మ్రింగి పునః కలహకరణోపాయము నాలోచించుచు నిశ్శబ్దముగా నున్నను, పురుషుఁడిల్లు వెడలఁగానే వెడలఁగ్రక్కి యేదో కారణాభావమును కల్పించుకొని వెనుకటి కలహకథలనెల్ల మరలఁ ద్రవ్వుకొని ద్విగుణముగా వాక్కలహమునకు డీకొని నోరు నొప్పియెత్తువఱకును పోరాడి యలసి రాత్రి గృహయజమానునకు నివేదింపవలసిన క్రమమును యోచించుచు నప్పటికూరకుందురు. ఇట్టి గృహచ్ఛిద్రములు నిత్యకృత్యములయి గృహమరణ్యసదృశమయినప్పుడు గృహపతికి మనశ్శాంతి యెక్కడిది ? గాఢనిద్ర యెక్కడిది? సుఖ మెక్కడిది? నా పెదతండ్రిగారికి నాయందుఁగల ప్రేమమునకు పరిమితిలేదు. అందుచేత నన్ను వేఱుపెట్టి యసహాయస్థితిలో నుంచుట కాయన కణుమాత్రము నిష్టములేకుండెను. ఆయన నన్నుఁజూచి యెన్నియోసారులు కన్నుల నీరుపెట్టుకొని దుఃఖింపఁ జొచ్చెను. ఎంత దుఃఖించినను నేమికార్యము? కుటుంబకలహమును మాన్పి నెమ్మదిని గలిగించుటకు చరస్థిరరూపమైన ద్రవ్యమును విభజించి యిచ్చి నన్ను వేఱుపెట్టుటకంటె నుపాయాంతర మేదియు నాయన మనస్సునకు గోచరము కాలేదు. నాజననియు సొత్తు పంచియిచ్చి తమ్ము వేఱుపెట్టవలసినదనియే కోరుచుండెను. అదియేయప్పటి కాయనకును యుక్త

మని తోఁచెను. నా పెదతండ్రిగా రొకసారి భాగములు పంచుటకు వస్తువులపట్టికను వ్రాయవలెనని కూరుచుండి, చేతులాడక కంట తడి పెట్టుకొనుచు కాగితమును కలమును క్రిందఁ బడవైచి గదిలోనికిఁ బోయి మంచముమీఁదఁ బరుండి దుఃఖింపఁ దొడఁగెను. ఈదుఃఖపాటంతయు నాయనకు నామీఁదఁగల యవ్యాజానురాగముచేతనే కాని స్వాధీనమయియున్న సొమ్ము పంచియియ్యవలసివచ్చునన్న విచారము చేత లేశమును గాదు. సొత్తు పంచియియ్యుటకు కలహము లడఁగుజాడ కనఁబడలేదు. అందుచేత మరలఁ గొన్నిదినముల కాయన 1862 వ సంవత్సరము ఆగష్టునెలలో నొకనాఁడు నాభార్య మేనమామను మఱియొక బంధువునుమాత్రము పిలిపించి వారి నొద్దనుంచుకొని భాగముల పట్టికను వ్రాసి నాసగపాలు నాకిచ్చివేసెను. నావంతుకు మేడగల పెద్దయిల్లొకటియు, మున్నూఱురూపాయల వెలగలపాత్రసామగ్రియు, నాలుగైదువందల రూపాయల వెండిబంగారపునగలును, ఏఁబదియైదు రూపాయల ఋణమును వచ్చెను. అటుతరువాత నాపాలికి వచ్చిన గృహములోనే నాజనని నాకు వేఱుగ వంటచేసిపెట్ట నారంభించెను. ఇట్లు పృథగ్భాండాశనము చేయుచున్నను, నాపెదతండ్రిగారు మాకు సర్వవిధముల సాయము చేయుచునేయుండిరి. ఎట్లు చేయకుండఁగలుగుదురు! కన్నప్రేమకంటె పెంచినప్రేమ యెక్కువగదా! మేము వేఱుపడినట్లు సహిత మితరులకు తెలియకుండవలెననియే యాయన యభిమతము. గృహకలహములచేత తల్లిని, బిడ్డను గొంతకాలము వేఱుగ నుంచవలసి వచ్చినదని యాయన యడిగినవారితోఁ జెప్పుచు వచ్చెను. ఒక కాగితముమీఁద వస్తువులపట్టికనువ్రాసి సంతకములు చేయించుటయేకాని దానిని ముద్రకాగితముమీఁద వ్రాయనేలేదు. దాయవిభాగమున కావశ్యకమైన విభాగపత్రమును వ్రాయలేదు. ఆ పట్టికను నాపెదతండ్రిగారు తనయొద్దనే యుంచుకొనిరి. ఈవిభాగము

అయినతరువాత కొలఁదికాలములో నేనాపెదతండ్రిగారు తమయుద్యోగ ధర్మమునుబట్టి గ్రామాంతరమునకుఁ బోవలసినవారయిరి. అంతటితో తొంటి కుటుంబకలహము లన్నియు నంతరించినవి; కుటుంబయజమానునకును తదితరకుటుంబస్థులకును గూడ మనశ్శాంతియు నైసర్గిక ప్రేమానుబంధదృఢత్వమును మరలదినదినక్రమమునవర్ధిల్లఁజొచ్చినవి. అవిభక్తకుటుంబములలో నంతఃకలహము లుద్భవిల్లి యైకమత్యము చెడి సుఖభంగము గలిగినప్పుడు కుటుంబస్నేహమును మరల నెలకొల్పుటకు వేఱుపడుటయే యుత్తమసాధనము. వేఱువేఱుగా దూరమున నుండుటచేత నొండొరులతోడ తగవులాడుట కవకాశముండదు. తగవులాట లెప్పుడుండవో యప్పుడే యీవఱకు శోషిల్లి ప్రాణావశిష్టమయి యుండిన స్వాభావికస్నేహలత నిర్మూలముగాక పునరుజ్జీవనము నొంది యల్పకాలములోనే తలయెత్తి కాలక్రమమున కొనలుసాగి వర్ధిల్లి ఫలప్రదమగును. కలిసియుండినప్పుడైకమత్యమును బరస్పరానురాగమును లేనివా రనేకులు విభక్తులయినతరువాత బహుకుటుంబములలో మరల నన్యోన్యమైత్రిని బడసినవారయి పరస్పరసహాయులయి సుఖించుచున్నారు. నా భాగమునకు వచ్చినయిల్లు చెన్నపురివంటి స్థలములో నుండెనేని నెలకు నలువది నేఁబది రూపాయలయద్దె రాఁదగినదైనను, రాజమహేంద్రవరములోసహిత మిప్పుడాయింటిమీఁద మాసమునకు పదునేనురూపాయలు వచ్చుచున్నను, ఆకాలమందు నాలుగు రూపాయలుమాత్రమే వచ్చుచుండెను. అప్పుడు నాలుగు రూపాయలతోనే బీదకుటుంబములు సుఖజీవనము చేయవచ్చును. ఆకాలమునందు భోజనపదార్థము లన్నియు మిక్కిలి చౌక; ఒక్క రూపాయ యిచ్చిన నిప్పుడు వచ్చువానికంటె నాలుగురెట్లెక్కువగా వచ్చుచుండెను. నాపాలికివచ్చిన యొక్కటకమాలిన వస్తువు లేవేవో

యమ్మివేసి నాతల్లి మాయప్పుల నప్పుడే తీర్చివేసెను. ఆమె యటు తరువాతసహితము పదిరూపాయలైనను ఋణమెప్పుడును జేయలేదు. ఆమె గృహకృత్యనిర్వహణమునందు మిక్కిలి సమర్థురాలు; ఒక్క రాగికాసైనను వ్యర్థముగా నెప్పుడునువ్యయపెట్టలేదు; సమస్తవిషయ ములలోను సుఖలోపము కలుగకుండ మితవ్యయము చేయుచుండెను. తన కడుపుకట్టుకొనియైనను నాకేలోపమును గలుగకుండ నన్నవస్త్రాదు లకు జరపుచుండెను. నాతల్లి మిక్కిలి యభిమానవంతురా లగుటచేత సాయముచేయుఁడని యెప్పుడు నెవ్వరి నడుగ నొల్లకుండెను. మాయం దత్యంతప్రేమముగలిగి మేనమామకుమారుఁడైన తనబావగారినిసహి తము తోడుపడుమని యామె యడుగలేదు. అయినను మాపెదతండ్రి గారు తమవంతు గృహముమీఁద వచ్చిన యద్దెనుగూడ పుస్తకముల నిమిత్తమును విద్యనిమిత్తమును నాకేయిచ్చుచుండిరి; ఇదిగాక యప్పు డప్పుడు మాకు కొంతధనసాహాయ్యమును సహితము చేయుచువచ్చిరి.

ఈకాలమునందు నేను జేసిన దుష్కార్యమొకటి కలదు. అది నామనస్సు నెంతో కాలము బాధించుచుండెను; నాతల్లిని మోసపుచ్చి నేనుజేసిన నాచిన్నప్పటి మోసకార్యమునకై నేనుపలుమాఱనుతాప పడితిని. దీనిని చదువుబాలురు నాదుశ్చేష్టవలన బుద్ధితెచ్చుకొని తా మట్టివంచనము నెప్పుడును జేయక జాగరూకులయియుండ నేర్చుకొనుట కనుకూలపడునన్న తలంపుతో దాని నిక్కడ వ్రాయుచున్నాను. నా కాంధ్రభాషాకావ్యపఠనమునం దత్యాసక్తి కలిగియుండెనని యీవఱకే చెప్పియున్నాను. బ్రహ్మశ్రీ ఓగిరాల జగన్నాథముగా రప్పుడు నూత నముగా రచించిన సుమనోమనోరంజన ప్రబంధ మంతయు మూఁడవ తరగతిలోఁ జదువుకొనుచుండినప్పుడే కాగితములమీఁద వ్రాసికొంటి నని నాచదువరులు విన్నప్పుడు నాకుఁ దెలుఁగునందుఁ గల యభి లాషాధిక్యమును వేఱుగఁజెప్పనక్కఱలేకయే తెలిసికోఁగలరు. ఆంధ్ర

కావ్యములలో నెల్లను వసుచరిత్ర ముత్తమమైనదని పలువురు చెప్పుచు వచ్చిరి. అందుచేత దాని నేలాగునైనఁ జదువవలెనని నామనస్సువ్విళ్ళూరఁ జొచ్చెను. మాయింటఁ గల తాటాకుల పుస్తకముల నెల్లను విప్పిచూచితినిగాని వసుచరిత్ర మందుఁ గానరాలేదు. అప్పుడేమి చేయుటకును తోఁచనివాఁడనయి, నాతల్లి నడుగుదునా మానుదునా యన్నసందేహముచే డోలాందోళనమానసుఁడనయి కొన్ని దినములు నాలో నేను తలపోసి, తుదకు సాహసముచేసి యొకనాఁడు మెల్లగా నామెను డాయఁబోయి వసుచరిత్రమును కొనిపెట్టుమని దీనముగా వేఁడితిని. అది నాపాఠపుస్తకము కాదని యెఱిఁగినదయి యామె నా కోరికను చెల్లింపక నిరాకరించెను. ఇట్లాశాభంగము నొందినవాఁడనైనను, అంతటితో నిరాశ చెంది యూరకుండక యేలాగునైనను వసుచరిత్రమును గొని చదువవలెనని నిశ్చయించుకొంటిని. ఎట్లుకొనఁ గలుగుదును? అప్పు డాపుస్తకము వెల నాలుగురూపాయల యెనిమిదణాలు; నాచేత నెనిమిదణాలకంటె నెక్కువగా లేవు; నాతల్లి నడిగిన నేమియు నిచ్చుజాడ కనఁబడలేదు; న్యాయమార్గమున నంతవిత్తము నార్జించుటకును నాకప్పు డాధారము కనఁబడలేదు. అందుచేత నా యొద్దనున్న యెనిమిదణాలును తోడనే పుస్తకవిక్రేతచేతిలోఁ బెట్టి, తరువాత నెలకెనిమిదేసియణాలచొప్పున ప్రతిమాసము నిచ్చుచుందుపద్ధతి మీఁద పుస్తకమునుకొని చదువవలెనని నాకప్పు డొక్క దురాలోచన తోఁచినది. నెలనెలకు నెనిమిదేసి యణాలచొప్పున నిచ్చుచుండుటకు సహితము నా కప్పుడు శక్తి లేదు. కాఁబట్టి ప్రతిదినమును వేళకుభోజనము చేసి పాఠశాలకుఁ బోవుచున్నట్లు నటించుచు నెక్కడనో కూరుచుండి సాయంకాల మింటికి వచ్చుచుండుటకును, పాఠశాలాజీతము నిమిత్తమిచ్చెడి యెనిమిదణాలును పుస్తకము నిమిత్తము వ్యయపెట్టుచుండుటకును నిశ్చయించితిని. ఇట్లుచేయుట పాపకార్యమని నాయంత

రాత్రి నన్ను దూషింపఁజొచ్చెను గాని పుస్తకపఠనాశామహాభూత మింతలో నడ్డపడి నాకు సహాయమయి యుద్రేకించి, తనసమ్మోహన శక్తిచేత నప్పటికి దాని నోరడఁచి నిద్రపుచ్చి నాదుర్బుద్ధిని ప్రోత్సాహపఱిచినది. పుస్తకపఠనాభిలాషము నన్నవివేకిని జేయఁగా నేను వెంటనే పుస్తకవిక్రేతయగు పందిరి మహాదేవుఁడను వైశ్యునికడకుఁబోయి, నావాంఛను దెలిపితిని. నా యుతిలౌలత్వమును జూచి కనికరించి, పుస్తకము వెల పూర్ణముగా తీఱువఱకును తన పుస్తకవిక్రయశాలలోనే నేను కూరుచుండి దానిని చదువుకొనుచుండునట్లు సమయమేర్పఱిచి, ఆయాపణికుఁడు నాప్రార్థన మంగీకరించెను. ఆవఱకు నాయొద్ద నున్న యెనిమిదణాలను నాకప్పుడు నెలజీతముకొఱ కిచ్చిన యెనిమిదణాలును జేర్చి యొకరూపాయ పుస్తకవిక్రయికున కిచ్చి యాతని యంగడిలోనే కూరుచుండి యతికుతూహలముతో పుస్తకమును జదువ నారంభించితిని. నేను పాఠశాలకుఁ బోకుండుట రెండవనెలలోనే నా సహపాఠులవలన నాతల్లికిఁ దెలిసినది. వంచనము బయలఁబడక చిరకాల మెప్పుడును దాఁగియుండ నేరదు. అప్పు డామె నన్ను గొందలించి, అడిగినతోడనే సత్యము చెప్పినందుకును జీతమును గొనిపోయి మధురాహారములకయి వెచ్చపెట్టక పుస్తకక్రయమునకు వ్యయపెట్టినందునకును గొంత సంతోషించి, మిగత సొమ్మిచ్చి నా కాపుస్తకమును గొనిపెట్టి, నన్ను మరలఁ బాఠశాలకుఁ బంపెను. దుర్బుద్ధి పొడమినప్పుడు వేగిరపడి యిటువంటి దురాచరణములయందుఁ బ్రవేశింపకుండ వారించుటకయి బాలుర కిది యొక మహోపదేశ మగును గాక! ఈ యపరాధమునకయి నాప్రియజనని పుత్త్రవాత్సల్యముచేత నన్ను మన్నించి యూరకున్నను, కొంతకాలము నిద్రించియుండి మరల మేలుకొన్న నాయంతరాత్మమాత్ర మట్లు చేయక నిర్దయమయి నన్ను నిందింపఁజొచ్చెను.

నాయంతరాత్మవలని బాధచేతనే యని చెప్పలేనుగాని యే హేతువుచేతనో యీపని జరిగిన శీఘ్రకాలములోనే చేసిన నేరమునకు దండనమో యనునట్లు నాకు వ్యాధి యారంభమయినది. ఒక్కసారి భగవన్నామస్మరణము చేసినమాత్రముననే యీజన్మమునఁ జేసినవే గాక బహుజన్మసంచితములయిన సమస్తపాపములును నిర్మూలము లగునన్న యప్పటి నావిశ్వాసమువలన నిత్యమును దేవతాసందర్శన సంస్మరణములు చేయుచుండెడి నాకా యల్పదుష్కృతదోష మప్పుడే పోయెననియే నమ్మకము కలిగెను. అందుచేత నంతరాత్మ నన్ను బాధించుట మానివేసినది. అయినను నా వ్యాధిమాత్రము తగ్గక యంతకంతకు వృద్ధిఁబొంద సాగినది. నాకు శైశవమునుండియు నుండిన దగ్గునకు తోడుగా నజీర్ణాతిసారరోగములుకూడ నన్నాశ్రయించినవి. ఇంగ్లీషువైద్యులును తెలుఁగువైద్యులునుకూడ బహుమాసములు నా కనేకౌషధము లిచ్చిరిగాని యెవరిమందువలనను రోగ మించుకయు నివారణము కాలేదు. శరీరములోని రక్తమాంసములు హరించిపోయి శల్యావశిష్టుఁడనై నేను పూచికపుడకవలె నయితిని. వ్యాధి యసాధ్య మైనదని భావించి, నాజీవితాశ లేనివారయి తామే మాట దక్కించు కొనుట కిష్టములేక చికిత్స మానుకొని యొకరితరువాత నొకరుగా వైద్యులందఱు నన్ను చేయివిడిచిరి. నాబంధువులు మొదలగ నెల్ల వారును నాబ్రతుకునందు నిస్పృహులయి యిఁక మనుష్యప్రయత్నము వలనఁ గార్యము లేదని దైవపరులయి యుండిరి. ఈప్రకారముగా 1863వ సంవత్సరాంతమునుండి 1864వ సంవత్సరాంతమువఱకును నేను మరణ జీవితములమధ్య నూఁగులాడుచుంటిని. ప్రతినిమిషమును మృత్యుదేవత నన్నునోర వేసికొనిపోవ జూచుచుండియు నేనొక్క కబళమునకైనను జాలనని యేమో విడిచిపెట్టుచుండెను. నేనప్పుడు మృత్యుముఖమునుండి వెలువడి మరల భూమిపై నడుగుపెట్టఁ గలు

గుట. నిర్హేతుకజాయమానమైన యీశ్వరానుగ్రహవిశేషము వలననే కాని యౌషధప్రభావముచేతఁ గాదని చెప్పవచ్చును. ఘనవైద్యులు నన్ను విడిచిపెట్టినతరువాత మాయింటి సమీపముననే వాసముచేయు చుండినట్టియు మొదటినుండియు నాకు మందు లిచ్చుచుండినట్టియు గండ్రెపు వెంకన్నగారను వైద్యశిఖామణి నాకు కూరగాయవైద్యము చేయుచువచ్చెను. ఏదైననేమి? వ్యాధిని కుదిర్చినదే దివ్యౌషధము. తుద కాయనవైద్యమువలననే దేహస్వాస్థ్యము కలిగినది. నే నిప్పుడు జీవించుట యతిమానుషమైన పరమాద్భుతకర్మమని యాయనయే పలుమాఱు నాతోననుచు వచ్చెను. 1865 వ సంవత్సరారంభమున నాకు వ్యాధి నిర్మూలించినను, తరువాతఁ గొన్నినెలలకుఁగాని జవసత్త్వములు గలిగి పాఠశాలకుఁ బోవ శక్తుఁడను గాకుంటిని. ఆసంవత్సరము వేసవికాలపుసెలవు లయినతరువాత దొరతనమువారి మండల పాఠశాలయం దావఱకు విడిచిపెట్టిన మూఁడవతరగతిలోనే నేను మరలఁ బ్రవేశించితిని. నా కప్పుడు గల మేధావిశేషమునుగూర్చి యీవఱకే సూచన చేసియున్నాను. నే నాఱుమాసములే యాతరగతిలోఁ జదివినను సంవత్సరాంతమునందు జరిగినపరీక్షలో నేనే మొదటివాఁడ నైతిని. సంవత్సరపరీక్షలో నాకు వచ్చినసంఖ్య నాతరువాతివానికి వచ్చినదానికంటె నూఱు హెచ్చుగానుండెను. ఇందులకుఁ గారణము పాఠపుస్తకమును నే నొక్కసారి చదువఁగానే యందలి విషయములన్నియు నాకు ముఖస్థములయి తత్కాలమునకు స్మరణకు వచ్చుచుండుటయే. సంవత్సరపరీక్షయం దాతరగతి కేర్పఱుపఁబడిన పరమసంఖ్య 360. ఈ సంఖ్యలో మూఁడవవంతుకు తక్కువకానిసంఖ్యను దెచ్చుకొన్న విద్యార్థుల నందఱిని పరీక్షాసిద్ధులనుగా పరిగణించి పైతరగతికిఁ బంపి, బాలురు తెచ్చుకోవలసినదానిలో నల్పిష్ఠసంఖ్యయైన మూఁడవవంతును (120) తెచ్చుకొనివారి నందఱిని

మరలఁబూర్వపుతరగతిలో నేయుంచుచుండెడివారు. ప్రతిబాలునకును తన తరగతిలో సంవత్సరముపొడుగునను వచ్చెడిసంఖ్యయంతయు మొత్తము చేసి, అందఱిలో నధికసంఖ్యను దెచ్చుకొన్న బాలుని సంఖ్యను సంవత్సరపరీక్షాపరమసంఖ్యతో (360) సమానముగాఁ జేసి, తక్కిన వారి సంఖ్యలను యథాభాగములుగా తగ్గించుచుందురు. ఇట్లు చేసినప్పుడు నావి యాఱునెలల సంఖ్యలే యగుటచేతను తక్కినవారివి సంవత్సరసంఖ్య లగుటచేతను నేను నాతరగతిలో తొమ్మిదవవాఁడ నైతిని. ఈ సంవత్సరార్జితసంఖ్యయు సంవత్సరాంత పరీక్షాసంఖ్యయు నొకటిగాఁ జేర్చి యెక్కువసంఖ్య వచ్చిన మొదటి ముగ్గురికిని బహుమానము లిచ్చుచుండిరి. ఇట్లుచేర్చిన సంఖ్యనుబట్టి యాసంవత్సరము నాతరగతిలో నేనే ప్రథముఁడ నైతిని. అందుచేత నాకోరికప్రకారముగా పయిసంవత్సరమంతయు నాకు జీతములేకుండ విద్య చెప్పునట్లేర్పాటు చేసిరి. పుస్తకరూపబహుమానము కావలెనో విద్యావేతనరాహిత్యరూప బహుమానము కావలెనో కోరుకొనెడి స్వాతంత్ర్యము ప్రథముఁడుగాఁగృతార్థుఁడయినవానికుండెను. ఆసంవత్సరము మొదలుకొని పాఠశాలలోఁ జదువుకొన్నంతకాలమును నేను చదువునిమిత్తము జీత మియ్యవలసిన యావశ్యకమే లేకపోయెను.

నాల్గవతరగతిలోఁ జదువుకొనుచున్నకాలములో నన్నుఁగూర్చి నేను విశేషముగాఁ జెప్పుకొనవలసినదేదియు లేదు. తెలివిగలవాఁడననియు, పాపభీతియు దైవభక్తియుఁ గలవాఁడననియు, ఆడినమాట తప్పనివాడననియు, సాధువర్తనముగలవాఁడననియు, సత్యము పలుకువాఁడననియు, భావించి పాఠశాలయందలి బాలురందఱు నాయందతిమాత్రగౌరవము కలవారయి యుండిరి. తోడిబాలురకు నాయెడలఁగల యవ్యాజసౌహార్దమునకు నిదర్శనముగా నొకవృత్తాంతము నిందుఁ బొందుపఱుచుచున్నాను. ఒకనాఁడు మధ్యాహ్నకాలమున మూ

మండలన్యాయాధిపతియైన హెన్రీ మారిసుదొరగారు పాఠశాలను జూచుటకయి యాకస్మికముగావచ్చిరి ప్రధానోపాధ్యాయుఁడాయనను వెంటఁ బెట్టుకొనిపోయి యన్నితరగతులను జూపివచ్చినతరువాత దొరగారు పాఠశాలలోని బాలురలో నెల్ల సత్ప్రవర్తనముగలవా రెవ్వరో వారిపేరు వ్రాయవలసినదని విద్యార్థుల కందఱికిని కాగితపుముక్కల నిప్పించిరి. ఎవ్వరిపేరు వ్రాయుదమని యితరులతో నాలోచించుటకు వారి కప్పు డవకాశములేదు. అందుచేత బాలురందఱును నెవరికిఁ దోఁచినపేరులు వారు వ్రాసియియ్యఁగా, ఆకాగితపుముక్కలనన్నిటిని పోగుచేసి యందువ్రాయఁబడిన నామధేయములను జదివినప్పు డధిక సంఖ్యగలబాలురు నాపేరువ్రాసినట్లేర్పడెను. ఎవ్వరిపేరైనను వ్రాయుమని కోరినప్పుడు బాలురు సాధారణముగా నున్నతవర్గములోని వారిపేరొకటి వ్రాయుట స్వాభావికము. అట్టిస్థితిలో పై తరగతిలోని వారినందఱిని విడిచిపెట్టి విద్యార్థులు దిగువ తరగతిలోనున్న నన్నుపేర్కొనుట వారికి నాయెడలఁగల సదభిప్రాయమును సూచించుచున్నది. సద్వర్తనముకొఱకై యొక బహుమానము నియ్యఁ దలఁచుకొని దొరగా రిట్లు పేరులువ్రాయించిరి. ఆబహుమానము నాకేవచ్చినదని చెప్పనక్కఱయుండదు. అప్రయత్నముగా వచ్చినదగుటచేతను సత్ప్రవర్తనమును గూర్చినదగుటచేతను నాకాబహుమాన మిప్పటికిని నధిక ప్రీతికరమై యున్నది. ఆదొరగారు పదిరూపాయల విలువగల పుస్తకములు నన్నుఁ గోరుకొమ్మన్నప్పుడు పైతరగతికిఁ గావలసిన పుస్తకములను, నిఘంటువు నొకదానిని నేను గోరుకొంటిని. ఆనిఘంటువుపై దొరగారు స్వహస్తముతో వ్రాసిన వ్రాఁతను జూచుకొన్నప్పుడెల్లను నాకు సంతోషము కలుగుచుండును. అందుచేతనే నాకు బహుమానములుగా వచ్చిన యితర పుస్తకముల నన్నిటిని పోఁగొట్టుకొన్నను సద్వర్తనము నిమిత్తము బహుమానముగా నియ్యఁబడిన యీ

నిఘంటువును మాత్ర మిప్పటికిని పదిలముగా భద్రపఱిచియున్నాను. ఈ దొరగా రింగ్లండు దేశ చరిత్రమును, హిందూ దేశ చరిత్రమును రచియించి ఉపకార వేతనము నొంది యింగ్లండునకుఁ బోయిన తరువాత హిందూ దేశమునందుండిన ఘనుల వృత్తాంతములు మొదలైనవి వ్రాసి యిప్పటికిని సజీవులయియున్న ప్రసిద్ధపురుషులు. ఈ దొరగారు మా గోదావరీమండలములో న్యాయాధిపతులుగా నుండినంత కాలమును సద్వర్తనమునకై ప్రతిసంవత్సరమును విద్యార్థులకు బహుమానము లిచ్చుచు వచ్చిరి. కాని తరువాత తరువాత ధనికులుగాను ప్రబలులుగాను నుండిన యనర్హులు సహితము విద్యార్థులను ప్రార్థించియు పీడించియు తమ పేరులు వ్రాయించుకొనుచు వచ్చుటచేత నట్టిబహుమానములయందలి గౌరవ మంతకంతకు తగ్గిపోవుచువచ్చినది. విద్యార్థులు నాయందిట్లు సదభిప్రాయముగలవారై యుండినను ఆ కాలమునందు నే నసత్యము నెన్నఁడును బలుకలేదని చెప్పఁజాలను. అప్పుడు నేనాడిన యొక యసత్యమునుగూర్చి యిందు వ్రాయక విడుచుట న్యాయముకాదు. ఆ కాలమునం దిరువదిరూపాయలకు మించిన దొరతనమువారి యుద్యోగముల కర్హులనుగాఁ జేసెడిది సామాన్యపరీక్ష యని యొకటియుండెను. అది యింగ్లీషును, తెలుఁగును, రెండు వేలువేలు శాఖలు కలదిగానుండెను. విద్యార్థు లింగ్లీషులోఁగానిఁ దేశభాషలోఁగాని, ఉభయభాషలలోనుగాని పరీక్షకుఁ బోవచ్చును. ఈపరీక్షయందుఁగాని సర్వకలాశాలాప్రవేశపరీక్షయందుఁగాని కృతార్థులైనంగాని యెవ్వరును విశేషపరీక్షలకు పోఁగూడదు. సామాన్య పరీక్షాప్రశ్నపత్రములను జూచినప్పుడు నాకవి సులభములుగా కనఁబడినందున నాకాపరీక్షకుఁబోవలెనని యత్యంతకుతూహలము కలిగెను. అయినను నా యుద్యమమునకొక్క ప్రతిబంధ మప్పు డనివార్యమై యడ్డుపడెను. పదునెనిమిది సంవత్సరములు దాఁటినవాఁడుగాని యాపరీక్షకు పోఁగూడదు. నాకప్పటికి

పదునెనిమిది సంవత్సరములు నిండలేదు. అప్పుడు నాకు నాజన్మసంవత్సర మేదో తెలియకపోయినను, నాజన్మపత్రమును నే నెన్నఁడును జూచియుండకపోయినను, నాకు పదునెనిమిదేండ్లు దాఁటలేదని మాత్రము నే నెఱుఁగనివాఁడనుగాను. అయినను శీఘ్రముగాఁ బరీక్షాసిద్ధుఁడను గావలెనన్న బాల్యచాపల్యముచేత నేను పరీక్షకు పోవుట మానక నావయస్సు పందొమ్మిది సంవత్సరములని కాఁబోలును ప్రార్థనాపత్రమునందు వ్రాసి పంపితిని. ఇంగ్లీషు వైద్యుఁడు సహితము నేను స్ఫోటకపడితి ననియు నావయస్సు పందొమ్మిది సంవత్సరము లనియు నిర్ణయపత్ర మిచ్చెనుగాని యంతమాత్రముచేత నేను దోషినిగాక పోను. ఆసంవత్సరమే నే నుభయభాషలలోను పరీక్షాసిద్ధుడనై, ఉత్తర సర్కారులలో కృతార్థులైనవారిలో రెండవవాఁడనై నిలిచితిని. ఇట్లు పరీక్షయందు చరితార్థత నొందుటగాని వైద్యపట్టము నందిన రాజకీయోద్యోగి పరీక్షించి పందొమ్మిది సంవత్సరములని నిర్ణయించుటగాని నన్ననృతదోషమునుండి రక్షింపనేరదు. ఆకాలమునందు బుద్ధిపూర్వకముగా నాడిన యసత్య మిదియొక్కటియే యని నానమ్మకము. ఈ యసత్యదోషమునకై నే నిటీవల పెక్కుతడవలు పశ్చాత్తాపపడితిని. ఇప్పటివలెఁ గాక కొన్ని విషయములలో నబద్ధమాడవచ్చుననియు, అనృతదురితము గాయత్రీమంత్రజపాదులవలనఁ బోవుననియు, బహువారపురాణపఠనదూషితమై యుండిన నాహృదయమున కప్పుడుసిద్ధాంతమై యుండెను. ఇట్టి దురాచరణములు పెద్దలచే యయినను పిన్నవారు వానిని ఆత్మానందవినాశకములైన మహావిషయములనువలెఁ బరిత్యజించి, యసత్యము నెప్పుడును జిహ్వాగ్రమునకు రానీయక, సత్యమునే ప్రాణాధికముగా గ్రహించి, సదా సత్యాదరముగలవారై మెలఁగవలయును. 'నాన్నృతాత్పాతకంపర'' మని పెద్దలు ఘోషించి యున్నారుగదా!

# స్వీయచరిత్రము

నాయందు మంచియభిప్రాయము గలవారు నాసహపాఠులైన విద్యార్థులు మాత్రమేకాక; ఉపాధ్యాయులకును నాయందట్టి సదభిప్రాయమే. ఉపాధ్యాయులలోఁ గొందఱు నాయం దతిదయయు పక్షపాతమును గలవారై యుండిరి. మామండలపాఠశాలలోని యప్పటి తెలుఁగు పండితులైన పులిపాక గురుమూర్తిశాస్త్రిగా రాంధ్రమునం దంతపాండిత్యము గలిగినవారుకారు. ఆయనకంటె నాకే తెలుఁగునం దెక్కువజ్ఞానము కలదని యప్పటిబాలుర యభిప్రాయము. ఆయాంధ్రోపాధ్యాయుఁడు మా తరగతిలోని బాలురకు పాఠములు నాచేతనే చెప్పించి యెప్పుడును నన్నగ్రస్థానమునందుఁ గూర్చుండఁబెట్టెడివాఁడు. ఎప్పుడేని బడికి పోక మానినప్పు డాయెడఁ గాఁడు నేనధమస్థానమునందుఁ గూర్చుండవలసినవాఁడనైనను, ఏదోప్రశ్నవేసి యాయుపాధ్యాయుఁ డొక్కసారిగా నన్ను కడనుండి మొదటికిఁ బంపుచుండెడివాఁడు; ఒకవేళ నడుమనుండిన బాలురలో నెవ్వఁడైన సరియైన యుత్తరము చెప్పినను వినిపించుకోక యతనిఁ దప్పుచేసెడివాఁడు; అట్టివంటిసమయములలో నేను లేచి యాబాలుఁడు సరియైన యుత్తరము చెప్పియుండుటచే నాస్థానమున కతఁడే యర్హుఁడని చెప్పినను మాశాస్త్రిగారియొద్దఁ గార్యము లేకుండెను. మా పాఠశాలాప్రధానోపాధ్యాయులకును నా నడతను బట్టియు తెలివిని బట్టియు నాయం దపరిమితాదరము కలిగియుండెను. మాకుఁ గొంతకాలము వైయాపురి మొదల్యారుగారు ప్రధానోపాధ్యాయులుగానుండిరి; ఆయనకు గణితశాస్త్రపరిజ్ఞానము విశేషముగా నుండినను భాషాజ్ఞానము మాత్ర మల్పమై యుండెను; ఇంగ్లీషుపద్యకావ్యములయం దాయన కర్థముకాని భాగములకుఁ గొన్నిసమయములయందు నేను సరియైన యర్థము చేయుచుండఁ గలుగుట చూచి యింగ్లీషునందు నేను గట్టివాఁడనని యాయన యెల్లరతోను జెప్పుచుండెడివాఁడు. ఆయన తఱు

వాత మాకు శ్రీ చెంగల్వ కుప్పుస్వామిశాస్త్రులవారు ప్రధానోపాధ్యాయులుగా వచ్చిరి; వారి కింగ్లీషునందు మంచిపాండిత్య మున్నను గణితశాస్త్రపాండిత్య మల్పమైయుండెను; ఆయన చేయలేని లెక్కలను నేను చేయఁగలుగుచుండుట చూచి గణితశాస్త్రమునందు నేను గట్టివాఁడనని యాయన యెల్లరతోను జెప్పి నన్ను మెచ్చుకొనుచుండెడివారు. నిజము చేత నేను తెలుఁగునందుఁగాని యింగ్లీషునందుగాని లెక్కలయందుఁగాని భూగోళశాస్త్ర దేశచరిత్రాదులయందుఁగాని దేనియందును న్యూనతలేనివాఁడనయి యుంటిని. దేశపటములను వ్రాయుటయందు తక్కినవారికంటె నా కెక్కువ నైపుణి కలిగి యుండెను. నాకప్పుడు గ్రహణధారణశక్తులును బుద్ధిసూక్ష్మతయు నసాధారణములుగా నుండినను వానివలన ఫలములేకుండఁ జేయుటకై యలసభావమును నిరంతరకృషిరాహిత్యమునుగూడ నన్నాశ్రయించి పీడించుచుండెను. అప్పటి నా ధారణాశక్తి కొకదృష్టాంతమును వినుఁడు. నేను రెండవతరగతిలోనో మూడవతరగతిలోనో చదువుకొనుచుండినకాలములో నా పెదతండ్రిగారును ములుకుట్ల గంగన్నగారును గలిసి మాయింట రాత్రులు ప్రాడ్వివాక (డిస్ట్రిక్టు మునసబు) పరీక్షకుఁ జదువుకొనుచుండెడివారు. నేను పరుండెడు మంచము వారు చదువుకొనెడు స్థలమునకు సమీపముననే వేయఁబడియుండెను. అందుచేత వారు చదివెడిది నేను పరుండి వినుచుండెడివాఁడను. వారు మఱునాఁడు చదువుట కారంభించినప్పుడు పుస్తకమును క్రిందఁబెట్టి ముందుగా గతదినము చదివినదాని చింతనము చేయుచుండెడివారు. అటుచేయునప్పుడు రాజశాసనప్రకరణభాగములలో నేదయినను వారికి స్మరణకు రాకపోయెనేని నేనందుకొని మంచముమీఁదనుండి చెప్పుచుండెడివాఁడను. నాధారణాశక్తికి వారాశ్చర్యపడుచుండెడివారు. ఆసంవత్సరముననే వారిరువురును తత్పరీక్షాసిద్ధులైరి. ఈపరీక్షలో

ధన్యతఁ బడసినతరువాత నాపెదతండ్రిగారికి ప్రాడ్వివాకసభలో ప్రధానవిలేఖకోద్యోగ మైనది. అందుచేత రాజమహేంద్రవరమును విడిచి కొంతకాల మాయన పెద్దాపురములోను, అమలాపురములోను, ఏలూరులోను, ఉండుచు వచ్చిరి. ఆ కాలమునందు నేనును నాతల్లియు వేసవికాలపు సెలవులలోను శీతకాలపు శెలవులలోను బోయి వారి యొద్దనే యుండుచుండెడివారము. అప్పుడు నా పెదతల్లియు తల్లియు నొండొరులతో మాటాడుచు లోపల మనస్స్పర్థ యొకవేళ నడఁగి యున్నను పైకి మైత్రి కలిగియే యుండెడివారు. అందుచేత మే మవిభక్తకుటుంబమువలెనే యుండెడివారముగాని విభక్తకుటుంబమువలె నుండుచుండలేదు. నాలవతరగతిలోను సంవత్సరాంతపరీక్షలో నేనే మొదటివాఁడనైతిని. పరీక్షాప్రశ్నముల కేర్పఱుపఁబడిన పరమసంఖ్య 480 లో నాకు వచ్చినసంఖ్య 420. అప్పటి పాఠశాలాపరీక్షకులైన బవర్సు దొరగారు నా తెలివి కద్భుతపడి నన్ను ప్రత్యేకముగా తమ గదిలోనికిఁ బిలిపించి చేరువను గూర్చుండఁబెట్టుకొని, ఆదరముతో నా వీపుమీఁద తట్టి, యిచ్చటఁ బ్రవేశపరీక్షం జేసినతరువాత చెన్నపురికిఁ బోయి పట్టపరీక్షవఱకును తప్పక చదువవలసినదని హితబోధచేసిరి. పరీక్షయందు వరుసగా రెండుసంవత్సరములు ప్రథముఁడుగాఁ దేఱిన వానికి పుస్తకబహుమాన మిచ్చుటయేకాక సంవత్సరకాలము జీతము లేకుండ చదువుకొన నిచ్చుచుండిరి. ఆసంవత్సర బహుమానసమయమునందు సద్వర్తనము నిమిత్తమయి యిచ్చిన పుస్తకములును పరీక్షయం దగ్రపదమును బడసినందున కిచ్చిన పుస్తకములును గలిపి నేను మోయలేనన్ని యాయెను. ప్రవేశపరీక్షతరగతిలోఁ జదువునప్పుడు నేను పాఠశాలలోఁ జీత మియ్యవలసినపని లేకపోయెను.

1867 వ సంవత్సరమునందు నే నయిదవతరగతిలో ననఁగా ప్రవేశపరీక్షతరగతియందు చదువుచుండినను నాకా సంవత్సరము

చదువు సాగనేలేదు. మాపెదతండ్రిగారు రోగపడి యేలూరునుండి యౌషధసేవనిమిత్తమయి రాజమహేంద్రవరమునకు వచ్చి కొన్ని మాసములు వ్యాధిబాధితులయియుండి లోకాంతరగతు లయిరి. ఆయన రోగపీడితులయి యున్నకాలములో మందులకొఱకును వైద్యులకొఱకును తిరుగుచుండుటచేతను, ఆయనవ్యాధివలన నాకుఁ గలిగిన మనోవ్యాధి చేతను, నేను పాఠశాలకు సరిగా పోవుచుంటయు పాఠములు చదువుటయు తటస్థింపలేదు. నాపితృవ్య మరణానంతరమున పాఠశాలను విడిచి పనిలోఁ బ్రవేశింపుమని మాబంధువు లనేకులు నన్ను ప్రేరేపించిరి; వారావిధముగా నాతల్లితోఁజెప్పి యామెచేతను నాకుఁ జెప్పించిరి. నాకు చదువు మానుటయం దెంతమాత్రము నిష్టము లేక పోయినను నాతల్లియొక్కయు బంధువులయొక్కయు ప్రేరణమువలన నాపూనికను విడిచి పనిలోఁ బ్రవేశించుట కొడఁబడి నాకు బహుమాన మిచ్చి నాయం దాదరము చూపుచుండిన మండలన్యాయాధిపతి యగు మారీసుదొరగారిని పనినిమిత్తమయిపోయి చూచితిని. నేను సామాన్య పరీక్షయందుఁ దేఱియున్నవాఁడ నగుటచేత రాజకీయోద్యోగమునకు యోగ్యుఁడ నయియే యుంటిని. ఆకాలమునం దాపరీక్షయందుఁ గృతార్థు లయినవారు దొరకుటయు దుర్లభముగానే యుండెను. మారీసుదొరగారు నాకు బహుమాన మిచ్చినప్పటినుండియు నప్పుడప్పుడు పోయి యాయనను జూచుచుండెడివాఁడను. ఆయనయు నా విద్యాక్షేమములనుగూర్చి యడిగి నన్నాదరించుచుండెడివాఁడు. మా పెదతండ్రిగారులోకాంతరగతులయిన తరువాత నేను పోయి దర్శనము చేసినప్పుడు దొరగా రాయనమృతికి విచారించి మంచిమాటలతో నన్నాదరించి, ఆయేర్పాటులో కడపటిదానిని నాకిచ్చెదనని వాగ్దానము చేసిరి. అప్పుడు మండలన్యాయసభలో సిరస్తాదారుగా నుండిన నెప్పల్లె లక్ష్మీనారాయణప్పగారు మాశాఖవాఁడును మాకుటుంబము

నకుపరమాప్తుఁడునయియుండెను. ఆయనయాపనితప్పక నాకేయిప్పిం
చెదనని చెప్పెను. ఇట్లుండఁగా రెండుమూఁడు దినములకాపని పరీక్షా
సిద్ధుఁడు కాని మఱియొకని కియ్యఁబడినట్లు నాకుఁ దెలిసినది. ఇది
యెట్లయ్యెనా యని విచారింపఁగాసిరస్తాదారుగారు నూఱు రూపాయలు
పారితోషికముగా స్వీకరించి యాపని యాతనికి వేయించినట్లు
తెలియవచ్చినది. రూపాయలగాలి సోఁకినప్పుడు వానిముందర బంధు
త్వమును మిత్రత్వమును సమస్తమును తృణకణములవలె నెగిరిపో
వలసినవే గదా! నేను మరలఁ బోయి దొరగారిని జూచినప్పుడు నీకింత
చిన్నతనములోఁ బని యేల యనియు, చదివి గొప్పపరీక్ష లిచ్చిన
తరువాతఁ జాలా గొప్పపని నిచ్చెద ననియు, చెప్పి నన్నుఁ బంపి
వేసిరి. ఆపనియే నా కప్పుడయియుండినయెడల నెలకు పదిరూపాయల
చొప్పున సద్యఃఫలము లభించియుండును. ఆపని నాకుఁ గాకుండుట
యీశ్వరుఁడు నామంచికొఱకే చేసెననవచ్చును. ఆపనిలో నే యుండుట
తటస్థించెనేని, శ్లేష్మములోఁబడిన యీఁగవలె రేయింబగళ్లు బండ
పనిలో మునిఁగి కొట్టుకొనుచు నిరంతర శరీరక్లేశపీడితుఁడనై పరోపకార
చింత లేక నే నెట్టిదురవస్థలో నుండియుందునో! ఈశ్వరుఁడు లోకములో
సర్వమును మనమేలుకొఱకే చేయును. అట్లాశాభంగము గలుగుట
కలుక పొడమినవాఁడనయి, ముందెప్పుడును న్యాయసభలో లేఖకో
ద్యోగమునందుఁ బ్రవేశింపకుందునట్లు శపథము చేసికొని, మరల పాఠ
శాలకుఁ బోవ నారంభించితిని. ఇది యిట్లుండగా నడుమ మఱియొక
విచిత్రకథ సంభవించి నావిద్యకు వేఱువిఘ్నము నాపాదించెను. అప్పు
డున్న ప్రధానోపాధ్యాయుఁడైన వైయాపురి మొదల్యారిగా రింగ్లీషు
భాషయందు విశేషసాహిత్యము లేనివారగుటచేత, పరీక్షకు నిర్ణీత
మైన యింగ్లీషుపద్యకావ్యమును చక్కఁగా బోధించుటకు సమర్థులు
కాక యుండిరి. అట్టియసమర్థుఁ డాయున్నతపదమునం దుండుట

క్రమము కాదని నాకు తోఁచెను. ఎక్కడ నేయక్రమము కనఁబడి
నను నాది సహించి యూరకుండెడి స్వభావము కాదు; ఆయక్ర
మమునకుఁ బ్రతిక్రియను జూచువఱకును నామనస్సున కూఱట
కలుగదు. అందుచేత విద్యార్థులలాభము నిమిత్త మాయన నక్కడ
నుండి పంపివేసి సమర్థుఁడైన మఱియొకరిని నాయనస్థానమునకు రప్పిం
చుట కర్తవ్యమని నాకు నిశ్చితాభిప్రాయము కలిగినది. నాసహపాఠు
లైన యితరబాలురతో నాలోచింపఁగా వారును నాయభిప్రాయ
ముతో నేకీభవించిరి. నాకొక యభిప్రాయము పుట్టుటకును దానిని
నెఱవేర్పఁ బూనుటకును నడుమ తడవు విశేషముగా నుండదు. అందు
చేత తోడనే విద్యావిచారణాధికారి గారికిఁ బంపు నిమిత్త మింగ్లీ
షున నొక సంఘ విజ్ఞాపనము వ్రాసి దానిపైని మాతరగతిలోనివారి
చేత వ్రాళ్ళుచేయించి, తక్కినతరగతిలోని బాలురచేత వ్రాళ్లుచేయిం
చుటకై నాబాల్యసఖుఁడును మాక్రింది తరగతిలో చదువుకొను
చున్నవాఁడును హిమవత్పర్వతముమీఁది తపశ్చరణమునకై వెడలిన
మువ్వురిలో నొకఁడునైన కనపర్తి లక్ష్మయ్యగారిచేతికిచ్చి యొక
భానువారమునాఁడా విజ్ఞాపనపత్రమును బంపితిని. ఈలోపల నేలాగు
ననో యీ విజ్ఞాపనపత్రవార్త మా ప్రధానోపాధ్యాయునికిఁ దెలిసి,
ఏదో మిషచేత దానిని తెచ్చి తనకిమ్మని మాతరగతిలోనే చదువుకొ
నుచుండిన మొండ్రేటి రామచంద్రుడను నాతనిని ప్రేరేఁచి యొడఁబఱి
చెను. అతఁడు తానందు వ్రాలుచేసి తెచ్చునట్లు నటించి, నామిత్రుని
చేతిలోనుండి విజ్ఞాపనపత్రమును గైకొని తనయింటిలోనికిఁ దీసికొని
పోయి,దొడ్డిదారిని తిన్నగా నడచి దానిని మాప్రధానోపాధ్యాయున
కిచ్చెను. ఇట్లు మోసపోయి నామిత్రుఁడు దీనవదనముతో మా
యింటికివచ్చి జరిగిన కథను నాకు దెలిపెను. నే నంతటితో నిరుత్సా
హుఁడనుగాక నామిత్రుని నేమియుననక, నాయొద్దనున్న మాతృకను

జూచి మఱియొక పత్రిని వ్రాసి సంతకములు చేయించి పంపవచ్చునని
చెప్పి యాతని నింటికిఁ బంపివేసితిని. ఆమఱునాఁడు యథా ప్రకార
ముగా పాఠశాలకుఁ బోయినప్పుడు మా ప్రధానోపాధ్యాయుఁడు చేత
బెత్తము పట్టుకొని నాల్గవ తరగతిలోనికిఁ బోయి నామిత్రుని గొడ్డును
బాఁదినట్లు బాఁదెను. అది చూచినప్పుడు నామనస్సునకు సహించరాని
నిర్వేదము కలిగెను. నా కెంతబాధ కలిగినను నే నోర్చుకొనియుండఁ
గలుగుదునుగాని యితరులకు నిష్కారణముగా బాధ కలిగినప్పుడు
సహించియుండఁజాలను. అందులోను నానిమిత్త మొరులకు బాధకలిగి
నప్పుడు నామనస్సెట్లు పరితపించునో వివరించుటకు భాష చాలదు.
స్వవిషయమున నేనెట్లు బాధ కోర్చుకొనఁగలుగుదునో తెలుపుటకై
నాచిన్ననాఁడు నడచిన యొకసంగతి నిచట సంక్షేపముగాఁ జెప్పెదను.

పది పండ్రెండేండ్లప్రాయమునం దొకప్రాతఃకాలమున మాదొడ్డి
లోని పాదున చిక్కుడుకాయలు కనఁబడఁగా వానిని గోయఁ జూచి
తిని గాని క్రిందినుండి నాకవి యందలేదు. కాఁబట్టి నేను కాయలకయి
పందిరిగుంజపయి కెక్కితిని. పాఁతదగుటచేత నడిమికి విఱిగిపోయి
యాగుంజ నేలవ్రాలఁగా దానితో పయినుండి నేనును నేలఁ
గూలితిని. అప్పుడా గుంజయొక్క విఱిగినవాఁడియయినభాగము నా
యఱకాలిలోఁ గ్రుచ్చుకొనిలోఁతుగాదిగి కాలినుండి నెత్తురుప్రవాహము
కట్ట నారంభించినది. నేను వెంటనే లేచి కూరుచుండి యేమనక యెవ్వ
రిని బిలువక ధైర్యమవలంబించి నాపైబట్టతీసి గట్టిగా కాలికి చుట్టఁ
బెట్టి, మెల్లగా మామేడమీఁదికిఁబోయితలుపులోపల వేసికొనికట్టువిప్పి,
గాయములో విఱిగియున్న కఱ్ఱముక్కలను దీసివేసి, మరల కట్టుకట్టు
కొని తలుపుతీసి యొక గదిలో మూలఁ బరుండితిని. నేను వేళకు భోజ
నమునకు రాకపోవుటచేత మావాండ్రు నన్ను వెదకి యెక్కడను

గానక కడపట మేడమీఁదికివచ్చి నేను కట్టు విప్పినచోటను కాఁటి యున్న రక్తమునుజూచి భయపడి, నన్ను పిలిచియు బదులుగానక నేనున్న గదిలోనికి వచ్చి యొకమూల సొదగిపడుండియున్న నన్నుఁ జూచి, కారణమును దెలిసి చికిత్సచేయించిరి. అప్పటి గాయపుమచ్చ యిప్పటికిని నా యెడమపాదమున నంగుళము వెడల్పునఁ గనఁబడు చున్నది.

ప్రధానోపాధ్యాయుఁ డట్లు నామిత్రుని గొట్టినప్పుడు దీనికిఁ బ్రతివిధాన మేమిచేయవలెనా యని యాలోచించుచు నేను పరధ్యానముతో నుండఁగా అతఁడు మాతరగతిలోనికి వచ్చి కోప మాపుకొనలేక నన్ను ''బుద్ధిహీనుఁడా'' యని తిట్టెను. ఆమాట యనఁగానే చివాలున లేచి నేను తరగతినివిడిచి యావలికిఁబోయితిని నా వెంబడినే నాతరగతిలోని బాలురందఱును తమ స్థలములు విడిచి వెలుపలికివచ్చి నాతోఁ గలిసి యుండఁబోయిరి. ఆ ప్రధానోపాధ్యాయుఁ డాదినము వఱకును నన్నెప్పుడును చిన్నమెత్తుమాట యనక యెంతో గౌరవముతోఁ జూచుచుండెడివాడు. తెలివిగలవాఁడనని మాత్రమేకాక శాంతచిత్తుఁడ ననియు వినయపరుఁడ ననియు సాధువర్తనుఁడ ననియు గూడ నాయం దాయనకు విశేషప్రేమము. ఆసంఘవిజ్ఞాపనములో నావ్రాలు మొట్టమొదటఁ జూచువఱకును తన ప్రియశిష్యుఁడనైన నే నింతపని చేయుదునని యాతఁడు స్వప్నావస్థయందును దలఁచియుండె లేదు. నేను సాధారణముగా శాంతస్వభావము గలవాఁడనే యయినను, న్యాయవిషయమున నాగ్రహకారణము కలిగినప్పుడు నాయుద్రేకమునకును పట్టుదలకును పరిమితియుండదు. అప్పుడు నేను గురువనియు బంధువనియు స్నేహితుఁడనియు బలయుతుఁడనియుఁ జూడక పూనిన కార్యమునందు దీక్షవహించి కడవఱకును పనిచేయుదును. సంతకము లయిన విజ్ఞాపనపత్రము పోవుట, మిత్రునకు దండనము కలు

గుట, నాకు నాతరగతిలోని వారి ముందఱ నవమానము కలుగుట మొదలైన విఘ్నము లనేకములు ప్రథమప్రయత్నములోనే కలిగినను నేను లేశమాత్రమును జంకక, ఆప్రధానోపాధ్యాయుని నక్కడనుండి పంపివేయువఱకును నిశ్శంకముగా పనిచేయవలయు నని నిశ్చయించుకొంటిని. నామాటలను వినినప్పుడు నాసహపాఠకులను సఖులకును గూడ వీరావేశము కలుగుచుండెను. ఈవిషయమున మాపాఠశాలలోని సహోపాధ్యాయులు కూడ, కొందఱు మమ్ము ప్రోత్సాహపఱిచిరి. మేము కట్టుకట్టి మఱునాటినుండి పాఠశాల కుం బోవ మానితిమి. మఱుసటినాఁడు ప్రధానోపాధ్యాయుఁడు పాఠ శాలకుఁ బోవునప్పటికి వట్టిబల్లలే కాని పిల్లలు లేకుండిరి. అతఁ డది చూచి లోపలభయ పడినను పయికి లేనిగాంభీర్యము పూని వెంటనే పాఠశాలకు రానియెడల పేరు తీసివేసెదననియు, రెండు దినము లలోపల రానివారి నందఱిని కొట్టెదననియు, మొదట బెదరించి చూచెను; తరువాత మంచిమాటలాడుచు తోడనే వచ్చినవారిని క్షమించి బహుమానము లిచ్చెదనని వర్తమానము పంపెను; అటు పిమ్మట బాలురను వేడుకొనియు వారిని మందలించి పంపుఁడని సంర క్షకులకు వ్రాసియు మరల బాలురను పాఠశాలకు రప్పించుటకయి బహుప్రయత్నములు చేసెను. ఎంత చేసినను చేసినప్రయత్నము లన్నియు భగ్నములయి భస్మములోని యాహుతులయ్యెను. అంతట నతఁడు విఫలమనోరథుఁడయి తొందరపడి చేసినపనికి సావకాశముగా పరితాపపడుచుండెను. మేము మఱునాఁడే సంఘవిజ్ఞాపనపత్రములను మరల సిద్ధముచేసి వానిమీఁద ప్రధానోపాధ్యాయునకును సంరక్షకు లకును భయపడి కొందఱు వ్రాళ్ళుచేయకపోయినను, అధికసంఖ్యాకుల చేత వ్రాళ్ళు చేయించి యొకప్రతిని విద్యావిచారణకర్తకు చెన్నపురి కిని, ఇంకొకప్రతిని పాఠశాలాపరీక్షకును విశాఖపట్టణమునకును, బంపి

తిమి. అంతేకాక యాదినముననే విద్యావిచారణకర్తయగు కర్నల్ మగ్డానల్డుదొరగారికిని, పాఠశాలాపరీక్షకులగు గ్రిగ్గుదొరగారికిని, తంత్రీవార్తలనుగూడఁ బంపితిమి. వెంటనే రాజమహేంద్రవరమునకుఁ బోయి విచారణచేయవలసినదని విద్యావిచారణకర్తగారు పాఠశాలాపరీక్షకునకు వ్రాసి, మా విజ్ఞాపనపత్రమును వారికిఁ బంపిరి. గ్రిగ్గుదొరగారు కొన్నిదినములలో రాజమహేంద్రవరమునకు వచ్చి మమ్మందఱిని పిలిపించి విచారణ చేసి. వైయాపురి మొదల్యారి గారిని వేఱొకచోటికిఁ బంపి వేయవలసినదని పయికి వ్రాసిరి. అందుచేతవిద్యావిచారణాధికారిగారు వైయాపురి మొదల్యారిగారిని నరసాపురమునకుఁ బంపి, అక్కడనుండి చెంగల్వ కుప్పుస్వామి శాస్త్రులవారిని రాజమహేంద్రవర మండల పాఠశాలకు ప్రధానోపాధ్యాయునిగాఁ బంపిరి. అటుతరువాత మే మందఱమును మరల పాఠశాలకుఁ బోయి చేరితిమి. మొదటి విజ్ఞాపనపత్రము నెత్తుకొనిపోయి ప్రధానోపాధ్యాయునకిచ్చిన విద్యార్థి యితర విద్యార్థులధాటికి తాళలేక రాజమహేంద్రవరములో నుండి చదువుట యసాధ్యమయినందున మా పాఠశాలనువిడిచి విశాఖపట్టణమునకుఁ బోయి యచ్చటి ప్రభుత్వమువారి బోధనాభ్యసన పాఠశాలలోఁ జేరెను.

1868 వ సంవత్సరములో నేనుమరలఁ బాఠశాలలోఁ జేరినను, నా కాసంవత్సరమునను చదువు జరగలేదు. మా పెదతండ్రిగారి మరణానంతరమున చరరూపమైన సొత్తంతయుపట్టుకొని యాయనభార్య తన పుట్టినింటికిఁ బోయెను. అప్పుడామెకు సంతానము లేదు. మరణకాలమునకు మా పెదతండ్రిగారికి ఋణము లేమియు లేకపోవుటయే కాక కొంత రొక్కముకూడ నుండెను. మా పెదతండ్రిగారి వంతునకు వచ్చినగృహభాగము మిక్కిలి విశాలమయి పట్టణమధ్యమునం దుండెను. అందుచేత నెట్లయిన నపహరింపవలెనని ప్రముఖు లనేకులు

దానిమీఁద కన్ను వేసియుండిరి. ఆయిల్లు మాపెత్తల్లియనంతరమున నాకు రావలసినదిగా నుండెను. ఆయింటి నపహరింపవలెనని కన్ను వేసియున్నవారిలో నొకరిద్దఱది విక్రయింపుమని నాపెదతల్లిని ప్రోత్సాహపఱచిరి. ఆమె దానిని విక్రయించి చేసిన రొక్కమును దీసికొనిపోవలెనని ప్రయత్నించెనుగాని వితంతువిక్రయమగుటచేతను, దానికనంతరకర్తనైన నేను జీవించియుండుటచేతను, క్రయము చెల్లనేరదని శంకించి యెవ్వరును తగినవెల యిచ్చి కొనసాహసింపకుండిరి. అందుచేత నామె యెంతతక్కువ మొత్తమునకైనను విక్రయించి రొక్కము చేసికోవలెనని చూచుచుండఁగా, పాపభీతిలేని యొకగొప్ప గృహస్థుఁ డా యిల్లామెవద్ద నతిహీనక్రయమునకు వ్రాయించుకొని, ఆయల్పధనమునైన నప్పుడామె కియ్యక భర్తయొక్క యుత్తరక్రియలనిమిత్తము ఋణములు చేసినట్లుగా నెవ్వరికిని దెలియకుండ నిష్టులైనవారిపేర దొంగపత్రములు వ్రాయించి, వారిచేత నామె పుట్టినింటివారి గ్రామమునకు చేరువనుండిన న్యాయస్థానములో వ్యాజ్యములు వేయించి తీర్పులను బడసెను. ఈసంగతినాతల్లికిఁ దెలిసి నన్నుఁదీసికొని వృద్ధుఁడును బంధుఁడునైన యొకన్యాయవాదకడకుఁ బోయి, తదనంతరస్వామ్యనిమిత్తము వ్యాజ్యము తెచ్చి గృహవిక్రయము నాపింపవలసినదని యాయనను వేఁడెను. మాగృహరహస్యములను బూర్ణముగాఁ దెలిసినవాఁడైన యాన్యాయవాది కొంచెముసేపాలోచించి, మావఱకు జరిగినవిభాగము క్రమమయినదికాదనియు, విభాగపత్రము పుట్టకపోవుటచేత నది చెల్లఁదగినదిగాక ధర్మశాస్త్రప్రకారము జరగనట్లే భావింపఁబడవలసినదనియు, ఏమేమో హేతువులు చెప్పి యభియోగపత్రమును వ్రాసి దానిపైని నాచేత వ్రాలు చేయించి, అనుగతన్యాయసభలో వ్యాజ్యము వేసెను. అప్పుడు నాకు వ్యవహారమేమో ధర్మశాస్త్రమేమో తెలియనే తెలియదు. మా

యింటికీర్పంతయు నాతల్లియే చక్కఁబెట్టుచుండెను. న్యాయాధిపతి విచారణచేసి యీవఱకు జరిగినది క్రమమయిన విభాగమే యనియు, అభియోగము తేవలసినక్రమమది కాదనియు, ప్రతివాది యనంతరమున గృహస్వామ్యమునిమిత్తము వ్యాజ్యము తెచ్చుకోవలసినదనియు, అక్రమముగా నామె తనపైని చేయించుకొన్న తీర్పులను రద్దు పఱుచుటకయి వేఱుగ వ్యాజ్యములు తెచ్చుకోవలసినదనియు, వ్రాసి యీ వ్యాజ్యమును కొట్టివేసెను. అంతటితోనైన నూరకుండక యీన్యాయవాదియే మండలన్యాయసభలో దానిపై నుపర్యభియోగము చేయించెను. మండలన్యాయాధిపతి దానిని సహితము కొట్టివేసి రెండు న్యాయసభలలోను ప్రతివాదికైన కర్చు లిచ్చుకోవలసినదని తీర్పు చెప్పెను. ప్రతివాది కిచ్చుకోవలసిన కర్చులక్రిందను న్యాయవాది కిచ్చినవియు ముద్రకాగితముల కైనవియు నైన వ్యయములక్రిందను నాభార్యకుండిన నాలుగైదువందల రూపాయల నగలను విక్రయింపవలసి వచ్చినది. తదనంతరకర్తృత్వమునిమిత్తమును, అన్యాయముగా పొందిన తీర్పులను రద్దుపఱుచుకొను. నిమిత్తమును, వ్యాజ్యములు తెమ్మని న్యాయవాదులుమాత్రమే కాక యితరులును నన్ను ప్రేరణ చేసిరి. అప్పటికి నేను స్వతంత్రుఁడనయి సంపాదింప నారంభించి యుండుటచేతను, వ్యవహారములకెక్కి వ్యర్థముగా ధనవ్యయము చేయుట నా కిష్టము లేకపోవుటచేతను, నాపక్షమే తీర్పువుట్టినను నాజీవితకాలములో నాకాస్తివచ్చుట సందేహమగుటచేతను, నేను మరల వ్యాజ్యములలో దిగలేదు. స్థిరద్రవ్యము విషయమయి యక్రమముగా పొందిన తీర్పులను రద్దుచేసికొనుట కప్పటి న్యాయశాసనమునుబట్టి పండ్రెండేండ్లు గడువుండినందున, ఈలోపల నే నెప్పుడు వ్యాజ్యము తెత్తునోయను భీతిచేత నిల్లుతనపేర వ్రాయించుకొన్నతఁడు దానిలోఁ జేరినస్థలములో నిండ్లు కట్టింపకయే మృతుఁడయ్యెను.

పంద్రెండేండ్లు గడచినతరువాత నాతనిభార్య యుండులో గృహములు కట్టించి యిప్పుడద్దెల కిచ్చినది. నాపెదతండ్రిగారిభార్య యిప్పటికిని సజీవురాలయి నాకంటె నెక్కువదార్ఢ్యము కలదయి యున్నది.

ఈకాలమునకే నేను తెలుఁగున కవిత్వము చెప్పుట కారంభించితిని. మతమునకు నీతిప్రధానమనియు, నీతిమాలినవాఁడు నిజమైన భగవద్భక్తుఁడు కాఁజాలఁడనియు, చిత్తశుద్ధిగలిగి యీశ్వరానుగ్రహమును బడయుటకు నీతిపరుఁడై యుండుట యావశ్యకమనియు, నేను మొదటినుండియు నమ్మియుండినవాఁడనైనను, నే నేకేశ్వరోపాసకుఁడను గాక యప్పటివఱకు విగ్రహారాధకుఁడనై యే యుంటిని. అప్పుడు నా కుపవాసములును వ్రతములును భగవత్ప్రీతికరములని యే నమ్మకముండెను. ప్రత్యేకాదశినాఁడును గోపాలస్వామి యాలయములోని భజనకుఁ బోయి రాత్రులు ప్రొద్దుపోయినదాఁక మేలుకొనియుండి యింటికి వచ్చుచుండెడివాఁడను; శివరాత్రినాఁడు ప్రాతఃకాలమున కోటిలింగక్షేత్రమునకుఁ బోయి స్నానముచేసివచ్చి నిరాహారుఁడనై ప్రదోషసమయము మొదలుకొని రాత్రి యెంతో ప్రొద్దుపోయినదాఁక మార్కండేయస్వామి యాలయములో కాలక్షేపముచేసివచ్చెడివాఁడను; ఒక శివరాత్రినాఁడు జాగారము సహితము చేసితిని. కవిత్వము చెప్పుట కారంభింపఁగానే మొట్టమొదట గోపాలస్వామిమీఁద నొకటియు, మార్కండేయస్వామిమీఁద నొకటియు, రెండు కంద పద్యశతకములను జెప్పితిని. ఆరెండు శతకములును చిరకాలము క్రిందటనే యెట్లో నశించినవి. అవి యిప్పుడున్నను ప్రశస్తముగా నుండి యుండవు గాని చిన్నప్పటికవిత్వ మెట్లుండెనో తెలిసికొనుటకుమాత్ర మాధారములై యుండును. వీనిలో మొదటిదిమార్కండేయశతకము; దానిలోఁ బ్రతిపద్యాంతమునందును 'మార్కండేయా' యని యుండును. రెండవది గోపాలశతకము; దానిలోఁ బ్రతిపద్యాంతపాదమును

'శ్రీ రాజమహేంద్రవరపురీ గోపాలా' యని యుండును. ఈకడపటి శత
కములోని యీక్రిందిపద్య మొకటిమాత్ర మభాగ్యోపాఖ్యానములో
మొదట వేయుటచేత నిప్పటికి నిలిచియున్నది.—

క. శ్రీరమణీహృల్లోలా, కారుణ్యలతాలవాల కాంచనచేలా
ఘోరాహవజయశీలా, శ్రీరాజమహేంద్రవరపురీ గోపాలా.

ఈశతకములు బాగుగ లేవనియు, ఛందోవ్యాకరణదోష భూయిష్ఠము
లనియు, నే నుపేక్షించి యొకమూలఁ బాఱవేయుటచేత నే నశించి
పోయినవి. నే నప్పుడు శైవవైష్ణవ మతములలో దేనియందును విశేష
పక్షపాతము లేనివాఁడనై, శివకేశవులు సమానులన్న విశ్వాసముతో
నుభయుల నారాధించుచు, వేదాంతమునం దెక్కువ యభిరుచిగల
వాఁడనై యుండెడివాఁడను. మంత్రప్రభావమునందును బరమవిశ్వా
సముగలవాఁడనై వేలకొలఁది గాయత్రీజపము చేయుచు నుండుటయే
కాక యాంజనేయమంత్రమును రామమంత్రమును ఉపదేశమునొంది
బహువారములు పురశ్చరణముచేసితిని. మంత్రమహిమవలన దయ్య
ములు వదలిపోవునని నమ్మి వానిని బ్రత్యక్షముగాఁ జూడవలెనన్న
యభిలాషముతో దయ్యములు పట్టినవన్న వారియిండ్లకెల్లను బోవుచు
భూతవైద్యులు చేయు మంత్రతంత్రములనెల్లఁ జూచుచు మంత్ర
వేత్తల నాశ్రయించుచుండెడివాఁడను. భూతవైద్యులనేందఱినో యను
సరించి యొకభూతమునైనను జూపుఁడని యెన్నివిధముల వేఁడినను
నా కొక్కరును జూపినవారుకారు. ఒక భూతవైద్యుఁడు మాత్రము
నాకు దయ్యమును జూపెదనని చెప్పి, ఒకనాటిరాత్రి నన్ను దూర
ముగా నూరికవలుపలి కొకమఱ్ఱిచెట్టువద్దకుఁ గొనిపోయి, చూపక
'చూపినచో నీవు జడిసికొందువు' అని చెప్పి తప్పించుకొనఁజూచెను.
నే నెంతమాత్రము జంకక 'నేను జడిసికోను. నాయం దనుగ్రహించి

తప్పక చూపుము' అని వేఁడి ధైర్యముతో నిలువఁబడితిని. అంతట నతఁడు 'నీవు భయపడకపోయినను ప్రభుత్వమువారివలన నాకు చిక్కువచ్చును. నేను చూపను' అని చెప్పి నాకాశాభంగముకలిగించి వెడలిపోయెను. దయ్యములు శ్మశానవాటికలయం దర్ధరాత్రసమయమునసంచారముచేయుచుండునని యెల్లవారును జెప్పుచుండుటచేతవానిని జూడవలెనన్న యుత్కంఠతో ననేకపర్యాయములు నిశాసమయమున పడకనుండి లేచి యెవ్వరితోను జెప్పక మాపట్టణములో 'నల్లరాళ్ళ' సమీపముననున్న శ్మశానభూమి కొంటిగాఁ బోయితిని. పాము కఱచునో, తేలుకుట్టునో, దొంగలుకొట్టుదురో అను భయము తక్క పిశాచభయ మొంతమాత్రమును లేక విఫలమనోరథుఁడనై తిరిగి వచ్చుచుండెడివాఁడను. ఈ సంగతి యితరులతోఁ జెప్పఁగా వారు పిశాచగణములలోఁ బుట్టినవారికిఁగాని దయ్యములు కనఁబడవని నాకు సమాధానము చెప్పెడివారు. ఇప్పటివలెఁ గాక నాచిన్నతనమునందు దయ్యములయందలి విశ్వాస మెల్లవారికి నత్యధికముగా నుండెను. అప్పుడు దయ్యములేనియిల్లు లేనేలేదని చెప్పవచ్చును. ఎవ్వరు క్రొత్తగావచ్చినను వారు దయ్యములయి తిరుగుచుండిరని యెల్లవారును జెప్పుకొనుచుండిరి. దయ్యములనుపాఱఁద్రోలు మంత్రగాండ్ర సంఖ్యయు నిప్పటికంటె నప్పుడు శతగుణాధికముగా నుండెను. ఏదియైన వింతసంగతిని విన్నచో శోధించి దానినిజమును గనుఁగొనవలెననియు, విన్నదానినెల్ల విశ్వసింపఁగూడదనియు, విశ్వసించినదానిని ననుసరించి ప్రవర్తింపవలెననియు, నాకు మొదటినుండియు నైసర్గికాభిరతియై యుండెనుగాని యాలోచన లేక యొరులు చెప్పినట్లెల్లను నడుచుస్వభావ మెప్పుడునులేదు. అందుచేత నేను గొన్నిసమయములయం దహంభావమును స్వచ్ఛందచారిత్వమును గలవాఁడనయి యితరుల యభిప్రాయములయందు గౌరవముంచకుండెడివాఁడను. నాశా

కాలమునందు విద్యార్థులుమాత్రమేకాక కొందఱుపాధ్యాయులును మిత్రులుగానుండిరి. ఒకనాఁడు సాయంకాలము నేనును నామిత్రులగు కొంద ఱుపాధ్యాయులును, విద్యార్థులును గలిసి యూరిబైటికి సంచారార్థము పోయితిమి. అట్లు క్రోశదూరము పోయి సూర్యాస్తమయ సమయమున వెనుక మరలి మేము నడచెడురథ్య రెండుశాఖ లయిన చోటికి వచ్చి నిలిచితిమి. అందొకదారి అంగళ్ళవాడనుండి పట్టణమునకుఁ బోవును; ఇంకొకదారి గోదావరియొడ్డునుండి పట్టణమునకుఁ బోవును. ఇందేదారిని బోవుదమని మాలో మాకు ప్రశ్నవచ్చినది. నే నొక్కఁడను నదీతీరవీధినుండి పోవుదమంటిని; తక్కినవా రందఱును విపణివీధినుండి పోవుదమనిరి. అప్పుడు నాతోడివారు విపణిమార్గమునుబట్టి, నేను వెంటవత్తునేమోయని తిరిగి తిరిగి చూచుచు మెల్లఁగా నడవసాగిరి; నేను వారిమార్గము ననుసరింపక తిన్నఁగా గోదావరియొడ్డునుండి పోయి యిల్లుచేరితిని. వాడుకప్రకారము మఱునాఁడును మే మావైపునకే సంచారార్థము పోయి మరలివచ్చునప్పు డేశాఖామార్గమున పట్టణమునకుఁ బోవలెనని మే మాస్థలముననే మగుడ శంకించుకొంటిమి. గతదినమునందువలెనే నాఁడును మాకభిప్రాయభేదము కలుగఁగా నేనొక్కఁడను గోదావరి దారిని నడవఁదొడఁగితిని. నామిత్రు లంతట తమపట్టు విడిచి నాకు లోఁబడినవారయి, నే నితరులు చెప్పినట్టు విననివాఁడనని పలుకుచు నామార్గము ననుసరించిరి. ఇట్టి పట్టుదలను ధర్మాచరణముతో సంబంధించిన ముఖ్యాంశములలోఁ జూపుట యావశ్యకమును కర్తవ్యమునైనను, ధర్మభంగములేని యిటువంటి అల్పాంశములలోఁ జూపుట యనాదరణీయమును మూర్ఖత్వమును నగును. నీతికిని సత్యమునకును ధర్మమునకును భంగము కలుగని విషయములలో నెల్లను బహుజనవాక్యమును మాననీయముగా భావించి తదనుసారముగా పెద్దలకు లోఁబడి

నడచుట కర్తవ్యమని తెలుపుటకే దీని నిందుఁ జెప్పితిని గాని నేను జేసినపని మంచిదని చెప్పుటకయి కాదు. దీనివలన సాధారణముగా బాల్యమునుండియు నాది పట్టినపట్టు విడుచు స్వభావము కాదని తేటపడును. ఈ కాలమునందే నాకు నాపూర్వవిశ్వాసములు కొన్ని మాఱుట కారంభించుటయు సంభవించెను. నామిత్రులగు చల్లపల్లి రంగయ్య పంతులవారియొద్దనుండియో మఱియొకరియొద్దనుండియో కేశవచంద్రసేనులవారి యుపన్యాసములు కొన్ని పుచ్చుకొని చదివితిని. ఆయుపన్యాసములు చదువుటవలన నేనావఱకు సత్యములని నమ్మియుండిన కొన్నివిషయములను గూర్చి సందేహము కలిగెను. ఆ సమయమునందాత్మూరి లక్ష్మీనరసింహముగారు బందరునుండి మామండల పాఠశాలకు ద్వితీయోపాధ్యాయులుగా వచ్చిరి. వారు బ్రహ్మసమాజమతమునం దప్పుడభినివేశము గలవారు. అందుచేత వారామతసిద్ధాంతములను విద్యార్థుల కప్పుడప్పుడు బోధించుచుండెడివారు. ఆయన ప్రోత్సాహమువలన మాలో మేముపయుక్తములయిన విషయములనుగూర్చి వారమున కొకసారి కూడి చర్చించుటకయి విద్యార్థులలో నొక సమాజము నేర్పఱచుకొంటిమి. నేనుగాక నామిత్రులగు కనపర్తి లక్ష్మయ్యగారును మఱియిద్దరు ముగ్గురును మాత్ర మాసమాజమునకు వచ్చుచుండిరి. మేమయిదాఱుగురమును లక్ష్మీనరసింహముగారి యింటివద్దఁగాని మాయింటివద్దఁగాని సమావేశమగుచుంటిమి. ఆ కాలమునందు నలుగురొకచోటఁ గూడి సభ చేయుటయే గొప్పతప్పిదముగా నుండెను. మేము వీధిలోనుండి పోవునప్పుడు మమ్ము వ్రేలితోఁ జూపి 'మీటింగువాళ్లు వీళ్ళేసుమీ' యని బాలురు తమలోఁ దాము చెప్పుకొనుచు వచ్చిరి. అందుచేత మేము మా లోపలతలుపులు వేసికొని కూరుచుండియే సభ చేసికొనెడివారము. ఆయేఁడును సంవత్సరాంత పరీక్షలో నాకు పుస్తకబహు

మానము వచ్చెను. నేనాసంవత్సరము సర్వకళాశాలా ప్రవేశపరీక్షకుఁ బోయితినిగాని కృతార్థుఁడను గాలేదు.

1839 వ సంవత్సరమునందు నన్ను మరల రోగమాశ్రయింప దగ్గును దౌర్బల్యమును హెచ్చయ్యెను. అందుచేత నేను చదువుటకుఁ గాని పని చేయుటకుఁగాని యశక్తుఁడ నయియుంటిని. నేనప్పుడు మంచ మెక్కలేదు కాని కొన్నిదినములలో రోగపీడితుఁడనయి యింటనే యుండుచు దేహము కొంచెము స్వస్థపడినప్పుడు పద్యములు చెప్పుచు నుంటిని. చిన్నప్పటినుండియు నాయందు చెప్పుచును శక్త్యాశక్తివిచారము లేక యున్నతపదమునకయి పాటుపడుచుండెడివి. పురాణములను జదువు నప్పుడం దభివర్ణింపఁబడిన మహర్షులవలె ఘోరతపస్సుచేసి తపోమహిమను బడయవలెనని వాంఛించుచుంటిని. కావ్యములను జదువునప్పుడు మహాకవినయి యుత్తమకావ్యములను రచింపవలెనని కోరుచుంటిని. ఐనను నామనస్సెప్పుడును ద్రవ్యార్థకారముల నిమిత్త మెప్పుడును బ్రాకులాడుచుండెడిది కాదు. అచ్చతెనుఁగు కావ్యముల నొకరిద్దరే రచించిరని యెఱిఁగి యుంటిని; నిరోష్ఠ్యకావ్యము నొక్కకవియే రచియించెనని వినియుంటిని; నిర్వచన కావ్యము నొక్కకవియే రచియించియుండెనని తెలిసికొనియుంటిని. అందుచేత సామాన్యకవులు పోయిన మార్గమునఁ బోవక యీమూఁడు లక్షణములు నొక్కకావ్యమునందే కూర్చి యసాధ్యమైన క్రొత్తత్రోవను త్రొక్కవలెనని నాకప్పుడు సంకల్పము జనియించెను. సాధారణముగా నాకు సంకల్ప ముదయించుటకును తదనుసారముగ కార్యారంభమున కుద్యమించుటకును చిరకాల మంతర ముండదు. ఇట్లు సంకల్పోదయము కాఁగా నేలోకానుభవశూన్యుఁడను పాండిత్యవిరహితుఁడను నగు నేనెక్కడ లోకానుభవశాలులైనవిద్వాంసులకును దుస్సాధమగు మహాకావ్యరచన యెక్కడని శంకింపక, బాల్యచాపలముచే సాహసము చేసి 'శుద్ధాంధ్రనిరోష్ఠ్య నిర్వచన

నైషధ' మను పేర నలచరిత్రమును జేయఁబూనితిని. ఇది ప్రౌఢ కావ్యము కాకపోయినను నాపూనినప్రతిజ్ఞ నెట్లో నిర్వహించి కృతకృత్యుఁడను కాఁగలిగితిని. ఈకాలమునందే 'రసికజనమనోరంజన' మను పేర నొక మిశ్రప్రబంధమును గూడఁ జేయనారంభించితిని.

ఆకాలమున చిత్రపు కామరాజుగారు మండలన్యాయసభలో దొరతనమువారి న్యాయవాదిగా నుండిరి. ఇతరవిషయములందు సమర్థులైనను, ఆయన యింగ్లీషు రానివారగుటచేత మండలకరగ్రాహితోను తదితరహూణాధికారులతోను నింగ్లీషున నుత్తర ప్రత్యుత్తరములను జరుపుటకు సమర్థుఁడైన యొకలేఖకుఁ డాయనకుఁ గావలసి యుండెను. నెల కిరువదిరూపాయల జీత మిచ్చెదననియు, ప్రాతఃకాలమున మాత్రము మూడుగంటలసేపు తనయింటివద్ద పనిచేయవలసినదనియు, ఆయన నన్ను గోరెను. నేనంగీకరించి యాపనిలోఁ బ్రవేశించితిని. ఆయన వేశ్యల నుంచుకొనుట గౌరవావహమని భావించెడు పూర్వ నాగరికకోటిలోనివాఁడు; నేను క్రొత్తక్రొత్తగా మాఱుచు వేశ్యావిషయమున భిన్నాభిప్రాయము చెందిన నవనాగరిక బృందములోనివాఁడను. అదిగాక ఛాందసుఁడనుగానున్న కాలములో సహితము దుర్నీతిపయి నాకు సహజద్వేషము; అప్పుడు సహితము దుర్నీతిపరులను చూచినప్పుడు నాతల కంటగించుచుండెను. నే నాయనయింటివద్ద పని చూచుచున్నకాలములో సహితము కొన్నిసమయములయం దాయన యుంచుకొన్న వేశ్య నిశ్శంకముగా వచ్చి వరసను గూర్చుండి యాయనతో సరససల్లాపములాడుచువచ్చెను. అది సరిపడక నామనస్సున్నను బాధించుచు వచ్చెను. అందుచేత మొదటి నెల జీతము పుచ్చుకోఁగానే నే నాపని మానివేసితిని. వేశ్యాసంగమదోషము మాట యెట్లున్నను, కామరాజుగారు నావిషయమున సర్వవిధముల దయతోను గౌరవముతోను మెలఁగుచు వచ్చిరనియు నాకెప్పుడును కోపకార

ణము నణుమాత్రమును గలిగింపలేదనియు నే సిచ్చటఁ జెప్పవలసి యున్నది. అటుతరువాత రాజమహేంద్రవరమండల పాఠశాలకు ప్రధానోపాధ్యాయులైన బారోదొరగారివద్దను, కారాగృహములపై నధికారియైన కెప్టెన్ హాల్లెట్టు దొరగారివద్దను, తెలుఁగుచెప్పుటకయి పని కుదిరితిని. వారిరువురివలనను నాకు నెలకు ముప్పదియైదు రూపాయలు వచ్చెడివి. 1869-వ సంవత్సరమున నేనుపరీక్షకుపోలేదు. 1870-వ సంవత్సరమునందు బారోదొరవారు ప్రకటించుచుండిన 'గోదావరీ విద్యాప్రబోధిని' (Godavry Educationist)అను మాసపత్రికకు నేను తెనుఁగున వ్రాయుచుంటిని. నాశుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధ మాపత్రికయందే మొదట కొంచెముభాగము ప్రకటింపఁబడినది. నేను పాఠశాలలో చదువకయే 1870-వ సంవత్సరమున సర్వకళాశాలా ప్రవేశపరీక్షకుఁ బోయి కృతార్థుఁడ నయితిని.

ఈప్రకరణమును ముగింపకముందు దీనిం జదివెడు యువజనులకు మిత్రసంగ్రహమునుగూర్చి కొంచెము హెచ్చరిక చేయవలసి యున్నది. పదునాలుసంవత్సరములు మొదలుకొని యిరువదిసంవత్సరములవఱకును మనకు సుగుణములుగాని దుర్గుణములుగాని పట్టుపడ నారంభించి తరువాత నవి స్థిరపడిపోవును. స్థిరపడినతరువాత వానిని మార్చుకొనుట బహుతరప్రయాససాధ్యముగాని సుసాధము కాదు. సామాన్యముగా సుగుణదుర్గుణములు మన సహవాసములైన మిత్రులనుబట్టి యులవడును. కాఁబట్టి యీకాలమునందు మిగుల జాగరూకులమయి శక్యమయినంతవఱకుసన్మిత్రసంపాదనమునకయిప్రయత్నింపవలయును. ఈవిషయమయి స్వానుభవము నొక్కింత చెప్పెదను. మా బంధువులే యొకరు మాయింట కాపుర ముండెడివారు. ఆ కుటుంబయజమానున కించుమించుగా నాయీడే గల యొకకుమారుఁడుండెను. ఇరువురమును పదునెనిమిదేండ్ల ప్రాయముగలవార మగుట

చేతను, ఏకగృహమున నేసర్వదా యుండెడివారమగుటచేతను, బంధుత్వసంబంధము గలవార మగుటచేతను మే మొండొరులతో మైత్రి గలవారమయి యుంటిమి. వినోదమునకయి యప్పుడప్పుడు మే మిరువురమును చీట్లాడుచుండెడివారము. శైశవమునుండియు నేను దుర్బలశరీరుఁడ నగుటచేత దేహాయాసకరములయిన యాటలపొంతఁ బోవక, చీట్లు, దశావతారి, చదరంగము, మొదలయిన కాయకష్టమక్కఱలేని యాటలతో విరామముగల యప్పుడు ప్రొద్దుపుచ్చుచుండెడివాఁడను. ఆయాటలయం దప్పుడు నేను గొంత నేర్పరి నయియు నుంటిని. నా మిత్రుడును నేనును మొట్టమొదట పందెము లేకయే చీట్లాడుచుండినను, తరువాత ప్రప్రథమమున చింతగింజలును తదనంతరమున గవ్వలును బెట్టి యాడఁ జొచ్చితిమి. అప్పుడు పదునాలుగవ్వలవెల యొకదమ్మిడీకి సమానముగా నుండెను; గవ్వలిచ్చి యప్పు డంగడిలో నేవస్తువునైనను గొనవచ్చును. ఏదుర్వ్యాపారమైన నారంభము కాకయే యుండవలెనుగాని కొంచె మారంభమైనతరువాత ముందుకు సాగక యారంభించినచోటనే నిలువదు నామిత్రుని ప్రోత్సాహముచేత గవ్వలు దమ్మిడీలయినవి, దమ్మిడీలు డబ్బులయినవి. నేను సాధారణముగా నోడిపోయెడివాఁడను గాకపోయినను, వేడుకకొఱకే యారంభమయిన మాచీట్లాట కడపట జూదముక్రింద పరిణమించినది. ఈయాటల వలన నేను రెండుమూడురూపాయలను గెలిచితిని. ఈ యాటకయి యతఁ డొకసారి నన్ను మాయింటినుండి తనమిత్రుని యింటికిఁ గొనిపోయెను. ఆతనిమిత్రు లాతనివలెనే విద్యాగంధములేని దుర్వ్యాపారులు. ఈపోమరిబృందముతోఁ గలిసి నేను పెక్కుమాఱులు డబ్బుపెట్టి జూద మాడితిని. నామిత్రుఁడును, మిత్రుని మిత్రులును గలిసి చీట్లాటకు మంచిస్థలము చూపెదము రమ్మని యొకభోగముదాని యింటికి నన్నుఁ దీసికొనిపోయిరి. ఆదినమున నొకముసలిజూదరిమాత్రమే

మాతో చీట్లాడెనుగాని మఱునటిదినమునందు వాఁడు తనకూఁతు రయిన పడపుపడఁతినిగూడఁ గొనివచ్చి యాటకుఁ గూర్చుండఁబెట్టెను. ఇంకను గొంతకాల మీదారినే యనుసరించి యుండినయెడల నేను నీతిమాలిన నిర్భాగ్యుఁడనయి చెడియుందునుగానియీశ్వరానుగ్రహము వలన నింతలోఁ దెలివి తెచ్చుకొని, కడచినదాని కనుతాపపడివెంటనే నాదుర్వ్యాపారమునుండి మరలుకొని నామిత్రునితోడి సాంగత్య మావశ్యకమని ఫలితార్థము తేలుచున్నది. స్వభావముచేత నెంత మంచివాఁడయినను దుర్జనసాంగత్యములోఁ బడిపోయి దుర్వ్యసనము లలోఁ దగులుకొన్నపక్షమునఁ దనవివేకమును గోలుపోయి తాను పూనిన వ్యాపారమే మంచిదనుకొనునంతటి దుస్థితిలోనికి వచ్చి మానహీనుఁడయిన దుష్టుఁడగును. ఇది మనస్సునందుంచి బాగు పడఁ గోరువారు దుస్సంగదూరు లగుటకు సర్వవిధములఁ బాటు పడ వలయును.



# మూడవ ప్రకరణము.

## ఉపాధ్యాయత్వ పత్రికావిలేఖకత్వ ప్రథమదశ.

క్రీస్తుశకము 1870 మొదలుకొని 1880 వ సంవత్సరమువఱకు.

బారోదొరగారు రోగపడి 1870 వ సంవత్సరాంతమున రాజమహేంద్రవరమునుండి తమ ప్రధానోపాధ్యాయత్వమును కల్లికోటయందలి రాజకీయపాఠశాలకు మార్చుకొని వెడలిపోయిరి. 1871 వ సంవత్సరారంభమున ప్రథమశాస్త్రపరీక్షతరగతి పెట్టఁబడినందున నేనందుఁజేరి నాలుగైదుదినములుంటిని గాని యింతలో బారోదొరగారికి బదులుగా కళ్ళికోటనుండి వచ్చుచుండిన దొరగారు దారిలో స్వర్గస్థులగుటచేత రాజమహేంద్రవరమునఁ బ్రథమశాస్త్రపరీక్షతరగతి యెత్తివేయఁబడెను. ప్రవేశపరీక్షయందుఁ గృతార్థుఁడనైన కొన్నినెలలలోనే 1871 వ సంవత్సరము చైత్రమాసములో కాఁబోలును నేను రాజమహేంద్రవరమునందలి దొరతనమువారి మండలపాఠశాలలో నప్పటి ప్రధానోపాధ్యాయులయిన కుప్పుస్వామి శాస్త్రులవారి సాయమువలన నెల కిరువదియైదురూపాయల జీతముమీఁద సహాయోపాధ్యాయుఁడనుగా నియమింపఁబడితిని. అల్పకాలికమైన యీపని సంవత్సరకాలముండి నిలిచిపోయినది. పనిలోనున్న కాలములో నేను గొన్నితరగతుల కింగ్లీషును లెక్కలును హిందూదేశచరిత్రమును చెప్పుచుండెడివాఁడను. ఆకాలమునందు సహితము నాయెడల విద్యార్థులకు భయభక్తులును సహోపాధ్యాయులకు గౌరవము నుండెను. నేను బాలురను నీతివర్తనమునందు ప్రోత్సాహపఱుచుచు, ఎవ్వరివిషయమునను పక్షపాతము చూపక, సమబుద్ధితో వర్తించుచుండెడివాఁడను. ఏలూరి లక్ష్మీనరసింహముగారు, దురిసేటి శేషగిరిరావు పంతులుగారు, వేపా

కృష్ణమూర్తి పంతులుగారు మొదలయినవారప్పుడు నాలగవతరగతిలో నావద్ద చదువుకొనుచుండెడివారు. ఇందలి కడపటివారి యన్నగారైన వేపా రామమూర్తిపంతులుగారా కాలములో మాపాఠశాలలో ద్వితీయోపాధ్యాయులుగానుండిరి. అందుచేత తక్కినయుపాధ్యాయులా యన తమ్ముఁడొకవేళ తమతరగతిలో వల్లరిచేసినను చూచిచూడన ట్లుపేక్షించి యూరకుండెడివారు. ఒకనాఁడు కృష్ణమూర్తిపంతులు గారు నాలవతరగతి నాయొద్దనున్నప్పుడేదో కొంచెమవిధేయతను గనఁబఱుపఁగా, నేనించుకయు సందేహింపక తత్క్షణమే యాతనను బల్లపై నెక్కించి నిలువఁబెట్టితిని. నాలుగైదు నిమిషములైన తరు వాత నాతోడి యుపాధ్యాయుఁడొకఁడు నావద్దకువచ్చి, రహస్యమని చెప్పి నన్నావలికిఁ గొనిపోయి 'యాచిన్నవాఁడు రామమూర్తిపంతులు గారి తమ్ముఁ' డని చెప్పెను. 'అవును. నేనెఱుఁగుదును' అని చెప్పి యచట నిలువక నాతరగతిలోనికి వచ్చితిని. నామిత్రుఁ డూహించి నట్లుగా రామమూర్తిపంతులుగారు నాపైని కోపపడక, సాయంకాల మైదుగంటలకు పాఠశాల విడిచిపెట్టఁగానే నాయొద్దకువచ్చి, తమ తమ్ముఁడని మోమోటపడక స్వకృత్యమును నిర్వహించినందులకు నన్నభినందించి తమకృతజ్ఞతను దెలిపిరి. శిక్షితులైన కృష్ణమూర్తి పంతులుగారు సహితము నాపైని గినుకపూనక యాదరమునే కలిగి యుండిరనుటకు 1876వ సంవత్సరమునందు చెన్నపురి రాజకీయ శాస్త్రపాఠశాల (ప్రెసిడెన్సీకాలేజి)లో ప్రథమశాస్త్రపరీక్షతరగతిలో చదువుకొనుచు చిరకాలమునకు తమంత నాపేరవ్రాసిన లేఖలో 'భగవత్కృపచేత మీ రస్థిభారమువేసిన యల్పజ్ఞానమువలననే నేనీ సంవత్సరము ప్రథమశాస్త్రపరీక్షలోఁ దేఱవచ్చును. నాజీవితకాల

ములో మిమ్మెల్లప్పుడును గౌరవింపకొండఁజాలను' 1 అనునర్థము వచ్చు నట్లు వ్రాయుటయే సాక్ష్యముగానున్నది. ఈవఱకుఁ జెప్పినట్లు న్యాయ సభలలో కొలువు కుదురఁగూడదని నేను శపథము చేసికొన్న తరు వాత, సేవకవృత్తిలేక స్వతంత్రుఁడనుగా నుండవచ్చునన్న యాశతో నాకు న్యాయవాదినై పనిచేయవలెనని కోరికయుండెడిది. అందుచేత నేను దానికిఁ గావలసిన పరీక్షలకుఁ జదువయత్నించితిని. మండలపాఠ శాలలో నాతో సహోపాధ్యాయుఁడును బాల్యములో నాసహాధ్యా యియు మా బంధువును నగు చల్లపల్లి బాపయ్యపంతులుగారు నాకు పరమమిత్రుఁడుగా నుండెను. పాఠశాలలో నుపాధ్యాయులుగానున్న కాలములో మే మిరువురమును గలిసి విశేషపరీక్షలకుఁ జదువ నారం భించితిమి. 1871 వ సంవత్సరము శ్రావణమాసములో జరగిన దండ శాసనోన్నతపదపరీక్ష (Criminal Higher Grade) కు మే మిరువు రమును బోయితిమి. మే మాపరీక్షలో లబ్ధవిజయులమైనట్లు మఱు సటి సంవత్సరమునం దనఁగా 1872 వ సంవత్సరమున రాజకీయ వ్యవ హారపత్రికయందుఁ బ్రకటింపఁబడినది.

ఈకాలమునాఁటికి నాపూర్వవిశ్వాసములు కొన్నిమార్పు చెందు చుండినట్లు చెప్పియుంటినిగదా. దయ్యములు పట్టినవని వారియిండ్లకుఁ దఱచుగాఁ బోయి వారిచేష్టలను నటనలను లక్షణములను పరీక్షించు చుండుటచేతను మంత్రవేత్తల మనువారు చేయు కుతంత్రములను, మా యలను శోధించుచుండుటచేతను భూతావేశమునందు నాకునమ్మకము పోయినది. ఈకాలమునందు జ్యోతిశ్శాస్త్రములోని ముహూర్తజాతక భాగములయందును, శకునములు మొదలైనవానియందును గూడ

1 ".I am doing well in the College and may, by God's grace, expect to Pass F. A. this year wifh the little bit of knowledge I have, of which the foundation stone was laid by you whom I cannot but honour ever in my life."— Letter dated 23rd June 1876, Madras.

నాకు విశ్వాసము పూర్ణముగా చెడినది. నమ్మకములేనివానిని పామరుల సంతుష్టికై నమ్మినట్లు నటించి యాచరించుచుండుట సాధారణముగా నాస్వభావమునకు సరిపడదు. విశ్వాసములేని దానియందు విశ్వాసము లేనట్లు చెప్పుటయు, ఆ విశ్వాసరాహిత్యమును మాటలచేతనేగాక చేష్టలయందును జూపుటయు, నాకు స్వాభావికము. నా యవిశ్వాసమును లోకమునకుఁ జూపుటకును నాకవకాశము శీఘ్రముగానే కలిగినది. మాదొడ్డిలోనున్న యరఁటిచెట్టొకటి యే హేతువుచేతనో కొననుండి వేయక నడుమనుండి చీల్చుకొని పువ్వు పైకివచ్చి గెల వేసినది. ఇట్లు చెట్టుమధ్యనుండి గెలవేయుట యరిష్టసూచకమనియు, వెంటనే చెట్టు కొట్టివేయవలసిన దనియు, ఇరుగుపొరుగులవారును దైవజ్ఞులును బంధువులును నాతో బహువిధములఁ జెప్పిరి. ఎవ్వ రెన్నివిధములఁ జెప్పినను వారిమాటలు చెవినిబెట్టక యేమిజరుగునో చూతమని యాచెట్టట్టే యుంచితిని. ఆరంభదశలోఁ గొంతకాలము గుంపులుగుంపులుగావచ్చి జనులావింతను జూచి పోవుచు వచ్చిరి. కొన్నినెలలకు కాయలెదిగి కూరకక్కఱకు వచ్చినతరువాత కాయలు కోసికొని దూటనిమిత్తము చెట్టు కొట్టివేయించితిని. ఆసమయమునందే మాయింటిదూలముయొక్క కొననున్నతొఱ్ఱలో తేనెపట్టు పట్టెను. ఇంట తేనెపట్టు పట్టఁగూడదనియు, అట్లుపట్టుట యశుభసూచకమనియు, దానినితీసివేయించి దోషపరిహారార్థముగా బ్రాహ్మణులచేత శాంతికర్మ చేయింపవలసినదనియు, ఎల్లవారును పైయట్లే చెప్పిరి. పైనట్లే మొండొడ్డి యెల్లవారిహితబోధలను నిరాకరించి చలింపక చట్టువలె నిలిచితిని. నాతల్లియు ముత్తవయుఁగూడ నాతో జెప్పిచూచిరి. కాని యీబండవానితోఁ జెప్పినకార్యములేదని తుదకు విసిగియూరకుండిరి. మండలపాఠశాలలోని పని నిలిచిపోయినతరువాత నాకు 1872 వ సంవత్సరము జ్యేష్ఠమాసములో కోరంగియను గ్రామ

మునందుఁగల యింగ్లీషు పాఠశాలలో నెలకు ముప్పదిరూపాయల జీతముగల ప్రధానోపాధ్యాయత్వము లభించినది. ఆపనికిఁ బోవునప్పుడు మంచిదినముచూచి మంచిముహూర్తము పెట్టుకొని పొమ్మని యితరులును మావారునుకూడ నన్ను బలాత్కారము చేసిరి. వారి నిర్బంధమును లక్ష్యము చేయక యమావాస్యనాఁడు బైలుదేఱిపోయి పనిలోఁ బ్రవేశించితిని. పాఠశాలకుఁ గార్యనిర్వాహకులుగానున్న యిరువురిలో నొకరు మాతాతగారియొద్ద కొలువులోనుండిన యాతనికుమారుఁడును చుట్టమును సముద్రశుల్కపర్యవేక్షకుఁడును (Sea Custom Superintendent) అగు బలిజేపల్లి నారాయణమూర్తిగారు పోఁగానే నేను వారియింటనే దిగితిని. అమావాస్యనాఁ డేల బైలుదేఱితివని నన్నాయన యడిగెను. ఈశ్వరుఁడుచేసిన దినములన్నియు సమానముగానే మంచివయినప్పు డేదినమునబైలుదేఱిన నేమని నేను బదులు చెప్పితిని. అందుపైని జ్యోతిశ్శాస్త్రవిషయమున మా యిరువురకును వాదమయ్యెను. ఇట్లావిషయమునఁ గొన్నిదినములు వితర్కము జరగునప్పటికాయన యేఁబదియేండ్లు దాఁటిన వృద్ధుఁడే యైనను, ఆయనకు ముహూర్తాదులయందలి నమ్మకము ముక్కాలుమువ్వీసము పోయినది.

1870 వ సంవత్సరమునందే 'గోదావరీవిద్యాప్రబోధిని'కి నేను వ్రాయుచుంటినని తెలిపియున్నాను. కోరంగికిఁ బోకపూర్వము నేను రాజమహేంద్రవరములో నుండినప్పుడే మచిలీబందరు నందలి పురుషార్థప్రదాయినికి గ్రంథములు వ్రాసి పంపనారంభించితిని. నాపద్యకావ్యముల ననేకులు శ్లాఘించి యాకాలమునందలి వార్తాపత్రికలలో వ్రాసియున్నారు. నే నప్పటికి శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన నైషధమును, రసికజనమనోరంజనమును, ముగించి శుద్ధాంధ్రోత్తరరామాయణమును జేయ నారంభించియుంటిని. నాగ్రంథరచనను గూర్చి యింకొక ప్రకరణమునందు వ్రాయఁదలఁచుకొంటిని గాన దాని

విందువిడిచి పెట్టెదను. కోరంగికిఁబోయినతరువాతఁగూడఁ బురుషార్థప్రదాయినికి వ్రాయుచునే యుంటిని. నేను రచియింప మొదలుపెట్టిన యచ్చతెలుఁగు సభాపర్వములోని కొంతభాగము బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నముపంతులవారిచేఁ జెన్నపట్టణములోఁ బ్రకటింపఁబడుచుండిన యాంధ్రభాషాసంజీవనిలోఁ బ్రచురింపఁబడినది. నేనక్కడ నున్నకాలములో విశేషపరీక్షలలో నొకటియగు రెండవతరగతి భాషాంతరీకరణపరీక్ష (Translation, Lower Grade)కు 1872 సంవత్సరము ఆశ్వయుజమాసములో ఇంగ్లీషు తెలుఁగుభాషలయందుఁ బోయి కృతార్థుఁడ నైతిని. మొదటితరగతి భాషాంతరీకరణపరీక్షకుఁ బోవువారు రెండుదేశభాషలను నేర్చియుండవలెను. ఒక్కయల్పాంశము తక్క నే నచ్చటనున్నకాలములో విశేషముగాఁ జెప్పవలసిన దేదియులేదు. నాతల్లికి పిశాచభ్రమ యుండుచువచ్చెనని మొదటిప్రకరణముననే చెప్పితిని. ఆమె కాభ్రమము పూర్ణముగాఁ బోవక మరణకాలమువఱకు నప్పుడప్పుడు కలుగుచునే యుండెడిది. కాని నేను దయ్యముల విషయమునఁ దఱచుగా సంభాషించుచు వచ్చుటచేత 1876వ సంవత్సరమునకుఁ దరువాత మాత్రము కలుగలేదు. అట్టిభ్రమ కలిగినప్పుడు తన్నివారణార్థమై భూతవైద్యుఁడను వాని నెవ్వనినో పిలిపించి తత్కాలమున కేదో తంత్రము చేయించుచు వచ్చినంగాని కార్యము లేకుండెను. కోరంగిలోనున్నకాలములో సహితము నామాత కట్టిభ్రమము కలుగుచు నే వచ్చెను. అక్కడివారు గొప్పభూతవైద్యుఁ డని నాయొద్ద కొకయోగిని గొనివచ్చిరి. ఆ బ్రాహ్మణయోగి మిక్కిలి కండపుష్టి గలవాఁడు; పూటకు శేరు బియ్యపు అన్నమునకు తక్కువ కాకుండ తినెడువాఁడు; గడ్డమును గోళ్ళను పెంచినవాఁడు; కాలికి కఱ్ఱపావలు తొడిగి, చేత బెత్తమును బట్టి, కాషాయవస్త్రములనుగట్టి, నొసట గొప్ప కుంకుమబొట్టు పెట్టి,

చూచుటకు మహాభయంకరముగా నుండెడివాఁడు; గంజాయిత్రాగెడు వాఁడు; ముప్పదికిని నలువదికిని నడిమిప్రాయముగల యాపురుషుని నావద్దకుఁ గొనివచ్చినప్పుడు నాకు మంత్రములయందుఁగాని దయ్యములయందుఁగాని నమ్మకము లేకపోయినను, నే నాతని మాయింట నుంచుకొని భోజనము పెట్టెదననియు, నాతల్లిదేహము స్వస్థపడిన తరువాత మంచి బహుమానము చేసెదననియు చెప్పితిని. ఆతఁ డందున కొప్పుకొని మాయింటఁ బ్రవేశించెను. ప్రవేశించినది మొదలుకొని యతఁడు 'మే' మని స్వవిషయమున బహువచన ప్రయోగము చేసికొనుచు, 'నీ' వని యితరులవిషయమున నేకవచన ప్రయోగము చేయుచు, గర్వము చూపఁదొడఁగెను. నేను దాని కోర్చుకొని యాతఁ డడిగినదాని నెల్ల స్వల్పమగుటచేత నిచ్చుచు వచ్చితిని. అందుపైని నేను దనకు లోఁబడితి ననుకొని యంతకంత కత్యాశాపరుఁడయి యతఁడు పెక్కు మిషలమీఁద నావద్దనుండి ధనము లాగఁజూచెను. నాతల్లిశరీరము స్వస్థపడినపిమ్మటఁగాని నే నేమియు నియ్యనని నిరాకరించితిని. అప్పుడతఁడు కన్ను లెఱ్ఱచేసి నావంక క్రూరదృష్టితోఁ జూచెను. నేను భయపడక యాతని యవివేకమును తలఁచినప్పుడు నవ్వు రాఁగా పకపక నవ్వితిని. అందుమీఁద నతఁడు మఱింతరోషము ;వచ్చినవాఁడయి శాపులు ప్రేల నారంభించెను. అప్పుడు నేనును పట్టరాని కోపము గలవాఁడనయి చేరువనున్న మాపాఠశాలభటునిచేత మెడపట్టించి యాయోగీశ్వరుని వీధిలోనికి గెంటించితిని. అతడు దండతాడితభుజంగమువలె రోఁజుచు, నన్ను శపించుచు, ఏమిచేసెదనో రేపీవేళకు చూడుమని బెదరించుచు, వేఱొక చోటికిఁ బోయెను. అట్లుపోయి యతఁ డొకయింట నొకగది పుచ్చుకొని యలికి ముగ్గుపెట్టి యందేదో యంత్రము వేసి ప్రయోగముచేసి నన్ను చంపెదనని పలుకుచు స్నానముచేసి తలవిరియఁబోసికొని వచ్చి యుపవాసముతోఁ గూర్చుండి నిష్ఠాపరుఁడై యేదో మంత్ర

జపము చేయ నారంభించెను. అది చూచి నా మిత్రులు భయపడి నా యొద్దకు వచ్చి, అట్టియభిచారవేత్తతో తగవులాడుట క్షేమకరము కా దనియు, తమమాట విని యాతనిపాదములమీఁదఁ బడి వేఁడికొని చేసిన యపచారమునకు క్షమార్పణము చేయవలసినదనియు, నాకు హితము చెప్పిరి. వారెన్నివిధములఁ జెప్పినను వారిమాటలు వినక, ఆమాంత్రికుఁడు నన్నేమి చేయఁగలఁడో చూతమని చెప్పి, వచ్చినవారిని వచ్చినట్టే పంపివేసితిని. ఆ యోగి రాత్రివఱకును భోజనము లేక కొబ్బరి కాయలనీళ్ళు త్రాగి యట్టె యుండి యొంటరిగా చీఁకటిలో 'హ్రీం' "హ్రాం" అని కేకలు వేయుచుండెను. అర్ధరాత్రముదాఁక నట్లే యుండి యాహారము లేకపోవుటచేతనో నారికేళజలము పైత్యము చేయుటచేతనో నిద్రమేలుకొనుటచేతనో గంజాయిమైకముచేతనో మఱి యే హేతువుచేతనో తూలి క్రిందఁ బడిపోయి, తన్నెవ్వరో త్రోచిపడవేసి నట్టు భ్రమించి దడసికొనెను; దానిచేత నాతనికి వెంటనే భయజ్వరము వచ్చెను. ఒకరిని జడిపింపఁబోయి తానే జడిసికొన్నట్టు మఱునాఁటి ప్రాతఃకాలమునఁ దన్నుఁ జూడవచ్చినవారితో నెల్లను నేను శరభ సాళ్వమును దనమీఁదఁ బ్రయోగము చేసితిననియు, ఆ దేవత వచ్చి తాను బంపుచుండిన దేవతనెత్తి యడఁచి తన్నుఁ గ్రిందఁ బడవేసె ననియు, ఆ దేవత తన్ను శీఘ్రముగానే చంపుననియు, ఆ యోగి చెప్ప సాగెను. నాకు మంత్రమహిమయందలి విశ్వాసము పోయినతరువాత నే నాతల్లియొక్క భ్రమను నివారించు నిమిత్తమయి నేను శరభసాళ్వ మంత్రము నుపదేశమందితిని. ఆసంగతి నంతకుఁబూర్వమే ఆ యోగి వినియుండి యిట్లు భ్రమసియుండును. నేను రెండుదినము లుపేక్షించి యూరకుంటిని గాని యతఁ డంతకంతకు బలహీనుఁడయి సంధి లో నన్నే పలవరించుచుండినట్టు విని జాలినొంది, అతనిభ్రమ పోఁ గొట్టుటకయి యాతనియొద్దకుఁ బోయి నే నేమియుఁ జేయలేదనినమ్మఁ

బలికి ధైర్యము చెప్పి, ఆతనిని మాయింటికిఁ గొనివచ్చితిని. ఈనాలుగు దినములలోనే యేనుఁగువంటి వాఁడు పీనుఁగువంటివాఁడయి యా. దయ్యాలపోతు బ్రాహ్మణుఁడు మాయింటికి వచ్చిననాఁ డరసోలెడు బియ్యపు అన్నమునైనను తినలేకపోయెను. క్రమక్రమముగా నన్నహితము కలిగి యతఁడు యథాస్థితికి వచ్చుటకు నెలదినములు పట్టినది. తమ మంత్రములయందు పటిమ లేదని యెఱిఁగి ధనార్జనమునకయి మాఱువేషములు వేసి పరులను మోసపుచ్చుచుండువారు సహిత మితరుల మంత్రములయందు పాటవము కలదని నమ్ముచుందురు. అతఁడు పూర్ణముగా స్వస్థపడిన తరువాత నాతనికొక క్రొత్తబట్ట కట్టఁబెట్టి యొకరూపాయ రొక్కమిచ్చి పంపివేసితిని. శరభసాళ్వమంత్రము నెఱుఁగ నపేక్షించువారు నా రాజశేఖరచరిత్రమునందుఁ జూడ వచ్చును.

1874 వ సంవత్సరమునం దాషాఢమాసమున నేను కోరంగిలోని పనిని విడిచి, నాస్వస్థలమగు రాజమహేంద్రవరమునకు నాలుగు మైళ్ళదూరములోనున్న ధవళేశ్వరమునందలి యాంగ్లోదేశ భాషాపాఠశాలలో నెలకు రు. 44—0—0 ల జీతముగల ప్రధానోపాధ్యాయత్వమునందుఁ బ్రవేశించితిని. ఇక్కడనున్నకాలములో సహితము బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులువారు వారిపక్షము వారును స్త్రీవిద్యానిషేధవాదులయి, స్త్రీలవిద్యకుఁ బ్రతికూలముగా నాంధ్రభాషాసంజీవనిలో వ్రాయుచుండఁగా, నేను వారికిఁ బ్రతిపక్షమును బూని స్త్రీవిద్యావిధాయకవాది నయి వారివాదమును ఖండించుచు స్త్రీలవిద్య కనుకూలముగాఁ బురుషార్థప్రదాయినికి వ్రాయుచుంటిని. ఈవాదప్రతివాదములలో నాయుత్తరములను గొన్నిటిని పద్యరూపమున సహితము వ్రాసితిని. అప్పటి నాపద్యము లెట్లుండునో తెలియుటకయి యొక లేఖనుండి కొన్నిపద్యముల నిందుదాహరించుచున్నాను—

శా. శ్రీమార్తాండమరీచిరోచి యనఁ గాఁ జెన్నొందు దివాంధావళిం
బ్రామన్ గ్రాల్పురుషార్థదాయిని సతీ! పద్యాలి సంజీవనిన్
శ్యామాలోకము కెల్ల విద్య వలదం చష్టావధాన్యాహ్వయుల్
తా మీమాంసము వెల్లడించుటలు మోదంబొప్ప వీక్షించితే?



చ. మునుపటివారు చెప్పినది మొక్కలపున్మది పూని సర్వముం
గొనఁ జనదంచు నామతముకూడ లవంబును గాదు, గాని యెం
దును మనబుద్ధికూడఁ గడుఁ దూరిచి యారయుచుంట ముఖ్యమై
చనును హితాహితంబులు పసల్ గని దుష్కృత ముజ్జగింపఁగన్.



మ. అయినన్ ముద్దియవిద్దియం గఱచి యెందైనం దగం గొంటియా
నయవేదుల్ తగదంచు వాదములు పూనం గంటిమే మీవలెన్?
దయ మీ రంగను జెప్పుఁడయ్య యలసిద్ధాంతంబు లెందైన మీ
నయనానందము చేసెనేమొ వినఁగన్ గౌతూహలం బయ్యెడున్.

ఉ. వింతగ వాద మేల యవివేకులపోలిక? స్త్రీలవిద్య సి
ద్ధాంతమె చేసినారు మనతద్జ్ఞులు పూర్వులు; వేద మొక్కటే
యింతులు చూడఁగూడదని యింతె; పురాణచయంబు స్త్రీలకై
యెంతయుఁ జేయుటల్ స్మృతులు నెల్లపురాణము లొత్తి చెప్పవే.

మనవారు సాధారణముగా యుక్తియుక్తముగాను సప్రమాణముగాను వాద ప్రతివాదములుచేయుట మాని నడుమ వక్తవ్యాంశమును విడిచి యన్యోన్యదూషణమునకు దిగుదురు. స్త్రీవిద్యానిషేధవాదులు స్వవాద దౌర్బల్యమునుబట్టి కాఁబోలును ముందుగాఁ బ్రతివాదిదూషణమున నారంభించిరి. అప్పుడు నేనును సైరణ వహింపక స్వాభావికా

గ్రహమునుబట్టియు సాధనాహంకారమునుబట్టియు విజిగీషాదురతి శయమునుబట్టియు దుర్భాషణముగా దూషణములకుఁ బ్రతిదూషణము చేయఁ గడఁగితిని. పంతులవారు ప్రయోగించిన వాక్ప్రహరణము మృదుత్వము కలదిగాక మోటుమైన బండదెబ్బకొట్టినదిగా నుండె డిది; నాది కొంతమార్దవము కలదగుటచేత వారియొక్క పోటుగాఁ దూటి మనస్సున కెక్కునట్టి శక్తి కలిగి యున్నదిగా నుండెడిది. ఆయన కృతివిమర్శని సమాజమని పేరుపెట్టి దానిచే మద్విరచితగ్రంథదోషా న్వేషణమునకు దిగఁగా, నేను [illegible] సమాజమని పేరు పెట్టి తద్విరచితగ్రంథదోషాన్వేషణమునకుఁ గడఁగితిని. అప్పుడు క్రొత్తగా మిత్రులుగాఁ జేర్పఁబడిన బయ్యపునేని వేంకట[illegible]య్యగారు మొదలయినవారు కొందఱు నాకీవాదమునందు సహాయులయి యుం డిరి. ఈవాగ్యుద్ధమునందు సహాయమును నేనే జయము పొందినను యిప్పటి వారనేకు లభిప్రాయపడినను, అప్పటి నా వ్రాతలు చూచిన నిప్పుడు నాకే సిగ్గగుచున్నది. వారెన్ని దూషణములు చేసినను, ఎన్ని పరిహాసములు చేసినను, ఈ కాలమువంటి వ్రాతలు వ్రాసియుండను. ఇరువురు తగవులాడుచుండఁగాఁ జూచుట పయివారికి వేడుకగానుండును గాన, శుష్కకలహమును జూచి వేడుకఁ జూడక యేదో పక్షముచేరి వివాదము పెంచుటకే పలువురు ప్రయత్నించుచువచ్చిరి. ఇట్లు పత్రికా ముఖమున ఘోరవాక్కలహము నడచుచున్నను, పంతులవారును నేనును మనస్సులలోపల ద్వేషము లేనివారమయి పరస్పరసుహృ ద్భావముతో నుత్తరప్రత్యుత్తరములను జరుపుకొనుచునే యుండెడి వారము.

1875-వ సంవత్సరమునందు నేను సంక్షేపలేఖన(Precis writing) పరీక్షయం దింగ్లీషునఁ గృతార్థుఁడ నైతిని. ఈపరీక్షనిమిత్తము నేను రాజమహేంద్రవరమునకుఁ బోయియుండినప్పుడే నా కచ్చటి రాజ

కీయ శాస్త్రపాఠశాలాధ్యక్షులగు మెట్కాఫుదొరగారితోడి ప్రథమ పరిచయము కలిగినది. ఆకాలమునం దాయన తెలుఁగభ్యసించుచుండిరి. అప్పుడు వారికేదో వాక్యార్థవిషయమున సందేహము కలుగఁగా, ఎవ్వరు నడిగినను తృప్తికరముగా తీర్పలేకపోయిరఁట. నేనా సందేహమును తీర్పఁగలనని యావఱకు కుప్పుస్వామి శాస్త్రులవారు చెప్పియుండుటచేత, పాఠశాలాభవనములో నేను పరీక్షాప్రశ్నముల కుత్తరములు వ్రాయుచుండఁగా వారిరువురును గలిసి నాయొద్దకు వచ్చిరి. దొరగారు తమసందేహమును దెలిపినప్పుడు నాకు తోఁచిన సమాధానము చెప్పఁగా వారత్యంతసంతుష్టులయి వెడలిపోయిరి. వారి కప్పుడే నాయందు మంచియభిప్రాయము కలిగెను. సంక్షేప లేఖనపరీక్షయందుఁ గృతార్థుఁడనగుటచేత నే ననుగతదండధారి (Sub-Magistrate) పదమున కర్హుఁడనైతిని. రెవిన్యూన్నతపదపరీక్ష (Revenue Higher Grade) కుఁ బోయి జయమొందినయెడల సహాయకరగ్రాహి (Deputy Collector) పదమున కర్హుఁడనయియుందును. ఆపరీక్షకప్పుడు రెండే పుస్తకములైనను నేనాశాఖయందుఁ బ్రవేశింపఁదలఁచుకోనందున, ఆపరీక్షకుఁ బోలేదు. వ్యావహారికోన్నత పద పరీక్ష (Civil, Higher Grade) యందుఁ గృతార్థుఁడ నైనయెడల, మొదటితరగతి న్యాయవాదిత్వమునకును అనుగతన్యాయాధిపతి (Sub-Judge) పదమునకునుగూడ నర్హుఁడనయి యుందును. న్యాయవాదిని గావలెనని తలఁపుగొని యున్నప్పు డాపరీక్ష కొకసారి పోయినను, తరువాత నామిత్రులైన న్యాయవాదులు కొందఱు తమపనిలోను నిజమైన స్వతంత్రత లేదనియు, అందు న్యాయముగాఁ బ్రవర్తించి ధనార్జనము చేయుట యసాధ్యమనియు, తాము స్వయముగా సాక్షుల కసత్యము బోధింపకపోయినను సత్యము కానట్టు తెలిసియు సత్యమయినట్టు వాదింపవలసియుండుననియు, చెప్పినందున న్యాయ

వాదిపదమునందును రోతపుట్టి రెండవసారి యాపరీక్షకుఁ బోవమాను కొంటిని. ఏపనియు లేక స్వతంత్రజీవనమునైనను చేయవలెను, లేదా పాపకార్యములకంతగా నవకాశము లేని యుపాధ్యాయత్వముకం దైనను ఉండవలెను, అని నేనప్పుడు నిశ్చయము చేసికొంటిని.

మొట్టమొదట స్త్రీవిద్యామండనవాదము నన్యపత్రికాముఖము ననే జరపుచు వచ్చినను, నాయూహలను లోకమునకు వెల్లడించుట కయి స్వకీయమైన వృత్తాంతపత్రిక యొకటి యుండుట యుక్తమని భావించి, 1874 వ సంవత్సరము ఆశ్వయుజమాసమునుండి 'వివేక వర్ధని' అను నామముతో నాలుగు పెద్దపుటలు గల యొకచిన్నమాస పత్రికను తెలుగునఁ బ్రకటింప నారంభించితిని. ఆకాలమునందు మా గోదావరిమండలములో దొరతనమువారిది తక్క వేఱు ముద్రాయం త్రము లేకపోవుటచేత నాపత్రిక నప్పుడు చెన్నపురిలో బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులువారి సంజీవనీ ముద్రాక్షరశాల యందు ముద్రింపింప నారంభించి, అక్కడ యుక్తకాలమునందు పత్రిక వెలువడకపోవుటచేత మూఁడుమాసములైన తరువాత శ్రీధర ముద్రాక్షరశాలకు మార్చి పత్రికను ద్విగుణముచేసి 17 పుటలు గల పుస్తకరూపమునఁ బ్రకటింప మొదలుపెట్టితిని. మాపత్రికాముఖము నకు తిలకముగాను పత్రికా నిర్వాహణమునందు మాకు మార్గదర్శ కముగాను ఉండుటకయి,

క. ఒరు లేయవి యొనరించిన,
నరవర, యప్రియము తనమనంబున కగుఁ దా
నొరులకు నవి సేయకునికి,
పరాయణము పరమధర్మపథముల కెల్లన్.

అను భారతనీతివాక్యరత్నమును మేముమాకు మూలసూత్రమునుగాఁ గైకొంటిమి. మా పత్రికయొక్క నామధేయమువలనను మేము

గైకొన్న పురస్కృతవాక్యమువలనను మా పత్రికోశద్దే మెల్లరకుఁ దెల్లము కాఁదగియున్నను, చతుర్థమాస పత్రికాదియందు నన్నుఁ గూర్చియు నాపత్రికనుగూర్చియుఁ బ్రకటించుకొన్న పద్యమువలన మఱింత స్పష్టమగునని దాని నిందు క్రిందఁ బొందుపఱుచుచున్నాను.

సీ. బ్రాహ్మణుండను హూణభాష నేరిచి యందు
నేఁ బ్రవేశపరీక్ష నిచ్చినాఁడ,
నాంధ్రమున నొకింత యభిరుచిగలవాఁడ
దేశాభివృద్ధికై దీక్షమైనఁ,
బ్రాలుమాలక పాటుపడ నిచ్ఛఁగలవాఁడఁ
గవితాపటిమఁ గొంత గలుగువాఁడ,
నోపిక సర్వజనోపయుక్తములైన
విషయమ్ములును నీతివిషయములును,
సులభశైలి నందఱకును దెలియునట్లు
కఠినసంధులు లోనుగాఁ గలవి విడిచి,
వ్రాయుదు నొకప్పు డన్యదేశీయములును
లోనుగాఁ గలవానినిఁ బూనికూర్తు.

ఈపత్రికాప్రకటనమునందు నాయుద్దేశములు భాషాభివృద్ధియు దేశాభివృద్ధియు ముఖ్యముగా రెండు. నే నేర్పఱుచుకొన్న భాషాభివృద్ధిమార్గము తెలుఁగుభాషలో మృదువైన సులభశైలిని సలక్షణమైన వచనరచన చేయుట; దేశాభివృద్ధిమార్గము జనులలోఁ గల దురాచారదుర్వర్తనములఁ బాపియు వృద్ధిపద్ధతులను జూపియు వారి నధిక నీతిమంతులనుగాఁ జేసి దేశము నున్నతస్థితికిఁ దెచ్చుటకయి శక్తివంచన లేక పాటుపడుట. దేశాభివృద్ధి కలుగుటకయి విద్యావిషయమునను, వ్యవహారవిషయమునను, కులాచారవిషయమునను, నీతివిషయమునను, మతవిషయమునను నానాముఖములఁ గృషిచేయవలయు

పనియేకాని యొక్క రాజ్యాంగవిషయములయందే పనిచేయుట నా యుద్దేశముకాదు. మానవదేహములోని కరచరణాది సమస్తావయవములును యథాప్రమాణముగా పెరుగుటయే వృద్ధికాని యొక్క తలయో కాలో యత్యధికముగా పెరుగుట వృద్ధికాక రోగమయినట్లే దేశవిషయములోఁగూడ జనులు నీతిమతకులాచారాదులైన సమస్తాంగములయందును సమానముగా నభ్యున్నతి నొందుటయే వృద్ధిగాని యితరాంగములను భంగము కలుగునట్లుగా నొక్క రాజ్యాంగములయందేగాని యొక్క బుద్ధిప్రచారమునందేగాని యుత్కర్షము నొందుట క్షేమకరమైన దేశాభివృద్ధికాదని నాయభిప్రాయము. రాజ్యాంగవిషయమున నెక్కడనో దూరమున నున్న పరిపాలకులను వారిశాసనములను దూషించుటకంటె సమీపమునుండి రాజశాసనములను నడుపువారి దోషములను వెల్లడిచేయుట యధికప్రయోజనకరమని నా నమ్మకము. దొరతనమువారికిఁ జెల్లింపవలసిన నేలపన్నుల మొత్తమునకంటె నీ రిచ్చెడు రాజపురుషుల కియ్యవలసిన లంచముల మొత్తమెక్కువయినప్పుడు నేలపన్ను కొంచెము తగ్గింపఁబడిన మాత్రముననే కాపుల కేమి మేలిమి కలుగఁబోవును? వ్యాజ్యపు మొత్తమునకంటె న్యాయాధిపతికి సమర్పింపవలసిన యుపాయనమే యధికమయినప్పుడు వాది యభియోగపత్రమునకుఁ బెట్టవలసిన ముద్రకాగితముల మూల్యపరిమితి తగ్గింపఁబడిన మాత్రముననే గెలుపొందియు నతఁడేమి లాభమనుభవింపఁగలుగును? చేసిన యపరాధమునకయి శిక్షాస్మృతినిబట్టి కట్టవలసిన ధనదండనమునకంటె దోషిని దండింపక విడుచుటకును నిర్దోషిని దండించుటకును దండవిధాయి స్వీకరించెడు ముడుపే యెక్కువయినప్పుడు దండశాసనములయందు మంచిమార్పులు కలిగింపఁబడిన మాత్రముననే మానప్రాణరక్షణము కలవారయి ప్రజలెట్లు సుఖమనుభవింపఁ గలుగుదురు? ఆ కాలమునందు రాజకీయోద్యోగులలో లంచములు పుచ్చుకొనుట సర్వసాధారణము; పుచ్చుకొనకుండుట

మృగ్యము. లంచము తప్పుగాక యుద్యోగధర్మమనియె యెల్లవారి నమ్మకము. కాఁబట్టి రాజకీయోద్యోగులలోని యీ యక్రమమును మాన్పఁ బూనుట మాపత్రికోద్దేశములలో నొకటి. లంచములిచ్చెడు ప్రజలలోను పుచ్చుకొనెడి యధికారులలోను నీతిగౌరవము వర్ధిల్లక లంచము లడఁగవు. కాఁబట్టి జనులలో నీతిమానమును వృద్ధిచేయుట యింకొక యుద్దేశము. వేశ్యాగమనాదులు దురాచారములని కులములో భావింపఁబడకుండునంతవఱకు నీతి యెట్లు తలయెత్తి వర్ధిల్లఁ గలుగును? కాఁబట్టి కులాచారములను చక్కఁబఱుపఁ బూనుట మఱియొక యుద్దేశము తులసీ రుద్రాక్షమాలాది బాహ్య చిహ్నధారణమున కంటె సత్ప్రవర్తనము మతమున కధికావశ్యకమని జనులలో విశ్వాసము కుదురువఱకును మతము పరిశుద్ధమయి దురాచారనివారకము కానేరదు. కాఁబట్టి పరిశుద్ధ మతసిద్ధాంతములను బోధించుట వేఱొక యుద్దేశము. ఇట్టి సదుద్దేశములతో మావివేకవర్ధని మొదట వెలువడినది. ఆస్తిక్యము, వివేకము, సత్యము, అహింస, మొదలైనవియే మొదటిపత్రికలయందు వెలువడిన యుపన్యాసములు. నేనప్పటికే బహుదేవతారాధనమును విడిచి యేకేశ్వరోపాసనమును బూనిన వాఁడనై యుంటిని. వివేకవర్ధని మొదటి మూఁడుపత్రికలనుండియు వరుసగా నొక్కొక్కటిచొప్పునఁ గైకొనఁబడిన యీ క్రిందిపద్యముల వలన నా పరిశుద్ధాస్తికభావము తేటపడవచ్చును—

సీ. అక్ష్యాదిబాహ్యేంద్రియాగోచరుండయి
యాత్మస్వరూపుఁడై యలరువాఁడు,
సచరాచరంబైన సర్వసృష్టికి నాది
కారణుండయి చాలఁ గ్రాలువాఁడు,
దుష్టశిక్షణమును శిష్టరక్షణమును
నాత్మకృత్యములుగ నమరువాఁడు,

సర్వజ్ఞుఁడయియుండి జనులెందుఁ గావించు
సుకృతదుష్కృతములఁ జూచువాఁడు,
నిత్యుఁ డీశ్వరుఁ డభవుండు నిర్మలుండు
నాదు పత్రికారత్నంబు నాదరమునఁ,
బ్రబలఁగాఁ జేసి యెల్లెడ వాసి కెక్క-
నించు కంతదయ ననుగ్రహించుఁ గాత !

సీ. ఎవ్వనియిచ్ఛమై నెల్లజగమ్ములుఁ
గలుగుచు వెలయుచుఁ బొలియుచుండు,
నెవ్వనికట్టడి నేప్రొద్దు విడువక
విన్నున ఱిక్కలు వ్రేలుచుండు,
నెవ్వనిగానముల నెంతవలంతులుఁ
గడముట్టఁ దెలియంగఁ గానకుండు,
రెవ్వనియానతి నించుకైనను మీర
మీఱక సంద్రముల్ మించి నిలుచు,
నెవ్వఁ డాకసంబున నేల నల్లనీళ్ళ
మెలఁగు పులుఁగుల మెకముల మీలగములఁ
దగినయాహారంబుఁ గలిగించి నెగడఁ జేయు
నట్టిదేవర మమ్ముఁ జేపట్టుఁ గాత !

సీ. తనకృపారసవృష్టి దాసుల తాపంబు
లణఁగించి నెగడించు ఘనుఁడెవండు
తన దివ్యతేజంబునను భక్తజనతమో
నిచయంబు మాయించు నినుఁడెవండు
తనశీతలాలోకమునఁ గువలయమును
వెలయించు చల్లని వేలుపెవఁడు

తనజగద్వ్యాపకత్వంబుపై లోకాళిఁ
బాలించు నలజగత్ప్రాణుఁ డెవఁడు
అట్టి పరమేశ్వరుండు దయాసముద్రుఁ
డాదరాయత్తచిత్తుఁడై హర్ష మెసఁగ
మాదు విన్నప మాలించి మఱచిపోక
'మమ్ము ననిశమ్మును భృతమ్ము మనుచుఁ గాత !

లంచములు తగవన్న, రాజకీయోద్యోగులకుఁ గోపము; వేశ్యాంగనాసంగము నీతి గాదన్న, శృంగారనాయకులకుఁ గోపము; పూర్వాచారమును మార్చుకోవలెనన్న, పామరజనులకు గోపము; నీతిమాలిన బాహ్యవేషములు మతవిరుద్ధములన్న, ఆచార్యపురుషులకుఁ గోపము. మాపత్రికోద్దేశమును నిశ్శంకముగా నిర్వహింపవలసి వచ్చో నిన్ని కోపములను సరకు చేయకుండవలెను. తనమీఁదఁ బడిన యీభారమును మా వివేకవర్ధని కొంతవఱకయినను నిర్వహింపఁ గలిగినదో లేదో ముందుముందు చెప్పఁబోయెదు. దానినిబట్టి మా చదువరులే తమకుఁ దోచిన యభిప్రాయముల నేర్పఱచుకొందురు గాక!

శ్రీవిద్యనుగూర్చి యాంధ్రభాషాసంజీవనిలోను 'పురుషార్థప్రదాయినిలోను వాదప్రతివాదములు నడచుచుండినట్లు ముందే చెప్పఁబడెనుగదా. శ్రీవిద్యా విషయక ఖండనవాద మాంధ్రభాషాసంజీవనిని విడిచిపెట్టక యందే నెగడుచున్నను మండనవాదము మాత్రము పురుషార్థప్రదాయినినుండి తరలివచ్చి వివేకవర్ధనిని జేరినది. పత్రికాముఖమున నిట్లు మాటలపోరాటము జరుగుచుండఁగా దానివాసన ధవళేశ్వరమునందలి మహాజనులనుగూడ సోఁకి శీఘ్రముగానే యీవాదమును ఫలోన్ముఖమునకుఁ దెచ్చినది. నేను ధవళేశ్వరమునందు సభలుచేసి బాలికావిద్యాభ్యాసమువలని లాభములనుగూర్చి పలు

మాటలు ప్రసంగించుచు రాఁగా, మొదట వృద్ధఘటములలోఁ గొంత ప్రాతికూల్యము పొడచూపినను క్రమక్రమముగా నడఁగంటిపోయి కడకక్కడి ప్రముఖుల కనేకులకు బాలికలకు విద్య యావశ్యక మన్న నిశ్చయము కలిగెను. కర్తవ్యతావిషయమున దృఢనిశ్చయము కలిగిన తరువాత కార్యారంభమునకు తడవుపట్టదుకదా. అందుచేత నక్కడి ప్రముఖులందఱును తమలోదాము చందాలు వేసికొని, 1874వ సంవత్సరము సెప్టెంబరు నెలలో నొక బాలికాపాఠశాలను స్థాపించి దానికి బ్రహ్మశ్రీ శ్రీమల్లాది అచ్చన్న శాస్త్రులవారిని ప్రధానోపాధ్యాయులనుగా నేర్పఱిచిరి. మహారాజశ్రీ దాసరి రామన్న నాయఁడుగారు నెలకు నాలుగురూపాయల చొప్పునను, ద్రోణమురాజు కృష్ణయ్యగారు రెండురూపాయల చొప్పునను, గాదిరాజు ప్రకాశరావుగారు మొదలయినవారు రూపాయలచొప్పునను చందాలు వేసిరి. అప్పుడట్లు చందాలతో స్థాపింపబడిన యాబాలికా పాఠశాల తరువాత స్థానిక సంఘమువారి సంరక్షణమునకుఁ బాత్రమయి యిప్పటికిని నవిచ్ఛిన్నముగా జరుగుచున్నది. పురుషులలో సహితము విద్య యత్యల్పముగా నుండిన యాకాలములో నొక చిన్నగ్రామములోనివారు చందాలు వేసికొని పాఠశాలను స్థాపించిరనుట కొంత వింతగానే తోఁచవచ్చును. గాని సత్కృత్య ప్రభావమును దలఁచినప్పు డసాధ్య మేదియు లేదు.

స్త్రీవిద్యయొక్క యావశ్యకమును గూర్చియు బాలికాపాఠశాలాస్థాపనమును గూర్చియు మొదట సమకూర్పఁబడిన యాసభ లే తరువాత మతవిషయములును నీతివిషయములును దేశక్షేమాభివృద్ధులకు వలయు నితరవిషయములును మాటాడుచుండుటకై యొక స్థిరమయిన సమాజముగా నేర్పడి నే నక్కడ నున్నంతకాలమును ప్రతి భానువారమునాఁడును సభలు జరుగుచు వచ్చినవి.

నేనప్పుడు పద్యములను వచనమువలెనే యాశుధారగాఁ జెప్పఁ గలిగెడివాఁడను. అందుచేత ధవళేశ్వరములోని నామిత్రులు కొందఱు నష్టావధానము చేయవలసినదని కోరిరి. వారికోరిక నంగీకరించి నేను కాపురమున్న వీణమువారిలోపల నొకదినమున కతిపయమిత్ర బృందసమక్షమున అష్టావధానము చేసితిని. నాకది ప్రథమప్రయత్నమే యైనను, చూచినమిత్రుల కద్భుతప్రమోదములపాలుచేసినది. అష్టావధానవార్త నాఁడే గ్రామమునం దంతట వ్యాపింపగా, ఆ యూరనున్న యుద్యోగస్థులు మొదలయినవా రందఱును తమకుఁ దెలియనందునఁ దామాదినమునఁ జూడఁ దటస్థింప లేదనియు నింకొక సారి యష్టావధానమును బహిరంగస్థలములోఁ జేసి చూపవలసిన దనియు, నన్నుఁ బ్రార్థించిరి. వారిమాట తీసివేయలేక పయివారమున మాపాఠశాలామందిరమునఁ జేసెదనని చెప్పితిని. ఆసంగతి యెట్లో రాజమహేంద్రవరమువఱకును వ్యాపించి యప్పుడు (1874-వ సంవత్సరమున) నామిత్రులగు బ్రహ్మశ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారిచేత నిట్లుత్తరము వ్రాయించినది —

'సీ. రాజమాన్యులు మఱి రాజపూజితగుణు
లాంధ్రగీర్వాణకవితావిహార కందు
కూరి వీరేశలింగముగారి కడకు
లీల ధవళేశ్వరంబున స్కూలులోన.

క. అష్టావధాన మేమో
తుష్టిని మీ రందుఁ జేయుదురటంచును నా
యిష్టసఖునిచే వింటిని
స్పష్టముగాఁ దెలియఁ జేయవలయుం జుండీ.'

నేను సంస్కృతమునందుఁగూడ ననుష్టుప్శ్లోకములు చేయ నారంభించితిని గాని నాకా భాషయందలి పాండిత్య మత్యల్పమయినదని భావించి

తరువాత మానివేసితిని. ముందట మాయిరువురకును పద్యరూపము నను యుత్తరప్రత్యుత్తరములు నడచెడికాలములో నే నాయనకు వ్రాసిన యొక యుత్తరమునందు రెండు సంస్కృతశ్లోకములు చేసి వేసితందున పయిపద్యములోని భ్రమ యాయనకుఁ గలిగినది. నేను జేసిన సంస్కృతశ్లోకములు కొన్ని మద్విరచిత బ్రాహ్మవివాహము నం దున్నవి. చేసిన వాగ్దానప్రకారముగా నిర్ణయింపఁబడిన దినమున మాపాఠశాలామందిరమునం దష్టావధానమును మొదటిసారికంటె, గొంచెము హెచ్చుగాఁ జేసితిని. అప్పుడు చేసిన యవధానములివి—
1. కవిత్వము, 2 వ్యస్తాక్షరి, 3. నిషేధాక్షరి, 4. సమస్యాపూరణము, 5. చతురంగవినోదము, 6. చీట్లాట, 7. సంభాషణము, 8. పుష్పపరిగణనము. కవిత్వము పదిమందికి వారువారు కోరినపద్యములో కోరిన విషయమునుగూర్చి యొక్కొక్కయక్షరము చొప్పున విడిచిన యక్షరమును మరల నడుగకుండఁ జెప్పితిని. ఆంధ్రగీర్వాణభాషలలో ముప్పదిరెండేసి యక్షరములకు మించని పద్యభాగమును శ్లోకమును విడికాగితములమీఁద వ్రాయించి, అక్షరములపైని వరుసయంకెలు వేయించి కత్తిరించిన ముక్కలను కలిపివేసి కవిత్వము చెప్పునప్పుడు నడుమ నడుమ నేదో యొకముక్క నిచ్చుచురాఁగా కడపట నన్నిటిని జేర్చి మనసులో వరుసగా కూర్చుకొని వారిచ్చిన వాక్యములను జదివి రెండు భాషలలో వ్యస్తాక్షరి చెప్పితిని. చరణమొకటికి రెండేసితావులలో వారు నిషేధించిన యక్షరములు విడుచుచువచ్చి యొక్కొక్క యక్షరము చొప్పునఁ జెప్పి పద్యమును పూరించితిని. వారు సమస్యగా నిచ్చిన పద్యపాదమున కనుగుణముగా నర్థము వచ్చునట్లాలోచించి యష్టావధానమధ్యమున నొక్కొక్కచరణము చొప్పునఁ బద్యముచేసి సమాస్యాపూరణము గావించితిని. ఈనడుమనే యింకొకమిత్రునితో చతురంగ మాడుచుంటిని; నడుమనడుమ బంటునో మంత్రినో గుఱ్ఱమునో యేనుఁగునో రాజునో శకటమునో త్రోయుచు నేదో యొత్తు

వేయుచుండుటతప్ప చతురంగక్రీడయందు నా కేదియు కష్ట మగపడ లేదు. చీట్లాటయు నిట్టిదేగాని వచ్చినపట్లలోనిసంఖ్య లెక్క పెట్టుటలో నించుక కష్టమున్నది. నే నొక్కయాటలోను లెక్క తప్పఁబెట్ట లేదు గాని నాయెదుటిపక్షమువారు వినోదముచూచుసందడిలో లెక్క మఱచి పోవుచువచ్చిరి. మధ్యమధ్య జరిగిన సంభాషణములో నెదుటివా రడిగినప్రశ్నలకు నేను సదుత్తరము లిచ్చుచు వచ్చితిని. ఈపను లన్నియుఁ జేయుచుండిన కాలములో నే నావెనుక నొకరు కూరుచుండి నా వీఁపుమీఁద నప్పుడప్పు డొకపువ్వు వేయుచు రాఁగా, ఆపుష్పముల సంఖ్యయు సరిగానే చెప్పితిని. ఈపనియంతయు ముగియుటకు రెండు గంటలకాలము పట్టినది. అష్టావధానము చేయఁగలుగుట ధారణాశక్తి చేత ననుకొనక సామాన్యజనులు మంత్రశక్తియని భ్రమించి, కాదని నామిత్రులు చెప్పినను నమ్మక, నాకుచ్ఛిష్టగణపతి యుపాసన యున్న దని నేను గోఁచి పెట్టుకొంటినో లేదో యని నావెనుకకువచ్చి కొందఱు చూడసాగిరి. ఇది జరిగినతరువాత రాజమహేంద్రవరములోని మిత్రు లక్కడఁగూడఁ జేయవలసినదని నన్నడిగిరి. అందుచేత నేనొక భాను వారమునాఁడు రాజమహేంద్రవరమున విశాలమయిన మాయింటి చావడిలోనే యష్టావధానము చేసితిని. నే నష్టావధానము చేయుచు న్న వృత్తాంతము పట్టణములోఁ దెలిసి జనులు గుంపులుగుంపులుగా వచ్చి మూఁగఁ జొచ్చిరి. అప్పుడు తావు చాలక మావీధితలుపులు మూసివేయవలసివచ్చినది. అష్టావధానము ముగిసినతరువాత తలనొప్పి వచ్చి యారాత్రి నేనెంతో బాధపడితిని. ఊరక పామరుల వేడుక కొఱకుఁ దక్క దీనివలన లోకమునకుగాని నాకుఁగాని నిజమైన ప్రయోజనము లేదని భావించి, తరువాత నెంద ఱెన్నివిధములఁ బ్రార్థించినను మెదడునకు వేదనాకరమైన యష్టావధానమును మానితిని.

మా వివేకవర్ధని తన కాలుమాసములు వచ్చినది మొదలు గొప్పవారిలోని దుర్నీతిని మాన్పుటకయి ప్రయత్నింపనారంభించినది. అప్పుడు మా మండలన్యాయసభలో న్యాయవాదిగా నుండినవా రొక వేశ్యకు కన్నెఱికము చేయఁగా, వివేకవర్ధని దానిని ప్రకాశపఱిచి యాపురుషుని సిగ్గుపడునట్లు చేసినది. ఆరసికపురుషుఁ డప్పటి కేమియు చేయలేకపోయినను తన్నవమానపఱిచినందునకు మనస్సులో ద్వేషము వహించి పగ తీర్చుకొనుటకయి సమయముకొఱకు వేచియుండెను. అట్లు ప్రతీక్షించుచుండిన సమయము సహిత మాపయి నెలలోనే తటస్థించెను. యోగినిగాను భక్తురాలుగాను నుండి యొక సంపన్నగృహస్థునిచేత పూజింపఁబడుచుండిన యొకయామె తా నొక యేకాదశినాఁడు బొందెతో స్వర్గమునకుఁ బోయెదనని చెప్పి యానాటిరాత్రి యెవ్వరును జూడకుండఁ బోయి గోదావరిలోఁ బడఁబోయెను. మహానుభావులని పేరుపడయుటకయి కొందఱాత్మహత్యకయిన సాహసింతురు గదా. గోదావరియొడ్డున పడవమీఁదఁ గూర్చున్నయతఁ డొకఁడు చూచి యామెను బట్టుకొని లోఁతునీటిలోనుండి దరి కీడ్చుకొని వచ్చి యింటికడఁ జేర్చెను. ఈసంగతి నుపవిలేఖకుఁ డొకఁడు వివేకవర్ధనికి వ్రాసెను. ఆలేఖ ప్రకటింపఁబడఁగానే కన్నెఱికముచేఁ బ్రసిద్ధికెక్కిన మాన్యాయవాదిగా రాయోగినియందు భక్తితాత్పర్యములుగల పూర్వోక్తసంపన్నగృహస్థునిపక్షమున తమ కాయుపవిలేఖకుని పేరు వెంటనే తెలుపవలసిన దనియు లేనియెడల మానష్టమునకయి యభియోగము తేఁబడుననియు నాపేర వ్రాసిరి. ఉపవిలేఖకుని పేరు తెలుపుటకు వలనుపడదని బదులు వ్రాసి, అభియోగము తెచ్చెడుపక్షమున స్వసంరక్షణార్థమయి యావ్యవహారమును ఋజువుపఱుచుటకు వలయుసాక్ష్యమును సమకూర్చితిని. వ్యవహారమునకు దిగినయెడల సత్యము బయలఁబడునని భయపడి ప్రతిపక్షు లభియోగము లేక యూరకుండిరిగాని

తన్మూలమున ధవళేశ్వరములో నున్న యాసంపన్నగృహస్థుని మిత్రులకును నాకును వైమనస్యము సంభవించెను.

నేను ధవళేశ్వరములో నున్న కాలమునం దుండఁగా 1875వ సంవత్సరము జూలయి నెలలో బసవరాజు గవర్రాజుగారు రాజమహేంద్రవరమునుండి నాయొద్దకువచ్చి తాము నూతనముగా స్థాపింపఁబోవుచున్న 'రాజమహేంద్రవర దేశపాఠశాలాసమాజ' (Rajahmundry Provincial School Club) ప్రారంభదినమున నన్నక్కడకు రమ్మని యాహ్వానముచేసిరి. ఆయన రాజమహేంద్రవరములో మావీధినే నివసించువారయినను, మాయిరువుర పెద్దలకును మైత్రియు బాంధవమును గలిగియున్నను, వీధిలో నొండొరులను జూచుచుండుటయే కాని మా కంతగా పరిచితిలేదు. ఆప్రథమసందర్శనము మొదలుకొని మాయిరువురకును మైత్రి యారంభమై దినదినాభివృద్ధి నొందుచు రాఁగా, ఆయన యావజ్జీవనమును నాతోడి బద్ధసఖ్యము గలవారయి నేనుబూనిన సమస్తకార్యములయందును నాకు సహాయులయి నా కుడిభుజమువలె నుండెడివారు. ఆయన యప్పటికి ప్రథమశాస్త్రపరీక్షయందుఁ గృతార్థులయి యానూతనసమాజమునకు కార్యదర్శిత్వము వహించిరి. ఆసామాజికులయొక్క ముఖ్యోద్దేశములు నీతివిషయములనుగూర్చి ప్రసంగించుటయు నుపన్యసించుటయు తామాప్రకారముగా నడచుకొనుటయు నితరుల నారీతిని నడిపించుటయు నయి యున్నవి. నే నాసమాజములో నొక సామాజికుఁడనుగాఁ జేరి, 1875-వ సంవత్సరము ఆగష్టు నెల 15-వ తేదిని 'ఐక్యమత్యము' ను గూర్చి యుపన్యసించితిని. నాఁడు మొదలుకొని తప్పక ప్రతిభానువారమునాఁడును మధ్యాహ్నము మూఁడుగంటలకు ధవళేశ్వరమునుండి నాలుగుమైళ్ళు రాజమహేంద్రవరమునకు నడచిపోయి సాయంకాల మాఁడుగంటలకు సభ ముగిసినతరువాత మరల నొంటిగా ధవళేశ్వ

రతమునకు నడచిపోవుచుండెడివాఁడను. జనోపయుక్తములైన సభలన్ని నాకప్పుడంత యుత్సాహజనకములుగా నుండెడివి.

లౌక్యాధికారధూర్వహులయి యున్నవారి దుష్ప్రవర్తనములను వెల్లడిచేయుచు వచ్చుటచేత నాకు విరోధు లంతకంత కెక్కువఁ గాఁజొచ్చిరి. ఆకాలమునందు వేశ్యాప్రియులసంఖ్య మీర మిాఱి యుండెను. ఆవిషయమయి నేను పత్రికలో మొట్టమొదట పరుషము కాకుండ వ్రాసినదానిలోని కొన్నిపంక్తుల నిట నుదాహరించెదను జూడుఁడు—'ఈకాలమునను జారిణీసంభోగమే సత్కృత్యమని కొని యాడఁబడుచున్నది. కట్టుకొన్నయాలిని దుఃఖపెట్టి, పరాంగనలఁ గలియువారు గర్వణీయులుగా నెన్నఁబడుచున్నారు; మఱి లంజెలు లేనివారు పెద్దమనుష్యులే కారని గణింపఁబడుచున్నారు, మిామిక్కిలి యేకభార్యావ్రతస్థులు పురుషులే కారనియు, నపుంసకులనియుఁ బరిహసింపఁబడుచున్నారు. ఎల్లరచే గొప్పవారని గౌరవింపఁబడుచున్న ధనికులయిన యధికారస్థులే వేశ్యల కింటిబంటులయి, వారికి వశవర్తులయి, యాభోగముచానల నాశ్రయించినవారినే గారవించుచుండుటచేత నా ధనికుల యనుగ్రహము నపేక్షించి వారివలన బాగుపడఁదలఁచి యాశ్రయించుచున్న వారందఱును ఆచెడుపడఁతుకలయుడుగులకు మడుగులొత్తవలసినవారుగా నున్నారు'—ఈవ్రాఁత యిప్పుడు కొందఱి కతిశయోక్తిగా తోఁచవచ్చునేమోకాని యప్పుడది మారాజమహేంద్రవర విషయమున స్వభావోక్తి యగుట కణుమాత్రమును సందేహము లేదు. అప్పటి వేశ్యావలంబులగు మహాపురుషుల నిచ్చటఁ బేర్కొనుట యనావశ్యకము. అప్పుడు న్యాయాధిపత్యము మొదలగు మహోన్నతపదములయందున్న మనవారందఱు నించుమించుగా వేశ్యాదర పరాయణులయియుండిరని చెప్పుటయే మనప్రస్తుతాంశము నకుఁ జాలియుండును. లౌక్యాధికారధురీణులయి యున్నవారితో పని

లేనివా రెవ్వరో కాని యుండరు. ఆయధికారులయిండ్లకు స్వకార్యా ర్థము పోయినప్పుడు వేశ్యల నుంచుకొన్నవారి కెక్కువ గౌరవము; ఉంచుకొనివారికి తక్కువ గౌరవము. న్యాయసభలలో సహితము వారకాంతావల్లభులైన న్యాయవాదులవాదమునం దాదరము; కేవల కులకాంతవల్లభులైన న్యాయవాదుల వాదమునం దనాదరము. అందు చేత ప్రభుసన్మానముచే ధనార్జనముచేయ నపేక్షించిన న్యాయవాదు లనేకులు వేశ్యలను జేరదీయవలసినవారయిరి. కొన్ని సమయముల యం దీయధికారులే శ్లాఘనపూర్వకముగా నొక్కొక్క వేశ్య నొక్కొక్క న్యాయవాది కనుగ్రహించుచు వచ్చిరి. అందుచేత మా రాజమహేంద్రవరములోనున్న వేశ్యలు చాలకపోఁగా, పడుపుపడఁతుల కయి ప్రసిద్ధిపడసిన రామచంద్రపురము మొదలైన గ్రామములనుండి క్రొత్తవేశ్యలు రప్పింపఁబడిరి. ఆ కాలమునందు రాజమహేంద్రవర ములో పాఠశాల యనఁగా వేశ్యల చదువుకూట మనియే యర్థము. వేశ్యల నృత్యగీతాదులకై పెట్టింపబడిన పాఠశాల లప్పు డాపురమునం దెన్నియోయుండెను. వేదపాఠశాలలకును శాస్త్రపాఠశాలలకును చిల్లి గవ్వ యియ్యనొల్లని శుద్ధశ్రోత్రియులు సహిత మధికారుల మెప్పున కయి యీవేశ్యలపాఠశాలలకు నెల కయిదులు పదులు రూపాయలు చందా లిచ్చుచుండిరి. ఈ భోగముమేళములు తమతమ పేరులతో వ్యవహరింపబడక - నాయుడుగారిమేళము, పంతులుగారి మేళము, శాస్త్రిగారి మేళము అని పిలువఁ బడుచుండెను. ఎవ్వరియింటనైన శుభకార్యము వచ్చినపక్షమున, ఈ ప్రముఖులు తమ తమ మేళము లను బెట్టవలసినదని సందేశములను బంపుచుండిరి. పత్రికావిలేఖత్వము పైని బడినందున, ఇట్టి బలవంతుల కప్రియముగా నీదుర్వ్యాపార మును గూర్చి పలుమాఱు వ్రాయవలసివచ్చినది. కొన్నిసమయముల యం దాప్రముఖులు దురాగ్రహావేశపరవశులయి పత్రికను గొనవల-

దని చందాదారులతోఁ జెప్పియు, దూషణోక్తులు పలికియు, నన్నేమో చేసెదమనియు చేయించెదమనియు బెదరించియు నానావిధముల నన్ను నాపూనికనుండి మరలింపఁ జూచిరి గాని యీశ్వరానుగ్రహమువలన వారికోరికలు సఫలములయినవి కావు. ఒక్కటి తక్క వేశ్యలపాఠశాలలన్నియు నల్పకాలములోనే తీసివేయఁబడినవి. దురభిమానముచేత నిలువఁబడిన యాయొక్కపాఠశాలయు వేశ్యలమూలమున దదభిమానికి సంభవించిన యాపదవలన నశించినది. పొరుగూళ్ళనుండి వచ్చిన వేశ్యలు తమప్రవాసక్లేశమును విడిచి మరల స్వగ్రామములకుఁ బోయి సుఖింపవలసినవారయిరి. ఇట్లు దుర్బలునిచే నవలంబింపబడిన దయ్యా ధర్మమే కడపట జయమునొందినను, వేశ్యావలంబులకు నా పయిని గలిగిన కోపము మాత్ర మంతశీఘ్రముగా పోలేదు. అప్పుడు నా కెవ్వరికోపమును గణనచేయ నక్కఱలేని స్వతంత్రస్థితియుండుండవలె నన్నచింత దృఢముగాఁ గలిగెను. ఉపాధ్యాయత్వము సాధారణముగా స్వతంత్రత కలదే యయినను, స్వదేశస్థులు పాఠశాలాకార్యనిర్వాహకులై యున్నప్పు డదియుఁ బరతంత్రమైనదనియె నాకభిప్రాయము కలిగెను. అందుచేత నుపాధ్యాయత్వమును సహితము విడిచి, పత్రికను నిర్వహించుచు గ్రంథకర్తనయి స్వతంత్రుఁడను గావలెనన్న బుద్ధి నాకప్పు డుదయించెను.

పత్రికాధిపత్యమువలన స్వతంత్రజీవనము చేయఁదగినంత ధనాగమము కలుగునని నా కప్పుడును నమ్మకములేదు. నాగ్రంథములను పత్రికావిలేఖకులు మొదలైనవారు శ్లాఘించుచు వచ్చుటచేతను, నేను రచించిన పుస్తకములను బహుపాఠశాలలలో పాఠపుస్తకములనుగాఁ బెట్టుటచేతను, గ్రంథకర్తృత్వమువలన స్వతంత్రజీవనోపాయము కలుగునన్న ధైర్యము కలిగినది. నావ్యాకరణమువలన రెండుమూడు మాసములలో నిన్నూఱు రూపాయిలు వచ్చినవి; నా నీతిచంద్రిక

విగ్రహతంత్రము వలన వేయిరూపాయలు వచ్చినవి. అయినను పత్రికను విడువవలెనన్న బుద్ధి నాకెప్పుడును పుట్టలేదు. పత్రికా ప్రకటనమునకును గ్రంథముద్రణమునకును వలయు ముద్రాయంత్రమును నెలకొల్పవలయునన్న యభిలాషము నాకు విశేషముగా నుండెను. నామిత్రులైన చల్లపల్లి బాపయ్యపంతులుగారును నేనును గలిసి నూఱేసిరూపాయల చొప్పున భాగము లేర్పఱిచి ముద్రాయంత్రమును దెప్పింపవలెనని ప్రయత్నించి ప్రకటనపత్రికలను ముద్రింపించి ప్రచురించితిమి కాని భాగస్థులు తగినంతమంది చేరలేదు. ధవళేశ్వరములో నుండగా మున్నూటయేఁబదేసి రూపాయలచొప్పున నాలుభాగములు వేసికొని ముద్రాయంత్రమును రాజమహేంద్రవరమునఁ బ్రతిష్ఠింపవలెనని మరలఁ బ్రయత్నించితిమి. ఈప్రయత్నము నామిత్రులైన చల్లపల్లి రంగయ్యపంతులవారి ప్రోత్సాహమువలన నెఱవేఱినది. అందులో నేనొక భాగస్థుడనయి నాసహపాఠియు మిత్రుఁడును లక్కవరపు సంస్థానాధిపతియు నైన శ్రీరాజా మంత్రిప్రగడ దుర్గామల్లికార్జున ప్రసాదరావుబహద్దరుగారి నొకభాగస్థునిగాఁ జేర్చితిని. రంగయ్యపంతులుగారు తమయన్నగారైన రామబ్రహ్మముగారిని, సరిపల్లె గోపాలకృష్ణమ్మగారిని, నాళము కామరాజగారిని, పందిరి మహాదేవుడుగారిని, భాగస్థులనుగాఁ జేర్చిరి. ఇట్లు భాగస్థులేర్పడిన తరువాత వేసవికాలపు సెలవులలో నేనొకసారి చెన్నపట్టణమునకుఁ బోయితిని. నేను నీతిచంద్రిక విగ్రహతంత్రమును రచించుటచేత మిక్కిలి సంతుష్టులైన శ్రీమాన్ బహుజనపల్లి సీతారామాచార్యులవారు మొదలైన పండితులు నన్ను మిక్కిలి యాదరించి, నాకయిన వ్యయముల నన్నిటిని దామే భరించి, ఒకనాఁడు సభచేసి నాఛాయాప్రతిమను దీయించి నాకొక వెండిపాత్రమును బహుమానముచేసిరి. నేనిప్పుడు మంచినీరు త్రాగుట కుపయోగించునది యిప్పుడు వారిచ్చిన రజతపాత్రమే. నేను చెన్నపురిలో నున్నకాలములో

గారు నాయుపచారము నిమిత్తమయి బ్రహ్మశ్రీ మన్నవ బుచ్చయ్య పంతులుగారిని నా కప్పగించిరి. అప్పటినుండి నాకాయనతోడి మైత్రి కలిగి నానాఁట వర్ధిల్లినది. పచ్చప్పగారి శాస్త్రపాఠశాలలో తెలుఁగు పండితులుగా నున్న మ. రా. శ్రీ కార్నంచి సుబ్బరాయలునాయఁడు గారు నాకుఁ జెన్నపురిలోఁ గావలసినవన్నియుఁ గొనిపంపుచుండుటకు వాగ్దానము చేసిరి. నేను మరల ధవళేశ్వరమునకు వచ్చిన తరువాత ముద్రాయంత్రమును ముద్రాక్షరములను గొనుటలోను పనివాండ్రను కుదిర్చి పంపుటలోను నా కాయనే సర్వవిధములఁ దోడుపడెను. స్వతంత్రుఁడనుగా నుండవలెనన్న యభిలాషముచేతను, పాఠశాలా కార్యనిర్వాహక సభ్యులలో నొకరికిని నాకును వైమనస్యముకలుగుటచేతను, మఱికొన్ని కారణములచేతను, నేనుధవళేశ్వరములోని యుపాధ్యాయత్వమును మానుకొని 1876-వ సంవత్సరారంభమున స్వస్థలమగు రాజమహేంద్రవరమునఁ బ్రవేశించితిని.

నేను రాజమహేంద్రవరమునకు రాకమునుపే ముద్రాయంత్రము వచ్చియున్నను, అక్షరములు మొదలగునవి నేను వచ్చిన కొలఁదికాలమునకుఁగాని రాలేదు. అక్షరములు రాఁగానే యేప్రిల్ నెలమధ్యనుండి పని మొదలుపెట్టి మాయింటనే నెలకొల్పఁబడిన స్వీయముద్రాయంత్రమునందే వివేకవర్ధనిని ముద్రింప నారంభించితిమి. మాభాగస్వాము లొక్కొక్కరిచ్చిన మున్నూటయేఁబదేసి రూపాయలును చాలకపోయినందున, ముద్రాయంత్రపరికరములుఁగొనుటకయి నేనియ్యవలసినదానికంటెనూఱురూపాయలను మొదటనే హెచ్చుగా నిచ్చితిని. ముద్రాయంత్రకార్యనిర్వాహకత్వమును నేను వహించి పని చేయుటకును, నేను పడిన శ్రమనిమిత్తమయి వచ్చిన యాయములో ఎనిమిదవపాలు నేనుపుచ్చుకొనుటకును, వచ్చెడు చందాధనము వివేకవర్ధనీ పత్రికావ్యయములకు చాలకపోయెడుపక్షమున శేషమును

ముద్రాయంత్రాదాయము నుండి పెట్టుటకును, పనివాండ్రజీతములు మొదలైనవ్యయములుపోఁగా మిగిలినలాభమును భాగస్థులాయుగురును సమముగా పంచుకొనుటకును, మొట్టమొదట మాలో మేమేర్పాటు చేసికొంటిమి. అయినను మే మనుకొన్నట్టుగా ముద్రాయంత్రము వలన లాభము రాలేదు. వచ్చిన యాయమును వివేకవర్ధనికి వచ్చిన చందాలమొత్తమును గలిపినను పనివాండ్రజీతముల కేచాలియుచాలక యుండెను. ఒక్కొక్క నెలలో మాచేతిసొమ్ముసహిత మిచ్చుకోవలసి వచ్చుచుండెను. అప్పుడు స్థలనిధిసంఘముల వారియొక్కయు పురపారిశుద్ధ్య విచారణసంఘములవారి యొక్కయు అచ్చుపనులన్నియు దొరతనమువారి ముద్రాయంత్రములోనే జరుగవలసియుండుటచేత మాకాపని యేదియు రాలేదు. ఇతరులును వివాహాదులయందు శుభలేఖలు వేయించుకొనుటతప్ప మాకు వేఱుపని యేదియు నియ్యలేదు. అయినను వివేకవర్ధనిని ముద్రించుకొనుట కానుకూల్య మధికముగాఁ గలిగినందున నాకదియే లాభముగానుండెను. ఆరంభదశలో భాగస్థులందఱునుగూడి రెండుసారులు లెక్కలుచూచుకొనిరిగాని లాభములేక చేతిసొమ్మే తగులుచున్నట్టు కనఁబడినందునఁ దామేమైన మరల నిచ్చుకోవలసివచ్చునని తరువాత వారుపేక్షించి యూరకుండుచు వచ్చిరి. నేనువివేకవర్ధనిని బ్రకటింపఁజొచ్చినపిమ్మట నరసాపురములో నామిత్రులగు మీరా్ షుజాయతల్లీఖాన్ సాహేబుగారు 'విద్వన్మనోహారిణి' యను తెలుఁగుమాసపత్రికను బ్రకటింప నారంభించిరి. మాయచ్చుపురకు 1874వ సంవత్సరాంతమునుండి మైత్రియారంభమై యంతకంతకు వృద్ధినొందెను. శ్రీవివేకవర్ధని నొకసంవత్సరము నడిపినతరువాత విద్వన్మనోహారిణి దానితోఁ గలిపివేసి, వివేకవర్ధనిలో నింగ్లీషుకూడఁ జేర్చి యింగ్లీషుభాగ మా యనవ్రాయుచుండుటకును తెలుఁగుభాగము నేనువ్రాయుచుండుటకును ఏర్పాటు చేసికొంటిమి.

వారు నాయుపచారము నిమిత్తమయి బ్రహ్మశ్రీ మన్నవ బుచ్చయ్య పంతులుగారిని నా కప్పగించిరి. అప్పటినుండి నాకాయనతోడి మైత్రి కలిగి నానాఁట వర్ధిల్లినది. పచ్చప్పగారి శాస్త్రపాఠశాలలో తెలుఁగు పండితుగా నున్న మ. రా. శ్రీ కార్నంచి సుబ్బరాయలునాయఁడు గారు నాకుఁ జెన్నపురిలోఁ గావలసినవన్నియుఁ గొనిపంపుచుండు టకు వాగ్దానము చేసిరి. నేను మరల ధవళేశ్వరమునకు వచ్చిన తరు వాత ముద్రాయంత్రమును ముద్రాక్షరములను గొనుటలోను పనివాం డ్రను కుదిర్చి పంపుటలోను నా కాయనే సర్వవిధములఁ దోడుపడెను. స్వతంత్రుఁడనుగా నుండవలెనన్న యభిలాషముచేతను, పాఠశాలా కార్యనిర్వాహక సభ్యులలో నొకరికిని నాకును వైమనస్యముకలుగుట చేతను, మఱికొన్ని కారణములచేతను, నేనుధవళేశ్వరములోని యుపా ధ్యాయత్వమును మానుకొని 1876-వ సంవత్సరారంభమున స్వస్థల మగు రాజమహేంద్రవరమునఁ బ్రవేశించితిని.

నేను రాజమహేంద్రవరమునకు రాకమునుపే ముద్రాయంత్రము వచ్చియున్నను, అక్షరములు మొదలగునవి నేను వచ్చిన కొంతకాల మునకుఁగాని రాలేదు. అక్షరములు రాఁగానే యేప్రిల్ నెలమధ్యనుండి పని మొదలుపెట్టి మాయింటనే నెలకొల్పఁబడిన స్వీయముద్రాయం త్రమునందే వివేకవర్ధనిని ముద్రింపింప నారంభించితిమి. మాభాగ స్వామి లోకొక్కరిచ్చిన మున్నూటయేఁబదేసి రూపాయలును చాలకపోయినందున, ముద్రాయంత్రపరికరములుకొనుటకయి నేనియ్య వలసినదానికంటెనూఱురూపాయలను మొదటనే హెచ్చుగా నిచ్చి తిని. ముద్రాయంత్రకార్యనిర్వాహకత్వమును నేను వహించి పని చేయుటకును, నేను పడిన శ్రమనిమిత్తమయి వచ్చిన యాయములో నివిమిందవపాలు నేనుపుచ్చుకొనుటకును, వచ్చెడు చందాధనము వివేక వర్ధనీ పత్రికావ్యయములకు చాలకపోయెడుపక్షమున శేషమును

ముద్రాయంత్రాదాయము నుండి పెట్టుటకును, పనివాండ్రజీతములు మొదలైనవ్యయములుపోఁగా మిగిలినలాభమును భాగస్థులాఱుగురును సమముగా పంచుకొనుటకును, మొట్టమొదట మాలో మేమేర్పాటు చేసికొంటిమి. అయినను మే మనుకొన్నట్టుగా ముద్రాయంత్రము వలన లాభము రాలేదు. వచ్చిన యాయమును వివేకవర్ధనికి వచ్చిన చందాలమొత్తమును గలిపినను పనివాండ్రజీతములకే చాలియుచాలక యుండెను. ఒక్కొక్క నెలలో మా చేతిసొమ్ముసహిత మిచ్చుకోవలసి వచ్చుచుండెను. అప్పుడు స్థలనిధిసంఘముల వారియొక్కయు పురపారిశుద్ధ్య విచారణసంఘములవారి యొక్కయు అచ్చుపనులన్నియు దొరతనమువారి ముద్రాయంత్రములోనే జరుగవలసియుండుటచేత మాకాపని యేదియు రాలేదు. ఇతరులును వివాహాదులయందు శుభలేఖలు వేయించుకొనుటతప్ప మాకు వేఱుపని యేదియు నియ్యలేదు. అయినను వివేకవర్ధనిని ముద్రించుకొనుట కానుకూల్య మధికముగాఁ గలిగినందున నాకదియే లాభముగానుండెను. ఆరంభదశలో భాగస్థులందఱునుగూడి రెండుసారులు లెక్కలుచూచుకొనిరిగాని లాభములేక చేతిసొమ్మే తగులుచున్నట్టు కనఁబడినందునఁ దామేమైన మరల నిచ్చుకోవలసివచ్చునని తరువాత వారుపేక్షించి యూరకుండుచు వచ్చిరి. నేనువివేకవర్ధనిని బ్రకటింపఁజొచ్చినపిమ్మట నరసాపురములో నామిత్రులగు మీర్ షుజాయతల్లీఖాన్ సాహేబుగారు 'విద్వన్మనోహారిణి' యను తెలుఁగుమాసపత్రికను బ్రకటింప నారంభించిరి. మాయిరువురకు 1874వ సంవత్సరాంతమునుండి మైత్రియారంభమై యంతకంతకు వృద్ధినొందెను. శ్రీవివేకవర్ధని నొకసంవత్సరము నడిపినతరువాత విద్వన్మనోహారిణి దానితోఁ గలిపివేసి, వివేకవర్ధనిలో నింగ్లీషుకూడఁ నింగ్లీషుభాగ మా యన వ్రాయుచుండుటకును తెలుఁగుభాగము నేనువ్రాయుచుండుటకును ఏర్పాటు చేసికొంటిమి.

1876-వ సంవత్సరమధ్యమున [జూలయి నెల] నుండి వివేకవర్ధనిని పక్షపత్రికను జేసినడపఁజొచ్చితిని. ఆ నెలలోనె 'హాస్యసంజీవని' యను పేర హాస్యరసప్రధానమైన యొకమాసపత్రికనుఁగూడ వివేకవర్ధని కనుబంధముగాఁ బ్రచురింప నారంభించితిని. బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులువారికిని నాకును వాగ్వాదము ముదిరి యన్యోన్యదూషణముక్రింద దిగెనని యీవఱకే చెప్పితినిగదా. ఆయన పూర్వనాగరికుఁడును, నేనునవనాగరికుఁడను అగుటతప్ప మాయిరువురకును వివాదకారణము వేఱేదియు లేదు. వివేకవర్ధని యంతకంతకువృద్ధియై దేశాభివృద్ధికి భంగకరములైనపూర్వాచారములను పూర్వపక్షముచేయుచు, దేశాభివృద్ధికరములైననూతనాచారములను సిద్ధాంతముచేయఁగడఁగినది ఆపనిని పూర్వాచారపరాయణులైనవారి కెవ్వరికిని దుస్సహముగా నుండకపోదు. అట్లయినప్పుడు పూర్వాచారస్థాపనదీక్షాదక్షులలో నెల్లనగ్రగణ్యులై యపూర్వపత్రికానిశితాసిపుత్రికను చేత ధరించియున్న పంతులవారికి నాపత్రికను రూపు మాపఁ దలంపుగలుగుట వింత కాదు. మా పట్టణములోని ప్రముఖులు ప్రయత్నించి విడిచిపెట్టిన యాపనిని పంతులవారు దూరమునుండి నిర్వహింపఁ బూని వివేకవర్ధనిని పరిహసించి తలకొట్లు కలిగించుటకై 'హాస్యవర్ధని' యను నామధేయముతో నొక మాసపత్రికను సంజీవని కనుబంధముగా 1875 వ సంవత్సరాంతమున వెలువఱిచి పంపిరి. ఆపత్రికాముఖపత్రముపైని దంతిముఖుఁడై విఘ్నేశ్వరుఁ డిరుపార్శ్వములయందును మూషకములు తన్ను సేవింప నిలుచుండి తాండవమాడుచుండెను. మా వివేకవర్ధని వారిసంజీవని కంటె వయస్సున చిన్నదగుటచేత బాల్యచాపల్యమును బూని సాహసముచేసి చలింపక తానును పౌరుషముచూప నుపక్రమించెను. అందుచేత 'హాస్యవర్ధని'తోఁ బ్రతిఘటించి పోరాడుటకొఱకయి యాంధ్రభాషాసంజీవనికి విరోధముగా నప్పు డుదయించిన పత్రికాపుత్రికయే

యాహాస్యసంజీవని. హాస్యసంజీవనిలో 'కోదుభాషా సంజీవని' యను భాగ మొకటికూడ నుండెను. కోదులనఁగా కొండలయందు వసించెడు భిల్లులవంటి యనాగరికులైన యొకజాతి కొండవాండ్రు. ఈపత్రికా ముఖపత్రముపైని సింహాముఖుఁడై విఘ్నేశ్వరుఁ డిరుపార్శ్వముల యందును మార్జాలములు తన్ను సేవింప నిలుచుండి తాండవమాడు చుండెను. ఆవిగ్రహాముక్రిందఁ గూర్పఁబడిన శ్లోక మిది :—

'శ్లో. సింహావక్త్రం మహాకాయం, విఘ్నేశ్వరవరాధిపమ్
పశ్య సంజీవనీనాథం, మార్జాలయుగళాశ్రితమ్.'

నా బ్రాహ్మవివాహ మీపత్రికయందే ప్రథమమున వెలువడ నారంభించెను. అట్టి వ్రాత కదియే తెలుఁగుభాషయందు మొదలగుటచేత నాదినములయం దెక్కడఁ జూచినను మూఁకలుగట్టిజనులు హాస్యసంజీవనిని ముఖ్యముగా నందులో బ్రాహ్మవివాహమును జదివి యానందించుచు వచ్చిరి. రెండేండ్లకుఁ దరువాత నేనొకసారి బందరు పురమునకుఁ బోయినప్పు డొకబ్రాహ్మణబాలిక బ్రాహ్మవివాహమును మొదటినుండి తుదవఱకును నప్పగించి నాకాశ్చర్యము కలిగించినది. తన రెండవయేట హాస్యవర్ధని యదృశ్యముకాఁగా మా హాస్యసంజీవనియు పుస్తకరూపమున నదృశ్యమై వివేకవర్ధనిలో నంతర్భాగముగాఁ బ్రవేశించి దురాచారదుర్నీతిభంజనమున నెంతో పనిచేసినది. ఈయుపకారమునకు హేతుభూతులు శ్రీపంతులువారేయైనందున నేను వారికిఁ గృతజ్ఞతాపూర్వకములైన యభివందనశతము లర్పించుచున్నాను. ఆంధ్రభాషాసంజీవనిలోని పూర్వాచారపోషకవ్యాసముల హేతుదార్బల్యమును ప్రకాశముచేయుట కనఁగా 'స్త్రీలకు విద్య కూడదు' అను నిట్టివ్యాసము లాపత్రికయందు పొడచూపఁగానే తోడనే తత్ఖండనముగా నందలియుక్తులనే గైకొని 'పురుషులకు విద్య

కూడదు' అను నిట్టివ్యాసములను వ్రాసి మొదటిదానియందలి హేత్వాభాసములను లోకమునకుఁ బ్రకాశముచేయుట కోదుభాషా సంజీవనియొక్క పనిగా నుండెను. స్త్రీలకు విద్య కూడదన్న దానికి ప్రతిగాఁ బ్రకటింపఁబడిన యొక చిన్నవ్యాసమును చూడుఁడు:—

'పురుషులకు విద్యకూడదు —| మాపూర్వు లెప్పుడున్నూ విద్య చదువుకోలేదు. కాఁబట్టి విద్యాభ్యాసము పూర్వాచార విరుద్ధము. పూర్వాచారవిరుద్ధమైన పని యెన్నటికిన్ని చెయ్యరాదు. యుక్తిచేత చూచినా, విద్య నేర్చుకోవడంవల్ల చాలా నష్టాలు కనఁబడుతూవున్నవి. ఇప్పుడు కోర్టులలోపుట్టే తప్పుదస్తావేజులున్నూ దొంగపత్రములున్నూ చదువుమూలంగానేకదా పుట్టుతూవున్నవి. ఎవరూ చదువుకోని పక్షమున తప్పుదస్తావేజు లేలాగుపుట్టునో బుద్ధిమంతుల కందఱకూ తెలుసును. కాఁబట్టి మేము యీ విషయములో విస్తరించి వ్రాయవలసిన పనిలేదు. ఈవొక్కదృష్టాంతమే పురుషులకు విద్య కూడదనుటకు చాలినంత ప్రబలయుక్తిగానున్నది. విద్య చదువుకోవడంవల్ల ప్రయోజనమేమి ? పూర్వకాలపువారందరూ విద్యచదువుకోకపోయినందుచేత చచ్చిపోయినారా ? చదువుకోకపోతే జీవనం జరుగదా ? కాలుమీఁద కాలువేసుకొని కలిగిన మాత్రంలో సుఖంగా కాలక్షేపం చెయ్యలేక, తీరికూర్చుండి విద్యపేరు పెట్టుకొని వృథాగా శ్రమపడడం యెందుకు ? దొరతనంవారు మనగ్రామాలలో బళ్లు పెట్టించి పిల్లవాళ్ళను పాడుచేస్తూయుండగా దేశాభిమానంగల వారందఱూ చూస్తూ వూరుకోవడం న్యాయమా ? దొరతనంవారికి అందరూ చేరి మాకు విద్యవద్దని మహాజరు అర్జీలను పంపించుకోరాదా ? పెద్దలందఱూ సభచేరి, మనశిష్టాచారానికి విరోధంగా చదువుకొనేవారిని వెలివేస్తామని గట్టిగా కట్టుదిట్టములు యేర్పఱిచి విద్యమాన్పరాదా ? ఇంగ్లీషువారు చదువుకొని బాగుపడలేదా అంటారేమో, వారు తెల్లని

వారు; మనము నల్లనివాళ్ళము. మనకు విద్యయెందుకు ? హిందువు లందరూ చదువుకోవడం లేదా అంటే, వారికీ మనకూ చాలా భేదం వున్నది. వారు గ్రామాలలో వుండేవారు; మనము కొండలలో వుండే వాళ్ళము. కాఁబట్టి మనకు చదువు పనికిరాదు. పూర్వపువాళ్ళు యీ మాత్రం యెరగకనే విద్యమానివేసినారా ? వారికంటె యిప్పటివాళ్లు మహాబుద్ధిమంతులా ? ఇటువంటివిపరీతబుద్ధులు పుట్టుచున్నవిగనుకనే యీ కాలపువాళ్ళందరూ అల్పాయుష్మంతులుగా వుంటూవున్నారు.'

నేను ధవళేశ్వరమును విడిచి వచ్చినతరువాత మరలఁ బనిలోఁ బ్రవేశింపవలెనన్న యుద్దేశము లేకపోయినను, 1876–వ సంవత్సరము నవంబరు నెల మొదటితేదిని రాజమహేంద్రవరమునందలి రాజకీయ శాస్త్రపాఠశాలలో నెలకిరువదియైదు రూపాయలజీతముగల యాంధ్ర ద్వితీయోపాధ్యాయపదమునందుఁ గుదురవలసినవాఁడ నైతిని. మొట్ట మొదట నాకీపనిని దయచేసెద మని మెట్కాఫుదొరగారు మహా రాజశ్రీ, ఫారసీ శ్రీనివాసరావు పంతులుగారిచేత వర్తమానము పంపి నప్పుడు నాకక్కఱలేదని నిరాకరించితిని. ఈసంగతి తెలిసి నా బంధువు లును మిత్రులును నన్ను చీవాట్లుపెట్టి, స్వస్థలములోనున్న యాపని కొప్పుకొమ్మని బలవంతపెట్టిరి. తరువాత వారిహితబోధ యుక్తమయి నదని భావించి, పనియిచ్చెదమన్నప్పుడు వలదని నిరాకరించిన నేనే మరలఁబోయి యాపనిని నాకీయవలసినదని ప్రార్థించితిని. నాప్రార్థన యంగీకరింపఁబడినది. అప్పు డా పాఠశాలలో ప్రథమశాస్త్రపరీక్షతర గతి మాత్రమేయుండెను. నేను పనిలోఁ బ్రవేశించిన తరువాత రెండు మాసములకు 1877–వ సంవత్సరారంభమునందు మాపాఠశాలలో పట్టపరీక్షతరగతికూడ పెట్టఁబడెను. నాయుపాధ్యాయత్వమునుగూర్చి నేను జెప్పవలసిన దేదియులేదు. నాకప్పుడు పలువురు శ్రోత్రమిత్రు లుండిరి. ఇదివఱకున్నవారు గాక పత్రికా నిర్వహణాదికమునందు నాకు

నూతనముగా మిత్రులైన బుర్రా రాజలింగముశాస్త్రిగారును, తోడు పడఁదొడఁగిరి. నాబాల్యసఖులైన చల్లపల్లి బాపయ్యపంతులుగారును, ధవళేశ్వరములో నున్న కాలములో మిత్రులైన బసవరాజు గవర్రాజు గారును ధవళేశ్వరములోనున్నప్పుడు నాయొద్దకుఁ దఱచుగా వచ్చుచు నాతో మైత్రినాటించిన యేలూరి లక్ష్మీనరసింహముగారును, నా కాప్తులును పత్రికా నిర్వాహణమునందు సహాయులు నగుచుండిరి. విశాఖపట్టణమండలమునుండి క్రొత్తగావచ్చి మామండల న్యాయ సభలో న్యాయవాదులైన చిట్టావఝ్ఝల యజ్ఞన్నశాస్త్రిగారును నాకు మిత్రులయి పత్రిక కెప్పుడైన వ్రాయుచుండెడివారు. నాకు మిత్రు లనేకులున్నను, ఒక్కపాఠశాలలో నుండుటచేత నేనును బసవరాజు గవర్రాజుగారును, బుర్రా రాజలింగముశాస్త్రిగారును ఏలూరి లక్ష్మీ నరసింహముగారును సదా కలసిమెలసియుండి యత్యంత మైత్రిగల వారమయి పత్రికలో వ్రాయు విషయములను గూర్చియు మాన్ప వలసిన దురాచారములను గూర్చియు నాలోచించుకొనుచుండెడి వారము. ఈ నలుగురిలోను నేను నాయకుఁడను. వారిలో నిరువురు కొంతకాల ముపాధ్యాయులుగా నుండినను, అప్పుడు తక్కిన మువ్వు రును విద్యార్థులుగాను నే నొక్కఁడనే యుపాధ్యాయుఁడుగాను ఉంటిమి. పత్రికలో మేము వ్రాసిన దానివలన మనసు నొచ్చినవా రందఱును మమ్ము దుష్టచతుష్టయమని పిలుచుచువచ్చిరి. ఆకాలము నందు మా వివేకవర్ధని చేసినపనుల నన్నిటిని వివరింపఁ బూనినచోఁ బుస్తకములు నిండవలసియుండును. కాఁబట్టి వానినన్నిటిని విడిచిపెట్టి వానిలోని రెండుమూఁడు ముఖ్యాంశములను మాత్ర మిం దుదాహ రించెదను.

వసూళ్ళువేయుట యనఁగా వివాహాదిశుభకార్యములయం దాహూతులయి చూడవచ్చిన పెద్దమనుష్యులందఱును భోగముమేళ మునకు రూపాయను తప్పకుండ నొసఁగు లోసఁగెడియాచార

మా కాలమునందు మా ప్రాంతములలో సర్వసాధారణమై యుండెను. ఎవ్వరయినను తాంబూలములకు వచ్చినవారు వేశ్యల కొసఁగులు వేయకుండుట యెంతో యవమానకరముగా నుండుచుండెను. కాఁబట్టి పెద్దకుటుంబమును భరింపవలసినవాఁడయి రిక్తుఁడుగా నున్నవాఁడు సహిత కొంత తక్కువ జీతములో నున్నను చెంబో ముంతో తాకట్టు పెట్టి యప్పుచేసి తెచ్చియైనను రూపాయకు తక్కువ కాకుండ భోగము మేళమునకు తప్పక ముడుపు చెల్లించి రావలెను. కొందఱో కానొకప్పుడు వేశ్యలకొసఁగులు సమర్పింపశక్తులుగాక యేవో సాకులుపెట్టి మిత్రబంధుబృందముల మందిరములకు శుభకార్యములకుఁ బోవక తప్పించుకోఁగలిగినను, అట్టివారు సహితము తప్పించుకో శక్తులుగాక యధికారపిశాచావేశమత్తు లయినవారియిండ్లకు తప్పకపోయి వేశ్యలకు కట్నములను సమర్పించి రావలసినవారుగా నుండిరి. పిలిచినప్పుడధికారులయిండ్లకుఁ బోనిపక్షమున సన్నగాండ్రు కాబలవంతులముందఱ గ్రామములో కాఁపురము చేయుటయే దుర్ఘటముగా నుండెను. అది యెట్లుండు రేమో వినుఁడు. ఆ కాలమునందు మాపట్టణమునందే యొక దండవిధాయి యుండెను. అతఁడేవేవో మిషలు కల్పించి నెలకు రెండు సారులైన తనయింట భోగముమేళములు పెట్టి గానవినోదము ననుభవించుటకై యూరనున్న వారి నందఱి నాహ్వానముచేయుచుండెడివాఁడు కాఁడు. ఆసభల కెవ్వరైనను పోకయుండిరా మఱునాఁడు వారియింటి ముందఱ పెంటయున్నదనియో మురికినీరు వీధిలోనికి వచ్చినదనియో యేమందభాగ్యులేదో యభియోగము పైని సభలకీడ్వఁబడి కొన్నాళ్ళు పనిచెడి తిరిగినమీఁదట వేశ్యల కియ్యవలసిన యొక్క రూపాయకు బదులుగా నాలుగురూపాయలు ధనదండన మిచ్చికోవలసినవా రగుచుండిరి. ఇటువంటి యధికారులు కొందఱు తమయింటనిచ్చెడు తమాషాలో సగముమాత్రమే వేశ్యల కిచ్చుటకును తక్కిన సగమును తామే

గైకొనుటకును వేశ్యలతో నేర్పాటుచేసికొని యీవిధముగా నెల కిన్నాళ్లో మున్నాళ్లో గడించుచుండిరి. పదిరూపాయల పనిలోనున్న వారు కొన్నిసమయములయం దొక్క నెలలో నాలుగైదురూపాయ లధికారులయిండ్లలో వేశ్యలనిమిత్త మపాత్రనిర్బంధదానములుచేసి యీనెలలో భార్యాపుత్రాదులతో నింట నర్ధభోజనములతోఁ దృప్తి నొందవలసినవా రగుచుండిరి. ఈదురాచారమును నివారించుటకయి సభలు చేయించి మావివేకవర్ధని యెంతో పనిచేసినది. ఆసభలలో కడపటిదానినిగూర్చి 1878 వ సంవత్సరము జనవరిపత్రికలోఁ బ్రకటింపఁబడిన పర్యవసానము నిందుఁ బొందుపఱుప ననుజ్ఞ వేఁడుచున్నాను—

"కడపట నీఁకముందు వివాహాదులయందుఁ దాంబూలములకు వచ్చువారు వసూళ్ళు వేయు దురాచారమును మాన్పించుట ముఖ్యకార్యమని నిశ్చయింపఁబడినది. అప్పు డాసభకువచ్చిన పెద్దమనుష్యు లందఱును తా మీఁకముం దెక్కడికి తాంబూలమునకు వెళ్ళినను వసూళ్ళు వేయమనియు, తమయిండ్లలో శుభకార్యములు జరిగినయెడల నితరులు వసూళ్ళు వేయకుండ ప్రయత్నముం జేయుదుమనియు, ఎవ్వరైనను వేసినయెడల వారిని తమయిండ్లకు తాంబూలములకుఁ బిలువఁగూడదనియు వారియిండ్లకు తాము తాంబూలములకు వెళ్ళఁగూడదనియు, ఎవ్వరైనను వెళ్ళినపక్షమునను పిలిచినపక్షమునను ఆ వెళ్ళిన పిలిచినవారివిషయములోఁగూడ నాప్రకారమే జరిగించవలసినదనియు, అట్టివారిలో నెవ్వరైనఁ బశ్చాత్తప్తులయి మరల నీసమాజములోఁ జేర నిచ్ఛించినయెడల సామాజికులలోఁ బదిమందికి తక్కువ కాకుండఁ జేరినసభలో క్షమార్పణము చెప్పికొందురేని మొదటిపర్యాయము సమాజములో మరలఁ జేర్చుకొనఁబడవచ్చుననియు నిబంధనలను వ్రాసికొని దానిక్రిందఁ దమచే

వ్రాళ్ళను జేసి, ఈపద్ధతులను క్రమముగా నడిపించువిషయమైన శ్రద్ధను పుచ్చుకొనుటకును ఆయాసమయములయందు విశేషసభలు కూడవలసినయెడల సభికులకు యుక్తకాలమునఁ దెలిపి వారిని రప్పించుటకును, ఈపత్రికాధిపతినే కార్యదర్శిఁగా నియమించిరి.”

మనవారిలో ననేకులు వాగ్దానము నెంతశీఘ్రముగాఁ జేయుదురో యంతశీఘ్రముగానే దాని నతిక్రమింతురు. వసూళ్ళవిషయమున నే నొడంబడిక చేసికొన్న కొన్ని దినములలోనే మాయూర నొక గొప్పగృహస్థునియింట నుపనయనమహోత్సవము నడచినది. మాసమాఖ్యలో సంతకము చేసినవారే యొక రా యుత్సవమునకుఁ బోయి యచ్చట భోగముమేళమునకు వసూలు చదివించి వచ్చిరి. నాకాసంగతి మాపాఠశాలలోని విద్యార్థులవలనఁ దెలిసినది. నేను సాయంకాల మైదుగంటల కింటికి రాఁగానే యాగృహస్థునకు నేను విన్న వార్తను దెలుపుచు, నేను విన్నదే నిజమైనయెడల మన యొడంబడికలోని దండననిబంధనలను ప్రవృత్తికిఁదీసికొని రావలసియుండునని వ్రాసి పంపి సాయంతనవిహారమునకుఁ బోయితిని. మాకట్టుపాటును మీఱినయతఁడు దైవికముగా నగరపారిశుద్ధ్యవిచారణసంఘసభ్యులలో నొకరగు బెజగము సోమయ్యగారను పెద్దకోమటి యగుట తటస్థించినందున, నాప్రకటన పత్రికవలనఁ గలుగవలసినసత్ఫలము తోడనే కలిగినది. నాపత్రికను జూడఁగానే యతఁడు భయపడి, నేను రాత్రి యేడుగంటల కింటికి మరల వచ్చునప్పటికి మావీధియరుగుమీఁదఁ గూరుచుండి యుండెను. నన్నుఁ జూడఁగానే యతఁ డరుగు దిగి నిలుచుండి దండము పెట్టి, తా నొడంబడికను బుద్ధిపూర్వకముగా నతిక్రమింపలేదనియు, అందలి నిబంధన లెప్పటినుండి వ్యవహారములోనికి రావలయునో కాలనిర్ణయ మేర్పఱుపఁబడి యుండక పోవుటచేత నట్టియేర్పాటు జరిగిన దినమునుండి వసువులొసఁగుట మానవలెననుకొంటిననియు, సమాధా

మాకుఁ జెప్పి తమయంత వేఁడుకొనెను. ఆరంభదశలో నక్కడ తిరస్కారము
గావించినయెడల నున్న కట్టుకూడఁ జెడునని మనస్సులో నెంచుకొని
ఆతఁడు చెప్పిన సమాధానమును క్షమార్పణమును కాగితముమీఁద
వ్రాయించి పుచ్చుకొని, జరిగిన వృత్తాంతమంతయుఁ దరువాత సమా
వేశమైనసభలో సభవారికి నివేదించితిని. మీఱినయెడలఁ దమవిషయ
మునఁగూడ నిట్లే జరుగునన్న భయముచేత మాయొడంబడికలో
వ్రాలు చేసినవారెవ్వరును తరువాత నెన్నఁడు మీఱలేదు. మాప్రతి
పక్షులైన వేశ్యాప్రియులు వసూళ్ళుండవలసిన యావశ్యకమునుగూర్చి
మాసభలలో ప్రసంగించుటయేకాక యందు విఫలమనోరథులైన తరు
వాతఁ దమలోఁ దాము వేఱుగ సభచేసి, మేము చెప్పినయుక్తుల నాక్షే
పించుచు నొకపత్రికను వ్రాసి, వసూళ్లు వేయుటకర్తవ్యమని సిద్ధాం
తముచేసి, దానియందు సంతకములు చేయుటకయి తగుమనుష్యులకుఁ
బంపిరి. ఆవనిలో మావివేకవర్ధనికి హాస్యసంజీవని తోడయి ప్రతి
వాదుల యుక్త్యాభావములను బరిహాసించి, మాప్రతిపక్షులైన వేశ్యా
జనాభిమాన మాననీయులను సిగ్గుపడునట్లుచేసెను. పలువురు వసూళ్లు
మాని ధవలాభము నొందుచున్నప్పుడు కొందఱుమాత్రము వసూళ్లు
వేయుట గౌరవముగాఁ గాక కేవలవ్యర్థవ్యయముగాఁ గనబడినందున,
క్రమక్రమముగా మొదట మాలోఁ జేరనివారు సహితము సభలో
వేశ్యలను వసూళ్లు లొసంగుట మానివేసిరి. ప్రతిపక్షుల యుక్తిరత్నము
లను మాహాస్యసంజీవని ప్రత్యుక్తులను గొందఱకుఁ గొంతవినోదకర
ముగా నుండవచ్చునని [illegible] యొక కొంతటి
[illegible] చేసినప్రకటనలోని కొంతభాగము గల
హాస్యసంజీవని వ్యాసము నొకదానిని నిందుఁ జూపుచున్నాను—

## సదాచార ప్రతిష్ఠాపనము

ఈమధ్య వసూళ్ళు వేయుపద్ధతి పోయినందున వేశ్యలకు కలిగిన నష్టమునుబట్టి జగత్ప్రళయము సంభవించునని భయపడి, లోకోపకారార్థము దయార్ద్రహృదయులయిన వేశ్యాభిమానులగు పూజ్యులు కొందఱు పూర్వాచారమును మరల నుద్ధరించి శాశ్వతకీర్తిని సంపాదింపవలెనని, స్వవాదోపబలార్థముగా నేకపుటల గ్రంథమును వ్రాసి దానిక్రింద తమపక్షమువారిచేత సంతకములు చేయించుచున్నారు. ప్రశ్నోత్తర రూపముగా వారు వ్రాసినగ్రంథము మహాసముద్రముం బోలె నున్నందున హాస్యసంజీవని సమగ్రముగా దాని నెల్లరకును జూపలేకపోయినను, దానియందలి హేతురత్నములఁ గొన్నిటి నేరి వారలంకరించిన మృదువచోభూషణములతోనే యెల్లవారలచూడ్కులను మిఱుమిట్లు గొలుప నెంచినది. ధీరులారా! జడిసికొనకుఁడు—

### పంచరత్నములు.

"బ్రాహ్మణుడికి గాని పండితులకుగాని యిస్తే ఫలంగాని భోగం వాళ్ళకు యివ్వడం పుణ్యమూ పురుషార్థమూ అగత్యంవుంటే రహస్యంగా యివ్వకూడదా"

"బ్రాహ్మణులు వగయిరాలకు శుభాశుభ కార్యములకు యేదయినా ఫలం దొర్కుతుంది. యీభోగంవాళ్ళకు శుభకార్యంకు మాత్రమే దొర్కుతుంది. యితర వర్ణములవారికి సహా ధర్మంచేస్తూ యిచ్చేవార్ని కూడా భోగంవాళ్లకు వద్దు అనడం న్యాయంకాదు. గొప్ప ఘురానా గల మనిషి రహస్యంగా యివ్వడం యెట్లా తటస్థమవుతుంది! కాదు"

"యీప్రకారం కొన్ని గ్రామాదులలో యెట్లారద్దు అయినది." —

"యేగ్రామం పద్ధతి ఆగ్రామంకు జర్గవలశ్నిది. వకరు డబ్బుపనిచేస్తే రెండోవారుకూడా డబ్బుపని చేయవలశినదా. యిదిగాక వారు యేహేతు వచ్చానయినా రద్దుపర్చినయెడల అందుకు తగిన ప్రతిఫలం కనపర్చ వుందురు."

"భోగంవాళ్ళు లేక పోతె కార్యములు కావా"

"భజంత్రీలు లేకపోయినా అవుతవి. భోగంవాళ్లు లేకపోతె సంసార్లు చెడిపోతారు. గుడిశేటివాళ్లు విస్తరిస్తారు. రేపు కేజులు యెడల్ట్రీ కేజ్లు విస్తరించుతవి"

"భోగంవాళ్ల యందు యింత అభిమానం యెందుకువుండవలెన్నది. వక బ్రాహ్మడియందు వుండకూడదా. వీళ్ళకులవృత్తివల్ల విశేషంగా సంపాదించడముకు అవకాశం కల్గివుండగా వస్తులు యెందుకు యివ్వవలసినది."

"వీళ్ళ కులవృత్తివల్ల వీళ్ళకు జీవనం జర్గదు. మనలో సహా వక గ్రహస్తుకు యీనాంలున్నా నవుఖరిన్ని వ్యవహారమున్ను వున్నప్పటికి సాలు ౧కి రు ౩-౮ చొ॥ యిటువంటి వస్తులు యివ్వడముకే యిబ్బంది అని ఆలోచిస్తూ వున్నాము. ఇటువంటి సంగతిలో భోగంవాళ్ళకు ఇష్టో వృత్తి అనగా యీవస్తులవల్ల జిరిగే ఆధారం పోతే యట్లా వాళ్లు జీవిస్తారు. వాళ్ళ కుటుంబాలు యట్లా వృద్ధి అవుతవి. ఇదిగాక వాళ్ళ కులవృత్తివల్ల వచ్చే ఖాయిలాలకే అటువంటి సొమ్ము చాలదు. పూర్వపు మామూలుకు వ్యతిరేకం వస్తుందేమో అనిగాని వాళ్ల యందు భక్తివుండికాదు. యిదిగాక వుత్సవములు పడిపోకుండా వుండడమ్కున్ను కారణం"

"భోగంవాళ్లు లేక పోతెయేమినష్టం."

"అనేక ఖర్చులుచేసె వక గొప్పగ్రహస్తుసాలు ౧కి వస్తులకింద రు. ౩-౮ ఖర్చుచేస్తే యేమి నష్టం. అట్లానష్టంలేదు సరేకదా బంధువుల్కు విరోధములు వుండవు. క్షేమాపణలు వుండవు. భోగంవాళ్ళ విద్యలు వృద్ధిచేసినవారము అవుతాము. యిదిగ్కా గుడిశేటివాళ్లువిస్తరించరు. గన్క భోగంవాళ్లు వృద్ధికాకపోతె యిదే నష్టం."

ఈయయిని తీసికొన్న హేతువులే మంచివని మేమిందు గ్రహింపలేదు. వారు వ్రాసిన యిరువదినాలుగు హేతువులును ఒకదానినొకటి మించియే యున్నవి. కాఁబట్టి వానిలో నేవి గొప్పవనో తోఁచక, అన్నిటివి గొప్ప స్థలముచాలక ఈయయిదింటినిమాత్ర మిందు పొందుపరచినాము —హాస్యసంజీవని 1878-వ సం॥ మార్చి.

వాలేన్ దొరగారు మాకప్పుడుమండలన్యాయాధిపతిగానుండిరి. ఆరంభదశలో నొకరిద్దఱు ప్రాడ్వివాకులు తమ్మాశ్రయించియున్నవారికిఁ గొందఱికి న్యాయవాదిపట్టాలనిమ్మని వ్రాసిరికాని పరీక్షాసిద్ధులుకారన్న కారణముచేత మామండలన్యాయాధిపతిగారు వారికి పట్టాల నియ్యలేదు. అయినను మామండలన్యాయాధిపతిగా రటుతరువాత పరీక్షాసిద్ధులు కానివారికి కొందఱికి పట్టాల ననుగ్రహించిరిగాని యొకప్రాడ్వివాకుఁడు వ్రాసినమీఁదట నిచ్చినపట్టాలను మరల లాగుకొనిరి. అంతట నొక క్రొత్తశిరస్తాదారు వచ్చెను. ఈయన మంత్రిత్వకాలములో న్యాయవాదిపట్టా లెల్లవారికిని కొల్లలుగా నీయఁబడఁజొచ్చెను. మొట్టమొదట న్యాయవాదులయొద్ద లేఖకులకుమాత్రమే పట్టాలియ్యఁబడెను; తరువాత న్యాయవాదులయొద్దనుండి యోగ్యతాపత్రికలను దెచ్చుకొన్నవారి కందఱికిని పట్టాలియ్యబడెను. ఇట్లు కొన్నిమాసములలో దాదాపుగా నెనుబదిమందికి పట్టాలను బడయు భాగ్యము లభించెను. వీరిలో నొక్కరును పరీక్ష నిచ్చినవాకమునఁ బోయినవారు లేరు; పెక్కండ్ర కింగ్లీషుభాషావాసన యైనను లేదు. ఇట్లు పదిమందికి మండలన్యాయసభలోను, డెబ్బదిమందికి ప్రాడ్వివాక న్యాయసభలలోను పట్టాలు లభించినవి. ఎక్కడనో యెవ్వరోకాని లోకములో సాధారణముగా లాభములేనిపనిలోఁ బ్రవేశింపవా రుండరు. అందుచేత మామండలన్యాయసభలోని న్యాయవాదులు కొందరు తా మావఱకంతగా ధనార్జనము చేయఁగలిగినవారు కాకపోయినను యోగ్యతాపత్రికా ప్రదానములమూలమున ధనసంపాదనము చేయఁగలిగిరి.

దేవుడు వర మిచ్చినను పూజారి వర మియ్యఁడన్న సామెత సుప్రసిద్ధము కదా! పై యట్లు చౌకగా యోగ్యతాపత్రికలను సంపాదించుకొనినవారికి సహితము కొందఱకు పట్టాలు రాకుండెను. వారి విన్నపములు దొరగారిని జేరుటకయి మధ్య నింకొకముడుపు చెల్లింపవలసి యుండెను. ఈ రెండవ ముడుపును చెల్లింపనివారి చేతులు మండలన్యాయాధిపతిగారి సముఖమునకుఁ బోనే పోవు. ఈ యక్రమమును సహింపక మా వివేకవర్ధని పరీక్షాసిద్ధులు కానివారికి పట్టాల నిచ్చుట యన్యాయమని ఘోషింప నారంభించెను దాని ఘోషను విని 1878 వ సంవత్సరాంతమున యున్నతన్యాయసభవారెట్లు పట్టాలీయఁబడినవో తెలుపవలసినదని మా మండలన్యాయాధిపతిగారి నడిగిరి. న్యాయవాదిపట్టాల విషయమునఁ గొన్ని ముఖ్యాంశములను దెలుపుటకయి 1879 వ సంవత్సరము జనవరి నెల 31 వ తేది మధ్యాహ్నము మూడుగంటలకు తమన్యాయసభకు రావలసినదని మా మండలన్యాయాధిపతిగారు గతదినము మధ్యాహ్నమున నా కాజ్ఞాపత్రమును బంపిరి. పట్టాలవిషయమున నేమో చెప్పవలసియుండునని నా కాయాజ్ఞాపత్రికవలన బోధపడెను, ఉన్నతన్యాయసభవా రావిషయమున మండలన్యాయాధిపతిగారి నడిగినవార్త గాని నేను జెప్పవలసినవిషయ మేమో యదిగాని నాకుఁ దెలియలేదు. అందుచేత నే నేమిచెప్పవలెనో యేమి చేయవలెనో నా కేమియు తోఁచలేదు. ఇంగ్లీషుభాగమునకు ముఖ్యముగా వ్రాయుచు నాకుఁ బ్రాణమిత్రులుగా నుండిన గవర్రాజుగారైనను నా కాలోచనచెప్పుట కప్పుడు పట్టణములో లేక పట్టపరీక్ష నిచ్చునిమిత్తమయి చెన్నపట్టణమునకుఁ బోయియుండిరి. గవర్రాజుగారు గాక యింగ్లీషుభాగమున కేలూరి లక్ష్మీనరసింహముగారును, అప్పుడప్పుడు చిర్రావూరి యజ్ఞన్న శాస్త్రులుగారును వ్రాయుచుండిరి. నాకాజ్ఞాపత్రిక వచ్చినసంగతి యూరంతటను ప్రకటనముకాఁగా నన్నుఁజూచుటకయి నామిత్ర

రైన కన్నమురెడ్డి పార్థసారథినాయఁడుగారును ఏలూరి లక్ష్మీనరసింహముగారును మాయింటికి వచ్చిరి. మేము ముగ్గురమును గలసి యప్పుడు చిరాత్రిపూరి యజ్ఞన్నశాస్త్రిగారి యింటికిఁ బోయితిమి. ఆజ్ఞాపత్రికను జూచి యాయనయు విస్మయపడెనే కాని నా కేమియు తగిన యాలోచన చెప్పలేకపోయెను. అప్పటికి సాయంకాల మైనది. పోఁతగట్టుమీఁద గోదావరియొడ్డున నడవవలెనని మేము నలుగురమును బైలుదేఱితిమి. తాత్కాలికముగా మండలన్యాయసభలో సిరిస్తాదారుగానుండిన రాజ రామకృష్ణారావుగారు దారిలో మా కెదురుపడిరి. అవల నాయన నాకు పరమమిత్రుఁడుగా నుండినందున, ఆయనవలన సర్వమును దెలియునన్న నమ్మకముతో నే నాయనను బలుకరించితిని. ఆయన నామాటవినిపించుకొనక యజ్ఞన్నశాస్త్రిగారివంకఁ జూచి 'నేనిప్పుడు మంత్రిస్థానమునందున్న యధికారినగుటచేత వీండ్రకటనేమియుఁ బ్రచురముచేయఁగూడదు. ఇప్పుడు సర్వమును అగ్నిహోత్రముఖమునఁబడి మండుచున్నది. వీండ్రిప్పుడు మీయాలోచనను గోరవలసినదే'' అని పలుకుచు నిలువక గర్వముతో నడచిపోయెను. ఆమధ్యాహ్నమున నాకుఁ బంపఁబడిన యాజ్ఞాపత్రిక వ్రాఁత యీతనిదే. నాఁడు సూర్యగ్రహణమగుటచే న్యాయసభకు సెలవు. అందుచేత నీతఁడదే యాజ్ఞా పత్రికను దొరగారియింటివద్ద స్వయముగా వ్రాసి సంతకము చేయించి నాకుఁ బంచివచ్చి యిట్లు సాయంకాలసంచారార్థము వెడలెను. ఈయన నాటిప్రాతఃకాలమువఱకు ప్రతిదినమును తప్పక మాయింటికి వచ్చుచు, నాకుఁ బరమాప్తునివలెనటించి యన్ని సంగతులను నావలనఁ దెలిసికొనుచు, నాతోఁ గలసిమెలసి తిరుగుచుండెను. నేనే పత్రికాధిపతినని చెప్పి దొరగారికి కోపము తెప్పించి యాజ్ఞాపత్రికను వ్రాయించి పంచిన మహానుభావుఁ డితఁడే. వివేకవర్ధనికి భయపడి పైకి మిత్రులవలె నటించుచు లోపల ద్వేషించుచుండు నను

యెవరు వచ్చినప్పుడు నాకు చెఱుపు చేయఁగోరుచుండెడు కపటనాటక లేయగువయిన యనేకులుండెడివారు. నేనందఱిని నిజమయిన మిత్రులనియే నమ్మెడివాఁడను. దండవిధాయులు న్యాయాధిపతులు మొదలయినవారిమీఁద వ్రాసిన నూరక పోవునా, ఎప్పుడో యొకప్పుడు చిక్కు రాకుండునా, అని తమలోఁదామనుకొనుచు నాకేదో యాపద వచ్చినట్లు భావించుచు నూర నెల్లవారును నాఁడును మఱునాఁడును తద్విషయమునసే సంభాషించుచుండిరి. సమస్తమునకును న్యాయాధిపతులకెల్లను న్యాయాధిపతియైన యీశ్వరునియందే భారమునుంచి నేనారాత్రి నిర్విచారముగా నిద్రపోయి, మఱునాఁడు భోజనముచేసి యథాపూర్వకముగాఁ బాఠశాలకుఁబోయి పనిచేసి, రెండుగంటలయిన తరువాత సెలవు పుచ్చుకొని యక్కడినుండియే తిన్నగా మండల న్యాయసభకు నడచిపోయితిని. సరిగా మూడుగంటలకు దొరగారును సభకువచ్చిరి. పత్రికాధిపతి వచ్చెనని సిరస్తాదారుగారు దొరగారితో మనవిచేయఁగా, ఆయన నాకు కుర్చీయిచ్చి కూర్చుండఁబెట్టి తమ పెట్టెలోనుండి వివేకవర్ధనీపత్రికను దీసి నాచేతి కిచ్చి, న్యాయవాది పట్టాలనుగూర్చిన వ్యాసమునుజూపి, 'ఇది మీరే వ్రాసితిరా?' అని యడిగెను. ఉన్నతన్యాయసభవారి ముద్రతో నున్న యాపత్రికను జూడఁగానే యందలితత్త్వమంతయు నా కవగత మయ్యెను. న్యాయసభాభవనమంతయు వేడుక చూడవచ్చిన పౌరులతోను క్రొత్తపట్టాల నొందిన న్యాయవాదులతోను నిండియుండెను. వెంటనే కర్తవ్యము నాలోచించి లేచి నేను 'మీప్రశ్న కుత్తరము చెప్పుటకు ముందు నాకీయాజ్ఞాపత్రిక యేరాజశాసనాను సారముగాఁ బంపఁబడినదో తెలుపఁ వేఁడెదను' అని బదులుచెప్పితిని. న్యాయాధిపతి యేమియు తోఁచనివాఁడివలె నించుక యాలోచించి తా నడిగిన ప్రశ్నమున కిచ్చిన యుత్తరమును కాగితముమీఁదవ్రాసి, 'ఈపత్రికను మీరే

ప్రకటించెదరా ?" అని మఱియొకప్రశ్న వేసెను. 'నేనడిగినదాని కుత్తరము చెప్పరైతిరి. మీప్రశ్నలకుత్తరములు చెప్పుటకుఁ బూర్వము నేను బదులు చెప్పుటకు బద్ధుఁడనో కానో తెలియఁగోరెదను.' అని నేను మరలఁ బలికితిని. 'మే మడిగినదాని కుత్తరము చెప్పుట మీకా కిష్టము లేదు కాఁబోలును' అని దొరవారు నవ్వుచుఁ బలికిరి. 'నే నుత్తరము చెప్పుటకు బద్ధుఁడనైనపక్షమునఁ జెప్పుట కిష్టమున్నది.' అని నేనంటిని. 'ఈదశలో మీరు బద్ధులైయున్నారని మేము చెప్పఁ జాలము. మీకిష్టమున్నచోఁ జెప్పవచ్చును' అని న్యాయాధిపతిగా రనిరి. 'నేను బద్ధుఁడను గానిపక్షమున బదులు చెప్పుటకు నాకిష్టము లేదు' అని నేను తెలియఁబలికితిని. ఈప్రశ్నోత్తరముల నన్నిటిని వ్రాసికొని 'ఇఁక మిమ్ము నిట్టియుంచుట నాకిష్టము లేదు' అని దొరవా రనిరి. 'సంతోషము' అని చెప్పి నే నీవలికి వెడలివచ్చితిని. ఈకథ యంతయు నైదు నిముషములలో ముగిసినది. రామకృష్ణారావుగారు లోపలికిఁ బోయి 'న్యాయాధిపతి తెలివితక్కువవాఁడు గనుక సరిపో యినదిగాని యిటువంటి యవినయోక్తులు పలికినందున కింకొకఁడైన సభాతిరస్కారముక్రింద దండించి యుండఁడా ?' అని తన క్రింది యుద్యోగస్థులవద్ద కేకలు వేసెను. నా ధైర్యమునకు సంతోషించి, నాకావఱకు మిత్రుఁడుగా నుండిన యొక న్యాయవాది నాతో వెలు పలికివచ్చి నన్నాలింగనము చేసికొని, మరల మిత్రభావమును జూపెను. నేను మరలి యింటికిఁ బోవుచుండఁగా నే నాదినమున కారాగృహమునకుఁ బంపఁబడుదునని నమ్మి వింత చూచుటకయి గుంపులు గుంపులుగా న్యాయస్థానమునకుఁ బోవుచున్న మహాజనులు దారిపొడుగునను నాకెదురుపడి నావంక నివ్వెఱఁగంది చూడఁ జొచ్చిరి. నేను సభవిడిచి వచ్చినతరువాత నామీఁద మాననష్టమున కయి యభియోగము తేవలసియున్నదని మా న్యాయాధిపతిగారు

దండవిధాయికి వ్రాయఁగా, అతఁడది వ్యావహారిక విషయమయి యుండినను ముందుగా దొరతనమువారి యంగీకారముపొంది యభియోగము తేవలసియుండునని బదులు వ్రాసెను. అప్రతిష్ఠ కలిగించినందుకయి నాపయి నభియోగము తెచ్చుటకు సెలవియ్యవలసినదని నేరగాఁడు దొరతనమువారికి వ్రాసికొనిరిగాని వారంగీకరింపరైరి. ఈ లోపల నున్నతన్యాయసభవారును దొరతనమువారును ఇచ్చినపట్టాల నెల్ల మరల నూడఁదీసికొనవలసినదని మామండల న్యాయాధిపతిగారి కుత్తరువు చేసిరి. ఆయన పైవారి యుత్తరువులను చెల్లింపఁగా, క్రొత్తగా వంగీలు కట్టించుకొని నాలుగునెలల భోగ మనుభవించిన నవీనన్యాయవాదులు తమధనమును పట్టాలనుగూడఁ గోలుపోయి కొంతకాలము నన్నును మావివేకవర్ధనిని శపించుచుండిరి.

ఆకాలమందు వేశ్యనుంచుకొనినవాఁ డరసికుఁ డనియు పౌరుషహీనుఁ డనియు భావింపఁబడుచుండినట్టే లంచములుపుచ్చుకొనినవాఁ డప్రయోజకుఁడనియు బుద్ధిహీనుఁడనియు పరిగణింపఁబడుచుండెను. అప్పుడు లంచములు స్వీకరింప నొల్లని ధర్మపరులయిన రాజకీయోద్యోగులు సహిత మందందుఁ గొందఱుండుచు వచ్చిరిగాని యట్టివారి సంఖ్య యత్యల్పమయి యుండెను. లంచములు పైకొనుట యుద్యోగధర్మమని యెల్లవారును దలఁచియుండుటచేత నిచ్చువారుగాని పుచ్చుకొనువారుగాని దానిని తప్పుగాఁ దలఁపకుండిరి. రహస్యమన్నదిలేక బంటుమొదలుకొని మంత్రివఱకును రాజపురుషులందఱును బహిరంగముగానే యుత్కోచస్వీకరణము చేయుచుండిరి. దొరలవద్దక్రింది యుద్యోగములలో నున్నంతకాలమును లంచములు పుచ్చుకొనుచుండినవారైనను, తాముస్వతంత్రులయి ప్రాడ్వివాకపదమునొంది న్యాయకర్తలైన తరువాత వెనుక లంచములు మానుచుండిరి. 1878-వ [illegible] పోలారి శ్రీ[illegible]గారనువాఁడు కొంతకాలము

రాజమహేంద్రవరమునకు ప్రాడ్వివాకుఁడు (డిస్ట్రిక్టు మునసబు) గా వచ్చెను. ఆయన చెల్లెలిని మామండలన్యాయసభలో దొరతనమువారి న్యాయవాదిగా నుండిన చిత్రపు కామరాజుగారి కుమారునకిచ్చి వివాహముచేసినందున వారిరువురు నాప్తబంధులును పరమమిత్రులునయి యుండిరి. క్రొత్తగా ప్రాడ్వివాకపదమునకువచ్చిన యాఘనుఁడు చిన్నతనమునుండియు చదివికొనుచుండి లంచములు మరగియున్నవాఁడగుటచేత నిప్పు డెక్కువయవకాశము కలుగఁగానే తానచ్చటనున్న కాలములోనే సాధ్యమైనంత యధికధనార్జనము చేయ నిశ్చయించుకొనెను. కాఁబట్టి యతఁడు వాది, ప్రతివాది, దరిద్రుఁడు, ధనికుఁడు న్యాయము, అన్యాయము, అని చూడక సర్వభక్షకుఁడైన యగ్నిహోత్రునివలెఁ దన్నుఁజేరినవారికడ నెల్లను ద్రవ్యభక్షణము చేయఁబూనఁగా, ధనంజయునకుతోడుపడునట్లుగా మహాబలుఁడైన చిత్రపు కామరాజుగారాయనకు సహాయులయి నిలిచిరి. అందుచేత నా బ్రాహ్మణప్రభువు నిర్భయుఁడయి, ధర్మదేవతను గోవునుగా మనపూర్వులు వర్ణించియుండుటచేత విపణివీధిలో గోవునువిక్రయించునట్టె బహిరంగముగా న్యాయసభలోనే ధర్మమును పాటపాడించి విక్రయింపఁ జొచ్చెను. కాఁబట్టి యీయనకాలములో న్యాయ మెక్కువపాట పాడినవారిసొమ్మయగుచుండెను. అప్పుడీన్యాయవిక్రయమునకయి వ్యావహారిక పరిభాషయొకటి క్రొత్తగా నేర్పడవలసివచ్చెను. ఈ పారిభాషిక వ్యవహారశాసనమునుబట్టి న్యాయవాదులకు వాదిప్రతివాదులపక్షమున యుక్తులు చెప్పి వాదింపవలసిన శ్రమము తప్పిపోయి పని సులభమయ్యెను. వారు హేతువాదములతో పనిలేక యీనూతనవ్యవహారశాసనముయొక్క ప్రకరణసంఖ్యను పేరుకొనుటయే వారివాదమునకుఁ జాలియుండెను. న్యాయాధిపతిగారు వారుదాహరించిన ప్రకరణబలమును రహస్యముగ విచారించి తాము తృప్తిపొందిన పిమ్మట వ్యవహారము

నేఁడొకయొకపక్షమున తీర్చుచుండిరి. ఆనూతనశాసనములో దశసంఖ్య లుగల తద్గుణితసంఖ్యలునుగల ప్రకరణములే కాని వాని నడుమయంకెలు గల ప్రకరణములు లేనియే లేవు. వాదిపక్షమున వచ్చిన న్యాయవాది 'ఏలినవారు 100 వ ప్రకరణమును చిత్తగించి న్యాయము దయచేయింపవలెను' అని వేఁడగా, ప్రతివాదిపక్షమున వచ్చిన న్యాయవాది 'ఆప్రకరణము పనికిరాదు. ఏలినవారు 150 వ ప్రకరణమును చిత్తగించి న్యాయము దయచేయింపవలెను' అని మనవి చేసికొనును. ఆపయిని నొకరితరువాత నొకరుగా 160, 170, 180, 190, 200 అని యుభయపక్షముల న్యాయవాదులును నూతన న్యాయశాసనము యొక్క ప్రకరణముల నుదాహరించుచు రాఁగాఁ గడపట నెక్కడనో యొకసంఖ్యకడ పాట నాఁటికి నిలిచిపోవును. 'మంచిది. ఆలోచించెదము. ఆప్రకరణార్థము నీరాత్రి సావధానముగా చిత్తగించి రేపు సభలో తీర్పు చెప్పెదము' అని చెప్పి యాప్రకరణసంఖ్యను వ్రాసికొని యాగ్రంథము నప్పటి కంతటితో ముగించి, మునసబుగారు మఱియొకగ్రంథమునకు దిగి యాప్రకారముగా దినమున కెన్నియో వ్యవహారములను విచారించి తీర్చుచుండిరి. పెద్దప్రకరణమును జాతి యొక్కవపాట పాడిన న్యాయవాది యారాత్రి యా న్యాయపరిపాలకుని యింటికిఁ బోయి యాప్రకరణార్థమును కన్నులకుఁ గట్టినట్టుగా దీపము వెలుతురున విశదముగాఁ జూపిన పక్షమున మఱునాఁ డాపక్షమునే మునసబుగారు న్యాయసభలో తీర్పు వినిపించుచుందురు. నూఱవ ప్రకరణ మనఁగా నూఱురూపాయలనియు, నూటయేఁబదవ ప్రకరణ మనఁగా నూటయేఁబది రూపాయలనియు, ఆనూతనశాసనముయొక్క పారిభాషికప్రకరణము లన్నియు వాగ్రూపములుగాక ధనరూపము లయినవని నాకు వివరింపవలసిన క్రమమయినచో యీవఱకే బుద్ధిమంతులయిన మీ చదువరులు తమంతటనే గ్రహించియుందురు. [illegible]

కాపులకు లంచములిచ్చి తాము లాభము పొందుచుండుట కాలాలపు వ్యాజ్యవాదులలో ననేకు లలవాటుపడినవారే యయినను, ఈ యపూర్వన్యాయాధికారియొక్క వ్యవహారనిర్ణయ ప్రకారము వారికి జీవితము దుర్భరమయ్యెను. ఇప్పుడు న్యాయాధిపతియే బోనిలోని పులియయి సర్వమును దానే గుటుక్కున మ్రింగువాఁడయినందున, అధికారులపేరులు చెప్పి యెక్కువపుచ్చుకొని తక్కువ యిచ్చుచుండు వారికి వీసమో పరకో గాని హెచ్చుమిగులకుండెను. మామునసబు గారు గొప్పగొప్ప మొత్తములను స్వీకరింపవలెనన్న యత్యాశచేత వరుస తప్పించి పెద్దమొత్తములుగల వ్యాజ్యములను ముందుగా విమర్శించి తీర్పు నారంభించిరి; అంతేకాక తామున్న యల్పకాలములోనే విశేషవిత్తము సంపాదింపవలెనన్న దురాశచేత నేకకాలమునందే రెండుమూఁడు వ్యాజ్యములలో సాక్షుల విచారణ చేయుచు, తా మొక్క వ్యవహారములో సాక్షులవిమర్శ చేయుచు నింకొకవ్యవహారములో సాక్షులవిమర్శ చేయుటకు గుమస్తాల కప్పగించుచుండిరి; ఒక్కసారిగా నన్ని వ్యాజ్యముల గ్రంథమును సాక్షివాఙ్మూలములను జదివి తీర్పులు వ్రాయుట యొక్కరికి దుర్భరముగాన, దాము కొన్ని వ్యాజ్యముల గ్రంథమును జదివి స్వయముగా తీర్పులు వ్రాయుచు, మఱికొన్నిటిని తమచుట్టమైన చిత్రపు కామరాజుగారి కప్పగించి యాయనచేత చిత్తుతీర్పులు వ్రాయించి తాము వానికి శుద్ధప్రతులను వ్రాసికొనుచు యథేచ్ఛముగా విహరింపఁజొచ్చిరి. ఇట్లాతఁడు విచ్చలవిడిగా లంచములు పుచ్చుకొని ప్రజలను దోఁచి యన్యాయము చేయుచుండినను, పై యధికారియైన మామండలన్యాయాధిపతిగా రాయన సుశీలన్యాయమూర్తియనియే భావించుచుండిరి. న్యాయవాది పట్టాల పత్రమును చేసిన వాలేసు దొరగారే మాకప్పుడు మండలన్యాయాధిపతిగా నుండిరి,

అప్పుడీయధికారియొక్క దుర్ణయము నేలాగుననయినఁ దుదముట్టింపవలెనని నిశ్చయించుకొని మా వివేకవర్ధని ధర్మస్థాపన దీక్ష వహించి కార్యసిద్ధి కయి సాక్ష్యాన్వేషణ ప్రయత్నములో నుండెను. ఇంతలో బాధ నొందిన ప్రజలను వారిపక్షమునఁ బనిచేయు న్యాయవాదులు కొందఱును ప్రాడ్వివాక శిఖామణియొక్క దౌర్జన్యములనుగూర్చి మొఱ్ఱపెట్టుకొన నారంభించిరి. గాని వారిలో నొక్కడును తాము లంచము లిచ్చినట్టుగాని మునసబు లంచములు పుచ్చుకొనుచున్నట్టుగాని బహిరంగముగా సాక్ష్యమిచ్చుటకు సిద్ధపడినవాఁడు కనఁబడలేదు. రాజకీయశాసనములనుబట్టి లంచము లిచ్చినవాఁడును పుచ్చుకొన్నవాఁడునుగూడ సమానముగానే దోషులయి దండమునకుఁ బాత్రులగుచుండుటచేత నెవ్వఁడును మేము లంచ మిచ్చితిమని పైకి వచ్చుటకు సాహసింపకుండిరి. లంచములనుగూర్చి నాతోఁ బలుమాఱు చెప్పుచు వచ్చిన కొందఱు న్యాయవాదులు మాత్రము తాము లంచములిచ్చినట్టు ప్రత్యక్షముగాఁ జెప్పకపోయినను సమయమువచ్చినప్పుడు పయియక్రమములు జరగుచున్నట్టు చెప్పి సాక్ష్యమిచ్చెదమని వాగ్దానముచేసిరి. నేను వెంటనే నామిత్రులైన చల్లపల్లి బాపయ్యపంతులుగారిని చిర్రావూరి యజ్ఞన్నశాస్త్రిగారినిమాయింటికిరప్పించి, పయిన్యాయవాదు లావఱకు నాతోఁ జెప్పినదాని నెల్లను మరల వారి యెదుటఁ జెప్పించి, మేము మువ్వురమునుగలిసి మునసబు లంచములు పుచ్చుకొనుచున్నాఁడన్న యర్థము సూచన యగునట్టుగా త్రైమాసపత్రిక కింగ్లీషున నొకవ్యాసమును వ్రాసితిమి. ఆవ్యాసము పత్రికలోఁ బ్రకటింపఁబడుటకు ముందుగా లంచములు పుచ్చుకొను విషయమును మాత్రము విడిచి తక్కిన విషయముల నొకకాగితముమీఁద వ్రాసి చేవ్రాళ్ళుచేసి నాకిచ్చెదమని యాన్యాయవాదు లప్పుడొప్పుకొనిరి. ఆ వ్రాఁతను బ్రచురపఱుపక నాయొద్దనే యుంచుకొనుటకును సమయమును

వచ్చినప్పు డాన్యాయవాదులు తద్విరుద్ధముగా సాక్ష్యమిచ్చినప్పుడు మాత్రమే నేనుదాని నుపయోగించుటకును నేనొప్పుకొంటిని. నాతోఁ జెప్పిన న్యాయవాదులలోఁ గొంద ఱప్పుడచ్చట లేనందునఁ దరువాత నందఱును జేరి వ్రాసి చేవ్రాళ్ళు చేసినకాగితమును నాయొద్దకుఁ బంపెద మనిచెప్పి వచ్చినన్యాయవాదులు వెడలిపోయిరి. వ్రాసినవ్యాక మచ్చుకూర్పఁబడి ప్రకటనమునకు సిద్ధమయ్యెనుగాని న్యాయవాదులు పంపెదమని వాగ్దానము చేసిన లేఖమాత్రము నాకు చేరలేదు. మఱునాఁడుపత్రిక ప్రకటింపఁబడునవఁగా గతసాయంకాలము నేనా న్యాయవాదులకడకు వారిమిత్రుని నొక్కనిని లేఖనిమిత్తము పంపితిని. వారు లేఖను మఱుసటిదినమునఁ బంపెదమని నాకు బదులంపి, తా మీవ్యవహారములోఁ దగులుకొనఁగూడదనియు పత్రికావిలేఖకులు తగులుకొని చిక్కులు పడుచుండఁగాఁ దాము పయినుండి వేడుక చూడవచ్చుననియు తమలోఁ దామాలోచించుకొనిరఁట. ఆవార్త తెచ్చినయతఁడు మాటలధోరణిని వారిరహస్యమును నాకడ వెలిఁబుచ్చెను. జరిగినమోసమునకు నేనాశ్చర్యవిషాదముల నొందియు నణుమాత్రమును నిరుత్సాహుఁడనుగాక మనోవికారమేమియు ముఖచిహ్నములవలనఁ గానరానీక శాంతభావముతో, వారు వేఱుగ వ్రాసియియ్యవలసిన యావశ్యకమే లేదనియు, పెద్దమనుష్యులు యెదుటఁ జెప్పియుండుటచేత నాకాసంగతులను దెలిపిన వారిపేరులు కూడ బత్రికలో వేసి ప్రకటించెదననియు, అతనితోఁ జెప్పినట్టుగాఁ జెప్పితిని. అతఁడప్పుడే నాయొద్దనుండి పోయి తనకాప్తుఁడయినయొక న్యాయవాదితో నే నన్నమాటలు చెప్పెను. అతఁడు తమపేరులు వెల్లడియగునని భయపడి తక్కిన న్యాయవాదులకడ కాలోచనకుఁ బోయెను. రాత్రిభోజనము లయినతరువాత వారు స్వగృహములు [illegible] ధారకరు. వారి నప్పుడు సందర్శింపవలె నన్న[illegible]

మానసిదయ్యెను. అందుచేత యువజను లనేకు లాభము వత్యులందు యుండెను. ఆకోమటి జవరాలికని పొరుగింటనే వసించియుండిన యొక బ్రాహ్మణయువతికిని జగడముతటస్థించినప్పు డావైశ్యాంగన 'నిన్నేమి చేయింతునో చూడు' మని యాబ్రాహ్మణాంగనను బెదరించెనట. ఆబ్రాహ్మణయువతి పదునాలుగేండ్లప్రాయముగలది; అత్తవారియింటి నుండి నవరాత్రములపండుగకు పితంతుమాత పిలుచుకొనిరాఁగా పుట్టి నింటికివచ్చియుండినది. ఆతరుణులిరువురును తగవులాడిన మఱునాఁడు రాత్రి పదునొకండుగంట లయినతరువాత ముగ్గు రారక్షకభటులా బ్రాహ్మణగృహముకడకు వచ్చి తలుపుతట్టి కేకలువేసి యాచిన్న దానిని పేరుపెట్టి పిలిచిరి. నిద్రలో కేకలువిని యెవ్వరో తలుపువద్దఁ బిలుచుచున్నారని లేచివచ్చి తలుపుతీసిన యాపడుచును చేయిపట్టు కొని వాండ్రువీధిలోనికి లాగి, 'నీవు ఆత్మహత్య చేసికొనఁబోవుచున్నా వని మాకు సమాచారము తెలిసినది; ఆరక్షకస్థానమునకు నడువుము' అని బలాత్కారముగా నీడ్చుకొనిపోయి కొంతదూర మరిగినతరువాత దారిలో నొకయరుగుమీఁద నామెను గూర్చుండఁబెట్టి యామె నెందునకో నిర్బంధింపఁ జొచ్చిరఁట. అంతట నాచిన్నదానిభాగ్యము చేత నాత్రోవను బోవఁ దటస్థించిన యొకపెద్దమనుష్యుఁ డామెయేడు పువిని చేరరాఁగా భటులు భయపడి పడుచును విడిచి పాఱిపోయి రఁట. తచ్ఛాఖవాఁడైన యాబ్రాహ్మణగృహస్థుఁ డాయువతివలన జరిగిన వృత్తాంత మంతయువిని యామెను వెంటఁబెట్టుకొని యింటికిఁ గొనిపోయి కొమార్తెనిమిత్త మేడ్చుచున్న తల్లి కప్పగించి పోయెను. అట్లువిడిపించి యాతరుణిమానమును కాపాడిన యాపెద్దమనుష్యుఁడు మఱునాఁడు ప్రాతఃకాలముననే నాయొద్దకువచ్చి గతరాత్రి జరిగిన యారక్షకభటుల దౌర్జన్యమును నాతోఁజెప్పి పత్రికలోఁ బ్రకటింపు మని కోరెను. నేనా కొందుస్థలములకును బోయి విచారింపఁగా నేను

విన్నదంతయు వాస్తవమయినట్టు స్పష్టపడెను. నేనా దుర్ఘటనమును గూర్చి వివేకవర్ధనిలో వ్రాసి ప్రకటించితిని. ఆరక్షకమండలాధ్యక్షుఁడు, పత్రికలో వ్రాయఁబడిన విషయమునుగూర్చి విచారణచేయనారంభింపగా, నేను విన్న కన్న సంగతులను సరిగాఁ జెప్పితిని. నాతో జెప్పిన పెద్దమనుష్యుఁడు తానావిషయమే యెఱుఁగననియు నాతో నేమియుఁ జెప్పనేలేదనియు, సాక్ష్యమిచ్చెను; ఆచిన్నదానితల్లి తమ యింట నేమియు నల్లరిజరగలేదనియు, తనకూఁతురు రాత్రి తెల్లవారినదాఁక తనయొద్దనే పరుండియుండెననియు, తెలియఁజేసెను; పరిభవపఱుపఁబడిన యాపడుచు తన్నెవ్వరును వీధిలోని కీడ్చుకొని పోలేదనియు, తానింటసుఖముగా నిద్రించుచుంటిననియు, చెప్పెను. అయినను, ఆరక్షకభటాధ్యక్షుఁడు నామాటయందు విశ్వాసముకలవాఁడయి, ఆభటులపేరులు తరువాత నావలనఁ దెలిసికొని వారి ననారోగ్యకరమైన మన్నెపు ప్రదేశమునకుఁ బంపి శిక్షించెను. పిమ్మట మొదట నాతోఁ జెప్పిన పెద్దమనుష్యుఁడు మరల నాయొద్దకువచ్చి, నిజముచెప్పినయెడల స్త్రీలు న్యాయస్థానములవెంటఁ దిరుగవలసివచ్చునని తానట్లు కల్లలాడవలసివచ్చెననియు, స్త్రీలవిషయమున బొంకిన నసత్యదోషము లేదనియు, చెప్పి క్షమార్పణముచేసెను. లిఖితపూర్వకమైన సాక్ష్యములేక పెద్దమనుష్యుల మాటలను నమ్మి పనిచేయఁ బూనుట యీదేశములో క్షేమకరముకాదని నాకప్పుడు మొట్టమొదట బోధపడినది.

ఇఁక మరల మనము మనమునసబుగారి వ్యవహారమునకు వత్తము. నా ప్రాణమిత్రులైన బసవరాజు గవర్రాజుగారు పత్రికానిర్వాహణాదులయందు నా కత్యంతసహాయులుగా నుండినను, ఆయన కామరాజుగారి తోడియల్లుఁ డగుటచేత నేనే యాతని కీవ్యవహారములో నేమియు పనిపెట్టకుంటిని. అయినను గవర్రాజుగారుమాత్రము బంధుత్వమునుబట్టి కామరాజుగారిపక్షము చేరవలసినవా రయినను

న్యాయైక

న్యాయైకాపక్షావలంబనముచేతను స్నేహభావముచేతను నాపక్షమునే వహించియుండి నేనొకవేళ కామరాజుగారికి విరోధముగా పనిచేయ నియమించినను చేయుటకు సంసిద్ధులయియే యుండిరి. మేము కాలమునందు ప్రజాక్షేమమునిమిత్తమయి పనిచేయవలసివచ్చినప్పుడు స్వజాతివాఁడనియు బంధువనియు మిత్రుఁడనియుఁ జూచెడివారము కాము. నేనొకనాఁడు ప్రాడ్వివాకన్యాయస్థానమునకుఁ బోయి ప్రచ్ఛన్నముగా నొకమూలఁ గూరుచుండి యాఘనునివర్తనమంతయు సావకాశముగాఁ జూచి వచ్చితిని. నేను వచ్చితినని వినియు వివేకవర్ధనిలోఁ దనమీఁద వ్రాయఁబడినదానిని జదివియు మొదట నతఁడించుక సంచలించెను గాని లంచములయం దాఱితేఱిన ధైర్యశాలియగుటచేతను పట్టణములో నత్యంతప్రబలుఁడుగా నుండిన చిత్రపు కామరాజుగారు తనకు మంత్రియయి సహాయుఁడయి యుండుటచేతను జంకక లంచములకుఁ గొంకక యెప్పటివలెనే వ్యవహారము నడపసాఁగెను. అంతేకాక వారిరువురును తత్పక్షమువారును జేరి నాకు చెఱుపుచేయ యత్నించుచుండిరి. ఉద్యోగస్థులందఱును వారిపట్టగుటచేత నాకప్పుడు సహాయులుగానుండువారు న్యాయసభలలో నెవ్వరును లేరు. బంటు మొదలుకొని ప్రభువువఱకు నెల్లరును ప్రతిపక్షులకే సహాయులుగానుండిరి. వివేకవర్ధనిని జదివియు మామండలన్యాయాధిపతిగా రెంతమాత్రమును విచారణచేయక యుపేక్షించి యూరకుండిరి. మంత్రాంగమును నడపెడి క్రిందియుద్యోగస్థులు ప్రాడ్వివాకులగు పోలూరి శ్రీరాములుగారు కేవల ధర్మమూర్తులనియు వారిపైని దోషారోపణము చేయు మాబోటు లీర్ష్యాపరులగు నీతిమాలిన దుష్టులనియు మామండలన్యాయాధిపతిగారికి దృఢవిశ్వాసము కలుగునట్లుచేసిరి. మండలన్యాయసభలోని యప్పటి రాజసేవకులలో పదిరూపాయలజీతముగల లేఖకుఁడైన బయపునేడి వేంకటజోగయ్యగా రొక్కఁడుమాత్రము నాకు

మిత్రులయి నాపక్ష మవలంబించియుండిరి. అతనివలననే నాకప్పుడు న్యాయస్థానమునందు జరగు కుతంత్రములు కొన్ని యప్పుడప్పుడు తెలియుచుండెను. ఈవిధముగా నధికారబలమును మనుష్యబలమును మా ప్రతిపక్షులపక్షముననే యున్నను సత్యబలమును దైవబలమును మాత్రమే మాకు సహాయములయి యుత్సాహజనకములుగా నుండెను. దుర్బలపక్షమున మా కపజయము తప్పక కలుగునని యెల్లవారును ప్రతీక్షించుచుండిన యీకాలములో నీశ్వరుఁడు మాకొక్క యాధారమును గనఁబఱచెను. చిత్రపు కామరాజుగారు మునసబుగారినిమిత్తము వ్రాసిన చిత్తుతీర్పు కాగితములను శుద్ధప్రతులు వ్రాయఁబడినతరువాత చించివేసి యాముక్కలను చింపివేయఁబడిన యితరమైన కాగితపు ముక్కలను గలిపి తమయింటి కెదురుగానుండిన పాడుదొడ్డిలోని పెంటకుప్పలలోఁ బాఱవేయుచుండిరి. అందులో తీర్పుముక్కలున్నవని మాకప్పుడు తెలియకపోయినను వారియింటి కెదుటింటిలోఁ గాఁపురమున్న యొకన్యాయవాదివచ్చి వారేవో కాగితపుముక్కలు పాఱవేయుచున్నారని నాతోఁ జెప్పెను. అవి యెందులకైనను బనికి రావచ్చునని తలఁచి వీధులు తుడుచుదాని కేమైననిచ్చి యాముక్కలెత్తించి తీసికొని రావలసినదని నే నాన్యాయవాదితోఁ జెప్పితిని. అతఁ డట్లుచేయించి రెండుబుట్టలతో ముక్కలను మాయింటికడఁ జేర్చెను. ఆముక్క లేమైన నతికి చదువఁదగియుండునేమోయని యొకదానితోనొకటిచేర్చి ప్రయాసపడి యతికింపఁజొచ్చితిని. శ్రమపడి యతికించినవానిలోఁ గొన్ని కరగ్రాహిమొదలైనవారికి వ్రాయఁబడిన యుత్తరములయి యెందునకుఁ బనికిరానివయిపోయెను. ముక్కలు సంగ్రహించి తెచ్చినన్యాయవాది యతికించినవానిలో రెండుకాగితములుచేరి పూర్ణముగా నొకతీర్పయ్యెను. పడినప్రయాసము వ్యర్థముయిపోలేదని నాకప్పు డపరిమితసంతోషము కలిగినది. ఆవ్యాజ్య

మును గోలుపోయినవాఁడొక మహమ్మదీయుఁడు. నాసహపాఠియు రెండవతరగతి న్యాయవాదియునైన దామరాజు నాగరాజుగారిచేత నామహమ్మదీయునిఁ బిలిపించి మాటాడఁగా, అతఁడు కామరాజుగారు లంచ మిమ్మని తన్నడిగినప్పుడు బీదవాఁడగుటచేతఁ దానియ్య లేకపోయితిననియు ప్రతివాదియొద్ద లంచముపుచ్చుకొని మునసబు వానిపక్షమున తీర్పుచేసెననియు చెప్పెను. ఆసంగతులనే తెలుపుచు మహమ్మదీయుని సమ్మతితో మండలన్యాయాధిపతిపేర విన్నపమొకటి వ్రాయించి దానిలో వానిచేత వ్రాలుచేయించి, చిత్తుతీర్పుయొక్క సగముభాగము నందుతోఁ జేర్చికట్టించి మండలన్యాయసభలోఁ బెట్టించితిమి. నాగరాజుగారియొద్ద లేఖకుఁడుగానుండిన మిత్తిపాటి రామయ్యగారా విన్నపములోఁ బేర్కొనఁబడిన సాక్షులలో నొకఁడు. ఈవిన్నపముసంగతి తెలియఁగానే మహాతాంత్రికుడైన కామరాజుగారా మహమ్మదీయుని రహస్యముగాఁ దమయింటికి రప్పించి, వానికి వ్యాజ్యపుమొత్తమునకు ద్విగుణముగా ధనమిచ్చి వానియొద్దనున్న తీర్పుముక్కల నపహరించెను. అన్నిరూపాయలొక్కసారిగా చేతఁబడఁగానే యామహమ్మదీయుఁడు పట్టరానిసంతోషముతోఁ దనమిత్రులకు విందుచేసెను. ఈవిందువలన ముక్కలుపోయినట్టు మాకుఁ దెలిసినది. ఈలోపల మఱిమూఁడునాలుగుతీర్పుల ముక్కలనుగూడ మేమతికి పూర్తిచేసితిమి. ముక్కలు పోయినసంగతి తెలియఁగానే సాక్షియైన మిత్తిపాటి రామయ్యగారిచేత మహమ్మదీయుఁడు చిత్రపు కామరాజుగారివద్ద సొమ్ముపుచ్చుకొని తిరిగిపోయి ముక్కలిచ్చివేసెననియు, కామరాజుగారు మునసబుగారికి లంచములు కుదుర్చుచున్నట్టును దీర్పులువ్రాసి యిచ్చుచున్నట్టును ఋజువుచేయుటకు తనయొద్ద నాధారము లున్నవనియు, మహమ్మదీయుని తీర్పుయొక్క సగముముక్కలు తనయొద్దనున్నదనియు మండలన్యాయసభలో నొకవిన్నపము పెట్టించితిమి. ఇంతలో కామరాజుగారా మహమ్మదీయునిచేత తనవిన్నపము

లోని సంగతులేవియుఁ దానెఱుఁగననియు, ఒకన్యాయవాది (దామరాజు నాగరాజుగారు) మోసముచేసి తనచేత నందులో సంతకము చేయించెననియు, తనవిన్నపమును విమర్శింపనక్కఱలేదనియు, మఱియొక విన్నపమును బెట్టించెను. అందుపైని మండలన్యాయాధిపతిగా రాన్యాయవాదిని మహమ్మదీయునిని బిలిపించి వారు చెప్పినసంగతులను వ్రాసికొనిరిగాని పిమ్మట నేమియుఁ జేయక యూరకుండిరి. మిత్రిపాటి రామయ్యగారిచ్చిన విన్నపముపైని మామండలన్యాయాధిపతిగారు మహమ్మదీయునితీర్పుయొక్క నకలుముక్కను బుచ్చుకొని, సాక్షులపేరులను తక్కిన యాధారములను బ్రదర్శింపవలసినదని యుత్తరువిచ్చిరి. నాయొద్ద నింకను తనవ్రాతతోనున్న ముక్కలున్నవని కనిపెట్టి నాయొద్దనున్న ముక్కలనన్నిటిని నిచ్చివేసినపక్షమున నైదువేలరూపాయల నిచ్చెదమని చిత్రపు కామరాజుగారు నాకు సందేశమును బంపిరి. ఆసందేశము నప్పుడు నేను తిరస్కారభావముతో నిరాకరించితిని. ఇప్పటికైదు తీర్పులముక్కలను మేము పూర్ణముగా నతికింపఁ గలిగితిమి. అతికింపఁబడినవానిలో నొక్కతీర్పునుమాత్రము నాయొద్ద నుంచుకొని తక్కిన నాలిగింటిముక్కలను ఒక్కకాగితపుసంచిలోఁ బెట్టి నాయుంగరముతో నే లక్కముద్రవేసి, మిత్రిపాటి రామయ్యగారిని నావెంట మండలన్యాయసభకుఁ దీసికొనిపోయి, ఆముక్కల సంచిని విమర్శదినము వఱకును న్యాయాధిపతిసొంతపెట్టెలోనే యుంచుకొనునట్లు విన్నపమువ్రాయించి వానిని దొరవారికిఁ బ్రదర్శింపించితిని. ఇంకను మేము క్రొత్తతీర్పుల నతికించుటకయి పాటుపడుచునే యుంటిమి. పనికిమాలినవని తీసివేసిన ముక్కలు పోఁగా నింకను బుట్టెడుముక్కలు నాయొద్ద మిగిలియుండినవి. వానిలో నేవైన సరిగా నతుకునేమో చూచుటయి యాబుట్టను నేను దామరాజు నాగరాజుగారియొద్ద నుంచితిని. ఆ మఱునాఁడుదయమున జాము ప్రొద్దెక్కిన తరువాతనొక రెండవ

తరగతి న్యాయవాది నాగరాజుగారి యింటి యొద్దనుండి మాయింటి దారిని బోవుచు వీధిలో నిలువఁబడియున్న నాతో మాటలాడుటలో మునసబుగారును కామరాజుగారును నాగరాజుగారి యింటి కేదో పనిమీఁదఁ దమ్మఁ బంపినట్లు పొరపాటునఁ గొన్నిమాటలు జారవిడిచెను. నేనాయనను బంపివేసి వెంటనే నాగరాజుగారి యింటికిఁ బోయి యాముక్కలుబుట్టను దీసికొనివచ్చి నాపెట్టెలోఁబెట్టి తాళము వేసితిని. ముక్కలనిచ్చినచోఁ దన కేనూఱురూపాయ లిచ్చెదమని సందేశము పంపిరనియుఁ దాను నిరాకరించితిననియు నాగరాజుగారు తరువాత నాతోఁ జెప్పిరి. అటుపిమ్మట రెండుమూడుదినములలో నాకు మొదటముక్కలను దెచ్చియిచ్చిన న్యాయవాది మాయింటికి వచ్చి తనకాదినమున న్యాయసభలో పనిలేదనియు బుట్టతీసికొనిపోయి తీర్పుల నతికించెద ననియుఁ జెప్పెను. నే నామాటనమ్మి ముక్కలబుట్ట నిచ్చివేసితిని. కామరాజుగారేదో మహోపాయము పన్ని ముక్కలబుట్ట నపహరించిరని నాటిసాయంకాలమే పట్టణములో నొకప్రవాదము కలిగెను. కామరాజుగారు ధనకాములయినవారికి ధనమిచ్చియు స్త్రీకాములయినవారికి స్త్రీలను సంధించియు వివిధమహోపాయములచేత స్వకార్యమును సాధించుకొనుట పరమసామర్థ్యము గలవారు. ముక్కలబుట్ట ప్రతికక్షులను జేరినదన్న వార్త నాచెవిని బడఁగానే నేనా న్యాయవాది కడకుఁ బోయి యడుగఁగా నతఁడాబుట్టలో పనికివచ్చు ముక్కలేవియు లేనందున వానిని రాల్చివేసితినని చెప్పెను. అంతటితో నన్నిముక్కలును పోయినవని యెల్లవారును దలఁచియుండిరే కాని నాయొద్ద నింకొక్కతీర్పు మిగిలియున్నదని నామిత్రులు సహిత మెఱుఁగరు. కామరాజుగారు గూఢచారులనుబెట్టి నేనెక్కడెక్కడకుఁ బోవుచుందునో యెవ్వరెవ్వరితో మాటలాడుచుందునో యేమేమి పని చేయుచుందునో నావర్తనము సర్వమును గనిపెట్టుచుండెడివారు.

మంత్రిపాటి రామయ్యగారి విన్నపముపైని మండల న్యాయాధిపతిగారు విమర్శకు జూన్ నెల 26 వ తేది నిర్ణయించి, సాక్షులకాహ్వానములు పంపి, ఆయావ్యాజ్యముల గ్రంథములు పంపుమని ప్రాడ్వివాకున కుత్తరువు చేసిరి. విమర్శదినము రాకమునుపే యేలాగుననో కాని మండలన్యాయాధిపతిగారి పెట్టెలోని తీర్పుల ముక్కలు సిరస్తాదారుగారి చేతిలోనికి వెళ్ళినవి. అత్యంతసమర్థుఁడును పరమతాంత్రికుఁడును నానోపాయవిశారదుఁడు నైన చిత్రపు కామరాజుగారా ముక్కల నేలాగుననైన నపహరింపవలెనని సర్వవిధములఁ బ్రయత్నించుచుండిరి. అప్పుడు మండలన్యాయసభలో సిరస్తాదారుగా నుండిన రోజారిహోదారగారివద్ద లంచములవ్యవహారములలో దండశాఖాలేఖ్యరక్షకుఁడైన (Criminal Record-Keeper) బొల్లాప్రగడ వెంకన్నగారు మంత్రిగా నుండిరి. ఈమంత్రిమణిగారు నూఱురూపాయిలు లంచము మాటాడినప్పుడు పాతికరూపాయిలతోనే సిరస్తాదారుని తృప్తిపఱచి తక్కిన ముప్పాతికరూపాయలను తనకష్టముకై తానే స్వీకరించుచుండెడి శక్తియుక్తులు గలవాఁడని వాడుక. అనుదినమును సూర్యనమస్కారములు చేయుచు నిష్పాపుడయి యుండెడి యీమంత్రిశిఖామణికి మున్నూఱురూపాయలిచ్చి చిత్రపు కామరాజుగారు తీర్పుల ముక్కలను తీసివేయించుట కేర్పాటు చేసిరఁట. ఈమొత్తములో నిరువదియైదురూపాయలును రెండుసారాబుడ్లును దక్క సిరస్తాదారుగారికి మఱేమియు దక్కలేదఁట. న్యాయసభలో మండలన్యాయాధిపతిగారి సముఖమున బ్రదర్శింపఁబడినముక్కలను దీసివేయుటయెట్లా యని గొప్పవిచారము పుట్టినది. ముక్కలను దొంగలెత్తుకొని పోయినట్టు కనఁబఱుపవలెనని వారు మొట్టమొదట నాలోచించి సరి యనుకొనిరి. ఆయాలోచనముబట్టి తెల్లవాఱి విమర్శ యారంభమగు ననఁగా 25 వ తేది రాత్రిన్యాయసభాభవనము యొక్క గోదావరివైపున నున్న తలు

పోకటి తెలుపఁబడి, సిరస్తాదారుని యొక్కయు నొక లేఖకునియొక్కయు వ్రాఁతపెట్టెలు పగులఁగొట్టఁబడి, కాగితములు చిందరవందరగా నేలమీఁద చిమ్మివేయఁబడినవి. సొమ్ముపెట్టె సమీపముననేయున్నను దాని నెవ్వరును ముట్టుకొనలేదు. కామరాజుగారి వ్యవహారముతో సంబంధించిన కాగితములను న్యాయసభాభవనములో దొంగలుపడి యెత్తుకొనిపోయిరని పట్టణమున గొప్ప ప్రవాదము పుట్టినది. నాఁడు విచారణదిన మగుటచేత సాక్షులును పౌరులును పగలు పదిగంటల కాకమునుపే సభాభవనమునకుఁ బోయి యుండిరి. సాక్షినయి యుండుటచేత నేనును మిత్రులతోడ సభామందిరమునకు ముందుగానే పోయియుంటిని. అప్పటికి సభాభవనములో నొకవింత నడుచుచున్నది. అవలకే సిరస్తాదారుగారును క్రిమినల్ రికార్డుకీపరుగారును వచ్చి యొకగదిలో తలుపులు వేసుకొని కూర్చుండి రహస్యముగా నేదో పని చేయుచుండిరి. నేనును నామిత్రులును తాళముచెవి పెట్టు తలుపుసందులోనుండి యొక రొకరుగా లోపలఁ జూచితిమి. సిరస్తాదారుగారును బొల్లాప్రగడ వెంకన్నగారును ఒకచోటఁ గూరుచుండి కాగితపుముక్కల నొకకాగితపుసంచిలో వేయుచుండిరి. వారిపార్శ్వమున దీపము వెలుఁగుచుండెను. ముద్రవేయుటకుఁగాఁబోలును లక్కకణిక వెంకన్నగారిచేతిలో నుండెను. ఇంతలో న్యాయాధిపతిగారును సభకు విజయంచేసిరి. ఆయన స్వపీఠము నధిష్ఠింపఁగానే మిర్తిపాటి రామయ్యగారు వచ్చి తనచేత నర్పింపఁబడిన ముక్కలు మార్పఁబడుచున్న వనియు, వెంటనే తనముక్కలను దనకుఁ జూపవలసినదనియు, న్యాయాధిపతిగారి ముందఱ మొఱ్ఱపెట్టుకొనెను. కొంచెముసేపటికి సిరస్తాదారువచ్చి యతికించియుండనిముక్కలనుగొన్నిటిని దెచ్చి న్యాయాధిపతిగారి బల్లమీఁదపెట్టెను. శోధించి చూచి యవి తాను కాగితపుసంచిలోఁ బెట్టియిచ్చిన ముక్కలుకావనియు, సిరస్తాదారు ముక్కలను

పోవుచుండఁగా చూచినసాక్షులున్నారనియు వెంటనే విమర్శచేయ వలసినదనియు, మిట్టిపాటి రామయ్యగారు బహువిధముల న్యాయాధిపతిగారిని ప్రార్థించెను. ముక్కలు పోయినందుకుఁ దావాచేయవలసిన పని లేదని న్యాయాధిపతిగారు సెలవిచ్చిరి. అంతేకాక మామండల న్యాయాధిపతిగారు మిట్టిపాటి రామయ్యగారినిపిలిచి, నీవపకారము నొందిన వాదిప్రతివాదులలోఁ జేరినవాఁడవుకావు. గావున నీవిన్నపమును విమర్శింప వలనుపడదని చెప్పి పంపివేసిరి. మండల న్యాయసభలోని న్యాయవిచారణ నాఁటి కీవిధముగా ముగిసినది. అవలను కాము రాజుగారును తత్పక్షావలంబులును నయమున భయమున బుజ్జగించియు బెదరించియు మిట్టిపాటి రామయ్యగారినే వశ్యునిజేసికొని తమపక్షమునకుఁ ద్రిప్పుకోవలెనని కృషి చేసిరికాని సఫలమనోరథులు కాలేక పోయిరి. 'బలవంతులతో నేల విరోధపడియెదవు ? ఈపనివలన నీకు వచ్చెడులాభమేమి !' అని యడిగెడివారితో నెల్లపుడు తా నావలనఁబొందిన యుపదేశానుసారముగా ప్రజాక్షేమము (Public good) కొఱకని చెప్పుచువచ్చెను. అందుచేత జను లతనిని గొంతకాలము 'పబ్లిక్‌గుడ్డుగాఁ' డను వినోదనామముతో కోడిగములకుఁ బిలుచుచుండిరి. ముక్కలు దొంగలెత్తుకొనిపోయిరని చెప్పుటకయి పెట్టెయుండట రాత్రివేళ తలుపుతెఱచి కాగితములను తాఱుమాఱుగా పాఱవైచినను, కాగితములనిమిత్తమే దొంగలు పడిరన్నచో నేరము చిత్రపు కామరాజుగారిమీఁదనో మునసబుగారిమీఁదనో సిరస్తాదారుగారిమీఁదనో మోపఁబడునని భయపడి వారు తరువాత ముక్కలు పోలేదని పలుకుచు చిత్రపు కామరాజుగారి వ్రాఁతలో నున్న పనికిమాలినముక్కలను దెప్పించి గదిలోఁ గూరుచుండి రహస్యముగా వానిని పూర్వపుముక్కలతో మాఱుగా నొక కాగితపుసంచిలో వేసి ముద్ర వేసిరి. ముక్కలుపోలేదని సిరస్తాదారుగారు కడపట మండల

న్యాయాధిపతిగారిముందు పెట్టి చూపినవి యీగ్రొత్తముక్కలే. ఈ ప్రకారముగా ముక్కలుపోయినను వ్యవహార మంతటితో పోలేదు.

రాజమహేంద్రవురారక్షక పర్యవేక్షకుడు (Police Inspector) ఈ యన్యాయమునువిని విచారపడి నన్ను మండలారక్షకాధ్యక్షుని (District Police Superintendent) కడకుఁ గొనిపోయి మాటాడెను. ఆరక్షకాధ్యక్షుఁడు జరిగినదంతయువిని మనసు కరఁగినవాఁడయి యీ వ్యవహారములో తనచేతనైన పనియంతయుఁ జేసెదనని చెప్పి, న్యాయసభలో జరిగిన చౌర్యవిషయమయి విచారణ జరుపుటకు సెలవియ్యవలసినదనియు, పోయినముక్కల విషయమయి సిరస్తాదారునియొక్క యాలోచనమీఁదనే యీపని జరగినట్టనుమానింపఁ దగియున్నదనియు మండల న్యాయాధిపతి కుత్తరము వ్రాసెను. అట్టి విచారణ యావశ్యకము లేదనియు, వస్తువులేవియు పోలేదనియు, ముక్కల దొంగతనమునుగూర్చి తనసిరస్తాదారు విషయమయి సందేహపడుట కవకాశము లేశము లేదనియు నతఁడు బదులువ్రాసెను. అందుపైని మండలారక్షకాధ్యక్షుఁడు జరగినసంగతి యంతయు నాచేతవ్రాయించి పుచ్చుకొని నామిత్రుల నొక రిద్దరినిగూడ విచారించి తాను వెంటనే కాకినాడకుఁ బోయి మండలదండవిధాయితో నడచిన కథయంతయు విన్నవించి, సిరస్తాదారుని క్రిమినల్ రికార్డుకీపరును పట్టుకొనుటకయి యాయనయొద్దనుండి యధికారపత్రములను (Warrants) గొని వచ్చెను. ఆమఱునాఁడు రొజారియోదొరవారును చిల్లాప్రగడ వెంకన్నగారును భోజనముచేసి న్యాయస్థానమునకుఁ బోవు నిమిత్తము బట్టలు కట్టుకొనుచున్న సమయములో నారక్షకభటులు వారియిండ్లకు బోయి వారినిరువురను బట్టుకొని యా రక్షకస్థానమునకుఁ గొనిపోయి కొట్లలోఁ బెట్టిరి. ఈ సంగతి తెలియఁగానే యూరంతయు నల్లకల్లోలమయ్యెను. ఎల్లవారును పురమున నెక్కడఁజూచినను ఈవిషయము

వనే ముచ్చటించుచుండిరి. ప్రతిపక్షులపక్షమువారు తోడనే పరుగెత్తుకొనిపోయి యీ వైపరీత్యమును మండలన్యాయాధిపతిగారితో మనవి చేసిరి. ఆయన యద్భుతపడి సిరస్తాదారుని వెంటనే విడిచిపెట్టవలసినదనియు, అతఁడు నిర్దోషియనియు, అతఁడు లేకపోవుటచేత న్యాయస్థానకార్యముల కడ్డంకి కలుగుచున్నదనియు, ఆ రక్షకాధ్యక్షుని పేర లేఖ వ్రాసెను. ఆ రక్షకశాఖవారు దానిని మన్నింపక యీ సాయంకాలమే వారినిరువురను పడవ యెక్కించి కాకినాడ మండలదండవిధాయియొద్దకుఁ దీసికొనిపోయిరి. సాక్ష్యమిచ్చుటకు మేమును వారితోడనే పోయితిమి. మండలదండవిధాయిగారు ప్రథమవిచారణచేసి మావలన సాక్ష్యములనుగైకొని, రాజమహేంద్రవరమునకు వచ్చి చౌర్యము జరగినస్థలమును జూచి, మండలన్యాయాధిపతిగారివలన వాఙ్మూలమునుగైకొని, బొల్లాప్రగడ వెంకన్నగారిని విడిచిపెట్టి సిరస్తాదారుగారినిమాత్ర మంతిమవిచారణ నిమిత్తము మండలదండాధికారి కార్యస్థానమునకుఁ బంపిరి. మామండల దండాధికారియు న్యాయాధిపతియు నయిన వారేనుదొరగారీవ్యవహారములో సాక్షియయి యుండినందున చెన్నపురి యున్నతన్యాయసభవారు విచారణనిమిత్తమీ వ్యవహారమును కృష్ణామండల దండాధికారి కార్యస్థానమునకుఁ బంపిరి. అక్టోబరు నెలలో నక్కడ విచారణ జరిగెను. ఈ మూడు మాసములును మాసిరస్తాదారుగారు కారాగృహమునందే యుండవలసినవా రయిరి. మా సిరస్తాదారుగారి స్థితి మిక్కిలి శోచనీయమైనదిగా నుండెను. ఆయన యీవ్యవహారములోఁ బొందినలాభ మత్యల్పము. ఆయన కెనమండుగురో తొమ్మండుగురో బిడ్డలు. ఏనెల జీత మానెలలోనే యన్నపానములక్రింద వ్యయపడుచుండుటచేత నింట పదిదినములు గ్రాసమునకైనను నిలువలేదు. ఆయనస్థితిని విచారించి తుదతో విచారణచేసిన మండలదండాధికారిగారికిని ప్రతిపక్షులకైయున్న

మాకునుగూడ పరితాపకరముగా నుండెను. విచారణ జరిగినమీఁదట కృష్ణామండల దండాధికారిగా రగు కెల్సాలుదొరగారు సరియైన ముక్కలు మండలన్యాయసభలో నర్పింపఁబడినందుకు లేశమైనను సందేహము లేదనియు, ఆముక్కలుపోయి వానిస్థానమున వేఱు ముక్కలువచ్చుట నిశ్చయమేయైనను సిరస్తాదారే వాని నపహరించి నట్టు సాక్ష్యము లేనందున నతఁడునిర్దోషియనియు, వ్రాసి కోజారిదొరగారిని విడుదల చేసిరి.

ఈలోపల మా వివేకవర్ధనిలో వ్రాయఁబడిన యంశమును జూచి చెన్నపురి దొరతనమువా రున్నతన్యాయసభ వారికి వ్రాయఁగా, వారు విమర్శచేసి పర్యవసానము తమకుఁ దెలుపవలసినదని మా మండలన్యాయాధిపతిగారి కుత్తరు విచ్చిరి. అప్పుడు మండల న్యాయాధిపతిగారు మేలుకొని నన్నును మఱి కొందఱిని పిలిపించి విమర్శ కారంభించిరి. విచారణారంభదినమున మా ప్రతిపక్షులైన చిత్రపు కామరాజుగారు మొదలగువారు మహోల్లాసముతో సభకువచ్చి నవ్వుమొగములతో నావజ్ఞముగా నావంక సారెసారెకుఁ జూచుచు నాకెదురుగా కుర్చీల నలంకరించి కూరుచుండిరి. ఈవిచారణలో నేను తప్పక కారాగృహమునకుఁ బంపబడుదునని వారికిమాత్రమే కాక యెల్లవారికిని గట్టినమ్మకము కలిగియుండెను. నాయొద్దనుండిన తీర్పుల ముక్క లన్నియు పదులపాలయి భగ్నములై పోయినవి; వాని నన్యాక్రాంతముచేసిన సిరస్తాదారుగారు మండలసభలో నిర్దోషులుగా నెన్నఁబడి విముక్తులైరి; విచారణకుఁబూనిన మండలన్యాయాధిపతిగారు నాపైని సదభిప్రాయము లేనివారయి ప్రతిపక్షులపక్షము నవలంబించినవారుగా నుండిరి. ఇట్లు నిమిత్తములన్నియు పైకి నాకు ప్రతికూలములుగాఁ గనఁబడుచుండినను కడపట సత్యము జయింపకపోదని నాకు మాత్రము ధైర్య ముండెను. నాయొద్ద నింకొకతీర్పుముక్క

మిగిలియున్నదని నామిత్రులకుఁగాని యమిత్రులకుఁగాని తెలియదు. అన్నిముక్కలట్లు విఫలములై పోయినప్పు డీయొక్కముక్కమాత్రము సఫలమగునని యూహించుట కంత యవకాశము లేకపోయినను, ఇట్లు వెడలునప్పుడు నేనాతీర్పు కాగితమును చొక్కాసంచిలో వేసికొనియే న్యాయసభకుఁ బోయితిని. మండలన్యాయాధిపతిగారు తమ ప్రక్కనే క్రింద నాకొకకుర్చీనివేయించి కూర్చుండ సెలవిచ్చిరి. విచారణ యారంభమగుటకు ముందుగా నేనొక కాగితముమీఁద నావద్ద కామరాజుగారి వ్రాతతోనున్న చిత్తుతీర్పొకటి యున్నదనియు ఆ వ్యాజ్యపుగ్రంథమును వెంటనే తెప్పించెడిపక్షమున దానిసంఖ్యను దెలిపెదననియు, వ్రాసి న్యాయాధిపతిగారిచేతి కిచ్చితిని. సంఖ్య చెప్పవలసినదని నా వ్రాఁతక్రిందనే వ్రాసి యాయన యాకాగితమును నా చేతికిచ్చెను. దానియడుగున సంఖ్యను వ్రాసి కాగితమును మరల నేను దొరగారి కిచ్చితిని. ఆయన తత్క్షణమే యొకయుత్తరపుకాగితము నందుకొని దానిపై నేమోవ్రాసి యాలేఖ నొక కాగితపుసంచిలో వేసి జిగురంటించి చెంతనున్న భటునిబిలిచి పరుగెత్తుకొనిపోయి నీ విది ప్రాడ్వివాకసభలోనిచ్చి వారిచ్చినది గొనిరమ్మని యాజ్ఞాపించెను. నాకును దొరగారికిని నడచినయుత్తర ప్రత్యుత్తరము లేవో యితరుల కెవ్వరికిని దెలియలేదు. ప్రాడ్వివాకసభ యీ యావరణలోనే యుండినందున పోయినభటుఁ డరగంటలోపలనే యావ్యాజ్యపుగ్రంథమును గొనివచ్చి దొరవారిచేతి కిచ్చెను. అప్పుడు నా జేబులోని కాగితమును పైకిఁదీసి దొరగారిచేతి కిచ్చితిని. దొరతనమువారి న్యాయవాది యగుటచేత కామరాజుగారి వ్రాఁత యందఱకుఁ దెలిసినదిగానుండెను. నే నిచ్చిన చిత్తుకాగితములో హంసపాదులు తుడుపులు ననేకము లున్నవి. వ్యాజ్యపుగ్రంథములోనితీర్పు సరిగా దానికి శుద్ధప్రతిగా నున్నది. ఆరెంటిని జూడఁగానే దొరగారికి మునుపున్న యభిప్రాయ

మంతయు నొక్కసారిగా మాఱిపోయినది. ఆయన యాచిత్తుతీర్పును దీసి కామరాజుగారిచేతి కిచ్చి యిది నీవ్రాఁతయగునా కాదా యని యడిగెను. అకస్మికముగాఁ జూపఁబడుటచే నాలోచించుకొనుట కవకాశములేక చేతులు వడఁక గద్గదస్వరముతో 'నావ్రాఁతవలెనే యున్నది' అని యాయన బదులు చెప్పెను. 'ఇదితప్పక నీవ్రాఁతయే. సత్యము నాకిప్పుడు బోధపడినది. (నన్నుఁజూపి) ఇతఁడున్యాయస్థుఁడు. సిరస్తాదారును మీరును గలిసి యీతనిపై నాకు దురభిప్రాయమును గలిగించితిరి. ఈవఱకుపోయిన ముక్కలన్నియు నిజమైనవే. ఆముక్కలను సిరస్తాదారునకు లంచమిచ్చి మార్పించినవాఁడవు నీవే. విమర్శనిమిత్తము రేపటిదినము నిన్ను దండవిధాయియొద్దకుఁ బంపెదను అని కోపముతోఁ బలికి, మామండలన్యాయాధిపతిగారు కాగితమును కలమును గైకొని సిరస్తాదారును క్రిమినల్ రికార్డు కీపరును పనిలోనుండి తొలఁగించినట్టువ్రాసి చదివి వినిపించెను. నాటికి సభముగిసినది. నవ్వుమొగముతో సభను ప్రవేశించిన మాప్రతిపక్షులు తొంటి యుత్సాహమును గోలుపోయి యేడుపుమొగములతో సభనువిడిచిరి. సత్యము తెలిసిన తరువాత సహితము తమ పూర్వాభిప్రాయమును మార్చుకొనొల్లని మనవారిలో ననేకులవలెఁ గాక యూరపియనులు సాధారణముగా తాము పడిన దురభిప్రాయము తప్పని తెలియఁగానే దానిని మార్చుకొందురు. కామరాజుగారు సభనుండి యింటికిఁబోయి తా మవమానమునుండి తప్పించుకొనుట కిఁకమార్గములేదని విచారించి తనసొత్తువిషయమై మరణశాసనమును వ్రాసి ముగించి యారాత్రియే విషము త్రాగి యాత్మహత్య చేసికొనిరి. నాఁడు తెల్లవారుజామున నాలుగుగంటలకు గవర్రాజుగారు మాయింటికివచ్చి నన్ను లేపి తన్మరణవార్తను దెలిపినప్పుడు నాకతివిస్మయమును విచారమును గలిగినవి. మండలన్యాయాధిపతిగారు రొజారియోగారిని బొల్లాప్రగడ

వెంకన్నగారినికూడ పనిలోనుండి తొలఁగింపఁగా, వారున్నత న్యాయ సభవారికిని దొరతనమువారికిని విజ్ఞాపన పత్రములను బంపుకొనిరి గాని వానివలనఁ గార్యము లేకపోయెను. సిరస్తాదారుగా నుండిన రోజారియో రన్నవస్త్రములకు లేక బిడ్డలతో బాధపడుచు యాచించుటకయి నాయొద్దకు సహితము వచ్చుచుండెడివాఁడు. అల్పకాలములోనే యతఁడు మతిచాంచల్యమునొంది కడపట పిచ్చివాండ్ర వైద్యశాలలో దుర్మరణము నొందెను. ఉన్నతన్యాయసభవారు పోలూరి శ్రీరాములుగారినికూడ లంచములు పుచ్చుకొన్నందుకు విమర్శ చేయవలసినదని మండలన్యాయాధిపతి కుత్తరువియ్యఁగా, విమర్శమధ్యముననే యాకస్మికముగా నతఁడును దేహవియోగము నొంది యిహలోకదండనమును తప్పించుకొనెను. ఆయన మరణమునకును గారణమాత్మహత్యయే యని జను లప్పుడనుకొనుచు వచ్చిరి. ఆయన లంచములమూలమున సంపాదించిన ధనమంతయు నీవ్యవహారములో వ్యయపడుటయేకాక మునుపున్నదికూడ పోయెనఁట. ఈశ్వరబలము ముందటను సత్యబలము ముందటను మనుష్యబలమును ధనబలమును గవ్వకును కొఱగావు. ఈశ్వరబల మున్నపక్షమున పూరిపుడకయు వజ్రాయుధ మగును; ఈశ్వరబలము లేనిచో వజ్రాయుధము సహితము పూరిపుడకయగును. ఈశ్వరబలమును సత్యబలమును ధర్మబలమును గలిగియుండఁబట్టియేకదా యెందునకును బనికిరానిదని పెంటలో పాఱవేయఁబడిన చింపిరికాగితపుముక్క లుత్తమసాధనములయి సాక్ష్యమిచ్చి యిందఱిప్రాణములను మానములను ధనమును జీవనమును గావఁగలిగినవి! లోకములో సత్యమును ధర్మబలమునే బలములుగాని యవిలేని యధికారబలమును విత్తబలమును బలములు కావు.

ఆకాలమునందు శరీరప్రయాసముగాక నాకునుగొన్నికష్టములు వచ్చినవి. మూఢజనులు వానిని గొప్పవారితో వైరము పెట్టుకొన్న

నా యవివేకమున కారోపింపఁ దొడఁగిరి. నే నవలంబించిన పక్షము న్యాయపక్ష మనియు నీశ్వరప్రీతికర మనియు నాదృఢనిశ్చయ మయినందున నామనశ్శాంతి కెప్పుడును భంగము కలుగలేదు. ఇట్టి చిక్కులలోఁ జిక్కుకొనియున్న కాలములోనే సెప్టెంబరు నెల 8-వ తేదిని మేము మొట్టమొదట రాజమహేంద్రవరమున సంఘసంస్కారసమాజమును స్థాపించి పనిచేయ నారంభించితిమి. ఆసమాజములో మొదట నుపన్యాసము లియ్యవలసినభారము నామీఁదనే పడెను. ప్రథమోపన్యాససమయమునకు నా ప్రియమాతకు వ్యాధి ప్రబలి ప్రాణము మీఁదికి వచ్చినందున నే నాయుపన్యాసమును కడవరకును వ్రాయలేక కొంత వాగ్రూపముననే చెప్పవలసినవాఁడ నైతిని. 1878-వ సంవత్సరము సెప్టెంబరు నెల 22-వ తేదిని నాపాలనే పడిన రెండవయుపన్యాసము లియ్యవలసినవంతు వచ్చునప్పటికి నన్నుఁ బెంచి పెద్దవానిని జేసి విద్యాబుద్ధులు చెప్పించి సమస్తవిధములఁ బ్రాణప్రదముగాఁ గాపాడిన ప్రాణాధికురా లయిన నాప్రియజనని నన్ను విడనాడి లోకాంతరగతురాలయి నన్ను దుఃఖసముద్రములో ముంచి పోయినది. ఆమెయుత్తరక్రియలు ముగిసినతోడనే యాదుఃఖములోనే నేను రొజారియోగారి వ్యవహారములో సాక్ష్యమిచ్చుటకు బందరుపురమునకుఁ బోవలసినవాఁడ నైతిని. దుర్ణయపరుల దుర్వ్యాపారములను మాన్పుటకయి ప్రయత్నించుటచే నా కెందఱితోనో వైరములు సంభవించెను గాని యా యల్పాంశము లన్నియు నిచ్చట వివరింపవలసినవి కావు. 1878-వ సంవత్సరాంతమునఁ బ్రకటింపఁబడిన వివేకవర్ధనిలో నిట్లు వ్రాయఁగలిగితిని. "మేమీపనిని పత్రికాప్రకటనమును, పూనుకొనుట దేశముయొక్కయు ప్రజలయొక్కయు క్షేమలాభములకొఱకే కాని ధనలాభమున కాశపడి కాదు. లోకవ్యాధికారణభూతు లయియున్న కొందఱి దుశ్చేష్టలను వెల్లడిచేయుటవలన, అట్టివారు మాకు

శత్రువులుగా నేర్పడిరి. అయినను ఒకరి యనుగ్రహమున కపేక్షపడి గాని ఒకరినిగ్రహమునకు వెఱచిగాని పత్రికావిలేఖకత్వము ననుసరించి మాకు విధిగా నేర్పడిన కృత్యమునుండి తొలఁగకుండుట మా పూనిక గాన, కొందఱితో విరోధపడినను జనసంఘమునకు మేలుచేయఁ గలిగితిమిగదా యని యానందించుచున్నాము.''- దూరమున నున్న రాజధానీపరిపాలకులను రాజప్రతినిధిని హిందూదేశరాజ్యకార్యదర్శిని తుదకు మహారాజచక్రవర్తిని తప్పు లెన్ని దూషించుట నిరపాయకర మయినపనిగాని తాను వసించుతావుననుండు ననుగలదండవిధాయిపైని గాని యారక్షకభటునిపై తప్పెన్ని వ్రాయుట యనపాయకరమైన పని కాదు. అయినను తప్పుచేసినప్పు డనుగలదండవిధాయినిగాని మండల దండ విధాయినిగాని యారక్షకభటాధ్యక్షునిగాని ధర్మాధికారినిగాని మఱి యేయధికారినిగాని ఖండింపక మావివేకవర్ధని విడిచిపెట్టి యూర కుండలేదు. వివేకవర్ధనియొక్క యాక్షేపములకుఁ బాత్రులైన యధి కారు లనేకు లనేకవిధముల దానిని రూపుమాపుటకయి ప్రారంభదశలో ప్రయత్నములు చేసిరిగాని వారికృషి సఫలము కాలేదు. చిత్రపు కామరాజుగారి వ్యవహారమువంటి వ్యవహారములలో మహాప్రబలు లయిన యధికారులే పరాభవము నొందవలసినవా రయినమీఁదట వివేకవర్ధనిపేరే భయంకరమయి దుష్టాధికారులకు గర్భనిర్భేదకమ య్యెను. అటుతరువాత దండవిధిచేతవివేకవర్ధనిని భంజింపవిజృంభించిన వారు కానరాలేదు. దండోపాయముచేత వివేకవర్ధనిని నిగ్రహిం చుట యసాధ్యమని తోఁచినతరువాత కొందఱుబుద్ధిమంతులు సామో పాయముచేత దానిని సాధింపఁ జూచిరి. నా కప్పుడు రాజమహేంద్ర వర రాజకీయశాస్త్రపాఠశాలలో నెల కిరువదియైదు రూపాయల జీతము. ఆరంభములోనే నెలకిరువదియైదురూపాయల పనిని కరగ్రాహి కార్యస్థానములో నిచ్చునట్లు నేను కోరకయే నాకొక వాగ్దానము

వచ్చెను. విమోహకరమైన యాపని నప్పు డంగీకరించినయెడల నేనొకవేళ గొప్ప లౌక్యాధికారిపదము నొందియుందునేమోకాని నా స్వాతంత్ర్యభావమును పారమార్థికచింతను మనశ్శాంతిని తప్పక కోలుపోయియుందును. నాకప్పు డుపకారము చేయఁబూనినవారు సచ్చింతతోనే చేసియుండవచ్చునుగాని వారు వివేకవర్ధని నడఁచివేయవలెనను తలంపుతోనే నాయం దట్టి నిర్హేతుకప్రేమను బూనిరని యెందుచేతనో నాకప్పు డొకదురూహ తోఁచెను. ఆపని నంగీకరించినపక్షమున నేనట్టివారిక్రింద కొలువుచేయవలెనో నేనెఱుఁగుదును. మా పాఠశాలయందుఁ బరీక్షాసిద్ధులయి నూనూఁగుమీసములతోను శృంగారతిలకములతోను జాలుగోఁచులుగల చలువవలువలతోను స్వచ్ఛందవృత్తిని విహారి. పమరగినవిద్యార్థు లట్టికొలువులలోఁ బ్రవేశించినయల్పకాలములోనే మీసములు గొఱిగించుకొని ముఖమున విభూతిరేఖలు దీర్చి బిళ్ళగోచులుపెట్టి నీరుకావిదోవతులు కట్టుకొని యానవాలు పట్టరాని మాఱువేసములతో చరించుచుండుట నేను దినదినమును జూచుచుండెడివాఁడను. ధనాశచే నట్టిపని కొడఁబడినయెడల వారి యవస్థయే నాకును బట్టునని భయపడి నాహితులు చెప్పినబుద్ధి వినక యాపని నిరాకరించితిని. అప్పుడు కృష్ణామండలములో నుండిన చల్లపల్లి రంగయ్య పంతులుగారును గంజాంమండలములో నుండిన దివాన్ బహదూర్ వల్లూరి జగన్నాథరావు పంతులుగారుకూడ నిర్వ్యాజమైన సదుద్దేశముతోడనే నాకాశాఖలో మంచిపనులు చెప్పించి నన్నున్నతదశకుఁ దేఁజూచిరిగాని నేను మొదటినుండియు నధికారమునందును ధనార్జనమునందును విశేషకాంక్ష గలవాఁడను గాకపోవుటచేత నే నావిషయమున నంతగా నాదరమును జూపలేను.

ఆకాలమునందు జరిగిన యొక ముఖ్యాంశమును మాత్రము సంక్షేపించి చెప్పి యీప్రకరణమును ముగించుచున్నాను. నేనును నా

మిత్రులు కొందఱును గూడి యప్పుడప్పుడు భగవత్ప్రార్థనలు చేసి కొనుచుండెడివారముగాని యావఱకు రాజమహేంద్రవరములో వార వారమును మానసికముగా నీశ్వరోపాసనము చేయు సమాజము లేకుండెను. అట్టిసమాజము నొకదానిని స్థాపింపవలసినదని నామిత్రులయిన బుర్రా రాజలింగముగారు నన్నడిగిరి. ముఖ్యముగా ఆయనప్రార్థనము మీఁదనే ప్రార్థనసమాజమును 1878 వ సంవత్సరములో మొదట మాగృహమున స్థాపించితిమి. అప్పుడు నేనును, బుర్రా రాజలింగము గారును, బసవరాజు గవర్రాజుగారును, ఏలూరి లక్ష్మీనరసింహము గారును, బయప్పునేడి వేంకటజోగయ్యగారును, కన్నమురెడ్డి పార్థసారథినాయఁడుగారును, సమాజముగాఁ జేరితిమి. సమాజముపేరు విని పెద్దమనుష్యులు సహితము పరిహాసించువారగుటచేత మేము ప్రతివారమును ప్రాతఃకాలమున మా మేడపైని తలుపులు వేసికొని కూరుచుండియే ప్రార్థనలు చేసికొనుచుండెడివారము. అప్పుడు పార్థసారథి నాయఁడుగారు కీర్తనలు పాడుచుండెడివారు; నేను చిన్న ధర్మోపదేశము వ్రాసి చదివెడివాఁడను. నేనప్పుడు చేసినధర్మోపదేశములు 1879-వ సం||రపు వివేకవర్ధనిలోఁ బ్రకటింపఁబడినవి. కొన్ని నెలలైన తరువాత మామిత్రులను గొందఱను ప్రార్థనా సమయములయందు రానిచ్చెడివారము. సంవత్సరమైనతరువాత సమాజమును బహిరంగముగా విజయనగరము మహారాజుగారి బాలికాపాఠశాలకుఁ గొనిపోయితిమి. ఇప్పుడీప్రార్థన సమాజమునకు స్వకీయమైన మందిరమే యేర్పడియున్నది. ఈ ప్రార్థనసమాజమెన్నియో సత్కార్యములకును, ఎందఱివర్తనమునో చక్కఁబఱుచుటకును, కారణమైనదని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. దీనివలన బాగుపడినవారిలో నొక్కరి నిందుఁ బేర్కొనెదను. మాపట్టణమున నందూరి జగ్గరాజుగారని నియోగిబ్రాహ్మణుఁ డొకఁ డుండెడివాఁడు. ఆయనకు విధవలలో

సంబంధముండెననియు, తన్మూలమున ధనార్జనము చేయుచుండెనని యు, పెద్దపేరుండెను. ఆయన యొకనాఁ డొకమిత్రునితోఁగూడి ప్రార్థనసమాజమునకు వచ్చి మాప్రార్థనలను ధర్మోపన్యాసమును విని నాఁటినుండి క్రమముగా ప్రార్థనలకు వచ్చుచుండెను; తన వెనుకటి దుర్వర్తనమునువిడిచి సన్మార్గము నవలంబించెను. అదిచూచి విగ్రహా రాధకు లాతనితల్లియొద్దకుఁ బోయి దుస్సహవాసముచేత సమాజము నకుఁబోయి నీకొడుకు చెడిపోవుచున్నాఁడని చెప్పిరి. సమాజమునకుఁ బోవలదని తల్లి యతనికి బుద్ధిచెప్పఁజొచ్చెను. అతఁ డొకనాఁడు తన తల్లిని రహస్యముగా బాలికాపాఠశాలకుఁ గొనివచ్చి నేను ధర్మోప దేశముచేయు స్థానమునకు వెనుక తలుపుచాటునఁగూర్చుండఁబెట్టెను. ఆమె నాఁటి యుపాసనమును జూచి యానందించి ప్రతివారమును తన్నక్కడకుఁ గొనిపొమ్మని కొడుకును బ్రతిమాలఁ దొడఁగెను. ప్రార్థ నాసమయమునందు వందలకొలఁది జనులువచ్చి ప్రతివారమును ప్రార్థ నలు విని యానందించి పోవుచుండెడివారు. కొందఱు కోమటులు సహితము తమయంగళ్ళను కట్టిపెట్టి వచ్చి యాసక్తితో ప్రార్థనలను వినుచుండెడివారు. ఈ సమాజమువలననే పూర్వాచారపరాయణు లకు సహితము గుడ్డివాండ్రు కుంటివాండ్రు మొదలైన వికలాంగులకుఁ జేసినదే యుత్తమదాన మనుజ్ఞానము కలిగినది. ఈసమాజమూలము ననే బీదలకు రాత్రిపాఠశాలలు మొదలైనవి మొదట స్థాపింపఁబడినవి.

## నాలుగవ ప్రకరణము.

### స్త్రీ పునర్వివాహ సంస్కార ప్రయాసదశ.

(క్రీస్తుశకము 1880 వ సంవత్సరము మొదలుకొని 1890 వ సంవత్సరమువరకు)

మా వివేకవర్ధని, సంఘదురాచార సంస్కారణము నిమిత్తము మొదటినుండియు పాటుపడుచుండినట్టు మా చదువరు లీవఱకే తెలిసికొని యుండవచ్చును. అతిబాల్యవివాహములు, అతివృద్ధవివాహములు కన్యాశుల్కము మొదలయినవానివలని యనర్థములను బోధించుట కయి బ్రాహ్మవివాహము ప్రకటింపఁబడినది. అది చదువుకొనువారి యొక్క వేడుకకొఱకుమాత్రమే యుపయోగపడెనుగాని యంతకంటె నెక్కువ ప్రయోజనము దానివలనఁగలుగలేదు. ఒకరు తానుపదేశించినదాని ననుష్ఠించి చూపినఁగాని కేవలశుష్కోపన్యాసములవలనను పుస్తకప్రకటనమువలనను కార్యముండదు. సంస్కారకరణమునందత్యంతాభినివేశముగల మేమిద్దఱుముగ్గురము మొట్టమొదట చిన్న చిన్న సంస్కారముల నారంభించి పనిచేసిచూపవలెనని యుద్దేశించుకొంటిమి కాని దానికి మాకు మార్గము కనఁబడలేదు. బాల్యవివాహములను మాన్పవలెనందుమా మేము పనిచేసి చూపుటయెట్లు? మాలోఁ గొమార్తెలున్నవా రొకవేళఁ దమకొమార్తెలకు పదిపండ్రెండేండ్ల ప్రాయమువఱకును పెండ్లిచేయక యట్టెయుంచినను, అది సంస్కారమెట్లగును? రెండుమూడు నాలుగేండ్లపిల్లలకు వివాహములు! మాన్పుట కది మార్గదర్శక మెట్లగును? కన్యావిక్రయ పరాయణులనేకు లెక్కువ ధనము వచ్చునని తమకూఁతులను పదుమూడు పదునాలుగేండ్లు వచ్చు

వఱకె నుంచుచుండలేదా? రెండుమూడేండ్ల బాలికలకు వివాహము చేసినవారిని, శుల్కము నుగ్రహించి తమ కొమారితలను వృద్ధులకును వికలాంగులకును కట్టిపెట్టినవారిని, బహిష్కరించెదమని కులమువారు పనిపూనినంగాని నిజమయినసంస్కారము జరుగదు. కులమువారికిఁగాని జగద్గురులమనియు ధర్మస్థాపన కర్తలమనియుఁ జెప్పుకొనెడు పీఠాధిపతులకుఁగాని యంతటిమగతనము లేదు. రజస్వలలయిన తరువాతనే బాలికలకు వివాహము చేయుట నిజమయిన సంస్కారమును పరులకు మార్గప్రదర్శకము నగును. అప్పుడది చిన్నసంస్కారము గాక పెద్దసంస్కారమే యగును. నాపుత్రికకు రజస్వల యయినతరువాతనే వివాహము చేయుచున్నానని చెప్పి చేయువానిని సహించి యూరకుండక కులమువారు కులమునుండి వెలివేయుదురు. నామిత్రులైన బసవరాజు గవర్రాజుగారు తమకూఁతునకు పదునాఱేండ్లు నిండుటకుముందు పరిణయము చేయనని పలుకుచుండెడివారు గాని తమప్రతిజ్ఞను నెఱపి యితరులకు దారిచూపుటకు వారి కాయువు లేకపోయినది. ఆయనయే తగినంతకాలము జీవించియుండుట తటస్థించియుండిన పక్షమున, చెప్పినంతపనియు తప్పక చేసి తీరెడువాఁడు. జాతినుండి బహిష్కారముండదు గనుక, శాఖాభేదములేక యొక్కొక్కవర్ణములోనివారొండొరులతో వివాహసంబంధములు చేసికొనునట్లు చేయుదమన్నను, మాకదియు నసాధ్యముగానే కనఁబడెను. అట్లు చేయుట కర్తవ్యమని యెల్లవారును జెప్పువారేకాని చేయసాహసించువారు కానరాలేదు. చేసెదమనువారున్నప్పుడు చేసికొనెడివారు దొరకలేదు; చేసికొనెద మనువారున్నప్పుడు చేసెడివారు దొరకలేదు; ఉభయులును దొరికినప్పుడు కార్యము కాలేదు. నామిత్రుఁడును నియోగియునైన యొకసంస్కారప్రియుఁడు తనకొమారితలలో నొకతెను పాఠశాలలో విద్యాభ్యాసము చేయుచున్న యొక వైదికబాలున కిచ్చెదనని చెప్పెను. చదువునందు

తెలివిగలవాఁడును బుద్ధిమంతుఁడు నైన యాబాలుని తండ్రియు తా నా చిన్నదానిని తనకుమారునకు చేసికొనెదనని చెప్పెను. ఇట్లు మాటలలో కొంతకాలము గడచిన తరువాత నామిత్రుఁడు స్వశాఖబాలున కిచ్చియే యాచిన్నదానికి వివాహము చేసెను. ఇది యేమని యడుగఁగా నత డన్యశాఖవరున కిచ్చుట తన కిష్టమే యైనను తనభార్య కిష్టము లేకపోవుటచేత స్వశాఖవానికే యియ్యవలసి వచ్చినదనియు, బీదవారిలో నెవ్వరయిన నొకశాఖవారితో నింకొకశాఖవారు వియ్యమందెడు పక్షమున తాను ధన సాహాయ్యమును జేసెదననియు, చెప్పెను. ఈప్రకారముగానే వివాహాదులయందు భూరిసంభావనలు మొదలయిన దుర్వ్యయముల నొకానొకఁడు సంస్కారప్రియత్వము చేతనే మానివేసినను జను లాతనిని లోభి యనియే భావించి గేలి చేయుదురుగాని సంస్కారప్రియుఁడని యెంచి శ్లాఘన చేయరు. ఆ కాలమునందు రాజమహేంద్రవరమునను తత్ప్రాంతముల యందును వివాహాది శుభకార్యము లయందు బంధుమిత్రాదులను భోజనములకుఁ బిలుచునప్పు డందఱిని యజమానుఁడు స్వయముగాఁ బోయి పిలిచి రావలెను. ఒక్కఁడు ప్రతిగృహమునకును బోవుటకు మిక్కిలికష్టముగా నుండుచువచ్చెను. స్వయముగాఁబోయి పిలువక యెవ్వరినైనను బంపి పిలిపించినపక్షమున నెవ్వరును భోజనములకురారు. ఈకష్టమును వారించుటకయి మేము రెండు సభలుచేసి, భోజనములకుఁ బిలుచుటకయి స్వయముగాఁ బోవుటకుమాఱుగా నాహ్వానపత్రికలను బంచుట యుచితమనియు తన్మూలమున కాలహరణమును, కష్టమును తొలఁగుటయే కాక యనేకవిధముల సౌలభ్యము కలుగుననియు బోధించితిమి, గాని అట్లు పూర్వాచార విరుద్ధమైనపని చేసి చాకలివానిచేత మంగలివాని చేతను చీట్లుపంచి దొరలవలె భోజనములకు పిలిపించినయెడల బ్రాహ్మణజాతి గౌరవమే పోవునని పూర్వనాగరికులు భావించి మాప్రయ

త్నము సాగనీక పోయిరి. ఇఁక నట్టివారితో వాదముచేసి యుక్తి బలముచేత వారినొప్పించుట యసాధ్యమనియెంచి యీనూతనపద్ధతి కనుకూలముగా నున్నవారమందఱమును జేరి మాలోమేము పత్రికల మూలముననే భోజనములకు పిలుచుకొనుటకు కేర్పాటుచేసికొని యట్లు చేయఁజొచ్చితిమి.

మనదేశములో శవములను శ్మశానములకుఁ గొనిపోయెడు విధమును, శవములను ఖననముచేసెడువిధమును, నాగరికులచే గర్హింపఁదగినవిగా నున్నవి. ఎంతగౌరవము కలవారికైనను, ఎంత ధనముగలవారికైనను. మరణముకలుగఁగానే రెండు వెదురుకఱ్ఱలమీఁద వేసి కట్టి పిల్లలును స్త్రీలును జడిసికొనునట్లుగా వీధులలోనుండి తల లల్లలాడుచుండఁగాఁ గొనిపోవుటయు, మరణసమయములయందు బంధువులు తోడుపడి శవములను మోయక ప్రేతపత్నుల నగలఁ దెగనమ్మించియైన డబ్బిచ్చి పనికిమాలిన యపవిత్రులచేత మోయించుటయు, దహనముగాక ఖననముచేయువారిని తరువాత నక్కలును, కుక్కలును పైకీడ్చునట్లుగా కొంచెము లోఁతునఁ బాతి పైని మన్ను వేసి యూరకుండుటయు, బ్రాహ్మణులలోని యవశ్యసంస్కరణీయములైన దురాచారములు. పట్టణములో నెవ్వరియింటనైన మరణాపద తటస్థించినప్పుడు లౌకికులు వైదికులు నన్న భేదములేక యెల్లవారును వెంటఁబోవుటకును ప్రేతమును రుద్రభూమికిఁ గొనిపోయి తోడ్పడుటకును నియమము చేసికొనుటకయి కొన్ని సభలు చేసితిమి. మొదట సభకు విజయంచేసిన లౌకికులలోఁగొందఱు తమకది గౌరవావహము యినదని కాదని కొంత యాక్షేపించి వ్యాఘాతము కలిగింపఁజూచిరి గాని మావాదము సావధానముగా విన్నమీఁదట ప్రాతికూల్యమును మాని యట్లుచేయుట కర్తవ్యమని సిద్ధాంతమొనర్చిరి. ఈపని నాచరణమునకుఁదెచ్చి కొంతమాఱు చేసియుందుము గాని యింతలో మేము

వేఱొక గొప్పసంస్కారములోఁ దిగియుండుటచేత దీనిని సాధారణ ముగా వ్యవహారమునకుఁ దెచ్చుట కవకాశముకలుగలేదు. ఈవిషయ మయి 1888-వ సంవత్సరములో గవర్రాజుగారి మరణానంతరమున నేనుసభలోఁజెప్పిన యొకచిన్నయంశమునునిందుదాహరించుచున్నాను

"మనలో శవములను రుద్రభూమికిఁ దీసికొనిపోవు విధమును గూర్చియు, పూడ్చెడువిధమునుగూర్చియు, మాలో మేము నేకపర్యాయ ములు చర్చించి యీవిషయములో నేదైన మంచిమార్పు కలుగఁజే యుట కర్తవ్యమని మేమిద్దఱమును నిశ్చయించుకొన్నాము. ఇట్లు జరి గిన కొంతకాలమున కనఁగా 1881వ సంవత్సరము నవంబరు నెలలో, ఆయనకు ప్రథమమునఁ బుట్టిన పురుషశిశువు మూఁడు మాసములు పెరిగి పోవుట సంభవించెను. అప్పుడందఱును మృతశిశువును వాడుక ప్రకారముగా పీనుఁగులనుమోచు బ్రాహ్మణునిచేతికిచ్చి పంచి గోదా వరియొడ్డున నిసుకలో పాతిపెట్టింపఁ దలఁచిరి. కాని యట్లు పాతిపెట్టఁ బడిన శిశువులను కుక్కలును నక్కలును పెల్లగించి పయికీడ్చి తిను చుండఁగా సాధారణముగా చూచుచుండుటచేతను, శవవహనాదుల విషయమున యాచారమును మార్చుట యుచితమని యావఱకే తలఁ చియుండుటచేతను, ఆశిశువువిషయముననే క్రొత్తమార్పును జేయ వలెనని నిశ్చయించుకొని శిశువు పట్టఁదగిన కొయ్యపెట్టెను చేయించి శిశుకళేబరము నందుంచి మూఁతకు మేకులు బిగించి దానిని తీసికొని పోవునిమిత్తమయి బండికొఱకు పాఠశాలలో సహోపాధ్యాయుఁడుగా నున్న యొకమిత్రునకు చీటివ్రాయఁగా నతఁడు తన బండి నిచ్చుటకు వలనుపడదని రాత్రి చీఁకటిపడిన తరువాత ప్రత్యుత్తరము పంపెను. అప్పుడద్దెబండి నొకదానిని కుదుర్చుకొని, రాత్రివేళ గవర్రాజు గారును నేనును మఱియిద్దఱు మిత్రులును గలిసి యా పెట్టెను బండిలో పెట్టుకొనిపోయి వారితోఁటలోనే యొకచోటఁ బూడ్చివచ్చి

రిమి. ఆపనిని చేసినందున కాయన నప్పుడు బంధువులెందఱో యెన్ని విధములనో దూషించిరి; మిత్రులనఁబడువారు సహితము కొందఱు పరిహసించిరి; బంధుకోటిలోఁ జేరిన యొక తగుమనుష్యుఁడు శ్మశాన వాటికగా నేర్పఱచిన స్థలమును దప్పించి మఱియొకచోట శవమును పూడ్చినందునకయి పారిశుద్ధ్యశాసనము ననుసరించి మాఁ పురపారిశుద్ధ్య విచారణసంఘము వారియుద్యోగస్థులచేత దండవిధాయకునియొద్ద నభియోగమును తెప్పించుటకు సహితము పాటుపడెను. తామొకన్న శిశువును కాకులును, గ్రద్దలును, నక్కలును, కుక్కలును పీకుచుండఁగా చూడలేక వానికి స్వాధీనము కాకుండునట్లు పాతిపెట్టించుకొన్నప్పుడు లోకు లింత ద్వేషమును వహించుటకు వారి దేమి పడిపోయినదో విచారింపుఁడు."

ఈప్రకారముగా చిన్నచిన్న మార్పులను జేయఁ బ్రయత్నించుచుఁ గ్రమక్రమముగా వితంతువివాహము మొదలైన గొప్పసంస్కారములకుఁ బూనవలయుననియే నే నుద్దేశించియుంటిని గాని యింతలో నొకమిత్రుని ప్రోత్సాహమువలన ముందుగానే యత్యంత దుఃఖనివారకము నవశ్యాచరణీయము నైనవితంతువివాహసంస్కారభారమును పైని వేసికొనవలసినవాఁడ నైతిని. 1874 వ సంవత్సరమునందు చెన్నపురిలోని ప్రముఖులు స్త్రీపునర్వివాహమును బ్రోత్సాహపఱుచుటకయి సమాజ మొకటి స్థాపించి పనిచేయ నారంభించి యన్నిమండలములకును బ్రకటనపత్రికలను బంపిరి. ఆసమాజమునకు శ్రీపల్లె చెంచలరావు పంతులుగారు కార్యదర్శి. నే నప్పుడు నలువదినాలుగు రూపాయల జీతముగల యుపాధ్యాయుఁడనయి యనామకుఁడనై యుండుటచేత వారి ప్రకటనపత్రికలు నావఱకు జేరలేదు. ఆసమాజము రెండు సంవత్సరములకాలము కోలాహలము చేసి విశ్రమించిన తరువాత మరల దాని పేరే వినఁబడలేదు. అది సంకడిచేయుచుండిన కాలములో

విశాఖపట్టణములోని ప్రముఖుల ప్రార్థన ననుసరించి శ్రీమహామహోపాధ్యాయ పరవస్తు వేంకటరంగాచార్యులవారు పునర్వివాహసంగ్రహమను పేరితో స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతమని 1875 వ సంవత్సరమునందొక చిన్నపుస్తకమును వ్రాసి ప్రకటించిరి. ఆపుస్తకము ప్రకటింపఁబడినప్పుడు బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులువారు నాపేర నిట్లు వ్రాసిరి:—

"విశాఖపట్టణములో నుండెడు శ్రీపరవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలుంగారు నవనాగరికాధీనులై వితంతువివాహము కర్తవ్యమని యొక చిన్నపొత్తముం బ్రకటించిరిగదా. తద్విషయమున మనము మిన్నకుండవచ్చునా? తమకుఁ దోఁచినట్లు ఖండన వ్రాసి పంపుఁడీ. నేను నిందస్మత్సభాసదులలోఁ దత్ఖండనపరాయణుండనై యున్నాఁడను. నాస్తికతాహార్మ్యసోపాన నివిష్టపదులైన వారు దుష్టులుగాక శిష్టులగుదురా. మనవారి స్వాచారానాదరమును దురాచార నిషేధ కరణోపేక్షయు నిట్టి దశకుఁ దెచ్చె. మనము నిట్టియెడ మౌనమూనుటమానుగాదు. నవనాగరికులకున్న స్వాతంత్ర్యము మనకును గలదు. జంకనేల? తోఁచిన ధర్మము నిక్కముగా వక్కాణించుట కెల్లరును స్వతంత్రులు కాఁబట్టి తాము దురాచార మర్దనమునకు నడుగిడుఁడు. దైవము మనకుఁ దోడ్పడుఁ గాక. మనము కించిద్జ్ఞులమని శంకింపం బనిలేదు. సర్వజ్ఞుఁడు భగవంతుఁ డొక్కఁడే. కావఁ బ్రాచీనాచార దూషకులగు నవనాగరికులు మనకు జయ్యులు గాఁదగుదురు. ఎందువల్ల ననఁగా వారు స్వోక్తియుక్తి ప్రమాణవాదులు. మనమో ప్రాచీన మహానుభావనివిష్ట కార్యభారులము. కావున మన మన్యులచేతను జయ్యులమైనను, పరాజయము మన కేనాఁడును గలుగనేరదు. ఒకవేళ మనకంటె విధవావివాహవాదులు బలవంతులైనను మనము భీష్మానుయాయుల మగుదుము గాక. మన

ప్రతిపక్షులు భార్గవప్రతిభు లగుదురుగాక. ధర్మమే జయము. చింతయేల? మనమందఱము గూడుకొన్న, బ్రతివాదులు విత్తమత్తులైనను మత్తగజంబులు శృంఖలాబద్ధంబులై కంది కుందు చందంబున నగుట సిద్ధము. "శ్లో. బహూనా మల్పసారాణాం సమవాయో దురత్యయః। తృణై ర్విరచ్యతే రజ్జు ర్బధ్యంతే తేన దంతినః". అనియుంకుట జగత్ప్రసిద్ధము గద. తమ సదుత్తరము ప్రతిక్షణము ప్రతీక్ష్యమాణంబు."

ఈవిషయమున నటుతరువాత చెన్నపట్టణములో సద్దడఁగినను, బందరులోఁ బ్రకటింపఁబడెడు పురుషార్థప్రదాయినీ పత్రికలో నెవ్వరో యప్పుడప్పుడు వ్రాయుచుండెడివారు. పురుషార్థప్రదాయినిలో సౌఖ్యార్థియను నామముతో నెవ్వరో వితంతూద్వాహమును గూర్చి వ్రాసిన దానిని నేను వ్రాసినట్లు భ్రమపడి, చిత్రనళీయాది బహునాటక కర్తలగు బ్రహ్మశ్రీ ధర్మవరపు రామకృష్ణమాచార్యులువారు యువ నామ సంవత్సరములో బళ్ళారి నుండి నాకిట్లు వ్రాసిరి—

మఱియొకటి విన్నవించెద. డిసెంబరుమాసపు పురుషార్థప్రదాయినిలో నుండఁబోలు, "సౌఖ్యార్థి" యను పేర విధవోద్వాహము సమంచితకార్యమని వ్రాసినది మీరేయైయుందురని యూహించుచున్నాను, ఆవిధవోద్వాహము గుణవంతమైనను కాకున్నను, ఇప్పటికిని బహుజనులచే ననాదృతమై యున్నది, మీరట్టిపని గుణవంతమని వాదింపఁ బూనుకొందురేని క్రియాసాధన మేమియు లేకున్నను కొందఱిచేనేని నిందింపఁబడుట యొకటి ప్రాప్తించు. జ్ఞానహీనులగు వారునిందించిన నేకొఱంతయు పాటిల్లదు గావున నేను వారి నిందవమునకు సరకుఁగొన నందురేమో మీరు, పోనిండు. అట్టినిందనేనిం బొంది మీరు సాధించునర్థమేమి? వలదు. 'దేశాభివృద్ధికై లేశమునఁ బ్రాలుమాలక పాటుపడ నిచ్చఁగలవాఁడ' ననియున్నారు గావ

దానివలన మతేమియు సాధించునది లేకున్నను మనము చేయునది యేమో చేయక మానఁగూడదందురా? 'జనసామాన్యము' సమాధానముం బొందినేకదా మీరు దేశాభివృద్ధికిఁ బాటుపడుట. అది లేకున్న నది పాటులోన గణనచేయఁదగినదియు కాదు. మీరిట్టి వాదమునకుం బూనుకొనుటవలన నందఱకుఁ గాకున్నఁ గొందఱకేని యనిష్టమయి యుండునని మున్న విన్నవించితిఁ గదా. అట్లు కొందఱచేనైనను నిందింపఁబడి ఫలసిద్ధిం బొందలేని కార్యమున కేల పూనవలయునో యెఱుంగ, అవధరింపుఁడు. కొన్నాళ్ళక్రిందు చెన్నపురి నుండి యెల్లెడలకు జాబులువచ్చి విధవోద్వాహమున కనుకూలులగు వారెవ్వరో వారినందఱిని జేర్చి యొక సమాజమువలె నేర్పడఁ జేసినది మీరెఱుఁగుదురు కదా? దానిలోఁ జేరినవారి నందఱం గాంచితిరా? కొందఱిని మాత్రము విడిచిన మిగిలిన యందఱును ధనికులును మహాధికారసముపేతులును నగుదురు. అట్టి సమాజమేర్పడి దాదాపున రెండేండ్లగుచు వచ్చెఁగదా. ఏదీ యెందఱు బాలవిధవలు వారిచే వివాహితులైరి? ఈహింపుదువు లెట్టివారో కాని ఎట్టి నూతనాచారమునకును నెడమీయరు. కావున నిప్పటి మీవాద ముజ్జగించుట సముచిత కార్యమని యెన్నుచున్నారు, మంచిది. స్త్రీవిద్యయు నిట్టిదేకదా. ఆ స్త్రీవిద్యకు వ్యతిరిక్తముగ వాదించినను గొందఱు దూఱెదరు గదా, అట్టిదానికేల నీవు పూనుకొంటివని యనియెదరేమో నన్ను మీరు? స్త్రీవిద్యకును విధవావివాహమునకును నెంత యంతర ముండుటయు, ఆవి రెండింటిని నేయేవిధమున జనసామాన్య మెన్నుటయు నెఱింగిన మీకు విశేషము విన్నవింపలేను.'

వ్యభిచారభ్రూణహత్యాదులకవకాశములేక బాలవితంతువులుతమ ద్వితీయవల్లభులతో నిరంతరసౌఖ్యమనుభవించుచుండగాఁ గన్నులఁ బండువుగాఁ గనుగొనఁ గలిగెడు భాగ్యమెప్పుడులభించునా యనిహృదయము

లో నేనెంత యభిలషించుచుండినను, స్త్రీపునర్వివాహములు వ్యాపించుటకుఁ దగినకాల మింకను రాలేదని తలఁచి యుండుటచేత నింతటి గొప్పమార్పునకయి కృషి చేయుటకు నాకు సాహసము పుట్టలేదు. ఇట్లు కొంతకాలము నడవఁగా నొకనాఁడు నాసహపాఠియు దేశాభిమానియు నాప్రియమిత్రుఁడునైన చల్లపల్లి బాపయ్య పంతులుగారు మనము స్త్రీపునర్వివాహవిషయమున కృషిచేయవలెనని నాతో నత్యంతాసక్తితోఁ జెప్పెను. నా యశక్తతను విచారించి నావంటివాఁ డిట్టి మహాకార్యముతలపెట్టిన ప్రయోజనము లేదని యధైర్యముతోఁచి, నేనాఁడున నంతగాఁ బ్రోత్సాహపఱుపక చూతమని చెప్పియుపేక్షింపఁ జొచ్చితిని. ఆయన రెండుమూఁడు తడవలు మరలమరల నాతో నీ విషయమయి మాటాడి, ఒకసారి వైదికులను గొందఱను దనవెంటఁ గొనివచ్చి యీకార్యమునిమిత్తము ప్రయత్నము చేయఁదగినకాలము వచ్చినదని వారిచేతఁ జెప్పించి, ప్రోత్సాహకరములయినమాటలు చెప్పి నన్నుఁ బురికొల్పుచుండెను. ఇట్లు రెండుసారులు ప్రస్తావము జరిగినమీఁదట మూఁడవసారి నామిత్రునివంకఁ జూచి 'నిన్ను మీయన్నలు విడిచిపెట్టినను బంధువులు బాధపెట్టినను నన్ను విడువక కడవఱకును నాతోనుండి పనిచేసెదవా?' అని ధీరవృత్తితో నడిగితిని. అతఁ డణుమాత్రమును సంశయింపక 'ఎన్నికష్టములువచ్చినను తొలఁగక నిలిచి పనిచేసెదను' అనితత్క్షణమే యుత్తరము చెప్పెను. అప్పుడదియీశ్వర ప్రేరితమైన యాజ్ఞయని నామనస్సునకు పొడకట్టఁగా, ఇఁక నేను వేఱుమాటాడక 'సభాహ్వానపత్రికను వ్రాసి తెమ్ము. నేను వ్రాలుచేసి ప్రకటించెదను' అని చెప్పిపంపితిని. అతఁడాహ్వానపత్రికను వ్రాసి తీసికొనిరాఁగానే దానిమీఁద సంతకముచేసి పట్టణములోనివారి కందఱికిని బంపితిని. విశేషపాండిత్యమును విత్తమును లౌకికాధికారమును లేనివాఁడను దుర్బలశరీరుఁడనునగు నేనీమహాకార్యమును నిర్వహింప

గలుగుదునని నేనిందులో నడుగిడలేదు. ఇది యీశ్వర ప్రేరితమును నీశ్వరప్రీతికరమును నందుచే నాకుఁ బరమధర్మమును నన్న దృఢవిశ్వాసములోనే సాధ్యాసాధ్యవిచారమును తలపెట్టక నే నీపనిలోఁ బ్రవేశించితిని. తనకు ధర్మమయినపనిలో శక్తివంచన లేక కృషిచేయుట యొక్కటియే మనుష్యుని పని; దాని ఫలాఫలముల నియ్యవలసినవాఁ డీశ్వరుఁడుగాన తద్విచారము మనుష్యునిది కాదు. ఈశ్వర ప్రీతికరమయిన సత్కార్యమునందు యథాశక్తిని కృషిచేతను ఫలముగలుగక పోయిన పక్షమున మనుష్యుని లోపమేదియు లేదు. మనుష్యుఁడు చేయవలసినపనిని జేసినవాఁడగుటచేత నంతవఱకే యతఁడు శ్లాఘార్హుఁడు. నాయుపన్యాసపత్రిక వెలువడఁగానే మాపట్టణములోని వైదికవృత్తిలో నున్న పండితులందఱును నామీఁద ధ్వజమెత్తి కత్తులు నూఱుట కారంభించిరి; పూర్వాచార పరాయణులయిన లౌకికశిఖామణులును వైదికోత్తములును వారికి సహాయులయి నామీఁద దాడి వెడలిరి. అప్పుడు విధవావివాహమన్న శబ్దమే కర్ణకఠోరమై దుస్సహమై యెల్లవారికిని హృదయశూలముగా నుండెను. అప్పుడు నాకు స్త్రీ పునర్వివాహవిషయమయి యేమేమి గ్రంథము లున్నవో తెలియవు. ఈశ్వరచంద్ర విద్యాసాగరులవారి గ్రంథమున్నట్టు తెలియును గాని నా కప్పుడది లభించినదికాదు. మనుస్మృతియు, యాజ్ఞవల్క్యస్మృతియు, పరాశరస్మృతియుమాత్రము నాయొద్దనున్నవి. ఈవిషయమయి తత్త్వబోధినిలోఁ బ్రకటింపఁబడిన యుపన్యాస మొకటియు, పురుషార్థప్రదాయినిలోఁ బ్రకటింపఁబడిన యుపన్యాస మొకటియు, నాకు లభ్యములయినవి. ఈగ్రంథసాహాయ్యములతో నాబుద్ధికిఁదోచిన యుక్తులను శాస్త్రప్రమాణములనుగూర్చి, యుపన్యాసము నిమిత్త మేర్పఱుపఁబడిన దినమునాఁటికి నాశక్తికొలఁది నొకయుపన్యాసము వ్రాసి, శ్రీవిజయనగరపు మహారాజుగారి బాలికాపాఠశాలామంది

రమున జరగిన మహాసభలో 1879-వ సంవత్సరము ఆగష్టునెల 3-వ తేదిని మొట్టమొదటఁ జదివితిని. బాలవితంతువుల దురవస్థనుగూర్చి జాలిపుట్టునట్టుగా వ్రాయబడిన నాయుపన్యాసభాగము బహుజనుల మనస్సులను కరఁగింపఁ గలిగినను, చిరకాలాచారబలముచేత శిలాకఠినహృదయులైన పండితులకోపాగ్ని కది యాజ్యధారయయి వారిని మఱింత మండిపడునట్లు చేసినది. ఆదినమున వాదమెట్లు జరుగునో వినవలెననియు, పండితుల విజయమును చూడవలెననియు, బాలవితంతువుల దుర్దశానివారణమునకు గతి యేమైన నేర్పడెడి యాశ కలుగునేమో కనవలెననియు, వివిధాభిప్రాయములతో గుంపులు గుంపులుగా వేడుకచూడవచ్చిన జనులతో నిండి యయిదాఱువందల జనులు పట్టఁదగిన సభాభవన మంతయు క్రిక్కిఱిసి పోయినది. నా యుపన్యాసము ముగియఁగానే వృషభముమీఁదికిఁ గుప్పించు వ్యాఘ్రములవలె నామహాసభలోనుండి పండితు లనేకులు లేచి భయంకరారావములతో నన్నుఁగవిసిరి. వారిలో శ్రీశంకరాచార్యస్వాములవారి యొద్ద పండితులుగాఁ గొంతకాలముండిన యద్దేపల్లి కృష్ణశాస్త్రులుగారు మొదలయినవారు తమ పాండిత్య ప్రభావమును గనఁబఱిచి నన్ను బహువిధముల దూషించి, నష్టేమృతేత్యాదిపరాశర స్మృతి వచనమున కనేక విపరీతార్థములుకల్పించి నాయర్థమును పరిహసించి, ప్రత్యుత్తరము చెప్పుటకు నాకవకాశ మియ్యక, పయివారము నాయుపన్యాసముమీఁద ఖండనోపన్యాసములువ్రాసిచదివెదమని చెప్పి, నాఁటికి సభనుండి వెడలిపోయిరి. ఆదినము మొదలుకొని పట్టణములోనిప్రతి గృహమునందును స్త్రీపునర్వివాహవిషయమైన చర్చలే జరుగనారంభించినవి; జను లేవీధిని జూచినను స్త్రీపునర్వివాహవిషయక ప్రసంగములనే చేయఁజొచ్చిరి. ఆవల కితరవిషయములయందు భూషించువారును నన్నీ విషయమునందు దూషింప నారంభించిరి; నామిత్రులు

సహితము నన్ను నిరుత్సాహపఱుపసాగిరి; వాదము నిమిత్తమయి నేనే గ్రంథము నడిగినను పండితులు నాకొక్కసారి యెరవియ్యకపోవుటయే కాక గ్రంథ నామములయినను నాకు తెలుపక మఱుఁగుపఱుచుచు వచ్చిరి. నాపక్షమునఁ గొందఱు మిత్రులున్నను వారప్పుడు నాకుఁ జేయఁగలిగినసాయ మత్యల్పమయియుండెను. మొదటినుండియు నా కత్యంత ప్రోత్సాహకులుగా నుండి నన్నీ కార్యమునందుఁ బ్రవేశపెట్టి పురికొల్పుచున్న బాపయ్యపంతులుగారు మాత్రము సంస్కృతమునఁ గొంతపాండిత్యము గలవారగుటచేత నాకు బహువిధముల తోడు పాటుగా నుండిరి. నాకింతలో కాశీ పట్టణమునుండియు కాళీఘట్టము నుండియు బొంబాయినుండియు కావలసినపుస్తకములన్నియువచ్చినవి. నేనప్పుడు ముప్పదిస్మృతులకంటె నెక్కువగాఁ గొని తెప్పించినాఁడను. అవియన్నియు పూర్ణముగా చదువుటకు నా కప్పుడవకాశము లేక పోయినను, ఈశ్వరుఁడుమాత్రము నాకు సహాయుఁడయియుండుటచేత నే నక్కడక్కడఁ జూచిన భాగములలోనే నావాదమున కనుకూలము లైన ప్రమాణవచనము లనేకము లప్రయత్నముగా నాకు దొరకెను. ఈప్రకారముగా సత్యబలమును దైవబలమును నాపక్షమునందుండినట్లు కనఁబడుటచేత ధైర్యము హెచ్చి నేనుత్సాహముతోఁ బనిచేయఁగా, పండితు లుపన్యాసములుచేసిన సభ నాఁడు నాప్రతివాదమును విన్న మీఁదట వివేకులకందఱకును పండితులవాద మసారమైనదనియు స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతమనియు నభిప్రాయము కలిగెను. పండితులు నన్ను బహిరంగముగా సభలయందోడింపలేక బహువిధ మాయోపాయములు ప్రయోగింపఁ జొచ్చిరి. కొందఱింటింటికిని వీథి వీథికిని దిరిగి శాస్త్రజ్ఞానములేని పెద్దమనుష్యులయొద్దను మూఢజనుల యొద్దను నేను జేసిన వపార్థములనియు శాస్త్రము స్త్రీపునర్వివాహ మంగీకరింపదనియు, 'కలౌపంచసహస్రాణిజాయంతే వర్ణసంకరాః' అన్న యార్యోక్తినిబట్టి వర్ణసాంకర్యము కలిగి లోకము చెడిపోవు

ననియు, చాటు మొదలు పెట్టిరి. కొందఱు మంచిమాటలు చెప్పియు బహుజనద్వేష మశుభదాయకమని భయపెట్టియు నయమున భయమున నన్ను మరలింపఁజూచిరి. కొందఱు నన్నకస్మాత్తుగాఁ బిలిపించి వాదములలో నోడించి శాస్త్రవిషయమున జనులకుఁ గలుగుచున్న యభిప్రాయమును జెడఁగొట్టఁ బ్రయత్నించిరి. అక్కడి పండితులు తాము వాదమునందు నిర్వహింపలేక యితరస్థలములనుండి పండితులను బిలిపించుటకయి ప్రయత్నించి, ఆవిషయమునను లబ్ధమనోరథులుగాక విశాఖపట్టణ మండలమునుండి దంతులూరి నారాయణ గజపతి రాజుగారిచేత నొకఖండన గ్రంథమును వ్రాయించి తెప్పించి పండితులందఱును దానియందు తమకు తోఁచిన విషయములనుగూడఁ జెప్పించి పుస్తకములోని సంగతులు మాపక్షమువారి కెవ్వరికిని దెలియకుండ రహస్యముగానుంచి, కాశ్యాది ప్రదేశములయందు చిరకాలము వాసముచేసి మంత్రశాస్త్రప్రవీణుఁడని బ్రసిద్ధిఁబొంది మహాతంత్రజ్ఞుఁడైన జోస్యుల పేరిచయనులగారిలోపల నొకసభచేసి, ఆ సభకు స్త్రీపునర్వివాహప్రతిపక్షులనుమాత్రమే యాహ్వానముచేసి యందఱునువచ్చి కూర్చున్నతరువాత నన్నచటి కాకస్మికముగా నొక పెద్దమనుష్యునిఁ బంపి పిలుచుకొనిపోయి, పై గ్రంథమును జదివి యందలియంశముల కాక్షణముననే యుత్తరము చెప్పవలయునని యడిగి నన్ను పరాజితునిఁ జేయఁజూచిరి గాని యీశ్వరానుగ్రహమువలన నేను సమయోచితములైన ప్రత్యుత్తరములను జెప్పనారంభింపఁగా ప్రజలకు తమమాటలయందు విశ్వాసము చెడునని భావించి యాపండితులు నాయుత్తరములను వినక కడుపునొప్పియని యొకఁడును కాలునొప్పియని యొకఁడును లేచిపోవఁదొడఁగిరి. అప్పుడా సభామధ్యమున నుండి యొక వైష్ణవుఁడు లేచి ముందుకువచ్చి తాను పూర్వాచారపరాయణుఁడయ్యును దమపక్షమువారు చేయుచుండిన యన్యాయ

మనుజూచి సహింపలేనివాఁడయి 'మీప్రతివాదమును వినియెదమని ప్రతిపక్షిని బిలిపించి చెప్పనారంభింపఁగానే వినక కడుపునొప్పియని కాలునొప్పియని సాకులుచెప్పి తొలఁగజూచుట యేమిన్యాయము ! ఇది యేమిసభ !' యని యఱచుచు సభనుండి వెడలిపోయెను. సభ్యులందఱు నంతర్ధానము నొందినతరువాత పరమశాంతిశీలుఁడైన యా చయనులుగారు నన్నొంటిగాఁ బిలిచి నన్నును నాపూర్వులను స్తుతి పాఠములతో శ్లాఘించి పూనినకార్యమునుండి నన్ను మరలింపఁ జూచెనుగాని యా పండితసత్తముని కోరిక సఫలముగాక, విధవా వివాహవృక్షమును మూలచ్ఛేదము చేయుటకయి దీక్షవహించినసభ కాలక్షమయి బ్రాహ్మణశ్రేణిలో శుద్ధశ్రోత్రియుల యిండ్లనడుమనున్న యీగృహమే తరువాత దైవికముగా విధవావివాహప్రవర్తకసమాజమువారి యధీనమయి పునర్వివాహములు చేసికొన్న నూతనదంపతులకాపురముల కాలయమయి యిప్పటికి నట్లేయున్నది. నేను మొట్టమొదట నిచ్చినయుపన్యాసము ప్రకటింపఁబడఁగానే తెలుఁగుదేశము నం దంతటను స్త్రీపునర్వివాహవిషయమైన వాదములే ప్రబలి మండనవాదులు నాపుస్తకము నాధారపఱుచుకొని శాస్త్రమును యుక్తులనుజెప్పఁబూనుటయు ఖండనవాదులు బహువిధములఁ బూర్వపక్షములు చేయఁబూనుటయు కొంతకాలము జరగెను. గుంటూరు నుండి భువనగిరి పరదేశి సోమయాజులుగారును, బందరునుండి శ్రౌతము కోటీశ్వరశాస్త్రులుగారును, చెన్నపురినుండి కొక్కొండ వేంకటరత్నముపంతులుగారును వర్తమాన రత్నాకరవిలేఖకులును, కాకినాడనుండి మందారమంజరీ పత్రికాధిపతియైన మోగిరాల జగన్నాథముగారును, రాజమహేంద్రవరమునుండి వేదము వేంకటరాయ శాస్త్రులుగారును, విశాఖపట్టణమునుండి దంతులూరి నారాయణ గజపతిరావుగారును, అల్లూరినుండి దాసు శ్రీరాములు పంతులు

గారును, ఇంకను ననేకులును నా ప్రథమోపన్యాసముమీఁద ఖండన గ్రంథములను వ్రాసిరి. ఈఖండన గ్రంథములయందలి ముఖ్యాంశములకును రాజమహేంద్రవరమునందలి పండితులు చెప్పిన యంశములకును సమాధానముగా శ్రీ విజయనగరమహారాజుగారి బాలికాపాఠశాలలో అక్టోబరునెల 12 వ తేదిని జరిగిన మహాసభలో నేను నా ద్వితీయ విజ్ఞాపనము నుపన్యసించి ప్రకటించితిని. ఇదిగాక బహుస్థలములయం దీవిషయమయి వ్రాయుచువచ్చిన ప్రతివాదులవాదములకెల్ల నుత్తరములను వివేకవర్ధనిలోఁ బ్రకటించుచు వచ్చితిని. తీఱికయున్నప్పు డితరస్థలములకుఁ బోయి యుపన్యాసము లిచ్చుటకు బ్రయత్నించుచువచ్చితిని. నేను మొట్టమొదటఁ గాకినాడ కొకభానువారమునాఁడు పోయి స్త్రీపునర్వివాహము శాస్త్రసమ్మతమని హిందూశాస్త్ర పాఠశాలాభవనములో నొక యుపన్యాసము చేసితిని. నాటి సభకు వందలకొలఁది జనులువచ్చి విని యానందించిరి. విధవావివాహమునకుఁ బ్రతిపక్షులుగా నున్న తత్పురవాసులగు పండితులు మొదలగువారు తమకు వారముదినములు గడువిచ్చిన పక్షమునఁ దామాపయిభానువారమునాఁడు ఖండనోపన్యాసము నిచ్చెదమని సెలవిచ్చిరి. వారుచేసెడు పూర్వపక్షములను విని నాకుతోఁచిన సమాధానములను జెప్పుటకయి యాయాదిత్యవారమునాఁడు రాజమహేంద్రవరమునుండి నేనక్కడకుఁ బోయితిని. ఆహ్వానపత్రికల ననుసరించి స్త్రీపునర్వివాహవిధాయకపక్షవాదులు యుక్తసమయమునకే పాఠశాలామందిరమునకుఁ బోయి యుండినను, పండితులు మొదలగువారు తామక్కడకు రామనియు దేవాలయములో సభచేసెడు పక్షమున వత్తుమనియు వర్తమానము పంపినందున వారి యిష్టానుసారముగా నేనును నా సహాయులును విష్ణ్వాలయమునకుఁ బోయితిమి. ఆహ్వానపత్రిక ననుసరించి పలువురు పాఠశాలా మందిరమునకుఁ బోయిరికాని యచ్చట సభలేనందున వారిలోఁ గొందఱుమాత్రమే యచ్చటినుండి మరల

దేవాలయమునకు రాఁగలిగిరి. అటుతరువాత మిక్కిలి యాలస్యముగా సభ యారంభింపఁబడఁగా, విధవావివాహనిషేధవాదులు నేను జేసిన యుపన్యాసమునకు ఖండనమని నాచేఁ జెప్పఁబడనివియుఁ జెప్పఁబడిన వియు నైన కొన్నివిషయములకుఁ బ్రత్యుత్తరముగా నొకగ్రంథమును జదువ నారంభించిరి; వేదార్థవిచారము ముగియునప్పటికే ప్రొద్దు గ్రుంకినందున స్మృతిభాగమును మఱునాఁడు ప్రాతఃకాలమునఁ జదువ వచ్చునని నాఁటికి సభ చాలింపఁబడినది. మఱునాఁటియుదయమునఁ గూడ వారు మిక్కిలియాలస్యముగానే వచ్చినందున స్మృతిభాగము యొక్క యర్థమునుగూర్చి వారు గ్రంథమును ముగించునప్పటికి పది గడియల ప్రొద్దెక్కినది. నిషేధవాదము ముగిసినతరువాత విధాయక వాదుల యుత్తరమును వినవలెనని మొదటనే నిశ్చయింపఁబడినను, విధవావివాహనిషేధవాదులు తమ ఖండన గ్రంథముమీఁద విధాయక వాదులేమియుఁ జెప్పఁగూడదని వాదింప మొదలుపెట్టిరి. అప్పుడు సభలో వారిమాట చెల్లనందున తాము మధ్యాహ్నమున జరుగఁ బోవు సభకు రామని వారందఱును వెడలిపోయిరి. వారు మధ్యా హ్నము సభకు రామని నిరాకరించుటచేతనే వారివాదము దుర్బల మయినదని యచ్చటనున్నవా రనేకు లభిప్రాయపడిరి. మరల మధ్యా హ్నము సభకూడినపిమ్మట స్త్రీపునర్వివాహవిధాయకవాదులు తమపక్షమును స్థాపించుకొనుటకయి యుపన్యసింపఁబోవుచుండఁగా బ్రహ్మశ్రీ మల్లాది అచ్చన్నశాస్త్రిగారను మహాపురుషు లక్కడికి విజయంచేసి, తమన్యాయైకదృష్టి వెల్లడియగునట్లుగా సభాధ్యక్షు లతో కొంత ధర్మోపన్యాసము చేసి, మధ్యవర్తిలేక వాదప్రతివాద ములయొక్క బలాబలములు తేలి సిద్ధాంత మేర్పడదనియు నుభయ పక్షములతోను జేరక భగవన్ముఖమునుజూచి నిష్పక్షపాతముగా న్యాయమును దెలుపుటకు సమర్థులయిన తాముమాధ్యస్థ్యముచేయుట

అంగీకరించెదమనియును సభలో నున్నవారి కందఱికిని భ్రమ పుట్టునట్లు కొన్ని తేనెమాటలను జెప్పిరి. నిషేధవాదులవాదము నీవఱకే విని యున్నారు. గనుక విధాయకవాదులు చెప్పఁబోయెడి యుత్తరము కూడ విని మీరు తోఁచిన యభిప్రాయము నియ్యవచ్చునని సభాసదులు పలుకగా, పూర్వోక్త మహాపండితులవారు ప్రతిపక్షులు లేకుండ తగవు చెప్పుట యుచితము కాదనియు వారినిగూడ పిలిపింపవలయుననియు పట్టుదలతో సెలవిచ్చిరి. వారు సభకు రామని నాటి ప్రాతఃకాలమున స్పష్టముగాఁ జెప్పిపోయిరని సభాధ్యక్షులు శాస్త్రిలవారితో మనవిచేయఁగా, వారిని పిలిపించుభారమును దామువహించెదమని చెప్పి శాస్త్రులవారు తమశిష్యుని నొక్కనిఁ బంపిరి. ఆ శిష్యుఁడు వారందఱును బైలుదేఱివచ్చుచున్నారని పదినిమిషముల లోనే తిరిగివచ్చి వర్తమానముచేసినను, ప్రతిపక్షులు మాత్రము గంటకుఁలోపల రాలేదు. ఈలోపుగా విధాయకవాదుల యుపన్యాసమును వినవలెనని పలువురు తొందరపడుచు వచ్చిరి. ప్రతినిషేధవాదులకు వర్తమానముపంపి వారు వచ్చెదమని ప్రత్యుత్తరము పంపినమీఁదట వారి రాకకయి పరీక్షింపక తొందరపడి యుపన్యసింపఁ బూనుట యుచితము కాదని యచ్చున్న శాస్త్రులవారు బహుమారము నొక్కి చెప్పి వారు వచ్చువఱకును నాయుపన్యాసము నాపిరి. వారు వచ్చిన మీఁదట నేను శ్రుతిభాగముయొక్క యర్థవివరణము చేయఁగానే శాస్త్రులవారు నిష్పాక్షికమైన తమ యభిప్రాయము నిచ్చుటకయి వచ్చునప్పు డింటికడ వ్రాసి తెచ్చుకొన్న తమ యభిప్రాయము జనువుటకయి రొండిని బెట్టుకొని తెచ్చిన కాగితమును బయికిఁదీసి మడత విప్పి నిషేధవాదుల కనుకూలముగా తమ యాశయమును జదువ నారంభించిరి. అంతట సభ్యుల కామధ్యస్థునియొక్క న్యాయతత్పరావలంబమును సత్యశీలతయు యోగ్యతయుఁ దెలిసి యిఁక నభిప్రాయము

సీయవలదని వారించిరి. మనలో పండితు లనఁబడువారే నీతిమాలి యెంతటి మోసములకును నన్యాయములకును లోఁబడుదురో! అప్పుడు ప్రతిపక్షులు తా మేమో చెప్పరాఁగా నుపన్యాసము ముగియువఱకును జెప్పఁగూడదని సభాధ్యక్షులు వారిని వారించిరి. అప్పుడు కప్పగంతుల రామశాస్త్రిగారు తానుసభలోనుండి విననని లేచిపోయెను; ఆయనవెంట నోగిరాల జగన్నాథముగారును మఱి యిద్దఱుముగ్గురును లేచివెళ్ళిరి. తాను జేసిన మోసముచేత సభలో నుండలేక యచ్చన్న శాస్త్రిగారును సంధ్యాసమయమయినదని మిష పెట్టి లేచిపోయెను. అంతటఁ బ్రతిపక్షులైన బ్రాహ్మణులు కొందఱల్లరిచేయవలెనన్న యుద్దేశముతో దేవాలయద్వారముకడ తోపులాట కారంభింపఁగా, కావలియున్న యారక్షకభటులు వారిని వారించిరి. ఇంతలోఁ జీఁకటి పడినందున మఱికొందఱు లోపలఁ బ్రవేశించి యల్లరిచేయ నారంభించిరి. రాజమహేంద్రవరమునుండి కొందఱు విద్యార్థులు నాకంగరక్షకులుగా వచ్చియుండిరి. ప్రతిపక్షులు రాళ్ళురువ్వుట కారంభించి నన్ను మర్దింప యత్నించుచుండఁగా, నాతోడవచ్చిన విద్యార్థులు దొమ్ములాటకయి వచ్చిన యల్లరిమూఁకతోఁ దలపడి వారికి నాయకుఁడై యుండిన బ్రాహ్మణుని దిట్టముగాఁ గొట్టుటచేతను తత్పట్టణారక్షకభటాధికారియు నామిత్రుఁడునైన గుమ్మిడిదల మనోహరము పంతులుగారువచ్చి యాయల్లరిమూఁకను కొట్టులోఁ బెట్టింపఁజూచుటచేతను వేగముగానే యాదుండగవుబాపనగుంపు చెదరి పలాయనమయ్యెను. ఈయల్లరిచేత నాఁటి యుపన్యాసము ముగియకుండనే సభ చాలింపఁబడినది. ఎదుటివాదము వినకుండ నల్లరిచేసినందున వారి దౌష్ట్యము వెల్లడియగుటతప్ప వారిపక్షమునకు వేఱులాభము కలుగ లేదు. ఇట్లు దౌర్జన్యముచూపి ప్రతిపక్షులు నన్ను మర్దింప యత్నించుట యొక్క-కాకినాడలోనే కాదు. నాస్వస్థలమయిన రాజమహేంద్రవరములో సహిత మట్టిప్రయత్న మొకసారిజరిగినది. చెన్నపట్టణము

వంటి రాజధానినగరములోనే స్త్రీపునర్వివాహమునుగూర్చి చాకలి పేటలోనే నుపన్యాసమిచ్చుచున్న సమయమునం దచ్చటి వైష్ణవ బ్రాహ్మణులు దొమ్మిచేసి నాపయిని బడఁబోఁగా రావుబహద్దూరు శ్రీ పనప్పాకము అనంతాచార్యులవారు నన్ను తప్పించి తమబండిలో నెక్కించుకొని తీసికొనిరావలసివచ్చినప్పుడు చిన్నపట్టణములలో మాఘు లిట్టి దౌర్జన్యమునకుఁ గడఁగుట యొంతవింత గాదు.

మొట్టమొదట స్త్రీపునర్వివాహసమాజమని పేరు పెట్టుకొని పనిచేయ నారంభించినవారము నేనును నామిత్రులగు చల్లపల్లి బాపయ్యపంతులుగారును, బసవరాజు గవర్రాజుగారును, ఏలూరి లక్ష్మీనరసింహముగారును, బతుకు ప్రనేడి వేంకటజోగయ్యగారును, కన్నమురెడ్డి పార్థసారథినాయఁడుగారును, చిర్రావూరి యజ్ఞన్న శాస్త్రిగారు, కాజ రామకృష్ణరావుగారు, కొమ్ము రామలింగశాస్త్రి గారు మొదలైనవారుకూడఁ గొందఱు మాలో నంతరువాతఁ జేరిరి. ఈవిషయమయి తఱుచుగా వాదప్రతివాదములు జరుగుచు వచ్చుటచేత విధవావివాహమన్న శబ్దమారంభదశయందువలె శ్రుతికటువుగా నుండక కొంతకాలములో జనులకు విపరిచితపదము సహ్యమయినది. అనేకులకు విధవావివాహములు శాస్త్రసమ్మతములనియు, అవశ్యా చరణీయములనియు, అభిప్రాయము కలుగసాగెను. బాలవితంతువుల సంరక్షకు లనేకులు తమ వితంతుకన్యలకు పునర్వివాహములు చేయ నుద్దేశించుకొన మొదలుపెట్టిరి. వితంతుకన్యలు దొరికినపక్షమున తాము వివాహమాడెదమని మాశాస్త్రపాఠశాలలోని విద్యార్థు లనేకులు బైలుదేఱిరి. నేనును నామిత్రులగు బాపయ్యపంతులుగారును బోయి యింటింటికిని దిరిగి యడుగఁగా లౌక్యులయిన బ్రాహ్మణగృహ స్థులు ముప్పదిమందికంటె నెక్కువసంఖ్యగలవారు వివాహసమయమున భోజనములకు వచ్చెదమని వాగ్దానములుచేసి సమాఖ్యపత్రముమీఁద

ప్రాల్లుచేసిరి. ఇట్లు కాలక్రమమున శుభసూచకము లనేకములు కానవచ్చినను, మే మీపని కారంభించినప్పుడు మాయొద్ద నొక కాసును నిధిగా లేదు; ఎవరైన పెద్దమొత్తమిత్తురన్న యాశయు నాకపుడు లేదు. ఐనను కొన్నివారముల లోపలనే నాకు పరిచితులయిన శ్రీ బారు రాజారావు పంతులుగారు శ్రీ పైడా రామకృష్ణయ్యగారు రాజమహేంద్రవరమునకు వచ్చినప్పుడు నాకు వారితోడ మైత్రిని గలిగింపఁగా, వారప్పుడీపని నిమిత్తమయి ముప్పదివేలరూపాయల నిచ్చెదమని వాగ్దానము చేసిరి. ఈవాగ్దానమువలన మాకు మఱింత యుత్సాహము గలిగి ద్విగుణధైర్యముతోఁ బనికి పూనినను, రెండు సంవత్సరములకు పిమ్మట ప్రథమ వితంతువివాహ మగువఱకును పట్టిన సమస్త వ్యయములను నేనే వహించినాఁడను. 'నేను చేసిన యుపన్యాసములను ముద్రింపించి కొన్నిప్రతులను విక్రయించినను విశేషభాగ మూరక పంచిపెట్టినాను; వాదమునిమిత్తమయి ముప్పదినలువది స్మృతులను, ఇతరపుస్తకములనుగొని కృషిచేసినాను; బహుస్థలములయందున్నవారితో నుత్తరప్రత్యుత్తరములను జరపుచు, వలసినప్పు డితర స్థలములకుఁ గూడఁబోయి యుపన్యసించుచువచ్చినాను; వివాహములు చేసికొనెదమని వాగ్దానములు చేసిన విద్యార్థులకుఁ గొందఱకు పాఠశాల జీతములను సాహాయ్యము చేయుచువచ్చినాను; బాలవితంతువులున్న స్థలములను విచారించి సమాచారములు చెప్పుటకును కృషి చేయుటకును మనుష్యులకు సొమ్మిచ్చుచు వచ్చినాను; బాలవితంతువుల సంరక్షకులతో మాటలాడుటకయి, అమలాపురము, మండపేట, కాశ్యపూడి, కాకినాడ, దొడ్డిపట్ల, విఘ్నేశ్వరము, రామచంద్రపురము, పాలకొల్లు మొదలైన స్థలములకు మనుష్యులను పంపుటయే కాక వీనిలో నొకటిరెండు స్థలములకు నేనును బోవుచు వచ్చినాను; ఈ ప్రయాణములో నొకసారి యొకపల్లెలో శీతకాలపురాత్రియందు దొర

మిత్రుఁడును నేనును పశువులపాకలోని పశువులతోఁ గలసి గొబ్బు
కంపులో పరుండి నిద్రింపవలసి వచ్చినది. ఈకృషిలో నాకిక్కడి రాజ
కీయపాఠశాలలోని విద్యార్థులు మొదటినుండియు ముఖ్యసహాయులుగా
నుండిరని చెప్పవలసి యున్నది. ఇప్పుడు వివాహములు చేసికొన్న
వారిలో పులవర్తి శేషయ్యగారును నల్లగొండ కోదండరామయ్యగా
రును పైనిజెప్పిన గ్రామములలోఁ గొన్నిటికిఁబోయి కృషి చేసినందు
నకై నాకృతజ్ఞత నిక్కడఁ దెలుపుచున్నాను.''*

మహారాజులు సహితము పూని నిర్వహింపలేకపోయిన యీ
మహాకార్యభారమును ధనవిద్యాధికారబలము లేని పిన్నవాండ్రము
నలుగురైదుగురము పైని వేసికొని శ్రమపడుచుండఁగా, ఇంతలో
లోకానుభవమును విద్యాధికారములను నెక్కువగాఁ గలవారయియీ
విషయమున నత్యంతాదరము గలవారు సాయపడి మాకు చేయూఁత
యయి నిలిచిరి. రాజమహేంద్రవరమునకుఁ గ్రొత్తగా న్యాయవాదిగా
వచ్చిన న్యాపతి సుబ్బారావుపంతులుగారు మాలోఁ జేరిరి. కాకినాడకు
సబుజడ్జిగా వచ్చిన శ్రీకంచి కృష్ణస్వామిరావు పంతులుగారు వాక్సహా
యమును జూపి మాకత్యంత ప్రోత్సాహము కలిగింపఁ జొచ్చిరి;
మొదటివివాహ మైదాఱుమాసములకు జరుగునఁగా ఆత్మూరి లక్ష్మీ
నరసింహముగారు రాజమహేంద్రవరమునకు డిస్ట్రిక్టుమునసబుగావచ్చి
మాకనేకవిధముల తోడుపడఁదొడఁగిరి; చెన్నపట్టణమునకు చదువు
నిమిత్తమై పోయియుండిన సోమంచి భీమశంకరముగారు మరలవచ్చి
మమ్ముఁ జేరిరి ఈప్రకారముగా మేము కొంతబలపడి రెండుసంవత్స
రములు వాదప్రతివాద రూపమైన వాగ్యుద్ధమును నడపిన తరువాత
క్రియలేని నిరర్థకవాదములవలనఁ బ్రయోజనము లేదని తెలిసికొని,
కష్టపడి యేలాగుననైనఁ గొన్ని వివాహములను జరుపవలెనని నిశ్చ

* స్త్రీ పునర్వివాహ వ్యాపారముయొక్క భూతవర్తమాన స్థితులు జనవరి 1887

యించుకొని, ఆత్మూరి లక్ష్మీనరసింహముగారును, న్యాపతి సుబ్బారావు పంతులుగారును, కొమ్మూరి రామలింగశాస్త్రిగారును, బసవరాజు గవర్రాజుగారును నేనును జేరి యైదుగుర మొక యాంతరంగిక సమాజముగా నేర్పడి, మాప్రయత్నముల నితరులతో మాప్రాణమిత్రులతో నైనను జెప్పకుండునట్లు మాలో మేము ప్రమాణములు చేసికొని, రహస్యముగా కార్యాలోచనము చేయుట కారంభించితిమి. మేమీ ప్రకారముగా కార్యములు జరుపుటకు కృతనిశ్చయులమయి గూఢముగా పనిచేయుచుండుటయు, వివాహసమయమున భోజనముల కెవ్వరు వచ్చెదరో తాంబూలముల కెవ్వరు వచ్చెదరో ప్రతిపక్షము పూనక సహాయులుగా నెవ్వరుందురో తెలిసికొనుటకు లక్ష్మీనరసింహముగారిలోపల రెండు సభలు చేయుటయు, తెలిసికొని స్త్రీపునర్వివాహవిద్వేషి పక్షమువారు భయపడి, మాప్రయత్నములు మాటలతోఁ బోక కార్యములకు వచ్చునట్లున్నవని సంచలించి కొందరపడి తమ మాంద్యమును విడిచి మహోద్యమము వహించి తాము సభలు చేసి మాప్రయత్నములకు విఘ్నములు కలుగఁజేయుటకయి యుపాయముల నాలోచింప మొదలుపెట్టిరి. ఒకదినమునఁ బూర్వాచారపరాయణులయిన లౌక్యులును వైదికులును మార్కండేయస్వామి యాలయములో సభచేరి నన్ను వర్ణమునుండి బహిష్కారము చేయుటకును విధవావివాహముల కేవిధమయిన తోడ్పాటు చూపెదమన్నను వారి నందఱిని వెలివేసెదమని వెఱపించుటకును ముందే నిశ్చయించుకొని వచ్చి, తగుమనుష్యుని నొకనిఁ బంపి నన్నా దేవాలయమునకు రప్పించిరి. ఆసభానాయకుల యనుమతితో మూర్ఖులైన యాపక్షపు బ్రాహ్మణులు కొందఱు సభావసానమునఁ బోవునప్పుడు సందడిలో నన్నుఁ గొట్టవలెనని యుద్దేశించుకొని వచ్చిరఁట! ఈవార్త యెట్లో విద్యార్థులలో నొకరిద్దఱి చెవిసోఁకగానే సభ యారంభమయిన యరగంట

లోపల దేవాలయమంతయు రెండువందల విద్యార్థులతో నిండిపోయి నది. వారిలో ననేకులచేతులలో కఱ్ఱలుండినవి. కొందఱు విద్యార్థులు ముందుకు తోసికొనివచ్చి పెద్దమనుష్యుల నీవలావలలకుఁ దోసి నడుమను నాచుట్టును గూర్చుండిరి. ప్రతిపక్షుల దురాలోచన నాకప్పుడు తెలిసియుండక పోవుటచేత విద్యార్థులప్రవర్తనము నాకప్పు డవినయముగా దోఁచినది. నావిషయమయి దౌర్జన్యము జరిగింపఁ దలఁచుకొని వచ్చిన యాదుష్టవిప్రులు విద్యార్థుల సంఖ్యనుజూచి భయపడి తమ కేమి పరాభవము వచ్చునోయని ప్రొద్దుగ్రుంకకముందే మెల్లఁగా నావలికి జాఱిరి. సభవారును మొదట నుద్దేశించుకొని వచ్చినపని జరుపనేరక తమ యిండ్లకుఁ బోవలసినవా రయిరి. దేవాలయమునకెదురుగానుండిన పత్రికావహనకార్యస్థానములో నుద్యోగములో నుండినవారును నా మిత్రులును నగు కొచ్చెర్లకోట సుందరరామయ్యగారు మేడమీఁద నిలుచుండి దేవాలయములో నడచుచున్నదంతయుఁ జూచుచుండి, నేను వీథిలోనికి రాఁగానే మేడదిగివచ్చి నన్నుఁ గలిసికొని బ్రాహ్మణులు నావిషయమయి చేయఁదలఁచుకొన్న దుష్టప్రయత్నము తనకుఁ దెలియరాఁగా సమయము వచ్చినప్పుడు పంపి వారిని మర్దింపించుటకయి టపాలు మోచువారిని పదుగురను సిద్ధముగా నుంచి యుంటినని నాతోఁ జెప్పిరి. ఆదినము మొదలుకొని పట్టణములో సంక్షోభమును కలహావేశములును మఱింత ప్రబలసాగెను.

1880, 1881-వ సంవత్సరములలో మావివేకవర్ధనియు ప్రార్థనా సమాజమును విద్యార్థుల సంఘసంస్కరణసమాజమునుగూడ మహోత్సాహముతో మిక్కిలి చుఱుకుగాఁ బనిచేయుచుండెను. విరూపాక్ష పీఠస్థులైన మాశంకరాచార్య స్వాములవారు విజయనగరము నుండి బైలుదేఱి దారిపొడుగునను భిక్షలును పాదపూజలును గైకొనుచు మా గోదావరీమండలమునకు వచ్చుచుండిరి. ఇట్టి యాచార్య

స్వాములవారు భిక్షలని పాదపూజలని పేరులుచెప్పి ధనాకర్షణముచేయు చుండుటయేకాని సాధారణముగా శిష్యులకు మతబోధ చేయవలెనన్న చింతయే వారికుండదు. వారిలోఁ గొందఱికి మతగ్రంథముల పేరుల కంటె భక్ష్యముల పేరులే యెక్కువగాఁ దెలియును. ఇందునుగూర్చిన పూర్వకథ యొకటిగలదు. ఒకస్వాములవారొక గృహస్థుని యింటికి భిక్షకు దయచేసిరఁట. భిక్షానంతరమున స్వాములవారు వేదాంత గ్రంథపారాయణము చేసికొందురేమో యని తలఁచి యా యింటి గృహిణి యతీశ్వరునికడకు వచ్చి 'స్వామీ! భగవద్గీతలు తెత్తునా?' యని యడిగెనఁట! ఆపే రా స్వాములవారెన్నఁడును విన్నది కాక పోవుటచేతఁ గొంతసే పాలోచించి యదియు నేమో భక్ష్యవిశేషమని భావించి 'అమ్మా! ఇప్పుడు కడుపు నిండుగా నున్నది. మఱిరెండు గడియలసేపు తాళి తీసికొనిరమ్ము' అని యుత్తరము చెప్పెనఁట! యతీశ్వరులలో ననేకులకు మతవిషయకజ్ఞాన మీరీతిగా నుండును. రాజమహేంద్రవరమున జరుగుచున్న విధావావివాహ ప్రయత్నమును గూర్చి తునియొద్ద నున్నప్పుడే మా స్వాములవారు విని తా మచ్చటికి విజయంచేసినప్పు డాపనిలోఁ బ్రవేశించినవారి నందఱిని వెలి వేసెదమని యానతిచ్చిరఁట! పీఠాధిపతుల యర్హాకృత్యములను గూర్చియు, వారు విత్తాపహరణము నిమిత్తము చేయుచున్న యకృత్యములను గూర్చియు, వానిని స్వకృత్యములకు మరల్చుటకు శిష్యులు చేయవలసిన కర్తవ్యమును గూర్చియు, మా వివేకవర్ధని బహువిధముల వ్రాసి ప్రజలకన్నులు తెఱచుట కారంభించినది. ఈస్వాములవారు మగనినివిడచి లేచిపోయి బహిరంగముగా జగన్నాథపురములో వ్యభిచరించుచుండిన యొక బ్రాహ్మణకులటవలన ధనస్వీకారమును జేసి యా యిల్లాలివలన భిక్షగైకొని భార్యను విడిచిపెట్టినందునకయి దానిమగనికి బహిష్కారపత్రికను బంపి యాతనికి శుద్ధపత్రిక నిచ్చుటకై యధికవిత్తమును లాగఁజూచిరి; రాజమహేంద్రవరమునందు

మండలన్యాయసభలో క్రిమినల్ రికార్డుకీపరుగానుండి యుద్యోగమును
బోఁగొట్టుకొని యేఁబదియేండ్లు దాఁటియున్న బొల్లాప్రగడ వెంకన్న
గారను వృద్ధగృహస్థుకు చిరకాలముక్రిందటనే ముట్లుడిగిన యేఁబది
యేండ్ల వృద్ధాంగనతో వ్యభిచరించినట్లు నేరము మోపి యాయనకు
బహిష్కారపత్రికను బంపి విశేషవిత్తము నాకర్షించుటకయి ప్రయ
త్నించిరి. చిరకాలముక్రిందటనే కులమువిడిచి లేచిపోయి తురకపేటలోఁ
గాపురముండి బిడ్డలనుగన్న యొక బ్రాహ్మణురాలియొక్క పుత్రుని
తమపీఠమువద్ద శిష్యునిగా స్వీకరించిరి. ఇవి యన్నియు వివేకవర్ధని
వెల్లడించుటచేత రాజమహేంద్రపురవాసులు స్వాములవారియెడ గౌర
వము లేనివారయి మాపురమునకు వచ్చినప్పుడు వారికి భిక్షలు చేయ
కుండిరి. ఈప్రకారముగా నెవ్వరెవ్వరినో వెలివేసెదమని వేంచేసిన
స్వాములవారు మాపురమున భిక్షలుగానక తామే వెలిపడవలసినవా
రయిరి. నేనే మధ్యవర్తినిగానున్నసభలో జరుపఁబడిన యేర్పాటును
బట్టి స్వాములవారు కులటాపుత్రుఁడైన తమశిష్యునిఁ బీఠమునుండి
పంపివేసినతరువాత నీ పట్టణములో వారికి భిక్షలు జరిగినవి. స్త్రీపున
ర్వివాహవిషయమైన శాస్త్రమునుగూర్చి సిద్ధాంతనిర్ణయము చేయ
వలసినదని నేనును న్యాపతి సుబ్బారావు పంతులుగారును కాజ రామ
కృష్ణారావుగారును వ్రాళ్ళుచేసి స్త్రీపునర్వివాహ ప్రవర్తకసమాజము
వారి పక్షమునఁ బంపిన విజ్ఞాపనపత్రము ననుసరించి జరిగినసభలో
స్వాములవారిపక్షమున వచ్చినప్రతినిధి యయిన యద్దేపల్లి కృష్ణ
శాస్త్రులవారు "స్వాములవారు బహుజనుల యిష్టానుసారముగా నడవ
వలసినవారుగనుక బహుజనులు చేరి స్త్రీపునర్వివాహము తమకిష్టమని
సంఘవిజ్ఞాపనమును వ్రాసికొన్నచో వారాలోచింతురనియు, శాస్త్ర
మెట్లున్నను పూర్వకాలములయందు సహితము దేశకాలానుగుణముగా
నిబంధనముల నేర్పఱుచుకొనుచుండుట గలదనియు, బహుజనాభిప్రాయ

మునుబట్టియు దేశమునఁ గలుగుచున్న నష్టములనుబట్టియు నాలోచించి ప్రస్తుతకాలమునకుఁ దగినట్లుగా నిప్పుడు క్రొత్తనిబంధనముల నేర్పఱుచుకొనుట కేయాక్షేపమును లేదనియు," చెప్పి యప్పటికి తప్పించుకొనవలసినవా రయిరి.

1880, 1831వ సంవత్సరములలో మాప్రార్థనసమాజముకూడ మహోచ్ఛ్రదశయం దుండినది. నేనే దానికి నియతధర్మోపన్యాసకుఁ డనుగా నుండెడివాఁడను. నాధర్మోపదేశములను వినుటకు వందల కొలఁది జనులు వచ్చెడువారు. ఇతరసామాజికులును మహోత్సాహముతోఁ బనిచేసెడువారు. ఏలూరి లక్ష్మీనరసింహముగారు మాయం దతికింటెను నప్పు డధికోత్సాహమును శ్రద్ధాళుత్వమును భక్తియుఁ గనఁబఱచెడివారు. అప్పటి యాయన వ్యగ్రతనుజూచి యాయనవలన దేశమున కెంతో మేలుకలుగునని నే ననుకొనెడివాఁడను. పరిశుద్ధాస్తికమతవ్యాపనమునిమిత్తమై యాయన యాస్తికపాఠశాల యనుపేరితో నొకపాఠశాలను స్థాపించెను. పాఠశాలాస్థాపనమునందు మేమందఱము నేకీభవించియే పనిచేసితిమి కాని దానిని నడపువిషయమై మాలో నభిప్రాయభేదము కలిగినది. ఆస్తికపాఠశాలయని పేరుపెట్టినప్పుడు సార్థక్యనిమిత్తము చూడక ప్రథమోద్దేశానుసారముగా దానిలో మొదటినుండియు పరిశుద్ధాస్తికమతసిద్ధాంతములను బాలురకు నేర్పవలయునని నాయభిప్రాయము. మొదటనే యట్టిపనికిఁ బూనినయెడల పాఠశాలకు బాలురంతగా రారుగనుక పాఠశాల బలపడినతరువాత క్రమముగా పరిశుద్ధాస్తికమతసిద్ధాంతముల నందుఁ జెప్పింపవలయునని లక్ష్మీనరసింహముగారి యభిప్రాయము. కొందఱు నాయభిప్రాయముతోను కొంద ఱాయనయభిప్రాయముతోను నేకీభవించిరి. ఆపాఠశాలాభవనములోనే విద్యార్థులకును నితరులకును నుపయోగపడుటకై యాస్తికమతపుస్తకములను జదివి బోధించుటకయి యొకతరగతి పెట్టఁబడినది.

మా వితంతూద్వాహసమాజమును ప్రార్థనాసమాజమును ప్రబలుచుండుట చూచి పూర్వాచారపరాయణులయిన బాలికాపాఠశాలాకార్యనిర్వాహకులు మాసభలకు బాలికాపాఠశాలామందిరము నియ్యకపోవుటచేత ప్రార్థనాసమాజము నాయాస్తికపాఠశాలలోనే పెట్టితిమి. 1881 వ సంవత్సరము మార్చి నెలలో పండిత శివనాథశాస్త్రిగారు రాజమహేంద్రవరమునకు వచ్చి హృదయోత్తేజకములయిన యుపన్యాసముల నిచ్చిపోయిరి. ఆయుపన్యాసములవలన నింగ్లీషు చదువుకొన్నవారిలోను విద్యార్థులలోను సత్కార్యోత్సాహము హెచ్చినది. విద్యార్థులు తమలోఁ దాము ప్రత్యేకముగా ప్రార్థనాసమాజముల నేర్పఱుచుకొని యేకేశ్వరారాధనము చేయసాగిరి. విద్యార్థులు బీదల యుపయోగమునిమిత్తమయి రాత్రిపాఠశాలలను స్థాపించి వంతులు వేసికొని రాత్రులు పోయి పనివాండ్రకు పాఠములు చెప్పుచువచ్చిరి. ఈపాఠశాలలవిషయమయి రెబ్బాప్రగడ పాపయ్యగారు తాయి సూర్యప్రకాశరావుగారు, పెద్దిభట్ల వేంకటప్పయ్యగారు మొదలయిన విద్యార్థులనేకులు మహోత్సాహముతో పనిచేయుచుండిరి. రాత్రి పాఠశాలవిషయమై విద్యార్థులకును మఱికొందఱు పెద్దమనుష్యులకును కొన్ని తగవులువచ్చి విద్యార్థులు తాముక్రొత్తగా వేఱొకపాఠశాలను స్థాపింపవలసివచ్చినను, తుదకు విద్యార్థులపాఠశాల యొక్కటియే యిప్పటికిని నిలిచి నగరపారిశుధ్య విచారణసంఘమువారి పరిపాలనములో నున్నది. తమ మరణమువఱకును బసవరాజు గవర్రాజుగారు రాత్రి పాఠశాలకు కార్యనిర్వాహకులుగా నుండి యెంతోశ్రద్ధతోఁ బనిచేయుచుండెడివారు. నేనును నామిత్రులును విద్యార్థుల నిట్టిసత్కార్యములకు పురికొల్పి ప్రోత్సాహపఱుచుచుండెడివారము. రెబ్బాప్రగడ పాపయ్యగారు, పెద్దిభట్లవెంకటప్పయ్యగారు మొదలయిన విద్యార్థులు ప్రార్థనాసమాజకార్యములోను శ్రద్ధాభక్తులు కనఁబఱచి బీదల

కన్యాదానము చేయుట మొదలగు సమస్తసత్కార్యములలోను మిక్కిలి శ్రమపడుచుండెడివారు. ఆ స్త్రీపాఠశాలనుబట్టి ప్రార్థనాసమాజము రెండుశాఖ లయినదిగాని యాశ్రోత్రశాఖ యప్పుడే యంతరించి మా సమాజముమాత్రమే నేఁటికిని నిలిచియున్నది. ఆ స్త్రీపాఠశాల స్థాపింపఁబడిన యుద్దేశ మటుతరువాతసహిత మెప్పుడును నెఱవేఱనే లేదు.

మాశాస్త్రపాఠశాలలోనివిద్యార్థులు ఇన్నిసుపేటలో నొక బాలికాపాఠశాలనుసహితముస్థాపింపనుద్దేశించిరి. అట్లుద్దేశించినవారిలో పెద్దిభట్ల వేంకటప్పయ్యగారు మొదలయినవారు ముఖ్యులు. విద్యార్థులు పగలు బాలికాపాఠశాలలో పనిచేయుటకు వలనుపడనందునను, ధనవ్యయము చేయుటకు శక్తులు కానందునను, వారిపక్షమున నేనాపనికి బూని మిత్రులచేత చందాలు వేయించి యిన్నిసుపేటలో 1881 వ సంవత్సరమున నొక బాలికాపాఠశాలను స్థాపించితిని. మాశాస్త్రపాఠశాలాధ్యక్షులయిన మెట్కాఫుదొరగారు వ్రాయుటచేతఁ గొంత కాలము శ్రీపిఠాపురపురాజుగా రా బాలికాపాఠశాల నుంచుటకయి తమసత్రమునిచ్చిరి. నేనుదానికిఁగార్యనిర్వాహకుఁడ నయియుండి నేను నగరపారిశుద్ధ్యవిచారణసంఘములో సభ్యుఁడ నగుటచేత మొదటిసంవత్సరము నెలకు పదేసిరూపాయలచొప్పునను, రెండవ సంవత్సరము పదునైదేసి రూపాయలచొప్పునను, మూఁడవ సంవత్సరము ఇరువదేసి రూపాయలచొప్పునను, సహాయద్రవ్యము నిప్పించుచు వచ్చితిని. దొరతనమువారును వేఱుగ దానికిసహాయధనము నిచ్చుచుండిరి. దానికి విఘాతము కలిగించుటకయి యోర్వలేనివారు కొందఱు ప్రయత్నము చేసినను వారికృషి సఫలముగాక తరువాత నది దొరతనము వారిచేఁ గైకొనఁబడి స్థిరపడి బాలికావిద్యాభ్యాసమున కత్యంతోపయుక్తమైయున్నది.

కులాచారవిషయములలోను రాజకీయవ్యవహారములలోను గల యనేక దురాచారములను వినోదకరముగా సంభాషణరూపమున వెల్లడిచేసి తన్మూలమున దురాచారములను మాన్పుటకయి వివేకవర్ధని కంతర్భాగముగా హాస్యసంజీవని ప్రకటింపఁబడు చుండెను. ఇందుఁ బ్రకటింపఁబడినవానిలో నొకటియగు వ్యవహారధర్మబోధినిని నామిత్రులు కొందఱును విద్యార్థులు కొందఱును జేరి 1880-వ సంవత్సరమున శ్రీవిజయనగరము మహారాజాగారి బాలికాపాఠశాలలో మొదటఁ బ్రయోగించిరి. అందు న్యాయాధికారుల యొక్కయు న్యాయవాదులయొక్కయు దుశ్చర్యలు పరిహాసరూపమునఁ బ్రకటింపఁబడినవి. వానిని బ్రదర్శించుటవలన నందభివర్ణింపఁబడిన దోషములు గలవారి మనస్సులకుఁ గొంత నొప్పి గలిగినను, నిటువంటిరూపకములను బ్రదర్శించుట కదియే మొదలయినందున నూఱులకొలఁది జనులు వచ్చి చూచి యానందించిరి. ఇట్టి నాటకప్రదర్శనములవలన జనులకు వినోదము కలుగుటయే కాక యక్రమములు చేయువారు సిగ్గుపడి తమప్రవర్తనము దిద్దుకొనుటయు నందువలన నీతివర్ధిల్లుటయుఁ గలుగునుగానఁ గ్రొత్తనాటకములను జేసి నాటకసమాజము నొకదానిని స్థాపింపవలసినదని నామిత్రు లనేకులు నన్నుఁ గోరిరి. వారికోరిక ననుసరించి 1881 వ సంవత్సరములో కడపటి భాగమున నొకనాటకసమాజమును స్థాపించి, ధార్వాడనాటకులు వచ్చి నాటకములాడి విడిచిపోయిన శాలలోనే "చమత్కార రత్నావళి" యను రెండు నాటకములుచేసి యాడించితిని. అట్టినాటకము లాడుట కదియే ప్రథమప్రయత్నమైనను, మొత్తముమీఁద నవి జయప్రదముగానే జరగినవని యెల్లవారు నభిప్రాయపడిరి. ఈనాటకప్రయోగమువలన సహితము పట్టణములో సంక్షోభము కలుగకపోలేదు. ఆనాటకములయందలి పాత్రములు విస్తారముగా పాఠశాలలోని విద్యార్థులు. నాటకములలో

వేషములు వేయుట గౌరవహానికరమని యనేకుల అభిప్రాయమగుటచేత విద్యార్థుల సంరక్షకులు తమ బాలురచేత వేషములు వేయించినందునకయి నామీఁద నభియోగము తెచ్చెదమని నన్ను బెదరించిరి. నాటకప్రదర్శనమువలన విశేషలాభము కలుగుననియు నీతి వృద్ధియగుననియు నేను దలఁచియుండినను, విద్యార్థులు నాటకము లాడుటయందలి యుత్సాహముచేతఁ దమ పాఠములయం దశ్రద్ధను జూపునట్లు కనఁబడినందున నాటకసమాజములయం దటుతరువాత నేనంతగా నాదరము చూపుచు రాలేదు.

*1881*-వ సంవత్సరమునందు మావిద్యార్థుల సంఘసంస్కరణ సమాజము సహితము మిక్కిలి యుత్సాహముతోఁ బని చేయుచుండెను. నేను విద్యార్థిని గాకపోయినను సామాజికులలో నొకఁడనుగాఁ జేరి వారు చేసెడి ప్రతిసభకును బోయిప్రోత్సాహపఱుచుచుండెడివాఁడను. ఈసమాజమునకుఁ గార్యదర్శి పెద్దిభట్ల వెంకటప్పయ్యగారు. ఆయన యప్పుడు పట్టపరీక్ష తరగతిలోఁ జదువుకొనుచుండెడివారు. ఆసమాజములోఁ జేరినవారు తాము చుట్టలు త్రాగుట, పొడుము పీల్చుట మొదలయిన దురాచారములు మానుటకును భోగము మేళముల యాటపాటలకుఁ బోవకుండుటకును సమస్తసంఘసంస్కరణముల యందును తోడుపడుటకును ప్రతిజ్ఞలను గైకొనిరి. వారితో నేను సహిత మాప్రతిజ్ఞలను గైకొంటిని. అప్పుడు విద్యార్థులుగానుండి ప్రతిజ్ఞలు గైకొన్న పెద్దిభట్ల వేంకటప్పయ్యగారు మొదలయినవారు క్రమక్రమముగా తా మున్నతస్థితికివచ్చి తాక్యాధికారధూర్వహులయిన తరువాత సహితము బాల్యమునందుఁ జేకొన్నప్రతిజ్ఞల నతిక్రమింపక మరణపర్యంతమును పాలించుచు వచ్చిరి. అట్లు ప్రతిజ్ఞాపాలనము చేయుచున్నవారిలో నేనొక్కఁడను. నేను బాల్యమునుండియు ప్రబలమైన దగ్గుచేత బాధపడుచున్నవాఁడను. చుట్టకాల్చుటవలన దగ్గుపోవు

వని యూశపెట్టి నామిత్రులును బంధువులును వైద్యులు కొందఱును నాచేత చుట్టలు కాల్పింపవలెనని బహువిధముల ప్రయత్నము చేసిరి. కాని యీశ్వరానుగ్రహమువలనను స్వాభావికమైన నా దృఢనిశ్చయత్వము వలనను వారిహితబోధనలకు లోఁబడిన వాఁడనుగాను.*

మార్కండేయస్వామి యాలయములో సభజరిగినదినము మొదలుకొని మాపట్టణములోని పూర్వాచారపరాయణులలో సంక్షోభము హెచ్చుటకు మఱికొన్ని కారణములు కూడ తటస్థించెను. నా యుపన్యాసములవలనను బోధనలవలనను కలిగిన యుత్సాహముచేత విద్యార్థుల నేకులు తాము వితంతుకన్యలను వివాహమాడి లోకమునకు దృష్టాంతముచూపెదమని నిశ్శంకముగా ఘోషింప మొదలుపెట్టిరి; వితంతుకన్యలు సహితముకొందఱు తమహృదయములలో నంకురించిన సుఖాశాబీజములు మొలకలెత్తి పయికిలేచి యుత్సాహపఱుపఁగా సంతోషచిహ్నములను కనఁబఱుపసాగిరి. ఈసంబంధమున రాజమహేంద్రవరమున నడచినయొక చిన్నవృత్తాంతము నిందుదాహరించెదను. జ్యోతిశ్శాస్త్రవిదుఁడయి వైదికమార్గోపజీవియయిన యొకశిష్టబ్రాహ్మణగృహస్థుఁ డుండెను. పినతండ్రి కూఁతురగు పదునాలేండ్ల ప్రాయము గల యనాథబాలవితంతు వొకతె యీయనయొద్దనుండెను. పిన్నవయస్సుగలదగుటచే నాబాలవితంతువు చీరలు కట్టుచు,రవికలు తొడుగుచు, నగలు ధరించుచు బొట్టులేకపోవుటచేఁ దక్క నితరవిషయముల యందు దించుమించుగా సువాసినివలెనే యుండెను. అప్పటివితంతు వివాహప్రయత్నజనిత సంక్షోభభీతిచేత సంరక్షకులు బ్రహ్మచారి బాలురకు బలాత్కార వివాహమహోత్సవములు జరుపవేగిరపడునట్లే బాల వితంతు బ్రహ్మచారిణులకు వస్త్రాలంకారములను తొలగించి కేశఖండన మహోత్సవములునడప త్వరపడుచుండిరి. ఈసందడిలో మన దైవజ్ఞ

* ఇంతవఱకును చెన్నపురిలో 1902 వ సంవత్సరమునందు వ్రాయబడెను.

శిఖామణి తనవిధవచెల్లెలికి చీరలుమాన్పి వితంతువులుకట్టెడి యెఱ్ఱచేనిముతుకబట్ట కట్టింపనెంచి యంగళ్లవాడకుఁబోయి యొకముతుకబట్ట కొనితెచ్చి "అమ్మాయీ! నీకిమిత్తమీబట్ట తెచ్చితి" నని చెల్లెలిచేతికీయఁబోయెను. ఆవితంతుబాల దానిని గైకొనక "అన్నయ్యా! నాకిప్పుడు చీరలున్నవి. ఈబట్టను వదినెకిమ్ము" అని బదులుచెప్పెను. ఆమాటలకతఁడు మండిపడి "ఇదేమి చేటుకాలమే? విధవలు కట్టుకోవలసిన యీబట్టను ముత్తయిదువ కిమ్మనెదవు?" అని మందలించెను. "అన్నయ్యా! కోపపడకు. నీభార్యవలెనే ముత్తయిదువను కాఁబోయెడు నాకుమాత్ర మీబట్టపనికివచ్చునా?" అని సంశయింపక యాగడుసరిపడుచు ప్రత్యుత్తరము చెప్పెను. ఆమాటలకతఁడు విస్మయపడి గుండెలు బాదుకొనుచు సభాపతులవద్దకు కొంపమునిఁగిపోయినట్టుపరుగెత్తిపోయి తనయింటనడచిన వైపరీత్యమును విన్నవించి యంగలార్చెను. వారాతని నూరడించి తగిన ప్రతిక్రియ నాలోచించెదమని చెప్పి యప్పటికింటికిఁ బంపివేసిరి. ఆచిన్నదానికి పుట్టువెండ్రుకలు తీయింపఁబడెనో వివాహముచేయించబడెనో యేమిజరిగెనో వినవలెనని దీనిం జదువువారికి కుతూహలము కలుగవచ్చును. ఈరెంటిలో నేపనియు జరగలేదు. ఆబాలవితంతువు బలవంతముగా శిరోజములు తీయించుటకు లోఁబడునది కాకుండెను. అందుచేత బంధుబృందమును శిష్టవర్గమును నాలోచించి నడిమిమార్గము నొకదానిని కనిపెట్టి తమకులగౌరవమును కాపాడుకొనిరి. మనవారు పూర్వాచార పరాయణులగుటచేత నీతిబాహ్యమైన గూఢవ్యభిచారమునైన నంగీకరింతురు గాని యాచారవిరుద్ధమైన ధర్మవివాహము నంగీకరింపరు. ఇంటనేయుండి వివాహముతోఁ బనిలేక నీమనసువచ్చినవానితో స్వేచ్ఛముగా విహరింపవచ్చుననియు, నీస్వైరిణీవ్యవహారమున కెవ్వరునడ్డురాఁగలవారు కారనియు, నమ్మఁబలికి కావలసినవా రాయనాథబాలను వివాహ

ప్రయత్నమునుండి విముఖురాలిని జేసిరి. అంతుసాగిన పెండ్లి యక్కఱ
లేదను నామెతను ప్రమాణముగాఁ గైకొని యాఁడుభాగ్యరాలిప్పటి
కిని కులములోనే యుండి దుర్వృత్తిరాలుగా కాలముగడపుచు బహి
ష్కారబాధలేక కులమును పావనము చేయుచున్నది.

మా ప్రతిపక్షులనాథబాలికాకేశఖండనాదులయందు పాటు
పడుచుండఁగా మేము తద్రక్షణోపాయాన్వేషణమునందు నిరంతర
కృషిచేయుచుంటిమి. ఇంచుకవిద్యాగంధముగల వితంతువులు కొందఱు
తమ్ము నిరంతర వైధవ్య దుఃఖమునుండి తప్పించి కాపాడవలసినదని
నాకుత్తరములు వ్రాసిరి. అప్పుడు నేనును నాతోఁ జేరినవారును స్త్రీ
పునర్వివాహసంస్కారము యుక్తవయస్సురాని వితంతుకన్యల వివాహ
ములతో నారంభించిన పక్షమున బహుజనరంజకముగా నుండి యత్యంత
శీఘ్రకాలములో వ్యాప్తికాంచఁ గలుగునని భావించియుంటిమి. ఇట్టి
వితంతుకన్యలకు వివాహములు చేసెదమని బైలుదేఱినవారు సహి
తము కొంద ఱేర్పడిరిగాని తా మిందులో ముందుగా నడుగిడుదు
మనువారు మాత్రము కానఁబడలేదు. ఎల్లవారును ముందొక వివాహ
మైనయెడల తాము రెండవవారముగా నుందుమనెడువారే కాని తామే
మొదటివారముగా నుందమను ధైర్యశాలులు బైలుదేఱలేదు.
ముందుగా నెవ్వరైన నీకార్యమునందు ప్రవేశించుటచూచి వారికి
కష్టములు వచ్చినపక్షమున తాము తప్పించుకొని దూరముగా తొలఁ
గుటకును వారికి కష్టములు రానిపక్షమున తామును ప్రవేశించి సుఖ
మనుభవించుటకును గోరుచుండుట లోకస్వభావముకదా! ఈసాహ
సిక కార్యమునందు ముందంజవేయుట కెవ్వరినైన నొక్కరిని సమ్మతి
పఱుచుటకు స్వయముగామాటాడియు, మిత్రులచే మాటాడించియు,
మనసుకరఁగునట్లుగా రహస్యలేఖలను వ్రాసియు, నానాముఖముల
కృషిచేయుచునే యుంటిమి. అప్పుడు విద్యార్థిగా నుండి సర్వవిధముల

మాకు సాయపడుచుండినట్టియు, తరువాత మా గోదావరీమండల
ములో మండల కరగ్రాహి సిరస్తాదారు పదవియందుండి యిప్పుడు
కీర్తిశేషులయినట్టియు, పిద్దిభట్ల వేంకటప్పయ్యగారు పట్టపరీక్షార్థము
చెన్నపట్టణమునకుఁబోవుచు పొగయోడ నెక్కుటకయి కాకినాడకు
వెళ్ళి యచ్చటినుండి 1881 వ సం॥ నవంబరు నెల నాలవ తేదీని నాపేర
వ్రాసినలేఖలోనుండి యొకభాగమును మా యప్పటికృషిని దెలుపుట
కయి యిందుఁ బొందుపఱుచుచున్నాను.

'గౌరవనీయుఁడైన మిత్రుఁడా!... నేను పిద్దిభట్ల యజ్ఞన్న
గారితో మాటాడినాను. అతఁడు తన వితంతుసోదరిని స్వశాఖవాఁ
డయి వృద్ధికి రాఁదగినచిన్నవాని కెవ్వనికైన నిచ్చి వివాహము చేయు
టకు సంసిద్ధుఁడై యున్నాఁడు. నాలుగయిదు మిథునములనుమాత్రము
గలదయినపక్షమున మొదటిగణములోనే చేయుటకు సహిత మతఁడు
సంసిద్ధుఁడయి యున్నాఁడు. అతఁడు వెనుకతీయఁడని మీరు నమ్మి
యుండవచ్చును. అతని మేనమామలును తక్కిన పెద్దలును పయికి
మాత్ర మసమ్మతిని కనఁబఱచునట్లుందురుగాని కడపట మనపక్షము
వారుగానే యుందురని నాకు రహస్యసమాచారము తెలిసినది. ఈ
యుత్తరము చేరినతత్క్షణమే మీవద్దకు రావలసినదని యజ్ఞన్నగారికి
వ్రాయుఁడు. మీ యొద్దనుండి యుత్తరము వచ్చినతరువాత నిమ్ము
పోయి కలిసికొని యావశ్యకములైన యేర్పాటు లన్నియు చేయుట
కీతఁడు వాగ్దానము చేసియున్నాఁడు.

నేనొకవ్యాపారి (మాధ్వ) మనుష్యుని భద్రపఱుచుటకుఁగూడ
శక్తుఁడనయినాను. అతఁడు వితంతువును వివాహమాడును. అతఁడు
సుమా రిరువదిరెండుసంవత్సరముల ప్రాయమువాఁడు; సామాన్య
పరీక్షయందు తేఱినవాఁడు; ఇప్పుడు ప్రాథమికపాఠశాలలో పదునేను
రూపాయల జీతముగల యుపాధ్యాయుఁడుగానున్నాఁడు. మీరు
వ్రాసినపక్షమున, అతఁడుకూడ మీవద్దకువెళ్ళి యేసియమముల

నతఁడు నరకేర్పవలసియుండునో ప్రస్తావించును. అతఁడు బీదస్థితియం దున్నవాఁడని నే నెఱుఁగుదును.

నేటి యుదయకాలమున రామకృష్ణయ్యగారిని కలిసికొంటిని. మీతో చేసినవాగ్దానములనే యతఁడు చేసెను. దృఢముగానుండి పట్టుదలచూపుఁడని యతఁడు మనలఁ గోరుచున్నాఁడు. ఆయన విషయమయి యిక్కడ వ్యాపించియున్న వాడుకనుబట్టి విచారింపఁగా, ఆయన మిక్కిలి యుత్సాహము కలవాఁడుగా నున్నాఁడు. ఈస్థలము లోని యాతని కులజనుల యొక్కయు నితరుల యొక్కయు ద్వేష యుక్తములైన దూషణలను సరకుసేయక యతఁడు తనపట్టును వదల కుండును. అప్పుడప్పుడు నాకు ప్రోత్సాహకరమైన యుత్తరముతో నాతని నిని తాఁకి పైకిలేపుచుండుఁడు.

ఇంచుమించుగా నొకగంటకాలములో మేము ధూమనౌక నెక్కుదుము. *

---

* "Respected friend....................

I have spoken to Peddibhotla Yeggenna Garu. He is prepared to give his widowed sister in marriage to any promising youth (of his sect of course). He is also prepared to join the first batch if only it consists of 4 or five matches. You may depend upon it he will not draw back. I have secret information to the effect that his uncles and other elders only put on the appearance of disapprobation but they will eventually be of our party. Please write immediately on the receipt of this to Mr. Yeggennah to go to you. He has promised to go and meet you and make all necessary arrangements after receiving a letter from you.

I have also been able to secure a మాధ్వ (Madhwa) man. He will marry a widow. He is about 22 years of age, passed General test, is now a teacher in the Primary School on Rs. 15. If you write to him he will also go to you and propose

మిత్రులలేఖ లిట్టువంటివి పెక్కులున్నను, ముందుపనికయి దీనిని మాత్ర మిచటఁ బ్రచురించుచున్నాను. ఇది యిట్లుండఁగా కృష్ణామండలములోని తిరువూరు డిప్యూటీతహాసీలుదారుగా నుండిన బ్రహ్మశ్రీ దర్భా బ్రహ్మానందముగారు తమతాలూకాలోని యొక గ్రామములో పన్నెండేండ్ల యీడుగల యొకవితంతు బ్రాహ్మణకన్య యున్నదనియు, తగుమనుష్యులను పంపఁగలిగినయెడల తల్లిని సమ్మతిపఱిచి యాచిన్నదానిని వారివెంటఁ బంపునట్లు ప్రయత్నము చేసెదమనియు, నాకొకలేఖను వ్రాసిరి. ఈ విషయమయి కొంత యుత్తరప్రత్యుత్తరములు జరిగిన తరువాత నామిత్రుఁడు తిరువూరు నుండి 1831 వ సంవత్సరము నవంబరు నెల మొదవ తేదిని నా కిట్లు వ్రాసెను.

'మీ యుత్తరములు యుక్తకాలములోనే నాకు చేరినవి. ఆ బాలవితంతువుయొక్క తల్లి తన గ్రామమును విడిచి బంధువులను చూచుటకయి పోయినందున ఆమెతో మాటాడి యింతెకంటె ముందుగా మీకు ప్రత్యుత్తరము పంపలేకపోయితిని. ఆమెతో నేనిప్పుడే మాటాడితిని. అక్కడికిఁ దీసికొనిపోవుటకు మీ రిక్కడికి మీ మనుష్యులను బంపినతోడనే తన కొమారితను మీవద్దకుఁ బంపెదనని

---

what conditions he needs to be fulfilled. I know his circumstances are narrow.

*    *    *    *

This morning I met Mr. Ramakrishniah. He made the same promises that he made with you. He asks us to be steady and persevere. He is very zealous judging from the talk afloat about him here. He holds his ground in spite of the malicious reproaches of his chste people and others of this place. Please be touching him up with an encouraging letter now and then.

We shall take steamer in an hour or so."

యామె వాగ్దానముచేసినది. ఆచిన్నదానిని వెంటఁబెట్టుకొనిపోవుటకు నమ్మఁదగినవారును ఋజువర్తనులును దృఢచిత్తులునయిన మనుష్యులను బంపుఁడు. వారు విషయము నత్యంతరహస్యముగా నుంచవలెను. వారు కపటవేషధారులైనపక్షమున, వారు మన కార్యమునకు భంగము కలిగించుట నిశ్చయము. వారిని నిజముగా మనపక్షావలంబులనుగాఁ జూడుఁడు. వివాహము నిజముగా జరుగువఱకును వారెందు నిమిత్తమువచ్చిరో యీపని యిక్కడ నెవ్వరికిని దెలియకుండవలెను. ఈపనినిమిత్తమయి యిద్దఱికంటె నెక్కువమనుష్యులను పంపవలదని సీతమ్మ (బాలవితంతువు తల్లి) మిమ్ము కోరుచున్నది. మనప్రయత్నములు కడపట మరల సంపూర్ణభగ్నతను పొందవచ్చునని యామె కూడ తలఁచుచున్నది. వివాహము నిమిత్తమయి తనలిఖితానుజ్ఞను మీకిచ్చుటకుకూడ నామె యొప్పుకొనియున్నది. మీ మనుష్యులు మీ యొద్దనుండి యుత్తరముతో మార్గస్థులవలె నిక్కడికి వచ్చి, యీవిషయమయినవాసన యిక్కడ నెవ్వరికి నెంతమాత్రమును సోఁకకుండ నన్ను కలిసికొనుఁడు. బాలికయొక్క గ్రామమైన రేపూడికి వారీస్థలమునుండి సహితము పోవచ్చును. మీ మనుష్యులువచ్చి యామెకూఁతును తీసికొనిపోవుపర్యంతమును గ్రామమునువిడిచి పోవలదని నేను సీతమ్మకు చెప్పితిని. మీ యుచితమైన యానుకూల్యము ననుసరించి మీ మనుష్యులను బంపుఁడు. *

* 'Your letters have reached me in time. As the mother of the young widow has left her village and gone to see her relatives, I could not talk to her and send you a reply earlier than this. I have just now talked to her. She promised to send her daughter to you as soon as you send your people here to fetch her there. Please send trustworthy, upright and firm-minded people to escort the girl there. They should keep the thing as a profound secrecy. If they are hypocrites, they are sure to frustrate our object. Please see that they really uphold our cause. No body here

పైయుత్తరము నాకీనెల యెనిమిదవ తేదిని చేరినది. మనుష్యులను నాలుగైదు దినములలోఁ బంపుచున్నానని 10 వ తేదిని బ్రహ్మానందముగారికి లేఖవ్రాసి, నేనావిషయమైన కృషిలోనే యుంటిని. ఈ విషయమై విశేషశ్రద్ధనువహించి తాము రాజమహేంద్రవరమునకు వచ్చినప్పటినుండియు ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు నాకు సర్వవిధముల సహాయులుగా నుండిరి. పంపవలసిన మనుష్యులవిషయమున నే నాయనతో నాలోచించి, ఆయన తనకార్యస్థానమునందు కొలువులో నుండి మిక్కిలి తెలివిగలవాఁడును పరమవిశ్వాసియునయిన యొకభటునికి సెలవిచ్చి నేను పంపఁదలఁచుకొన్న నామిత్రునికి తోడుగా వెళ్లుటకయి యాభటుని దయాపూర్వకముగా నావశము చేయఁగా, ఈ కార్యములయం దత్యంతాదరముకలిగి ప్రథమశాస్త్రపరీక్షయందు కృతార్థుఁడయి మొదటినుండియు మాతో పనిచేయుచుండిన సోమంచి భీమశంకరముగారిని నాలేఖతో బ్రహ్మానందముగారియొద్ద కీనెల 16వ తేదీని బంపితిని. ఇటువంటికార్యములలో పేరు వెల్లడియైనచో కార్యభంగము కలుగును గనుక, ఆచిన్నది యేగ్రామమునం దుండెనో, ఆచిన్నదాని తల్లి పేరేదో, మేముపంపినమిత్రునకు సహితము చెప్పక రహస్యముగా నేయుంచి, బ్రహ్మానందముగారిని కలిసికొన్నతరువాత కర్తవ్యమును సమస్తమును వారే చేసెదరనిమాత్ర మాయనతో

---

should know the purpose for which they come here till the marriage actually takes place. Seetamma wants you to send not more than two people for the purpose. She also thinks that our efforts may, at the end, again prove a total failure She has also agreed to give you her written permission for the marriage. Let your people come here as travellers with a note from you and meet me without giving the least smell of the matter to any body here. They can go to Repudi, the girl's village, even from this place. I told Sitamma not to leave her village till your men come and take her daughter away. Please send your people at your earliest convenience."

చెప్పితిని. నామిత్రుఁడు రాజమహేంద్రవరమును విడిచిన రెండుదినములకు బ్రహ్మానందముగారు వ్రాసిన యుత్తరమొకటి నాకు చేరినది. ఆయన తిరువూరినుండి 14 వ తేదిని వ్రాయఁగా 17 వ తేదిని నాకందిన యాలేఖలో నిట్లు వ్రాయఁబడియుండెను.

"పదవ తేదిగల మీయుత్తరలాభమును వందనములతో నంగీకరించుటకు నేను మిక్కిలి యానందము నొందుచున్నాను. కాని, వెంటనేపోయి తహశ్శీలుదారుగా వినుకొండతాలూకా నొప్పగించుకో వలసినదని యాజ్ఞాపించుచు నిన్నటిదిన మాకస్మికముగా నాకుత్తవురు వచ్చినదని మీకు చెప్పుటకు నేనెంతయు చింత నొందుచున్నాను. నేనక్కడ నలువది దినములుండవలసి యుండును. ఈ గడువు తరువాత నేనిక్కడకు మరల వచ్చుట సంభావ్యము కావచ్చును. నేను రేపటిదినము వినుకొండకు పోవుటకయి యీస్థలమును విడుచుచున్నాను. ఆశాభంగమును పొందక రేపూడికి వెళ్ళి బాలిక తల్లితో మాటాడి యామెను తీసికొనిపోవలసినదని మీమనుష్యులతో చెప్పుఁడు."*

ఈయుత్తరము నాకుచేరుటకు రెండుదినములుముందే మామనుష్యులు రైలుదేరిపోయి నడిదారిలోనుండిరి. మామిత్రుఁడు పోవలసిన గ్రామము మా పట్టణమునకును నూటయేఁబది మైళ్ళ దూరములోనున్నది. అక్కడ కరోమార్గములు లేవు; తంతిసమాచారముండదు,

* "I feel very glad to acknowledge with thanks the receipt of your letter of 11th instant. But I am very sorry to tell you that on a sudden I received an order yesterday directing me to take charge of Vinukonda Taluq forthwith as the Ag. Tasildar there. I shall have to stay there 40 days. Most likely I may return after this term. I shall leave this tomorrow for Vinukonda. Please tell your people not to be disappointed but to go to Repudi; talk to the mother of the girl and take her away."

అట్టిస్థితిలో నేను నామిత్రులతోడ నాలోచించి, ఆచిన్నది వాసము చేయుగ్రామమును తల్లి యింటిపేరును జరపవలసిన కృత్యమును విస్తారముగాఁ దెలుపుచు మామిత్రునకొక లేఖవ్రాసి, దానికి లక్కముద్రలు వైచి, లక్ష్మీనరసింహముగారే మరల ననుగ్రహించి యిచ్చిన విశ్వాసపాత్రుఁడైన మఱియొకభటునిచేతికిచ్చి పంపితిమి. ఈజాబు చేరులోపల మామిత్రుఁడు గమ్యగ్రామము చేరి విచారింపఁగా, బ్రహ్మానందముగారావఱకే గ్రామమువిడిచి యొక్కగాంతెరముమీఁద దూరగ్రామము పోయినట్టు తెలియవచ్చినది. తాము పోవలసిన గ్రామమేదో, తీసికొనిరావలసిన చిన్నదెవరో, వారికి తెలియదు; తామువచ్చిన కార్యమునైనను వేఱొకరితో చెప్పవల్లకాదు; ముందు తామెవ్వరో తెలుపవయినను తెలుపవలనుపడదు. ఈస్థితియందేమి చేయుటకును ఆలోచన పాలుపోక బుద్ధిమంతుఁడును కార్యదక్షుఁడును నగుటచేత తొందరపడి గ్రామము విడిచిరాక మాయుత్తరము నపేక్షించి మామిత్రుఁడా గ్రామములోనే వేచియుండఁగా, మేము పంపిన మనుష్యుఁడు పోయికలిసికొని 22వ తేదిని మాలేఖనిచ్చెను. తక్షణమే పోవలసినగ్రామమునకు వారు ముప్వురును బైలుదేఱిపోయిరి. ఆచిన్నదాని తల్లిదండ్రులు ధనికులయి గ్రామాధికారులయిన గొప్పవంశమువారు; ఈకార్యము తల్లి కొకతెకుతప్ప బంధువర్గములో నెవ్వరికిని ఇష్టములేదు; ఆచుట్టుపట్టుల నున్న గ్రామములన్నియు వారిబంధువులతో నిండియున్నవి; ఈసమాచారము కొంచెము పైకిపొక్కినపక్షమున మోటుగ్రామములవారెంత దౌర్జన్యమునకు తెగింతురో యెల్లవారు నెఱిఁగియుందురు; ఆచుట్టుప్రక్కల మామిత్రునకుసాయముసేయువా రొక్కరునులేరు. ఇటువంటి విషమస్థితిలో నామిత్రుఁడు కర్తవ్యమును చక్కఁగా నాలోచించి తానెక్కడికిఁ బోవుచున్నారో బండివాండ్రకు సహితము చెప్పక రాత్రి రెండుయామముల కాగ్రామముచేరి ప్రయాసముమీఁద వారి

యిల్లు తెలిసికొని చిన్నదానితల్లిని లేపి రహస్యముగా తామువచ్చిన పనిని తెలుపఁగా, ఆమె బ్రహ్మానందముగారు రానిదే తాను పిల్లను పంపనని చెప్పెను. నామిత్రుఁడారాత్రి యామె నేలాగునకో బ్రతిమాలి యేమేమో చెప్పి యొప్పించి పిల్లదానిని తమవెంట నొంటిగా వచ్చునట్లు డంబడిచి తెల్లవారకమునుపే యాచిన్నదానిని తీసికొని బైలుదేఱి యావిన మేగ్రామములో నాఁగినట్లు చేసికొని భోజనము చేయక యటుకులే తినియుండి, వెనుకనుండి యెవ్వరువచ్చి పట్టుకొందురో యను భీతిచేత శీఘ్రప్రయాణము చేసి కొన్నిదినములలో తామా చిన్నదానిని సురక్షితముగా రాజమహేంద్రవరమునకుఁ గొనివచ్చి యిరువదియేడవ తేదీని మాయింటివద్ద చేర్చెను. ఆయెలుగాఁడే యీవార్త యూరంతయు పొక్కి యాచిన్నదానిని చూచుటకయి జనులు తీర్థప్రజలవలె మాయింటికి రాసాగిరి. అందుచేత కొన్నిదినములు మాయిల్లు తిరుమల వేంకటేశ్వరుని దేవాలయమువలె వచ్చెడివారితోను పోయెడివారితోను సందడిగా నుండెను. అప్పుడు మేము వరాన్వేషణమున కుపక్రమించితిమి. ఇదివఱకు చెప్పినట్లు మేము వితంతుకన్యానయ ప్రయత్నమారంభించినది మొదలుకొని తల్లిదండ్రులు భయపడి సమస్తప్రయత్నములు చేసి బ్రహ్మచారులైన విద్యార్థులకు బలవంతపెట్టి వివాహములు చేయ నారంభించిరి. అందుచేత నావఱకు వివాహమాడ నిశ్చయించుకొన్న విద్యార్థులకు కొందఱికి వివాహము లయిపోయినవి; ఉన్నవారిలో కొందఱు అన్యశాఖవారగుటచేత పనికిరాకపోయిరి. మిగిలినవారిలో నుండి మంచివాని నొక్కని నేర్పఱచుట కాలోచించుచుండఁగా, అవఱకు బహుసంవత్సరములు మాయింటనే యుండి విద్యనేర్చుకొని సర్వకలాశాలా ప్రవేశపరీక్షయందు తేఱి, అప్పుడు విశాఖపట్టణములో నా రక్షకశాఖయందిరువదిరూపాయల పనిలోనున్న యిరువదిరెండు సంవత్సరముల ప్రాయముగల యొక

చిన్నవాని భార్య యాకస్మికముగా మరణము నొందుట తటస్థించెను. అతఁడు చిరకాలము నా శిక్షలోనుండి పెరిగినవాఁడగుటచేత వితంతు వివాహములు మొదలైన క్రొత్తమార్గములయం దాసక్తియు నుత్సాహమును గలవాఁడు. నేనాతని కీవిషయమున జాబు వ్రాయఁగా తానీ చిన్నదానిని వివాహమాడుట కంగీకరించెను. అతఁడు చిన్నవాఁడగుటచేతను విద్యగలవాఁడగుటచేతను వృద్ధి కాఁదగిన దొరతనమువారి కొలువునందున్నవాఁడగుటచేతను పలువురాతనికి కన్యనిచ్చెదమని తిరుగుచున్నను వారినందఱిని నిరాకరించి వితంతువును వివాహము చేసికొని బుద్ధిపూర్వకముగా ననేకకష్టములు పొందుటకు సాహసించిన యాతని ధైర్యమును పరోపకార చింతయు నత్యంత శ్లాఘ్యములు. వివాహదినము నిశ్చయింపఁబడినది. వివాహవ్యయముల నిమిత్తమయి పైడా రామకృష్ణయ్యగారు వేయిరూపాయలు నాకిమ్మని నాళము కామరాజుగారికి వ్రాయఁగా వారా మొత్తమును మాకిచ్చిరి. వివాహమునకుఁ గావలసిన పరికరములన్నియు సమకూర్పఁబడినవి. అయినను విశాఖపుర మండలారక్షక శాఖాధ్యక్షుఁడు వరునకు సెలవీయుటకు నిరాకరించి నందున వివాహమునకు విఘ్నము సంభవించునట్లు కానఁబడెను. కాని యనాథరక్షకుఁడైన యీశ్వరుఁడు మా పక్షము నందుండుటచేత కడపట సర్వమును సానుకూలమయి ముగిసెను. కొంతకాలము మా గోదావరీ మండలారక్షక శాఖాధ్యక్షుఁడయి నాయందు మంచియభిప్రాయము కలిగియుండిన కర్నల్ పోర్చిగీస్ దొరగారప్పుడు చెన్నపురిరాజధానిలోని యారక్షకశాఖ కంతకును నధికారి (Inspector General of Police) గానుండుట తటస్థించెను. నేనాయనకు వ్రాయఁగా నాదొరగారు నాయందనుగ్రహించి వరునకు సెలవిచ్చి వెంటనే పంపవలసినదని విశాఖపట్టణ మండలారక్షక శాఖాధ్యక్షునకు తంతివార్తను బంపుటయేకాక గోదావరీ మండలారక్షక శాఖాధ్యక్షు

నకు (Police Superintendent) వివాహ సంబంధమున నేను గోరిన సర్వసాహాయ్యములును జేయవలసినదని యాంతరంగికలేఖను సహితము వ్రాసిరి. విశాఖపట్టణ మండలాగతుక శాఖాప్రధానకార్యస్థానా వేక్షకుడు (Police Head Quarters' Inspector) ను నామిత్రుఁడును బ్రహ్మానందముగారి తమ్ముఁడును వితంతువివాహవిషయమున వరుని ప్రోత్సాహపఱచినవాఁడును నయిన దర్భా వేంకటశాస్త్రిగారు వరుని వెంటబెట్టుకొనివచ్చి యుక్తకాలములో రాజమహేంద్రవరము చేరిరి. అంతవఱకును జనులు పరిపరిలాగుల నూహలుచేయుటయే కాని వరుఁ డెవ్వరో నిశ్చయముగా తెలిసికోఁగలిగిన వారు కారు. వరుఁడు గోగుల పాటి శ్రీరాములుగారని తెలిసినతోడనే మాపట్టణములోని యాతని బంధువులు మొదలైనవారు వచ్చి వివాహము చేసికోవలదని హితోప దేశములుచేసి కార్యము గానక మరలిపోవుచు వచ్చిరి. వివాహము జరుగునని నిశ్చయముగా తెలిసినతరువాత మాపట్టణమునందు పుట్టిన సంక్షోభ మింతంతయని చెప్పుటకు శక్యముకాదు అవఱకు నిశ్శబ్దము గానుండిన మాపట్టణమంతయును మహావాయువుచేత సంక్షోభము నొందిన మహాసముద్రమువలె కలఁగ నారంభించినది. ఎక్కడ జూచి నను సభలే ! ఎక్కడఁజూచినను వీధులలో గుంపులుగూడి గుజగుజ లాడుచుండుటలే; ఎక్కడఁజూచినను కోపవాక్యములే; ఎక్కడఝూచి నను బెదరింపులే.

ఈ యాకస్మికసంక్షోభములో తామంతకుముందు పేరులేక మూలఁబడియున్న యనామధేయు లనేకులు సుప్రసిద్ధు లయినారు; వివాహములలో తోరణములు త్రెంపి పెనఁగులాడి చేతులువిఱిచి సంభావనలు గొను మహాపురుషులు పెద్దసభాపతులయినారు; ఇచ్ఛ కములాడి యింటింటఁదిరిగి బిచ్చమెత్తుకొను తుచ్ఛులు సందడిగా తిరిగి సమాచారములు తెచ్చుట కెంతో పెద్దలయినారు. వీరి యాటోప

మునుజూచి నామిత్రులు సహితము కొందఱు నాతో మాటాడుటకే భయపడిరి; స్త్రీపునర్వివాహ విషయమయి తమ ప్రాణములనయిన విచ్ఛేదమని దంభములు పలికి యితరులకు లేఖలు వ్రాసినవారును, అంతరంగిక సమాజములో చేరియున్నవారును సహితము పెండ్లికి వచ్చుటమాట యటుండఁగా మావీధిని నడుచుటకే జంకుపడి కార్యస్థానాదులకుఁ బోవునప్పుడు చుట్టుతిరిగి వేఱుదారులఁ బోవువారైరి. పామరులవలని భయముచేత మాయింట వంటచేయు బాపనపనికత్తె మమ్మావఱకే విడిచిపెట్టెను; పురోహితుఁడు మాయింట శుభకర్మలు చేయించుటకయి రాక మానుకొనెను; బంధువులందఱును నన్ను బహువిధముల నిందించుచు జాతిభ్రష్టునివలె చూడసాగిరి; వివాహదినమున మాయింటమాత్రమే కాక మాయింటిచుట్టును మావీధిపొడుగునను రక్షకభటుల కావలి కావలసివచ్చినది. ఇటువంటి మహాసంక్షోభములో 1881 వ సంవత్సరము డిసెంబరు నెల 11 వ తేదిని రాత్రి రాజమహేంద్రవరములో మొదటి స్త్రీ పునర్వివాహము జరిగినది.

ఆవివాహమునకు మొదటినుండియు నాతోనుండి పనిచేసి ప్రప్రథమమున నన్నీకార్యమునకుఁ బురికొల్పిన మిత్రుఁడు చల్లపల్లి బాపయ్యగారు రానేలేదు. ఆయన పామరజన దూషణమునకు భయపడిగాని యీకార్యమునం దాదరము తగ్గిగాని వివాహసమయమునవచ్చుటకు మానుకోలేదు. ఆయన యన్నబిడ్డలును నాటిరాత్రి యాయనను బలవంతముగా నొకగదిలోపెట్టి తాళమువేసి నిర్బంధించి యీవలకు రానీయకపోయిరి. పెద్దన్నగారయిన రామబ్రహ్మముగారు పూర్వాచారపరాయణుఁడును వితంతువివాహవిపక్షుఁడు నయినను రెండవ యన్నగారైన రంగయ్యపంతులుగారు నాకు చిరకాలమిత్రుఁడును సంస్కారపక్షానుకూలుఁడును నయినవాఁడే. అయినను బహు

జనసంక్షోభసముద్రమునందు బంధుజనబహిష్కారమునకు భయపడ కుండుట సామాన్యులకు సాధ్యముకాదుగదా? బాపయ్యగారివలెనే నాకు పరమమిత్రుఁడును మా యాంతరంగిక సామాజికులలో నొక్క-డును వితంతువివాహపక్షమునం దసమానాదరముగలవాఁడును నయిన న్యాపతి సుబ్బారావు పంతులుగారు రాత్రి వివాహమునకు రావలె నని యెంతో ప్రయత్నము చేసికాని వారు కాపురముండిన యింటి వారా రాత్రి పెండ్లికిఁ బోయిన యెడల మరల నింట నడుగిడనియ్యమని స్పష్టముగాఁ జెప్పినందున రాలేకపోయిరి. ఆయన కప్పుడు స్వగృహ ముండినయెడలను, ఉండిన యింటివారైన బంధువు లంత నిర్బంధ పెట్టకపోయినను, అప్పుడుండిన యుత్సాహమునుబట్టి వారు తప్పక వివాహమునకు వచ్చియుందురు. కొందఱీప్రకారముగా ననివార్య ప్రతిబంధములచేతను, కొందఱు స్వాభావిక భీరుత్వముచేతను, రాలేక పోయినను, ధైర్యశాలులును దేశాభిమానులు నయిన నామిత్రు లనేకులు వివాహదినములలో తాంబూలములకు మాత్రమేకాక భోజనములకు సహితము వచ్చిరి. అట్టి యసామాన్యసాహాయ్యముచేసి నాకు తోడుపడి పెక్కు-కష్టములకు లోనైనవారియెడల నేనత్యంతకృతజ్ఞత గలవాఁడనయి యున్నాను. ఇట్టివారిలో నగ్రగణ్యులయిన యొక్క-రిని గూర్చి నేను చెన్నపురిలో 1885 వ సంవత్సరమధ్యమున నేనిచ్చిన రాజమహేంద్రవర స్త్రీపునర్వివాహచరిత్రమునుగూర్చి యుపన్యాసములో నిట్లు చెప్పితిని—

“వారిలో నాకు మొదటినుండియు పరమాప్తుఁడయి, ఒక్క-యీకార్యమునందు మాత్రమేకాక దేశక్షేమము నిమిత్తమయి నేను చేయతలపెట్టిన మంచికార్యములలో నెల్లను నాకు కుడిభుజమయియుండి, పయికి పేరు నాదియైనను చాటున నాకంటెను బహుగుణము లధికముగా పనిచేయుచు వచ్చుచున్న బసవరాజు

నవరాజుగారి సాహసచరిత్రము నిచ్చట ముఖ్యముగా శ్లాఘింప వలసియున్నది. పదిమంది యొక్కసారిగా లోకాంతరగతులయి నప్పుడు పుట్టునంత సంక్షోభము ఈ వివాహదినమున వారియింట పుట్టినది. భార్యవంకవారును తనవంకవారు నయిన బంధువు లొక్కసారిగా గొల్లున గోలపెట్టి మధ్యాహ్న సమయమున మృత్యుని నిమిత్తమయి యేడ్చున ట్లేడ్చుచు శపించుచు లేచిపోయిరి. తల్లిదండ్రులు చిన్నతనములో పోయినప్పటినుండియు పెంచి పెద్దవానిని జేసిన పెద్ద తల్లి తన్నువిడిచిపోయినను వెనుకతీయక, లోకోపకారమునిమిత్త మయి యెన్నికష్టములు వచ్చినను సహించుకొనియుండి, భార్య దీర్ఘ వ్యాధిచేత బహుమాసములు మంచమెక్కియుండి బంధువులురాక బహు బాధలు తటస్థించినను ప్రాయశ్చిత్తమన్న పేరైననుతలపెట్టక ఈ దినమువఱకును పరోపకారకమయిన యీకార్యము నిమిత్తము వ్యయప్రయాసములను సంతోష పూర్వకముగా వహించుచున్న యీనామిత్రుని నెట్లు శ్లాఘింపవలయునో నేనెఱుఁగకున్నాను."

1888-వ సంవత్సరము జూలయి నెలలో నిట్టి మిత్రరత్నమును గోలుపోయిన యభాగ్యము నాకు సంప్రాప్తమయినది. మరణపర్యంత మును నన్నును నేను పూనిన వితంతువివాహపక్షమును విడువక ప్రాయ శ్చిత్తమునకు లోఁబడకయుండిన మహాపురుషుఁ డీయనయొక్కఁడే. నాకింతటి సహాయుఁడయి యుండియు మాయిరువురి విషయమునను డాక్టరు సత్యనాథముగారు 1886-వ సంవత్సరాంతమున మెయిలు పత్రి కకు వ్రాసినప్పుడు తనదినచర్యయందు విధేయత తేటపడునట్లుగా నిట్లు వ్రాసికొనిరి:-

"వితంతువివాహసంబంధమున నాపేరును వీరేశలింగముగారి పేరును ఉదాహరించుటచే మాయందాయన కెంతో దయకలదని భావించెదను. కాని యీగొప్పకులాచార సంస్కారకార్యమునందు

నేను చేసినపని యత్యల్పమయినదని సిగ్గుపడుచున్నాను. నాసరియైనస్థితి సత్యనాథముగారి కొకవేళ తెలియకుండవచ్చును. నేను చేసినదంతయు ఉపకృతము వారితో భోజనము చేయుటయు వీరేశలింగముగారిని ఇతర విధముగా ప్రోత్సాహపఱుచుటయును. నేను లేకుండ వీరేశలింగముగారింతపనియు తాము చేసియుందురనియు, ఆయన లేకుండ నాయంతట నేనేమియు చేయలేకుందుమనియు, ఆయనతోఁ గలిసికూడ పనిని చెప్పినదానికంటె నధికముగా నిశ్చయముగా నేనేమియు చేసియుండ లేదనియు, నామనోనిశ్చయము.'

గవర్రాజుగారివలెనే యాపక్షముఁజేరి వివాహసమయమున భోజనములు చేసినవారందఱును కొంచెముగానో గొప్పగానో యావిధమైన శ్రమల కోర్చినవారే. పలువురు మార్గాంతములేక ప్రాయశ్చిత్తములు చేయించుకొని మరల్ని విడువవలసినవారైనను వారి మనస్సులు మాత్రము మాపక్షమునే యుండెను. ఒకరు రాజకార్యమువిూఁద గుంటూరు వెళ్ళవలసినవారయి యక్కడ నీళ్ళబ్రాహ్మణులు దొరకకయు కాపురముండుట కిల్లుదొరకకయు బహుబాధలు పొంది యిష్టములేకయే ప్రాయశ్చిత్తమునకు లోనుగావలసినవారైరి; ఆయన బావమఱఁది మఱియొక రారంభదశయందలి కష్టములకన్నిటికి తాళి కొంతకాలము మాతో నేయుండి యెదిగి యాడేటి కాపురమునకు సిద్ధముగానుండిన తనతోడఁబుట్టినపడుచును అత్తవారు తీసికొనిపోనొల్లకుండినందున ప్రాయశ్చిత్త మంగీకరింపవలసిన వారయిరి; ఇంకొకరు పెద్దకుటుంబముగలవా రగుటచేత తనకొడుకులకును కొమారితలకును సంబంధములు దొరకవన్న భీతిచేత ప్రాయశ్చిత్తము చేసికొనిరి; దూరదేశముపోయి కన్యను తీసికొనివచ్చిన నామిత్రుఁడు సహితము తనమేనమామ కాలముచేసినప్పుడు గత్యంతరములేక ప్రాయశ్చిత్తమున కొప్పుకొనవలసినవాఁ డయ్యెను. కొందఱు కొందర

పడి భయభ్రాంతులై యారంభదశలోనే ప్రాయశ్చిత్తములు చేసి కొన్నను, ఇటువంటి భయంకరసమయములో ధైర్యము నిలుపలేక పోయినందుకు నేను వారిని నిందింపను. వివాహములకు బహుసహస్ర రూప్యములు గవ్వలవలె వ్యయము చేసి, వివాహములాడిన దంపతుల కాపురముల కిండ్లిచ్చి మరణసమయమునందు పదివేల రూపాయ లిచ్చిన శ్రీ పైడా రామకృష్ణయ్యగారి యంతటి ధైర్యౌదార్యశాలి సహిత మీ సంక్షోభములో మనస్స్థైర్యము నిలుపలేక ప్రాయశ్చిత్తము చేసికోవలసి వచ్చినప్పుడు, అబలమిత్రులును బంధుజనులును కులము వారును బహువిధముల దూషించి వెలిపించుచుండఁగా, ఇంటభార్య లును తల్లులును బహువిధముల విలపించుచు మనస్సు కలంచుచుండఁ గా, మతగురువులు బహిష్కారపత్రికలు పంపి భీతికలుపుచుండఁగా, సామాన్యజనులు ధైర్యము నిలుపఁగలుగుదురా? ఇఁక మరల మన వివాహకథకు వత్తము.

ఈ యనర్థమునకెల్లను మూలమయిన నా ప్రాణములకు సహితము కొందఱు దుష్టులెగ్గుతలఁచిరి కాని విద్యార్థులును రక్షకభటు లును నా కంగరక్షకులుగా నుండుటచేతను, ప్రభువులకెల్లను ప్రభు వయిన యీశ్వరుఁడే నన్నుకాపాడువాఁడయి యుండుటచేతను, దుష్టు లవలన నాకేవిధమైన యపాయమును గలుగలేదు. ఈకార్యముల యందు మాకారక్షకశాఖవారివలనఁ గలిగిన సాయమింతయంత యని చెప్పతరముకాదు. హిందువులయిన రక్షకభటులు సహితము మాకు ప్రతిపక్షులుగా నుందురని విన్నవింపఁగా, మా మండలారక్షక భటాధికారి కరుణించి మాకు తోడుచూపుటకై పయిస్థలములనుండి మహమ్మదీయులను క్రైస్తవులను తగినంతమందిని తాత్కాలికముగా రాజమహేంద్రవరమునకుఁ బిలిపించెను; ఏదైనఅల్లరి జరిగినపక్షమున

నాయకులను పట్టుకొనెదమని ప్రతిపక్షుల నాయకులకు ప్రకటనపత్రిక లను బంపెను. అందుచేత మా ప్రతిపక్షులు భయపడి శిక్షాస్మృతిని బట్టి నేరములగు దౌర్జన్యములు చేయుటకు సాహసింపలేక యితరవిధ ములచేత మా కార్యభంగముచేయ పాటుపడిరి. అవలకు పనిలేక సోమరులుగా తిరుగు బ్రాహ్మణవేషధారుల కందఱకును మా మూలమున పుష్కలముగా చేతులనిండ కావలసినంత పనిదొరికినది. కొందఱు మేము కుదుర్చుకొన్న వంటబ్రాహ్మణుల యిండ్లకుఁబోయి వాండ్రను బెదరించియు లంచములిచ్చియు రాకుండఁజేయుచు వచ్చిరి; కొందఱు వివాహతంత్రము నడుప నిర్ణయించుకొన్న పురోహితులను పట్టుకొని తిట్టియు భయపెట్టియు మొగము చాటువేయించుచువచ్చిరి; కొందఱు వీధులమూలలను మా యింటియెదుటను గూరుచుండి మా యింటికి వచ్చువారిని మాత్రమేకాక మావీథిని నడచువారిని సహితము పేరులు వ్రాసికొని బహిష్కారపత్రికలు తెప్పించి వెలివేసెదమని బెదరించుచు వచ్చిరి. ఇటువంటి దుష్ప్రయత్నములలో విద్యావిహీనులయి వైదికవృత్తియందున్న పూర్వాచారావలంబకులు మాత్రమేకాక యింగ్లీషునందు పాండిత్యముకలిగి పట్టపరీక్షయందును ప్రథమశాస్త్రపరీక్షయందును కృతార్థులయి మావద్ద విధవావివాహముల కనుకూలముగా మాటాడుచు స్త్రీపునర్వివాహములను తామామోదించినట్లు చేవ్రాళ్ళుచేసిన మహానుభావులుకూడ కొందఱుకూడి తామే ప్రధాననాయకులయి తాము చదువుకొన్న విద్యను పొందిన యున్నతస్థితికినిగూడ నగౌరవము తెచ్చినందున కెంతయు చింతిల్లవలసియున్నది. ఇట్టి మహానుభావులయిన మా పురములోని బ్రాహ్మణ ప్రభువుల యాలోచనచేత కొందఱు వివాహసమయమున కాగడాలువేయు చాకలివాండ్రను వాద్యములు వాయించు మంగలివాండ్రను కూడ రాకుండఁజేయుటకయి బహువిధముల ప్రయాసపడిరి. వీరివారి నన

నేలే! తుదకు పెండ్లిలో మేళమునకు వచ్చిన వేశ్యలనుగూడ వెలిపించి వారియొద్ద నుండి ధనము తీసికొనిరి.

వేశ్యలనఁగానే సంస్కారపరాయణులు చేసెడు వితంతు వివాహములకుఁగూడ భోగముమేళముల నుంచిరాయని సంస్కారప్రియులకు సందేహము కలుగవచ్చును. వితంతువివాహపక్షమువారికి కార్యదర్శినయి వేశ్యలమేళములకు వెళ్ళనని ప్రతిజ్ఞను గైకొన్న నే నీవిషయమునఁ గొంచెము సమాధానము చెప్పవలసియున్నది. వివాహవ్యయముల నిమిత్తమయి రామకృష్ణయ్యగారు పంపిన వేయిరూపాయలు మాచేతిలో నున్నవి. తెలుఁగుదేశములో మొదటిదైన యీ వితంతువివాహమును మహావైభవముతో జరుపవలెనని యీపక్షమువారియభిప్రాయము. భోగముమేళములేక వివాహమునకు శోభ రాదని రామకృష్ణయ్యగారు మొదలయినవా రందఱును తలఁచియుండిరి. నేనును గవర్రాజుగారును మాత్రము భిన్నాభిప్రాయులమై యుంటిమి. అయినను మాపక్షమువారిలోని యెక్కువ సంఖ్యగలవారి యభిప్రాయమును బట్టి భోగముమేళము పెట్టుటకు నిశ్చయింపఁబడి ముందుగా కొంత సొమ్మీయఁబడినది. వివాహము జరుగవలసిన స్థలము మాయిల్లు; నృత్యగానములు సలుపుటకయి వేశ్యాంగనలను మాయింటిలోపలి కడుగిడనియ్యనని నేను పట్టుపట్టితిని. మాయింటిలోపల నాది సర్వాధికారము. అందుచేత మావారూరేగింపు సమయమున భోగముమేళమును పెండ్లిపల్లకి ముందు పెట్టుటకు నిశ్చయించి యట్లు గావించిరి. అప్పుడు సహితము నేను పెద్దమనుష్యులకు ముందు వేశ్యలాడుచోటి కిఁబోక చూడవచ్చిన గుంపులోఁ గలిసి జనులాడుకొను మాటలు వినుచు వేడుక ననుభవించుచుంటిని.

ప్రతిపక్షుల ప్రయత్నములను సరకుగొనక మేమును విచ్చలవిడిగా ధనవ్యయముచేసి వారిక్రియలకు ప్రతిక్రియలు చేయుచుంటిమి.

వాద్యములు వాయించుటకై వచ్చుటకు కొందఱు మంగలివాండ్రు తమ కులమువారికి భయపడుచుండినట్లు కనఁబడఁగా ధనవ్యయమునకు వెనుకతీయక మా పట్టణములోని వాద్యములు వాయించు మంగలి వాండ్ర నెల్ల మేము పెండ్లిలో మేళమునకు కుదిర్చితిమి. వీరినందఱిని వెలివేసి తమయిండ్లకు రాకుండఁజేసిన పక్షమున క్షురకర్మ చేయువారు లేకయు శుభకార్యములయందు వాద్యములు వాయించువారు లేకయు మాకంటె తామే యెక్కువకష్టము పొందవలసివచ్చును గనుక మా ప్రతిపక్షులు బుద్ధిమంతులయి యట్టిప్రయత్నమును మానుకొనిరి. పిచ్చుకపయి బ్రహ్మాస్త్రము తొడిగినట్లు మాయూరి ప్రముఖు లింతమంది యబలలయిన యనాథబాలలమీఁద ధ్వజమెత్తినను, ఈశ్వరుఁడు వారిపట్ల నుండుటచేత ప్రబలులయిన మాయూరి శూరులయభిమత మీడేరినది కాదు. నూటేసి రూపాయ లిప్పించియు, భోజనములుగాక నెలకేడేసిరూపాయల చొప్పున జీతమిచ్చి సంవత్సరమువరకు పనిచేయించుకొనుట కొడంబడికలు వ్రాసియిచ్చియు, వివాహదినములలో దినమునకు నాలుగేసిరూపాయలచొప్పున నియ్య నొప్పుకొనియు, మేము నలుగురు వంటబ్రాహ్మణులను నీళ్ళ బ్రాహ్మణులను సంపాదించుకొనఁ గలిగినారము. ఎంతమంది యాజకులను బెదరుపెట్టి సాగనంపినను, కట్టకడపట ధైర్యముచేసి వారిమాటవినక వచ్చిన పురోహితునిభార్యను గోదావరిలో పడుటకయి పరుగెత్తించి, మరలించినను, నూఱురూపాయలిచ్చి యావివాహములో మంత్రములు చెప్పుటకొక యాజకుని సంపాదింపఁ గలిగినారము. ఈవివాహ మహోత్సవమును జూచుటకయి యారాత్రి మాపట్టణములోని యూరపియనులు సహిత మందఱును దయచేసిరి. అల్లరి జరుగకుండ కాచుటకయి మాయింటిచుట్టును రక్షకభటు లిరువదిమంది నిలిచి జాగరూకులయి కావలి గాచుచుండిరి; మండలరక్షకభటశాఖా

ధ్యక్షుఁడే (District Police Superintendent) స్వయముగా నుండి తగిన యేర్పాటులు చేయుచుండెను; సంయుక్త దండవిధాయకుఁడే (Joint magistrate) స్వయముగా రక్షణక్రమమును విచారించుచుండెను. అందుచేత నాటివివాహము నిరుపద్రవముగా జరిగెను. మా వంటబ్రాహ్మణులలో నొకఁడు మఱునాఁడు పాఱిపోఁగా పోలీసువారతనిని పట్టితెచ్చి పెండ్లి నాలుగుదినములును వంటయు భోజనములును కాఁగానే వారిని తమయధీనములో నుంచుకొని మరల సాయంకాలము వంటవేళకు తీసికొని వచ్చుచు మాకెంతో తోడుపడిరి.

ఇట్లు ప్రథమ వివాహము నిర్విఘ్నముగా నడచుటయు, అనేకులు తాంబూలములకును భోజనములకును దక్షిణలకును వచ్చుటయు, వాయువేగ మనోవేగములతో మామండలమంతయు వ్యాపింపఁగా తమ వితంతుబాలికలకు వివాహము చేయఁదలఁచుకొన్న వారనేకులు మాపట్టణమునకు రాసాగిరి. అందుచేత మొదటివివాహమయిన నాలవ దినముననే రెండవవివాహముకూడ జరిగినది. ఇంకను ననేక వివాహములు జరుగునని యనేకులెదురుచూచుచుండిరి. వివాహమయిన మఱునాటి యుదయమున వార్తాపత్రికలకును మిత్రులకును మేమీ శుభవార్తను దెలుపుచు బహుస్థలములకు తంతివార్తలను బంపితిమి. దంపతుల నాశీర్వదించుచు మమ్మభినందించుచు మఱునాటినుండియు నానాముఖముల తంత్రీవార్తలును లేఖలును రాఁదొడఁగినవి. చెన్నపురి నుండివచ్చిన రెండు లేఖలలోని భాగములను మాత్రమీ సందర్భమున నిందుఁ బొందుపఱుచుచున్నాను:—

“తిరువల్లిక్కేణి—13.వ డిసెంబరు 1881.

*మీతంతిసమాచారము మమ్మందఱిని అత్యంత సంతోషపర

* “Your telegram has made us all exceedingly happy. Ma God bless you and the couple! It has at last pleased Him crown your earnest and ardent exertions with succes

తులరుగాఁ జేసెనది. మిమ్మును దంపతులను ఈశ్వరుఁ డాశీర్వదించును గాక! మీయొక్క యవ్యాజమైనట్టియు నుత్సాహవంతమయినట్టియు ప్రయత్నములను సఫలముచేయుట కిప్పటికాయనకు దయవచ్చినది. రాజమహేంద్రవర మిప్పటినుండి జీవవంతమయిన దయినట్టు చెప్పఁ బడవచ్చును. మనరాజధానియొక్క చరిత్రములో డిసెంబరు 11-వ తేదిని మిక్కిలి ప్రసిద్ధిదినమునుగా మీరు చేసియున్నారు. మీ రనివార్యముగా పొందిన వారయి యుండవలసిన సంతోషమును శ్రమను మీతోడఁగూడ పంచుకొనుట కక్కడనుండనందుకు నేను మిక్కిలి చింతనొందుచున్నాను...........

శీఘ్రముగా మనము మఱికొన్ని వివాహములను జరుపుదుమా! ఈ వేఁడిలో మఱికొన్ని వివాహములు చేయఁబడిననేతప్ప, ఒకవివాహమువలన నెక్కువ మేలుకలుగఁబోదు. మీరీవిజయము ననుసరించి నాలుగైదు వివాహములను శీఘ్రముగాచేసినయెడలఁ గొందఱు నన్ను నమ్మింపఁజూచునట్లు చెన్నపురి రాజమహేంద్రవరముయొక్క మొలఁకువ ననుసరించును. ఈవారములో మఱి నాలుగు వివాహములు జరగనున్నట్టు అవధాని (వావిలాల వేంకట శివావధానిగారు) తన సోద

Rajahmundry may henceforth be said to *live*. You have made the 11th of December a very remarkable day in the history of our Presidency. I feel very sorry for not being on the spot to share with you the joy as well as the trouble you must necessarily have undergone.

* * *

Are we to have any more marriages soon ? Unless some more are done in the heat there will not be much good forthcoming from one marriage. If you follow up this success and perform four of five more soon. Madras, as some wish me to believe, will follow in the wake of Rajahmundry. I have heard that Avadhani has heard from his brother to say that there are to come off four more marriages this week. I offer my heartfelt prayers to God to make you to telegraph to me this news soon"

టునివలన విన్నట్టు నేను వినియున్నాను. ఈవర్తమానమును నాకు శీఘ్రముగా మీరు తంత్రీముఖమున తెలుపునట్లు చేయుటకయి దేవునకు నేను హృదయపూర్వకములైన ప్రార్థనలనుసమర్పించుచున్నాను-

'పెద్దిభట్ల వెంకటప్పయ్య'

'చెన్నపట్టణము—12-వ డిసెంబరు 1881.

కొన్ని నిమిషములక్రిందట నాకుఁ జేరిన మీతంత్రీవార్తను చదివి నేను మిక్కిలి సంతోషించితిని. క్రొత్తవివాహదంపతులకు నా మనఃపూర్వకములైన యాశీర్వచనములను, మీవిరామములేని ప్రయత్నములవలనఁ గలిగిన జయమునకయి మీకు నాయభినందనములను బంపుచున్నాను. మీతంతిసమాచారమును డేవిడ్సన్ దొరగారికిని మేష్టరు దొరగారికిని చూపఁగా వారీ విశేషమును విని యెంతో సంతోషించిరి. ఒకటితరువాత నొకటి వేవేగముగా అధమపక్షము నూఱు వివాహములైనను జరగవలెనని నేను కోరుచున్నాను. ఈ యుద్రేకము చల్లాఱనియ్యకూడదు. ఇనుము వేఁడిగా నుండఁగానే సాగఁగొట్టి వేగముగా ననేకవివాహములను చేయింపుఁడు. మీతంత్రివార్త నిచ్చటి స్వదేశపుపెద్దమనుష్యులలో త్రిప్పుచున్నాను. వివాహములకు విరోధమైన సమాజమొకటి యిచ్చట నిప్పుడే కాలూనుచున్నది. అది మీ కేమియు హానిచేయఁజాలదు-*వల్లూరి జగన్నాధరావు.

* "I was quite rejoiced to read your telegram which reached me a few minutes ago. I send my sincere blessings to the newly married couple and congratulations to you for the success your indefatigable exertions have brought about. I have shown the telegram to Messrs. Davidson and Master who are much pleased to hear the news. I only hope that at least half a dozan more marriges will take place in rapid succession. The excitement must not be allowed to cool down. Strike while the iron is hot and have a lot of marriages performed soon. I am circulating your telegram among the Native gentry here. An Anti-marriage association is just now on foot here. It can do you no harm."

వీనిలో మొదటియుత్తరము వ్రాసిన వేంకటప్పయ్యగారు వితంతు వివాహప్రయత్నములో మా కత్యంతసహాయుఁడయి, వివేకవర్ధనిలోని యింగ్లీషుభాగమును వ్రాయుటలో గవర్రాజుగారివలెనే నాకుఁ దోడుపడుచు, ప్రస్తుతము పట్టపరీక్షార్థము చెన్నపురికిఁ బోయి యుండి, యెప్పుడువచ్చి మాతో చేరుదునాయని తహతహ పడుచుండినవాఁడు. ఆయన యనుకొన్నట్లు బహువివాహము లొకటి తరువాత నొకటిగా నగునని ప్రతీక్షించితిమిగాని మాప్రతిపక్షుల యుపద్రవమునకంతరంగములు సంచలింప ననేకులు ముందుకురాలేక వెనుకంజె వేయఁజూచుచుండిరి. రెండవవారయిన బ్రహ్మశ్రీ దివాన్ బహద్దూర్ వల్లూరి జగన్నాథరావు పంతులుగారు వ్రాసినట్టు చెన్నపురిలోవలె మాపట్టణములో వితంతువివాహ నిషేధక సమాజము క్రొత్తగా నేర్పడక పోయినను మునుపున్న సమాజమే ప్రతిపక్షులమయిన మా విజయమువలన కోపఘూర్ణితమయి యపజయావమానలజ్జాప్రేరితమయి యుద్రేకించి ద్విగుణోత్సాహముతో సంస్కారపక్ష నిర్మూలన దీక్ష వహించి పాటుపడఁ జొచ్చెను.

మొదటి వివాహమయిన నాలవదినమున పండ్రెండేండ్లప్రాయముగల యొక బాలవితంతువును వెంటఁబెట్టుకొనివచ్చి యాసుతల్లి తనభర్త యాచిన్నదానిని వివాహము నిమిత్తము మాయొద్దకుఁ బంపెనని చెప్పెను. మేమామెమాటలు నమ్మి భోజనముచేసి సకలకలాశాలా ప్రవేశపరీక్షనిమిత్తమయి పరీక్షాస్థలమునకు పోఁబోవుచున్న యొకవిద్యార్థిని తత్క్షణమే రప్పించి వధువును జూపి యాతఁ డొప్పుకొన్నమీఁదట వివాహము సిద్ధముచేసితిమి. పెండ్లికొమారుఁడు మంగళస్నానమునకుఁ గూరుచుండు వఱకును మాపురజను లీ వివాహము జరుగునన్న సంగతియే యెవ్వరు నెఱుఁగరు. ప్రతిపక్షులవారు అతఁడు మంగళస్నానమునకుఁ గూరుచుండఁగా చూచి పరుగెత్తుకొనిపోయి

పిడుగువంటి యీవార్త వరునితండ్రితోఁ జెప్పిరి. అతఁడును రోదనము చేయుచుఁ బెద్దపెట్టునఁ గేకలువేయుచు వివాహసమయమున వధూవరులు పెండ్లిపీటమీఁద కూరుచుండియున్నప్పుడు పరుగెత్తుకొనివచ్చి పెండ్లికుమారుని లేవఁదీసి లాగుకొనిపోవుటకయి ప్రయత్నించెను గాని, మాలోనివారు కొందఱాయనను కౌఁగిటఁ బట్టుకొని యొకగది లోనికి తీసికొనిపోయి కూరుచుండఁబెట్టి శరమానము ముగియువఱ కును మంచిమాటలుచెప్పి యోదార్చుచు సమాధానపఱిచి తరువాత మెల్లఁగా నావలకుఁ బంపివేసిరి. ఆనాఁటిరాత్రి యీయుద్వాహ పెండ్లి దంపతులను మహావైభవముతోఁ బెద్దపల్లకిలో నూరేఁగించితిమి. ఆరాత్రి జరిగిన యూరేఁగింపు మహోత్సవవైభవము సంస్కారపక్షపు వివాహములయందుకూడ జరిగియుండెను. ఆఱువదిమంది పోలీసుభటులతో పోలీసు సూపరింటెండెంటు పల్లకులను జనసమ్మర్దమునుండి సంరక్షించుచు పురవీధులలో వెంటనడిచెను. హిందువులలోని గణ్యమనుష్యులు మాత్రమేకాక మండలన్యాయాధిపతి (District Judge) సయుక్తదండవిధాయకుఁడు (Joint magistrate) శాస్త్రపాఠశాలా ప్రధానోపాధ్యాయుఁడు (College principal) మొదలయిన యూరపియనులు సహితము మహోత్సాహముతో పల్లకులవెంట నడచిరి. వేలకొలఁదిజనులు లావేసుకొని చూడవచ్చుటచేత వీధు లొకకొననుండి రెండవకొనవఱకును మనుష్యులతో నిండిపోయి యొకవీధివారి కొకవీధికి నడుచుట దుర్లభమాయెను. నేను పల్లకివెంట నడవక వచ్చిన మూకలోఁ జేరి వారేమి చెప్పుకొందురో వినుచుంటిని. చిరకాల దురాచారవాసనచేతను ద్వేషైకప్రధానులైన ఛాందస శిరోమణులవలన భీతిచేతను పల్లకులు వీధులవెంటఁ బోవునప్పుడు కొందఱు తలుపులు మూసికొన్నను, ఆ వధూవరులను జూచిన సామాన్యజనులందఱును సంతోషించి యెక్కడఁజూచినను ఆకార్యములను శ్లాఘించుచునే వచ్చిరి.

రెండవ పెండ్లికొమార్తెను తండ్రి యనుమతిలేకయే తల్లి తీసికొని వచ్చెనని మా ప్రతిపక్షులు లోలోపలనే తెలిసికొని, ఆతనిచేత మామీఁద దండవిధాయకమైన నేరము మోపించి మమ్ము శిక్షింపఁజేయవలెనని ప్రయత్నము చేసిరి. కాని వారి దుష్ప్రయత్నములను మేము యుక్తసమయమునందే తెలిసికొని కష్టముమీఁద తల్లివలన కన్యనుగ్రహించి [illegible] యుంచగా మేమే పెండ్లికొమార్తెతల్లిని పిలిపించి [illegible] చేయించుకొని సభల [illegible] వివాహమును [illegible] మూర్ఖజనులవలన [illegible] సాగెను. ఈవివాహములను చేయించినవారిని చేసికొన్నవారిని వారితోఁ గలిసి భోజనములు చేసినవారినిమాత్రమే కాక వేడుక చూడఁబోయినవారిని సహితము పలువిధముల బాధపెట్ట నారంభించిరి; ఈ శుభకార్యములయందు కొంచెము సంబంధమున్న వారినందఱిని వారు కాపురమున్న యద్దెయిండ్లలోనుండి లేవఁగొట్టిరి; కాపురముండుటకు వారికి యిండ్లనియ్యకుండిరి; నూతిలలో నీళ్ళు తోడుకోనియ్యకపోయిరి; నీళ్ళు తెచ్చు బ్రాహ్మణులను తేకుండఁజేసిరి; శుభాశుభ కార్యములకు పురోహితులను బ్రాహ్మణులను రాకుండఁజేసిరి; దేవాలయములకు పోనియ్యకపోయిరి; బంధువులు మొదలైనవారిని వారియిండ్లకు పోకుండఁజేసిరి; కనఁబడినచోట్ల మొగములుముండ అనే తిట్టసాగిరి; మఱియు నింక నెన్నివిధముల దుండగములు చేయఁగలుగుదురో యెన్నివిధముల నాయాస పెట్టఁగలుగుదురో యన్నివిధములను వారు క్రమముగాఁ జేయసాగిరి. అంతేకాక తాము బాధించి యెదురు తమ్మే బాధించుచున్నారని యల్లరిచేసి దొంగయభియోగములు చేయసాగిరి. అల్లరిమూకమాట యటుండగా మండలన్యాయసభలో న్యాయవాదిగానున్న యొక బ్రాహ్మణోత్తముఁడే యొకదినమున బొట్టుగోఁకి వేసికొని భోజనము చేయునట్లు నటించుచు

తనవెంట కొంతబ్రాహ్మణుల మూకను జేర్చుకొనియొక విజ్ఞాపనపత్రి కతో దండవిధాయకునియొద్దకుఁబోయి వితంతువివాహ విధాయక పక్షమువారి నాయకులు దేవాలయములు దూరి తమ కనేకవిధముల తొందరలు కలుగఁజేయుచున్నారని మొఱ్ఱపెట్టుకొను నంతటి నైచ్యమునకు లోఁబడెను. ఈపక్షములో చేరినవారు రాజకీయోద్యోగములలో నున్నయెడల వారిమీఁద లేనిపోని నేరముల నారోపించి వారిని పనినుండి తొలఁగింపవలయుననియు మఱియొకచోటికి మార్పవలయుననియు పయియధికారుల కాకాశ రామన్న విన్నపములను పంప మొదలుపెట్టిరి. పాఠశాలలో నుపాధ్యాయులుగా నున్నయెడల వారినాకొలువునుండి తొలఁగింపవలయునని విశ్వప్రయత్నములు చేసిరి.

ఈ ప్రకారముగా పూర్వాచార పరాయణులలోని ధూర్తులు చేయు దుండగములకును పెట్టు బాధలకును తాళఁజాలక పిఱికిగుండె కలవా రనేకులు ప్రాయశ్చిత్తములు చేసికొని ప్రతిపక్షులలోఁ జేరిరి. కొంతధైర్యముకలిగి నిలచినవారిలో స్వగృహములు గలవారికిని పరగృహములనుండి వెడలఁగొట్టఁబడని బలవంతులకునుగాక మిగిలినవారికి నేను మా గృహమునిచ్చితిని. కొటికలపూడి రామేశ్వరరావుగారికి గవర్రాజుగారు తమ గృహమునిచ్చిరి. వివాహములయిన పెండ్లికొమారితలును పెండ్లికొమాళ్ళును రెండవ పెండ్లికొమారితయొక్క తల్లిదండ్రులును తమ్మునిద్దఱును పినతల్లియు మాతామహుఁడును వంటబ్రాహ్మణులు నలుగురును వివాహములలో భోజనములకు వచ్చి మాలోఁ జేరి ప్రాయశ్చిత్తములు చేసికొనక నిలచిన ముంజులూరి వెంకటాద్రయ్యగారును భార్యయు కుమారుఁడును తమ్ముఁడయిన గోపాలముగారును వల్లకొండ కోదండరామయ్యగారును మాయింటనే యుండవలసినవారయిరి. ఈవివాహములలో నితరుల మాట యటుండఁగా నాపితామహిసహితము నన్ను విడిచి మా

యింటినుండి వీధి పొరుగింటికిఁ గాపురమునకు వెళ్ళెను. నేనామెకుఁ గావల
సిన సమస్తమును సమకూర్చుచుంటిని. ఆరంభదశలో విధవావివాహ
ములకు బద్ధశత్రువుగా నుండిన వృద్ధురాలయిన యామె కొన్నిదినము
లలో కొంతమాఱి నామీఁది స్వాభావికప్రేమచేత నేనుజేసినపని
మంచిదేయని నన్ను దూషించెడివారితో వాదింపమొదలు పెట్టెను;
తరువాత నొకగది ప్రత్యేకముగా నిచ్చినపక్షమున వేఱుగ వంట
చేసికొని భుజించెదనని వచ్చి మాయింటనే ప్రవేశించెను; కడపట
నాతోఁ గలిసి మాతోనే భోజనముచేయుచు 1884 వ సంవత్సరమున
మృతినొందువరకును వివాహము చేసికొన్న దంపతుల నత్యంతప్రేమతో
నాదరించుచు వచ్చెను. వివాహములయిన కొన్నిదినములలోనే
ముప్పదిమందికి శ్రీశంకరాచార్యస్వాములవారియొద్దనుండి బహిష్కార
పత్రికలుకూడ వచ్చినవి. మాయూరిసభాపతులు మొదలైనవా
రాపత్రికలనుజూచి పరమానందభరితులయి వానిని ప్రకటించుటకు
శ్రీవిజయనగరము మహారాజుగారి బాలికాపాఠశాలలో సభచేసిరి.
ఆసభలో నావఱ కిచ్చకములాడుచు చిత్తముచిత్తమని యనుగ్రహ
మును వేచి తిరుగుచుండిన యనామధేయులుకూడ పెద్దలయి తమకంటె
నెక్కువవారి పేరులను గౌరవసూచకమైన "గారు" నుమాటయైన
చేర్పకుండ నుచ్చరించి వారిని వెలివేసితిమనియు శుభాశుభకార్యముల
యందు వారియిండ్ల కెవ్వరును పోఁగూడదనియు వారి నెవ్వరియిండ్ల
కును బిలువఁగూడదనియు వారిని దేవాలయములకు పోనియ్యఁగూడ
దనియు మహాజనమధ్యమున కేకలువేయుచు బల్లలమీఁద నెక్కి
గంతులువేసి యఱచిరి. ఈ కోలాహలమునకు జడిసి యీవరకు వృథ
చిత్తులుకాక యిటునటు నూఁగులాడుచున్నవా రనేకులు ప్రాయశ్చిత్త
ములు చేయించుకొనిరి.

ఈబాధ లిక్కడ నిట్లుండఁగా నాకు బహుస్థలములనుండి

ప్రోత్సాహకరములైన యుత్తరములను నభినందనపత్రికలను రాఁ దొడఁగినవి. చెన్నపట్టణమునుండి యనేకమిత్రులు వెంటనే చెన్నపట్టణము రావలసినదనియు వచ్చి యచ్చట నీవేఁడి చల్లారకమునుపే కొన్ని యుపన్యాసములు చేసినపక్షమున తప్పక కొన్నివివాహములగుననియు నన్నాహ్వానముచేసిరి. వారికోరిక చెల్లించుట కర్తవ్యమనియు తన్మూలమున వితంతువివాహపక్షము బలపడుననియు నాకుఁ దోఁచినందున, ఇక్కడ నెవ్వరికి నేవిధమైన యిబ్బందులు గలుగకుండ తగినయేర్పాటులుచేసి, యొకవంటబ్రాహ్మణుని వెంటఁగొని చెన్నపట్టణమునకుఁ బోయి యక్కడ కొంతపనిచేసి శీతకాలపుసెలవుల కడపట జనేవరు 16-వ తేదిని పాఠశాల తెఱచులోపల మరల రాజమహేంద్రవరమునకు రా నిశ్చయించుకొంటిని. అప్పుడు నల్లగొండ కోదండరామయ్యగారు తానావరకు చెన్నపట్టణము చూచియుండకపోవుటచేత చూడవలెనన్న యభిలాష తనకు విశేషముగాఁ గలదనియు, వంటబ్రాహ్మణునకు బదులుగా తన్ను తీసికొనిపోయెడు పక్షమున తానే నాకు వంటచేసిపెట్టెదననియు, నన్నడుగఁగా నేనది యనుగ్రహముగా నెంచుకొని యాయనకోరిక నంగీకరించితిని. అప్పుడు చెన్నపురికిఁబోవ నావిరిబండ్లును ఇనుపదారులును లేవు. పడవమీఁద కాలువపయి నొక్కదినము ప్రయాణముచేసి కాకినాడచేరి, అక్కడనుండి వారమున కొక్కసారిపోయెడు పొగయోడలమీఁద సముద్రముపైని రెండుదినములు ప్రయాణముచేసి చెన్నపురి చేరవలెను. కోదండరామయ్యగారిని వెంటఁబెట్టుకొని బయలుదేఱి డిసెంబరు నెల 29 వ తేదీని కాకినాడలోఁ బ్రవేశించితిని. పొగయోడ బయలుదేఱెడు 30 వ తేదీని గాలివాన యారంభమయ్యెను. అటువంటి సమయమున సముద్రముమీఁద పోవలదని పైడా రామకృష్ణయ్యగారు మొదలైనవారు నన్ను బహువిధముల ప్రార్థించిరి. ఒక్కసారి నిశ్చయముచేసి

కొన్నతరువాత పట్టినపట్టును విడిచెడుస్వభావము కలవాఁడను కాక పోవుటచేత నామిత్రుల హితవాక్యములు వినక మూర్ఖ్యముతో నాటి మధ్యాహ్న మాగాలివానలోనే పడవయెక్కి నాసహచరునితోడఁ గూడ పొగయోడయొద్దకుఁ బోవ బయలుదేఱితిని. అప్పుడు ఝంఝూమారుతము ప్రచండముగా వీచుచు సంతతధారగా వర్షము కురియుచు సముద్రతరంగములు పర్వతోపమానములుగా నుండెను. అట్టి భయంకరస్థితిలోనే సముద్రమునం దైదుమైళ్ళు ప్రయాణము చేసి యెంతో కష్టముమీఁద పొగయోడ సమీపమునకుఁ బోఁగలిగినను, పడవ యోడను తారసించుట యపాయకరమని యెంచి ఘూమనౌకాధికారి మమ్మెక్కించుకోక నిరాకరించినందున మేముభయులమును ఆశాభంగమునొందినవారమయితడిసిముద్దయయి రాత్రి యెనిమిది తొమ్మిది గంటలకు తీరము చేరవలసినవారమయితిమి. ఈసమయమున జనేవరు నెల 8 వ తేదిని పెద్దిభట్ల వేంకటప్పయ్యగారు చెన్నపట్టణమునుండి వ్రాసిన యీక్రిందియుత్తర మీవిషయమును గొంత సూచించును.

"వై. ఎల్. నరసింహముగారి యుత్తరమునుబట్టి 30-వ డిసెంబరు స్టీమరుమీఁద మీరిక్కడకు వత్తురని మే మెదురుచూచితిమి. సముద్రము తరంగాకులముగా నుండుటచేత మీరు మరల రాజమహేంద్రవరమునకుఁ బోయినట్టు జయంతి రామయ్యగారి కిప్పుడే యుత్తరము వచ్చినది.

పూర్వాచారపరాయణ సంఘముయొక్క సభలనుగూర్చియు వారి చర్యలనుగూర్చియు ఆచార్యుని (శంకరాచార్యుని) యొద్దనుండి శాస్త్రప్రమాణావలంబక సంఘముయొక్క ప్రతినిధియైన పుణ్యాత్ముఁడగు నాగవరపు రామమూర్తిచేత తీసికొనిరాఁబడిన తరువాతి బహిష్కారపత్రికలను గూర్చియు సంపూర్ణసమాచారము నాకు వచ్చి

యున్నది. వివాహసమయమున నూరకవచ్చినవారినిసహితము చేర్చుకొని సుమారు 31 కుటుంబములు బహిష్కరింపఁబడినవని తెలిసికొనుటకు నాకానందము కలుగుచున్నది............పరీక్ష యయిన తరువాత నేను తక్షణమే బైలుదేరెదను."*

చిత్రపు కామరాజుగారి వ్యవహారములో వేశ్యాంగనాసంభోగ సౌఖ్యమున కాశపడి కాగితపుముక్కల నిచ్చివేసిన న్యాయవాది యని దురాహారింపఁబడిన నాగవరపు రామమూర్తి యను మహా పురుషుఁడే.

ఆపదలు వచ్చినప్పుడు మేము ధైర్యముతో నిలుతుమో పిఱికి పందలమై ధర్మపక్షమును విడిచి తొలఁగుదుమో శోధించుటకయి యీశ్వరుఁడు పంపిన శోధనలో యనునట్లుగా మమ్మన్నిపక్కలను కష్టములే యెదుర్కొన నారంభించెను. స్వాములవారు పంపిన బహిష్కారపత్రికలు పిడుగులవలె బెదరింపఁగా నావఱకు ముందంజె వేయు వారిందఱును వెనుకంజె వేసి మాధైర్యవచనములను చెవిని బెట్టక మాకు విముఖులయి పూర్వాచార పరాయణుల మఱుఁగునకుఁ బలాయితులు కాఁజొచ్చిరి. భయకంపితులయియున్న యిట్టివారి భయ ముడిపి వారికి మరల ధైర్యముపుట్టించి వారిని సుముఖులనుజేసి మరల

---

* "According to a letter from Mr. Y. L. Narasimham we expected youwould come down here by the thirtieth December steamer. Mr. Jayanti Ramayya has just received a letter to say that you went back to Rajahmundry finding the sea rough.

I have received full information about the meetings of the orthodox community and their proceedings as also about the subsequent writ of excommunication brought from the Achari by the pious Nagavarapu Ramamurti, delegate of the orthodox community! I am delighted to learn that about 31 families are excommunicated including even those that attended the marriage simply..................I shall start immediately after examination."

మనవంక కాకర్షించుటకుఁ దగినప్రతిక్రియను కార్యమునించకముందే యాలోచించి ప్రయోగించుట కర్తవ్యమని నాలోనివారు నిశ్చయించి, శంకరాచార్యస్వాములవారిమీఁద మాననష్టమునకయి యభియోగము తెచ్చుటయే దానికిఁ దగినమందని నన్నాపనికిఁ బురికొల్పిరి. మనుష్యమాత్రు లెవ్వ రెంతమంది శత్రువులయి యెన్ని విఘాతములుచేయఁబాటుపడినను మనముపూనినకార్యము మంచిదియు నీశ్వరప్రీతికరమైనదియు నయినపక్షమునధర్మబలముచేతను దైవబలము చేతను కడపట కార్యసాఫల్యము కాకమానదనియు, విరోధులయుపకృతికిఁ బ్రత్యుపకృతి యక్కర లేకయే విజయము నొందవచ్చుననియు,నమ్మినవాఁడగుటచేత స్వాములవారిపై నభియోగము తెచ్చుటకు నేనొప్పుకొనలేదు. ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు స్వాములవారిపై నభియోగము తెచ్చిరికాని యది కొట్టుబడిపోయినది. ఇది యిట్లుండఁగా విశాఖపట్టణములోఁ బ్రథమ వివాహముచేసికొన్న గోగులపాటి శ్రీరాములుగారి నీవిషయమున దూషించినారని కొందఱిప్రముఖులమీఁద దర్భా వేంకటశాస్త్రిగారు మొదలైనవారాయనచేత మాననష్టమున కభియోగము తెప్పించి యోడిపోయినందున గొప్పవారితో వైరము సంపాదించుకొనుటతప్ప వేఱు ప్రయోజనము కలుగకపోయెను. సభల కెక్కక యుపేక్షచేసి యూరకుండుటకు మాఱుగా సభలకెక్కి యోడిపోవుట మాపక్షమున కధికానర్థదాయక మయినందున క్రొత్తగా వచ్చిన యనర్థమువలన దుష్ఫలములను తొలఁగించు విషయమున నేనును పనిచేసి యుపర్యభియోగాదుల విషయమయి పాటుపడవలసినవాఁడనైతిని. స్వాములవారిపై తేఁబడిన యభియోగము కొట్టువడిపోవుటచేత మాప్రతిపక్షులు విజయగర్వితులయి మాపక్షమువారిని మఱింతలోకువచేసి గేలిచేయసాగిరి. ఏవంకఁజూచినను కష్టమేఘములును విద్వేషాకాలవాయువులును చుట్టుకొని యంధకారబంధురము

అయి యీదినములు స్త్రీపునర్వివాహ విధాయకపక్షమువారికి దుర్దిన
ములుగా నుండెను. అవఱకు వితంతువివాహములు చేసెదమని ముం
దుకువచ్చినవా రిప్పుడా పేరైన తలపెట్టక పిలిచినను పలుకక పలా
యితులైరి. అభియోగము కొట్టుపడినతరువాత అత్మూరి లక్ష్మీనర
సింహముగారు వైష్ణవమతప్రవిష్టులయి ప్రాయశ్చిత్తము చేసికొనగా,
వారు వితంతువివాహపక్షమున పనిచేసినందుకే ప్రాయశ్చిత్తము చేసి
కొనిరని ప్రతిపక్షులును పామరులును పలుకఁజొచ్చిరి. వైష్ణవమత
ప్రవేశమున కావశ్యకమయినందుననే ప్రాయశ్చిత్తమును జేసికొంటిమి
కాని యది యిందుతో నెంతమాత్రమును సంబంధించినది కాదనియు,
తాము వెనుకటివలెనే వితంతువివాహముల విషయమున శ్రద్ధవహిం
చెదమనియు, వారు వివేకవర్ధనికి లేఖ వ్రాసిరి కాని తరువాత వివాహ
ములు జరుగునప్పుడు మాత్రమెప్పుడును రాలేదు. అయినను వివాహ
ములతో సంబంధించిన సమస్తవిషయములయందును యథాపూర్వ
ముగా శ్రద్ధవహించుచునే యుండిరి. వితంతువివాహముల కవలంబ
స్తంభమని చెప్పఁదగిన పైడా రామకృష్ణయ్యగారే వితంతువివాహ
పక్షమును విడిచిపెట్టి ప్రాయశ్చిత్తము చేయించుకొనఁబోవుచున్నారని
యొక ప్రబలప్రవాదమెల్లయెడలను వ్యాపించెను. అట్టి వైపరీత్యము
కలుగకుండుటకయి నేను సర్వవిధములఁ బ్రయత్నము చేసితిని. ఈ
విషయమునుగూర్చి మాకత్యంతసహాయులయి కాకినాడ యనుగత
న్యాయాధిపతి (Sub Judge)గా నుండిన కృష్ణస్వామిరావు పంతులు
గారి పేర వ్రాయఁగా వారిట్లు ప్రత్యుత్తరమిచ్చిరి—

"కాకినాడ—21-3-82.

మీయుత్తరము నాకంది నేను దానిని పై- రా- కృగారికిఁజూపి
తిని. అందున మీరు రు. 100 లు పంపినట్లును ఇంకను కొంత సొకటి

రెండు దినములలో సంప్రశ్నను చెప్పిరి. శ్రీరాములవిషయమై తగిన శ్రద్ధ పుచ్చుకొనఁ బడును.

పైడా రామకృష్ణయ్యగారు ఆచార్యునియొక్క యధికారమునకు లోఁబడుటకయి తనమనస్సును దృఢముచేసికొన్నాఁడు. విధింపఁబడునట్టియు, నంగీకరింపఁబడినట్టియు షరతులు మీరు పైని వేసికొన్న యుత్తమకార్యమున కత్యంత హానికరములైనవిగా నున్నవి. వితంతువివాహవిధిగూర్చి జనులకు విన్నపము పంపుటకయి మీకాలోచన చెప్పుచున్నాను. ఆవిన్నప మన్నిపత్రికలయందును ప్రకటింపఁబడవలెను. మీచేవ్రాలు చేయఁబడిన విన్నపముయొక్క ప్రతినొకదానిని మీరు నాకు పంపినయెడల నేను దానిని హిందూపత్రికకుఁ బంపి దానిని తనవ్రాతతో బలపఱుచుచు ప్రకటింపుమని పత్రికాధిపతిని గోరెదను, సామ్ము పోగుచేయుటకయి ప్రయత్నము చేయవలసినదనియు, పైడా రామకృష్ణయ్యగా రింతవఱకును జేసినట్టుగా ముందంత సాహాయ్యమును చేయఁజాలరు గనుక లేకపోయిన యెడల కార్యమునకు భంగము కలుగునవియు, నేను చెంచలరావుగారికి వ్రాసియున్నాను. ఆయన కొంతపని చేయునని నమ్ముచున్నాము. చెంచలరావుగారి ప్రకటనకు బహులుగావచ్చిన యుత్తరములనుబట్టి చూడఁగా దేశమింకను ఈ సంస్కారమునకు సంసిద్ధముకానట్టు కనఁబడుచున్నది. రాజమహేంద్రవరమునుండి వచ్చిన యొక పెద్దమనుష్యుఁడు మీయారోగ్యము సరిగాలేదని నాతోఁ జెప్పినాఁడు. దీని ప్రధానకారణము మీ యతిమనస్తాప మని నే ననుకొనుచున్నాను. మీదేహస్థితి చెడునట్లుగా మీమేదస్సున కతివిస్తారముగా పనిపెట్టఁగూడదు. మీదిమిక్కిలి విలువగల యాత్మ. ఈసంస్కారము పూర్ణముగా మీయొక్కరి కృషిమీఁదనే నిలిచియున్నది. సర్వకర్తుఁడు మీజీవితమును దీర్ఘముగాఁ జేసి, మీకు మీరేర్పఱుచుకొన్న యుత్తమకార్యములో జయమును ప్రసాదించి, అన్నికష్టములను శోధనలను

ప్రతిఘటించుటకు మిమ్ము శక్తులనుగాఁ జేయునుగాక యని మీ క్షేమమును గోరెడు మిత్రుఁడైన కే. కృష్ణస్వామిరావుయొక్క ప్రోత్సాహ ప్రార్థన యయియున్నది ' *

పయియుత్తరములో విధింపఁబడి యంగీకరింపఁబడినట్లు చెప్పఁబడిన షరతులలో ప్రధానమైనది రామకృష్ణయ్యగారికముందు వితంతు వివాహముల నిమిత్తము ధనసహాయము చేయుకుండుట. శ్రీరాములనుగూర్చి చెప్పఁబడినయంశము ముందు వివరింపఁబడును.

---

* ',Cccanda, 21 -3—82 My dear sir,

I received your letter and showed it to Mr. P. R. K. He told me that he had remitted to you Rs. 100 and that he would remit some money in a day or two. Streearmulu will be taken proper care of.

Mr. P. R. K. has made up his mind to submit to the authority of the Pontiff. The conditions imposed and accepted, are very injurious to the noble cause you have undertaken. I would advise you to appeal to the public for a widow marriage fund Let the appeal be published in all the papers. If you send a copy of the appeal signed by you, to me, I will send it to the Hindu and ask the edito to support it by an editorial. I have written to Mr. Chencha Rao that steps should be taken to raise funds, otherwise the cause will suffer for want of money as Mr. P. R. K. could not hereafter render the same amount of assistance as he did up to this time I hope he will do something. From the manner in which Chenchal Rao's circular was replied and other circumstances, I see that the country is not ye prepared to accept the reform. A gentleman from Rajahmundry told me that your health was indifferent. I believ the sole cause of it is you over anxiety. You must not ove work your brains to the injury of your constitution. Your is a most valuable soul. The reformation solely rests o your individual exertions. May the Almighty prolong you life, bless you with success in the noble task you have se to yourself and enable you to withstand all difficulties an trials, is the fervent prayer of your well wisher and frien K. Krishnaswami Rao."

ఇటువంటి కష్టకాలములయందు సహితము మమ్ము చేయివిడువక రహస్యముగా మాకు బహువిధముల తోడుపడినవారుసహితము కొందఱుండిరి. అట్టివారిలో ప్రథమగణ్యులయి న్యాపతి సుబ్బారావుపంతులుగారు మా కారంభదశనుండియు నాలోచనచెప్పుచు సర్వవిధముల సాయము చేయుచుండిరి. అట్టి సుబ్బారావు పంతులుగారు రామకృష్ణయ్యగారిని ప్రాయశ్చిత్తకర్మమునుండి మరలించు సందేశమును వహించి మాపక్షమున కాకినాడకుఁబోయి వారితో మాటాడి మాకిట్లు వ్రాసిరి—

"రామకృష్ణయ్యగారీ రాత్రి బైలుదేఱుచున్నారు. రేపు పెద్దాపురములో నిలిచి మఱునాఁడు రాజమహేంద్రవరములో నుండెదనని యాతను చెప్పుచున్నాఁడు. ప్రాయశ్చిత్తము చేయించుకొనుటకుముందు మిమ్మిద్దఱిని చూడవలెనని నేనాతనియొద్దనుండి యొక్క వాగ్దానమును గైకొన్నాను. ఆయనను నిరుత్సాహపఱుచుటకు నా యావచ్ఛక్తిని ప్రయత్నించినాను. (ఇక్కడ కొంతభాగము శిథిలమయినది.) ...మనశ్శాంతి లేకున్నాఁడు. ఆయన ప్రాయశ్చిత్తము చేసికొనవలెను; చేసికొనుట కిష్టములేదు. ఈకార్యమునుండి దేవుఁడాతనిని రక్షించునుగాక! ఈశ్వరుని మార్గములు దుర్గ్రాహ్యములు. ఇవి వితంతువివాహపక్షమువారికి శోధనదినములు. ఈపక్షముయొక్క దృఢసహాయులు విడిపోవుచుండఁగా నేను చూచునప్పుడు, మిమ్ముల నుండి నన్ను వేఱుగానుంచుచున్న యీ సన్నదారమును త్రెంపివేసి మీపక్షమునఁ జేరుటకు దేవుఁడు నన్ను మఱిమఱి పురికొల్పుచున్నాఁడు......" *

---

* "Mr. Ramakrishniah is starting to night. He says he will stay at Peddapur tomorrow and be at Rajahmundry the day after tomorrow. I have taken one promise from his that he should see you both before he takes penance. I have tried all my best to disuade him............is so uneasy. He wants to do it and at the same time does not want to do it.

పంతులుగారు వ్రాసినట్టుగా రామకృష్ణయ్యగారు ప్రాయశ్చిత్తము చేయించుకొనుటకయి రాజమహేంద్రవరమువచ్చి నన్ను చూచిరి. ప్రాయశ్చిత్తము చేసికొనకుండ మరలించుటకయి యాయనకు నేను చెప్పవలసినంత చెప్పితిని. ఆయన యేమిచేయుటకును తోఁచనివాఁడై చిత్తము డోలాందోళనమునొంద, ఇఁకముందు వివాహములు జరగవనియు జరగెడుపక్షమున తాను వాగ్దానముచేసినట్టు సాహాయ్యము చేసెదననియు నాతోఁ చెప్పెను. వివాహములు తప్పక జరగుననియు, అధమ మొక్కసంవత్సర కాలము వేచి చూడవలసినదనియు, అప్పటికి వివాహములయ్యెడు చిహ్నములు కనఁబడకపోయినయెడల ప్రాయశ్చిత్తము చేయించుకోవచ్చుననియు, నేను చెప్పితిని. మోమోటముచేత నాముందు ప్రాయశ్చిత్తమును నిలువుచేసెదనని పలికి నన్ను వీడ్కొని వెడలిపోయెను. అటుతరువాత గంటసేపటికి కొందఱు విద్యార్థులు నావద్దకువచ్చి రామకృష్ణయ్యగారు ప్రాయశ్చిత్తము చేయించుకొనఁ బోవుచున్నారని చెప్పిరి. నేను వెంటనే వారియింటికిఁ బోయితిని. నేను పోవునప్పటికిఁ బ్రాయశ్చిత్తమునకై యేర్పాటుచేసిన మా ప్రతిపక్షనాయకులును కొందఱు వైదికులును రామకృష్ణయ్యగారిని పరివేష్టించియుండిరి. రామకృష్ణయ్యగా రానాయకులతో మాటాడి పంపివేసి, నేను మాయింటికి వచ్చినతరువాత గోదావరిమీఁద పడవయెక్కిపోయి బొబ్బర్లంకలోఁ బ్రాయశ్చిత్తము చేసికొనివచ్చి నాఁడే కాకినాడకు వెడలిపోయిరి. ప్రాయశ్చిత్తము చేసికొన్న తరువాత రామకృష్ణయ్యగారు మాసవ్యయముల నిమిత్తము సొమ్ము పంప మానివేసిరి. నేనీసంగతి నెవ్వరికిని దెలుపనీక వారు సొమ్ము

God save him from the act. God's ways are mysterious These are the days of trial for the widow marriage party When I see the staunch advocates of the cause falling off God is nerving me more and more to join the side, to break asunder that thin thread which is keeping me separate from you........."

కుంపుచుండినప్పటివలెనే యథాపూర్వకముగా సేవకులజీతములు మొదలైన విచ్చుచు పనులు జరపుచుంటిని.

ఇప్పుడు కృష్ణస్వామిరావు పంతులుగారి యుత్తరములో సూచింపబడిన గోగులపాటి శ్రీరాములుగారి వృత్తాంతమునకు వత్తము. ఆయన వివాహముచేసికొని మరల విశాఖపట్టణమునకు వెళ్ళిన యల్పకాలములోనే యాయనకు రక్తగ్రహణి పట్టుకొని యంతకంతకు హెచ్చయ్యెను. జనేవరు నెల మూడవవారములో నతఁడు ప్రాణసంశయదశలో నున్నాఁడని మిత్రులు నాకుత్తరములువ్రాసి తంతీవార్తను బంపిరి. ఆసమయములోనే మాయొద్దఁ జేరియున్న దర్భా వేంకటశాస్త్రిగారక్కడలేక సెలవుమీఁద స్వస్థలమైన బందరు (Masulipatam)నకు వెళ్ళుట తటస్థించెను. అప్పుడు నాకుఁ గలిగిన మనోవ్యాకులతకుఁ బరిమితిలేదు. వివాహమైన నెలదినములలోనే యొకట వివాహముచేసికొన్న పురుషునకే యైన తటస్థించినపక్షమున జనులు దాని నీవివాహమున కారోపింతురు; అందుచేత ముందెవ్వరును వితంతువులను వివాహముచేసికొన సాహసించుటకే సంశయింతురు. తన్మూలమున నేను పూనినసంస్కారమునకే విఘాతము కలుగవచ్చును. నాకుఁ దంతీవార్త యందఁగానే యాతనివిషయమయి యధికశ్రద్ధ చేయవలసినదని మిత్రుల కనేకులకు లేఖలను వ్రాసి తంతివార్తలనుబంపి, పథ్యపానము లమర్చుటకయి మాపురోహితుఁడైన శ్రీపాద రామసోమయాజులను ముందుగా కాకినాడనుండిఁ బొగయోడమీఁదఁ బంపి, తరువాత నుపాధ్యాయపదమునందుండి మాలోఁ జేరి మాయింటనే యున్న నల్లగొండ కోదండరామయ్యగారిని పయివారపు స్టీమరు మీఁద విశాఖపట్టణమునకుఁ బంపితిని. నేను ప్రతిదినమును తంతీవార్తలనుబంపి యెప్పటి స్థితి యప్పుడు తెలిసికొనుచుంటిని. కోదండరామయ్యగారు జనేవరి నెల 29వ తేదిని విశాఖపట్టణముచేరునప్పటికే

యతనివ్యాధి యీశ్వరానుగ్రహమువలన మరలి యతఁడు స్వస్థతకు వచ్చుచుండెను. విశాఖపట్టణముచేరిన 1882-వ సంవత్సరము జనేవరు 29-వ తేదిని కోదండరామయ్యగారు నాకిట్లు వ్రాసిరి.

“సుమారు పదిగంటలకు నేఁటియుదయమున నేనిక్కడ సురక్షితముగాఁ బ్రవేశించితిని. మొన్నటిదినము తంత్రీవార్తవలన తెలిసికొనిన దానికంటె శ్రీరాములుగారిప్పుడు మిక్కిలి వాసిగానున్నట్లు నేను కనుఁగొంటిని. అతని యారోగ్యవిషయమై మీకీవఱకే తంతిసమాచారము పంపఁబడినందున నారాకనుగూర్చి తంతియియ్యలేదు. రక్తగ్రహణి యించుమించుగా నివారణమైనది............నిన్నటి మీతంతివార్త శ్రీరాములకు మిక్కిలి ధైర్యము కలిగించినది. అప్పటినుండి చాలమార్పుగలిగినదని నేను వినుచున్నాను”* శ్రీరాములుగారు కొంత స్వస్థపడినతరువాత జనేవరు 31 వ తేదిని రైలుదేఱి మీఁదుగా రామసోమయాజులు వచ్చివేసెను; వేంకటశాస్త్రిగారు వచ్చువఱకును నుండి కోదండరామయ్యగారు తిరిగివచ్చిరి. ఆయనరోగము మర్లి కుదురుకుముఖమునకు వచ్చుచున్న దనువఱకును నాగుండె కుదుటఁబడలేదు. మిత్రవిషయమయి యెంతో కష్టపడినందుకు కోదండరామయ్యగారికి నాకృతజ్ఞతను దెలుపుచున్నాను.

మాప్రతిపక్షులు మాకొత్తుకు కలుగఁజేయుటకును మాయుద్యమములకు విఘ్నములు కలిగించుటకును ఏయే సాధనములున్నవో వానినెల్ల మాయెడలఁ బ్రయోగింపక విడువలేదు. (ఆకాలమునందలి

* "I arrived here safe at about 10 o'clock this morning, found Sriramulu to be much better than he was by the telegram the day before yesterday. I did not telegraph to you about my arrival as you were already telegraphed about his health. Dysentery is almost cured..............Your yesterday's telegram gave Sriramulu much courage. There has been ever since, I hear much change.........."

రాజకీయోద్యోగులలోని లంచములు మొదలైన దుష్కృత్యముల నణంచుటకును కులములోని దురాచారములను మాన్పుటకును సంఘసంస్కారములను దేశమునందంతటను వ్యాపింపఁజేయుటకును మాచేతిలో వివేకవర్ధనీపత్రిక యమోఘాయుధముగా నుండెను. దానిని రూపుమాపినఁగాని మాపక్షము దుర్బలము కాదని మాప్రతిపక్షులు తలఁచి, పత్రికాప్రకటనమునకు మూలమయిన ముద్రాశాలభాగస్థులను ప్రేరేచి ముద్రాయంత్రముపనిని నిలుపునట్లు చేసిరి. భాగస్థులలో నే నొకఁడను; రెండవవాఁడయిన నామిత్రుఁడు రాజా మంత్రిప్రెగడ దుర్గామల్లికార్జున ప్రసాదరావు బహదూరుగారు కాలధర్మము నొందుట తటస్థించెను; తక్కిన నలుగురును సంస్కారవిషయమున నాప్రతిపక్షకోటిలోనివారు; వారిలో సరిపల్లె గోపాలకృష్ణమ్మగారు వితంతువివాహవిపక్షయోధులకుఁ బ్రధాననాయకుఁడు. పూర్వాచారపరాయణుఁడైన చల్లపల్లి రామబ్రహ్మముగారు నాతోడఁగూడి పని చేసిన బాపయ్యగారి జ్యేష్ఠభ్రాత; నాళము కామరాజుగారును పందిరి మహాదేవుఁడుగారును రామబ్రహ్మముగారి చేతిలోనుండి యాయన నడిపించినట్లు నడుచువారు. ఈకడపటివారు నలుగురును జేరి పని మానిపించిరి గాని ముద్రాశాలను నాయొద్దనుండి తొలఁగించుటకు శక్తులు కాకపోయిరి. వారు ముద్రాయంత్రమును విక్రయింపవలెనని తమ యభిప్రాయమును దెలుపఁగా రు 1250 లను వారికిచ్చి ముద్రాయంత్రమును నేనే కొని పని నెప్పటివలె సాగింపసాగితిని. నేను వితంతువివాహోద్యమములో మునిఁగి యున్నప్పుడు సహితము మిత్రసాహాయ్యమున నిర్భయముగా నితరుల దౌష్ట్యములను వెల్లడించి ధర్మస్థాపనముచేయఁ బాటుపడుచునే యుంటిని. ఈవిషయమున శ్రీ పైడా రామకృష్ణయ్యగారి లేఖలలోని కొన్నివాక్యము లిందుదాహరించెదను.

1. "కాకినాడ. 1—10—81.

గొప్పవారికి విరోధముగ మీరువ్రాసిన వ్యాసములలోఁ గొన్నిటిని చదివినప్పుడెల్లను నేనత్యంతకష్టమును బొందుచున్నాను. ఈయంశములలో దేనిలోనైనను మీరు చిక్కులలోఁ బడుదురేమో యని నేను భయపడుచున్నాను. మీకనేకశత్రువులున్నారు......మీకడపటిదానిలో జాన్సన్‌గారి విషయమును పురపాలకసంఘము విషయమును ష్మిత్తుగారి విషయమును మీవ్యాఖ్యానములను విచారములోఁ జదివినాను. ఎవ్వరైనను మేములక్ష్యముచేయమని మీరంటిరి. ఇది జాన్సన్‌గారి నుద్దేశించి పలికినది. దండవిధాయులతోను దండశాఖాధికారులతోను తగవు పెట్టుకొనవలదని నేను మీకు హితము చెప్పుచున్నాను...... ........దీని యంతటివలనను నేను చెప్పఁదలఁచుకొన్న దేమనఁగా—ఏదినమునైన మీరు శ్రమలోనికి వచ్చెదు పక్షమున, వితంతుపక్షములో నొక గొప్ప పోషకుని నేను పోగొట్టుకొనవలసివచ్చును. ఆవేడిమి మీతో పడి పోవును.*

ఇందుఁ జేర్కొనఁబడిన దండవిధాయకుఁడైన జాన్సన్‌దొరగారే రెండుమాసముల తరువాత జరిగిన వితంతు వివాహసమయమున తాము స్వయముగా వచ్చి యూరేఁగింపువేడుకను నడపి నాకెంతో సాయము

* "I get very nervous whenever I read some of the articles of your paper when you attack big men. I fear in any one of the occasions you will get into trouble. You have many enemies.........In your last I read with sorrow your remarks about Mr- Johnson, the Municipality and Mr. Schmidt. You said in it 'we do not care whoever it may be,' It is meant for Mr, Johnson. I do not advise you to get into row with Magistrates and criminal judges......By all this I mean to say that one day if you get into trouble, I should lose a great patron in widows' cause. The warmth will fall with you"

చేసిరి; డాక్టర్ స్మిత్ దొరగారిప్పటికిని నాకు మిత్రులయి రాజమహేంద్రవరము వచ్చినప్పుడెల్లను నన్నుఁ జూచి పోవకమానరు.

2. 'కాకినాడ, 2౬—౯—౮4.

'మీ క్షేమమును గోరెడు మిత్రుఁడనుగాను, మీరు అశరణ్యులై బాధింపఁబడు జాతికి గొప్పయనుగ్రహమును జేయుచున్న గొప్ప సంస్కర్తలయినందునను కెల్సాల్ గారి విషయమైన మీ వ్యాఖ్యానములు రుచ్యములైనవి కావని మీకు వ్రాసి తెలుపఁగోరుచున్నాను. మీకు రహస్యమైనట్టి కాని బహిరంగమైనట్టి కాని శత్రువు కావచ్చునని నేను భయపడుచున్నాను..................మీరు ప్రజలకు మిక్కిలి విలువగలవారు. కాఁబట్టి యిటువంటి గొప్పవారును బలవంతులునైన వారినిగూర్చి వ్రాయకుఁడు. మేము మిమ్ము పోఁగొట్టుకొన్న పక్షమున, మేము సమస్తమును పోఁగొట్టుకొందుము. నన్ను క్షమింపుఁడు.' *

మండల న్యాయాధిపతియైన యీ కెల్సాల్ దొరగారు తరువాత పరమమిత్రులయి రాజమహేంద్రవరములో నున్నప్పుడు మాయింటికి వచ్చుచుండుటయే కాక యుపకారవేతనమును బడసి యింగ్లండునకుఁ బోయిన తరువాత సహితము ఇప్పటికిని నాపేర లేఖలు వ్రాయుచున్నారు.

ఈయంశము నిచ్చట విడిచి మరల మన వెనుకటికథకుఁ బోవుదము. లక్ష్మీనరసింహముగారు తెచ్చిన యభియోగము పోయినతరు

* "As a friend interested in you and as you are a great reformer conferring a great boon to the defencelessly afflicted sex, I wish to write and tell you that your remarks about Mr. Kelsal &c.........are not palatable. I fear, you may find a secret or public enemy.........You are to the public a very valuable one. So don't write about great and powerful men like this. If we lose you, we lose everything. Excues me."

వాత ప్రతిపక్షులు తమకు సంపూర్ణజయము కలిగినదని విఱ్ఱవీఁగుచు విధవావివాహపక్షము మరల నెప్పటికిని తలయెత్తలేకుండ స్థిరముగాఁ జెడినదని పరమానందభరితహృదయారవిందులయి మిన్నందియుండిరి. మాలోని మహాధైర్యవంతులు సహితము మరల వివాహములు కావని యధైర్యపడి నిరుత్సాహులయిరి. ఈ సమయములో మాకుఁ బాఠశాలలోని విద్యార్థులనేకులు పెట్టనికోటగానుండి చేతనయిన సర్వవిధముల తోడుపడినారు; కొందఱెక్కడకుఁ బొమ్మన్నను పోయి చేయుమన్న పనిని రెండవమాట యనకుండఁ జేయుచువచ్చిరి. విద్యార్థులకు మాయందెంత యభిమానముండెనో, వారెంతటి ధైర్యోత్సాహములను విశ్వాసమును కార్యనిర్వహణాసక్తియు లోకోపకారచింతయుఁ గలవారయి యుండిరో, యీక్రింది సంగతివలనఁ గొంత తేటపడ వచ్చును—

లక్ష్మీనరసింహముగారి యభియోగము పోయినతరువాత శ్రీశంకరాచార్యులవారును వారిని పురస్కరించుకొనియున్న మాపురమువారును మహోచ్ఛ్రాయదశయందుండి విజయగర్వముచేత మిన్నును మన్నును గానకుండిరి. ఆయభియోగము పోయినమఱునాఁడు శంకరాచార్యస్వాములవారిని మహావైభవముతో మావీధిని మాగుమ్మము ముందఱినుండి గొనిపోయి రాత్రి కరదీపికాసహస్రములతో రాజమహేంద్రపురవీధులలో నూరేగించిరి; కాని మాయింటిముందర నల్లరియేమాత్రముచేయక నిశ్శబ్దముగా సాగిపోయిరి. నాఁడే యావార్తను తంత్రీముఖమునఁ గాకినాడకుఁ బంపఁగా నాలేఖను కాకినాడపురజనులు పల్లకిలోఁ బెట్టి యారాత్రియే యూరేగించి గొప్పయుత్సవముచేసి పయిశా రామకృష్ణయ్యగారి యింటిముందునిలిచి యంతటిధనికుని చెల్లెలుబడి కలిగినవానిని సహితము లక్ష్యముచేయక, ఆయనగుమ్మము వద్ద చప్పటలుగొట్టి కేకలువేసి చేయఁగలిగినంత యల్లరి చేసిరి. ఈ

యల్లరియే రామకృష్ణయ్యగారి ధైర్యమును చలింపఁజేసి యాయనను ప్రాయశ్చిత్తమునకు లోఁబడునట్లు చేసినది. ఇటువంటి సంతోషదినములలో స్వాములవారు రాజమహేంద్రవరమును విడువక మాపక్షము వారికి మఱింత యవమానము కలుగుటకయి ప్రతిదినమును వాద్యములతో వీధులవెంబడ నూరేగుచు భిక్షలుచేయుచుఁ గొన్ని మాసములక్కడనే నిలిచియుండిరి. ఆకాలములో స్వాములవారు విధవావివాహముల నెంత నిషేధించుచు వచ్చినను ఘోటకబ్రహ్మచారులైన వారిశిష్యులు మాత్రము రండలతోడ రాత్రు లమంత్రకములైన వివాహములను రహస్యముగా జరపుచునే వచ్చిరి. పాఠశాలలోని విద్యార్థులు కొంత యీరహస్యమును గనిపెట్టి యొకనాటిరాత్రి కాచియుండి యొకబ్రాహ్మణవితంతువుతో సంసారముచేయుచున్న బ్రహ్మచారిశిష్యుని పట్టుకొని, ఆపుణ్యదంపతులను వీధిలోనికీడ్చుకొని వచ్చి యెల్లవారికిని జూపి యవమానపఱచిరి. అందుచేత స్వాములవారి శిష్యుల కందఱికిని పాఠశాలలోని విద్యార్థులమీఁద విద్వేషముపుట్టి వారి బాలురమీఁద నేలాగుననైన పగతీర్చుకోవలెనని నిశ్చయము చేసికొనియుండిరి. ఇట్లుండఁగా వారికి సమయము సహితము వెంటనే దొరకినది. రెండుదినములయిన తరువాత పగలు పండ్రెండుగంటలవేళ స్వాములవారిశిష్యులు గోదావరిలో స్నానముచేయుచుండఁగా, పాఠశాల విడిచినతరువాత విద్యార్థులిద్దఱక్కడకు స్నానమునకుఁబోయిరి. వారినిచూచి యాస్వాములవారి శిష్యులుపాఠశాలం జదువుకొను విద్యార్థుల నందఱిని కలిపి తిట్టఁగా, ఎవరు తప్పిదము చేసిరో వారినే తిట్టవలయునుగాని మొత్తముమీఁద తిట్టుట న్యాయముకాదని యొక విద్యార్థి మందలించినందున వాక్కలహము ముదిరి పిండివంటలు నిత్యమును తిని బలిసియున్న యా శిష్యు లాచిన్నవాని పట్టుకొని నిష్కరుణులయి క్రూరముగాఁ గొట్టిరి. అప్పు డక్కడనున్న రెండవ

విద్యార్థి పాఱిపోయి యీ సమాచారమును పట్టణములోఁ జెప్పఁగా, పాఠశాలలోని విద్యార్థు లనేకులు కూడుకొని తమతోడి బాలకుని క్రూరముగాఁ బ్రహరించి నందునకయి యాదుండగపు శిష్యులను దండింపవలయునని ప్రతిజ్ఞ చేసికొని గుంపులుకూడి కోపముతో స్వాములవారున్న గృహముముందు వీధిలో తిరుగసాగిరి. విద్యార్థుల యీ గ్రహమునుజూచి భయపడి యాశిష్యులు వీధిలోనికి రాక యింటిలో నడఁగియుండుటయే కాక యిద్దఱు రక్షకభటులను సహాయులనుగా తెచ్చుకొని వాకిటిలోఁ గావలియుంచుకొనిరి. విద్యార్థులాప్రకారముగా రాత్రిజామువఱకును తిరిగి స్వాములవారి శిష్యు లిల్లువెడలివచ్చు జాడఁ గానక విసిగి నాఁటికిండ్లకుఁ బోయిరి. శిష్యు లంతటితో వారిసహితము వీధిమొగము చూచుటకు సాహసింపలేక తముకుఁ గావలసిన వస్తువులను గోడచాటుననుండి పొరుగువారిని బతిమాలుకొని తెప్పించుకొని, దాహశాంతికయి మంచినీరు కావలసిరాఁగా రాత్రి రెండు జాములవేళ నందఱును కఱ్ఱలు పట్టుకొని గుంపుగా బైలుదేఱి యీ రక్షకభటులను వెంటనుంచుకొని గోదావరికిఁబోయి నీరు తెచ్చుకొనిరి. మఱునాఁటియుదయమున యథాప్రకారముగా విద్యార్థులు పాఠశాలకుఁ బోయిరి. ఆమధ్యాహ్నమున వీధులలో విద్యార్థుల సందడి యంతగా కానరాకపోయినందునఁ గొంత ధైర్యము తెచ్చుకొని యీ శిష్యులు వీధిత్రొక్క సాహసించి యిద్దఱు నొక్కకూటముగాఁ జేరి బహిర్భూమికిఁబోవునిమిత్తమయి రెండుమూఁడుగడియల ప్రొద్దుండగా గోదావరియొడ్డుననున్న యిసుకతిప్పకేసినడచిరి. ఈసంగతియేలాగునవో యొకవిద్యార్థి కనిపెట్టి తక్కినవారికి సమాచారము నంపెను. ఆశిష్యులును బాహ్యభూమికిపోయి మరలివచ్చుచు గోదావరియొడ్డుననున్న ధాన్యపుపాకలను సమీపించునప్పటికి, వారియెదుట దండధరులవలెఁగొందఱువిద్యార్థులు కనఁబడిరి వారు కంటఁబడఁగానే గుండెలు పగిలిపోయి బెదరి ముందునకునడువ కాళ్లురాక బెదరిబెదరి చూచుచు

నలుప్రక్కలను చూపునిగిడింపఁగా నానాముఖముల విద్యార్థులు గుంపులుగుంపులుగా వచ్చుచుండిరి. ఆ సంఖ్యను చూడఁగానే శిష్యులకు మునుపున్న ధైర్యముకూడ మూలముట్టుగ నశింపఁగా నదిరించుటకుఁ బ్రయత్నముచేయక పిక్కబలముచూపి పాఱిపోవుటకుఁ గాళ్ళకు బుద్ధి చెప్పిరి. విద్యార్థులు ముందుకువచ్చువారిని పట్టుకొని పాదరక్షప్రయోగములచేత బుద్ధిచెప్పి దాసులమనిపించుకొని యాశిష్యులను విడిచిపెట్టిరి. ముందు పరుగెత్తినవారియవస్థను జూచి వెనుకటివారు తాము వారి దారి పట్టక ప్రాణరక్షణార్థమయి గోదావరిలో దిగి కంఠములోఁతు వఱకును పాఱిపోయిరి. విద్యార్థులు కొందఱు వారిని వెంబడించి పట్టుకొని నీటిలోముంచి లేవనెత్తి కొన్నినిమిషములు వారి తలలను మద్దెలలనుగాఁ జేసి వినోదించి తమతోడివిద్యార్థి నన్యాయముగాఁ గొట్టిన ఋణమును వడ్డితోడఁగూడ తీర్చుకొనిరి. మొట్టమొదట దెబ్బలుతిని తప్పించుకొనిపోయిన యిద్దఱుశిష్యులును వాయువేగమున పరుగెత్తి స్వాములవారి సన్నిధానముచేరి కన్నీటితోఁ బాదములు కడుగుచు పురాణవిద్యాశాలలోని బాలురవలన జగద్గురువుయొక్క శిష్యులకు సంప్రాప్తమయిన కష్టపాటును విన్నవించుకొని, అక్కడనున్న రక్షకభటులతోడ కొన్నినిమిషములలో మరల యుద్ధభూమిని చేరిరి. రక్షకభటు లాఘూరులతో రణరంగమును చేరునప్పటికి నక్కడ నిన్నూఱుగురు విద్యార్థులకంటె నధికముగాఁ జేరియుండిరి. నీటిలోనున్నవిద్యార్థులారక్షకభటులను జూచి శిష్యులను విడిచిపెట్టి తాము నీటిలోమునిఁగి యీఁది మఱియొకరేవున తేలి యింటికిఁబోయిరి. చేతిలోని పాత్రలను నీటిలోఁ బోఁగొట్టుకొని యపాత్రులయియున్న యాశిష్యులను వెంటఁ బెట్టుకొనిపోయి రక్షకభటులు వారిని స్వాములవారితోఁ జేర్చిరి. స్వాములవారు శిఖాయజ్ఞోపవీతములను విసర్జించినను రాగద్వేషాదులను మాత్రము విసర్జింపనందున శిష్యులకు సంభవించిన దుర్దశ నిమిత్త

మయి కొంతసేపు విలపించి యా విద్యార్థులను శపించి యూరివారు తమ్మువచ్చి ప్రార్థించి యలుకతీర్చెదరేమోయని పీఠమునువిడిచి లేచి పోయెదమని వారికిని వీరికిని సమాచారములు పంపిరి. ఆరాత్రి బడి పిల్లలు స్వాములవారి శిష్యులను కొట్టి చంపిరనియే పట్టణములోఁ బ్రవాదము పుట్టెను. అందుచేత విధవావివాహములకుఁ బ్రతిపక్షులుగా నున్నవారు వీథులలో మొగము చూపుటకే తెగింపలేకపోయిరి. నేనా సమయమున చల్లగాలి ననుభవించుచు మారేవున గోదావరిలోని యొకపడవమీఁదఁ గూరుచుండియుండుటచే ప్రొద్దుపోయి యింటికిఁబోవు వఱకును నాకీ వార్తయే తెలిసినదికాదు. ప్రథమశాస్త్రపరీక్షనిచ్చి న్యాయవాదిగానుండి మొట్టమొదట మాలోఁ జేరియుండినను ఇప్పుడు స్త్రీపునర్వివాహనిషేధవాదులకు నాయకుఁడుగానుండిన యొక ప్రబు గృహస్థాసమయమున చల్లగాలికై నేను కూరుచుండిన తావున కనతి దూరముననే గోదావరియొడ్డునఁ గూరుచుండియుండి యెవ్వరో వచ్చి యాశిష్యులవార్తను చెవిలోఁ జెప్పఁగానే యుద్ధైర్యముపుట్టి తనసేవకుని చేతిలోని దీపము నార్పించి తలనిండ ముసుఁగు వేసికొని రాజమార్గమున నడువక ప్రాణములఱచేతిలోఁ బెట్టుకొని సందులగుండపోయి యిల్లుచేరి తిరిగి చూచెను. అటువంటిస్థితిలో స్వాములవారికి ముఖ్యబలముగానున్నవా రొక్కరును వారి నూరార్చుటకయిన ఆరాత్రి పీఠదర్శనమునకు రాక, తత్క్షణ మూరు విడిచిపొండని దూరమునుండి లోకగురువులకు సందేశమును బంపిరి. వారియాలోచనప్రకారముగా మఱునాటి యుదయమున విద్యార్థులు తమవిద్యాశాలనుండి రాక మునుపే స్వాములవారు తమ పీఠమును మాపట్టణమునుండి తరలించి పోగరోడకుఁ గట్టిన పడవలో శిష్యబృందముతోఁ దాము నదిని తరించి భిక్షలు చేయింపలేక శ్రమపడుచున్న మాపురమువారినికూడ తరింపఁ జేసిరి. స్వాములవారు మాపురములో నక్కియుండినయెడల విద్యా

ర్థులు వారిపీఠమును గొనిపోయి గోదావరిలోఁబడవేసెదరనికూడ నొక ప్రవాదము పుట్టెను. మొట్టమొదట దెబ్బలుపడిన విద్యార్థి స్వాములవారిశిష్యులమీఁదను, స్వాములవారిశిష్యులు విద్యార్థులమీఁదను ధర్మసభలలో నభియోగములు తెచ్చిరికాని దండవిధాయకుఁడు జగద్గురుల శిష్యులపై నేఁబదిరూపాయలు ధనదండనము విధించి ఋజువు లేనందున విద్యార్థులను విడిచిపెట్టెను. స్వాములవారికి సంభవించిన యీవిపత్తువలన మాప్రతిపక్షులకుఁ గొంతగర్వభంగము కాఁగాఁ గొంతకాలము వారు మమ్మధికముగా బాధింపకుండిరి.

ఇక్కడ మేము మాపాట్లు పడుచుండఁగా, చెన్నపట్టణములోని మాస్నేహితులు ఊరకుండినవారు కారు. శ్రీపల్లె చెంచలరావుపంతులుగారును దివాన్ బహదూర్ రఘునాథరావుగారును మాపక్షమును బలపఱుపవలెనని యెవ్వరెవ్వరు మాతో భోజనములుచేసి యేవిధమునఁ దోడుపడుదురో తెలిసికొనుటకయి పత్రికలలోఁ బ్రకటనలు ప్రచురింపఁగా పేరుగలవా రిరువదిమంది భోజనములు చేయుటకు సంసిద్ధులయియున్నట్టుత్తరములు వ్రాసిరి. హిందూపత్రికలోఁ బ్రతిదినమును మూఁడునాలుగేసి యుత్తరములు ప్రకటింపఁబడుచు వచ్చినవి. ప్రకటింపఁబడిన యుత్తరములలో నధికసంఖ్యవి యంతగాఁ బ్రోత్సాహకరములుగా నుండకపోయినను, ప్రోత్సాహకరములుగా నున్నవే యప్పటి మాపనికిఁ జాలియుండునట్లు కనఁబడెను. మాతోసహభోజనమున కేర్పాటుచేసి మాకుఁ బ్రోత్సాహము కలిగించుటకయి చెంచలరావు పంతులుగారు మమ్మచ్చటకు రండని యాహ్వానముచేసిరి. నేనా యాహ్వానము నంగీకరించి యీస్టరుసెలవులలోఁ గుటుంబసహితముగా నచటికిఁ బోవ నిశ్చయించి నాయభిప్రాయమును వారికిఁ దెలిపితిని. తమ యుత్తరమును జూచువఱకును బైలుదేఱవలదని తంతిసమాచారమును బంపి 12 వ మార్చి తేదిని మైలాపురమునుండి వారు నాకిట్లు వ్రాసిరి.

"నా ప్రియమిత్రుఁడా!

మీయుత్తరమునకుఁ బ్రత్యుత్తరమైన నాతంత్రీవార్త మీకాశాభంగము కలిగింపదని నమ్ముచున్నాను. మనము పూనినపక్షమునందు గొప్పయాదరము పూనుచున్నట్టు మీకెఱిఁగిన రఘునాథరావు వారి సాహాయ్యమును గోరుచు తనమిత్రులకందఱికిని విజ్ఞాపనమును బంపియున్నాఁడు. కార్యములలో మనము తొందరపడిన పక్షమున ఎవరి సాయము మనకుముఖ్యమో యట్టివంటి యనేకులయొక్క సాహాయ్యమును మనము పోఁగొట్టుకొనవచ్చునని ఆయనతలఁచుచున్నాఁడు. అందుచేత నాతఁడు వచ్చెడు ఏప్రిల్ 30 వ తేది వఱకును మీప్రయాణము నిలుపవలసినట్టు మిమ్ము ప్రార్థింపుమని నన్నుఁగోరెను. మావర్తమానము నన్యథాగ్రహించి, మీకుసహాయము చేయుటకు మేముచేసిన వాగ్దానమును కొంతవఱకు మఱలించుకొనుటగా మీరు భావింపరని నేను నమ్ముచున్నాను. అయినను మీరు వెంటనే రావలెనని నిశ్చయించుకొన్నపక్షమున,మీరట్లు చేయవచ్చును. నేనుమిమ్ము మాయింటనైనను పెట్టుకొనెదను; లేదా మీనిమిత్తము ప్రత్యేకముగా నొక యిల్లును కుదిర్చెదను. ఎట్లయినను నేను మీతో భోజనముచేసి మిమ్ము బ్రాహ్మణునిగా నంగీకరించుటకు నాకాక్షేపణయుండదు."*

---

* "My dear friend,

I hope that my telegram in reply to your letter will not disappoint you. Raghoonadharao who, you know, takes great interest in the cause we have taken up, has issued a circular to all his friends inviting their co-operation.

He thinks that if we precipitate matters we may lose the support of many whose aid will be of importance to us. He therefore asked me to beg you to defer your journey till 30th April next. I hope that you will not misconstrue our policy and regard it as a partial retraction of our promise to support you. If you however are resolved upon coming here at once, you may do so, and I will receiveyou either at my own House, or find a separate lodging for you. In either case, I shall have no objection to eat with you and recognize you as a Brahmin........."

మాకిప్పుడు వేసవికాలపుసెలవు లారంభ మగును గనుకను, అప్పుడు పోయినయెడల మఱికొంతకాల మధికముగానుండి యుపన్యాసము లియ్యవచ్చును గనుకను, నేనును మెయినెలలో పోవుటయే మంచిదనియెంచి యీనెలమొదట ప్రథమవివాహదంపతులతోడఁ గూడవచ్చెదనని వ్రాసితిని. దానికి మరల 1882-వ సంవత్సరము ఏప్రిల్ నెల 26-వ తేదిని పంతులుగా రిట్లు బదులువ్రాసిరి—

'ప్రియమిత్రుఁడా!

రఘునాథరావుగారే యుపనయనము నిమిత్తము మెయి మూఁడవ తేదిని స్వగ్రామమునకు వెళ్ళి, ఆ నెల 20వ తేదివఱకును తిరిగి రారు. మీసెలవులెప్పుడు ముగియునో నేనెఱుఁగను. ఆయన లేకుండ నేనేమియుఁ జేయఁజాలను గనుక, మీ రెట్లయినను మెయి 20-వ తేది తరువాతఁ గొంతకాల మిక్కడ నుండున ట్లేర్పాటు చేసికొనవలెను. అయినను మీ యానుకూల్యమునుబట్టి మీ రిక్కడకు ముందుగానే రావచ్చును. రఘునాథరావుగారిక్కడ లేకపోవలసివచ్చినదని చింతిల్లుచున్నానుగాని యీయన స్థానాంతరగమన మనివార్యమయినట్లు కనఁబడుచున్నది' *

ఈ పత్రమునకు మిత్రుఁడయి విశాఖపట్టణములో మిక్కిలి ప్రబలుఁడుగా నుండిన యొక సంపన్నగృహస్థునిమీఁద నొకమిత్రుని

---

MYLAPORE.

* 'My dear friend. 26—4—82.

Raghunadha Rao goes to his village for some upanayaanam on 3rd May and will not return till the 20th of that month. I do not know when your vacation terminates. Any how you must arrange to stay here for some time after 20th May, as I can do nothing without him. You can come here however before hand according to your convenience I am sorry that Raghunadha Rao has to be absent, but his absence seems to be unavoidable.'

ప్రేరణచేత గోఁగులపాటి శ్రీరాములుగా రనాలోచితముగాఁ దెచ్చిన
యొక యభియోగములో సంధిచేయవలెనన్న తలంపుతో ముందు
గా నే నచ్చటికిఁ బోయి మాటాడవలసినవారితో మాటాడి, తరువాత
ప్రథమవివాహదంపతులను వెంటఁబెట్టుకొని భార్యాసహితముగా
నొక వంటబ్రాహ్మణునితోడ బైలుదేఱి, ముందుగా నారాకను
తంత్రీముఖమున చెంచలరావు పంతులుగారికిఁ దెలిపి, విశాఖపురి
రేవులోఁ బొగయోడ నెక్కి నాలవదినమున చెన్నపట్టణపు రేవుచేరితిని.
చెంచలరావు పంతులుగారు రేవుమీఁదికే మనుష్యులనుబంపి, మమ్ము
పడవమీఁద ఒడ్డునకుఁ గొనివచ్చి యక్కడినుండి బండ్లమీఁద తీసికొని
పోయి మైలాపురములో కచ్ఛపేశ్వరుని యాలయసమీపమున మా
కయి యేర్పఱిచిన విశాలగృహమునందుఁ బ్రవేశపెట్టిరి. మాకేవిధమైన
లోపమును లేకుండ సమస్తమును సనుకూర్చుచుఁ బంతులుగారు మా
యెడల నత్యంతాదరము చూపిరి. నేనును సుఖభోజనము చేయుచుఁ
పంతులుగారు పంపిన గుఱ్ఱపుబండ్లమీఁదపోయి యక్కడ నుపన్యా
సము లిచ్చుచు రఘునాథరావుగారి రాకను బ్రతీక్షించుచుంటిని. నే
నొకసారి చాకలిపేటలో వితంతువివాహమునుగూర్చి యుపన్యసించు
చుండఁగా మూర్ఖులయిన వైష్ణవబ్రాహ్మణులు చుట్టుముట్టి నన్ను
మర్దింపఁజూచిరిగాని నా మిత్రులైన పసప్పాకము ఆనందాచార్యులు
గారు యుక్తసమయమునఁ గనిపెట్టి నన్నక్కడనుండి తొలఁగించి తమ
బండిలో నెక్కించుకొని దూరముగాఁ గొనిపోవుటచేత వారిబారినుండి
తప్పించుకొంటిని. ఇంకొక్కసారి నేను పెద్దనాయనిపేటలో (Black-
town) నుపన్యసించుచుండఁగాఁ బండితు లనేకులుచేరి యుపన్యాసాంత
మునఁ బ్రశ్నలు వేసి నన్ను పరాభవింప నెంచి, వితంతువు వివాహము
చేసికొన్నచో దానిపూర్వభర్తయొక్క శ్రాద్ధము లెవ్వరు పెట్టుదు
రనియు, ఆశౌచ మెట్లు పట్టవలయుననియు, ఇట్టివే యనేకప్రశ్న

ములు వేసిరి. నేను వానికన్నిటికిని శాస్త్రోక్తములయిన సమాధానము లను చెప్పితిని. ఈవిధముగా నన్నోడింపలేక భగ్నమనోరథులయి కడపట 'మీకు శాస్త్రములయందు విశ్వాసమున్నదా?' యని ప్రశ్న వేసిరి. 'లేదు. ఆత్మసంరక్షణార్థమును శాస్త్ర విశ్వాసముగలవారి నిమిత్తమును నేను శాస్త్రప్రమాణములను జూపుచున్నాను' అని చెప్పి, పూర్వ మొకగ్రుడ్డివాఁడు దీపము చేతఁబట్టుకొని దారినిబోవుచు నీకదియేమి యుపయోగమని దారినిపోవువా రడిగినప్పుడు మీకు దారి కనఁబడుచుటకును చీఁకటిలోఁ గనఁబడక మీరు నామీఁదఁబడి యపా యముఁ గలిగింపకుండ నన్నుఁ గాపాడుకొనుటకును దీనిని వహించు చున్నానని యుత్తరము చెప్పిన కథను దృష్టాంతము చూపితిని. ఇంకొక సారి తిరువళ్ళికేణిలో గంగనామంటపముమీఁద జరగిన పండితసభలో కంచి సుబ్బారావు పంతులుగారిపక్షము వారితో శాస్త్రార్థవిషయ మయి వాదప్రతివాదములు జరపితిని. కాని పర్యవసానమేమియు తేలక యా పండితసభ పరిసమాప్తి నొందినది. ఈ సభలకుఁ బూర్వము ఆండర్సన్ హాలులో స్త్రీపునర్వివాహము నుగూర్చి యుపన్యాసమిచ్చుట కేర్పాటు చేయఁబడినది. శాస్త్రప్రమాణములను కాగితముమీఁద వ్రాసికొని, యుపన్యసింపవలసినరీతి మనస్సులో నేర్పఱుచుకొని, యుపన్యసించుటకు సంసిద్ధుఁడనయి పెంచలరావుపంతులుగారి బండిలో వారితోఁ డఁగూడ హైలుదేఱితిని. అది మొదటి యుపన్యాసమగుటచేత నాయుపన్యాసమును వినకముందే వితంతువివాహవిషయమయి జను లకు దురభిప్రాయము కలిగింపవలెనన్న దురుద్దేశముతోఁ బండితు లేమేమో వ్రాసి పెద్దకాగితముమీఁద నచ్చొత్తించి పట్టణమునం దంతటను పంచిపెట్టిరి. ఉపన్యాసస్థలమునకు మేము బండిలోఁ బోవుచుం డఁగా మైలాపురములో నెవ్వఁడో యొకకాగితమును బండిలో గిర వాటువేసెను. నే నది పుచ్చుకొని చదువ నారంభించితిని. ఆకాగిత ములో రండలు, ముండలు, అన్న పదములును, దూషణవాక్యము

లును తప్ప సహేతుకములైన యుక్తులుగాని శాస్త్రప్రమాణములు గాని నాకేమియు కానరాలేదు. మైలాపురమునుండి క్రైస్తవకళాశాలతోఁ జేరిన యాండర్సన్ హాలుకు నాలుగుమైళ్ళున్నందున గమ్యస్థానము చేరునప్పటికి నేనా కాగితమును పూర్ణముగాఁ జదివి ముగింపఁ గలిగితిని. అది చదివినకొలఁదిని కోపవ్యగ్రతచేత నాయొడలిలోని రక్తము వేఁడియెక్కి దేహము వెచ్చనై నామనస్సు నావశముగాక యుద్రేకింపఁ జొచ్చెను. ఇట్టిస్థితిలో నేనుపన్యాసపీఠము నెక్కి, మొదట యోచించుకొనివచ్చిన యుపన్యాసమును సన్నను మఱచి, రెండు గంటలసేపు నోటికి వచ్చిన ట్లేమేమో చెప్పితిని. ఉపన్యాసమధ్యమునఁ బలుమాఱు కరతాళధ్వనులతో సభాభవనమంతయు మాఱుమ్రోయఁజొచ్చెను. ఆపత్రికాకారచనకుఁ గర్తలయి సభకు వేంచేసియుండిన ఘనులు సిగ్గుపడి తలలు వంచుకొనిరి. నేచేసిన యుపన్యాసమునందు విద్వాంసులు మెచ్చఁదగిన శాస్త్రాంశములుగాని బుద్ధిమంతు లామోదింపఁదగిన యుక్తివిశేషములు గాని యేవియులేవు, పామరజనరంజకములైన పరిహాసవాక్యములే విశేషముగా నుండినవి. ఏందుచేతనో కాని నాకు హాస్యవచనరచనానైపుణ్యమును ఈశ్వరుఁ డధికముగాఁ బ్రసాదించెను. స్వాభావికమైన యాశక్తిని నేనంతగా నుపయోగింపక కొంతవఱకడఁచుచుందును. అప్పుడు కోపోద్రేకముచేత నాచిత్తము నాకు వశముగాక హాస్యరసప్రవాహము వెల్లువగాఁ బాఱెను. అందుపయోగింపఁబడిన నిందాగర్భితములైన వాక్యములు సువిచారస్థితియందు నేనుపయోగింపఁ దగనివై యున్నవి. అయినను నాయుపన్యాసములను వినుచువచ్చినవారందఱు నిదియే యధికహృదయాకర్షకమైనదని చెప్పిరి. తరువాత స్త్రీపునర్వివాహశాస్త్రసంగ్రహమను నుపన్యాసరూపమున వ్రాసి యొకసభలోఁ జదివి దాని నచ్చుటయచ్చొత్తించితిని.

ఈ ప్రకారముగా వివాదములతో మేముఁ గాలముపుచ్చుచుండఁగా, దివాన్ బహదూరు రఘునాథరావుగారు చెన్నపట్టణమునకు విచ్చేసిరి. వారును చెంచలరావు పంతులుగారును గలిసి యీ వఱకు భోజనములుచేసెదమని శూరవాక్యములు లిఖించిన దేశాభిమానుల యిన సంస్కారప్రియుల కందఱకును నిర్ణీతదినమున సంస్కారభోజనమునకు దయచేయవలసినదని బహుదినములకు ముందుగానే యాహ్వానపత్రికలను బంపిరి. వానికి బదులు వ్రాయుటకే గొందఱు సంస్కారప్రియులకుఁ దీఱిక కాలేదు; పలువురుఁ గార్యాంతర భారములచేతఁ దాము రాలేకపోయినందుకు విచారములు తెలుపుచు క్షమార్పణలు చేసిరి; సబుజడ్జిగానుండిన గణపతయ్యరుగారొక్కరుమాత్రమాహ్వానమంగీకరించి రాఁగలిగిరి. అప్పుడు రఘునాథరావుగారును మిత్రులును కర్తవ్యము నాలోచించి శ్రీపార్థసారథిస్వామివారి యాలయమునుండి ప్రసాదమును తెప్పించి మాతోడఁగూడ విందారగించిరి. ఆవిందుకు వచ్చినవారు వివాహదంపతులుగాక రఘునాథరావుగారును చెంచలరావుపంతులుగారును గణపతయ్యగారును దంపూరి నరసయ్యగారును మన్నవ బుచ్చయ్యపంతులుగారును నేనును గలిసి సాంఘిక సంస్కారాభిమాన షట్చక్రవర్తులు. ఈ యాఱుగురితోను విందు బహువిధముగా ముగిసినతరువాత చెంచలరావుపంతులుగారు మా కందఱకును విలువబట్టలను కట్టనిచ్చి, ప్రయాణవ్యయములకయ్యె నూఱురూపాయలు రొక్కమిచ్చి, మమ్ము వీడుకొల్పఁగా జూన్ నెల నడుమను సుఖముగా మరల రాజమహేంద్రవరముఁ జేరితిమి. శ్రీరాములుగారికి గర్భాదానముచేసి యాయనను పత్నీసహితముగా విశాఖపట్టణమునకు మరలఁ బంపివేసితిని.

ఇట్లు మిత్రద్రవ్యముతో మాయుపక్షములు విందు లారగించి స్వేచ్ఛావిహారము చేసివచ్చి స్వస్థలము చేరి మాయెప్పటివ్యవహార

ములో మరల మేము ప్రవేశించితిమి. పలుచోట్లనుండి వచ్చి బహువి
ధాభిప్రాయములను గలిగినవా రెక్కువమంది యొక్కచోటం గూడిన
ప్పుడు వారిలో నైకమత్యముండుట యరుదుగదా! అట్టివారిలోం గొం
దఱిని వేఱుచేయవలసిన యావశ్యకము శీఘ్రకాలములోనే సంభవిం
చెను. ఉపశమములోం జేరినవారి కితరులు కాపురముండుట కిండ్లి
య్యరు. రామకృష్ణయ్యగారి కక్కడకు వచ్చినప్పుడీచిక్కు వారితోం జె
ప్పంగా, వివాహము లాడినవారు తత్సంబంధులును గాపురము లుం
డుటకయి యిన్నీసుపేటలో వారొకగృహమును గొనియిచ్చిరి. నే
నెనిమిదేసి రూపాయలు జీతము లేర్పఱిచి ముందుగా రెండవపెండ్లి
మారితె పుట్టినింటివారిని తరువాత రెండవపెండ్లి దంపతులను, అయి
టికిం బంపితిని. రామకృష్ణయ్యగారు ప్రాయశ్చిత్తము నంగీకరించిన తం
వాత ముంజులూరి వెంకట్రామయ్యగారు తనతమ్ముని మాయింట ది
విడిచి, ప్రాయచిత్తము చేయించుకొని భార్యతోను కుమారునితోను
మాయింటినుండి వెడలిపోయిరి. నల్లగొండ కోదండరామయ్యగా
తమతల్లికి జబ్బుచేసినందున జూలయినెలలోం బ్రాయశ్చిత్తముచేయిం
చుకొనిపోయి బంధువర్గములోం గలిసిరి. వంటబ్రాహ్మణులలో నిద్దఱు
గూడ మాయిల్లు విడువవలసినవారయిరి. వారిరువురిలో నొకండు హ
లాఘవవిద్యయందు నిపుణుండు; అతనిశక్తిచేత మాయింట నేవస్తువు
పెట్టికొంచె మేమఱియుండినను; ఆవస్తువు నిమిషములో నదృశ్యమగు
వచ్చెను; మొదటిపెండ్లిదినములలో నే మొదటివధువునకుం బెట్టినబంగా
పట్టెడ మాయమయినది; మాయింటంగలచిన్నవస్తువులను నేను ధ
చెడు వస్త్రములును పెక్కులుమాయింటనుండి తరలిపోవుచువచ్చెను
ఇంటిదొంగను పట్టుకొనుటకష్టముగదా! అనుమానపడి నేమయి
వన్నపక్షమున మేము బదులిచ్చిన నూఱురూపాయిలును పోవునేమొ
యన్న భయమొకటి, వాండు పోఁజేసిన వంటబ్రాహ్మణు

దొరకఁడన్న భయమొకటి, సంవత్సరము జీతమిచ్చెదమని వ్రాసి యిచ్చి చేసినప్రతిజ్ఞను నడుమను మీఱకూడదన్న భయమొకటి, మమ్ము బాధింపఁగాఁ బ్రత్యక్షమయిన ఋజువు దొరకువఱకును చూడవలెనని మేమప్పటిస్థితిఁ బట్టి వానిను పేక్షించుచు వచ్చితిమి. ఆ బ్రాహ్మణుఁడు మేము చెన్నపట్టణములో నున్నప్పుడు మాముద్రాక్షరశాలలోఁ బనిలోనున్న మునిసామి యనువాని కత్తెర మొదలయినవానిని తస్కరింపఁగా అతఁడు గదిలోఁ బెట్టి దిట్టముగాఁ గొట్టినందున వంటబ్రాహ్మణుఁడు భయపడి మునిసామిని తనవెంట తీసుకొన్న ముందయింటికిఁ దీసికొనిపోయి యాతని వస్తువుల నిచ్చివేసెను. ఆవస్తువులతోడి పాటుగాఁ బోయినవస్తువులు మావిసహితము కొన్నిదొరికినవి. మునిసామికి జడిసి యాబ్రాహ్మణుఁడు మమ్మువిడిచి పాఱిపోయెను. వివాహములు చేయించి విశాఖపట్టణమువెళ్ళిన పురోహితుఁడును ప్రాయశ్చిత్తము చేయించుకొని స్వజనమునుచేరెను. ఈప్రకారముగా మాయింటనున్న పైజనమంతకంతకుఁ దగ్గిపోయి పలుచఁబడినది; నేను చెన్నపట్టణము వెళ్ళఁదలఁచుకొన్నప్పుడు ఏప్రిల్ నెలలోఁ బ్రయాణవ్యయముల నిమిత్తము రామకృష్ణయ్యగారు నాకిచ్చిన నూఱురూపాయలను ఆమాసవ్యయములక్రిందఁ గర్చుచేసితిని. ఆమాసమునకయిన వ్యయముల నిందు క్రిందఁజూపుచున్నాను—

రామచంద్రరావు (రెండవపెండ్లికొడుకు) నకు

| | | | |
|---|---|---|---|
| భోజనము నిమిత్తము | రు. 7 | 0 | 0 |
| రామచంద్రరావుకు పుస్తకము ... ... ... | 2 | 0 | 0 |
| ,, న్యాలుఫీజు ... ... ... | 6 | 1 | 0 |
| ,, జంప్ఖానా ... ... ... | 1 | 10 | 0 |
| ,, కట్టుబట్టలు ... ... ... | 5 | 1 | 6 |

| | | | |
|---|---|---|---|
| రామచంద్రరావుకు గర్భాధానపుకర్చు ... ... | 5 | 0 | 0 |
| ,, గర్భాధానమునకు బట్టలు... ... | 8 | 10 | 0 |
| వంటబ్రాహ్మణుఁడు శేషయ్యజీతము ... ... | 7 | 0 | 0 |
| ,, సీతమ్మకు ... ... ... | 4 | 0 | 0 |
| ,, విస్సయ్యకు ... ... ... | 4 | 0 | 0 |
| ,, సీతమ్మతల్లి తద్దినమునకు... ... | 1 | 0 | 0 |
| పెమ్మరాజువారి (రెండవ పెండ్లికొమార్తె పుట్టినింటివారి) కి నెలజీతము ... ... | 8 | 0 | 0 |
| ,, బట్టలు, జాకెట్టుతాను | 3 | 0 | 0 |
| రామచంద్రరావుమామగారి కాయిలానిమిత్తము, పెమ్మరాజువారికి | 5 | 0 | 0 |
| పెమ్మరాజువారినిమిత్తము వైద్యునికి(4విజిట్లకు రు. 2-0-0, ఔషధములకు రు. 9-0-0) | 11 | 0 | 0 |
| రామచంద్రరావు మామగారి దహనవ్యయము ... | 11 | 0 | 0 |
| వైద్యునికి నాలుగుసార్లు బండికూలి... ... ... | 1 | 6 | 0 |
| నారాయణమూర్తి నెలజీతము ... ... ... | 6 | 0 | 0 |
| శూద్రసేవకుఁడు లక్ష్మయ్యకు ... ... ... | 1 | 0 | 0 |
| అప్పారావు (రెండవపెండ్లికొమార్తెతమ్ముఁడు) స్కూలుజీతము | 0 | 6 | 0 |
| | 98 | 2 | 6 |

ఇప్పటికి మా సమాజమునకు నిధిగా ధనమేదియు లేదు; నెల చందాలు లేవు; మాసవ్యయములకయినను రామకృష్ణయ్యగారిత్తురో లేదో సందేహము. ఈస్థితినంతను గ్రహించి కృష్ణస్వామిరావుపంతులు గారితో మొఱ్ఱపెట్టుకొనఁగా వారు పరమదయాళురయి తమయావచ్ఛక్తిని ధారపోసి రామకృష్ణయ్యగారిని ప్రోత్సాహపఱిచి దివాన్ బహా

దును రఘునాథరావుగారిని పల్లె చెంచలరావు పంతులుగారిని ట్రస్టీలనుగా నేర్పఱిపించి జూన్ నెల కడపట పదివేల రూపాయలను చెన్నపట్టణమునకుఁ బంపునట్లు చేసిరి. ఈ యేర్పాటువలన పైని రామకృష్ణయ్యగారి రెండుప్రతిజ్ఞలును నెఱవేఱినవి. ప్రాయశ్చిత్తకాలమునందుఁ దా నిఁకముందు రాజమహేంద్రవరవితంతువివాహసమాజము వారికి సొమ్ము పంపనని చేసిన రెండవ ప్రతిజ్ఞయు చెల్లినది.— ఎట్లనఁగా మాకుఁ జెన్నపట్టణమువారు పంపుదురుగాని రామకృష్ణయ్యగారు స్వయముగా సొమ్మియ్యరు; వితంతువివాహముల నిమిత్తమయి సొమ్మిచ్చెదనన్న మొదటిప్రతిజ్ఞయు చెల్లినది —ఎట్లనఁగా సొమ్మును మాకుఁ జెన్నపురివారే బంపినను సొమ్ము రామకృష్ణయ్యగారిచ్చినదే. ఈ విషయములో మాకు కృష్ణస్వామిరావు పంతులుగారు చేసిన మహోపకారమును మేమెప్పుడును మఱువఁజాలము. ఈ పదివేల రూపాయలను పంపినకాలములో మరల వివాహములు జరుగునన్న నమ్మకము రామకృష్ణయ్యగారి కెంతమాత్రమును లేదు. సొమ్మును చెన్నపట్టణము పంపినప్పుడు రామకృష్ణయ్యగారు చెంచలరావు పంతులుగారిపేరను రఘునాథరావుగారిపేరను వ్రాసిన యుత్తరములో రెండుసంవత్సరముల లోపల వివాహములు జరగనిపక్షమున తమ సొమ్ము తమకు మరలఁ బంపివేయునట్లును, వివాహములయ్యెడు పక్షమునఁ జెన్నపట్టణము సమాజమువారు రెండువివాహములకు రెండువేల రూపాయలను వ్యయపఱచుకొనునట్లును వ్రాసి, వివాహములు జరగెడిపక్షమున వివాహ మొక్కొంటికి వేయేసిరూపాయలచొప్పున నాయొద్దకుఁ బంపుచుండవలసిన దనియు వ్యయములక్రింద జూన్ నెల మొదలుకొని నెలకు డెబ్బదియైదు రూపాయలచొప్పున నాకుఁ బంపుచుండవలసిన దనియు వ్రాసిరి.

ఏపత్రికనుజూచినను కష్టములే కనఁబడుచు, మరల వితంతు

వివాహము లగునన్న యాశ కవకాశములేక, పూనిన కార్యము కాల
నాశనము నొందునట్లగపడుచున్న యీకాలములో నేలాగునైనఁ
గొన్నివివాహములుచేసి యిటువంటి సత్కార్యప్రవృత్తము మనుష్య
కుటిల ప్రయత్నములవలన నిర్మూలము కానేరదని లోకమునకుఁ జూప
వలెనని మేము మఱింత ధైర్యోత్సాహములతో బహుప్రయాసముల
కోర్చి పనిచేయసాగితిమి కాని మొట్టమొదట మాకృషి సఫలమగునట్లు
కనఁబడలేదు. ఆవఱకు తమవితంతు కన్యలకు వరులను విచారించి వివా
హము చేయుఁడని మమ్ము బతిమాలుకొన్న వారికడకుఁ బోయి మేమే
బతిమాలుకొనఁగా మాతో మనసిచ్చి మాటాడక పోవుటయే కాక
మామీఁద కోపపడి యట్టి యనుచిత ప్రసంగము చేసినందుకు
మమ్ము తిట్టసాగిరి; మఱికొందఱు మమ్ము తమయిండ్లలోనికే రానీ
యకపోయిరి. వేంకటప్పయ్యగారు చెన్నపట్టణమునకుఁ బోవుచు కాకి
నాడనుండి వ్రాసిన యుత్తరములో నుదాహరింపఁబడిన పెద్దిభట్ల
యజ్ఞన్నగారును ప్రాథమికపాఠశాలలో నుపాధ్యాయుఁడైన తామూరి
రామారావుగారును నేను వ్రాసినమీఁదట రాజమహేంద్రవరము
వచ్చి నాతో మాటాడి మొదటివారు తమచెల్లెలిని స్వశాఖవాఁడయిన
వైదికవరునకిచ్చి వివాహము చేయుటకును, రెండవవారు స్వశాఖది
యైన మాధ్వవితంతువును వివాహమాడుటకును అంగీకరించిరి. కాఁ
బట్టి యిప్పుడొక వైదికవరుఁడును, ఒక మాధ్వవధువును గావలసియుం
డిరి. వైదికవరుఁడు మాపాఠశాలలోని విద్యార్థులలో నొకఁడు సంసిద్ధుఁ
డయియే యుండెను; మాధ్వవధువు సహితము లభించినట్లేయుండెను.
ఉమ్మెత్తాల వేంకటపతిరావను మాధ్వగృహస్థుఁ డొకఁడు నాతో
నావఱకుఁ బలుమాఱుమాటాడి 1882-వ సంవత్సరము జూన్ నెల
24-వ తేది నాకీ క్రిందియుత్తరము వ్రాసియిచ్చెను.

"మీరు యిదివరలో వితంతువివాహములు చేయించినారని

యిట్టి శాస్త్రోక్తమయిన లోకోపకారం జరిగించినందుకుఁ జాలసంతోషంగా వున్నది. నాకుమార్తె అయిన శనగవరపు లక్ష్మీబాయమ్మకు భర్తచనిపోయినాడు. దానికి సుమారు 16 సంవత్సరములు వయస్సు కలిగియున్నది. తిర్గివివాహంచేతామని ఆలోచిస్తే నాకు ద్రవ్యోపపత్తి లేదు. నీరసుణ్ని. దానికిముఖ్యంగా వివాహం చేసుకోవలెనని వుద్దేశం వున్నది. మామతస్థుడయిన చిన్నవాడు యెవరైనా మీకుఁ గనపించి యిందుకు అంగీకరించిన పక్షముకు అతనికి సదరు లక్ష్మీబాయమ్మను వివాహంచేసి మీరు నాకు కర్చులేకుండా జరిగించినపక్షమున నేను చాలాసంతోషిస్తున్నాను గనుక విశదం ని॥ వ్రాసినాను. చిత్తగించవలెను. ది ౨౮ జూన్ ౧౮౮౨ సం॥ వుమ్మెత్తాల వెంకటపతిరావు."

సరిగాఁ గార్యము కావలసి వచ్చునప్పటికి బంధువులకుఁ దెలియుటచేత వేంకటపతిరావుగారును, యజ్ఞన్నగారును కూడ భయపడి యిద్దఱును వెనుకతీసిరి. వేంకటపతిరావుగారి కూఁతురును, యజ్ఞన్నగారి చెల్లెలును, ఇద్దఱును చదువుకొన్నవారయి నాకావఱకే యుత్తరములు వ్రాసియుండిరి. అందుచేత సంగతులను విడిచిపెట్టి యేకస్వయముగా నాబాలవితంతువులతోనే యుత్తర ప్రత్యుత్తరములను జరపి కార్యమును సాధింపవలెనని నేను నిశ్చయించుకొంటిని. ఇద్దఱిలో నొకచిన్నది పెద్దాపురములో నున్నది; ఇంకొకచిన్నది కాకినాడలో నున్నది. నేను వారిపేరనే యుత్తరములు వ్రాసెడుపక్షమున, రహస్యము వెల్లడియయి కార్యభంగము కాకమానదు. వితంతువివాహసంస్కారవ్యాపమునం దవ్యాజాదరము గలవారయి నిపుణులై కార్యదక్షులయిన యిద్దఱు మిత్రులీవిషయమున గూఢముగాఁ బనిచేయుటకయి పెద్దాపురమునం దొకరును కాకినాడయందొకరును గావలసియుండిరి. ఆకాలమునందు రాజమహేంద్రవరనివాసులయి కార్యదక్షులయి వితంతువివాహపక్షావలంబులయి మాకత్యంతాప్తులయిన సుమ్మది

దల మనోహరము పంతులుగారు పెద్దాపురమునందు పోలీసు ఇన్‌స్పె క్టరుగా నుండిరి; మాపక్షమున శ్రద్ధావులలయి పనిచేయుచుండిన పెండెకట్ల లచ్చిరాజుగారు కాకినాడ జగన్నాధపురములో నుండిరిగాని పనిచేయవలసిన స్థలమునకు వారియిల్లెంతో దూరముననుండెను. అయి నను ఆయుభయమిత్రులవలనను కార్యము సాధింపవలెనని నేను నిశ్చ యించుకొంటిని. ఇంతలో మాపక్షమునం దభిమానముగలవాఁడయి మేము కృషిచేయవలసిన చిన్నదాని యింటియెదుటనే కాపురముండిన తంజావూరి వేంకటచలపతిరావుగారు లభింపఁగా కాకినాడలో ఆయన వలన కార్యసాఫల్యము బడయుట కేర్పఱుచుకొంటిని. స్టేట్యూటరీ సివిల్ సర్వీస్ సంబంధమున గవర్నరుగారు చెన్నపురికిఁ బోవలసిన యావశ్యకము తటస్థింపఁగా, ఈవిషయమయి కాకినాడలోఁ బనిచేయుటకును, కొట్టుపడిపోయిన లక్ష్మీనరసింహముగారి యభియోగ సంబంధమైన యుపర్యభియోగ విషయముయి చెన్నపట్టణములోఁ బనిచేయుటకును, వితంతువివాహపక్షమున నేనాయనను నియమించితిని. ఆయన చెన్నపురికిఁ బోవుచు దారిలో కాకినాడనుండి 1882 సం॥ ఆగస్టు 24 వ తేదీని నాకిట్లు వ్రాసిరి :—

"నా ప్రియగౌరవనీయ మిత్రుఁడా!

"ఎల్లోరా పొగయోడ నేఁడిక్కడ ప్రతీక్షింపఁబడుచున్నది. అందుచే నేను వెళ్ళిపోవుచున్నాను. పై-రా-గారిని, జడ్జిని చూచితిని. నేను డర్హాముగారినికూడ దర్శించితిని. పై-రా-గారిని, కార్మైకల్, చెంచలరావు మొదలైనవారికిఁ దంతీవార్తలు పంపునట్లు చేసితిని. సబుజడ్జి అప్పీలులేదని తలఁచుచున్నాఁడు. ముందుముందు మనము సివిల్ వ్యాజ్యము తీసికొనిరావచ్చును. డర్హాముగారును సబుజడ్జియు నాకావిషయమున దీర్ఘోపన్యాసములుచేసిరి. లచ్చిరాజుగారు, రామారావు మొదలయినవారిని చూచితిని. తన్ను స్వశాఖవాని కెవ్వని

కైన వివాహము చేయుమని కోరుచు స్వహస్తముతో ఆచిన్నది మీపేర వ్రాసిన యుత్తరమొకటి వారియొద్ద నున్నది. వివాహ మీనెలలో జరుపఁబడవచ్చునని నేను తలఁచుచున్నాను. రేపుగాని పయిశనివారమునాఁడుగాని మీయొద్దకుఁ బోవలసినదని నేను పెండ్లికుమారునితోఁ జెప్పితిని. ఆచిన్నది యొక్క పర్యాయము తల్లిదండ్రుల యొద్దనుండిఁ దొలఁగింపఁబడిన పక్షమున అప్పుడు తల్లిదండ్రులవద్దకు మరల పోవలెనన్న మోహమునంతను ఆమె మరల్చుకోఁగలదు. ఈ వివాహమును గూర్చి నేను సబుజడ్జితో మాటాడలేకపోయినందుకు విచారించుచున్నాను. మరల నొక్క వివాహము జరగింపఁబడినపక్షమున, అప్పుడు మఱికొన్ని జరిగించుట కాశయున్నది. ఈసంగతులు నాతోఁ జెప్పఁబడినవి.

మంచిది. ఈ ప్రయాణమువలనఁ గలిగిన ధనకాల నష్టములటుండఁగాను, శ్రమ యటుండఁగాను, ఒక్క విషయమయి నేను రాజమహేంద్రవరము విడిచినందుకు చింత నొందుచున్నాను. మిక్కిలి విలువగలవని నేను తలంపవలసినవి యిప్పుడు రాజమహేంద్రవరములో రెండు ఆత్మలున్నవి. అతి శ్రమపడుచున్నారు గనుక, మీయారోగ్యవిషయమయి నేను ముఖ్యముగా భయపడుచున్నాను. మీకోసమును, నాకోసమును, మన దేశముకోసమును, దేవునికోసమును, దయచేసి మీ మెదడునకు భారము పెట్టకుఁడు. ఈపుస్తకమును ఆపుస్తకమును భాషాంతరీకరింపవలెనన్నఁ దలంపును అధమము కొంతకాలమువఱకైనను గట్టిపెట్టుఁడు. మఱియెవ్వరైనను వివేకవర్ధనిని జరపనిండు. రాత్రిపాఠశాలవిషయమైన యల్పవివాదములలో తగులుకొనకుఁడు. అతఁడు మంచిదారికి రా నేరనివాఁడైన, పోనిండు.

వము చేసికొనెను. గవర్రాజుగారు వ్రాసినమీఁదట పోయినపుస్తకములను మరల రాఁబట్టెడు ప్రయత్నమును మాని, నామిత్రులు మొదలైనవారిచేత చందాలువేయించి పుస్తకాదిపరికరములను కొనియిచ్చి, విద్యార్థులు మఱియొకచోట రాత్రిపాఠశాలను సాగించెడి యేర్పాటును చేసితిని. గవర్రాజుగారు తమయుత్తరములో వ్రాసిన సంపర వెంకన్నగారిని వెంటనే పిలిపించి, నాసొంతమునుండి నెల కెనిమిది రూపాయలు జీతమిచ్చునట్లేర్పఱిచి, గ్రామములవెంట తిరిగి పనిచేయ నియమించితిని. పట్టపరీక్షయందును ఇతర పరీక్షలయందును కృతార్థుఁడయి, మండలన్యాయసభ (District court) యందు సిరస్తాదారు పదమునొంది, కడపట న్యాయవాదియయి, మరణపర్యంతము నన్ను విడువకుండిన దీ గవర్రాజుగారొక్కరే.

పెద్దాపురమునందు నామిత్రులయిన మనోహరము పంతులుగారుండిరని చెప్పియుంటినిగదా ! వితంతువివాహపక్షమునం దత్యంతాభిమానము కలిగి యుత్సాహముతోఁ బనిచేయుచుండిన యాయన తమ్ముఁడైన గుమ్మడిదల సాంబశివరావుగారు రాజమహేంద్రవరమునుండి యాచిన్నదాని నిమిత్తము పనిచేయుటకుఁ దఱచుగా నన్నగారియొద్దకు వెళ్ళుచు, నాయుత్తరముల నాచిన్నదాని కందఁజేయుచు, ఆచిన్నదాని యుత్తరములు నాకుఁ జేరునట్లుచేయుచు, నాకెంతో సహాయుఁడుగా నుండెను. ఈయనయే యొకసారి యాచిన్నదానిని చామర్లకోటలోఁ బడవయెక్కించి తీసికొనివచ్చునట్లేర్పాటుచేసి పడవనంతను కుదిర్చి యుంచితిమి కాని యాప్రయత్నము కొనసాగినదికాదు. ఆచిన్నదానియింట పనిచేసెడి యొకకుఱ్ఱది యాచిన్నది వ్రాసిన యుత్తరములను నాకుఁ బంపుటకయి రహస్యముగా మనోహరముపంతులుగారియింట నిచ్చుచు నేనువ్రాసి మనోహరముపంతులుగారియొద్దకుఁ బంపిన యుత్తరములను గొనిపోయి రెండవకంటివారెఱుఁగకుండ నాచిన్న

దాని కందిచ్చుచు, ఉండెను. లేఁతవయస్సులోనున్న జవ్వనులకు నిరంతరవైధవ్యదుఃఖముసకంటె మరణమే మేలుగా నగపడునుగనుక, తానేలాగునైన దుస్సహవైధవ్యబాధనుండి బయలఁబడి సుఖింపఁగోరి యాచిన్నదే తన్నుఁ గొనిపోవుటకుఁగల వివిధమార్గములను మాకుపదేశించినది. ఆమె చెప్పిన యుపాయమునను సరించి తగినంతమందిని పల్లకిమోచువారిని నియమించి, లక్ష్మీనరసింహముగారు దయాపూర్వకముగా నిచ్చిన యిద్దఱు భటులను తోడిచ్చి మామిత్రులయిన నల్లకొండ కోదండరామయ్యగారిని మనోహరము పంతులుగారికి వ్రాసియిచ్చిన యుత్తరముతో పిఠాపురము పల్లకిలోఁ బంపి, ఆచిన్నదానిని రాత్రివేళ సంకేతస్థలములోఁ గలిసికొని పల్లకిలో నెక్కించుకొని తెల్లవారునప్పటికి రాజమహేంద్రవరము తీసికొనివచ్చి మాయింట విడుచునట్లు తగినయేర్పాటులన్నియు చేసితిమి వివాహ మగునన్న నిశ్చయముతో నే నావఱకే చెన్నపట్టణమునుండి వేయిరూపాయలను తెప్పించి యాత్మాగి లక్ష్మీనరసింహముగారియొద్ద నుంచితిని. ఈ సందేశమునకయిన వ్యయమును వారే యాసొమ్ములోనుండి చేసి నాకు లెక్క వ్రాసియిచ్చిరి. కొందఱు వెళ్ళినచోట నేర్పుతోఁ గార్యములను సాధించుకొనివత్తురు. కొందఱు బుద్ధిమంతులయ్యును నుపాయప్రయోగనైపుణ్యము చాలక కార్యసాఫల్యమును బొందరు. ఈసంగతి యేలాగుననో కొంచెము పొక్కి ఆచిన్నదానిబంధువులకు ముందుగాఁ దెలియఁగా వారు జాగరూకులయి యుండుటచేతను, అక్కడకుఁ బోయిన మామనుష్యుల తెలివితక్కువచేతను, ఆయేర్పాటులేవియు సరిగా జరగక వ్యయప్రయాసములకు లోనయి మావారు పోయిన దారినే పట్టిచేతులతో మరలి రావలసినవారయిరి. నాయుత్తరమునకు బదులుగా మనోహరము పంతులుగారిట్లు వ్రాసిరి.

"My dear friend.

మీరు వ్రాయించిన యుత్తర మంది అందులసంగతులు విశద పఱచుకున్నాను. ఈసారి యయినా మనము తలుచుకున్న కార్యము సఫలముకానందున మిక్కిలి విచారించుచున్నాను. ఈకార్యపోవుట ముఖ్యముగా మీరు పంపిన మనుష్యులతెలివితక్కువ నడవడికచేతనే యయినట్టు నేను స్పష్టముగాఁ జెప్పగలను. వాళ్ళనడవడిక మీనోటీసు లోనికి తీసుకొనిరావడపు వుద్దేశ్య మేమనఁగా యిటుమీదట యెప్పటికీ యిట్టివాళ్ళను ఉపయోగపర్చకుందురని తలుస్తాను. రాత్రి 10 గంటల వరకు కోదండ్రామయ్య వగయిరాలను మాయింట్లో నుంచుకుని పిమ్మట సవారీబోయీలను ఊరిబైట సిద్ధముగావుంచి ఒకరుమాత్రము చిన్నదాని అరుగుమీద పరుండవలసినదనిన్నీ ఒకరాత్రివేళ ఆచిన్నదే వచ్చి లేపుతుందనిన్నీ చెప్పివున్నందుకు ఆప్రకారముచేయక యిద్దరు మనుష్యులు వాళ్ళగుమ్మమువద్దకు వెళ్ళి వాళ్ళగుమ్మమెదుట యిటూ అటూ టలాయిస్తూ తలుపుకొట్టినారు. ఎక్కడినుంచో తమరు తీసుకునివచ్చిన రెండువుత్తరాలు వాళ్ళగుమ్మములోఁ బారవేసినారు. ఈ సంగతులన్నీ ఆగుమ్మముయెదుటనున్న వెంకటనరసన్న వగయిరాలు చూచి యెవళ్ళో యీలాగునచేసినట్లు నాతోఁ జెప్పినారు. అందుపై వాళ్ళు మేలుకుని వెలుపలికివచ్చి వీళ్ళవెంట మనుష్యులను పంపినారు. అదివరకే అనగా ఆదివారమునాటికే మనవుద్దేశముకాకినాడలోఁ దెలిసినది. ఒకనుమ్మార్తను ఆదివారము రాత్రి మేము చిన్నదాన్ని రాజమండ్రి తీసుకొనివెళ్ళుతాము జాగ్రతగా వుండవలసినదని చిన్నదాని తండ్రిపేర వుత్తరము వ్రాసినాడు. ఆలాగున వ్రాసినా చిన్నది యేలాగునసైనా ఒకరాత్రివేళ వస్తాననిన్నీ ఒక మనిషిమాత్రము మరుగుమీద పరుండబెట్టవలసినదనిన్నీ చెప్పినది. ఆప్రకారము జరగలేదు. కాకినాడనుంచివచ్చిన వుత్తరముప్రకారము మనుష్యులు వచ్చినందున

యింటివాళ్ళు తెల్లవాళ్లు నిద్రపోలేదు. పైగా ఆరాత్రి యిక్కడికి వచ్చిన బంట్రోతులు తాగివున్నట్టు కనబడుతున్నది. ఈ పైనవ్రాసిన సంగతులకు నిదర్శనముగా చిన్నది వ్రాసిన వుత్తరాలు జతపర్చినాను. ఏలాగునైతేనేమి యీపని మేము చేయించినట్టు యింటివాళ్ళు అనుకోకుండా వాళ్ళకు విరోధిగా వున్నటువంటిన్నీ కాకినాడనుంచి వుత్తరము వ్రాసినటువంటిన్నీ మనుష్యుకు తనవుత్తరపురంగతులు నిజముగా వున్నట్టు యేర్పడేనిమిత్తమ ఆదివారము నాటిరాత్రి యెవరో మనుష్యుల చేత అల్లరి చేయించినట్టు అనుకునేలాగున చేయడమైనది. మేము మాత్రము యెవరివల్లనున్ను యిదివరకు అనుమానింపబడలేదు. చిన్నదానికి మాకు నుత్తర ప్రత్యుత్తరములు జరుగుతూ వున్నవి. చీకటిరాత్రిళ్లుగాచూచి ఒక మాసము రోజులు పోయినపిమ్మట ముహూర్తము యేర్పర్చి ఒకమనిషిని మీరు నాయొద్దకుఁ బంపినయెడల చిన్నదాన్ని పంపగలనని తోచుచున్నది. నాకు వీలైనప్పుడు పంపినపక్షమున ముహూర్తము కుదిరేవరకూ చిన్నదాన్ని దాచగలరా? ఒక వేళ పట్టుపట్టినయెడల యుక్తమయిన వయస్సు వచ్చినట్టు స్థిరపర్చగలుగుదురా? వ్రాయించవలెను. కోదండ్రామయ్య వగైరాలను చీవాట్లు పెట్టకోరుతాను. ఆచిన్నదానికివ్వవలసిన వుత్తరములు యేమైనా వున్నయెడల ఆసంగతి నాతోఁ జెబితే నేను medium ద్వారా అంద చేతును. వీళ్లు గుమ్మంలో పారవేసినవుత్తరములు చిన్నదానికిఁజిక్కినవి. ఆఉత్తరములు 1-2రోజులలో నే సంగ్రహించి తమతావునకుఁ బంపించుచున్నాను. ఈచిన్నదిగాక 4 గురు చిన్నవాళ్లు వున్నారు. వాళ్ళుకూడా నింపాదిమీద సందర్భించగలరని తోచుచున్నది................."

ఈప్రయాణమునకు లక్ష్మీనరసింహముగారి పరిజనుఁడు పట్టాభిరామస్వామిగారిచ్చిన యీక్రింది లెక్కలప్రకారము ముప్పదిమూడు రూపాయల ఆఱణాలయినవి.

| | | | | |
|---|---|---|---|---|
| జనం 1కి రు. 1-12. చొ॥ 13 బోయీలకు | రు. 22 | 12 | 0 |
| బంట్రోతులకు ... ... ... | 4 | 0 | 0 |
| కోదండరామయ్యగారికి ... ... ... | 5 | 0 | 0 |
| కాగడా ... ... ... ... | 0 | 8 | 0 |
| చమురు ... ... ... ... | 1 | 2 | 0 |

అందుమీఁద మేము చేసినప్రయత్నములను చిన్నదాని పేరును సమస్తజనులకు వెల్లడి యయిపోయినవి. ఎల్లవారును ఈవివాహము నకు విఘ్నము కలుగఁజేయుటకై చేయవలసిన ప్రయత్నముల నన్నిటిని జేసిరి. అయినను మా యుత్తరప్రత్యుత్తరముల సంగతిమాత్ర మెవ్వరికిని తెలియక రహస్యముగానే యుండినది. అందుచేత మేము మఱియొక యుపాయము నాలోచించి మావర్తన మెవ్వరికిని భేద్యము కాకుండునట్లు గోప్యముగా నిర్వహించి పరమ నిపుణుఁడును మాకుఁ బరమవిశ్వాసియునయి మాముద్రాశాలలోఁ బనిలోనుండినమునిసామిని పెద్దాపురమునకుఁ బంపితిమి. అతఁడెవ్వరికిని ననుమానము కలుగకుండ మార్గస్థునివలె నటించి రాత్రి వారి వీధియరుగుమీఁదనే పరుండి తన సందేశము నా చిన్నదానికిఁ దెలిపి నేర్పుతోఁ బనిచేసెను. అమావాస్య నాఁడు రాత్రి రెండుజాముల వేళ మబ్బుపట్టి చినుకులు పడుచుండఁగాఁ దనతండ్రికిఁ దలనొప్పి వచ్చుటచేత నుపచారములు చేయుచున్న తల్లి మొదలైనవారి నేమఱించి లఘుశంకకుఁ బోవుమిషమీఁద వీధిలోనికి వచ్చి యాచిన్నది మా మనుష్యునితోఁ దాను వచ్చుటకు సిద్ధముగా నున్న సంగతి తెలిపెను. అతఁడు వెంటనే యాచిన్నదానిని వెంటఁగొని బైలుదేఱి, కొంతదూరము పోయినతరువాత తానావఱకుఁ దీసికొనిపోయిన బట్టలా చిన్నదానికిఁ గట్టి పురుషవేషము వేసి, పగలు చూచుకొనివచ్చిన మాఱుమూలదారిని గాఢాంధకారములో వానలోఁ దడియుచుఁ బరుగెత్తి, కొంతదూర మాచిన్నదానినినడిపించియుఁగొంత

దూర మెత్తుకొని మోచియుఁ దెల్లవాఱునప్పటికి రెండామడలు నడచి, అక్కడ బండిచేసికొని మఱునాఁడు పగలు రెండుజాములవేళ నామెను మాయింటికిఁ జేర్చెను.

ఆచిన్నది యిల్లుదాటిన నాలుగైదునిమిషములకెల్లను తల్లి మొదలైన వా రామె తలిలిన సంగతి కనిపెట్టి చుట్టుపట్ల వెదక నారంభించిరి. ఆమె యిందునిమిత్తమే పోయినదని వారు గ్రహించి బంధువులతోడను పొరుగువారితోడను పరుగెత్తి యున్నిదారులను వెదకి యెందును గానక తిరిగి వచ్చిరి. అప్పుడు వారందఱును న్యాయవాదులతో నాలోచించి తమ నగ లెత్తుకొని పాఱిపోయినదని దొంగతనపు నేరము నారోపించి యాచిన్నదానిమీఁద పోలీసువారివద్ద ఫిర్యాదుచేసి యామెను పట్టుకొనుటకయి యారాత్రియే వారంటు పుట్టించిరి. ఆవారంటు నిచ్చినది మామిత్రుఁడైన గుమ్మడిదల మనోహరముపంతులు గారే. ఆయన వారంటు పట్టుకొనిపోయెడుభటునితో ముందుగాఁ గాకినాడకుపోయి నాలుగైదుదినము లక్కడనుండి రామకృష్ణయ్యగారి యిండ్లలో దేనిలోనైన నాచిన్నది దాచఁబడినదేమో విచారించి యక్కడలేదని రూఢిగాఁ దెలిసినపిమ్మటనే రాజమహేంద్రవరమునకుఁ బోవలసినదని చెప్పి, రహస్యముగా నాకాదినముననె తెలియునట్లు మనుష్యునిఁ బంపెను. నాకీవర్తమానము పాఠశాలలో నుండఁగా మఱునాటి మధ్యాహ్నము తెలియవచ్చినది. ఆసమాచారము తెలియరాఁగానే నేను సెలవుగైకొని వారంటు తప్పించుటకయి పోలీసు సూపరింటెండెంటుగారి కార్యస్థానమునకుఁ బోఁగా, ఆయన కాకినాడకుఁ బోయినట్టు తెలిసినది. అప్పుడింటికివచ్చి చిన్నదానిని భద్రపఱచి పోలీసిన్స్పెక్టరును గలిసికొని నేను మరల వచ్చుపర్యంతమును చిన్నదానిని వారంటుమీఁదఁ బట్టుకొనకుండునట్టు దిట్టపఱిచి, వెంటనే బండిమీఁద ధవళేశ్వరముపోయి పడవయెక్కి మఱునాటి మధ్యాహ్నమునకుఁ గాకి

నాడ చేరితిని. అక్కడ విచారింపఁగా సూపరింటెండెంటు ఉప్పుకొటా
రులను పరీక్షించుటకయి పెనుగుదురు గ్రామమునకుఁబోయినట్టు తెలి
సినది. అప్పుడు చింతమఱింత యెక్కువయయి భోజనములేని విచార
మును మఱచి పెనుగుదురు పోవుటకయి ప్రయత్నించుచుండఁగా, పో
లీసు సూపరింటెండెంటంతకుముందే మరలవచ్చి కాలువలోని తమ
పడవలోనున్నట్టును గంటసేపటిలోఁ జామర్లకోటకుఁ బోవనున్నట్టును,
వర్తమానము తెలిసినంతనె, ఆయెండలోఁ బరుగెత్తుకొనిపోయి సా
యంకాలము నాలుగుగంటలవేళ కాలువమీఁదిపడవలో దొరగారిని
సందర్శించి సంగతి విన్నవించితిని. అతఁడాచిన్నదానిని పట్టుకొనకుండ
పోలీసుద్యోగస్థుల కుత్తరువు పంపెదనని చెప్పి నన్నుపంపివేసెను. ఇఁక
పెండ్లికొమారుని తీసికొని పోవలసినపనియొకటి మిగిలియున్నది. అందు
చేతనే నాయనవద్దనుండి తిన్నగా హిందూపాఠశాలకుఁబోయి యక్కడ
నుపాధ్యాయుఁడుగానున్న యాతనిని కలిసికొని నావెంట రమ్మని పిలు
వఁగా నతఁడీయభియోగవార్తను వినుటవలనను జనులవలని భీతివల
నను కొంతజడిసి నావెంట రాకుండుటకయి కొన్ని సాకులు చెప్ప మొ
దలుపెట్టెను. కాని, నేనన్నిటికిని తగిన పరిహారములు చెప్పి, పాఠశాల
నుండియే తిన్నఁగా నేనాతనిని పడవవద్దకు బలవంతముగాఁ దీసికొని
పోయి నాగదిలోఁ గూరుచుండఁబెట్టుకొనఁగా, తన్నప్పుడు విడిచిపెట్ట
వలసినదని నతఁ డనేకవిధములఁ బ్రార్థించియు నేను పూనికను విడువ
నందున నామాట తీసివేయలేక నాతోవచ్చి మఱునాఁడు తెల్లవారిన
తరువాత తాను తొడుగుకొన్న యంగీయు తలగుడ్డయు నుత్తరీయమును
నాగదిలోనే యుంచి గురుశంకకుఁ బోయివచ్చెదనని నాతోఁజెప్పి
మేడపాడుదగ్గర పడవదిగి వెనుకకుఁ బారిపోయెను. నేనుమాత్రము
నాఁడు మధ్యాహ్నము రెండుగంటలకు రాజమహేంద్రవరముచేరి,
ముందుగా తంతివృత్తాంత కార్యస్థానమునకుఁబోయి పెండ్లికొమారుని

చర్యను కాకినాడలోని లచ్చిరాజుగారు మొదలైన మిత్రులకుఁ దంత్రీముఖమునఁ దెలిపి యింటికిఁబోయి మూఁడవనాఁ డపరాహ్ణ మైనతరువాత మూఁడుగంటలకు భోజనముచేసి, అప్పుడే రామకృష్ణయ్యగారు మొదలైన మిత్రులకందరికిని వచ్చిన మరలఁ బంపుటనుగూర్చి యుత్తరములు వ్రాసితిని. పెండ్లికుమార్తె మీఁదియభియోగ మామె వివాహము చేసికొనఁబోవుచున్న దన్న ద్వేషముచేత తెచ్చినదయినట్టు కనఁబడుచున్నందున, ఆమెను పట్టుకొనవలదని పోలీసువారికి సూచరించెం డెంటు వద్దనుండి వెంటనే యుత్తరువు వచ్చెను. తరువాత కాకినాడకు మనష్యులనుబంపి పెండ్లిజరగకుండఁ జేయుటకయి వివిధోపాయములను పన్నుచున్న విరోధుల ప్రయత్నముల కన్నిటికిని ప్రతిక్రియలుచేసి యిదేసమయమని పెండ్లికొమారుని బాధింపనెంచిన ఋణప్రదాతల చేతులనుండి యాతని విముక్తునిఁ జేసి పెండ్లికొమారితను జూచి మాటాడిపోవుటకయి తుద కాతనిని రాజమహేంద్రవరమునకు మరల రప్పించితిమి. ఈతనిని ఋణవిముక్తునిఁ జేయుటకయి యప్పుడిచ్చినవి యిన్నూరురూపాయలు. పెండ్లికొమార్తె యిల్లువిడిచిన మఱునాఁడు పెద్దాపురములోనివారు మేము యుక్తవయస్సు రానిపిల్లను సంరక్షకులవశములో దొంగిలించుకొనిపోతిమని నేరముమోపి యనుగటిదండవిధాయకునియొద్ద మామీఁద నభియోగము తెచ్చిరి. ఆదండవిధాయి యీయభియోగము వితంతువివాహసంబంధమున వచ్చినట్లు కనఁబడుచున్నదని మండలదండవిధాయకునకుఁ దెలుపఁగా నతఁ డాయభియోగమును తనయొద్దకు రప్పించుకొని విమర్శకయి సంయుక్తదండవిధాయకునియొద్దకు రాజమహేంద్రవరము పంపెను. నేను రాజకీయ వైద్యుని (Doctor) మాయింటికిఁ బిలిపించి యాయనచేత వధువును పరీక్షింపించి యాయనవలన వధువు పదునారేండ్లు దాటినదని నిర్ణయపత్రమును (Certificate) పుచ్చుకొంటిని. పెండ్లికుమార్తెతల్లి మొద

లగు బంధువులు మాయింటికివచ్చి యేడ్చియు కేకలువేసియు బెదరించియు బతిమాలియు బుద్ధులుచెప్పియు వాగ్దానములుచేసియు వధువును మరలఁ దీసికొనిపోవుటకయి నానావిధముల పాటుపడిరిగాని వారి ప్రయత్నములన్నియు విఫలము లైనందున వారు నిరాశులయి వెనుకకు మరలవలసినవారయిరి.

ఈసమయమునందు మాకు సహాయులయి యుండిన లక్ష్మీనరసింహముగారు సెలవుమీఁద బందరులో నుండిరి. గవరాజుగారు చెన్నపురమునుండి వచ్చి విశాఖపట్టణమునకు మా పనిమీఁద నే పోవలసినవా రయిరి. లోకములోఁ గష్టములమీఁద నే కష్టములు సంప్రాప్తము లగును. ప్రథమవివాహము చేసికొన్న గోగులపాటి శ్రీరాములుగారికిని భార్యకును సరిపడ లేదనియు; తల్లి యాచిన్నదానిని తనతోడఁ దీసికొనిపోవ సిద్ధముగా నున్నదనియు, ఆపుటకయి వెంటనే సాధనము లాలోచింపవలసినదనియు, పెద్దాపురపు వధువును తీసికొని వచ్చుటకయి మేము చేసినకృషి విఫలమయిన కాలములో విశాఖపట్టణములోని మిత్రులయొద్దనుండి నాకుత్తరములును తంతీవార్తలును వచ్చినవి. వరుఁడు మొదటినుండియు పట్టణములోనుండి నాచేత శిక్షితుఁడయి యింగ్లీషు విద్యాభ్యాసముచేసిన నవనాగరికుఁడు; వధువు మొదటినుండియు పల్లెలలో గ్రామ్యజనులలో నుండి విద్యాగంధము లేక మోటుదేశములోఁ బెరిగిన మృగప్రాయురాలు. ఇట్టి యీయుభయులకును ప్రతివిషయములోను భిన్నాభిప్రాయము కలిగి యైకమత్యము లేకపోవుచుండఁగా నింతలోఁ దల్లి కూతురివద్దకువెళ్ళి యామెపక్షమయి యల్లునిఁ దనకు దాసునిగాఁ జేసికొనవలెనని వివాదము లాడుటచేత తగవు లంతకంతకు హెచ్చి కాపురము చెడిపోవునంతటి దుస్స్థితికి వచ్చెను. విద్యాధికుఁడైన వరునకిచ్చి వివాహము చేయుట వలన నీప్రథమదంపతు లెంతో సుఖవంతులగుదురని నేను భావించి

తిని. తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచును. నేను మొట్ట మొదటనే యాచిన్నదానిని వివాహము నిమిత్తమయి నావద్దకు వచ్చుచుండిన యొక మోటువానికిచ్చి వివాహము చేసియుండినపక్ష మున, ఆదాంపత్యము నిజముగానే సుఖవంతమయి యుండియుండును. విశాఖపట్టణమునుండి తంత్రీవార్తలు వచ్చిన సమయముననే చెన్న పట్టణమునుండి తాము రైలు దేఱుచున్నామని గవర్రాజుగారు నాకుఁ దంతివార్తను బంపిరి. నేను వెంటనే కాకినాడకుఁబోయి యాయన యోడదిగెడు దినమున రేవువద్ద వేచియుంటిని. ఆదినమున పొగ యోడ కాకినాడ చేరుటకు మిక్కిలి యాలస్యమయినది. మధ్యాహ్నము రెండుగంటల కాయన యోడదిగి పడవమీఁద దరిచేరునప్పటికి, నే నొద్దనుండి యాయనను కలిసికొని విశాఖపట్టణమునుండి వచ్చిన లేఖ లను తంత్రీవార్తలను జూపి శ్రీరాములుగారికిని భార్యకును పొందుపఱు చుటకయి విశాఖపట్టణము వెళ్ళవలసియున్నదని చెప్పితిని. చిరకాలము భార్య మొదలయినవారిని విడిచియుండి యిప్పుడు చూచి బంధు మిత్రాదులతో నిష్టసల్లాపసౌఖ్యము ననుభవింపఁగలుగుదు నను నాశతో నుండియు, ఆవఱకు రెండుదినములనుండి భోజనములేక క్షుదార్తుఁడై యుండియు, నామాటకు మాఱుపలుకక, తాను తెచ్చిన వస్తువులను నాకప్పగించి, మరల పడవనెక్కి యోడదగ్గఱకు నైదు మైళ్ళు సముద్రముమీఁదపోయి వచ్చిన యోడలోనే విశాఖపట్టణమున కాయన వెళ్ళెను. పరార్థమయి స్వసుఖత్యాగ మిట్లుగదా చేయవల యును! విశాఖపట్టణము చేరి దంపతులను సమాధానపఱుచుటకయి తామక్కడనుండి యెప్పటి సమాచారములప్పుడు నాకుఁ దెలుపుచుండిరి.

ఇచ్చట పెద్దికొమారుఁడు మామీఁద వచ్చియున్న వ్యవహా రముయొక్క పర్యవసానము తేలువఱకును వివాహమును నిలుపవల సినదని నన్నుఁగోరుచుండెను. అంతట వరునియొక్క యన్నగారు

రాజమహేంద్రవరమువచ్చి మంచిమాటలచేత నాతనిని తీసికొని పోవ లెనని యనేకోపాయములు చేసెనుగాని నామందఱ నాతనియుపాయములు సఫలములయినవికావు. అటుతరువాత వివాహ మగువఱకును మరలఁ బాఱిపోకుండఁ బెండ్లికుమారునిని కంటికి ఱెప్పవలెనొకరు విడిచి యొకరముకాచి, 1882-వ సంవత్సరము అక్టోబరు నెల 22-వ తేదిని బహు కష్టముమీఁద మూడవవితంతు వివాహముచేసి యీశ్వరానుగ్రహముచేత నిర్వహింపఁగలిగితిమి. ఈవివాహమునకు మాకు మొదటివివాహమునకంటెను పదిరెట్లు ప్రయాస మెక్కువయయినది. మొదటివలెనే యిప్పుడును రక్షకభటులు మాయిల్లు కావలికాయవలసి వచ్చెను విశేషవ్యయముచేసి యీ వివాహమును మొదటి దానికంటెను నధికవైభవముతో జరపితిమి. అంతధనవ్యయముచేసినను, ఇంతమంది రక్షకభటులు కావలికాచినను, ఊరేగింపు ఉత్సవసమయము సందాయుధపాణులయి యారక్షకభటులు పల్లకిచుట్టును నిండియున్నను దుష్టులు కొందఱు పెండ్లిపల్లకిమీఁద రాళ్ళు విసరిరి. పిమ్మట మాప్రతిపక్షులు తెచ్చిన యభియోగము విమర్శమీఁద డిశంబరు నెలలోఁ గొట్టుపడిపోయినది. విమర్శసమయమునందు పెండ్లికొమారితతండ్రి మాకావలఱకు వ్రాసియిచ్చిన యుత్తరమును జూపఁగా, తన్ను గదిలోపెట్టి కొట్టెదమని బెదరించి యాయుత్తమును బలవంతముగా వ్రాయించి పుచ్చుకొంటిమని చెప్పెను. అభియోగము కొట్టుపడిపోయిన తరువాత నతఁడు మాయింటికివచ్చి క్షమార్పణముచేసి, యీవ్యవహారము నిమిత్తమయి రాజమహేంద్రవరములో నుండవలసి వచ్చుటచేత తనకుఁ బదిరూపాయ లప్పయ్యెనని చెప్పఁగా నే నాపది రూపాయలు నిచ్చివేసితిని. వివాహనిర్వర్తన విషయమయిన యేర్పాటులుచేసిన మిత్రులు మొదటి వివాహమునకు వలెనే భోగముమేళమును కుదిర్చి నాకుఁ దెలియకుండ ముందుగా రెండురూపాయ లిచ్చిరి

యున్నందున, ఊరేగింపు సమయమునందు సహితము భోగము మేళము లేకుండఁ జేసితిని. ఈ వివాహముతోనే ప్రతిపక్షులగర్వము సగమడఁగెను గాని తరువాత జరిగిన నాల్గవవివాహముతో వారికిఁ బూర్ణముగా గర్వభంగమైనది. ఈవివాహవార్తను మిత్రులకును, పత్రికలకును తంతీ ముఖమునఁ దెలుపుటకయి నేను పెండ్లినాటిరాత్రి 15 రూపాయలు వ్యయపెట్టితిని. ఈ శుభవార్త తెలియఁగానే 24వ తేదిని గవరాజుగారు విశాఖపట్టణము నుండి నాకిట్లు వ్రాసిరి—

"ప్రియమిత్రుఁడా!

ప్రార్థించుచున్నాను. నాహృదయపూర్వకములైన సన్నేహాభినందనముల నంగీకరింపుఁడు చక్కఁగాఁ జేయఁబడినది. ఈశ్వరునకు వందనములు. నాసంతోష మనిర్వాచ్యమైనదిగా నున్నది. ఓర్పు సమస్తకష్టములను గట్టెక్కించునుగదా! కొందఱు మిత్రులు నిరాశనుపొందిరి. వారు మఱివివాహములు జరగవని తలఁచిరి. వారిఁకముందు వివాహములు జరగుట యసాధ్యమని భావించిరి వారికందఱికిని మీ రిప్పుడాశాభంగము ననుకూలముగాఁ గలిగించినారు. సంస్కారప్రియులని చెప్పబడువారియొక్క నిష్కాపట్యమును పరీక్షించుటకయి మఱియొక శోధనవచ్చినది. ఈయవకాశము వలన లాభమును పొందుటకయి మీరు తప్పిపోరని కోరుచున్నాను. అధమ మందఱిని తాంబూలములకైనను పిలువుఁడు. వారిని మీరీవఱకే పిలిచియుండనిపక్షమున, వివాహానంతరమునైనను చేయవేఁడుచున్నాను. పయియాదివారమున నిర్ణయింపుఁడు. మనబలమును మరలఁ గుదురుపఱుచుటకు మనశక్తిలో నున్న సమస్తసాధనములను మనము ప్రయోగించి చూడవలెను. మనము సంగీతసభను పెట్టవలెను. ఆదివారమునాఁడుగాని యంతకు ముందుగాని యీశ్వరేచ్ఛ యున్నయెడల నేను మీతో నుండెదను. పయి బుధవారమునాఁ డిక్కడి కొక పొగయోడ వచ్చునని నేనను

కొనెదను. ఆదివారము కాకపోయినను గురువారము నాఁడది యిక్కడ నుండును. సర్వదయాళుఁడైన యీశ్వరుఁడు మీప్రయత్నములకు జయము కలిగించునుగాక! ఏది వ్యతిరేకముగా నున్నను, ఈపక్ష మీశ్వరునిచేత నంగీకరింపఁబడిన పక్షమున విజయము నొందునని మనము దృఢముగా నమ్మియుండవచ్చును.''*

ఈవివాహమయినతరువాత అక్టోబరు 24-వ తేదిని కలకత్తా నుండి యీశ్వరచంద్రవిద్యాసాగరులవారిట్లు వ్రాసిరి.

“దేశముయొక్క మీభాగములో మొదటి బ్రాహ్మణ వితంతువుయొక్క వివాహనిర్వాహణమును గూర్చిన సమాచారమునకై నేను మీకెంతయు నుపకారస్మృతి కలవాఁడనై యున్నాను. ఇక్కడి వితంతువివాహనిర్వాహకులు ఈశుభవర్తమానమువలన మిక్కిలి సంతోషమును పొందియున్నారు. అదృష్టహీనులైన దుఃఖభాగినుల పక్షమున

---

* "Vizagapatam, 23rd October 1882.

Dear Friend,

Pray, accept my most sincere and warm congratulations. Well done! Thank God! My joy is inexpressable. You see patience surmounts all difficulties. Some friends dispaired. They thought no more marriages would take place. They thought it was impossible to perform any more marriages. Now you have agreeably disappointed all those. Here is another trial to test the sincerety of the so-called sympathisers. I hope you will not fail to make the most of this opportunity. Invite all for betalnut at least. If you have *not invited them already* pray do so after the marriage. Let next Sunday be the day. You see we must try all the means in our power to recruit our strength. You must have a singing party. On or before next Sunday I shall be with you God willing. A steamer is due here next Wednesday I suppose. If not she will be here on Thursday. May the All-Merciful God crown your efforts with success! We may rest assured in spite of anything that if the cause is approved **by God, it will succeed."**

మీయొక్క పరోపకారప్రయత్నములకు నిరంతరవిజయము కలుగును గాక యనుట.

మీసుహృదుఁడైన యీశ్వరచంద్రశర్మయొక్క సమాహిత ప్రార్థన."* కలకత్తానుండి యీశ్వరచంద్ర విద్యాసాగరులవారును, బొంబాయినుండి మహాదేవగోవిందరానడిగారును, నాతోడ నప్పుడప్పు డుత్తర ప్రత్యుత్తరములను జరపుచు శాస్త్రవిచారవిషయమున నాసందేహములను దీర్చుచు నాకెంతో సాయము చేయుచుండెడివారు.

ఈవఱకు జరిగిన వివాహములు మూఁడును లౌక్యులుగా నుండు నియోగిబ్రాహ్మణులలోను, మాధ్వబ్రాహ్మణులలోను జరిగినవి. వైదికులలో మాత్ర మింతవఱకు జరగనందున వారదిగొప్ప ప్రతిష్ఠగాఁ జెప్పుకొనుచుఁ దమవారిలో నట్టివివాహములు చేయించుట యసాధ్యమని దంభములు పలుకుచు వచ్చిరి. కాకినాడలో నుత్తమవైదికకుటుంబమునందు జనన మొంది చదువుకున్న యొకబాలవితంతు వుండెను. వెంకటప్పయ్యగారు వెనుక మాటాడినది యీ చిన్నదాని యన్నగారితోనే. ఈచిన్నది వివాహములు జరుగుచుండుట విని తాను కూడ వివాహము చేసికొనవలెనని మనస్సులో నెంతో యభిలాషపడుచుండెను. ఆచిన్నదాని యింటియెదుట నున్నయింటిలో, తంజావూరి చెలపతిరావుగారను నొక పెద్దమనుష్యుఁడు కాపుర ముండెను. ఆయ

* "Calcutta, 24th October, 82.

My dear sir, I am very much obliged to you for the information respecting the celebration of marriage of the third Brahmana widow in your part of the country. The friends of the marriage of Hindu widows here have been exceedingly delighted by this happy news.

May uniform success attend your benevolent exertions on behalf of the unhappy sufferers is the earnest prayer of

K. VIRESALINGAM ESQ., Yours sincerely,
Rajahmundry. ISWARA CHANDRA SARMA.

వకు మండలకరగ్రాహికార్యస్థానములో లేఖకోద్యోగము. ఆయన వితంతువివాహములయందు విశేషాభిమానముఁ గలవాఁడగుటచే జాలి పడి యాచిన్నది యొంటిగాఁ దమయింటికి వచ్చినప్పుడు వివాహవిషయ మైన ప్రసంగము తీసికొనిరాఁగా నామె తన యభీష్టమును దెలియఁ బఱిచెను. ఆచిన్నదానివిషయమై పనిచేయవలెనని యాయనను నే మేమును గోరితిమి. ఆయన యీవఱకే తాను పనిచేయుచున్నట్టు చెప్పి మాప్రార్థన నంగీకరించెను ఆచిన్నది యొకనాటిప్రాతఃకాలము నం దొంటిగా నున్నప్పు డాయనను కలిసికొని, ఆరాత్రి పెండ్లివారు తమవీధినుండి యూరేగునప్పుడు తన కీవలకు వచ్చుట కవకాశము కలు గుననియు, అప్పుడు తన్ను తీసికొనిపోవున ట్లేర్పాటు చేసినపక్షమున రాజమహేంద్రవరము వెళ్లుదుననియుఁ జెప్పెను. ఆయన యట్లే చేసె దనని చెప్పి యప్పుడే మూఁడవవివాహము చేసికొన్న మామిత్త్రునితోఁ గలిసికొని పల్లకినిబోయీలను సిద్ధముచేసి, చీఁకటిపడ్డ తరువాత పల్లకి నొక సంకేతస్థలమునం దుంచున ట్లేర్పాటుచేసి చిన్నదానిని పల్లకి వద్దకుఁ దీసికొని పోవనియమించిన మనుష్యుని ముందుగా నాచిన్న దానికిఁ జూపెను. ఆరాత్రి తొమ్మిదిగంటల కొకచోట నద్భుతమైన గారడివిద్య (Magic) చూపఁబడునని ప్రకటనపత్రికలు రాఁగా చెలపతి రావుగారు దానిని పొగడి ప్రోత్సాహపఱిచి యాచిన్నదాని యన్నను మేనమామలను దానినిపోయి చూచుట కొడఁబఱిచెను. ఆయన తాను ముందుగా భోజనముచేసి వారియింటికిఁ బోయి తొందర పెట్టి యెనిమిదిగంటలకే భోజనముచేయించి వారిని తన వెంటఁగొని గారిడీవిద్య ప్రదర్శించు స్థలములకుఁ బోయెను నాటివివాహము శ్రీపైడా రామకృష్ణయ్యగారి యింటనే. సుమారు రాత్రి పదిగంటల వేళ పెండ్లియూరేగింపు వారియింటిముందునుండి సాగెను. నియమింపఁ బడిన మనుష్యుఁడును పెండ్లిపల్లకితో నూరేగింపునకు ముందే నడుచు

చుండెను. పల్లకియు సంకేతస్థలమున సిద్ధముగా నుంచబడెను. పెండ్లి పల్లకి తమయింటిముందుకు రాగానే లోపలివారు గుమ్మముముందఱ నిలుచుండి వేశ్యలనృత్యగానములను చూచుచుండఁగా, ఆచిన్నదిసందు డిలో వెలుపలికివచ్చి తనరాకకయి యెదురుచూచుచుండిన మనుష్యుని వెంట నడిచి పల్లకిలోఁ గూరుచుండెను. తత్క్షణమే పల్లకిమోచువారా చిన్నదానినిగొని బైలుదేఱిరి. తెల్లవారునప్పటి కాకస్మికముగాఁ బల్లకి వచ్చి మాగుమ్మములో దిగఁగా మే మాచిన్నదానిని లోపలికిఁ దీసి కొనిపోయి భద్రముగా నుంచితిమి. చిన్నది కాకినాడ విడువఁగానే తృతీయవివాహవరుఁడైన రామారావుగారు నాకుఁ దంతీవార్తను పంపిరి. పెండ్లిపల్లకి తమ గుమ్మముదాటి దూరముగాఁ బోయినతరువాత నాచిన్నదానితల్లి మొదలయినవారు లోపలికిఁబోయి చిన్నది కనఁబడకపోఁగా పేరుపెట్టిపిలిచి యింటనంతయు వెదకి తొందర పడసాగిరి. కొంతసేపటికి మగవారు గారడీవిద్యను చూచి యింటికివచ్చి స్త్రీలవలన జరిగినసంగతి విని యాచిన్నది రాజమహేంద్రవరమే పోయినదని నిశ్చయించిరి. ఆచిన్నదాని యన్నగారును మేనమామలును కొందఱు బంధువులును రాజ్యోద్యోగములలోనుండి ప్రబలులుగా నున్నవారు, పినతండ్రులు మొదలైనవారు కొందఱు యజ్ఞాదిక్రతువులు చేసి పండితు లనిపించుకొనుచున్న శిష్టసంప్రదాయములోనివారుగా నున్నారు. ఆచిన్నదాని మేనమామ లారాత్రియే రాజమహేంద్రవరములోఁ దహశ్శీలుదారుగానున్న తమ బంధువైన తణికెళ్ళ జగన్నాథముగారికిని పోలీసువారికిని తంతీవార్తలు పంపిరి కాని వారెవ్వరును జోక్యము కలిగించుకొనక యూరకుండిరి. మఱునాఁడు పడవమీఁద బైలుదేఱి చిన్నదానియన్నయు, తల్లియు, మేనమామలలో నొకరును రాజమహేంద్రవరమునకు వచ్చి బంధువుల యింటదిగి మూడవనాటిమధ్యాహ్నము మాయింటికి వచ్చిరి. చిన్నదానితల్లి కొంతసేపు రోదనముచేసి కొమారితను తమవెంట రమ్మని బహువిధ

ముల బలిమాలుకొననుగాని చిన్నది వారికోరిక చెల్లింపక స్థిరచిత్తురాలయి నిరాకరించెను. అన్నగారేమియు మాటాడక తలవంచుకొని నిలుచుండెను. మేనమామ నన్ను చాటునకు పిలిచి మంచివరుని విచారించి వివాహము చేయవలసినదని చెప్పి, అంతమూర్ఖముగా నిరాకరించుచున్నదానితో సిగ్గులేక యేల మాటాడెదవని యప్పగారిపైని కేకలువేసి యప్పను మేనల్లునిని వెంటఁగొని మాయిల్లు వెడలిపోయెను. ఈ చిన్నదానికి వివాహము చేయు నుద్దేశించి యామె యన్నగారా వఱకు నాతో ననేకపర్యాయములు మాటాడి యుత్తరములు వ్రాసిన వాఁడయ్యును, బహిష్కారపత్రికలు వచ్చినతరువాత జడిసి వెనుకదీసి తాను కార్యము చేయుటకు సాహసింపలేకపోయెను. పులవర్తి శేషయ్య యను నొక వైదిక విద్యార్థి యుండెను. అతఁడా సంవత్సరము సర్వకలాశాలాప్రవేశపరీక్షకుఁ బోయియుండెనుగాని ఫలిత మింకను తెలియలేదు. అతఁడు పరీక్షానంతరమున తన్నగారియొద్దకు గ్రామాంతరము పోయి యుండఁగా మనుష్యుని బంపి యాతనిని పిలిపించి యీ చిన్నదాని నాతనికి 1883-వ సంవత్సరము జనవరి నెల 3-వ తేదిని వివాహము చేసితిమి. ఈ వివాహమునాటికి లక్ష్మీనరసింహముగారు బందరునుండి తిరిగి వచ్చినవారయి సహాయులయిరి. ఈవరుఁడు శుద్ధశ్రోత్రియవంశమునందుఁ బుట్టి వైదికవృత్తియందున్న యన్నలునుతండ్రియుకలవాఁడు. దేశాభిమానము కలవారయి యిట్టి ప్రజాక్షేమకరములైన కార్యములందు నుత్సాహముకలిగి సర్వవిధముల నాకు సహాయులుగానుండిన విద్యార్థులలో నితఁ డొకఁడు; తరువాత పదవవితంతువివాహము చేసికొన్న నల్లగొండ కోదండరామయ్యగా రింకొకఁడు. ఇటువంటి విద్యార్థుల కనేకులకుఁ బాఠశాల జీతములు మొదలుగునవిచ్చి యనేకవిధముల సాయము చేయుచుండెడివాఁడను. ఈ యువపురుషుని తల్లిదండ్రులు స్వజాతికన్యలనుకుదిర్చి వివాహములు చేయఁ బ్రయత్నించినప్పుడు చేసికొనక నిరాకరించిన ధైర్య

శాలులు. ఇట్టివారనేకులుండిరి కాని వారిలో నెవ్వఁడును తరువాతవితంతు వివాహములను చేసికొన్నవారు కాకపోవుటచేత వారినామము లిం దుదాహరించుట యనావశ్యకము. ఆకాలమునందు విద్యార్థులు మాకుఁ జేసినసాయమును నేనెన్నటికి మఱవఁజాలను. ఈవిద్యార్థులలోఁ గొం దఱు లోకోపకార కార్యాసక్తులయి యగ్నిహోత్రములో దూఁకుమన్నను దూఁకుటకు వెనుకతీయని వారుండిరి. వారేయర్ధరాత్రమున నెంత దూరమునను న్న గ్రామమునకుఁబోయి యెవ్వరితో మాటాడి యేకార్యమును చేసికొని రమ్మన్నను మాఱుమాటాడక చెప్పినట్లు చేసికొనివచ్చుచుండిరి. ఇటువంటివారి తోడ్పాటువలననే మే మనేక కార్యములు నిర్విఘ్నముగా నిర్వహింపఁగలిగితిమి. ఇట్లు కష్టములమీఁద నిర్వహింపఁబడిన యీ రెండువివాహములకు నత్యాశ్చర్యపడి పైడా రామకృష్ణయ్యగారు మొదలైనమిత్రులు మాకనేకాభివందనపత్రిక లను బంపిరి. రామకృష్ణయ్యగారి యభినందనలేఖలలో నొకదానినుండి కొన్ని పంక్తు లిచ్చట నుదాహరించుచున్నాను.—"ఈయభినందనపంక్తు లను మీకు రాత్రి 11 గంటలకు వ్రాయుచున్నాను............... (చిన్నమనుష్యులైన) మీరును గవర్రాజుగారును మనయద్భుత సాహసికమిత్రుఁడైన బి. సో. బి. యల్. లక్ష్మీనరసింహముగారి సాహాయ్యమను డాలుతో ప్రవాహమునకు విరోధముగాఁ బోరాడుచు బ్రహ్మాండమైన పనిలో విజయమొందినారు. దేవునకు వందనములు దేవుఁడు మీకండఁగా నుండుఁగాక. నాహృదయవాంఛల కొన్నిటితో మీకొఱకీలేఖ వ్రాసితిని. ఓవీరేశలింగముగారూ! మీ పేరును స్థాపించి యీప్రపంచములో ముందుకు దానిని శాశ్వతము చేసియున్నారు. దేవుఁడు మీకు మంచి యారోగ్యమునియ్య ప్రార్థించుచున్నాను."*

---

* "I am writing you these congratulating lines at 11 O,clock in the Night. * * *

You and Gavarrazu Garu (the *little* men) have suc. ceeded a monstrous thing fighting against the current with the aid of the shield of our admirably bold friend

ఈనాలవవివాహమయిన పిమ్మట ప్రతిపక్షులు తమప్రయత్నములవలనఁ గార్యము లేదని తెలిసికొని నిరుత్సాహులయి ప్రత్యక్షముగా బాధించుటకును కార్యవిఘాతముచేయఁ బాటుపడుటకును మానుకొని యుపేక్షాపరులు కాసాగిరి. అవఁజుకు వీరు నాప్రాణములకు సహిత మెగ్గుతలఁచిరి. పిండిబొమ్మలు చేసి వానికీళ్ళలో ముళ్లుగ్రుచ్చి పసుపుతోను పిండితోను ముగ్గులుపెట్టి రాత్రులు మావీధిగుమ్మముముందు పెట్టుచుండిరి. వీధిలోఁ జేసిన యీప్రయోగముల వలనఁ బ్రయోజనము కలుగకపోఁగా రాత్రులు నిచ్చెనలువేసికొని మాదొడ్డిలోనికే దుమికివచ్చి దొడ్డిలోనున్న దానిమ్మచెట్టునకే యీపిండిబొమ్మలను కొబ్బరికాయముక్కలను కట్టఁదొడఁగిరి. తెల్లవాఱినతరువాత మాముద్రాయంత్రములోని పనివాండ్రు కొబ్బరిముక్కలను తినుచువచ్చిరి. శత్రువులెన్ని మారణకర్మలు చేసినను భగవదనుగ్రహమువలన నేను నిరపృవ్వాడనై యథాప్రకారముగానే తిరుగుచుంటిని. నాకును గవర్రాజుగారికిని బాల్యమిత్రుఁడయిన గాడేపల్లి సుబ్బయ్యగారు కొన్నిమాసములకిందట నన్నుఁ జూచుటకయి మాయింటికి వచ్చినప్పుడు వెనుకటి సంగతులు ముచ్చటించుచు పగలుసహితము నేనొంటిగా వీధిలోనికిఁ బోయి మసలినప్పుడు నేను తిరిగి యింటికి వచ్చువఱకును నాకేమి యపాయము సంభవించెనోయని భయపడుచుండెడివారమని చెప్పిరి.

బాలవితంతువులతోను వితంతువులసంరక్షకులతోను మాటాడి వారిని ప్రోత్సాహపఱిచి సంస్కారవ్యాపనముఁ జేయు నిమిత్తమయి నెల కెనిమిదిరూపాయలు జీతమేర్పఱిచి సంపర వెంకన్నగారిని నియ

---

B A. B.L. A. Lakshminarasimham Garu. Thank God. God will help you all. With a few of my heart's wishes, I wrote this note for you. You Veerasalingam Garu, you have established your name and immortalized it in this world to come. Pray God give you good health."

మించితినని చెప్పితినిగదా! ఆయన యీవితంతువుతో మాటాడితి ననియు, ఆవితంతువుతో మాటాడితిననియు, ఈసంరక్షకుని ప్రోత్సాహపఱిచి యొప్పించితిననియు, ఆసంరక్షకుని ప్రోత్సాహపఱచి యొప్పించితిననియు, చెప్పుచు అక్టోబరు నెలనుండి నావద్ద మూఁడునెలలజీతము పుచ్చుకొనెను. ఆవితంతువుమాట యీవితంతువుమాట యటుండఁగా పదునెనిమిదేండ్లప్రాయముగల యాయనకూతురైన తనయింటి వితంతువే నాలవనెలలో మాయింటికిఁ బరుగెత్తుకొనివచ్చి తనకుఁ బతిభిక్షపెట్టుమని నన్ను వేఁడుకొనెను. తండ్రియైన సంపర వేంకన్నగారు కొమారితవెంటనే మాయింటికిఁ బరుగెత్తుకొనివచ్చి విలపించుచు, మరల తన కొమారితను తనవెంటఁ బంపివేయవలసినదనియు, తనకు వంటచేసిపెట్టుటకు వేఱు దిక్కులేదనియు నన్ను వేఁడుకొనెను. వంటచేసిపెట్టుటకు వేఱొక పనికత్తెను కుదుర్చుకోవలసినదనియు లేక పోయినయెడల నుద్యోగములోనున్న కొడుకువద్దను కోడలివద్దను నుండవలసినదనియు హితము చెప్పి పనినుండి తొలఁగించి కొమారితను మాయింటనే యుంచుకొని యాయన నొక్కనిని మాత్రమే పంపివేసితిని. ముంజులూరి వెంకట్రామయ్యగారు ప్రాయశ్చిత్తము చేసికొని కుటుంబసహితముగా వెడలిపోవునప్పు డిరువదియేండ్లవయస్సుగల తన తమ్ముని మాయింట దిగవిడిచిపోయిరి. నేనాతనిని మాముద్రాక్షరశాలలో నక్షరములు కూర్చుపనిలోఁబెట్టి నెలకాఱురూపాయ లిచ్చుచుంటిని. గోపాలమను పేరుగలయీతఁడు తనకు వివాహము చేయవలసినదని పలుమాఱు నన్ను తొందరపెట్టుచుండెను. అతని కెనిమిది రూపాయలు జీతముచేసి, నాలుగవవివాహమయిన యిరువదియేమదినములకనగా 1883-వ సంవత్సరము జనేవరు నెల 30-వ తేదిని కొత్తగావచ్చిన వితంతువు నాతనికిఁ బెండ్లిచేసితిని. ఆసంవత్సరము గోదావరి పుష్కరసంవత్సరము. ఆవఱకుఁ దలవెంట్రుకలున్న బాలవితంతు

వులను సంరక్షకులు రాజమహేంద్రవరము తీసికొనివచ్చి గోదావరీతీరమున శిరోజములుతీయించి విరూపిణులను చేయుదురు. ఆయాచారమునుబట్టి పదునేడేండ్ల యీడుగల యొకవైదిక వితంతువును తల్లియు నన్నగారును రాజమహేంద్రవరమునకుఁ దీసికొనివచ్చి గోదావరియొద్ద నున్న సత్రములో దిగియుండిరి. ఇఁక తెల్లవాఱిన శిరోజములు తీయింతురనఁగా నారాత్రి యెట్లో యాచిన్నది తనవారి నేమఱించి తప్పించుకొనివచ్చి నన్ను శరణుజొచ్చెను. పూర్వభర్త యుపాధ్యాయోద్యోగములో నుండినవాఁడే యయినను, తన ప్రస్తుతావస్థనుబట్టి తానొంటి బీదవాఁడుగ నుండిన వాని నైనను వివాహముచేసికొన సంసిద్ధురాలనయి యున్నదాననని యాచిన్నది నన్ను దీనముగా వేఁడుకొనెను. మా ప్రాతపురోహితుఁడైన రామసోమయాజులు ప్రాయశ్చిత్తము చేయించుకొని పాఱిపోఁగా, విధురుఁడైన చెలికాని నారాయణమూర్తి యను నతని పురోహితునిగా నేర్పఱుచుకొంటిమి. అతఁడు తిన్నగా మంత్రములు వచ్చినవాఁడు కాకపోయినను మేమతనితోడనే గడుపుకొనుచుంటిమి. ఆదినమున 23 సంవత్సరముల ప్రాయముగల యాతని మేనల్లుఁ డొకఁడు అమలాపురమునుండి రాజమహేంద్రవరము మీఁదుగా కాకినాడకుఁ బోవుచు మేనమామను చూడఁబోయెను. మేనమామ మేనల్లుని వితంతు వివాహము చేసికొమ్మని ప్రోత్సాహపఱుపఁగా నతఁ డందుల కంగీకరించెను. క్రొత్తగా నొకవితంతువు వచ్చినదని విని మాపురోహితుఁ డామెను తానైనను వివాహముచేసికోవచ్చుననియు, తనకు సహాయుఁడుగా నుండునుగాన మేనల్లునికైనను వివాహము చేయవచ్చుననియు, ఆలోచించి తన మేనల్లుని వెంటబెట్టుకొని మధ్యాహ్నము నావద్దకువచ్చి తనయభిమతమును దెలుపఁగా, నే నాచిన్నదానికి వారిరువురనుజూపి, యితఁడు పురోహితుఁడు రెండవ యాతఁడు వంటబ్రాహ్మణుఁడు వీరిలో నెవ్వరినైన పెండ్లిచేసికొనుట

కిష్టమున్నదా యని యడిగితిని. పడుచు వాఁడైనందున రెండవ యతనినే వివాహము చేసికొనెదనని యామె చెప్పెను. నేను వెంటనే శతమానములు చేయించి యారాత్రియే వారికి వివాహము చేసితిని. వివాహమాడిన యతనిపేరు చేబోలు వెంకయ్య. ఆఱవదియైన యీ వివాహము 1883-వ సంవత్సరము మార్చినెల 13-వ తేదిని నడచినది. వరుఁడావఱకు అమలాపురములో న్యాయవాదిగానున్న పేరి విస్సయ్యగారివద్ద వంటబ్రాహ్మణుఁడుగా నుండెను. ఆన్యాయవాది స్థలనిధిసంఘములో సభికుఁడుగానుండి రెండుదినములలో కాకినాడలో జరగఁబోయెడు సభకుఁ దాను వెళ్ళునప్పటికి వంటచేసి సిద్ధముగా నుంచుటకయి యొకదినము ముందుగాఁ దన బ్రాహ్మణునిఁ బంపెను. ఆబ్రాహ్మణుఁడు నాటియుదయమున పగలు పదిగంటలకు రాజమహేంద్రవరములోఁ బడవదిగి మేనమామను చూచి సాయంకాలము కాకినాడపడవకుఁ బోవలెనని తలఁచుకొని వచ్చెనుగాని యింతలోఁ గళ్యాణము తోసికొని వచ్చినందున గోదావరీక్షేత్రమహిమనుబట్టి బ్రహ్మచారిగా వచ్చినవాఁడు గృహస్థుఁడుగా మాఱుట తటస్థించెను. విస్సయ్యగారు కాకినాడ మఱునాఁడుచేరి యింట వంటప్రయత్నములేకపోఁగా మా వంటబ్రాహ్మణుఁడు రాలేదాయని యచ్చటివారిని విచారించెను. వారు గతరాత్రియే రాజమహేంద్రవరములో మీబ్రాహ్మణుని పెండ్లియైనదని చెప్పగా నద్భుతపడి, సభముగిసి స్వగ్రామమునకుఁ బోవునప్పుడు మాయింటికి వచ్చి నన్నుచూచి వధూవరుల నాశీర్వదించి పోయెను. అయిదవ వివాహమునకు వంటబ్రాహ్మణుఁడు లేచిపోగా నా భార్యయే గోదావరినుండి నీళ్ళు మోచుకొనివచ్చి వంట మొదలైన పనులెల్లను స్వయముగాచేసి యెంతో కష్టపడవలసిన దయ్యెను. ఈ కార్యములయందు నావలెనే నాభార్యయు బద్ధాదరముకలదయి సర్వకష్టములను సంతోషపూర్వకముగా సహించి నన్ననుసరించుచు సహా

ధర్మచారిణి యన్నపే రన్వర్థము చేయుచుండెను. నా భార్యయొక్క యానుకూల్యమే లేక యుండిన యెడల నే నిన్ని కార్యములను నిరంతరాయముగా నిర్వహింప లేకయుందునేమో! ఈవివాహము వంటలు మొదలైనవి చేయఁగలిగిన శ్రోత్రియ బ్రాహ్మణునకే చేసి వంటబ్రాహ్మణులవలని బెదరింపులను తప్పించుకోఁగలిగితిమి. బ్రాహ్మణులలో వివాహములు తఱచుగా జరగుచుండుట విని యొక వైశ్యవితంతువు తన కొమార్తెయైన పదేండ్ల యీడుగల బాలవితంతువును దీసికొనివచ్చి పరిణయము చేయవలసినదని నా పాదములమీఁదఁ బడియేడ్చెను. వివాహము చేసికొనెదనని యావఱకే నావద్దతిరుగుచున్న యిరువదియేండ్ల యీడుగల బోడా శ్రీరాములనుకోమటిచిన్నవాని కిచ్చి యాచిన్నదానిని 1883-వ సంవత్సరము ఏప్రిల్ నెల 1౹-వ తేదిని వివాహము చేసితిని. ఏడవదియైన యిదియే మొదటివైశ్యవితంతువివాహము. మూడవదియైన మాధ్వవివాహము జరిగినప్పుడు పల్లకిచుట్టును రక్షకభటులు కావలియున్నను రాళ్ళు రువ్విన కాలము పోయి, ఏడవదియైన యీకోమటి వివాహము జరుగునప్పటికి ఒక్క విద్యార్థులయొక్క సాయముతక్క రక్షకభటులయొక్క సాహాయ్యమక్కఱలేకయే దంపతులను రాత్రివేళ వీధులగుండ నిర్భయముగా నూరేగింపఁగలిగిన కాలము వచ్చినది.

ఈ ప్రకారముగా నెలకును రెండేసి నెలలకును రాజమహేంద్రవరములో వెంబడివెంబడిగావివాహములు జరగుచుండుటచూచి, చెన్నపురములోని నామిత్రులు పళ్ళె చెంచలరావుపంతులుగారును దివాన్ బహదూరు రఘునాధరావుగారును వివాహము లెల్ల రాజధానిలో నొకమూల నున్న రాజమహేంద్రవరములో జరుగుటకంటె కొన్నియైనను రాజధానిలోనే జరగుట యధికాభ్యర్థనీయ మగుటచేతనొకటి రెండు వివాహములను చెన్నపట్టణములో జరప వలసినదని నన్నును రామకృష్ణయ్యగారిని కోరిరి. నేను వారి యాజ్ఞను శిరసావహించివారి

యభీష్టమును చెల్లించుటకుఁ గృతనిశ్చయుఁడనై సాధ్యమైనయెడల నొక రిద్దఱు వధూవరులను సమకూర్చి చెన్నపట్టణములో వివాహముచేయుటకుఁ బ్రయత్నించెదనని వారిపేర వ్రాసితిని. రాజమహేంద్రవరములోని బ్రాహ్మణవిద్యార్థి యొకఁడు క్రొత్తగాఁ బెండ్లి చేసికొని కాలధర్మము నొందెను. ఆతనియుప్పుగారు మాయింటిసమీపముననే కాపురముండి యప్పుడప్పుడు మాయింటికి వచ్చుచుండెను. ఆమె నొకసారి మీ తమ్ముని భార్య యెక్కడ నున్నదని యడుగఁగా గుంటూరుమండలములోని యొకపల్లె యందున్నదని చెప్పి, తన మఱఁదలుమాత్రమే కాక మఱఁదలి చెల్లెలు సహితము విధవ యయ్యెనని చెప్పెను. వారికి వివాహము చేయింపరాదా యని నే నడుగఁగా తనకుఁ బ్రయాణవ్యయములను, కొంతబహుమానమును ఇచ్చెడుపక్షమునఁ బిల్లల తల్లితో మాటాడి యామె నిచ్చటికిఁ దీసికొనివచ్చెదనని చెప్పెను. నే నందున కంగీకరించి దారిబత్తెమున కియ్యఁగా నామె నాతోఁ జెప్పినట్లు తల్లిని గొనివచ్చెను. తల్లితో మాటాడి యామె యంగీకారమును బడసి యామెను మరల గుంటూరుసమీపముననున్న పల్లూరికిఁ బంపి యిద్దఱు వితంతుకన్యలను బిలిపించితిని. రెండుసారులు వెళ్లినందుకును తల్లి వారిని వెంటఁబెట్టుకొని వచ్చినందునకును నలువది రూపాయ లయినవి. వితంతువులను తీసికొనివచ్చుటకయి ప్రయాసపడిన యామెకు దారిబత్తెములతోఁ గూడ నలువదిరూపాయల నిచ్చితిని. తరువాత చలపతిరా వనునతఁ డొకఁడును, బేతపూడి ప్రకాశరా వనునతఁ డొకఁడును నిద్దఱువరు లావఱకే మాయింట నుండిరి. ఈ బాలవితంతువులలోఁ బెద్దచిన్నదాని వయస్సు పండ్రెండేండ్లు; ఆమె చెల్లెలివయస్సు పదేండ్లు. ఈ వధువుల నిద్దఱిని నాయొద్దనున్న వరులకిచ్చి చెన్నపట్టణములో వివాహములుచేయ నిశ్చయించి అక్కడి మామిత్రద్వయమునకు నీశుభవార్తను దెలిపి, యిద్దఱువరులు వధు

వులు పురోహితుఁడు వంటబ్రాహ్మణుఁడు మొదలైనవారిని వెంటఁ బెట్టుకొని భార్యాసహితముగా పొగయోడ నెక్కుటకు నేను కాకినాడకు వెళ్ళితిని. రఘునాధరావుగారు రావలెనే తమ స్వశాఖవారు వంటచేసినఁగాని తాను భోజనము చేయనని నాకు వ్రాసిరి. అందుచేత వంటచేయుటకయి నేను కాకినాడలో నున్న మాధ్వపంతులను గూడఁ బ్రయాణము చేసితిని. నా యుత్తర మందఁగానే చెంచలరావు పంతులుగారు రఘునాథరావుగారియుత్తరమును బంపుచు రావలదని కాకినాడకుఁ దంతివార్తను బంపిరి. అందుచేత మేము నాఁటి పొగయోడను విడిచిపెట్టి వారముదినములు కాకినాడలో నిలువవలసి వచ్చినది. రఘునాథరావుగారియొద్దనుండి వచ్చిన యుత్తర మిది—

"మైలాపురము, 28-వ మెయి 1883 నా ప్రియమైన అయ్యా!

మీయుత్తరములందినమీఁదట సమాజసభ్యులయొక్క విశేష సభను మేము సమకూర్చితిమి. సభకు వచ్చిన 30 సభ్యులలో 18 బ్రాహ్మణులుగా నుండిరి. వారందఱును వివాహమునకు వచ్చి తాంబూలములు పుచ్చుకొనుట కిష్టముగా నున్నారు. భోజనవిషయమును నిశ్చయముగా శూద్రసభ్యుల కాక్షేపణ లేదుగాని, అది మనకంత యుపయోగము గాదు. బ్రాహ్మణసభ్యులలో నొకవేళ సులభముగాని షరతులమీఁద నెప్పుడు భోజనము చేయుట కిష్టముగా నున్నవారత్యల్పసంఖ్యాకులు. ఈసంగతులనుబట్టి మద్రాసులో వివాహము జరపుట అవివేకమగునట్లు నాకుఁ గనఁబడుచున్నది. అయినప్పటికిని కొంచెముముందు వచ్చుటలోఁ బని లేదని మీరు తలఁచెడుపక్షమున, మీరు రావచ్చును. మే మిల్లు సులభముగాఁ గుదుర్పఁగలము."*

---

* "Mylapore, 28th May 1883.

My dear sir,

On the receipt of your letters, we convened an extraordinary meeting of the members of the Association. 30 members attended of whom 18 were brahmins. They are all

ఈ యుత్తరము రాఁగానే నేను వివాహములను చెన్నపట్టణము లోనే చేయ నిశ్చయించుకొనియున్నాను గనుక వెంటనే యిల్లు కుదుర్చవలసినదని ప్రత్యుత్తరము వ్రాసి, జూను నెల 2-వ తేదిని "పదుముగ్గురము నేఁడు మద్రాసునకు రైలు దేఱుచున్నాము. ఇల్లు కుదుర్చుఁడు" అని తంతివార్త నంపి, మేము పదుమువ్వురము నాటిసాయంకాలమున పోయెడి రాత్రిబండిలోనే చెన్నపట్టణమునకు రైలు దేఱితిమి. దారిలో గాలివాన వచ్చుటవలనను, ప్రతికూలవాయువులవలనను, 4-వ తేది ప్రాతఃకాలమున నాలుగు గంటలకుఁ జెన్నపురి చేరవలసిన మా బండి మధ్యాహ్నము రెండుగంటలకుఁ జేరెను. మాకొఱకు స్టేషనులోని కెవ్వరును రాలేదు; మేమే పదుముగ్గురముగూడి మొట్టమొదట దిగితిమి కాని యక్కడ సహాయము నిమిత్త మెవ్వరును వేచియుండలేదు. ఇల్లు కుదిర్చెనో లేదో, మేమేమి చేయవలెనో, ఎక్కడకుఁ బోవలెనో, తెలిసినది కాదు. అందుచేత మావారి నందఱిని అక్కడనే నిలిపి నేనొక్కఁడను దాని సమీపముననే యున్న చెంచలరావుపంతులుగారి కార్యస్థానమునకుఁబోయి మా యవస్థను దెలిపితిని. ఆయన యద్భుతపడి రఘునాథరావుగారు స్టేషనున మా నిమిత్తము మనుష్యుల నుంచలేదా యని యడిగి జరిగినపనికి మిక్కిలి నొచ్చుకొని, కొంత విచారణము చేసి, రఘునాథరావుగారి యింటిప్రక్కనే యిల్లు కుదుర్చఁబడెనని

willing to attend the marriage and take betel-nut. As regards dining, of course, Sudra members have no objection which is not of much use to us. Of the Brahmin members very few are willing to dine but on conditions which it is not easy to secure. Under these circumstances, it seems to us that it would be unwise to celebrate the marriage at Madras. If you, however, think that the scanty attendance is of no consequence, you are welcome and we can easily arrange for a house.

Yours truly,
R. RAGOONATH ROW.

చెప్పి, ఆయింటికి మమ్ముఁ గొనిపోవుటకయి యొక భటు నిచ్చెను. మేము గుఱ్ఱపుబండ్లు మాటాడుకొని మైలాపురము చేరితిమి కాని యిల్లు చేరునప్పటి కాయింటికి బైట దాళము వేయఁబడి యుండినది. పంతులుగారు పంపిన భటుఁడు పోయి బీగము తీసికొనివచ్చి వీధితలుపు తెఱచెను. ఆయిల్లు విశాలమైనదే కాని యింటివారిలో నెవ్వరో చెడ్డ నక్షత్రమందు మృతినొందుటచేత కొన్నినెలలనుండి పాడుపడియుండిన దగుటచేత గబ్బిలముల పెంటతోను ఎలుకలు త్రవ్విన మంటిరాసులతోను వాసయోగ్యము కాకుండెను. మే మంగడికిఁ బంపి వస్తుసామగ్రిని తెప్పించుకొని యిల్లు బాగుచేసుకొని వంటచేసికొని భోజనములు చేయునప్పటికి రాత్రి యెనిమిదిగంట లయినది. వెంచలరావుపంతులుగారు తమ కార్యస్థానమునుండి తిన్నగా మాయింటికి వచ్చి మా క్షేమసమాచారము విచారించి యరగంటసేపు నాతో మాటాడుచుఁ గూరుచుండి తమయింటికిఁ బోయిరి. నారాకవిని మఱు నాటినుండి నన్నుఁ జూచుటకయి మిత్రులు మొదలైనవారు రాఁదొడఁగిరి. వారు వివాహ మెప్పుడని యాత్రముతో నడుగుచు రాఁగా నెని మిదవ తేదిని జరగవచ్చునని చెప్పుచు వచ్చితిని. వచ్చిననాఁడు రఘునాథరావుగారి దర్శనము కాలేదు. మఱునాటిప్రొద్దున వారిదర్శనము చేయుటకయి పోయితినిగాని వాకిటనున్న భటులు సమయము కాదని చెప్పినందున వెనుకకు మరలవలసినవాఁడ నయితిని. రెండవనాఁడు మరలఁ జూడఁబోయినప్పుడు వారిభటులు రాయలవారు జపములో నున్నారనియు, చూచుటకు సమయము కాదనియు నన్ను లోపలికిఁబోకుండ వారించినందున నాఁడును వచ్చినదారినే మరల మాయింటికిఁబోయితిని. ఇట్లు రెండుదినములు వృథాకాలహరణమయ్యెను. మూఁడవ నాటిప్రాతఃకాలమున ననఁగా 7-వ తేదిని నే నెప్పటియట్ల వారిదర్శనార్థ మరుగఁగాఁ గావలిభటులు వెనుకటిసాకులనే చెప్పిరి కాని యీసారి

తప్పక చూచి మాటాడి మఱి రావలెనని నిశ్చయించుకొని వచ్చితిని. కను
క వారి మాటలను గణనచేయక తిన్నగా లోపలికిఁబోయి మేడయెక్కి
వారు కూరుచుండు స్థలముఁ జేరితిని. వారు నన్నుఁ జూచి తమపీఠమునుండి
లేచి యెదురుగా వచ్చి నన్నుఁ గొనిపోయి యుచితాసనమునందుఁ
గూరుచుండఁబెట్టి నాక్షేమము విచారించి గౌరవించిరి. వారు నారా
కను తాము వింటిమనియు తొందరపనులచేత మూఁడుదినములనుం
డియు నన్ను చూడలేకపోయినందుకుఁ జింతిల్లుచుంటిమనియు నుప
చారవాక్యములు పలికి క్షమార్పణము చేసిరి. నే నామాటలయందు
దృష్టియుంచక వచ్చిన కార్యవిషయము నందుకొని రేపటిదినము వివా
హము జరపుటకు నేను నిశ్చయించుకొంటిననియు, ఆహ్వానపత్రికలను
వారి పేరఁ బంపుట కిష్టపడనియెడల నా పేరనే పంపెదననియు, స్పష్ట
ముగాఁ జెప్పితిని. వారించుకసేపాలోచించి కాగితమును కలమును
గైకొని యాహ్వానపత్రికను వ్రాసి క్రింద తమచేవ్రాలు చేసి నాకుఁ
జూపి నే నుండఁగాఁగానే దానిని ముద్రింపించుటకయి పొరుగున నున్న
తమ ముద్రాయంత్రమునకుఁ బంపిరి. పోయినపని చక్కఁబడుటచేత నేను
వారిని వీడ్కొని యింటికి వచ్చితిని. చెంచలరావుపంతులుగారు మా
యింటికి మైలుదూరములో నుండినను ప్రతిదినమును మాయింటికి
వచ్చి నాతో మాటాడిపోవుచునే వచ్చిరి. రఘునాథరావుగారు ముద్రిం
పఁబడిన యాహ్వానపత్రికలను గొన్నిటిని నాయొద్దకుఁ బంపిరి. వానిని
చూడఁగాఁ గ్రింద వారిపేరు కానఁబడలేదు. ఆపత్రిక వివాహమునకు
విజయము చేయుటకు సమాజమువారిచే నెల్లవారును గోరఁబడు
చున్నారని పేరులేకుండఁ బ్రకటింపఁబడినది. పట్టణములోని వృత్తాంత
పత్రికలకును మిత్రులకును తగుమనుష్యులకును వారే యాహ్వానపత్రి
కను బంపిరి. పందిళ్లు వేయించుట, కదళీస్తంభములను తోరణము
లను కట్టించుట, పెండ్లికిఁ గావలసిన సమస్తసంభారములను సమ

భోదనములు చేసినంతమాత్రముచేత కలిగెడు ప్రయోజన మేదియు లేదనియు సెలవిచ్చి నాప్రార్థనను మన్నింపరైరి. దీనిని పత్రికలలోఁ బ్రకటింపవలసినదని యుత్సాహవంతులైన సంస్కారోత్సుకతరుణ వయోవంతులు నన్ను బలవంతపెట్టిరిగాని వారికోరికకు నే నంగీకరింప లేదు. ఈవివాహమునకుఁ జెన్నపురిలోనైన 850 రూపాయలునుగాక వేయింటిలో మిగిలిన 150 రూపాయలును రఘునాథరావుగారు నా కిచ్చిరి. ఈప్రకారముగా 1883-వ సంవత్సరము జూన్ నెల 8-వ తేది నారంభింపఁబడిన యీవివాహమహోత్సవము పండ్రెండవతేదితో సంతోషకరముగా సమాప్తమయినది. వివాహమునకు దయచేసిన రావు బహద్దరు ఆర్కాటు నారాయణస్వామి మొదలియారిగారు బెంగుళూరుకు రావలసినదని, న న్నాహ్వానము చేయఁగా నే నొక్కఁడను వెళ్ళి దండులో నుపాధ్యాయులుగానున్న గోపాలస్వామయ్యగారింట దిగి దండులో నొకటియు, పట్టణములో నొకటియు వితంతువివాహమును గూర్చి రెండుపన్యాసములు చేసితిని. అప్పుడు బెంగుళూరులో నుండిన మూఁడువేల నియోగు లందఱును నొకచోటఁగూడి నన్నుఁ బిలుచుకొని పోయి చందనతాంబూలపుష్పమాలాదులతో నన్నుసత్కరించిరి. నే నక్కడ రెండుదినములుండి మిత్రులను వీడ్కొని మరల చెన్నపట్టణమునకు వచ్చి మావారల నందఱిని వెంటఁబెట్టుకొని ధూమనౌకమీఁద పోయి స్వస్థానమును సురక్షితముగాఁ జేరితిని. ఈవఱకు జరగిన వివాహములన్నిటిలో దీనికే యధికవ్యయ మయినది. చెన్నపట్టణములో వ్యయపడిన రు 850 లు గాక రాకపోకలకు ప్రయాణముక్రింద రు 331 లయినవి; తరువాత పెండ్లికొమారితకు మాన్యము విడిపించియిచ్చుటకిన్నూరు రూపాయలయినవి; గుంటూరి కావలనున్న వల్లూరునకు వెళ్ళి యీసంబంధమును కుదిర్చిన యామెకు రు 40 లిచ్చితిమి; పెండ్లికొమారితతల్లి రెండుసారులు వల్లూరు వెళ్ళివచ్చినందునకుఁ బెండ్లికూఁతులను

తెచ్చినందునకును రు 40 లయినవి; పెండ్లికొమారితెకుఁ బెట్టినసగల కిన్నూఱు రూపాయలయినవి. అన్నియుఁగలిసి యీవివాహమునకు మొత్తముమీఁద రు 1671 లు కర్చుపడినవి.

మేము రాజమహేంద్రవరములోఁ జేరిన రెండుమాసములలోపల నసఁగా 1883-వ సం॥ ఆగష్టునెల 19-వ తేదిని రెండవకోమటి వివాహము జరగినది. ఈవివాహము చేసికొన్నయతఁడు లక్ష్మీనరసింహముగారి కాశ్రితుఁడయి యాంధ్రసభ (Court) లో బత్తెపుబంట్రౌతు (Batta Peon) గా నుండుటచేత, ఆయనకోరిక ననుసరించియే యాతని కీవివాహము చేయఁబడినది. ఇది తొమ్మిదవ వివాహము. మఱి నాలుగు నెలలలోపల నసఁగా 1884-వ సంవత్సరము జనేవరు నెల 5-వ తేదిని నల్లగొండ కోదండరామయ్యగారి దయిన పదవవివాహము చేసికొన్న పులవర్తి శేషయ్యగారును, దేశాభిమానమును ధైర్యోత్సాహములను పరోపకారచింతయుఁ గలవారయి నాకుఁ దోడుపడిన విద్యార్థులలోనివారని నేను వీరి నొకసారికంటె నెక్కువగా శ్లాఘించియుంటినిగదా! పులవర్తి శేషయ్యగారు వివాహమయిన సంవత్సరమునందే ప్రవేశపరీక్షయందుఁ దేఱుటచేత నేనాతనికి నెలకు పంద్రెండేసి రూపాయలచొప్పున జీతమిచ్చుచు బట్టలు పుస్తకములు మొదలైనవి వేఱుగా నిచ్చుచు నిప్పటికి సంవత్సరమునుండి ప్రథమశాస్త్రపరీక్షకుఁ జదివించుచుంటిని. 1883-వ సంవత్సరము డిసెంబరు నెలయందొక వృద్ధవైదికవితంతువు నావద్దకు వచ్చి తనసంరక్షణములోఁ బదుమూఁడేండ్ల ప్రాయముగల వితంతువైన మనుమరాలున్నదనియు, తల్లిదండ్రులులేని యాచిన్నదానికి వివాహము చేయుటకయి తన కభిలాష యున్నదనియు, వివాహానంతరమునఁ దానుగూడ మనుమరాలియొద్దనే యుండెదననియు, నాతోఁ జెప్పెను. నేను పులవర్తి శేషయ్యగారిని వెంటనిచ్చి ప్రయాణవ్యయములకుఁ గొంత సొమ్మిచ్చి యామెతోఁ

గూడ తాటిపాకకుఁ బంపిరి. పిల్లను ముత్తవతల్లిని రాత్రివేళ నొరు తెలియఁగకుండ తీసికొని రావలసి వచ్చినందుచేతను ఇతరులకు వెల్లడికాకుండ వారివస్త్రములను మోసికొనివచ్చుటకై యాకుగ్రామములోఁ గూలివానిని సంపాదించుట కష్టమైనందువలను, లేశమైనను సంశయింపక దుర్భరశ్రమను విడిచి కార్యసాధనమే ముఖ్యప్రయోజనముగాఁ జూచుకొని తానే కావడిని కొన్నిక్రోసులదూరము మోచుకొనివచ్చి యీ శేషయ్యగారే వారిని మాయింటికిఁ దెచ్చి యొప్పగించెను ఇప్పుడు కోదండరామయ్యగారి కిచ్చి వివాహము చేయఁబడినది యీచిన్నదే. వరుడైన కోదండరామయ్య ప్రథమశాఖవాఁడు; వధువు వైదికశాఖాసంభవ. శాఖాభేదము విచారింపక చేసిన వివాహములలోనిదియే మొదటిది. ఇంతవఱకును జరిగిన వివాహములన్నియు నియోగులలో నియోగులకును, మాధ్వులలో మాధ్వులకును, వైదికులలో వైదికులకును, కోమట్లలోఁ గోమట్లకును, శాఖాభేద మతిక్రమింపక జరుపఁబడుచు వచ్చినవి. ప్రథమవివాహము చేసికొన్న దంపతుల కొక్కరికిఁ దక్క తక్కినవారి కందఱికిఁ గాపురములుండుటకు గృహములీయఁబడుచు వచ్చినవి. మొట్టమొదట విన్నిసిపేటలోఁ గొనఁబడినయింటిలో దక్షిణభాగము రెండవవివాహముచేసికొన్న రాచర్ల రామచంద్రరావుగారికిని ఉత్తరభాగము నాలవవివాహము చేసికొన్న పులవర్తి శేషయ్యగారికిని, ఇయ్యఁబడినవి. మూఁడవవివాహము చేసికొన్న తాడూరి రామారావుగారికి సూర్యారావుపేటలో నొక గృహముకట్టించి రామకృష్ణయ్యగా రిచ్చిరి. అయిదవవివాహము చేసికొన్న ముంజులూరి గోపాలకృష్ణయ్యగారికి శేషయ్యగారి యింటిప్రక్కను క్రొత్తగాఁ గట్టింపఁబడిన యిల్లియ్యఁబడినది. ఇన్నిసుపేటలో ముంజులూరివారివద్ద స్థలముకొని కట్టించిన యింటిలోని దక్షిణభాగ మెనిమిదవ వివాహముచేసికొన్న తణుకు చెలపతిరావుగారి కియ్యఁబడినది;

ఉత్తరభాగ మాతని మఱఁదలికి వివాహమైనప్పు డిచ్చుటకు నిలువ యుంచబడినది. మాయింటిసమీపమునఁ గొనఁబడిన పేరి చయినులు గారి యింటిలోని యుత్తరభాగ మాఱవవివాహముచేసికొన్న చేబోలు వెంకయ్యగారికిని, దక్షిణభాగము పదవవివాహము చేసికొన్న వల్లగొండి కోదండరామయ్యగారికిని, ఇయ్యఁబడినవి. ఏడవవివాహము చేసికొన్న జోగా శ్రీరాములుగారికి రామకృష్ణయ్యగారు కాకినాడలోని తమయిండ్లలో నొకదాని నిచ్చిరి. తొమ్మిదవవివాహము చేసికొన్న సలాది రామయ్యగారికి రామకృష్ణయ్యగారు కాకినాడలో నొక తాటాకుల యిల్లిచ్చిరి. కోదండరామయ్యగా రప్పు డిరువదిరూపాయల జీతముగల యుపాధ్యాయపదమునం దుండినందున సమాజమునుండి ధనసాహాయ్యమును కోరవక్కఱలేని స్థితిలో నుండెను. అయినను వివాహమయిన నెలదినముల కాయన క్రిందితరగతిలోఁ జదువుకొనుచున్న తన పెద్దతమ్ముని నావద్దకుఁ దీసికొనివచ్చి విద్యానిమిత్తము సాయము చేయవలెనని కోరెను. నేను ఫిబ్రవరు నెలలో నాలుగురూపాయలిచ్చితిని. అతఁడు మరల మార్చినెలలో వచ్చి యడుగఁగా వెనుకటివలెనే నాలుగురూపాయ లిచ్చితిని; మూడవనెలలోవచ్చి నాలుగురూపాయలు చాలుచుండ లేదనియు నెక్కువ యియ్యవలసినదనియుఁ గోరెను. అప్పుడు నే నేప్రిల్ నెల కయిదురూపాయలిచ్చి, యాయనయెదుటనే నాపుస్తకములో పద్దువ్రాసితిని. అదిచూచి యాయన నాతమ్మునికిచ్చినట్టు వ్రాయక నాకిచ్చుచున్నట్టు వ్రాయుచున్నారేమని యడిగెను. మీచేతి కిచ్చుచున్నాను గనుక నేనట్లు వ్రాయుచున్నాను. మీతమ్మున కెందువలని యిచ్చినట్టు వ్రాయుదును? అని యడిగితిని. మీరు వివాహముచేసికొనినవారికి వారి కియ్యలేదా వీరికియ్యలేదా యని కొన్ని పేరులు చెప్పెను. అప్పుడు వివాహనిధి లేదుగనుక నాసొంతములోనుండి యిచ్చుచుంటిని. ఇప్పు డట్లిచ్చుటకు వీలులేదని బదులు

చెప్పితిని. అట్లయిన నిశ్చయము మంగళగిరి కృష్ణమూర్తి కేల యిచ్చు
చున్నారని యాయన యడిగెను. చెలపతిరావు మఱదలిని వివాహము
చేసికొనుట కతఁ డొప్పుకొన్నందునను, ప్రవేశపరీక్షతరగతిలోఁ జదువు
కొనుచున్నందునను, అతని కిచ్చుచున్నానని బదులుచెప్పితిని. వీరాయి
ష్టము వచ్చినవారి కిచ్చి మీరాయిష్టము వచ్చినట్లు చెప్పెదురని యాయన
గొణుగుకొనుచు వెడలి పోయెను.

అతికష్టపడుచుండుటవలనను, స్వాభావికశరీరదౌర్బల్యము వల
నను, నా దేహస్థితి కొంత చెడి యప్పుడు విశ్రాంతిని కోరునదిగా నుం
డెను. అందుచేత నేను నరసాపురమునకుఁ బోవఁదలఁచుకొని యక్కడి
డిస్ట్రిక్టుమునసబుగా నుండిన కొమ్మూరి రామలింగశాస్త్రిగారికి యిల్లొ
కటి యద్దెకుఁబుచ్చుకొని, మాపాఠశాల కేప్రిల్ నెల 20-వ తేదినుండి
వేసవికాలపు సెలవులియ్యఁగానే యియ్యవలసిన వారి కందఱికిని మెయి
నెల జీతములు సహితము ముందుగానే యిచ్చివేసి నాభార్యతోను
మేము పెంచుచుండిన శ్రీరాములుగారి శిశువుతోను బైలుదేఱి నర
సాపురము వెళ్ళితిని. గోగులపాటి శ్రీరాములుగారు వితంతు వివా
హము చేసికొనునప్పటికిఁ బ్రథమకళత్రమువలన నాలుగుమాసముల
పురుషశిశువుండెను. నాయందలిగౌరవముచేత తండ్రి యాబాలునకు
నాపేరే పెట్టెను. ఆశిశువును మాయొద్ద నుంచుకొని పెంచి పట్టపరీక్ష
యందుఁ గృతార్థుఁడగువఱకును నేనే విద్య చెప్పించితిని. నా దెప్పు
డును పనిలేక యూరకకూరుచుండెడి స్వభావముగాదు కనుక నరసా
పురములో నున్నప్పుడు సహితము వితంతువివాహపక్షమునఁ బనిచే
యుచు నక్కడి సెంట్రల్ హైస్కూలులో వితంతువివాహమును
గూర్చి యొక యుపన్యాసము వ్రాసి మెయి నెల 28-వ తేదిని చదివి
తిని. నేను నరసాపురము వెళ్ళగానే బందరునుండి రాజమహేంద్ర
వరము వెళ్ళి తిరిగివచ్చిన యీక్రింది యుత్తరము నాకందెను—

"అంతరంగికము. మశూలా,
16-వ ఏప్రిల్ 84.

నాప్రియమైన అయ్యా!

ఏవిషయమును గూర్చియైనను మీపేర వ్రాయుటకు నేను కలము పట్టిన దిదియే మొదటిసారియైనను మనయసహాయులైన వితంతువులను దుఃఖమోచనము చేయుటకయి మీరు పూనినపదమునం దాదరము కలవాఁడనన్న చిన్న హేతువుచేత మిమ్ము "ప్రియమైన" యను విశేషణముతో సంబోధించెడు స్వాతంత్ర్యమును వహించుచున్నాను.

నాయాదరము నింతకుముందే తెలుపనందుకు మీరు నన్ను క్షమింతురని కోరుచున్నాను. ఈపట్టణములో నేదైన వితంతువివాహము జరపఁబడెడుపక్షమున, వివాహము చేసికొన్నవారికి ఘనమైన ధనసహాయ్యముతోఁ దోడుపడెడు స్థితియందు మీరున్నారా? ఉన్న పక్షమున నెంతవఱకు? పయిప్రశ్నకుత్తరమును నాకుఁ దెలిపినయెడల, ఈప్రశ్నను నేను మిమ్మేల యడుగవలసెనో యందును గూర్చిన యధికవివరములను మీకుఁ దెలిపెదను. నేనీమండలములోని మండల న్యాయసభ న్యాయవాదిని.

నాపేరు——

చెరువు- సుబ్రహ్మణ్యశాస్త్రి.
డిస్ట్రిక్టుకోర్టు వకీలు, మచిలీపట్టణము.

నాయొద్దనుండి ముందుగా నంగీకారమును బడయువఱకును దయచేసి మీరీలేఖలోని సంగతుల నెవ్వరికిని దెలుపకుఁడు. మీరు నాస్థితి నెఱుఁగ గోరెడుపక్షమున రాజమండ్రి డిస్ట్రిక్టుమునసబును అక్కడ వకీలుగానున్న శిష్టు జగన్నాథశాస్త్రిగారిని అంతకంటె నధికముగాక నేనెవరో తెలిసికొనుటకు మాత్ర మడుగవచ్చును. ఈయుత్త

రములోని సంగతు లితరులకుఁ దెలియఁజేయకుండ నాపరిచితుఁడని మీరుఁ దలఁచిన యేమనుష్యునివలననైనను నన్నుగూర్చి నావృత్తాంతముననైనను మీరు పోగుచేయుటకు నాకాక్షేపము లేదు. ఇప్పుడు పడవలసంచారముండి యుండినపక్షమున, స్వయముగా మాటలాడుటకు నేను మీవద్దకు వచ్చియుందును. అది లేకపోయినందున, నేను మీతో లేఖాముఖమున నుత్తరములు జరుపవలసినవాఁడనయినాను.'*

వివాహవ్యయములను భరించి వధువున కిన్నూఱురూపాయలు నగలు పెట్టెదమనియు, దంపతులు కాపుర ముండుటకయి మున్నూఱు

* My Dear, Sir, Masula, 16th April 1884.

I take the liberty of addressing you by the epithet 'Dear' tho' this is the first time that I took my pen to write you on any subject, on the simple ground that I sympathise with you for the step you took for relieving our helpless widows

You will excuse me. I hope, for my not expressing my sympathy earlier. If any widow marriage were to be performed in the town, are you in a position to help the party with any substantial pecuniary aid. If so, to what extent? If you let me know the answer to the above question I shall let you know further particulars, why I came now to ask of you this question. I am a District Court Vakil of this District.

My Name. Charuvu Subrahmanya Sastri,
District Court Vakil, Masulipatam.

Please don't disclose the contents of this letter to any body there before you take my previous permission. If you wish to know my status you may ask the District Moonsiff of Rajahmundry and Sistu Jagannadha Sastri Garu, a Vakil there, simply to know who am I and no further. Without letting others know of the contents of this letter, I have no objection for you collecting any information regarding me from any person whom you think that he is my acquaintance.

Had there been canal communication, I would have gone up to you to speak in person. As that is now wanting I am obliged to keep letter correspondence with you.

రూపాయల వెలచేసెడి యింటినిగాని యారోక్కమునుగాని యిచ్చెద మనియు నేను వ్రాసితిని. ఈప్రకారముగాఁ గొన్ని యుత్తరప్రత్యుత్తరములు జరిగినమీఁదట తాను వితంతువివాహమును చేసికొనుటకు సంసిద్ధుఁడనయి యున్నాఁడ ననియు తన బంధువురాలయి ధనికురాలయి యున్న యొకతరుణవితంతువును వివాహ మాడుటకుఁ దా మేర్పాటు చేసికొంటిమనియు, తనకు ధనసహాయ్య మక్కఱలేదనియు, వివాహము చేసికొనుటకు సంసిద్ధులయియున్న మఱియొక వధూవరులకు ధనసాహాయ్యము కావలసియున్నదనియు, ఆయన వ్రాసెను. అందుమీఁదట మచిలీపట్టణములో నొకటిరెండు వివాహములు జరగు సూచనలు కానఁబడుచున్నవనియు, అక్కడివారు నన్నాహ్వానము చేసిరనియు, నే నచ్చటికి వెళ్ళవలసినదని మీయభిప్రాయమేమో తెలుపవలసినదనియు, ఆలోచన యడుగుచు నేను పైడా రామకృష్ణయ్యగారికి వ్రాసితిని. ఆయన నాలేఖకుఁ బ్రత్యుత్తరముగా 1884-వ సం॥ మే నెల 20-వ తేదిని కాకినాడనుండి నాకిట్లు వ్రాసిరి.

"కాకినాడ, 20—5—84

నాప్రియమిత్రుఁడా!

ఆరోగ్యముకు మిత్తము మీరు వెళ్ళియుండిన నరసాపురమునుండి వ్రాయఁబడిన మీ యుత్తరము నందుకొంటిని. మీరు కొంతమేలుగా నున్నారని నమ్ముచున్నాను. ఒకటి రెండు వివాహముల నిమిత్తము మీరు కోరఁబడినందున మీరు మచిలీకు వెళ్ళవచ్చునేమో యాలోచన చెప్పవలసినదని మీరు నన్నడిగియున్నారు. అక్కడ పక్షవిద్వేషము విస్తారముగా నున్నందున, అక్కడి పరార్థపరులచేఁ గష్టములపాలు చేయఁ బడుదురని భయపడుచున్నాను. సొమ్ముతో సహితము తగినంత సాయము చేయువారు మీ కక్కడ నెవ్వరును లేరు. ఇటువంటి స్థితులనుబట్టి మీయారోగ్యము వచ్చుట

అనుకూలముగా లేదని మీరు వారికి వ్రాసి తెలుపవలెను. వారు తమకుఁ జేతనైనది శక్తికొలఁదిని తామే చేసికొందురు. వేఁడి భయంకరముగానుండి నాకుఁ జెఱుపుచేయుచున్నది. నేను నిర్వేదపడుచున్నట్టున్నాను. కడచిన రెండుమూఁడు దినములనుండి యది 110 డిగ్రీలున్నది. కాఁబట్టి యేమి చేయవలసినది మీరెఱుఁగుదురు. నామట్టుకు నేను మీ యారోగ్యమునుబట్టి మీరు వెళ్ళవలసినది కాదని తలఁచుచున్నాను. మీచర్య యేమో దయచేసి నాకు తెలుపుఁడు. మీ హితుఁడు.—పీ. రామకృష్ణయ్య. *

ఈప్రకారముగా మిత్రులు పోవలదని హితబోధచేయుచుండినను వ్యాధిబాధచేత దుర్బలశరీరుఁడనై యుండియున్నను, ఎండలు దుస్సహములయి యతితీక్ష్ణముగా నుండినను, సంస్కారబీజము నితరస్థలములయందు నాటుట కవకాశము కలిగినప్పుడు కృతవ్యవసాయుఁడనయి ఫలము పొంద నపేక్షింపక యుపేక్షించుట ధర్మముకాదని భావించి, రాజమహేంద్రవరము వ్రాసి పురోహితుని రప్పించి, వచ్చుచున్నానని సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి వ్రాసి, బందరుపురమునందలి మిత్రబృందసాహాయ్యముచేత నేను వసించుట కనుకూలమైన యిల్లు

---

* "Cocanda 20—5—84. Mr. Dear Friend,

I had duly received your letter from Narsapur to which you went for health. I hope you are better. You have asked me to advise you if you can go Masula as you are invited for a marriage or 2. There is such a party feeling there, I fear the philonthrophers there will be put to difficulties; there are none to support in funds even sufficiently; in all such circumstances you should write and tell them that your health does not permit you. They will do their best for themselves. The weather has been fearful and it is acting upon me I feel quite dejected. The last 2 or 3 days it is 110 degrees. So you know what to do. As for my part I don't think you should go on account of your health. Please let me know what is your procedure. Yours truly P. Ramakistiah."

కుదుర్చుకొని, మండు వేసవికాలములో ఇసుకదారిని మోటుబండ్ల మీఁద కుటుంబసహితముగా బైలుదేఱి జూన్ నెల ప్రారంభమున బందరునకుఁ బ్రయాణమైతిని. త్రోవపొడుగునను జనులు నాయెడల నే ననుకొన్నట్లు ద్వేషమును జూపక యనుకూలురుగా నే కనఁబడుచు వచ్చిరి. మేము నరసాపురము బైలుదేఱి మధ్యాహ్న మొక యూరి సత్రము చేరునప్పటికి మాకంటె ముందుగా బండ్లుదిగి వంటచేసికొన్న బ్రాహ్మణకుటుంబమువారు మాచిన్నవాని నన్నము పెట్టుటకయి తీసికొనఁబోవవచ్చిరి. నేను మాస్థితిని దెలుపఁగోరి మీ రెవ్వరమో యెఱుఁగుదురాయని యడిగితిని. 'ఎఱిఁగియే పిలువవచ్చితిమి; మేమును మీకంటె కొంచెము ముందుగా బైలుదేఱి నరసాపురమునుండియే వచ్చుచున్నాము' అని వారు బదులుచెప్పిరి. ఆరాత్రి మేము గొల్లపాలెము చేరఁగాఁ బలువురు నన్ను చూడవచ్చుటయే కాక యొక పెండ్లివారు మమ్ము వంటచేసికోనియ్యక మాకుఁ బిండివంటలతో సమస్తభోజనపదార్థములను బ్రాహ్మణులచేతఁ బళ్ళెములతోఁ బంపిరి. త్రోవలో నెట్లుండినను బందరుపురము మేము చేరునప్పటికి నారాక యంతకుముందే తెలియుటచేత మహావాయువుచేతఁ గలఁతనొందబడిన మహాసముద్రమువలె పౌరజనవారధి యంతయుఁ గలఁగి యల్లకల్లోలముగా నుండెను. తనపట్టణములో గతభర్తృకాపాణిగ్రహణమునకుఁ దాను ప్రథముఁడనుగా నుండెదనని నాపేర వ్రాసిన బ్రాహ్మణధీరుఁ డాసంక్షోభమునకు సంత్రస్తుఁడయి బాలవితంతుపరిణయముమాట యటుండఁగా నేను వెదకికొనుచుఁ దమయింటికిఁ బోయినప్పు డీవిషయమయి నాతో బహిరంగముగా మాటాడుటకే భయపడి నన్నొంటిగాఁ జాటునకుఁ గొనిపోయి తా నప్పుడు రోగపీడితుఁడయి యుండుటచేత వివాహప్రయత్న మప్పటికి విడిచితిననియు తాను స్వస్థపడి పునఃప్రయత్నము చేసినప్పుడు నాపేర వ్రాసెదననియుఁ జెప్పెను. నే నంత

టితో నిరుత్సాహుఁడనయి యాశాభంగము చెందక పట్టణమునకు వచ్చినందుకు కొంత పనిచేసి పోవలెనని వివాహవిషయమునఁ గొన్ని యుపన్యాసముల నిచ్చుటకు నిశ్చయించితిని. నా మొదటియుపన్యాసమును నేను బసచేసిన శ్రీ వల్లూరు జమీందారుగారి విశాలసభాభవనమునందే చేసితిని. అది యచ్చటి నాప్రథమోపన్యాస మగుటచేత దానిని వినవలెనన్న కుతూహలముచేతను, నా మొగ మెట్లుండునో చూడవలెనన్న యభిలాషచేతను, మఱికొన్ని హేతువులచేతను, ఉపన్యాససమయమునకు ముందే వందలకొలఁది జనులు వచ్చుటచేత సభాభవనమంతయు మనుష్యులతోఁ గిక్కిఱిసిపోయినది. సభాపతులైన నిష్ఠల నరసయ్యగారు మొదలైన బ్రాహ్మణులలోని ప్రసిద్ధపురుషులు కొందఱు తమశిష్యబృందముతోఁ గూడ వేంచేసి, నాయుపన్యాసమును సాగనీయక చప్పటలుగొట్టి యల్లరిచేయ నిశ్చయించుకొనివచ్చి యున్నారని నామిత్రులు కొందఱు నాకా మహాపురుషులను జూపిరి. అటువంటిసభలో శాస్త్రప్రసంగమును చేయఁబూనుట యవివేకమని యెంచి నే నట్టిపనికిఁ బూనక క్రొత్తగా నరసాపురములో నుపన్యసించి వచ్చుటచేత నందలియంశములనే విశేషముగాఁగొని నిర్బంధవైధవ్యమువలనఁ గలుగుచున్న వివిధానర్థములనుగూర్చియు తత్సాంకర్యనివారణసాధనములనుగూర్చియు వారు కనియు వినియు నున్న దృష్టాంతములతో తలవంచుకొని నాస్వభావధోరణిని రెండు గంటలసే పుపన్యసించి వారిహృదయములకుఁ దాఁకునట్లుగా నన్యగతికులైన యనాథకాంతావనపుణ్యకార్యమునందు దీక్ష వహింపవలసినదని ప్రార్థించితిని. మొదట నూహించినట్లెవ్వరును నల్లరిచేయక యెల్లవారును కడవఱకును నాయుపన్యాసమును నిశ్శబ్దముగా వినిరి. జనసమ్మర్దముచేతను, ఆతపతాపముచేతను, నాదేహమంతయుఁ జెమర్చి యాయాసము కలుగఁగా క్రొత్తగాలిలోఁ దిరిగి బడలిక తీర్చుకొనుటకయి నేను మేడ

మీఁదికెక్కి వీధిపై పున పచారు చేయుచుంటిని. అల్లరిచేయఁ దలఁచు కొనివచ్చినారన్న బ్రాహ్మణోత్తములు తమలోఁ దామీవిషయమయి యే మాటాడుకొనుచు నడచిపోవుచు నాకంటఁబడిరి. వారిలో నొకరు లోపలినుండి వీధిలోనికి మెట్లుదిగుచు 'ఈయుపన్యాస మెట్లున్నదిరా?' అని రెండవవారి నడిగెను. 'ఇటువంటిపాడుసభలకు మనము రాకూడదు. ఇటువంటిమాటలు వినుచు వచ్చినయెడల మనబుద్ధికూడ చెడిపోవును' అని యాతఁడు బదులుచెప్పెను. నేను భగవదనుగ్రహము వలన పామరులవలని పరాభవమునుండి తప్పించుకొని బయటఁబడఁ గాంచితిని.

డిప్యూటీకలెక్టరుపని చేసి యుపకారవేతనమునొంది కర్మిష్ఠులయి యుండిన వడ్లమన్నాటి వేంకటాచలము పంతులుగారు ఈపట్టణములో వితంతువివాహప్రతిపక్షులకుఁ బ్రధాననాయకులు. వారు బృందావనపురములో మిక్కిలి పేరుపొంది యెల్లరచే గౌరవింపఁబడుచుండిన యొక గొప్ప పండితునిచేత నావితంతువివాహవిషయకవిజ్ఞాపనములమీఁద నొక ఖండనగ్రంథమును వ్రాయించిరి. ఆఖండనగ్రంథములోని యుక్తులకుఁ బ్రతియుక్తులు చెప్పుటగాని, చూపినప్రమాణములను ఖండించుటగాని, చేసినసిద్ధాంతములను పూర్వపక్షముచేయుటగాని, సాధ్యముకాదని వారు నమ్మియుండిరి. నేను వేంకటాచలము పంతులుగారి దర్శనార్థమయి యొకనాటి ప్రాతఃకాలమున వారియింటికి వెళ్ళినప్పుడు వారు లోపల జపము చేసికొనుచుండి నన్ను లోపలికి రప్పించుకొని తమ సరసను పీటమీఁద కూర్చుండఁబెట్టి నాతోఁ జాలసేపుమాటాడిరి. ఆసంభాషణలో వారు శాస్త్రప్రమాణరహితములైన పాడిమాటలతోఁ బ్రయోజనము లేదనియు, శాస్త్రప్రమాణబద్ధులైన హిందువులకు శాస్త్రార్థవిచార మావశ్యకమనియు, ఆ విషయమయి యొక పండితసభ జరగుట కర్తవ్య మనియు, సెలవిచ్చిరి. నేనును

వారితో నేకీభవించి, పామరజనబహుళమైన సభలో శాస్త్రచర్చ చేయుట నిష్ప్రయోజనమనియు, పండితులను గుణగ్రహణపారీణులైన పెద్దమనుష్యులును మాత్రము చేరిన చిన్నసభలో శాస్త్రవిషయిక వాదప్రతివాదములు జరపుటయే లాభకరమనియుఁ, జెప్పితిని. వారందున కొప్పుకొని మఱునాటిమధ్యాహ్నమున తమచావడిలోనే సభ జరపుట కేర్పఱిచి, ఉభయపక్షములలోను జేరిన పెద్దమనుష్యులకుఁ గొందఱికిని విద్వాంసులకుఁ గొందఱికిని, ఆహ్వానములు పంపిరి. నేనును యుక్తసమయమునకుఁబోయి సభలోఁ గూరుచుంటిని; నా గ్రంథముపై ఖండనగ్రంథము చేసిన శాస్త్రులవారు పండితపక్షమున తత్ప్రతినిధిగా నాతో వాదము చేయుటకయి నాయెదుటను గూరుచుండిరి. ధర్మార్థ విచారమునకుఁ బ్రమాణగ్రంథము లేవో, వాని గౌరవతారతమ్య మెట్టిదో, అర్థనిర్ణయ మెట్లు చేయవలెనో, అటువంటి ప్రాథమికనిబంధనములను గూర్చి శాస్త్రులవారును నేనును నేకాభిప్రాయమునకు వచ్చినపిమ్మట మేము శాస్త్రచర్చ కుపక్రమించితిమి. కలియుగమునకుఁ బరాశరస్మృతి యొక్కటియే పరమప్రమాణమయినందున తద్విరుద్ధస్మృతులన్నియు నప్రమాణములనియు, పరాశరసంహితలోని "నష్టేమృతే" యను శ్లోకముయొక్క యర్థనిర్ణయమొక్కటియే ప్రథమకర్తవ్యమనియు, నేను చెప్పఁగా శాస్త్రులవారును నాతో నేకీభవించి ఆశ్లోకమున కర్థము చెప్ప నారంభించిరి. వారు చెప్పఁబూనిన యర్థము ప్రథమమునఁ జేసికొన్న నియమములకు విరుద్ధమనియు, తన స్మృతిలో పరాశరుఁడు చెప్పిన నిర్వచన మీయర్థమును బాధించుననియు, నేను వారు చేసెడి యర్థములను పూర్వపక్షము చేయ నారంభించితిని. ఇట్లు పావుగంటసేపు శాస్త్రార్థవిచారము నడచినపిమ్మట శాస్త్రులవారు క్షణకాల మూరకుండి సభవారివంకఁ దిరిగి, "అయ్యా! మీరు తమజీవితము సింధులో ధారపోసి యీవిష

యమయి విశేషకృషి చేసినారు. నాకుఁ గొంతకాలము గడువిచ్చినఁ గాని వీరితో వాదము చేయఁజాలను," అని యూరకుండిరి. ఆకాలము నందనేక పండితులతో ననేకస్థలములయందు దీవిషయమయి నేను వాదములు చేసితినిగాని తాము యుక్తి చెప్పలేకపోయినప్పుడు తమ యశక్తి నొప్పుకొని సత్యమునం దాదరము చూపినవారిని వీరినొక్క రినిదక్క మఱియెవ్వరిని నేను చూడలేదు. సాధారణముగాఁ బండితులు వాదములోఁ దాము పరాజయము నొందినను తమయోటమి నొప్పు కొనక "శేషంకోపేన పూరయేత్" అను న్యాయము నవలంబించి క్రిందఁబడినను తామే గెలిచితిమని కేకలు వేయుదురు. ఈశాస్త్రిగారి పేరిప్పుడు నాకు స్మరణకు రాలేదు. సూర్యనారాయణశాస్త్రిగారు కాఁ బోలును! ఈసభానంతరమున వేంకటాచలము పంతులుగారు తాంబూ లాది సత్కారము చేసి నన్ను వీడుకొల్పిరి. అక్కడి ప్రముఖులవద్ద సెలవు గైకొని సకుటుంబముగా నేను రాజమహేంద్రవరమునకుఁ బోయితిని.

స్త్రీపునర్వివాహవ్యాపారముయొక్క భూతవర్తమానస్థితులను గూర్చి 1887-వ సంవత్సరము జనేవరినెలలో సమాజముయొక్క సంవత్సరసభయందు నేను చదివినదానిలో "1884-వ సంవత్సరము మెయి నెలలో నేను నరసాపురము వెళ్ళియుండినప్పుడు నేనెప్పుడు నెఱుచూడని తావునుండి నాకొకయుత్తరమువచ్చి నాకాశ్చర్యము పుట్టించినది. నే నీపనిమీఁద నరసాపురమునుండి బందరుపోయి తిరిగి రాఁగానే జూన్ నెలలో సభచేసి యిప్పుడున్నరీతి సమాజమేర్పఱుచు టకుఁ బ్రయత్నించినాను. ఇప్పుడున్నరీతిగా మన యీసమాజ మప్పు డేర్పడినదే." అని చెప్పితిని. ఇందుఁ జెప్పఁబడిన యుత్తరము వ్రాసి నతఁడు పులవర్తి శేషయ్యగారు. నాకాశ్చర్యము పుట్టించుటకుఁ గార ణము నేను నరసాపురమునకు బైలుదేఱు దినమువఱకును నా యెడల వినయభయభక్తులు కనఁబఱుచుచు నాకుఁ బరమభృత్యుఁడుగానుండి యా దినమున సహితమువచ్చి పయినెలజీతమును పాఠశాలజీతమును

పుచ్చుకొని నన్నూరికి సాగనంపినతఁడు నేను లేనిసమయములో నా శాస్త్రికముగా మాఱి నేను మొదట పెక్కుసామాజికులతో నిండి యుండిన వితంతువివాహసమాజములో నాసామర్థ్యమువలన సామాజికులు లేకుండఁ జేసితినవియు, నేనేదారిని బోవుచున్నానో యెవ్వరికిని దెలియకుండ పాటుపడుచుంటిననియు, మిథ్యాదోషారోపణములు చేయుచు నుత్తరము వ్రాయుట. ఆయుత్తరములోని కడపటి ప్రార్థనము తమకు నిరంకుశప్రభుత్వముగాక ప్రతినిధిప్రభుత్వము కావలెననుట, అతఁడు బుద్ధిహీనుఁడయి దుష్టులప్రోత్సాహముచేత ననాలోచితముగా నిట్లు వ్రాసినందుకు చింత నొందుచున్నాననియు, నేనుజేసిన పని యెల్లరకును తెల్లమేగాన నిఁకముందు దేర్పడుసమాజములోఁ జేరి మీఁదు నాకంటె నెక్కువ పనిచేయుచుండఁగాఁ జూచి సంతోషించెదననియు, నేను రాజమహేంద్రవరమునకుఁ దిరిగి రాఁగానే సమాజము నేర్పఱిచి వివాహవ్యవహారము వారి కొప్పగించెదననియు, బదులు వ్రాసి బందరుకుఁబోతిని. బందరునుండి నేను మరలి రాఁగానే న్యాపతి సుబ్బారావు పంతులుగారు ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు మొదలైన మిత్రులతో నాలోచించి, సభాహ్వానపత్రికను బంపి స్త్రీపునర్వివాహ పక్షాభిమానులయిన నామిత్రులను వారిమిత్రులను సమకూర్చి 1884-వ సంవత్సరము జూన్ నెల 22-వ తేదిని క్రొత్తసమాజము నొకదాని నేర్పాటుచేసితిని. ఈ నూతనసమాజము రామకృష్ణయ్యగారును నేనును గవరాజుగారును ఆత్మూరి లక్ష్మీనరసింహముగారును న్యాపతి సుబ్బారావు పంతులుగారును జేరి పదునాలుగురు సామాన్యసమాజికులతో నారంభమయినది. ఇదిపూర్వసమాజముయొక్కయనుబంధమే యయినట్టును సమాజముద్వారియాదరణక్రింద వివాహము చేసికొన్నవారందఱును నిందు సామాజికులయినట్టు పరిగణింపఁబడునట్టును నేర్పఱుపఁబడినది. సమాజములో నేడుగురు కార్యనిర్వాహక

సంఘముగా నుండుటకును, వారిలో నలుగురు సామాజికులచేతను ఒకరు వివాహములు చేసికొన్న వారిచేతను ఏటేట ఎన్నుకొనఁబడుటకును, నిర్ణయము జరిగి, శ్రీపైడా రామకృష్ణయ్యగారును నేనును బసవరాజు గవర్రాజుగారును ఆత్మూరి లక్ష్మీనరసింహముగారును న్యాపతి సుబ్బారావు పంతులుగారును ఆచంట లింగరాజుగారును సామాన్య సామాజికులచేతను సోమంచి భీమశంకరముగారు పెండ్లికుమారులచేతను ప్రథమ కార్యనిర్వాహకసంఘముగా కోరుకొనఁబడితిమి. మొదటినుండియు నున్నట్టి నన్ను సమాజకార్యదర్శినిగాను, లక్ష్మీనరసింహముగారిని కోశాధ్యక్షునిగాను, గవర్రాజుగారిని గణకునిగాను, సుబ్బారావు పంతులుగారిని కార్యనిర్వాహకసంఘము కార్యదర్శినిగాను, భీమశంకరముగారిని సహాయకార్యదర్శినిగాను, ఏర్పఱిచిరి. సమాజ మేర్పడిన యాదినముననే సకుటుంబముగా ఒక సేవకునితోను సమాజ పురోహితునితోను వివాహపక్షవ్యాపనము చేయుటకయి చుట్టుపట్ల మండలములలో సంచారము చేయుమని నన్ను కోరుటకును, ఒక నిర్ణయము చేయఁబడినది.

ఈవఱ కిదియంతయు సరిగా నేయున్నదిగాని దీనిని నిర్వహించుటకు ధనము కావలెను 1882-వ స ॥ జూను నెలలో శ్రీపైడా రామకృష్ణయ్యగా రనుగ్రహించి పదివేల రూపాయలిచ్చిరి. ఆయిచ్చినప్పుడు మరల వివాహములగునన్న నమ్మిక మాకునకు లేకపోవుటచేత రెండు సంవత్సరముల లోపల వివాహములు జరగనియెడల తమసొమ్ము తమకు మరల పంపివేయవలసినదనియు, జరిగెడు పక్షమున వివాహ మొకటికి వేయేసి రూపాయలను మాసవ్యయములకు నెలకు డెబ్బదియైదేసి రూపాయలును నాకుఁ బంపుచుండ వలసినదనియు, ఆయన యేర్పాటు చేసిరి. మితిపెట్టిన రెండు సంవత్సరములలోపలనే నేనెనిమిది వివాహములు చేయఁగలిగితిని. ఆయనయిచ్చిన యధికారప్రకారము నేను

వ్యయముచేసి యుంచినయెడల, జరగిన యెనిమిది వివాహములకు నెనిమిదివేల రూపాయలును, 1882-వ సంవత్సరము ఏప్రిల్ నెల మొదలుకొని మాసమునకు డెబ్బదియైదేసి రూపాయల చొప్పున 27 మాసములకును రెండువేల పదునేనురూపాయలును, మొత్తము పదివేల పదునేనురూపాయలు కర్చుపెట్టి యీసమాజమువారికి నేను పదునేను రూపాయల ఋణము చూపియుండును. అట్లుచేయక నేను మితముగా వాడి చెన్నపట్టణపువివాహమున కొక్కదానికే 1671 రూపాయలు కర్చుపెట్టినను మొత్తముమీఁద నెనిమిదివివాహములకును 5668 రూపాయలుమాత్రమే వ్యయముచేసి మాసవ్యయములకు 1768 రూపాయలుమాత్రమే కర్చుపెట్టి, గృహములు కొనుటకయి వ్యయపఱిచిన 1166 రూపాయలును, పాత్రసామానులు, వైద్యపుఖర్చులు మొదలైనవాని క్రిందనయిన 320 రూపాయలును కలుపుకొని యించుమించుగా 8921 రూపాయలుమాత్రమే కర్చుపెట్టి వేయి రూపాయలకంటె నెక్కువగా నిలువ చూపితిని. సమాజము క్రొత్తదగుటనుబట్టి చందాలు మొదలైనవి యేర్పడక పోవుటచేత కొన్నిమాసములవఱకు యథాపూర్వకముగా నేనే మాసవ్యయాదులు జరపుచుంటిని. నరసాపురమునుండి నేను వ్రాసినయుత్తరమువలన రోషము వచ్చినవాఁడయి సంవత్సరమున్నర ప్రథమశాస్త్రపరీక్షతరగతిలోఁ జదివిన తరువాతఁ బాఠశాలకుఁ బోవుట మానుకొని పులవర్తి శేషయ్యగారు మండలన్యాయసభలో లేఖకోద్యోగమునందుఁ బ్రవేశించెను.

రఘునాధరావుగారును చెంచలరావుగారును పెండ్లిలో భోజనములు చేయకపోయినను కులమువారయిన మాధ్వులు చెన్నపురిలోని యెనిమిదవ వివాహానంతరమున వారిని కొంతబాధింప నారంభించిరి. వారి యాచార్యులైన యుత్తరాదిమఠస్వామి చెన్నపురికి వచ్చి కొంతకాలమచ్చట వాస మేర్పఱుచుకొనిరి. వృద్ధురాలైన తల్లియొక్క దీనా

లాపములచేతను.........రావుగారి ప్రోత్సాహముచేతను తామొక దుర్బల విషయములోఁ బ్రాయశ్చిత్తమునకు లోనుగావలసివచ్చిన దనియు తాము యథాపూర్వముగానే వితంతూద్వాహపక్షమునకు సాయము చేయుచుండెదమనియు, నాపేర చెంచలరావుపంతులుగారు తమ నిర్వేదమును దెలుపుచు లేఖవ్రాసిరి. ఈవిషయమును నేను రఘునాథరావుగారిపేర వ్రాసితినిగాని వారు ప్రత్యుత్తరమియ్య ననుగ్రహించిన వారు కారు. ఆసంవత్సరాంతమున శీతకాలపుసెలవులలో నే నీపనిమీఁద మరలఁ జెన్నపట్టణమునకుఁబోయి రఘునాథరావుగారి దర్శనము చేసితిని. వారు నన్నుచూచి 'నేను ప్రాయశ్చిత్తము చేసి కొంటినని మీకువ్రాసిన బుద్ధిహీనుఁ డెవ్వఁడు?' అని పలికి, వీరావేశము కలిగినట్లు దేహము పెంచి తల యూఁచి సోత్సాహమైన గంభీరోచ్చైస్స్వనముతో 'మాస్వామి యిప్పుడిక్కడనే యున్నాఁడు. ఈ సమయమునం దొక్క పెండ్లివాఁడు కుదిరినా, వాని యింటియెదుటనే పెండ్లిచేసి వానికి బుద్ధివచ్చునట్లు చేసియుందును' అని పండ్లుగీటుచు పిడుగులు పడుచున్నట్లు వీరాలాపములు పలికిరి శూరత్వము మూర్తీభవించినట్లున్న వారియాకారమును జూచి వారివాక్సారము వినునప్పుడు నాహృదయములో నొకవిధమైన వికారము పొడమి మేను గగురు పొడువ వీరికున్న యుత్సాహములో నాకు నాలవవంతుండినపక్షమున నే నెంతో పనిచేసియుండవచ్చునుగదా యని నాలోనాకే లజ్జపొడమఁ దొడఁగెను. ఈసంభాషణము ముగిసినతరువాత నేనాయనను వీడ్కొని నాలో నే నీవిషయమునే యాలోచించుకొనుచుఁ జెంచలరావుపంతులు గారి యింటికివెళ్ళి వారిదర్శనముచేసి రఘునాథరావుగారి యింటనడచిన సంభాషణమును విన్నవించితిని. ఆయన యనాదరము సూచించు ముఖభావముతో 'ఆయనమాటల కేమి లెండి?' అని పలికి, నాతో నితరవిషయములనుగూర్చి కొంతసేపు ముచ్చటించిరి. ఆయనవద్ద

సెలవుఁ గైకొని నే నింటికి వచ్చునప్పటికిఁ గొందఱువిద్యార్థులు నన్ను చూడవచ్చి, మీరు పట్టణము వచ్చెదరని విని యొక వృద్ధబ్రాహ్మణుఁడు నాలుగైదుదినములనుండి మీకొఱకుఁ దిరుగుచున్నాఁడని చెప్పిరి. ఆయనను నావద్దకుఁ దీసికొనిరండని నేను వారితోఁ జెప్పితిని. మఱునాటియుదయమున వారావృద్ధుని నాయొద్దకుఁ గొనివచ్చిరి. నా నిమిత్తమయి విచారించుచున్న కార్య మేమని నే నాయన నడిగితిని. చిత్తూరుజిల్లాలో నొకగ్రామమున నిద్దఱుబాలవితంతువులు గలరనియు, వారికి వివాహములు చేయుటకుఁ దల్లిదండ్రు లొప్పుకొని యున్నారనియు, ఆయన నాతోఁ జెప్పెను. వారిని వివాహము చేసికొనుటకు వరులున్నారాయని యడిగితిని. వరులును సంసిద్ధులయియే యున్నారని యతఁడు పలికెను. 'అట్లయినచో నిఁక నాలస్య మెందుకు ? చెంచలరావుగారివద్దకును రఘునాథరావుగారియొద్దకును పోయి వివాహము చేయింపరాదా ?' అని నే నంటిని. 'వారు మాటలవారేకాని కార్యములవారు కారు' అని యాయన నుడివెను. ఇందులో మీకింత శ్రద్ధ యెందుకు ? వితంతుకన్యలు మీకేమైన చుట్టములా ? అని మరల నడిగితిని. 'వారిదుస్స్థితిఁజూచి జాలినొంది మీరు చేయుచున్నది మంచి కార్యమని యెంచి లోకోపకారముగా వాక్సహాయము చేయవచ్చితిని' అని యాయన పరోపకారచింతఁగలవానివలెఁ బలికెను. 'అట్లయినచో మీకు నావలనఁ గావలసిన పనియేమున్నది ?' అని నే నడుగఁగా, ఆయో మార్గవ్యయములనిమిత్త మిరువదియైదు రూపాయ లిచ్చినపక్షమున తాను పోయి యిద్దఱు పెండ్లికూఁతులను వారి తల్లిదండ్రులను వరుల నిరువురను గొనివచ్చెదననియుఁ దరువాత వారికి వివాహములు చేయవచ్చుననియుఁ జెప్పెను. ఆతనిమాటలధోరణిని ముఖచిహ్నములను చూడఁగా నతఁడు మోసగాఁడు కానట్లు కనఁబడఁగా, మంచిది రమ్మని యాయనను నాబండిలో నెక్కించుకొని చెంచలరావుపంతులు

గారియింటికిఁ దీసికొనిపోయి జరగిన కథనుజెప్పి యిరువదియైదురూ
పాయ లిమ్మని కోరితిని. ఇట్టివాండ్రు మోసముచేసి సొమ్మపహరింతు
రని యాయన చెప్పెనుగాని సొమ్మపహరించిన యెడల ఆనష్టమును
నేను భరించెదనని పలికి సొమ్మిప్పించి యావృద్ధబ్రాహ్మణు నక్కడి
నుండియే పంపివేసితిని. చెంచలరావుపంతులుగారితోఁ గొంతసేపు
సంభాషించినతరువాత నాయనను వీడ్కొని బైలుదేఱి, తిన్నఁగా
రఘునాథరావుగారియింటికిఁబోయి యాయనను సందర్శించి 'మీరు
నిన్నటిదినమున వధూవరులు దొరకినపక్షమున స్వాములవారి యింటి
యెదుటనే వివాహము జరపించెదమని సెలవిచ్చితిరి. ఈశ్వరుఁడు మీ
యభీష్టమును శీఘ్రముగానే సిద్ధింపఁజేయుచున్నాఁడు. వధూవరులను
గొనివచ్చుటకయి ప్రయాణవ్యయములకిచ్చి యొకమనుష్యుని నేనిప్పుడే
పంపించితిని' అని చెప్పితిని. ఈ కడపటివాక్యమును ముగించునప్పటి
కాయనముఖము కళాహీనమయి వైవర్ణ్యము నొందెను. ఆయన
చేతులు జోడించి నాకు నమస్కారముచేసి, 'ఈపక్షమునఁ బనిచేసి
నందుకు నే నీవఱకే బహుబాధలు పొందితిని. నేఁ నిఁక దీనితో సం
బంధము కలిగించుకొనఁజాలను. క్షమింపుఁడు' అని స్పష్టముగాఁ
బలికిరి. నే నప్పటి కాయనను వీడ్కొని బంసీలో నింటికిఁ బోయి
తిని. నాతోఁ జెప్పిన ట్లాముసలాయన నాలుగైదు దినములలో వధు
వుల నిద్దఱిని వారిజననీజనకులను వరుల నిద్దఱను తీసికొనివచ్చి నా
కప్పగించి తనదారిని పోయెను. ఆయన మరల నాకంటఁ బడలేదు.
తరువాత విచారింపఁగా నావృద్ధవిప్రుఁడు వధువుల మాతామహుఁ
డయినట్లుఁ దెలియవచ్చెను. పెనుకటివలె నంతవిజృంభణముగాఁ జేయక
మాచేతనున్న వేయిరూపాయలనుమాత్ర మీరెండువివాహములకును
వ్యయపెట్ట నిశ్చయించుకొని ఆవధూవరులకుటుంబములను బ్రహ్మ
సమాజమందిరమునందుంచి, నామిత్రుల కావిషయమును దెలిపితిని.

చెంచలరావుపంతులుగారును రఘునాథరావుగారును నావద్దకు వచ్చి యీవివాహములను చెన్నపట్టణములో జరపవలదనియు, తాము రాక పోయినయెడల తమ పేరుచెడుటయే కాని వివాహపక్షమున కేమియు లాభము కలుగదనియు, అంతేకాక తా మీపక్షమును విడనాడినట్లు జనులకుఁ దెలిసినపక్షమున ముఖ్యులు విడిచిరని యీపక్షమునకు నష్టమే కలుగుననియు, అందుచేత తమగుట్టు బైలఁబడకుండ వివాహములను స్థలాంతరమునఁ జేసి తమ్మవమానమునుండి కాపాడవలసినదనియు, ప్రయాణవ్యయములను తాము వహింతుమనియు నన్ను బహువిధములఁ బ్రార్థించిరి. నా కప్పటికి వారికోరిక చెల్లించి వివాహపక్షము నపవాదమునుండి తప్పించుటయే యుచితమని తోఁచినది. ఈ యాలోచనలలో బహుదినములు గడచిపోయినవి. సెలవు అంతము కావచ్చుచున్నందున నేను పోవలసిన దినములు సమీపించుచుండెను. వివాహము లొకస్థలములోనే జరుగుచుండుటకంటె వేఱు వేఱు తావులలో జరపించుట యధికలాభకరము గనుక మీస్థలములో జరపబూనుకొనెదరా యని మేము స్త్రీపునర్వివాహ పక్షాభిమానుల కనేకులకు వ్రాసితిమి. వారిలో బళ్ళారినుండి రావుబహద్దరు సభాపతిముదల్యారిగారు సమస్తవ్యయములను వహించి తమపట్టణములో తాము చేయఁబూనుకొనెదమని వ్రాసిరి. నాసెలవులయిపోవచ్చినందున బళ్ళారికివెళ్ళి వివాహములు చేయించి తిరిగి రాజమహేంద్రవరము వచ్చుటకవకాశము చాలక, వధూవరులు మొదలైనవారిని బళ్లారికిఁ గొనిపోయి వివాహములు జరపివచ్చుటకు నామిత్రులయిన మన్నవ బుచ్చయ్యపంతులుగారి కొప్పగించి, వేయిరూపాయలను బుచ్చయ్యపంతులుగారి చేతికిచ్చినట్లు చెంచలరావు పంతులుగారితో మాటాడి యేర్పాటుచేసి, నేను మరలి వచ్చితిని. ఈప్రయాణమువలన మాక్రొత్తసమాజమునకు ధనముకూర్చి చెన్నపట్టణమునుండి పట్టుకొనిపోవుటకు బదు

లుగా చెన్నపట్టణములోనున్న వేయిరూపాయలనుకూడ వ్యయముచేసి వట్టిచేతులతో మా యూరు చేరితిని. 1885-వ సంవత్సరము ఫిబ్రవరి నెల 6-వ తేదిని బుచ్చయ్యపంతులుగారు పెండ్లివారితో బళ్ళారికి వెళ్ళినట్టు శ్రీరఘుపతి వేంకటరత్నమునాయఁడుగారు నాకుఁ దంతి వర్తమానమును బంపిరి.* ఆనెల 12-వ తేదిని 15 ఏండ్లు ప్రాయము గల పెద్దవధువును చిత్తూరి సుబ్బారావుగారును, 12 ఏండ్లు ప్రాయము గల చిన్నవధువును జటప్రోలు రామారావుగారును బళ్ళారిలో వివాహమాడిరి. ఇవి రామకృష్ణయ్యగారి ధనముతో మాచే జరిగింపఁబడిన పదునొకండవ పండ్రెండవ వితంతు వివాహములు.

ఇప్పుడు వివాహములు చేయుటకుమాత్రమేకాక ప్రతివమాసమును చేయవలసిన వ్యయములకు సహితము సొమ్ము కావలసియున్నది. న్యాపతి సుబ్బారావుపంతులుగారును, సీ. నాగోజీరావుగారును, ఆత్మూరి లక్ష్మీనరసింహముచెట్టిగారును, ఇతరసామాజికులును చందాల నొసఁగి సాయము చేయుచున్నను, మావ్యయములకు వారౌదార్యముతో నిచ్చెడు ధనము చాలకుండెను. అందుచేత చందాలు దయచేయుటకయి మహాజనుల వేఁడుట యావశ్యకమయినందున, మా సమాజమువారు ధనసహాయ్యార్థమైన తమవిజ్ఞాపనపత్రముతో నన్నుఁ జెన్నపురి మొదలైన ప్రదేశములకుఁ బంప నిశ్చయించిరి. మాపాఠశాలకు వేసవికాలపుసెలవు లియ్యఁబడినపిమ్మట మాసమాజమువారిచే సమకూర్పఁబడిన యీక్రిందివిజ్ఞాపనపత్రముతోఁ జందాలు వేయించుటకయి నేను సకుటుంబముగాఁ జెన్నపురికిఁ బ్రయాణమయిపోయితిని—

"స్త్రీ పునర్వివాహము.

ఈక్రింద చేవ్రాలుచేసిన మేము రాజమహేంద్రవర వితంతు వివాహసమాజపక్షమున మా వేఁడికోలు వ్యర్థముకాదన్న సంపూర్ణ

* Marriage Party Pantulu gone for celebration Bellary to day.

విశ్వాసముతో ధనసాహాయ్య నిమిత్తమైన యీప్రార్థనను హిందూ దేశముయొక్క జ్ఞానసంపన్నులయిన మహాజనుల ముందుంచుట కనుజ్ఞ వేఁడుచున్నాము.

హిందువులలో నిర్బంధ వైధవ్యమనలని యనర్థములు చెన్నపురి రాజధానియందును హిందూదేశముయొక్క యితర ప్రదేశముల యందునుగూడ సర్వపత్రములను అత్యంతోత్సాహముతోను సమర్థతతోను ఈనడుమనే విమర్శింపఁబడినందున వాని నిక్కడ మరల ననువదించుట మాకనావశ్యకము. హిందూసుందరులయొక్క పునర్వివాహమును శాస్త్ర మంగీకరించుచున్నదని మహాజనులకు విశ్వాసము కలిగించుటకయి మాచేతనైన దంతయు చేసియున్నాము. ఈశ్వరాశీర్వాదమువలన మేము కడచిన మూఁడు సంవత్సరములలోపల బాలవితంతువులయొక్క పండ్రెండువివాహములను చేయునంత కార్యసాఫల్యము నింతవఱకు బొందియున్నాము; సాంఘికక్రౌర్యమునకుఁ దాళుటకయి శక్తులనుగాఁ జేయుటకొఱకుఁ గొంత ధనసాహాయ్యము చేయఁబడెడు పక్షమున, వివాహములు చేసికొనుట కనేక బాలవితంతువులును యౌవనపురుషులును నున్నారని చెప్పుటకు మేము సంతసించుచున్నాము. హిందూస్త్రీలపునర్వివాహమును ప్రోత్సాహపఱుచుటకయి లంచములిచ్చుపద్ధతిని దేనిని అవలంబించుటకు మేము ప్రతికూలురముగా నున్నాముగాని సంఘముయొక్క ప్రస్తుతస్థితినిబట్టి కొంత ధనసాహాయ్య మత్యంతావశ్యకమయినట్టు కనఁబడుచున్నది. ఈ కార్యములకు విరోధముగా దురాగ్రహము బలముగా నున్నందున, ఈవివాహములు చేసికొన్నవారు సర్వవిధములైన బాధలకును లోఁబఱుపఁబడుచున్నారు. వారు తల్లిదండ్రుల యిండ్లనుండి వెడలఁగొట్టఁబడుచున్నారు; బంధువులచేత విడిచిపెట్టఁబడుచున్నారు; సేవకులు వారిని విడిచి పోవుచున్నారు;

జనులవద్ద పనిలో నుండుట తటస్థించినపక్షమున, వారు పనులలోనుండి తీసివేయఁబడుచున్నారు. కాఁబట్టి యట్టివారిని మరల సంసారయాత్ర యందు నిలువఁబెట్టుటకయి కొంత ధనసహాయ్య మావశ్యకముగా నున్నది. మేము కొన్నిసమయములయందు వారికిఁ గాపురములుండుట కయి యిండ్లియ్యవలెను; రోగసమయములయందు సాయము చేయవ లెను; విద్య చెప్పించవలెను; స్వయముగా సంపాదించుకొనుటకు శక్తు లగువఱకును వారిజీవనమున కాధారములు కల్పింపవలెను. ఇవిగాక, మేము వివాహవ్యయమును భరింపవలెను; అపరిమితమయిన జీతము లిచ్చి సేవకులను పెట్టవలెను; పెండ్లితంతును నడపుటకయి పురోహి తుని కియ్యవలెను. ఇంతవఱకు మే మీవ్యయముల నన్నిటిని అత్యంత దేశాభిమానియు పరోపకారబుద్ధియు కాకినాడ నివాసియు నయిన పైడా రామకృష్ణయ్యసెట్టిగారు మావశములో నుంచిన ధనము (సు మారు రు. 10000 లు) నుండియు ఇతరోదారపురుషు లిచ్చిన సహా యధనమునుండియు, భరింపఁ గలిగినారము. మాయధీనములో నుంచఁ బడిన ధనమంతయు నించుమించుగా వ్యయపడిపోయినది. ఇఁక మా పురోవృద్ధియంతయు మహాజనులవలన మేము పొందెడు ధనసహాయ్య ముమీఁద పూర్ణముగా నాధారపడి యుండును. రాజాసర్. టి. మాధ వరావుగారు మాకు దయాపూర్వకముగా రు. 500 లిచ్చి, యింకను సాయము చేయుటకయి వాగ్దానము చేసియున్నారు. ఈసంకటసమయ మునందు మాకుఁ దమ యుదారహస్తము నొసఁగి మేము పూనియున్న కార్యమును సాగించుటకయి మమ్ము శక్తులనుఁగా జేయుటకొరకు దేశ క్షేమమునుగోరువారి నందఱిని మేము వినయముతో వేఁడుచున్నాము.

చందాలును దానధనములును అర్బత్ నట్ కంపెనీవారిచేతఁ గాని, ఈక్రింది చేవ్రాళ్లుచేసిన యెవ్వరిచేతనైనను గాని స్వీకరింపఁబడి

సంవత్సరమున కొక్కపర్యాయము చందాదారులకుఁ బూర్ణమైన లెక్క చూపఁబడును.*

| | |
|---|---|
| వితంతువివాహ సమాజము, రాజమహేంద్రవరము మేయి 1885. | సీ. నాగోజీరావు, బి. యే.<br>కే. వీరేశలింగము.<br>ఏ. ఎల్. నరసింహము బి.యే., బి.యల్.,<br>యస్. సుబ్బారావు, బి. యే., బి. యల్., |

---

## RE-MARRIAGE OF HINDU WOMEN

* We, the undersigned on behalf of the Widow Marriage Association of Rajahmundry, beg leave to lay before the enlightened Public of India the following appeal for pecuniary aid with the full confidence that we shall not be making it in vain.

The evils of enforced widowhood among Hindus have been of late so warmly and so ably discussed from all points of view both in Madras and other parts of India that it is hardly necessary for use to recapitulate them here. We have done our best to convince the public that the remarriage of Hindu Women is sanctioned by the Sastras, and have, With God's bleseing, so far succeeded that within the last three years 12 marriages of young widows have been performed, and we are glad to say that there are several young widows and young men who are willing to marry if some pecuniary help is given them to enable them to withstand social tyranny. We are averse to adopting any system of bribery for encouraging the remarriage of Hindu women, but some pecuniary help seems to be absolutely necessary in the present state of society. The prejudice against the movement is so strong that persons contracting such marriage are subjected to all sorts of annoyance. They are driven out of the house, of their parents, are abondened by their relations, and deserted by their servants; and if they happen to be in private service, their services are dispensed with. It is, therefore necessary that some pecuniary help should be given to them to start them in life again. We have some times to provide them with houses to live in, help them in case of illness, educate them, and provide

నేను చెన్నపురి చేరినతరువాత చందాలనిమిత్తము గొప్పవారి యిండ్లకు బండ్లమీఁద తిరుగుచు వచ్చుటయేకాక 1885-వ సంవత్సరము జూన్ నెల 29-వ తేదిని బాబుగారిబాలికాపాఠశాలలో సభ చేసి రాజమహేంద్రవర స్త్రీపునర్వివాహ చరిత్రమునుగూర్చి యుపన్యసించి యుపన్యాసావసానమునఁ జందాలు వేయించుటకై ప్రయత్నించితిని. ఇది చందాలసభ యగుటచేఁ బెద్దమనుష్యు లనేకు లాసభకు రాలేదు. వచ్చి నాయుపన్యాసమును విన్నవారు నూఱులకొలఁది యున్నను చందాలపుస్తకమును పయికిఁ దీయగానే యొక్కరొక్కరే యావలికి దాటి నూఱులకొలఁది నున్నవారు పదులకొలఁది యయిరి. ఆయున్నవారిలోఁ గొందఱు కొన్నిచందాలను వేసిరి. నేను చదువుకొన్న యుపాధ్యాయుల కడకేగి నాయందత్యంతప్రేమను కలిగియుం

---

them with the m[illegible]ans o[illegible] l[illegible]velihood till they can earn it for themselves. Besides, we have also to incur the Marriage expenses, hire servants at exhorbitant rates and pay the Priest for the performance of the ritual. All these expenses we have hitherto been able to bear from the funds (about 10,000 Rs.) placed at our disposal by that most patriotic and benevolent gentleman, Paidu Rama Krishnaiya Chetty Garu of Coconada and from the contributions of other liberal gentlemen. But the funds plac[illegible]d at our disposal have been nearly exhausted, and our further progress depends entirely upon the pecuniary aid we can secure from the public. Rajah Sir T. Madhava Rao, has kindly contributed Rs. 500, has promised more help, and we beseech all the well wishers of the country to give us their helping hand at this juncture and enable us to further the movement we have undetaken.

Subscriptions and donations will be received by Messrs Arbuthnot & Co., or by any one of the undersigned and full account thereof rendered to the subscribers once a year.

| | |
|---|---|
| Widow Marriage Association. ajahmundry, May 188[illegible]. | C. NAGOGIRAO, B. A.<br>K. VEERESALINGAM;<br>A. L. NARASIMHAM, B.A., B L.,<br>N. SUBBARAO, B.A., B.L., |

దెను. నేను ప్రవేశపరీక్షతరగతిలోఁ జదువుకొనుచుండినప్పుడు ప్రధా
నోపాధ్యాయుఁడుగా నుండిన శ్రీ చెంగల్వ కుప్పుస్వామిశాస్త్రిగా రుప
కారవేతనమునొంది యప్పుడు చెన్నపట్టణములోనుండి, నేను పట్టణ
మునకు వచ్చుటవిని నన్నుచూడ నభిలషించి నే నెక్కడ నుంటినో
తెలియక నాఁటిదినమున నే నుపన్యసింపఁ బోవుచున్నానని పత్రికా
ముఖమున నెఱిఁగి యుపన్యాసభవనమునకు నన్ను వెదకుకొనుచువచ్చి
చూచి యాలింగనము చేసికొని ప్రియశిష్యునితోడి సుఖసల్లాపము
నందు గొంతసేపుగడపి, అయిదురూపాయలు చందాయిచ్చిపోయిరి.
నే నీ ప్రకరణమునందు వ్రాసినదానిలో విశేషభాగ మీదినమునఁ
జేసిన యుపన్యాసమునుండి గైకొనఁబడినదే. అప్పు డీయుపన్యాసము
నందు పైడా రామకృష్ణయ్యగారిని గూర్చి యిట్లు చెప్పితిని.—

"ఈ వ్యయములన్నియు శ్రీపైడా రామకృష్ణయ్యగారు మహౌ
దార్యముతో మాసమాజమునకు దయచేసిన పదివేలరూపాయలతోనే
జరపఁబడినవి ఈయన సాహాయ్యమే లేక యుండినయెడల మేమిం
దులో నొక్క వివాహమునైనను జేయుటకు సమర్థులమై యుండము.
కాఁబట్టి యీవివాహముల కన్నిటికిని మూలాధార మీ మహాపురు
షుఁడేయని నిస్సందేహముగా చెప్పవచ్చును. ఈయన కీమధ్య లక్ష
యేఁబది వేల రూపాయలు నష్టము వచ్చినను, ఇప్పటికిని బహువిధముల
నీమహాకార్యమునకుఁ దోడుపడుచునే యున్నాఁడు. ఈ పదివేల రూపా
యలునుగాక మొదటి రెండువివాహములకు నయిన సమస్తవ్యయము
లను వహించుటయేకాక, ఈయనయే కొన్నిగృహములను సహితము
పునర్వివాహదంపతులు కాపుర ముండుటకయి సమాజమువారి వశ
మునయుంచి యున్నాఁడు. పరోపకారశీలుఁడైన యీదయాశాలియొక్క
యీ యోగ్యదానమును నేను వర్ణింపవలసిన పనిలేదు. ఈయిచ్చిన
ధనము పోయినను, తనువులు పోయినను, మఱియేమి పోయినను,
ఈయనకీర్తి యీభూమండలములో స్థిరముగా నుండకపోదు. నావంటి

వారు కొందఱు పనిముట్లవలె కొంత యుపయోగపడినను, ఈ కార్య వ్యాపనమున కీఘనుఁడే ముఖ్యకారణుఁడు."

ఈ యుత్తమపురుషుని దృష్టాంతమును జూపి సభవారిని సత్కార్యమునకుఁ బురికొల్పి "ఎవ్వరికిని భారముగా నుండని యీయుత్తమ కార్యమునకు మీరు తోడుపడెదరు పక్షమున, ఇంతవఱకు కాయకష్ట పడి శ్రీపైడా రామకృష్ణయ్యగారి ధనముతోఁ జేసినపని నేటి నుండి మీధనముతోఁ జేసి చేతనయినంత కృషిచేసి మీధనము సార్థక పఱుచునట్లు సాధ్యమయినన్ని వివాహములను జేయ బ్రయత్నించెదను." అని వ్యాఖ్యానము చేసితిని. తరువాత జాబ్తా చేసికొనిపోయి చందాలనిమిత్తము గొప్పవారిగృహములకుఁ దిరుగ నారంభించితిని. శ్రీ పిఠాపురపురాజుగారి దత్తపుత్రు లిన్నూఱురూపాయ లిచ్చిరి. చెంచలరావు పంతులుగారును రఘునాథరావుగారును చెఱి నూఱేసి రూపాయలును చందాలు వేసిరిగాని తరువాత వారియ్య ననుగ్రహింప లేదు. సాంబయ్యసెట్టిగారును, రాజరత్నము మొదలియారుగారును, రంగయ్యసెట్టిగారును, నంబెరుమాళ్ళసెట్టిగారును, ఒకరొకరు ఇరువదియైదేసి రూపాయలు చందాలు వేసిరి. ఇరువది, పదునేను, పది రూపాయలు ముగ్గురిచ్చిరి. బండి చేసికొని యొక గొప్పగృహస్థునియింటికి చందానిమిత్తము పోయితిని మహాధనికుఁడై వితంతువివాహముల యందత్యంతాదరము చూపుచు నేను పోయినప్పుడెల్ల ప్రత్యుత్థానము చేసి నన్నధికగౌరవముతోఁ జూచుచుండెడి యాగృహస్థుఁడు చందా నిమిత్తము నేను పోయిన యాదినమునందు నా పేరుగలచీటి లోపలికిఁ బోయిన యరగంటసేపునకు వెలుపలికివచ్చి తాను తొందరపనిమీఁద నున్నట్లు నిలుచుండియే రెండుమాటలు చెప్పి మరల లోపలికిఁబోయెను. అతనికి నిజముగా తొందరపనియే యుండి యుండవచ్చునుగాని నేను మాత్రమది గొప్పయవమానముగా భావించుకొని కోపముతో వెనుక

మరలితిని. బాల్యమునుండియు నాది శీఘ్ర కోపోద్రేకము నొందెడు స్వభావము. కార్యార్థమయి యొరుల వేఁడు వారికుండవలసిన యోర్పు గాని వారి ననుసరించి తిరుగవలసిన యణఁకువగాని నాయొద్ద లేదు. మొదటినుండియు నేను శాసించుటకే కాని యాచించుట కలవాటు పడిన వాఁడనుగాను. ఏ హేతువుచేతనో కాని యీశ్వరుఁడు నన్నుఁ గార్యవాదినిగాఁగాక శుద్ధవాదినిగా సృజించియున్నాఁడు. ఈయవమానము యాచింపఁబోయినందువలనఁ గలిగినఫలముగదా యని మనస్సులోఁ బశ్చాత్తాపమునొంది, ఇఁకముందెవ్వరిని యాచింపఁబోఁగూడదని నిశ్చయము చేసికొని, మఱియెవ్వరియింటికిని బోక యోడనెక్కి రాజమహేంద్రవరమునకు మఱునాఁటికే పోయితిని. ఈసారి మదరాసుప్రయాణ వ్యయములనుమాత్రము నేను పోగుచేసిన చందాసొమ్ములోనుండి పుచ్చుకొని, శేషమును సమాజమువారి కిచ్చివేసితిని. రాజమహేంద్రవరములోని నా సహాయకులు నెలచందాల నిచ్చుచుండుటయేకాక వారిలో ననేకులు పెక్కుమొత్తములు సహాయము దయచేసిరి. న్యాపతి సుబ్బారావుపంతులుగారు మన్నూఱు రూపాయ లిచ్చిరి; వాడ్రేవు చలపతిరావుగారిన్నూఱురూపాయలిచ్చిరి; కృష్ణస్వామిరావుపంతులుగారును, సి. నాగోజీరావుపంతులుగారును, ఆత్మూరి లక్ష్మీనరసింహముసెట్టిగారును నూటేసి రూపాయ లిచ్చిరి. ఏఁబదిరూపాయ లిచ్చినవారొక్కరును, ఇరువదియైదేసి రూపాయ లిచ్చినవారు ముగ్గురును, పదునైదేసి రూపాయ లిచ్చినవారిద్దఱును, పదేసి రూపాయ లిచ్చినవారు నలుగురును ఉండిరి. మావిజ్ఞాపనపత్రికను జదివి సహాయులైనవారిలో బెంగుళూరులోని యున్నతన్యాయసభలోని న్యాయాధిపతి (Judge) యైన ఏ. రామచంద్ర అయ్యరుగారు వివాహమొకటికి నూఱేసి రూపాయలు పంపుచుండుటయేకాక, ఆఱేసినెలలకు నూఱు రూపాయలు చందా నిచ్చుచుండిరి; ఇటీవల రావుబహదూరు ఏ. సభా

పతి మొదల్యారిగారు వివాహ మొకటికి నూటేసిరూపాయలచొప్పున బల్లారినుండి పంపుచుండిరి. ఇట్లు సేకరించిన ధనముతో సమాజము వారు నెలజీతము లియ్యవలసినవారి కిచ్చుచు, వివాహములు చేసి కొన్నవారికిఁ గావలసిన సహాయము చేయుచు, మిగిలినదానితో వివాహములు చేయుచుండిరి. ఈసంవత్సరము డిసెంబరు నెల 20-వ తేదిని జరగిన 13-వ వివాహమునకయిన మున్నూఱురూపాయలును రామకృష్ణయ్యగారు రహస్యముగా నాయొద్దకుఁ బంపిరి. ఈవివాహమునందు వరుఁడు పట్నాల వెంకయ్యగారు; ఇతఁడు మొదట చిన్నయుపాధ్యాయుఁడుగానుండి పిదప కరణ మయ్యెను.

వివాహమునిమిత్తము చెన్నపురికిఁ గొనిపోఁబడి వివాహము జరగక మరలఁ దీసికొని రాఁబడిన తిరువూరు చలపతిరావుగారి మఱదలొకతె యింకను వివాహము కాక నిలిచియుండెను. ఆచిన్నదానినిచ్చి వివాహము చేయుటకయి మంగళగిరి కృష్ణమూర్తియను మాధ్వబ్రాహ్మణబాలుని విద్యచెప్పించుచు నేను సంసిద్ధుని చేసియుంచితిని. అతఁడు మాయింటనేయుండి ప్రవేశపరీక్షతరగతిలోఁ జదువుచుండఁగా, ఆఱునెలలకు బదమూడేసి రూపాయల చొప్పున రెండుసారులు పాఠశాలజీతమిచ్చి, బట్టలు, పుస్తకములు మొదలైనవిచ్చి, స్ఫోటకము వచ్చినప్పుడు పదిరూపాయలు కర్చుపెట్టి, వివాహమున కేర్పాటు చేసినప్పుడు చిన్నదానితల్లి స్మార్తురాలయిన తనకొమారితెను మాధ్వున కియ్యనని యాసంబంధమును నిరాకరించెను. తరువాత నాచిన్నవాఁడు ప్రవేశపరీక్షలో మొదటితరగతియందుఁ గృతార్థుఁడయి, పిలిచి పిల్లనిచ్చిన స్వజాతికన్యను పరిణయ మయ్యెను.

చిన్నదానితల్లి తనకొమారితెకు వరునిగా కొమ్మరాజు గోపాలమను పేరుగల స్వశాఖవాఁడైన యొక నియోగిబ్రాహ్మణబాలుని నావద్దకుఁ దీసికొనివచ్చి వివాహము చేయుమని యడిగినది. అతఁడు

చదువుకొన్నవాఁడు కాఁడు; అల్లరిగా తిరిగి తల్లిదండ్రుల మాటవినక లేచివచ్చినవాఁడు. ఈహేతువులను బట్టి నే నాతనికి వివాహముచేయు నని నిరాకరించితిని. అందుపై నామె ఆత్మూరి లక్ష్మీనరసింహము గారియొద్దకు వెళ్ళి, ఆయనయొద్దనుండి శ్రీ పైడా రామకృష్ణయ్యగారి కుత్తరము పుచ్చుకొని వరునితోఁగూడ కాకినాడకు వెళ్ళెను. అప్పుడు రామకృష్ణయ్యగారు నా కిట్లు వ్రాసిరి —

'చిన్నపిల్లతల్లి నాయొద్దకు వచ్చెను. వివాహము జరుపుటకు నేనుకూడ నొప్పుకొన్నాను. ఈ నిమిత్తము మిక్కిలి ఆవశ్యకముగాను అనివార్యముగాఁ గావలసిన సొమ్మెంత తక్కువసొమ్మును దయచేసి నాకుఁ దెలుపుఁడు. ఇది అయినతరువాత మనము ప్రస్తుతము వివాహములు చేయుట నిలుపవలెను.......................

మనమిత్రుఁడు బి. ఏ., బి యల్. నాకు వ్రాసిన యుత్తర మీమె యిచ్చినది. ఈ పెండ్లి మసులాలో చేయుట కాయన చెప్పెను. మన మాలాగున చేసినయెడల మనకు విస్తారము సొమ్ము కావలెను. ఒకవేళ అక్కడ తిరిగి చిక్కులు వచ్చును. ఇది రాజమహేంద్రవరములోనే చేయవలెనని నే నాలోచన చెప్పుచున్నాను. పిల్లవాఁడును అత్తగారును కలిసి మాటాడిరి; ఇద్దరు ఒప్పుకొన్నారు. మీరెప్పుడు ముహూర్త మేర్పఱిచినను వెళ్లుట కతఁడు సిద్ధముగా నున్నాఁడు. మెట్రిక్యులేషను వఱకుఁగాని మిడిల్‌స్కూలు పరీక్షవరకుఁగాని చదువుటకు మనమీ కుఱ్ఱవానిని సహాయింపవలెను. అతఁ డీవఱకే కొంచెము చదివినవాఁ డగుటచేత కడపటిదాని కొక్క సంవత్సరము చాలును......ఈ వ్యయములకు నేనిచ్చుచున్నానని మీ వివేకవర్ధనిలో వ్రాయకుఁడు. దయచేసి నాపేరు రహస్యముగా నుంచుఁడు.' *

* "The mother of the little girl came to me I also agree to perform the marriage ceremony. Please let me know the lowest amount of money which is most urgently and

లైన వారికందఱికి నాహ్వానములు పంపితిని. వారందఱును వచ్చి వేచి యుండిరి. కాని పెండ్లికొడుకు రాకపోవుటచేత పెండ్లినిలిచిపోయి నది. ఈసంగతులను దెలుపుచు నేను వ్రాసినలేఖ కుత్తరముగా మార్చినెల 5-వ తేదిని రామకృష్ణయ్యగారు నాకిట్లు వ్రాసిరి—

"పెండ్లికి లిస్టరుదొరగారు మొదలైనవారిని పిలిచితినిగాని పెండ్లికొడుకు రానందున పెండ్లి జరగలేదని తెలుపుచు మీరు వ్రాసిన యుత్తర మందినది. అటువంటి యాశాభంగములు కలుగునని నేనెఱుంగుదును. ఇల్లు కోరఁగలవాఁడను కానన్న షరతుతో నతని వద్దనుండి మీరుత్తరము పుచ్చుకొన్నట్లు మీయుత్తరములోఁ జెప్పితిరి. మన మిల్లు నియ్యకపోయినయెడల, వా రెక్కడ నుందురు? మన మతని కేదో యిల్లియ్యవలెనుగాని, మనకు వారవిధేయులుగా నున్నపక్షమున వారు దాని హక్కును కలిగియుండరు. అటువంటిషరతుమీఁద నియ్యవలెను. నాయుద్దేశ మిది. అట్లు చేయుఁడు. అతనిని మరలఁ బిలిపించి వివాహమున కేర్పాటుచేయుఁడు. ఈ పెండ్లికూఁతురుకొఱకును తల్లికొఱకును మనము విశేషవ్యయము చేసితిమి. ఇది మనము చేసిన యెడల ముందు వివాహములనిమిత్తము మనము శ్రమపడ నక్కఱలేదు. ఇష్టమున్నయెడల మనము మానివేయవచ్చును. ఇందునుబట్టి యీవిషయమై పెండ్లికొమారుని ఉత్తరమిమ్మని యడుగుటకూడ అవశ్యకము కాదు. అయినను మీరీవఱకే యట్లు చేసితిరి కాన పోనిండు.'*

---

* "Cocanada, 5th March 1886. My dear friend,

I have received your letter stating that you have invited Mr. Lister etc., to the marriage, but as the bridegroom disappointed, the marriage did not take place. I know such disappointments will happen. You stated in your letter that you have taken a letter from the man on the condition of not claiming for a house. If we wo'nt give a house, where will they be? We must give him some house, but they will not have possession of it if they be disobedient to us. We

సిద్ధమయిన వివాహమునకు భంగము కలుగుట కిదియే ప్రథమము కాదు. చెన్నపట్టణమున కొకసారి నేను వెళ్ళియుండినప్పు డక్కడ కూడ నొకవివాహమున కీలాగుననే భంగము కలిగెను. చెంచలరావు పంతులుగారి ముద్రాపత్రకార్యస్థానము (Stamp office) లో నొక వైష్ణవు డుద్యోగములో నుండెను; ఆయనకు బుట్టినసంతానము లేక యొక్కతెయే కూతు రుండెను; ఆయొక్క కూతురును పతివిహీన యయ్యెను. ఆతనియొద్ద నిరువదివేలరూపాయ లుండెను. చెంచలరావుపంతులవారి ప్రోత్సాహముచేత నావైష్ణవుడు బాలవితంతువైన తనకొమారితకుఁ బునర్వివాహముచేయుట కంగీకరించెను. ఇంక తగిన వరుఁడు కావలసియుండెను. నావద్దకు వచ్చుచుండినవిద్యార్థులలో నే నీవిషయము ముచ్చటింపగా వారిద్దరు వైష్ణవవిద్యార్థుల నన్నదమ్ములను నాయొద్దకుఁ గొనివచ్చిరి. వారిలోఁ బెద్దవాఁడు పట్టపరీక్షతరగతిలోను, రెండవవాఁడు ప్రథమశాస్త్రపరీక్షతరగతిలోను, క్రైస్తవ కళాశాలలోఁ జదువుచుండిరి. వారిలోఁ బెద్దవానికి వివాహమయ్యెను గాని చిన్నతఁడు బ్రహ్మచారిగానే యుండెను. అతఁ డన్నగారియనుమతిమీఁద నాబాలవితంతువును వివాహమాడుట కంగీకరించెను. నే నాతనిని గొనిపోయి చెంచలరావు పంతులుగారికిఁ జూపి వధువుతండ్రిని పిలిపించి యాతనికిఁ గూడఁ జూపినపిమ్మట నతఁడు తనకొమారితె నా చిన్నవాని కిచ్చుట కొప్పుకొనెను. కొన్ని దినములలోనే ముహూర్త

---

must give on such condition. This is my object. Please do so. Please get the man again and arrange for marriage. We have spent much for the bride and her mother. If we do this, we need not take trouble in further for marriages. We can cease if we wish. Owing to this understanding it is not necessary to ask even the bridegroom to give a letter on the subject. However as you had done it, it is no matter.

Yours truly, P. Ramakrishnah"

నిశ్చయము చేయఁబడినందున నాటిసాయంకాలము నేనును చెంచలరావు పంతులుగారును వధువుగృహమునకుఁ బోయి వివాహసన్నాహమంతయు చేసి, మంత్రములు చెప్పుటకు యాజకుని నొప్పగించి, వరునావలనే వారిగృహమునఁ బెట్టి, వివాహ మగునన్న నిశ్చయముతో మేముపురమును మాగృహములకుఁ బోయితిమి. నేను పరుండి నిద్రపోవుచుండఁగా రాత్రి పదిగంటలు దాటినతరువాత నొకమనుష్యుఁడు మాయింటికివచ్చి కేకలువేసి నన్ను లేపి చెంచలరావు పంతులుగారు పంపినయుత్తరము నాచేతి కిచ్చెను. ఆవివాహవార్తను దెలిసికొని ముందుగా నెవ్వరో కుంభకోణములోనున్న వరుని మేనమామలకుఁ తంతివార్త పంపిరనియు వారు రాచిన్నవానిమీఁద నేదో యభియోగము తెచ్చి పోలీసువారిని వెంటఁగొనివచ్చి పెండ్లిపీటమీఁద కూరుచుండియున్న వరుని బలవంతముగా నీడ్చుకొనిపోయిరనియు, తెల్లవారుజామున వారు వెళ్ళెడు పొగబండిలోనే యెక్కి కుంభకోణమునకుఁ బోయి గోపాలరావుగారు మొదలైనవారితో మాటాడి వరునివిడిపించి తీసికొని రావలసినదనియు, ఆయుత్తరములో నుండెను. నే నప్పుడు మన్నవ బుచ్చయ్యపంతులుగారియింట బస చేసియుంటిని. కుంభకోణము పోయి యచ్చటివారితో మాటాడి కార్యసాఫల్యము చేసికొనివచ్చుటకు నాకా దేశభాషయైన యఱవము తెలియదు. అందుచేత బుచ్చయ్యపంతులుగారిని ప్రయాణముచేసి, గోపాలరావుగారిపేర నుత్తరము వ్రాసియిచ్చి, ఆయన నారాత్రియే కుంభకోణమునకుఁ బంపితిని. ఆయన రెండుదినములలోఁ బెండ్లికుమారుని విడిపించి తనవెంటఁ దీసికొనివచ్చెను. ఇంతకష్టపడి తీసికొనివచ్చిన తరువాత వధువుతండ్రి తనకొమారితకుఁ బెండ్లియోగము లేదనియు, ఉండినపక్షమున నాఁటిరాత్రిసిద్ధమైన పెండ్లిపీటలమీఁదివివాహము తప్పిపోయి యుండదనియు, చెప్పి నేనును చెంచలరావుపంతులుగారును ఎంతచెప్పినను మామాటవినక వివాహము మానివేసెను.

ఈ చెన్నపట్టణపు వివాహము వలెఁ బూర్తిగఁ జెడిపోక మా రాజమహేంద్రవర వివాహము తరువాత జరిగినను రామకృష్ణయ్యగారి జీవితకాలములో జరగలేదు. మార్చినెల 17-వ తేదిని కొంత యింగ్లీషు తోను కొంత తెలుఁగుతోను రామకృష్ణయ్యగారు నాకీయుత్తరము వ్రాసిరి.—

"Cocanada, 17th March 1886.

My dear friend,

I am suffering by a boil on the neck for the last 15 days. I have seen our A. L. Narasimham Gar and spoke to him every thing. Please see him. Dont lose Ravi Guruvavadhany's money. I got a letter from him. This correspondence made through Peri Vissayya Gar, pleader at Amalapur, the contents of which are a request to grant time to pay the money for the bond he executed. Please get a copy of the document and send me, or please send to Peri Vissayya Gar to complain.

(కడచిన 15 దినములనుండి మెడమీఁద కురుపుచేత నేను బాధపడుచున్నాను. మన ఏ. ఎల్. నరసింహముగారిని చూచినను సర్వమును ఆయనతో మాటాడినాను. దయచేసి ఆయనను చూడుఁడు. రావి గురువావధానిసొమ్ము పోఁగొట్టకుఁడు. అతనివద్దనుండి నాకు నుత్తరము వచ్చినది. ఈయుత్తరప్రత్యుత్తరములు అమలాపురములో ప్లీడరైన పేరి విస్సయ్యగారిద్వారమున జరిగినవి—దానిలోని సంగతులు వ్రాసియిచ్చిన పత్రపుసొమ్ము చెల్లించుటకు గడువిమ్మని ప్రార్థన. పత్రమునకు నకలు వ్రాయించి నాకుఁ బంపుఁడు, లేదా వ్యాజ్యము వేయుటకు పేరి విస్సయ్యగారికిఁ బంపుఁడు—ఇక్కడనుండి తెలుఁగు.)

ఈ వ్యవహారము విషయమయి విస్సయ్యగారు గురువావధానులుగారిని పిలిపించి కూఁకలు వేసినందున గురువావధానులుగారు నావద్దకువచ్చి కొంచెము వాయిదా యివ్వవలసినది. రూపాయలు యిస్తానని కోరియుండాంశముతో గురువావధానులుగారు ఉత్తరము వ్రాసి నాకిచ్చి

నారు. అది కావలసియుంటే మీకుఁ బంపుతాను. దస్తావేజుకుఁ గాపీ తయారుచేయించి విస్సయ్యగారివద్దకుఁ బంపి కంప్లయింటు చేయవలెను.

గవర్రాజుగారు నాకు రు ౧౦౦ లు నూరురూపాయలు యివ్వవలసియున్నది. ఆరూపాయలు ఆయనకు వీలు అయినప్పుడు W. M. Fisccia'ter కు యివ్వమని చెప్పకోరుతాను. సుబ్బారావు పంతులుగారికి గవర్రాజుగారికి నా Compliments చెప్పకోరుతాను. ఆయనకు దొండరయిచ్చి పుచ్చుకోవచ్చు. ఎప్పుడు యిష్టమువచ్చి యిస్తే అప్పుడు పుచ్చుకొండి.

Yours truly P. Ramakristnah.'

ఈ యుత్తరము వచ్చువఱకును రామకృష్ణయ్యగారికిఁ గురుపు వేసినట్టు నాకుఁ దెలియదు. రావి గురవావధానులపత్రముయొక్క నకలు వ్యాజ్యము వేయించునిమిత్తము తనకుఁ బంపవలసినదని కోరుటచేత, ఈయుత్తరమందిన తఱువాత సహితము కురుపు ప్రమాదకరమైనదని నేను భావింపలేదు. తమబంధువులను జూచుటకయి యానాము వెళ్ళి తిరిగి వచ్చునప్పుడు మూఁడుదినములుండి, అప్పారి లక్ష్మీనరసింహముగారు కాకినాడలో రామకృష్ణయ్యగారిని చూచుట తటస్థించెను. లక్ష్మీనరసింహముగారితో మాటాడితినన్న విషయము నాతో నాకుఁ బదివేల రూపాయలనిచ్చుటను గూర్చి మాటాడిన విషయమే. ఈవిషయమయి మఱునాఁడాయన మరణశాసనమే వ్రాసియిచ్చెను. ఈవిషయమునుగూర్చి 1887-వ సంవత్సరారంభమున నేను సమాజసాంవత్సరిక సభయందు 'స్త్రీపునర్వివాహవ్యాపారముయొక్క భూతవర్తమానస్థితు'లను గూర్చి వ్రాసి చదివి దానిలో నిట్లు చెప్పితిని.

'అటుపిమ్మట రామకృష్ణయ్యగారిక్కడకు వచ్చినప్పుడు తాము తఱువాత నిచ్చిన పదివేలరూపాయలును మొదటి రెండు వివాహములకుఁ బ్రత్యేకముగా చేసిన వ్యయములును కట్టించిన

యుండ్లను స్త్రీ పునర్వివాహాభివృద్ధి నిమిత్తమయి చేసిన యితరవ్యయములను కలుపుకొని యిరువదివేల రూపాయలయ్యెననియు, మొట్టమొదట వాగ్దానముచేసిన మొత్తములో అవిపోఁగా మిగిలిన పదివేల రూపాయలను వేఱుగ నిచ్చెదననియుఁ జెప్పి మూలధనము వ్యయపడక వృద్ధివలన సమాజమునకుఁ దోడుపడునట్లుగాఁ జేయుటకై యేమి చేయుట యుచితముగా నుండునని నన్నాలోచన యడిగిరి. అప్పుడు నేనొకసారి నాగోజీరావు పంతులవారియొద్దకును, ఇంకొకసారి ఆచంట లింగరాజుగారి యొద్దకును వారితోఁ గలిసిపోయి యాలోచించితిమి గాని యప్పు డెట్లు చేయుటకును నిశ్చయింపలేదు. దేశముయొక్క యభాగ్యముచేత నింతలో వారి కవసానదశ సంప్రాప్తమగుచుండఁ, ఉద్దేశించిన పదివేలరూపాయలను మరణశాసనమూలమున నిచ్చి, చేసిన వాగ్దానమును చెల్లించుకొన్నారు.'

రామకృష్ణయ్యగారు వ్రాసినయుత్తరము నాకందిన రెండు మూఁడు దినములలోనే యాయన కాలధర్మము నొందుట తటస్థించినది. వారు నాకు వ్రాసిన యుత్తరములలో నిదియే కడపటిది. ఈ యుత్తరమునందుదాహరింపఁబడిన రావి గురువావధానులకథ నిచ్చట కొంత తెలుపవలసియున్నది. ఆ కాలమునందు వితంతుకన్యలను తెచ్చెదమనియు, దానిబ్రాహ్మణులకుఁ గావలయుననియు చెప్పి, యనేకులు నావద్ద రెండును మూఁడును రూపాయలు పుచ్చుకొని మోసము చేయుచుండెడివారు. ఈ రావి గురువావధానులు నాయొద్దకు వచ్చి, అమలాపురము తాలూకాలోని యొకగ్రామములో అక్కచెల్లెండ్రిద్దఱు బాలవితంతువులు గలరనియు నూఱురూపాయలు బదులిచ్చినపక్షమున వారితండ్రి ఋణవిముక్తుఁడయి యాపిల్లలను తనవెంట నాయొద్దకుఁ బంపుననియు నమ్మకము పుట్టచెప్పెను. అప్పుడు నేను కోరిన నూఱురూపాయలను నాలవివాహముచేసికొన్న పులవర్తి శేషయ్య

గారిచేతికిచ్చి, ఈయనవెంట కోనసీమలోని యాగ్రామమునకు వెళ్ళి యీనూఱురూపాయలును తండ్రి పిల్లలను తీసికొనివచ్చి యొప్పగించిన తరువాత నిచ్చి యీ బ్రాహ్మణుని తోడఁగూడ నిరువురు బాలవితంతులను తీసికొని రావలసినదని చెప్పిపంపితిని. గురువావధానులు శేషయ్యగారిని చెప్పిన గ్రామమునకుఁ గొనిపోయి చెఱువుగట్టుమీఁదఁ గూరుచుండఁబెట్టి, మీరు గ్రామములోనికి వచ్చిన జను లను కూన పడుదురనియు, అందువలన కార్యవిఘాతము కలుగునదియు, రూపాయలు తనచేతి కిచ్చినపక్షమునఁ దండ్రికిచ్చి యరగంటలోపల పిల్లలతో వచ్చి కలిసికొనెదననియు, చెప్పినమ్మించి తొంబదిరూపాయలు పుచ్చుకొని గ్రామమువంక నడిచి యదృశ్యుఁ డయ్యెను. నామిత్రుఁడా చెఱువుగట్టుమీఁద గంటలకొలఁది వేచియుండి యాతనిరాక కానక, గ్రామములోనికిఁబోయి విచారించి యచ్చటఁగూడ నతనిజాడ తెలియక, నిరాశచేసికొని యొక్కఁడును మరలి నాయొద్దకు వచ్చెను. తరువాత గురువావధానులను పిలిపించి బెదరించి యామొత్తమున కాతనివలన పత్రము వ్రాయించి పుచ్చుకొంటిమి కాని యతఁడు సొత్తేమియులేని నిర్ధనుఁ డగుటవలన రామకృష్ణయ్యగారు వ్రాసినట్టు వ్యాజ్యమునకు సొమ్ము దండుగపెట్టక యసలుసొమ్మును వదలుకొని యూరకుంటిమి. ఒక్క యీ గురువావధానులుగారుమాత్రమే కాక మఱికొందఱుకూడ మమ్ము మోసముచేసినవారును మోసముచేయఁ బ్రయత్నించినవారును పలువురుండిరి. 'విశాఖపట్టణమునుండి యొకబ్రాహ్మణుఁడు వితంతుకన్యలను తీసికొని వచ్చెదనని చెప్పి మునిస్వామిని విశాఖపట్టణమండలమునందుఁ బెక్కు దినములుత్రిప్పి తనకుఁ గొంతసొమ్మిప్పించుకొని పారిపోవుట మొదలైన వార్తలను పలువు రెఱిఁగియుందురు' అని నా యుపన్యాసములో వ్రాసియుంటిని. అట్టివార్తల నొకదానినిచ్చి చదువుకొన్నవారు నన్ను మోసపుచ్చి ధన మపహరింపఁజూచిన యొక

వింతమైన ప్రయత్నమునుగూర్చి మాత్రము కొన్ని పంక్తులు వ్రాసెదను. 1887-వ సంవత్సరము అక్టోబరునెల 31-వ తేదిని కలకత్తానుండి నాక్రింది తంత్రీవార్త వచ్చినది—

"To
Kandukuri Veeresalingam Pantulu Garu,
Rajahmundry.

From
L. Shanmukaram
Barabazar.

Got widow × Widow yes arranged × starting × spent 100 × send 235 by wire 40 [illegible] particulars posted."

(వితంతువున్నది × వివాహము చేర్పాటుచేయబడెను × బయలుదేరుచున్నాము × 100 ఖర్చుపెట్టినది × తంత్రీమూలమున 40 బట్టలకు 235 పంపుము × వివరములు టపాలో వేయబడినవి)

ఇందుకు పేర్కొనబడిన లాలాషణ్ముఖరాముగారు విశాఖపట్టణమందలి క్రైస్తవోన్నతపాఠశాలయందుపాధ్యాయుడుగానున్న క్రైస్తవుడు. నాకును బ్రహ్మవివాహము చేసికొన్న గోగులపాటి శ్రీరాములుగారికిని మిత్రుడు. ఈయన కలకత్తాయందుకు వెళ్లెనా యని సందేహము కలిగి,

"From
Kandukuri Veeresalingam
Rajahmundry.

To
Gogulapati Sriramulu Garu,
Police Head Quarters,
Vizagapatam.

Wire where Shanmukharam is × Is he in Calcutta?
Reply prepaid 8 As"

(షణ్ముఖరాముగారెక్కడనున్నారో తంతివేయుము. ఆయన కలకత్తాలో నున్నారా? ప్రత్యుత్తరమునకు ఎనిమిదణాలు కట్టబడినవి)

అని విశాఖపట్టణమునకు నవంబరు మొదటి తేదిని గోగులపాటి శ్రీరాములుగారికి దంత్రీవార్తనంపి, అదినముననే కలకత్తాకుగూడ నీక్రింది తంత్రీవార్తను బంపితిని.—

'Form
K. Veerasalingam.
Rajahmundry.

To
L. Shanmukharam Garu,
46 Burtola, Barabazar.
Calcutta.

Wire the caste and country of the couple.

(వధూవరుల కులమును దేశమును తంత్రీముఖమున తెలుపుము)

విశాఖపట్టణము గోగులపాటి శ్రీరాములుగారికి పంపిన తంత్రీ వార్తకు ౨ డవ తేది నిట్లు జవాబువచ్చెను.—

To
Veeresalingam Garu,
Govt College, Rajahmundry

From
Gogulapati Sriramulu
Vizagapatam.

Your Telegram just to hand · Shanmukharam at Vizagapatam."

(మీ తంత్రీవార్త యిప్పుడే యందినది. షణ్ముఖరాము విశాఖపట్టణములో నున్నాఁడు)

ఆదినముననే కలకత్తానుండియుఁ దంత్రీముఖమున నిట్లు ప్రత్యుత్తరము వచ్చినది.

"To
K. Veeresalingam Pantulu Garu,
Rajahmundry.

From
L. Shanmukharam.
Calcutta.

Vidikas · Kristnapuram Vizagapatam District × preferable send urgently · Address 43 Burtola, Reply ordinary.

[వైదికులు × విశాఖపట్టణ మండలములోని కృష్ణపురము × ముఖ్యముగా శీఘ్రముగా పంపుఁడు × నావిలాసము 48 బర్టోలా × సామాన్య ప్రత్యుత్తరమిందు]

ఇప్పుడు మోసము స్పష్టముగాఁ దెలిసినది. అయిదవ తేదిని సొమ్ము పంపుచున్నానని మోసగానికిఁ దంత్రీవార్తపంపి, ఈలోపల కలకత్తాలోని మిత్రులకును పోలీసువారికిని తంత్రీవార్తలు పంపి, యా వంచకుని పట్టించి దండింపఁ జేయవలెనని మొదట నాలోచించితిని.

గాని ముందు వ్యయప్రయాసములకుఁ గారణమగునని తలఁచి యా ప్రయత్నమును మానివేసితిని.

'పదమందిచేరినగిరువాతఁ గొన్నిమనస్తాపములును చిక్కులును కలుగక మానవుగాని చేసిన మహాకార్యమును తలఁచుకొన్నగా, అవి యెంతమాత్రమును గణనకుఁ దేఁదగినవిగా నుండవు. కొందఱు ధనాశాపరులుగానుండి పునర్వివాహితులమీఁదఁ దొందరలు కలుగఁజేయవచ్చును; కొందఱవివేకముచేతను కొందఱు దుస్స్వభావముచేతను తగవులాడవచ్చును.'

అని 1885-వ సంవత్సర మధ్యమున స్త్రీపునర్వివాహచరిత్రను గూర్చి నేనిచ్చిన యుపన్యాసములో వ్రాసియుంటిని. అవివేకముచేతఁ జేయఁబడినవి క్షమింపఁదగినవిగా నుండును, దుస్స్వభావముచేతఁ జేయఁబడినవియుఁ గొంతవఱకు క్షమింపఁదగినవిగా నుండవచ్చును. కాని లోకోపకారధురీణులమనియు నార్యాగ్రేసరులమనియుఁ జెప్పుకొనుచు ధనాశాపరత్వముచేతఁ బునర్వివాహితులమీఁద బుద్ధిపూర్వకముగాఁ జేసినవారి దుష్కార్యములుమాత్రము క్షంతవ్యములు గావు.

1887-వ సంవత్సరారంభమున సమాజమువారిముందు స్త్రీపునర్వివాహవ్యాపారముయొక్క సంగ్రహ వృత్తాంతమునుగూర్చి చదివిన యుపన్యాసములో నిట్లు వ్రాసితిని—

'1884-వ సంవత్సరము డిసెంబరు నెలలో నల్లగొండ కోదండరామయ్యగారివివాహ మగువఱకును సామాజికులకును వివాహములు చేసికొన్నవారికిని ఐకమత్యమున కేమియుఁ గొఱఁత రాలేదు. కోదండరామయ్యగారి వివాహమునిమిత్తము కన్యను తీసికొని రావలసినదని నేను పులవర్తి శేషయ్యగారిని పంపినప్పు డాయన సంకోచింపకఁ బెండ్లికూఁతురువారివస్తువులనుసహితము కొంతదూరము సంతోషపూర్వకముగా మోసుకొనివచ్చుట యా యైకమత్యమున కొకనిదర్శన

ముగా చెప్పవచ్చును....................................
కోదండ రామయ్యగారి వివాహమయిన రెండుమూడు మాసముల
లోఁ గొన్ని కలహకారణములు కలిగినవి. లోకములో వైరమునకును
నేరములకును ఏవి కారణములుగానుండునో దెలిసినవారికి వైరమునకుఁ
గల కారణమును దెలుపవలసిన పనియుండదు.'

ఈ కారణము ధనాశయని నాయాశయము. ఈవితంతువివాహ ప్రయత్నమునకు నేను ప్రధానపురుషుఁడను; పామరులును పూర్వాచారపరాయణులు నయిన విపక్షులవలని దూషణములకును బాధలకును నేను సంసిద్ధుఁడనయి తెగించినను స్వపక్షములోనివారు నాకుఁ దొందరలిచ్చి నన్నుఁ గష్టపెట్టుదురని స్వప్నావస్థయందును దలఁపలేను. అందులోను ముఖ్యముగా నావలన బహులాభములనుపొంది లోకోపకారార్థమే తాము సర్వకష్టములకును లోనగుచున్నట్లు పలుమాఱు పలుకుచుండువారు. నా కాయాసము గలిగించెదరని నేను బొత్తిగానే తలఁపలేను. అన్నియు మనము తలఁచుకొన్నట్లు జరుగవు. మనుష్యుఁడు తానొకటి తలఁచిన దైవ మింకొకటి తలఁచును. నేను నరసాపురము వెళ్ళియుండినప్పుడు 1884-వ సంవత్సరము మేనెల 6-వ తేదిని పులవర్తి శేషయ్యగారు నాకు వ్రాసిన యుత్తరమునకు 8-వ తేదిని నేనిచ్చిన ప్రత్యుత్తరములో నాఁడు వ్రాసిన యుత్తరము స్వబుద్ధిచేఁ గాక పరులప్రోత్సాహముచేత వ్రాయఁబడినదని నేను వ్రాసితిని. (ఆతని యుత్తరమును నాప్రత్యుత్తరమును ఏలూరి లక్ష్మీనరసింహముగారు నామీఁద తెచ్చిన మాననష్టవ్యాజ్యములో దాఖలుచేయఁబడి నాకిప్పుడు మరల రాలేదు.) ఆతని నాయుత్తరము వ్రాయునట్లు ప్రోత్సాహపఱిచినవారు కోదండరామయ్యగారని నేను నమ్మితిని. అయినను నేనది మనస్సులో నుంచుకొని నేనాతని కపకారముఁ జేయుటకుఁగాని సమయము వచ్చినప్పుడు చేతనైన సాయముఁ జేయ

యుండుటకుఁగాని యెప్పుడును తలఁచుకోలేదు. ఇది జరిగిన రెండు మూఁడు మాసములలోనే క్రొత్తసమాజమును స్థాపించిన యిరువది దినములలోపల నీయన కప్పుడుండిన (యిరువది రూపాయల జీతము గల) యుపాధ్యాయపదము పిల్లలకు నప్పుడు నఱచుచు విశేషవాగ్వ్యయము చేయవలసినదగుటచేత నీయన శ్వాసకోశములకు సరిపడలేదన్నప్పుడు నే నీయనకు మాముద్రాశాలలో కార్యనిర్వాహకోద్యోగ మియ్యవలెనని సమ్మతి నొందితిని. 1884-వ సంవత్సరము జూలయినెల 11-వ తేదిని కోదండరామయ్యగారు నాకీ జాబు వ్రాసిరి —

'ఈనడుమ మీరు నన్ను ముద్రాశాల కార్యనిర్వాహకునిగా నియమింప నుద్దేశించినట్లు యన్. సుబ్బారావుగారు నాతోఁ జెప్పుచున్నారు. రేపటిమధ్యాహ్నమునుండి నా సేవ నర్పించుటకు నా కాక్షేపణ లేదు. ఉద్యోగమునిచ్చి, పనిచేయవలసిన గంటలను జీతమును నిర్ణయింప దయచేయుదురని కోరుచున్నాను. Mr N. Subbarao tells me that you the other day proposed to employ me as the manager of this Press. I have no objection to offer my services from tomorrow afternoon. I hope you will be good enough to make the appointment and fix the working hours and pay.")

ఈయన కీయవలసిన జీతముకాని, పనిచేసెడు గంటలుకాని, మాపని కనుకూలపడనందున నేనీయన కీయుద్యోగ మీయలేదు. మావీధిని నున్న చెయనులగారియిల్లు కొన్నప్పుడు నే నందు మూఁడు కుటుంబముల నుంచఁదలఁచి ముందుగా నీయన కోరుకొన్న భాగము నవఁగా వంటయిల్లును భోజనములయిల్లును పడకగదియు నున్న భాగము నీయన కిచ్చి, రెండవ భాగములో, తంకు చెలపతిరావుగారి కుటుంబమును, చావడి భాగములో, చేబోలు వెంకయ్యగారి కుటుంబమును, కాపుర ముంచితిని. కోదండరామయ్యగారు తా నున్నయిల్లు

నప్పుడు కోదండరామయ్యగారు తన కాయిల్లు చాలదని యాయనతో మొఱ్ఱపెట్టుకోఁగా రామకృష్ణయ్యగారును నేనును గలిసిపోయి నాగాచినప్పు డాయిల్లునకే యిచ్చినపక్షమున విశాలముగా నుండు నని యాయన నాతోఁ జెప్పిరి. మంగళవారపుపేటలోఁ గొన్నిస్థలములలో యిల్లు కట్టించువారి పటానేని వెంకయ్యగారి నచ్చటికి బంపి వేసి యాయిల్లునకే యిచ్చెదనని నేను చెప్పితిని.

విద్యలేని మూఢులు పలువురుచేరి చేయుదానికంటె విద్యాధికుఁ డొక్కఁడు చేయుపని శతగుణము లధికముగా నుండును. మన దేశములో యాచ్ఞావృత్తి హేయముగా నెంచఁబడకుండుటయు, పాటుపడక కూరుచుండుట గొప్పయని తలఁపఁబడు చుండుటయు, చిరకాలాగతాచారము లగుటచేత కాయకష్టపడక నిరుద్యోగముగాఁ గూరుచుండి స్వోదరపోషణార్థ మితరులను వేఁడి ధనార్జనము చేయుట లాఘవమని యెవ్వరును భావింపకున్నారు. అందుచేత నెల్లవారును ధనాకర్షణమునకు వెరపున్నపక్షమున నేయుపాయముచేతనైనను సాధ్యమైనంతడబ్బు లాగవలయుననియే యత్నించుచున్నారు. వికలాంగులుగాక యవయవపుష్టిగల వారందఱును పాటుపడవలసిన వారే యనియు, పాటుపడ నొల్లనివారికి ధనదానముచేసి సోమరితనమును ప్రోత్సాహపఱుచుట పాపమనియు నామతము. నేను పాటుపడెడివాఁడను; ఇతరులు పాటుపడవలసిన వారని తలఁచెడివాఁడను. కాయకష్టమువలని గౌరవము నెఱుఁగని మంజులూరి గోపాలముగారు (ప్రథమ వివాహవరుఁడు) ఆ నెల జీతము పుచ్చుకొన్నతరువాత తాను ముద్రాశాలలోఁ బనిచేయు మనియు, (ద్వితీయ వివాహవరుఁడు) రామచంద్రరావునకును (చతుర్థ వివాహవరుఁడు) శేషయ్యకును ఇచ్చుచున్నట్లే తనకును నెల కేమిదేసి రూపాయలచొప్పున

మీచేతనైనంత చేయుదురనియు మీస్థితిని పితృచితమైన దానినిగాఁ జేసికొంటిరనియు నేనెఱుఁగుదును. నేను సంబంధము కలిగించుకోను)*

ఇట్లు వ్రాసినను రామకృష్ణయ్యగారతనికి రహస్యముగా సొమ్మిచ్చుచుండిరి. వారు వ్రాసినట్లనేకు లప్పుడప్పుడు సొమ్మును గూర్చి నాకుఁ దొందరకలుగఁ జేయుచుండుట వాస్తవమే. అడిగినదెల్ల నిచ్చుటకు నేను రామకృష్ణయ్యగారివలె ధనికుఁడను గాను; ఒకవేళ నే నియ్యఁగలిగినను వారికోరిక యనుచితమని నే ననుకొన్నప్పు డిచ్చువాఁడనుగాను. నాదగ్గఱ నొకగొప్ప లోపముగూడఁగలదు. ఇతరులడుగునది న్యాయమైనది కాదని నేను భావించినప్పుడు నెమ్మదితో వారిని సమాధానపఱుపఁజూడక పెద్దగొంతుకతో వారు దురాశాపరులనియు వారడిగినది యనుచితమైనదనియు నామనసులో నున్నదానిని మొగమోటములేక మొగముమీఁదనే స్పష్టముగా ననివేయుట. నేనీప్రకారము నిర్దాక్షిణ్యముతోఁ బలుకువాఁడనైనను, ఎవ్వరికైనను నిజమైన కష్టము వచ్చినప్పుడు వారడుగకయే వారికి నాచేతనైన సాయమంతయుఁ జేసెడివాఁడను. కొన్నిమాసములైన తరువాత ఈగోపాలముగారి భార్యకే మసూరి (స్ఫోటకము) రోగము వచ్చెను. అప్పుడతని నసహాయస్థితిని కనిపెట్టి వెంటనే యతనియింటికిఁ బోయి, పథ్యపానములుచేసి పెట్టుటకు నాలుగు రూపాయలిచ్చి యొక బ్రాహ్మణస్త్రీని నియమించి, అయిదురూపాయలిచ్చి రాత్రిందివములు రోగియొద్ద కనిపెట్టుకొనియుండుటకయి యొకశూద్రస్త్రీని పెట్టి, కావలసిన పదార్థములు కొనియిచ్చి, ఆరోగ్యస్నానముచేయువఱకును నేను

* "If that Moonjoolury boy does not act decently as you wish, you must make him do it quietly. I did not promise any thing more than he should obey and please you and then you will do for him your best. I know how they will be bothering you. I know you will do your best for them and you have made your position a parental one. I shall not interfere."

ప్రతిదినమును పోయి చూచుచుంటిని. గోపాలము వర్తించినవిధము కేవలమూర్ఖత్వముచేతనే కలిగినదగుటచేత నాతనిది క్షమింపఁదగినదే. రాజమహేంద్రవరములో నున్నవారు నాకుఁ గొందరఁ గలుగఁజేయుచు వచ్చినట్లే కాకినాడలో నున్నవారు రామకృష్ణయ్యగారికిఁ గొందరఁ గలుగఁజేయుచు వచ్చిరి. నామీఁద నేరములు చెప్పుటకయి యిచ్చటివారు రామకృష్ణయ్యగారియొద్దకు వెళ్లినట్లే, రామకృష్ణయ్యగారిమీఁద నేరములు చెప్పుటకయి యచ్చటివారు నాయొద్దకు వచ్చుచుండిరి. నేను సొమ్మియ్యక వారిని తృప్తిపఱుపలేను; ఆయన సొమ్మిచ్చియు వారిని తృప్తిపఱుపలేదు. వితంతువివాహము చేసికొని కాకినాడలోనున్న జోగా శ్రీరాములు రామకృష్ణయ్యగారు తాను కోరిన విత్తమియ్యకపోవుటచేత భార్య నక్కడ విడిచి నాయొద్దకుఁ బరుగెత్తికొని వచ్చి రామకృష్ణయ్యగారిమీఁద నేమేమో చెప్పెను. నేనితని విషయమును గూర్చి వ్రాయఁగా 1885-వ సంవత్సరము జూలయి నెల 2-వ తేదిని వారు నాకిట్లు వ్రాసిరి —

"I have got your letter about Sriramulu. What he said is all lie. So you must tell him to go Cocanada back & there is no use of threatening by running away like this and also tell him to come to me and see me." (శ్రీరాములనుగూర్చి మీ యుత్తరము చేరినది. అతఁడు చెప్పినదంతయు అబద్ధము కాఁబట్టి కాకినాడకుఁ దిరిగి వెళ్ళవలసినదనియు, ఈలాగున పాఱిపోవుటవలన బెదరించిన ప్రయోజనము లేదనియు మీ రతనితోఁ జెప్పవలెను. నావద్దకు వచ్చి నన్నుఁ గలుసుకొనుమనికూడ చెప్పుఁడు.) రామకృష్ణయ్యగారిని బెదరించినప్పుడాయన మంచిమాటలతో వారి నాదరించి ధనమిచ్చెడువాఁడు; నన్ను బెదరించినప్పుడు నేను కోపవాక్యములుపలికి యనాదరము చూపి దేనియు నియ్యకుండెడివాఁడను. మా యిరువుర స్వభావములలోను గల భేద మిది.

చదువంతగా లేనిమూఢులవలన ధనవిషయమయి మాకుఁ జిక్కులు కలుగుచు వచ్చినను వారియాశ లత్యధికములయినవి కానివిగాను, అవి యత్యల్పములతోనే తృప్తినొందునవిగాను, ఉన్నవని యొప్పుకొనవలసియున్నది. ఇఁక విద్య నేర్చినవారిలోనో యివి విపరీతములుగా నుండినవి. వారియాశలకుఁ బరిమితి లేదు; సామాన్యలాభముచేత వారికి దృప్తి లేదు. వారిలోఁ గొందఱు స్వప్రయోజనపరత్వమునుసహితము పరోపకారార్థమే యయినట్లు చూపఁగల శక్తిమంతులు. రామకృష్ణయ్యగారివలనను సమాజమువారివలనను ధనస్వీకారమధికముగాఁ జేసినవారును చేయఁ బ్రయత్నించినవారును చదువులేక సంపాదించుకొను శక్తిలేనివారిలోఁ గాక చదువుకలిగి సంపాదించుకొను శక్తిగలవారిలోనే యధికముగానుండిరి. ఇటువంటివిషయములనుగూర్చి చెప్పుట నాకును వినుట చదువరులకును హృద్యము కాకపోయినను కొందఱు మహానుభావు లిప్పటికిని విషయములను విపరీతముగాఁ బత్రికలలోఁ దెలుపుచుండుటవలన సత్యము లోకమునకుఁ దెలియుటకయి యొకటిరెండు సంగతుల నిచ్చటఁ జేర్పవలసివచ్చినందుకుఁ జింతిల్లుచున్నాను. మూఁడవవివాహము చేసికొన్న రామారావుగారికి మున్నూరురూపాయల నిచ్చెదనని నేను వాగ్దానము చేసి యిదిగాక యిప్పించిన సొమ్మంతయు వివాహమునకే వ్యయపడినందునఁ జెప్పినట్లు చేయలేకపోతిని. నేను రామారావుగారియెదుటనే నా యశక్తతను రామకృష్ణయ్యగారికిఁ దెలుపఁగా నిల్లు తా మిచ్చెదమని చెప్పిరి. 1885-వ సంవత్సరము సెప్టెంబరునెలలో రామారావుగారు మీకు వాగ్దానముచేసి దాదాపుగా మూఁడుసంవత్సరములయినను రామకృష్ణయ్యగా రిప్పటికిని చేసిన వాగ్దానము చెల్లింపలేదనియు, ఆయనకు వ్రాసివెంటనే యిల్లిప్పింపవలసినదనియు, నాకు వ్రాసిరి. నేనా నెల 13-వ తేదిని ఇతరవిషయములతో పాటుగా నీవిషయమునుగూర్చి

రామకృష్ణయ్యగారికి వ్రాసితిని. ఆయన నాకుఁ బంపిన ప్రత్యుత్తరము చూడుఁడు.—

"Cocanada. 16th September 1885

My Dear Sir,

Yours of 13th Inst. was duly to hand; I now reply for the present about T. Rama Row's subject. Though the human creation is alike in this world, yet there is individually amplesellishness, [illegible] is much in him. I have done him good & [illegible] many things and many times much more than you and I said we would give him. There is nothing due to him in any shape and he was many times overpaid, all that he wishes to ask is not at all due to him; or can it be even met from mercy or charitable side. However, to be asked by one, if possible, to get is not unnatural for any one; So, he does. Here I will state a few of my deeds to him.

| | | Rs A P. |
|---|---|---|
| 1. | He with his mother owed me before his marriage as I remember about ... | 100-0-0 |
| 2. | After his marriage according to his request, gave him a house situated on a large piece of ground, fit for building 2 houses more at least; this house is exchanged with another house of mine which [illegible] above | 500-0-0 |
| 3. | On his request and with that of his mother-inlaw, I paid her ... | 350-0-0 |
| 4. | I paid him for his sundry debts nearly ... | 30-0-0 |
| 5. | I think, I paid him several times some sundry moneys and some sundry things ... | 50-0-0 |
| 6. | I lent him a carriage and a pony costing ... | 125-0-0 |
| 7. | I gave his mother on his request once may be more than ... | 300-0-0 |
| 8. | I paid him and his mother for some ceremonies | 50-0-0 |
| | | Rs. 1505-0-0 |

I never promised him another house again. I thought we must give a house, whether it may be you promised or I thought of giving. So I built a house here which cost me nearly Rs. 2,000 and it has a large piece of ground at the time of building this house. I told him the portion I am building to suit for 2 families and I told him I would give him a portion of it & the other portion. I will make it available for any other W. M. Couples and in the yard I will build or houses will be built for these married couples. So I am willing and will be willing to give him the portion, but cannot give him the whole house. If he does not like it, as you say you [illegible] him [illegible]. I will give him this sum and he can buy another house and we should only give him that money when he actually buys the house with the usual condition — [illegible] for the family and with the condition that it cannot be mortgaged or sold I hope you will see now, we have done very much kindness and he is in every way better off by God's favour than any one else. Please tell him now he must be satisfied for the present and reconcile him with laws of contentment and in every way all the promises are fulfilled and above promises much is done to him and you have not to give him money or a house except as I said above the sum of Rs. 300 for a house, if he buys one separately without wishing to take the portion of the house we offer. We have done our best and more than our best is done to him. I have built this house so conveniently with a wish for the accommodation of the members of this association, because no houses are available [illegible] the members when they come here and go to Madras and other places or come here from other places to go through this. In such a case, how can I sacrifice my big wish and give this large property to one family alone. I cannot give away things like that. With best wishes.

Yours truly,

P. RAMAKISTIAH."

(మీ॥ 18-వ తేది యుత్తరము సరిగా నాచేతి కందినది. నే

నిప్పుడు ప్రస్తుతము టి. రామారావు గ్రంథములనుగూర్చి బయలిచ్చు

యు, ఈశ్వరానుగ్రహమువలన ఈయన ప్రతివిధముచేతను ఇతరులాద ఱికంటెను మంచిస్థితిలో నున్నాఁడనియు, మీరిప్పుడు చూతురని నేను కోరుచున్నాను. ఇప్పటిదానితో ఈయన తృప్తిఁబొంది యుండవలెననియు, సంతుష్టిధర్మములతో సమాధాన పడవలెననియు, ప్రతి విధముచేతను వాగ్దానములన్నియు నెఱవేర్పఁబడినవనియు, వాగ్దానములకంటె నధికముగా నీయఁ జేయఁబడెననియు మన మిచ్చెదమన్న యింటిభాగమును పుచ్చుకొనుట కిష్టములేక వేఱుగా నొక యిల్లు కొనఁదలఁచినందున నేను పైని చెప్పినట్లుగా నింటికొఱకు రు. 300 రూపాయలు తప్ప సొమ్మునుగాని యిల్లునుగాని మీ రియ్యవలసిన పనిలేదనియు, దయచేసి వీరీయనతోఁ జెప్పుఁడు. మనచేతనైనదంతయుఁ జేసియున్నాము. మనచేత దానికంటె నెక్కువగా నీయనకు చేయఁబడినది. వారిక్కడకు వచ్చి చెన్నపట్టణమునకును ఇతర స్థలములకును పోవునప్పుడుగాని యితర స్థలములనుండి దీని[illegible] వచ్చునప్పుడుగాని సామాజికుల కక్కడ వేఱుగృహములు లభ్యములు కావు గనుక ఈసంఘముయొక్క సామాజికులు వసింపవలెనను కోరికతో నే నీయింటి నెంతో యనుకూలముగాఁ గట్టించియున్నాను. అట్లయి యుండఁగా, ఈ పెద్ద సామాజికసంఘమునకు మాత్రమే యిచ్చి నా పెద్ద కోరిక నెట్లు నేను బలిపెట్టఁగలను! ఈప్రకారముగా నేను వస్తువుల నిచ్చివేయఁజాలను.'

ఈయుత్తరము వచ్చువఱకును రామకృష్ణయ్యగారింత సొమ్ము యుపనిమిత్తము వ్యయపెట్టిరని నాకుఁ దెలియదు. ఇక్కడ రాజమహేంద్రవరములో నొక్కొక్క వరునివిషయమున నింతింత సొమ్ము వ్యయపెట్టుటకు సమాజమువారియొద్ద ధనమును లేదు; ఉన్నను ధనమును విచ్చలవిడిగా వ్యయముచేయనుచేయరు. సమాజస్థాపనమయిన 1884-వ సంవత్సరమునం దిచ్చిన యిరువదిరూపాయలునుగాక,

1885-వ సంవత్సరమునందు సమాజమువారు కోదండరామయ్యగారికి భార్యనగల నిమిత్తము రు. 80-0-0 లును, భార్య ప్రసవమునిమిత్తము రు 10—0—0 లును, ఏప్రియల్ మేయి నెలలకు నెలకాతేసిరూపాయల చొప్పున రు. 12—0—0 లును, సెలవుమీఁద నున్న ఆగస్టు, సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు నెలలకుఁ నెలకుఁ బదేసి రూపాయలచొప్పున రు. 40—0—0లును, మొత్తమునూటనలుబది రెండురూపాయలు. (142—0—0) సమాజమువారిచ్చిరి. ఈయన వివాహనిమిత్తము వ్యయపడిన రు. 454 లలో రు. 110 ల పయిచిల్లర నగలుమాత్రమే యీయనభార్య కప్పుడు పెట్టఁబడినవి. ఇన్నూఱు రూపాయలప్రాప్తికి రావలసిన మిగతమొత్తము నగలనిమిత్త మియ్యఁబడినదిగాన యీయన నగలు చేయించి పెట్టినట్టు కనఁబడదు. భార్యయొక్క ప్రసవమునిమిత్తముపోయి కాకినాడలో నుండిన కాలములో నచ్చటి వ్యయములను రామకృష్ణయ్యగారు భరించిరి. కోదండరామయ్యగారీకాలములో నిరువదిరూపాయలు జీతముగల యుపాధ్యాయపదమునం దుండిరి. ఈవఱకు నేను చెప్పినట్లు కొంచెము వైరకారణము కలుగఁగానే నాకు విరోధులుగా నున్న పెద్దమనుష్యులు కొందఱు తమయొద్ద కాలోచనకుఁ బోయిన యొకరిద్దఱు వరులసాహాయ్యముతోఁ దక్కినవరులను తమయొద్దకుఁ బిలిపించుకొని నాపయిని దోషారోపణములు చేయుచు సమాజమువారికి విన్నపములు పంపునట్లు వారిని పురికొల్పఁజొచ్చిరి. రాజమహేంద్రవరములో నున్న వారిలో నొకరిద్దఱుమాత్రము బాల్య మగుటచే యుక్తాయుక్తవివేకము లేక వారిదుర్బోధనలకు లోఁబడి వారు వ్రాయించియిచ్చిన యుత్తరములను సమాజమువారికిఁ బంపిరి. వారిలో నొక్కరైన తేఁకుకు చెలపతిరావుగారు తనవివాహములో నియ్యఁబడిన కట్నములను తనకియ్యలేదు. గనుక నాయొద్దనున్న బట్టలను తన కిప్పింపుమని

సమాజమునకొరకు విన్నపమును బంపెను. సమాజమువా రావిన్నపమును వెంటనే నిరాకరించిరిగాని యటుతరువాత నతఁడు తన్ను ప్రోత్సాహపఱిచి విన్నప మిప్పించిన వారిపేరులుచెప్పి క్షమార్పణము చేసినమీఁదట నాయొద్ద నిలువయున్న నాలుగు బట్టలను అతని కిచ్చివేసితిని? అతనివివాహమునకుఁ జెన్నపట్టణములో 17 బట్టలు కట్నములు చదివింపఁబడినవి. వధూవరులకు మధుపర్కములు మొదలయిన వానికిఁ బెండ్లిలో కావలసిన వస్త్రముల నన్నిటిని మేమే యక్కడ కొనియిచ్చితిమి. కట్నము లిచ్చిన 17 బట్టలలోఁ గొన్నిచీరలు; కొన్ని పంచెలు; కొన్ని యెక్కువ వెలగలవి; కొన్ని తక్కువ వెలగలవి. వీనిలో మంచిబట్టలను రెంటిని చెన్నపట్టణములో వధూవరుల కిచ్చితిని; ఒకచీర వరునిమఱఁదలి కిచ్చితిని; ఒకచీర నాభార్యకిచ్చితిని; రెండు వస్త్రములను వివాహమునకు వచ్చిన రామారావుగారికిని ఆయన భార్యకును (మూఁడవ వివాహదంపతులు) నిచ్చితిని; సామాన్యపు బట్టలు రెండు మావెంటవచ్చిన మునిసామికిని అతనిభార్యకును ఇచ్చితిని; ఒకబట్టను చలపతిరావు మఱఁదలిని పెండ్లియాడుతలంపున మాతో వచ్చిన పరిశారావుగారి కిచ్చితిని; రెండుబట్టలు కాకినాడ వచ్చిన పిమ్మట జోగా శ్రీరాములకును అతని భార్యకును (ఏడవ వివాహదంపతులు) ఇచ్చితిని; రెండు మంచి వస్త్రములను రాజమహేంద్రవరము వచ్చినతరువాత గర్భాధానసమయమున వధూవరుల కిచ్చితిని. ఇవి పోఁగా మిగిలియున్ననాలుగుబట్టలను సమయము వచ్చినప్పుడు వధూవరుల కిచ్చుటకయి నాయొద్ద నిలువయుంచితిని. ఈకట్నములలోని బట్ట యొకటియైనను నేనుమాత్రము పుచ్చుకొనలేదు. ఈతని ప్రేరేచిన పెద్దమనుష్యులపేరు లిచ్చుటఁ జేకొనుట యనావశ్యకము. నాకు రెండువిధములుగా శత్రువులనేకుఁ లేర్పడి నాకుఁ గీడు చేయుచుండెడివారు. అందొక తెగవారు వితంతువివాహప్రతిపక్షులుగా

నుండి నన్ను ద్వేషించువారు; ఇంకొక తెగవారు వివేకవర్ధనిలో నేను తమకార్యములను బయలఁబెట్టుచు వచ్చుటచేత సంతాపమునొంది వ్రేటుపడ్డ పామువలెఁ బగఁదీర్చుకొనుటకు సమయము ప్రతీక్షించు చుండెడివారు. ఈకడపటి తెగవారు మాసామాజికులలో సహిత మొక రిద్దరుండిరి. వీరిచర్యలను సూచించుచు నా స్త్రీపునర్వివాహాభూతవర్తమానస్థితులనుగూర్చిన యుపన్యాసములో నిట్లు వ్రాసితిని.—

"ఉన్న యైకమత్యమును చెడఁగొట్టుట యెట్టివారికిని సులభముకాని చెడినదానిని మరలఁ గూర్చుట సాధారణముగా సాధ్యము కాదు. అట్లు నాటఁబడిన వైరవిషబీజము మెల్లమెల్లఁగా నంకురించి వివాహము చేసికొన్నవారికే కాక సామాజికులలో కొందఱికిఁగూడ తనవిషవాయువును బఱపి యీ మహాకార్యమునకు భంగకరమయిన దుష్ఫలములను కొంతవఱకుఁ గలుగఁజేసినందుకయి యెంతయుఁ జింతిల్లుచున్నాను. ఒక సత్కార్యమునకు విఘ్నము కలుగఁజేసెడి యవకాశము కొంచెము లభింపఁగానే దానిని సందుచేసికొని గోరంతలు కొండంతలుచేసి ద్వేషాగ్నిని ప్రజ్వలింపఁజేసి కార్యవిఘాతమయినప్పుడు చూచి సంతోషింపవలెనని కనిపెట్టుకొనియుండు మహానుభావులు లోకములో ననేకు లుందురు. అట్టివారిదుర్బోధలు విని చెడిపోక బీటలు వాఱుచున్న యైకమత్యమార్గమును స్వలాభముకొఱ కెల్లవారును శాంతిసుధతో నతికింపఁ జూతురని నమ్ముచున్నాను. యుక్తకాలములో నట్లు చేయకపోయినయెడలఁ గార్యము మించినతరువాత పశ్చాత్తాపపడిన ప్రయోజనములేక స్వయంకృతదోషఫలము ననుభవింపవలసివచ్చును."

వివాహములయినవారిలో విద్యాధికులు గానివారు తమకుఁ గష్టములు కలుగుచున్నవని యితరులతో నంతగాఁ జెప్పకొనుచుండక

పోయినను విద్యార్థులలోఁ గొందఱు తమకుఁగలిగిన యల్పకష్టములను కోటిగుణితముగాఁ జేసికొనుచు వీరివారియొద్దకుఁ బోయి సదా మొఱ్ఱ పెట్టుకొనుచుండెడివారు. వారుపడ్డ కష్టములు వారు ఘోషించుకొనుచుండినంత విశేషమైనవి కావని నేను చెప్పఁగలను. వారి కేవిధమయిన కష్టములును కలుగకుండఁ జేయుటకయి నేనును నామిత్రులును మా చేతనైనదంతయుఁ జేయుచుంటిమి. ఈవివాహములు చేసికొన్న వారిలో నావఱ కెవ్వరికిని సొంతయిండ్లు లేవు. అట్టివారి కందఱికిని కాపురముండుట కిండ్లీయఁబడినవి; అందుచేత మాయిండ్లలోనుండి లేచిపొండని వీరికిఁ దొందర యిచ్చువా రెవ్వరును లేరు; పని చేయుటకయి సేవకులియ్యబడిరి: వారు ప్రతిదినమును మంచినీళ్ళిచ్చుచుండుటయేకాక కావలసినప్పుడు వంటసహాయముచేసి పెట్టుచుండిరి. భోజనవ్యయములు మాత్రమే కాక చదువుకొనువారికి పాఠశాలలజీతములును పుస్తకములును బట్టలును వేఱుగా నీయఁబడుచువచ్చినవి. వ్యాధులు వచ్చినప్పుడు వైద్యపుఖర్చులను, శుభాశుభకార్యవ్యయములను, సమాజమువారే భరించుచుండిరి. ఎవ్వరికైనఁ గొంచెము కష్టము వచ్చినపక్షమున నేనును గవర్రాజుగారును బోయి విచారించుచుఁ గావలసిన సాయమునంతను జేయుచుంటిమి. అప్పుడు మాతో మాటాడనివా రొకరిద్దఱుండినను వారికిఁ గష్టమువచ్చినప్పుడు సహాయము మేము పోయి తోడుపడకుండ రాలేదు. ఆకాలమునందు పులవర్తి శేషయ్యగారు మా యింటికిరాక నాతో నంతగా మాటాడకుండిరి. నేనొకదినమున పనిమీఁద నెక్కడికో పోయి పగలు పదునొకండుగంటలకు భోజనము నిమిత్తము నడచి యింటికిఁ బోవుచుంటిని. బజారులో నన్ను దూరమునుండి చూచి యాతఁడు తా నెక్కివచ్చుచుండిన బండిలోనుండి దిగి వచ్చి నాపాదములఁబడి యేడువఁజొచ్చెను. నే నతనిని లేవఁదీసి యేల యేడ్చెదవని యడుగఁగాఁ గొంచెముకాలముక్రిందట ప్రసవమయిన

తనభార్యకు సూతిక కనఁబడి జబ్బుగా నున్నదనియు, తాను వైద్యుని నిమిత్తము వెళ్ళుచున్నాననియు, నతఁడు చెప్పెను. వైద్యుని నేను తీసికొనివచ్చెదనని చెప్పి, భార్యవద్ద నుండుటకయి వచ్చిన బండిలోనే యతనిని మరల నింటికిఁ బంపివేసి, నేను మిక్కిలి బడలియున్నను వెనుక తిరిగి వైద్యునియింటికి నడచిపోయి, యాయనను వెంటఁగొని తిన్నగా నిన్నిసుపేటకు శేషయ్యగారి యింటికిఁబోయి తగిన చికిత్సలు చేయించి, పిమ్మట నింటికి భోజనమునకుఁ బోయితిని. నేను భోజనము చేయఁగానే గవర్రాజుగారియింటికిఁబోయి యాయనను గూడఁ దీసికొని మరల నిన్నిసుపేటకుఁబోయితిని. మే మిరువురమును రాత్రి యెనిమిదిగంటలవఱకును శేషయ్యగారి యింటియొద్ద నున్నపిమ్మట గవర్రాజుగారు నన్ను మాయింటికిఁ దీసికొనివచ్చి, నాది దుర్బలశరీరమగుటచేత జబ్బుచేయునని భయపడి నన్ను రాత్రి మరల రాకుండునట్లు వేఁడుకొని యొప్పించి, తా నింటికిఁ బోయి భోజనముచేసి తిరిగి యిన్నిసుపేటకుఁ బోయెను. విధివశముచేత శేషయ్యభార్య కాలవశము నొందెను. అప్పుడు పుట్టిన యాపురుషశిశువును బహుసంవత్సరములకుఁ దరువాత నాతఁడు తాను కాలధర్మము నొందినప్పుడు నాకొప్పగించెను. నే నాపిల్లవానిని నాయొద్ద నుంచుకొని పెంచి విద్య చెప్పించితిని. అతఁడిప్పుడు వివాహము చేసికొని తనకుఁ గలిగిన పురుషశిశువుతో సుఖముగా మా తోటలోనే యున్నాఁడు.

మిత్రసాహాయ్యముతోఁ గృషిచేసి నేను రాజమహేంద్రవరసుక్షేత్రమున బిత్తనము వేసి మొలిపించిన విశ్వస్తావివాహవనలతాంకురమునకుఁ బట్టుకొమ్మయయి నానాముఖముల తీగలు సాగించిన శ్రీ పైడా రామకృష్ణయ్యగారు బాలవితంతువులదుర్భాగ్యముచేత 1886-వ సంవత్సరము మార్చినెల 28-వ తేదిని ప్రాతఃకాలమున స్వర్గస్థులగుట తటస్థించెను. ఈయన మరణమునుగూర్చి నేను1887-వ

సంవత్సరారంభమునఁ జెప్పినమాటలనే యిచ్చట మరలఁ జెప్పుచున్నాను. "స్త్రీపునర్వివాహప్రయత్నమునకెల్లను రామకృష్ణయ్యగారు ప్రాణముగా నుండెడివారు. అటువంటివారు లోకాంతరగతులగుటచేత మనసమాజము ప్రాణము లేని బొందెవంటిదైనది." ఆయన తనమరణమునకు ముందు కొంచెముకాలముక్రిందట రాజమహేంద్రవరమునకు వచ్చినప్పుడు మొదటి రెండువివాహములకును ప్రత్యేకముగా చేసిన వ్యయములు తరువాత నిచ్చినపదివేలరూపాయలనుకట్టించినయిండ్లను స్త్రీపునర్వివాహాభివృద్ధినిమిత్తము చేసిన యితరవ్యయములును కలుపుకొని యిరువదివేలరూపాయ లయ్యెననియు, మొట్టమొదట నిచ్చెదనని వాగ్దానము చేసిన ముప్పదివేలరూపాయలలో నీయిరువదివేలరూపాయలును పోఁగా మిగిలిన పదివేలరూపాయలును వేగిరమే యిచ్చెదననియు, చెప్పినప్రకారముగా మరణమునకు నాలుగుదినములు ముందు తమసమ్ముఖమున నుండ తటస్థించిన యామ్యూరి లక్ష్మీనరసింహముగారి సమాజపక్షమున ధర్మకర్తను (Trustee) గా నేర్పఱిచి యుద్దేశించుకొన్న పదివేలరూపాయలను మరణశాసనమూలమున సమాజమున కిచ్చివేసినవాగ్దానమును పూర్ణముగాఁ జెల్లించుకొనిరి. ఆయన వ్రాసిన మరణశాసనములు రెంటను నిందు క్రిందపొందుపఱుపఁబడుచున్నవి:—

I

'I, Pyda Ramakrishniah of Cocanada, son of Pyda Chelamayya do hereby entrust you with two Hundies executed by Rajah Venkatadri Apparow Bahadur Garu on the 3rd March 1886 to the value of Rs. 10,000 (Rupees ten thousand only) and request you to act as trustee for Widow Marriage Association so that you may use the interest to be realised from the above sum in the support of remarried widows and their husbands and their children and for bringing about widow marriages; but not a single pie should be spent from the principal. I further request that you should do this business to the best of your ability and dis-

cretion for the improvement of the widows marriage cause and that you should make such arrangements that the object might be carried on in perpetuity even after your demise.

18th March 1886,
Cocanada. P. RAMAKRISHNAYYA."

(కాకినాడ నివాసియు పైడా చలమయ్య కుమారుఁడైన పైడా రామకృష్ణయ్య అనెడి నేను 1886-వ సంవత్సరము మార్చినెల 8-వ తేదిని రాజా వెంకటాద్రి అప్పారావు బహద్దరుగారివలన రు. 10,000 (పదివేఁరూపాయలు మాత్రములకు వ్రాయఁబడిన రెండు హుండీ లను మీ వశముచేసి పయిమొత్తమువలన వచ్చెడు వడ్డిని వివాహము చేసికొన్నవి వితంతువులయొక్కయు, వారిభర్తలయొక్కయు, వారి బిడ్డలయొక్కయు పోషణమునిమిత్తమును వితంతువివాహములను జరపునిమిత్తమును మీరుపయోగించుటకయి వితంతువివాహసమాజ మునకు ధర్మకర్త (Trustee) గాఁ బనిచేయుటకు మిమ్ము వేఁడు చున్నాను; కాని అసలులోనుండి యొక్క దమ్మిడికూడ ఖర్చుచేయఁ బడకూడదు అంతేకాక వితంతువివాహపక్షాభివృద్ధి నిమిత్తమయి మీ యావచ్ఛక్తిని బుద్ధిని వినియోగించి యీపని చేయవలెననియు మీ మరణానంతరము సహితము శాశ్వతముగా నాయుద్దేశము జరుగుట కయితగినయేర్పాటులు చేయవలసినదనియు మిమ్ము వేఁడుచున్నాను.)

ఈమరణశాసనములో వితంతువివాహసమాజ మన్నచోట రాజమహేంద్రవరమనికాని, ధర్మకర్త యున్నచోట అత్యూరి లక్ష్మీ నరసింహముగారనికాని, వ్రాయఁబడలేదు. వితంతువివాహసమాజ మొక్కటేయుండుటచేత వేఱుగ రాజమహేంద్రవర మనుట యనావశ్యకము; తమపేరు చేర్చవలసినదని లక్ష్మీనరసింహముగారు రామకృష్ణయ్యగారికి వ్రాసిరికాని శేఖ చేతులోపలనే యాయన మర ణము నొందుట తటస్థించెను.

II

"Pyda Ramakristniah, son of Chelamayya Garu, residing at Cocanada Godavary District, do hereby make a will as regards the property herein below described in the following way.

As I have various properties. I am obliged to make various will but the wills will not contradict one another and each will have its force.

The houses together with sites herein after mentioned and situate at Cocanada and Rajahmundry will be given to the persons named herein in perpetuity to be enjoyed by them from generation to generation without the power of alienation either by sale, mortgage or otherwise and further that the occupants should be liable to be ejected if they behave improperly. The houses that are in my name, the houses and sites that are in the name of Kandukur. Veerasalingam Pantulu Garu, Kotikalapudi Rameswara Row Garu and any other, for the sake of the Widow Marriage Association will be transferred by the Widow Marriage Association to the several persons mentioned below with the conditioned above stated.

18th March 1886. P. RAMAKRISTNIAH."

(చెలమయ్యగారి కుమారుఁడనై గోదావరిమండలములోని కాకినాడలో నివసించుచున్న పైడా రామకృష్ణయ్య అను నేను ఈ క్రింద వివరింపఁబడిన సొత్తువిషయమయి యీక్రిందిరీతిగా నిందువలన మరణశాసనము చేయుచున్నాను.

'నాకు వేఱు వేఱు సొత్తులున్నందున, వేఱు వేఱు మరణశాసనములను చేయవలసినవాఁడ నగుచున్నాను, కాని మరణశాసనము లొకదాని నొకటి బాధింపక దేని కది తన బలమును కలదయి యుండును.'

ఈక్రింద పేర్కొనబడినట్టియు, కాకినాడలోను రాజమహేంద్రవరములోను ఉన్నట్టి గృహములు స్థలములతోఁగూడ ఈ క్రింద పేర్కొనఁబడినవారికి విక్రయమువలనఁగాని, తాకట్టువలనఁగాని యితర

Venkiah Garu and his wife Venkamma Garu (చేబోలు వెంకయ్యగారు ఆయనభార్య వెంకమ్మగారు)సదరులోగిటిలోఉత్తరపువైపు భాగము స్థలము అనఁగా యీ వెంకయ్యగారిస్వాధీనములోవున్న ఇల్లు స్థలము. "అనివ్రాసి, దానిక్రింద "7, 8 Remarks ఈయిల్లు యావత్తూ రెండు సమభాగములువేసి వకభాగము కోదండరామయ్యగారికిన్ని రెండవభాగము చేబోలు వెంకయ్యగారికిన్ని యివ్వవలసినది." అని యొక యను శాసనమును లిఖించిరి. ఇందువలన నిప్పుడు పదుమూడవ వివాహముచేసికొన్న పటానేని వెంకయ్యగారికిని ఆయన భార్య సుబ్బమ్మగారికిని కాపురముండుట కిల్లు లేకుండపోయినది. ఈపటానేని వెంకయ్యగారు ప్రాథమికపరీక్ష (Primary Examination) యందుఁ గృతార్థుఁడయి యెనిమిదిరూపాయల జీతముగల యుపాధ్యాయపదమునం దుండెను.

పూర్వోక్తానుబంధపట్టికలో రామకృష్ణయ్యగారు తాడూరి రామారావుగారి యింటినిగూర్చి "3 Taduri Ramarow Puntulu Garu and his wife Seetamma Garu (తాడూరి రామారావుపంతులుగారు ఆయన భార్య సీతమ్మగారు) శ్రీ పిఠాపురపురాజాగారివద్ద సూర్యారావుపేటలో నేను కొన్నలోగిలి స్థలము అనగా యీరామారావుగారి స్వాధీనభుక్తములోవున్న ఇల్లుస్థలంలోఁ గొంతిభాగం— యిందునుగురించి రిమార్కు—చూచేది" అనివ్రాసి దానిక్రింద "సూర్యారావుపేటలో మేఁ రోడ్డున చేరివున్న పెంకుటియిల్లు విక్టోరియా రేజస్ కుటుంబములవారు కాపురములు వుండడముకు రెండు భాగములుగ విభజించడమైనది. ౧ ఉత్తరపు వయిపువాటా వకభాగము. ౧ దక్షిణవయిపువాటా వకభాగము. ౧ యీరెండు భాగములలో తాడూరి రామారావుగారికి ఆయనకు యిష్టమయిన వకభాగమున్ను, పడవానున్ను ఆయన కింవను యేర్పర్చడమైనది. ఇదివరలో ఆయనకు రు. ౪౦౦-౦-౦ కిమ్మత్తుగల యిల్లు యిస్తానని వాగ్దత్తముచేసి వుండ

డమైనది. ఎక్కువకిమ్మతుగలదిన్ని నడవ కలుపుకుని యెక్కువభాగము అయినప్పటికిన్ని రామారావుగారికి ఉండడముకు యేర్పర్చడ మయినది.........

౧ పయిన వ్రాసినప్రకారం వకభాగము రామారావుగారు పుచ్చుకోవడముకు యిష్టము లేనియెడలనున్ను ఆయన వేరేయిల్లు కొనుక్కుంటానని కోరినయెడలనున్ను ఆయనయందు నా కుండే దయ చేత ఆయన వేరే యిల్లు కొనుక్కోవడప్రుతరుణము తటస్తమయి నప్పుడు నాకుమాళ్లు ఆయనకు రు. ౫౦౦-౦-౦ అయిదువందల రూపా యీాలు నగదుయిచ్చి ఆయనకు యిస్తావన్న భాగముకూడానాకుమాళ్ళ వశములో వుండగలందులకు యేర్పర్చడమైనది.'' అని యనుశాసన మున చేర్చిరి.

రామకృష్ణయ్యగారి మరణానంతరమున వారు వితంతువివాహ సమాజమువారిపక్షమున వ్రాసియిచ్చిన మరణశాసనములను రెంటిని ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు తీసికొనివచ్చి సమాజమున కిచ్చిరి. ఆయన సమాజమువారికోశాధ్యక్షుఁడయియుండున తెచ్చిన మరణ శాసనములు రెండును లక్ష్మీనరసింహముగారి యొద్దనే యుంచఁబడెను. 1886-వ సంవత్సరము ఏప్రిల్ నెల 8-వ తేదిని జరిగిన సమాజము యొక్క కార్యనిర్వాహకసంఘమువారిసభలో నీక్రిందినిర్ధారణము చేయఁబడినది.

"5. That the will executed by late Ramakrishniah Garu infavour of the Association be registered." (సమాజమున కనుకూలముగా గతించిన రామకృష్ణయ్యగారిచేఁ జేయఁబడిన మరణ శాసనములు లేఖ్యారూఢములు చేయఁబడవలెను.)

ఈ నిర్ధారణముక్రింద నగ్రాసనాసీనుఁడుగానుండిన మాకర్ల సుబ్బారావునాయుఁడు బి. ఏ., బి. ఎల్., గారిచేతను, ఆత్మూరి లక్ష్మీ నరసింహముగారిచేతను, బసవరాజు గవర్రాజుగారిచేతను, నాచేతను,

"6. That after the execution of the rent deed, Mr. A. L. Narasimham be authorised to divide the above house according to the will of P. Ramakrishnayya."

(అద్దె చీటి వ్రాసిన తరువాత పి. రామకృష్ణయ్యగారి మరణ శాసనప్రకారముగాఁ బయియింటిని భాగించుటకు ఏ. ఎల్. నరసింహముగారి కధికార మియ్యఁబడినది.)

రామకృష్ణయ్యగారి మరణశాసనానుసారముగా నిల్లు రెండు భాగములుచేసి యిద్దరికే యిచ్చినతరువాత వారు పటానేని వెంకయ్యగారి కాపురమున కియ్యనిపక్షమున వారికి యిల్లులేక చిక్కులుపడ వలసినప్పటికిని, ఇప్పుడే యిల్లొకటియ్య మనెడుపక్షమున మూడవ నిర్ధారణ ప్రకారముగా వరినిల్లు కట్టించి యిచ్చువఱకును యథా ప్రకారముగా నతనిని నచటనే భాగముగానే యుంచి గృహవిభాగము తరువాత చేయవచ్చుననియు, ఇల్లిచ్చెద మనెడుపక్షమున సంవత్సర కాల మవకాశ మిచ్చుకొని యతని నందులోఁ గాపురముంచి యా సంవత్సరములోపల యిల్లుకట్టించి యియ్యవచ్చుననియు, ఉద్దేశించి యీ కడపటి యుయిదాయినిర్ధారణములు రెండును చేయఁబడినవి. వితంతువివాహపక్షమునం దభిమానముగలవాఁడును పిఠాపురములో ప్రాడ్వివాకుఁడు (Dt Munsiff) గానున్నవాఁడును అయినమల్లారి రావుపంతులుగారు కోదండరామయ్యగారికిఁ దనకార్యస్థానములో రు. 15 లు జీతముగల లేఖకోద్యోగము నిచ్చినందున ఆయన యక్కడకుఁ బోవునప్పుడు మూఁడవ నిర్ధారణానుకూలముగా నిల్లద్దె కిచ్చుట కంగీకరింపఁగా నద్దెచీటి వ్రాసిపుచ్చుకొని యథాపూర్వకముగా, పటానేని వెంకయ్యగారికి యింటిబయలునం దుంచితిమి. పిమ్మట లక్ష్మీనరసింహముగా రిల్లు రెండుభాగములుచేసి కోదండరామయ్యగారి కర్ధభాగ మిచ్చిరి.

ఏప్రిల్ నెల 3-వ తేదిని చేయఁబడిన నిర్ధారణప్రకారముగా మరణశాసనములను రెంటిని గొనిపోయి లేఖ్యారూఢము చేయించుట

కయి సమాజసహాయకార్యదర్శియైన సోమంచి భీమశంకరముగారు లక్ష్మీనరసింహముగారియొద్దకుఁ బోయి యడుగఁగా, పదివేలరూపాయల మరణశాసనమును తనయొద్దనే యుంచుకొని మిగిలిన మరణశాసనము నొక్కదానినే నరసింహముగా రిచ్చినందున భీమశంకరముగా రొక్క మరణశాసనమును మాత్రమే 1885-వ సంవత్సరము మేయి నెల 6-వ తేదిని సహాయలేఖ్యారూఢాధికారి (Sub Registrar) యెదుటఁ బెట్టవలసినవాఁడయ్యెను. లక్ష్మీనరసింహముగారు జూన్ నెల 26-వ తేదిని సహాయలేఖ్యారూఢాధికారి కార్యస్థానమునకుఁ బోయి మరణశాసనము రామకృష్ణయ్యగారు వ్రాసి యిచ్చినట్టు సాక్ష్య మిచ్చెను. ఆమఱునాఁ డనఁగా 1886-వ సంవత్సరము జూన్ నెల 27-వ తేదిని జరిగినసమాజకార్యనిర్వాహకసంఘమువారిసభలో-

"4. That the secretary, N. Subbarau Pantulu, be authorized to present the will of P. Ramakrishnıah Garu before the Sub Registrar of Rajahmundry." (పి. రామకృష్ణయ్యగారి మరణశాసనమును రాజమహేంద్రవరసహాయలేఖ్యారూఢాధికారి ముందర్పించుటకుఁ గార్యదర్శియైన ఎన్. సుబ్బారావు పంతులుగారి కధికారమియ్యబడినది.)

అని మిగిలియున్న రెండవ మరణశాసనమును లేఖ్యారూఢము చేయించుటకై నిర్ధారణము చేయఁబడినది. ఈ నిర్ధారణముక్రింద న్యాపతి సుబ్బారావు పంతులుగారును, ఆత్మూరి లక్ష్మీనరసింహముగారును, నేనును, సోమంచి భీమశంకరముగారును, బసవరాజు గవర్రాజుగారును, మాకర్ల వెంకటసుబ్బారావు నాయఁడుగారును, వ్రాళ్లుచేసితిమి. ఈసభలోనే పెద్దాపురము పోవుటకుఁ బ్రయాణవ్యయముల నిమిత్తము కోదండరామయ్యగారు చేసిన విజ్ఞాపనము నిరాకరింపఁబడెను. ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు రామకృష్ణయ్యగారి పదివేల రూపాయల మరణశాసనమును లేఖ్యారూఢార్థ మియ్యక

పోవుటకును, ఇయ్యక పోవలెనని నిశ్చయించుకొన్నను పైకిఁజెప్పక లేఖ్యారూఢము చేయింపవలసినదని కార్యనిర్వాహకసంఘమువారు చేసిన నిర్ధారణముక్రింద వ్రాలు చేయుటకును గలకారణము కొంత వివరింపవలసియున్నది. సత్యప్రకటనార్థమయి నేనీవివరములు చెప్ప వలసివచ్చినందున కెంతయుఁ జింతిల్లుచున్నాఁడను. నేను నాలవతరగతి యందుఁ జదువుకొనుచుండినప్పుడు రాజమహేంద్రవరమున దొరతన మువారి మండల పాఠశాలలో ద్వితీయోపాధ్యాయుఁడుగా నుండిన యాయనయొద్ద మాపాఠములు కొన్ని జరుగుచుండుటచేత నాకాయన గురువు, ప్రియశిష్యుఁడనగుటచేత నా కాయన బ్రహ్మసమాజసిద్ధాం తములను బోధించుచు, నేను మా యింట చేసెడి విద్యార్థుల సభలకు వచ్చుచు, నన్ను ప్రోత్సాహ పఱుచుచుండెడివారు. నాయం దాయన కప్పు డుండిన సదభిప్రాయము తేటపడుటకయి నేను క్రొత్తగా నారం భించిన వివేకవర్ధనికిఁ జందాను పంపుచు 1875-వ సంవత్సరము నవం బరు 14-వ తేదిని బరంపురమునుండి వ్రాసిన లేఖలోని మొదటి రెండు వాక్యముల నుదాహరించుచున్నాను.

"I am very glad that the sparks of Public spirit which were found in you when I was at Rajahmundry have now taken a flame. Every one that looks to public interest must assist you to the best of his ability in the successful carrying out of your laudable object."

(నేను రాజమహేంద్రవరములో నుండినప్పుడు మీయందుఁ గనఁబడిన జనహితబుద్ధిజ్వాలకణము లిప్పుడు జ్వాలగా నయినందుకు నే నెంతయు సంతసించుచున్నాను. ప్రజాక్షేమమును గోరెడు ప్రతి మానవుఁడును మీ శ్లాఘ్యమయిన యుద్దేశమును జయప్రదముగాఁ గొనసాగించుటకుఁ దన యావచ్ఛక్తిని మీకుఁ దోడుపడవలయును.)

ఎప్పటివో చిన్నతనమునాటి కథలనటుండ నిచ్చినను, ఈ మన నాయందు బాల్యమునందుండిన వాత్సల్యమునే కనఁబఱుచుచు మరలఁ

డాను రాజమహేంద్రవరము వచ్చినతరువాతకూడ నేను పూనిన స్త్రీపునర్వివాహాదులయందు నా కెన్నివిధములనో సాయపడుచుండెను. అయినను నాకు నెయ్యముకంటె న్యాయము ప్రియతరమైనది. న్యాయమునకు గురువుతో గ్రుద్దులాడవలెనన్న న్యాయము ననుసరించి యిప్పు డాయనతో నేను ప్రతిఘటింపవలసివచ్చినది. నే నాకాలములో వితంతువివాహవిషయమున విశేషముగా బాటుపడుచుండినను, పురపారిశుద్ధ్యవిచారణసభాకార్యములలోను, పత్రికానిర్వహణములోను, గ్రంథరచనలోను, అన్యాయనివారణప్రయత్నములలోను, ఉపన్యాసకరణములలోను, పూర్వగ్రంథప్రకటనములలోను కూడ సమానముగానే పాటుపడుచుండెడి వాడను. నేను ప్రకటించుచుండిన వివేకవర్ధనిపత్రిక దుష్టవర్తనముగలవారికి కంటకమై గర్భనిర్భేదకముగా నుండెను. నేను చెన్నపురికి చందాలు పోగుచేయుటకై వెళ్ళియుండినప్పుడు నామిత్రులైన బసవరాజు గవర్రాజుగారు నరసాపురమునుండి 1885-వ సంవత్సరము మెయి నెల 28-వ తేదిని వివేకవర్ధనినిగూర్చి నాకిట్లు వ్రాసిరి.

"I am doing my best for V. I am afraid we must employ a clerk to keep accounts & carry on correspondance. Without a clerk it is impossible for you or any body else to do this petty work. I think with a little system both the paper and the Press may be made to pay themselves at least. The paper is not very regular. But in course of time with another press it is quite possible to make the paper more regular."

(వివేకవర్ధనినిగూర్చి నాచేతనైనంత చేయుచున్నాను. లెక్కలుంచుటకును ఉత్తరప్రత్యుత్తరములను జరపుటకును మనమొక లేఖకుని పెట్టవలెనని నేను భయపడుచున్నాను. లేఖకుడు లేక యీచిన్న

పనిని చేయుట మీకుఁగాని మఱియే యితరునికిఁగాని సాధ్యము కాదు. కొంచెము క్రమపద్ధతితోఁ బత్రికయు ముద్రాయంత్రమునుకూడ అధమము తమంత పొట్టపోసి కొనునట్లు చేయవచ్చునని నేను తలఁచుచున్నాను. పత్రిక యంతక్రమముగా లేదు. కాని కొంతకాలములో నింకొక ముద్రాయంత్రముతోఁ బత్రిక నిప్పటికంటె నెక్కువ క్రమముగాఁ జేయుట మిక్కిలి సాధ్యమే."

ఇతరవిషయములకయి ధనము కావలసి యుండుటచేత మితవ్యయము నపేక్షించి రాజమహేంద్రవరములో నున్నప్పుడు లెక్కల పనిని ఉత్తరప్రత్యుత్తరముల పనినికూడ నేనే చేయుచుండెడివాఁడను. ఇంకొక ముద్రాయంత్రము కావలెనని యాఁకున వ్రాయఁగానే వెంటనే తగిన యేర్పాటుచేసి క్రొత్తముద్రాయంత్రము నొకదానిసికూడ నప్పుడే (1885-వ సం॥) తెప్పించితిని. మావివేకవర్ధని పేరు చెప్పిన లంచములు పుచ్చుకొనువారును, అక్రమములు చేయువారును, భయకంపితు లగుచుండిరి. ఉన్నతన్యాయసభవా రొకసారి యితర మండలములలో లంచములు పుచ్చుకొనుట కలవాటుపడి యాఱితేఱిన యొక ప్రాడ్వివాకుని మా రాజమహేంద్రవరమునకుఁ బంపిరి. ఈయన లంచములు పుచ్చుకొనెడిరీతి పూర్వము పోలూరి శ్రీరాములుగారు పుచ్చుకొనుచుండిన దానికంటె భిన్నమైనదిగా నుండెను. ఈయన సాక్ష్యము మొదలైనవానిని క్రమముగాఁ బుచ్చుకొని, తీర్పు చెప్పఁబోవుసమయమున నుభయపక్షములవారినుండియు వారియ్యదగినంత మొత్తమును లంచముగాఁ దెప్పించి తనయొద్ద నుంచుకొని, గ్రంథమునంతను న్యాయదృష్టితోఁ జదివి, ఏదిన్యాయపక్షమో కనుఁగొని యాపక్షమువాఁడు పదిరూపాయల నిచ్చినను దానితోనే తృప్తి నొంది వానిపక్షమే తీర్పుచెప్పి, యన్యాయపక్షమువాఁ డిన్నూఱు రూపాయ లిచ్చినను ఆ మొత్తమును తిరిగి యిచ్చివేసెడివాఁడు. అందు

చేత నాతని తీర్పును చూచినవాఁడెవ్వఁడును న్యాయముతప్పిన తీర్పని చెప్పఁజాలఁడు. అటువంటిప్రౌఢునిలంచములను మాన్పవలెనని మా వివేకవర్ధని పనిచేయఁ బూనెను. ఇతనివిషయమయి వ్రాయఁబడిన హాస్యసంజీవనిలోనిసంభావనలు చదివి కొన్నాళ్ళు లంచములు మాని వేసి యాఁబుసెలలు సెలవుపుచ్చుకొని తనపని మఱియొకచోటికి మార్చుకొనఁ బ్రయత్నించెనుగాని యున్నతన్యాయసభవా రాతని ప్రార్థన నంగీకరింపనందున మరల మాపట్టణమునకే రావలసినవాఁడయ్యెను. రెండవసారి వచ్చినపిమ్మట నల్పకాలము శుద్ధవర్తనుఁడయి యుండి తనయింటి కివ్వరిని రాకుండఁ జేయుటకయి భంటులను కావలి యుంచెను. అయినను లంచముల మరిగి ధనార్జనమున కలవాటుపడిన హస్తము చిరకాలము రిక్తదశలో నుండఁజాలదు గనుక శీఘ్రకాలములోనే యతఁడు రహస్యముగా నధర్మధనస్వీకారమునకుఁ జేయి చాప నారంభించెను. వెంటనే మా వివేకవర్ధని విజృంభించి తనలేఖనీకృపాణోపేతమైన చేతిని చాచి యన్యాపదేశముగా వ్రాయుచు లంచములకయి చాచెడి యాతనిచేతిని ముడిపింప పోరాడఁ దొడఁగెను. వివేకవర్ధనిధాటికిఁ దాళఁజాలక యతఁడు మరల సెలవు పుచ్చుకొనిపోయి యేమేమో ప్రయత్నములుచేసి మరల మాయూరికి రాకుండఁ దప్పించుకొనిపోయెను. ఇట్టి వివేకవర్ధని యింటిలోకహితకార్యశూరత్వమును దౌష్ట్యనివారణదీక్షాపరత్వమును విడిచి శాంతమయి స్వపక్షరక్షణపరాయణత్వమునకుమాత్రమే కడఁగుచున్నదని యిటీవల నపవాదమొకటి కొంచెము తలయెత్త నారంభించినది. వివేకవర్ధని స్వపక్షము వారి యక్రమములను వెల్లడింపక పక్షపాతము వహించుచున్నదని కొందఱు మిత్రులు నాతోనే యనిరి. మాపత్రిక స్వపక్షము వారన్న హేతువుచేత వారిదుష్కృత్యములను కప్పిపుచ్చుటకయి బుద్ధిపూర్వకముగా నెప్పుడును ప్రయత్నింపలేదుగాని బహుజనానర్థదాయకములు

కాని యల్పదోషముల నుపేక్షించుచు వచ్చెను. ఒకానొకప్పుడు కొందఱి యకార్యములను వెల్లడింపకపోవుట తటస్థించినను, ఆలోప మజ్ఞానముచేత నైనదే కాని మనఃపూర్వకమైనది కాదు. అల్పదోషముల నుపేక్షించుచు వచ్చుటచేత నొకానొకరు నిర్భయులయి కొంత వఱకు యథేచ్ఛముగా సంచరించుచు వచ్చుటయుఁ గలదు. అయినను భ్రమప్రమాదాదులు మనుష్యసామాన్యము లగుటచేత మావివేకవర్ధనిమాత్రము సర్వసామాన్యములైన మానుషదౌర్బల్యములు లేదని చెప్ప నెవ్వరు సాహసింపఁగలరు ? ఉండనిండు. దాని తాత్కాలిక విషమావస్థను దలఁచి యుదారచిత్తులగువారు తదపరాధములను క్షమింతురుగాక !

ఆత్మూరి లక్ష్మీనరసింహముగారు లంచములు పుచ్చుకొనువారు కాకపోయినను, తమన్యాయసభలోఁ బనియున్నవారియొద్ద నుండి న్యాయమైనవెలలకంటె మిక్కిలి తక్కువవెలలకు ధాన్యము మొదలైన తమకుఁ గావలసినపదార్థములను గైకొనుచుండిరి; తాము పూనినకార్యములనిమిత్తము చందాలు వేయించి కక్షిదారులవలన ధనస్వీకారము చేయుచుండిరి; తమయింటఁ బనిచేయు సేవకులకుఁ దమకార్యస్థానములోఁ బను లిచ్చి వారిన్యాయమయిన పని నితరుల చేతఁ జేయించుచుండిరి; తాము బంధుమిత్రాదులను చూడ గ్రామాంతరము పోవలసివచ్చినప్పుడు దారిలోఁగాని తత్సమీపమునఁ గాని యేదైన స్థలవివాదముగలవ్యాజ్య మున్నదేమో విచారించి దానిని స్వయముగాఁ జూడవలెనని చెప్పి తమకును తమకుటుంబమునకును పల్లకులమీఁద రాకపోకల కయ్యెడు కర్చులను వ్యాజ్యదారులవలనఁ బుచ్చుకొనుచుండిరి. అయిన మిత్రపక్షానురక్తియు, సత్కార్యసాహాయ్యకరణాసక్తియు, కార్యతంత్రప్రయోగశక్తియు, విశేషముగాఁ గలవారే యయినను దాంభికవర్తనాపేక్షయు సర్వజనప్రియాచరణ

శాంతియు నాయనయందు ముఖ్యలోపములుగా నుండెను. 1886-వ సంవత్సరము మార్చి నెల 31-వ తేదిని ప్రకటింపఁబడిన వివేకవర్ధనిలో దంభాచార్యవిలసనమను ప్రహసనముయొక్క ప్రథమభాగము ప్రచురింపఁబడినది. దానిలోని ముఖ్యపాత్రములు దంభాచార్యులును, మిత్రుఁడు జంబుకేశ్వరశాస్త్రియు, స్వామిశాస్త్రియు, అందువర్ణింపఁబడిన లక్షణములవంటివి రెండు మూఁడింటనయం దుండినవి. అందలి రెండుమూడుభాగముల నిందుఁ జూపుచున్నాను—

"స్వామి—ధాన్యము నాలుగురోజులలో వస్తవి. ఇప్పుడు కొత్తధాన్యము పుట్టి యిరవై రెండు రూపాయల కమ్ముతూవుంటే నేను పుట్టి పదహారురూపాయలచొప్పున పదిగరిశలధాన్యమునకు బెట్టీయిచ్చినాను. వాళ్ళకు మనతఃసులో వ్యవహారము వుండబట్టి ఆధరకుయిచ్చినారు కానండి లేకపోతే యిరవై రెండురూపాయలకుఁ జల్లిగవ్వతక్కువ యివ్వరు. మనధాన్యం చేరేవరకూ మీరు వాళ్ళవ్యవహారం పరిష్కరించకూడదు. వాళ్ళజుట్టు మనచేతిలోనుంచి తప్పిపోతే మళ్ళీధాన్యం రావు. ధాన్యం వచ్చేదాకా మీరు పోస్టుపోనుచేసి తిప్పుచుండవలెను. మీ కన్నిధాన్యము అక్కరలేకపోతే మనం బజారులో నిరువదిరెండు రూపాయలకాడి కెవరికైనా అమ్మివేయవచ్చును.

జంబు—స్వామిశాస్త్రిలుగారు సల్లయిలు మహాబాగా చేయిస్తారు. మాకుకూడా యీధరకు రెండుగరిశల ధాన్యము యిప్పిస్తురూ.

దంభా—మాధాన్యములో మీరుకోరిన రెండుగరిశలూ కొన్నధరకు నేను యిప్పిస్తాను లెండి. మాస్వంతవాడుకకు అన్ని ధాన్యము అక్కరలేదు. ఈస్వామిశాస్త్రిల్లుగారు మన కన్నివస్తువులూ యీప్రకారం చవకగా యిప్పిస్తారు. మనం డబ్బుయిచ్చి కొంటాముగాని లంచాలు పుచ్చుకోము.

♦ ♦ ♦

దంభా—ఏమీనాపనిలేదండి. మేమిప్పుడు వేదాలనుగురించి మాట్లాడుచున్నాము. మనవేదాలు దైవదత్తా లనుదానికి సందేహము లేదు. ఆదరించే ప్రభువులు లేకను కిరస్తానీవిద్యచేతను వేదశాస్త్రాలు నశిస్తూన్నవి. భీమరాజుగారూ! మనము వేదము వ్యాపించే ప్రయత్నముచేయవలెనండీ. మనవేదాలలోఁ జెప్పిన వర్ణాశ్రమాచారా లేలాగునయినా నిలువపెట్టవలెను.

భీమ—చిత్త మాలాగే చేశాము. నావంతుచందా నేను యాభయిరూపాయ లిస్తాను. అధికారులు మీరు తలపెడితే నాలుగు ఘడియలలో వెయ్యిరూపాయలు పోగవుతవి.

♦ ♦ ♦

దంభా—(లేచి) రాఘవాచార్యులుగారూ! దయచెయ్యండి. అడివేఁందాసుణ్ణి—అయ్యా! మేము కొంచెము రహస్యము మాటాడుకోవలెను. లోపలికి వెళుదుమా!—ఆచార్యులుగారూ! లోపలికి దయచేస్తారా!

రాఘ—అక్కర లేదండి. తమరుచెప్పిన కార్యము మీరన్న ప్రకారము జాగ్రత పెట్టించినాను. ఈకాలములోఁ బరమభాగవతాగ్రేసరుల అధికారములో నున్నవారిలో మీరొక్కరు కనపడుచున్నారు. మీద్వాదశోర్ధ్వపుండ్రాలు చూచినా తులసిమాలలు చూచినా నాకు బహుసంతోష మగుచున్నది. మీరు తిరుమణిమహాత్మ్యము విన్నారు కాదండీ!

♦ ♦ ♦

దంభా—అవచ్చే ఆయన రివరెండుకారు దొరగారు. స్వాములవద్ద నే నేలాగు ప్రవర్తిస్తానో తమరే చిత్తగిస్తారు—హుటాహుటి వస్తూన్నాఁడు. తమరంతా దయచెయ్యవచ్చును.........(తనలో) ఈముండాకొడుకుకూడా నామాలు కడిగివేయకమునుపే వచ్చినాడే.

వీళ్ళనందరినీసాగనంపి వీడివద్ద యేదో మాయోపాయమున్న తాను.

కాదు—(ప్రవేశించి) తహశ్శీల్దార్ ! వీరి నెవరినీ పంపించ వద్దు. వీరికి సత్యమతము కొంచెము బోధింతాము. మీ వేదాలు సత్యమైనవి కావనిన్నీ బైబిలొక్కటే సత్యవేదమనిన్నీ, కృష్ణుడు జారత్వము చోరత్వము చేసిన పాపి అనిన్నీ, రక్షకుడయిన యేసు క్రీస్తును కొలిస్తేనే కాని ముక్తి లేదనిన్నీ, జాతిభేధాలు పనికిమాలిన వనిన్నీ నిన్న మీరు మాయింట్లో చెప్పినమాటలు వీరితో నెప్పుడయినా చెప్పినారా !

ఆయన దీనిని చదివినతరువాతఁగూడ యథాప్రకారముగానే నాతో మాటాడుచుండిరి. రామకృష్ణయ్యగారిమరణశాసనములను నా కాయన చూపినప్పుడు మఱి యిద్దఱు ముగ్గురు ట్రస్టీలనుకూడ తమతోఁ జేర్చుకొని పనిచేయుఁడని నేను చెప్పిన హితవచనముల కాయన యామోదించినట్లే మాటాడిరి. రామకృష్ణయ్యగారిమరణమునుగూర్చి యేప్రిల్ నెల 7-వ తేది ప్రకటింపఁబడిన వివేకవర్ధని లోని వ్యాసములో నే నాయనతో మాటాడిన మాటలయర్థమిచ్చెడు వాక్యములే యుండినవి. ఇవి యిట్లుండఁగా మేయినెల మొదటివారము తుదను సత్యకామియను పేరుతో నొకరు వివేకవర్ధని కిట్లు వ్రాసిరి.—

"మహారాజశ్రీ వివేకవర్ధనీ యెడిటరుగారికి.

అయ్యా, పైడా రామకృష్ణయ్యగారిచావునుగురించి వ్రాసిన వివేకవర్ధనిలో ఆయన క్రొత్తగా యిచ్చిన పదివేలరూపాయలను గురించి యీ మాటలు కనబడుచున్నవి.

"అంతేకాక కార్యాంతరముమీద మాడిస్ట్రిక్టుమునసపుగార యిన ఆత్మూరి లక్ష్మీనరసింహముగా రక్కడకుఁబోయి యుండగాఁ

బదివేలరూపాయల ప్రామిసరీనోట్లను వారిచేతికిచ్చి, ఆసొమ్మువ్యయ పెట్టక దానిమీదివడ్డిని పునర్వివాహములనిమిత్తమయి వినియోగ పఱుచుచుండవలసినదని యేర్పఱిచినారు. అంతసొమ్మొక్కరివశమున నుండుట క్షేమకరము కాదుగనుక లక్ష్మీనరసింహముగారు తగుమనుష్యులను మఱిముగ్గురు నలుగురినికూడ ట్రస్టీలనుగా తమతోఁ జేర్చుకొని యాధనము స్థిరముగా దాతయుద్దేశప్రకారముగా వినియోగపడుటకుఁ దగినమార్గమును సమాజమువారితోఁ గలిసి యాలోచించి యేర్పఱుతురని నమ్ముచున్నాము. అట్లుచేయుట సమాజమువారికి మాత్రమే కాక లక్ష్మీనరశింహముగారికిని మిగుల క్షేమకరము. ఒక్కరెంతమంచియుద్దేశముతో ధనవృద్ధినిమిత్తమయి పనిచేసినను దైవవిపరీత్యమువలన నష్టము సంభవించినయెడల దాతయొక్క మనోరథము విఫలమగుటయే కాక యాపనిచేసినవారికి నిందయు వచ్చును, తాము మంచియుద్దేశము కలవారయినను తమపుత్రులు మొదలైనవా రట్టిసచ్చింతగలవారు కాకపోవచ్చును. కాఁబట్టి నిక్షేపధారులు పలువురయి యుండుట యుభయపక్షములవారికి సర్వవిధముల శ్రేయస్కరము. విశేషధన మొక్కరిచిత్తవృత్తిననుసరించి యుండుటకంటెఁ బలువురయాలోచనకు లోఁబడియుండుట క్షేమకరము కాకపోవునా? కాఁబట్టి బుద్ధిమంతులగు లక్ష్మీనరసింహముగారు మఱియొకవిధముగా నాలోచింతురని మేము భావింపము.”

అయితే యీయూరిలోనున్న యొక పెద్దమనిషి వీరేశలింగముగారా సొమ్ము తమకుఁ కావలెననుచున్నారని వాడుక చేయుచున్నాడు. ఆమాటలలో నేమయిన నిజమున్న దేమో మీపత్రిక ద్వారా తెలియచెయ్య కోరుతాను. చిత్తగించవలెను.

మీవిధేయుడు, సత్యకామి.

ఈయుత్తరమును నేను దీనికిచ్చిన యీక్రింది ప్రత్యుత్తరమును మేయి 19-వ తేది వివేకవర్ధనిలోఁ బ్రకటింపఁబడినది.—

"సత్యకామిగారు చెప్పినమాటలను వాడుకచేయుచున్న పెద్దమనుష్యుఁడు కేవలస్వప్రయోజనపరుడయి యేదో దురుద్దేశముతోఁ బయిప్రవాదమును వేయుచున్నాఁడేకాని, ఆపెద్దమనుష్యునిమాట లెంతమాత్రమును సత్యములుకావు. వివేకవర్ధనిలోఁ బ్రకటింపఁబడిన యర్థముచ్చెడు మాటలనే నే నొకసారి మహారాజశ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహముగారితో ఆయనక్షేమమును సమాజముయొక్క వృద్ధియుఁ గోరి చెప్పియున్నాను. ఆయేర్పటిచెడు ట్రస్టీలలో నాపేరక్కఱలేదని కూడ నే నప్పుడాయనతోఁ జెప్పియున్నాను. ఈవిషయమయి యెవ్వరికయిన సందేహము కలిగియున్నపక్షమున, ఆలక్ష్మీనరసింహముగారినే అడిగి సత్యమును తెలిసికోవచ్చును. ఆయన యీవిషయమయి అసత్యమాడఁబోఁడుగనుక, సత్య మందఱికిని వెల్లడికాక మానదు. ఈ విషయమయి నాయుద్దేశమేమో మాసమాజముయొక్క కార్యనిర్వాహకసభికులకందఱికిని తెలిసియున్నది. ఈధనము తనవశమునందుండవలెనని కోరుటవలన దానిని కాపాడుట మొదలయినదానియందుఁ గష్టములును, ఉత్తరవాదిత్వమును కలుగుటయేకాని యెవ్వరికి నేవిధమయిన లాభమును కలుగదు. ఎవ్వరయినను దాతయుద్దేశప్రకారము మూలధనమును ముట్టుకొనక భద్రముగాఁ గాపాడి దాని వృద్ధిని సమాజమువారి కొప్పగింపవలసినవారేకాని మనసు వచ్చినట్లు వినియోగపఱుపవలసినవారుకారు. ఇంతకంటె నే నిప్పు డధికముగాఁ దెలుపవలసినది లేదు.

కందుకూరి - వీరేశలింగము."

పయియుత్తరము వచ్చినతరువాతను, అది నాయభిప్రాయముతోఁ బత్రికలోఁ బ్రచురింపఁబడులోపలను, 1886-వ సంవత్సరము జూను నెల 9-వ తేదిని ఒక చిత్రకథ నడచినది. లక్ష్మీనరసింహము

గారిమిత్రుఁడు సభకుఁ బోయినప్పుడెల్ల తోడిన్యాయవాదులు మొద లైనవారాయనను 'జంబుక శాస్త్రిగారు దయచేసినారా! జంబుక శాస్త్రిగారూ! విశేషములేమి?' అని పిలిచి హేళనముచేయ నారంభించిరఁట! ఆయనయుఁ గలహప్రియులైన కొందఱు పెద్దమనుష్యులును లక్ష్మీనరసింహముగారియొద్దకుఁ బోయి దంభాచార్యవిలసనము మిమ్ముద్దేశించియే వ్రాయఁబడినదనియు, చేతకానివారివలె మీరూరకుండుట పౌరుషము కాదనియు, ఆయనను పురికొల్పి ప్రోత్సాహపఱిచిరఁట! వారిమాటలపైని కోపావేశము గలవాఁడయి నెలపైని మిది దినములూరకున్నతరువాత నాకస్మికముగా దంభాచార్యవిలసనమును కలిగియుండిన వివేకవర్ధనిని బుద్ధిమంతులందఱును చేరి యాలోచించిన యద్భుతవిధమున లక్ష్మీనరసింహముగారు దగ్ధము చేయించిరి. రెండవనాఁడు నేను మాపత్రికాప్రకటనకర్తచేత వ్రాయించిన లేఖనుబట్టి యాయద్భుతవిధము దీని జదువువారికిఁ దేటపడవచ్చును-

'మహారాజశ్రీ ఆత్మూరి లక్ష్మీనరసింహం చెట్టియార్ గారికి. వివేకవర్ధనిపత్రిక ప్రింటర్ అండు పబ్లిషరు కూరెళ్ళ రామయ్య విన్నపములు.

యీనెల ది 9 తేదిని సాయంత్రము వివేకవర్ధనిపత్రికను గడకుఁగట్టి దానికిఁ బాతచెప్పున్ను చీపురున్ను కట్టి వివేకవర్ధనిలోఁ బ్రచురముచేయించినవాడినిన్ని చేసినవాడినిన్ని వివేకవర్ధనిన్ని బంగారయ్య మేడ అనే స్థలమందుఁ దగులపెడుతామనిన్ని యిష్టమువున్నవారు వచ్చి చూడవలసినదనిన్నీ మీకోర్టు ప్రెస్సాఫీసులనవుకర్లు కొందరున్ను మీయిలాకామనుష్యులున్ను అనేకవిధములైన దూషణపు మాటల నుపయోగిస్తూ పత్రికనున్ను పబ్లిషరునున్ను పత్రికాధికారికిన్ని అవమానము (insult) (పరువునష్టము (defame) న్ను, చేయదపు ఉద్దేశ్యముతో నీబస్తీలో వీధులవెంట టముకు వేయిస్తూ అపని

మీవుత్తరువుప్రకారము జరిగిస్తావున్నట్టు ప్రచురముచేసినారు. ఇందును గురించి నేను న్యాయశాస్త్రప్రకారము చర్యజరగించతలచినాను గనుక యీవిషయములో మీకు యెంతవరకు యిలాకావున్నదిన్ని (నాలుగు) 4 రోజులలోగాఁ దెలియఁజేయఁగోరుతాను.

చిత్తగించవలెను.

ది 11 మెయి 1886 సం. }<br>
రాజమండ్రి }

కూరెళ్ళ రామయ్య,<br>
ప్రింటర్ అండు పబ్లిషరు.'

దానికి లక్ష్మీనరసింహముగా రింగ్లీషున నీక్రింది ప్రత్యుత్తరమును బంపిరి.—

"Sir,

In reply to your registered letter dated 11th Inst. and which reached me on the 12th inst. I have to say that on enquiring I find that what is stated in the letter is not true.

I have further to inform you that the letter under reply contains libellous and defamatory statement and learn that your self and one or two of your men have been making such disparaging statement, and that unless sufficient apology is made within a fortnight from this day, I shall be compelled to proceed against you and your men according to law.

Rajahmundry, }<br>
16th May 1886 }

I have &c.,<br>
A. L. NARASIMHAM."

(అయ్యా! 11-వ తేదిగలట్టియు 12-వ తేదిని నాకుఁజేరినట్టియు మీరిజిష్టరుత్తరమునకు బదులుగా ఆయుత్తరములోఁ జెప్పఁబడినది నిజముకాదని నేను విచారణమీఁదఁ గనుగొన్నట్టు నేను చెప్పవలసియున్నది. అంతేకాక నేను బదులిచ్చుచున్న (మీ) యుత్తరమపవాదగర్భితమయినట్టియు మాననష్టకరమయినట్టియు వచనమును కలిగియున్నదని నేను మీకుఁ దెలుపవలసియున్నది. మీరును మీ మనుష్యులు లొకరిద్దఱును అట్టి బరిభవకరమైనమాటలను చెప్పుచున్నారని నేను వినుచున్నాను, ఈదినము మొదలుకొని పక్షము

లోపలఁ జాలినంత కుమార్జనము చేయనిపక్షమున, మీ మీదను మీ మనుష్యులమీఁదను న్యాయశాస్త్రప్రకారము నేను చర్య జరప వలసినవాఁడ నగుదును. రాజమహేంద్రవరము. 16-వ మెయి 1836.

ఏ. ఎల్. నరసింహము.

పైదాని కింగ్లీషునసే యీక్రింది ప్రత్యుత్తరము పంపఁబడినది.

"To

M. R. Ry. A. L. NARASIMHAM GARU,

Rajahmundry.

Sir,

In reply to your answer of the 16th instant I beg to inform you that I fail to see that my letter contains any libellous and defamatory statement' and that I am not aware, of any 'such disparaging statements' whatever it may mean and that the expression 'one or two of your men' conveys no idea to my mind and'that I am not consequently prepared to make an apology and that you may 'proceed according to law' against whomsoever you may please.

I remain Sir,

20th May 1886. Yours etc,

K. RAMAYYA."

(అయ్యా, మీ 16-వ తేది ప్రత్యుత్తరమునకు బదులుగా నా యుత్తరములో 'అపవాదగర్భితమైనట్టియు మానసష్టకరమయినట్టియు వచనము ఏదియు నాకుఁ గనఁబడలేదనియు, దానియర్థ మేమయినను 'అట్టి పరిభవకరమైనమాట' లేవియు నాకుఁ దెలియరాకున్నవనియు, 'మీమనుష్య లొకరిద్దరు' అన్నవచనమునకు నామనస్సున కర్థమగు చుండలేదనియు, మీ కిష్టము వచ్చిన యెవరిమీఁదనైనను మీరు 'న్యాయశాస్త్రప్రకారము చర్య జరప' వచ్చుననియు, నేను మీకుఁ దెలుపఁగోరుచున్నాను.

20-వ మెయి 1886. (కే. రామయ్య.)

మా పత్రికాప్రకటనకర్త వివేకవర్ధనీపహాసవిషయమయి లక్ష్మీనరసింహముగారి కుత్తరమువ్రాసిన మఱునాఁడు వెలువడిన 12-వ మెయి 1888-వ సంవత్సరపు వివేకవర్ధనిలో దంభాచార్యవిలసనము యొక్క ద్వితీయభాగమును, ఆయన యద్భుతచర్య నొకదానిని తెలుపుచు వ్రాయఁబడిన యొకచిన్నవ్యాసమును, ప్రకటింపఁబడినవి. ఆ వ్యాసములోని మొదటిభాగము నిందుఁ బొందుపఱుచుచున్నాను—

'మాడిస్ట్రిక్టుమునసఫుగారియద్భుతచర్య — రాజమహేంద్రవరపు డిస్ట్రిక్టుమునసఫుగారైన మహారాజశ్రీ ఉమ్మారి లక్ష్మీనరసింహముగారు తమయింటఁబనిచేయుచున్న గోలకొండ-అమ్మన్నయను నొక చాకలివానికి వెనుక తమకోర్టులో బంట్రోతుపని యిచ్చినారు. వాఁడువారియింట పనిపాటులు చేయుచుండి, గతసంవత్సరము మార్చి నెలలో నొకనాఁడు లక్ష్మీనరసింహముగారిపడకగదిలో మంచము మీఁదనున్న వెండిమట్టెలజత నెత్తుకొనిపోయినాఁడు. అందుమీఁద లక్ష్మీనరసింహముగారు తమబంట్రోతయిన బొలిసెట్టి వెంకన్నచేత వానిమీఁద ఫిర్యాదు చేయింపఁగా ఏప్రిల్ నెలలో రాజమహేంద్రవరము రెండవక్లాసు మేజస్ట్రేటుగారు వానికి నెలదినములు ఖయిదు శిక్షను విధించినారు. ఆమఱునాఁడే మునసఫుగారు వానిని పనినుండి తొలగించి బరతరఫుచేసినారు. అటుతరువాత వాఁడు స్వగ్రామమయిన బందరుకు వెళ్ళి కొన్నిమాసములుండి మరలి వచ్చి లక్ష్మీనరసింహముగారి ననుసరించుచు మరల వారియింట పనిపాటులు చేయుచుండెను. ఈప్రకారముండఁగా లక్ష్మీనరసింహముగారు వానికిఁ బూర్వపునామధేయమునుతీసివేసి వీరన్నయను నూతననామకరణముచేసి, ఈక్రొత్తపేరుతో బరతరఫయిన అమ్మన్నకే యేప్రిల్ నెలమధ్యను ఆక్టింగుగా బంట్రోతుపనిని మరలనిచ్చినారు. ఆబదిలీపని యీమాసారంభముతో నయిపోయినందున వానికి మరల నొకబదిలీ బంట్రోతుపని నిచ్చినారు.

దొంగతనము చేసినందునకయి తానే శిక్ష వేయించి పనితీసివేసి పయియధికారులకుఁ దెలియఁజేయకుండ మరల పనినిచ్చుటయేకాక, ప్రజల కన్నులు గప్పుటకును పయియధికారులను భ్రమింపఁ జేయుటకును మునుపున్న పేరునుగూడ వీరన్నయని మార్చివేసినారు. గొప్పపరీక్షలయందుఁ గృతార్థులయి దేశోపకారమునిమిత్తము పనిచేయుచున్నట్లందఱికిని తోఁచునట్లు ప్రవర్తించెడి యిటువంటివారే యిట్టియక్రమములు చేయుచుండఁగాఁ దగినంతవిద్యలేక రాజకీయాధికారములను జేయువారెట్టి యక్రమములకు లోఁబడరు?..............."

పయిదానితోఁ బ్రకటింపఁబడిన రెండవదంభాచార్యవిలసనములోనుండికూడ రెండుభాగము లిందుఁ బొందుపఱుపఁ బడుచున్నవి.

"జం బు—...............మొన్న మీయింటిలో జరిగిన వివాహానికి భోగంవాళ్ళకు యిరువైలూ ముప్ఫయిలూ వసూళ్లు వెయ్యమని నిర్బంధపెట్టివేయించి, ఆసామ్ము లోపాయికారీని మీరు పుచ్చుకొన్నారని కన్నెర్రగానున్నది గనుక బెంచిమేజస్ట్రీట్లు వాళ్ళు నేరస్థులని చెప్పరు.

దంభా—వసూళ్ళు వేయించినానుగాని నేనులంచాలు పుచ్చుకోలేదు-బంధువులయింటికి వెళ్ళుచు యేదోస్థలముచూస్తానని మిషపెట్టి తనకు వకసవారీతన పెళ్ళానికి వకసవారీ తనవెంటసహాయముగా వచ్చే బంధువుడికి వకసవారీపెట్టి రానూపోనూ వందేసిరూపాయలు ప్రయివేటుగా పుచ్చుకుంటూన్న మునసపులను యేమి చేసినారు? వాళ్ళు స్థలము చూడమనే వంకలు పెట్టి పార్టీలవద్ద జోలెడేసిరూపాయలు రహస్యముగాఁ బుచ్చుకొంటూవుంటే చూస్తూవూరుకున్నారు కాని నేను భోగంవాళ్ళకువసూళ్లు వేయించినానని నామీదకక్షకడతారా?

   

దంభా — శాస్త్రుల్లుగారూ! నామనస్సులో నొక్క సంశయము బాధిస్తూన్నది. ఇంతా చేసినా ఆ వైష్ణవులు నన్ను ప్రాయశ్చిత్తము అనే పేరు లేకుండా తమలోఁ జేర్చుకుంటారో లేదో!

జంబు — మహారాజులాగు చేర్చుకుంటారు. రాఘవాచార్యులకు మనకచేరీలోఁ బనియున్నదిగదా? ఆతనివ్యవహారము పరిష్కరించకుండా తొక్కిపెడుతూ వుందురూ. తరువాత నేను మాటాడుతాను.

దంభా — రాఘవాచార్యులు మహా చెడ్డవాఁడు. ముందుగాఁ దనకార్యము చేయించుకుని తరువాత వైష్ణవులు కలసి రాలేదని చెప్పేటట్టుగా వున్నాడు. మనము కార్యము చెయ్యకపోతే దొరకు అర్జీయిస్తాడేమో! మనము ఆనెస్టుమానులము కామని దొరకొకవేళ సందేహము కలుగవచ్చును.

జంబు — మీరు హానెస్టుమానులు కాక లంచాలు పుచ్చుకుంటారా యేమిటి? కక్షిదార్లవద్ద పశువులకు గడ్డీ కూరలూ పాలనిమిత్తము ఆవులు వంటచెఱకూ ధాన్యాలూ అపరదినుసులూ యీలాగంటివి తెప్పించుకోవడము లంచము కాదుగదా? రొఖ్ఖముగా పుచ్చుకోవడము లంచంగాని వాడుకనిమిత్తము రెండుమంచాలు పుచ్చుకున్నా పెట్టెలు పుచ్చుకున్నా లంచము కాదు.”

ఈప్రకారముగా మావ్యవహారమంతకంతకు ముదురొచ్చినది. లక్ష్మీనరసింహముగారు బ్రహ్మసమాజసిద్ధాంతములయందు సంపూర్ణవిశ్వాసము కలవని చెప్పుచు మాప్రార్థనాసమాజమునకప్పుడప్పుడు వచ్చుచుండెడివారు. శంకరాచార్యస్వాములవారిమీఁద తాము తెచ్చిన యభియోగము కొట్టుపడిపోయినతరువాత స్మార్తులు తమయింటికిఁ గర్మలు చేయించుటకు రాకపోఁగా వైష్ణవులను చేరఁదీసి ప్రాయశ్చిత్తము చేయించుకొని తప్తముద్రాధారణమునొంది మధ్య వైష్ణవునకు నామములు మెండన్నట్లు ద్వాదశోర్ధ్వపుండ్రములను తులసి

పూసలతావళములను గండభేరుండంచుబట్టలను ధరింపఁజొచ్చెను; ఈవదుమనే జాతిభేదమువలని యనర్థములను దెలుపుచు క్రైస్తవాచార్యప్రేరణమున నొక యుపన్యాస మిచ్చెను. స్మార్తులనుకూడ కూడఁగట్టుకొనివచ్చుటకయి యాకస్మికముగా వేదములయం దపరిమితవిశ్వాసమునొంది వేదపాఠశాలపెట్టి వితంతువివాహప్రతిపక్షనాయకుల వేదపాఠశాలతో దానిని చేర్చిరి. వైదికముద్రాయంత్రమును వైదికపుస్తకభాండాగారమును స్థాపించుటకయి చందాలు సమకూర్చినవిధమును వివరింపక నీతిపరులు మెచ్చఁదగినది కాదనిమాత్రమిచ్చట జెప్పటఁజాలను. దంభాచార్యవిలసనములో నిందుఁ బేర్కొనఁబడిన దానిలో విశేషభాగము వాస్తవముగా జరిగినసంగతులే. ఉన్నమాట యన్ననులుకు వేసికొని వచ్చునన్న సామెత నందఱు నెఱుఁగుదురు గదా! వివేకవర్ధనీదహనసంస్కారవిషయమయి జరిగించినపని కభియోగము తెప్పించి తుదముట్ట గ్రంథము నడపుటకు నేను నిశ్చయించుకొని దానికిఁ గావలసిసాక్ష్యము నంతను సేకరించి సాధనసామాగ్రితో సంసిద్ధుఁడనయి యుంటిని. ఇంతలో మాయుభయుల మిత్రులును స్వల్పవిషయములనుగూర్చి మిత్రులుగా నుండినవారు రచ్చకెక్కి తగవులాడుట ధర్మముకాదనియు, ఈయంతఃకలహమువలనఁ బ్రతిపక్షులకు మఱింత లోకువగుననియు, మేము పూనిన మహాకార్యమునకు నష్టము కలుగుననియు, అనేకవిధముల మాకు హితబోధచేసి మమ్మసమాధానపఱుప పాటుపడిరి. తాను తొందరపడి చేసినపనికి క్షమార్పణము చేయుట కాయన యొప్పుకొనెను. మిత్రు లందఱును నొకచోట సమావేశమయి మిత్రసమక్షమున లక్ష్మీనరసింహముగారిచేత వివేకవర్ధనీదహనవిషయమయి జరిగినదానికిఁ జింతిల్లుచున్నాననియు దానినిమిత్తము క్షమార్పణము వేఁడుచున్నాననియు చెప్పించెదమనియు జరిగినదానిని మఱచిపోయి దాని నంగీకరించి మరల యథాపూర్వముగా మిత్రి

భావముకలిగి యుండవలసినదనియు మధ్యవర్తులయిన స్నేహితులు నాతోఁ జెప్పిరి. నేను మొదటినుండియుఁ బట్టినపట్టువిడువనిమూర్ఖస్వభావము కలవాఁడనగుటచే లిఖితపూర్వకమైనక్షమార్పణము చేసినఁగాని సంధి పొసఁగనేరదని నేను స్పష్టముగాఁ జెప్పితిని. ఇట్లు మమ్ముల నుభయులను సమాధానపఱిచి సంధి చేయ పాటుపడినవారిలో ముఖ్యులు మహారాజశ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగారు కొంత కాల మీ విధముగా రాయబారములు జరగినపిమ్మట కడపట లక్ష్మీనరసింహముగారు 1886-వ సంవత్సరము 6-వ ఆగస్టు తేదిని ఈక్రింది క్షమార్పణలేఖను బంపిరి.—

"మహారాజశ్రీ శ్రీవివేకవర్ధని పత్రికాధిపతిగారికి,

అయ్యా!

మార్చినెల 11 తారీఖుగల వివేకవర్ధనిలోని హాస్యసంజీవని యందునుండు సంగతులు ఒక్కరివిషయమయి ఉద్దేశించి వ్రాయబడినట్టు నా స్నేహితులు కొందఱు నాతోఁజెప్పినమీదట ఆగ్రహమువచ్చి మెయినెల 9 తారీఖున సదరు వివేకవర్ధని దగ్ధవిషయమయి జరిగించిన పనికి విచారిస్తున్నాను. మరిన్ని అప్పుడు నానవృకర్లు కొందరు మిమ్ముల దూషించినట్టు మీరు తెలియచేసినారు. అట్లా చేయడమెంతమాత్రము నాఉద్దేశముకాదు. వారిని మందలించడమైనది. వారుకాని మరియితరులుకాని ఆసమయమునందున మిమ్ముగాని మీపత్రికనుగాని దూషించిన యెడల అందుకు అపాలజీ చేయుచున్నాను. మీవివేకవర్ధనిలో ఆకని మిలా ప్రచురింపఁబడిన హాస్యసంజీవినివలె సర్వసామాన్యముగా అందరికి వర్తించునటుల ఉన్నయెడల యెవరికి భాధకరముగా నుండదు గనుక అప్రకారముగా ముందు నుండునని తలుస్తూవున్నాను.

6 ఆగస్టు 1886-వ సం॥ తమ విధేయుడు

ఆ. ల. నరసింహము."

దంభాచార్యవిలసనములోని రెండవభాగమునందుండిన విష యము లెంతసర్వసామాన్యముగా నుండినవో మొదటిభాగమునందలి విషయ మంతసర్వసామాన్యముగానే యుండినవి. రెండుభాగములలోను దంభాచార్యుఁడు మునసబుగా గాక తహశ్శీలుదారుగాఁ జెప్పఁబడెను. మొదటిభాగములోని వన్నియు తహశ్శీలుదారుఁడు చేసినట్టే చెప్పఁ బడినవి; రెండవదానిలోఁ గొన్ని యెవ్వరో డిస్ట్రిక్టుమునసబు చేసి నట్లు తహశ్శీలుదారుని నోటఁ బలికింపఁబడినవి. ఈరెంటికినిగల వ్యత్యా సమింతే. ఈరెంటిలోను విషయము లట్టిలోపములు గలవారు తమ్ము ద్దేశించియే వ్రాయఁబడినవని భావింపవచ్చును. ఇఁక చేసిన తీర్మా నము వివేకవర్ధని యంగీకరించి యీవిషయమయి తాను వ్రాయఁ దలఁచుకొన్నదానిని వ్రాయవలసియున్నది. వివేకవర్ధని మరల తీవ్ర ముగా వ్రాయక సౌమ్యముగా వ్రాయవలసిన చిత్తును న్యాపతి సుబ్బారావుపంతులుగారే వ్రాసి దానిని లక్ష్మీనరసింహముగారికిఁ జూపి యాయన సరియన్న మీఁదట మరలఁ దెచ్చి నా కిచ్చిరి. ఇది యంతయు జరగుటకుఁ గొంతకాల మాలస్యమయి నందున 1886-వ సంవత్సరము సెప్టెంబరు నెల 8-వ తేదివఱకును తీర్మానపత్రము స్వవ్యాఖ్యానముతో వివేకవర్ధనియందుఁ బ్రకటింపఁబడలేదు. అందు చేత నీలోపల సెప్టెంబరు నెల 6-వ తేదిని జరగిన స్త్రీపునర్వివాహ సమాజముయొక్క కార్యనిర్వాహకసంఘమువారిసభయందుఁ జేయఁ బడిన యీక్రింది సిద్ధాంతములకేమియు నాక్షేపణచెప్పక యామో దించి లక్ష్మీనరసింహముగారు వానిక్రింద తమచేవ్రాలు చేసి సమా జమువారియధికారము నొప్పుకొనిరి.

"2. That Mr. Pida Ramakrishnayya's allowance of Rs. 2 a month to Prabala Mahalakshmi be continued to her out of his funds by Mr. A. L. Narasimham. ((ప్రభల మహాల క్ష్మికి నెలకు 2 రూపాయలచొప్పున పైడా రామకృష్ణయ్యగారిచ్చు

చుండిన జీతమాయన నిధిలోనుండి యామెకు ఏ. ఎల్. నరసింహముగారిచే నియ్యఁబడుచుండ వలెను.

*3. That an additional* allowance of Rs. 4 a month a *well as Medical charges be paid to Saladi Ramayya fo* August and September out of Pida Ramakrishnayya's funds (నెలకు 4 రూపాయల చొప్పున నెక్కువజీతమును వైద్యపుకర్చులను పైడా రామకృష్ణయ్యగారినిధిలోనుండి శ్రావణ భాద్రపదమాసములకు సలాది రామయ్య కియ్యఁ బడవలెను.)

5. That a grant of Rs. 15 be paid to S. Ramiah in lieu of certain jewels (girdle and vessel) due to him and other matters out of Pida Ramakrishnayya's funds (అతని కియ్యవలసిన కొన్నినగలకు (ఒడ్డాణము, పాత్ర)ను ఇతర వస్తువులకును బదులుగా పైడా రామకృష్ణయ్యగారి నిధిలోనుండి రు. 15 ల. సహాయధనము సలాది రామయ్య కియ్యఁబడవలెను.)

6. That a grant not exceeding Rs. 200 be made to S. Ramayya for building a tiled house at Cocanada on the site given by Pida Ramakrishnayya out of his funds (పైడా రామకృష్ణయ్యగారిచే కాకినాడలో నియ్యఁబడిన స్థలమునందుఁ పెంకుటిల్లు కట్టించుకొనుట కాయనసిధిలోనుండి సలాది రామయ్యకు రు. 200 లకు మించకుండ సహాయద్రవ్య మియ్యఁబడవలెను.)'

పయినిర్ధారణముల నెల్ల నంగీకరించి క్రింద వ్రాలు చేయుటయే కాక లక్ష్మీనరసింహముగారు వీనినెల్లను జరపిరి. తరువాత 1886-వ సంవత్సరము సెప్టెంబరు నెల 8-వ తేదిని లక్ష్మీనరసింహముగారి తీర్మానపత్రమును వివేకవర్ధని యాక్రిందితనవ్యాఖ్యానముతోను మొదటినుండియు జరగిన యుత్తరప్రత్యుత్తరములతోను ప్రకటించినది.—

'మార్చి 31-వ తేదిని మెయి నెల 12-వ తేదిని వివేకవర్ధని యందుఁ బ్రకటింపఁబడిన డంభాచార్యవిలసనమువలనఁ గొందఱికి మనస్సునొచ్చినదని విని చాల విచారించుచున్నాము. హాస్యసంజీవని యుద్దేశమును పలుమాఱు మాపత్రికయందు వెల్లడించియున్నాము. హాస్యసంజీవనిలోనుండు పురుషులు కల్పితులు; అందులో నొక్కరి యం దారోపింపఁబడియుండు విషయములు కొందఱివి కొన్నిగాను, మఱికొన్ని మఱికొందఱివిగాను, కొన్ని కేవలకల్పితములుగాను, ఉండును. దానియొక్క యుద్దేశ మెవరియందైన నట్టిలోపము లున్నపక్షమున, అట్టివాని వారువారు దిద్దుకొనుటకే కాని మఱియొకందునకుఁ గాదు. కాఁబట్టి యెవ్వరును అందులో వ్రాయఁబడినవన్నియుఁ దమ కొక్కరికే చెందునని కాని, తమరి నొక్కరినే యుద్దేశించి వ్రాయఁ బడినవని కాని, యెంచకుందురని నమ్ముచున్నాము. ఆప్రకారముగానే మార్చి 31-వ తేదిని మెయి 12-వ తేదిని డంభాచార్యవిలసనమను పేరిటఁ బ్రకటింపఁబడిన హాస్యసంజీవనిలో నొక్కొక్కపురుషునియం దారోపింపఁబడిన విషయములన్నియు నాయొక్క పురుషునకే చెందునని యెంచుటయు న్యాయము కాదు. అట్లవి యున్నియుఁ దమయొక్కరి విషయమే యుద్దేశింపఁబడినవని యెవ్వరును తలఁపకుందురని నమ్ముచున్నాము.'

ఈప్రకారముగా బహుమార్గములనుండి రాజుచున్న వివాదాగ్ని పూర్ణముగాఁ జల్లారిపోయినందున లక్ష్మీనరసింహముగారికి నిర్భయముగాఁ దమమనసు వచ్చినట్టు వ్యవహారము నడపవచ్చును. తమతమ దౌర్జన్యములను వివేకవర్ధనిలో వెల్లడించుచు వచ్చుటచేత నాకు శత్రువులయిన వారందఱును లక్ష్మీనరసింహముగారి కాలోచన చెప్పుట కిప్పుడు మంత్రులయిరి. ఈయభినవమిత్రులు కొందఱు వివేకవర్ధనీ దహనవిషయమయి మొట్టమొదట నేమియు నెఱుఁగనని చెప్పి తరువాత నొప్పుకొని క్షమార్పణము వేఁడుకొనుట యవమానకరమని

యాయనను పరిహాసముచేసి, పగతీర్చుకొనవలెనని పురికొల్పఁజొచ్చిరి. రామకృష్ణయ్యగా రిచ్చిన పదివేలరూపాయలలో నేభాగమును వివాహముల కుపయోగపడకుండఁ జేసినపక్షమున మును వితంతువివాహములు జరగవనియు, అట్లు చేయుటయే పగతీర్చుకొని నన్ను సాధించుట యనియు, లక్ష్మీనరసింహప్రభృతు లాపనికే యాలోచించిరి! ఆహా! ఇదియేమి యజ్ఞానము! వివాహములు నిజముగానే జరగకపోయినయెడల నాకేమి యవమానము? పగ తీర్చుకోఁదలచినయెడల నా కపకారముఁ జేయఁజూడవలెను గాని నేను పూని పనిచేయుచున్నా నన్న హేతువుచేత లోకోపకారకమయిన యనాథరక్షణకార్యమునకు హాని కలుగఁజేయఁ జూచుట యేమి న్యాయము? ఇది యవివేకవిలసనమయినను స్వప్రయోజనపరత్వముచేత వితంతువివాహములు చేసికొన్నవారు కొంద ఱీయనాలోచితవ్యవహారమునకు సహాయులయిరి. కర్తవ్యనిశ్చయము వివేకవర్ధనీదహనకాలమునకు ముందే చేయఁబడినను తదనంతరవ్యవహారభీతిచేత నింతకాలము కార్యారంభము విలంబము చేయఁబడెను. పదివేలరూపాయలవలన వచ్చెడివడ్డీనంతను మీకే పంచిపెట్టుచుండెదనని యాశపెట్టి లక్ష్మీనరసింహముగారు రాజమహేంద్రవరములోనున్న వితంతువివాహవరులను తనలోఁ జేర్చుకొని, వారిని గుమిగూర్చి, రామకృష్ణయ్యగారు వ్రాసి యిచ్చిన మరణశాసనములో 'వివాహములు చేసికొన్న వితంతువులయొక్కయు వారి భర్తలయొక్కయు వారిబిడ్డలయొక్కయు పోషణమునిమిత్త' మన్నదాని కీవడ్డి వివాహములు చేసికొన్నవారికి మాత్రమే యని' యొక నూతనార్థముఁ గల్పించి, ఆవడ్డి వివాహములు చేసికొన్నవారిలోఁగూడ దూరమునం దుండుటచేత బళ్ళారిలో నున్నవారి నిరువురను విడిచిపెట్టి, ఆవడ్డి వివాహము కానివారిని కూడ నొకరి నిందులోఁ జేర్చుకొని, 'వితంతువివాహములను జరుపు

నిమిత్త' మని వ్రాసినకథనే బొత్తిగా నెత్తుకొక, ఈవఱకు వివాహము చేసికొన్న వారిపోషణమునకును చిల్లరవ్యయములకును మాత్రమే వడ్డీని ముఖ్యముగా వ్యయము చేయవలసినదని తనతో రామకృష్ణయ్యగారు రహస్యముగాఁ జెప్పిరన్న నవసృష్టి నొకదానిని బైలుదేఱఁదీసి, వారిచేతఁ గొన్ని నిర్ధారణములు చేయించి, వానిని 5-వ అక్టోబరు తేదిగల తమ ప్రకటనపత్రముతో నితరస్థలములయం దుండిన వరులకుఁ దరువాతఁ బంపిరి. ఈకూటమిలో నాకుఁ బ్రతిపక్షులయిన కోదండరామయ్యగారును పులవర్తి శేషయ్యగారును చేరుట వింత కాదుగదా! లక్ష్మీనరసింహముగారిచేతిక్రింద పనిలో నుండినవారగుటచే రాచర్ల రామచంద్రరావుగారును శాయుకు వెంకటచలపతి రావుగారును తప్పక చేరవలసినవారే. బీద లగుటచే ధనాశచేత చేబోలు వెంకయ్యగారును పటానేని వెంకయ్యగారును చేరిరి. ఒక్క ముంజులూరి గోపాలకృష్ణయ్యగా రందుఁ జేరకపోయిరి కాని దానికిఁ గారణము రామకృష్ణయ్యగారు రూపాయ లిచ్చుచుండఁగా నది తగ్గిపోవుననియే, కాని పారమార్థిక చింత కాదు. ఈకాగితములను మొదటివివాహ మాడిన గోగులపాటి శ్రీరాములుగారికిఁ బంపినప్పు డాయన వ్రాసిన యుత్తరముతోడఁ గూడ నిందుఁ బ్రకటించుచున్నాను.

## NOTICE.

To

The ex-officio members fo the Widow Marriage Association, Rajahmundry.

Late Mr. Pydy Ramakrishniah at the time of this death appointing me as Trustee for Rs. 10,000 which he left at the time for the benefit of the people married under the auspices of Widow Marriage Association at Rajahmundry cleary expressed in his words to me that the interest alone

of the said sum should be spent primarily for the support and contingencies of the already existing families. In order to carry out the original intention of the Testator, I now desire you all to give your opinion on the subject.

5th October, 1886,
Rajahmundry.

A. L. NARASIMHAM
Trustee to Mr. P. Ramakrishnayya,
W. M. Fund.

To

Gogulapati Sreeramulu Garu

మహారాజశ్రీ లేటు పైడా రామకృష్ణయ్యగారు తాను చని పోవుసమయమున రాజమహేంద్రవరము స్త్రీపునర్వివాహసమాజములోఁ జేరి వివాహములు చేసికొన్నవారికి అత్తలూరి లక్ష్మీనరసింహముగారిని ట్రస్టీగా నేర్పర్చియిచ్చిన పదివేలరూపాయలకు వచ్చేవడ్డీ కర్చుపెట్టుటకు ముఖ్యమయినవిధులు.

1. పదివేలరూపాయీలవడ్డీమాత్రము యిదివరలో నున్న పండ్రెండు కుటుంబములవారికి సమానముగాఁ బంచి యియ్యవలసినది.

2. ఆయాకుటుంబములవారికి వంశపరంపరా యియ్యవలసినది.

3. ప్రతిసంవత్సరముగాని అర్ధసంవత్సరము కొకసారిగాని యియ్యవలసినది.

4. ఈ కుటుంబములలో నేకుటుంబముగాని యొకటి నిస్సంతు అయ్యేపక్షమున నా కుటుంబమువంతుకు వచ్చేవడ్డీధనము నీ పండ్రెండుకుటుంబములవారిలోఁ దక్కినవారు సమానముగాఁ బంచుకోవలసినది గాని నిస్సంతు అయినకుటుంబము యొక్క వారసులకుఁ జెందకూడదు.

5. చెరుకూరి నారాయణమూర్తి పౌరోహిత్యము జరుపుచు మతవిషయమైన కర్మలు క్రమముగా సన్నికుటుంబములవారికి జరుపుచు నున్నంతకాలము ఆయన జీవితకాలము యావత్తు మేనేజింగుకమిటీవారు వారి ఫండులోనుంచి సహాయము చెయ్యనికాలము సంభవించినయెడల ఆకాలములో నెల 1 కి ఆరురూపాయీలచొప్పున సదరు పంౕడెండుకుటుంబములవారి మీాద సమానముగా నేర్పర్చి సదరు ఆరురూపాయీలు యియ్యవలసినది

6. 1886–వ సంవత్సరమునకు వచ్చేవడ్డీధనములో సలాది రామయ్య కిల్లుకట్టుకునే నిమిత్తము రెండువందల రూపాయీలున్ను దేవాలయపుహక్కు నిమిత్తము తణుకు వెంకటచలపతి తెచ్చిన అసలువ్యాజ్యపుకర్చులకుమాత్రము అయిన ధనమున్ను మినహాయించి తక్కినధనము సమముగాఁ బంౕడెండుభాగములు చేసి సదరుకుటుంబములలో నెవరి కయినా కొంతసొమ్ము యీావరకు కర్చుపడినయెడల సదరుసొమ్ము వారిభాగములో మినహాయించి తక్కినసొమ్ము యియ్యవలసినది. సదరువ్యాజ్యము గెలిచినయెడల వచ్చేపరిహారము పంౕడెండు కుటుంబములవారు సమానముగాఁ బంచుకోవలయును.

7. సదరుపంౕడెండుకుటుంబముల యజమానులపేరులు :

1. గోగులపాటి శ్రీరాములు, 2. రాచర్ల రామచంద్రరావు, 3. తాడూరి రామారావుపంతులు, 4. పులవర్తి శేషయ్య, 5. ముంజులూరి గోపాలకృష్ణయ్య, 6. సలాది రామయ్య, 7. బోడా శ్రీరాములు, 8. చేబోలు వెంకయ్య, 9. తణుకు వెంకటచలపతి, 10. నల్లగొండ కోదండరామయ్య, 11. పశా

నేని వెంకయ్య, 12. వల్లూరి ముత్తెమ్మగారికొమార్తె పున్నమ్మకు కాగల పెనిమిటి.

8. ఈదిగువ వ్రాలు చేసినవారు పైవిధులకు సమ్మతించినారు.

1. రాచర్ల రామచంద్రరావు
2. పులవర్తి శేషయ్య.
3. తణుకు వెంకటచలపతిరావు.
4. పున్నమ్మ సంరక్షకురాలు వల్లూరి ముత్తెమ్మ.
5. చేబోలు వెంకయ్య.
6. నల్లగొండ కోదండరామయ్య.
7. పరానేని వెంకయ్య.

20—10—1886
VIZAGAPATAM

To

A. L. Narasimham Chetty Garu,
Trustee to the Widow Marriage Fund of Mr.
Pyda Ramakrishnayya Garu who is now dead.

Sir,

It is with many thanks I received your notice and the Telugu enclosure yesterday at about 4 p. m. desiring my opinion as to the distribution of the interest that may arise from the principal of Rs. 10,000 left by the above mentioned revered well-wisher of the Widow Marriage movement of Rajahmundry at the time of his death, among the already existing married couples equally, in accordance with the original intention of the Testator.

From your notice it appears that there is no evidence between you and the testator when he clearly expressed his words to you to the above effect. It is also quite evident from the notice he has left no will in writing in order to

carry out his intention. If you conscientiously say that this intention was such at his death and if you mean to do justice to his intentions bearing in your mind that the Almighty alone is a searcher of your heart and He is a sole witness between you and the testator. I see no reason why you have undertaken the task of collecting opinions from the ex-officio members of the Widow Marriage Association Rajahmundry. If the intention of the testator was such as you honestly feel to be you should have carried out his intention whether the ex-officio members agree or not. Now that you have begun to collect the opinions and the conditions laid down in the Telugu enclosure regarding the equal distribution of interest among the 12 families seem to have been subsequently formed after mature consideration on the basis of pure selfishness I doubt if the intention of the testator as you or the conditions say, was true. The conditions say that the portion remaining unclaimed by reason of the extinction of issue in any one of the twelve families must be distributed eqully among the rest. For instance if half a dozen families are distitute of issue at any time which God in his boundless mercy may forbid, to claim the distribution of the ownerless portions among the rest is *a pure selfishness* in my opinion. What is it then if you do not call it selfishness? Granting that the opinion of the testator at his death was true, we as well-wishers of the movement are bound to consider whether he formed that opinion in a state of mental peace or agony. It is quite plain he formed the same just before his death when he was in great agony. If we formed that opinion in that painful state, can we give effect to his intention in such away that the movement should suffer? We should also take into consideration how anxious he was in a state of good health for the welfare and progress of the movement. I hope I will not be contradicted if I say that there is not one at least at present so enthusiastic as he in the list of the so many members. As it is quite evident that he was a sincere well-wisher of the movement (of course including the already married couples), we will have to consider whether the movement will suffer or not by carrying out his intention at his death. If the interest should be distributed only among the existing twelve fami-

lies, can we celebrate any more marriages in future? I say decidedly no. Because in the first place we have got no funds at the disposal of the Association to perform the marriages. Supposing we get funds after a good deal of difficulty only for the celebration of the marriages don't we naturally expect that the future married couples would also raise questions as to the means supplied to the already married couples. If we say there are no such means for them how can we expect that they will embrace the movement in the face of so many social sufferings and in the absence of the so many facilities that are being enjoyed by the already married couples. You know that the country is not so far enlightened that the people will take up reform voluntarily. Therefore some means should be provided to all the married couples either before or in future in accordance with the requirements, so far as may be within the power of the association till the movement becomes a general one. Otherwise there is a chance of restricting the cause. The well-wishers of the cause should not depend on the present strength of the members alone. Ultimately these members may become extinct one by one. Therefore we should make our movement a living one and not a dead one.

In conclusion I say that the principal should be lodged in a safe bank in the name of more persons than one, that the interest should be added yearly or half yearly to the principal, that expenditure if necessary should be incurred from the interest and never from the principal. If necessary due help must be given from the interest alone to the married couples reasonably supposed to have been helpless If there is sufficient interest accumulated due proportion after proper deduction of expenditure may be spent for marriages.

If extra fund may be secured for the purpose of the association from the outside of the enlightened public by means of subscriptions and donations, it may be safely added to the accumulated principal of the late Mr. Pyda Ramakrishnayya Garu whose name will be borne in the minds of the future widows relieved from the misery of widowhood with great respect and love. If such a noble object as this were

to be realised the movement will be kept continually moving on whether we all have the fortune of seeing the progress of the movement or not. Let our minds engage in the relief of so many helpless widows whose suffering I cannot even imagine and let God make us all as unselfish as the late Mr. P. Ramakrishnayya who spent away more than Rs. 30,000 for the cause. By this distribution as you propose in accordance with the opinion of the testator as you say, I am sure laziness will be fostered in the married couple. By deprivation of this, they should look up to their own exertion and support. Of course if they reasonably fail due help must be given in time from the fund. I hope you or any one of the agreed members will not take offence for my sincere opinion as a well wisher of the movement. Let us all forget all difference of opinion if sprung up in our minds through our own fault and strive to do our best for the furtherance of the cause. I know how valuable services you and the signatories have rendered to the cause hitherto. Please push on the movement with the same spirit and drive away cheerfully selfishness and malice.

Yours truly,
G. SREERAMULU

గోగులపాటి శ్రీరాములుగా రింగ్లీషులో వ్రాసినదానినంతను తెలుఁగులో భాషాంతరము చేయుటకంటె నందలి సారాంశమును మాత్రము సంక్షేపముగాఁ జెప్పుట మనయిప్పటికథకుఁ జాలియుండు నని యెంచి యట్లు చేయుచున్నాను—

'దాతయొక్క ప్రథమోద్దేశప్రకారముగాఁ బదివేలరూపాయలమీఁదివడ్డిని ఈవఱకు వివాహము చేసికొన్నవారిలో సమానముగాఁ బంచిపెట్టుటనుగూర్చి నాయభిప్రాయ మడుగుచుఁ బ్రకటన పంపినందు కనేకవందనములు చేయుచున్నాను. మీప్రకటననుబట్టి దాత మీతో నెప్పుడట్లు స్పష్టముగాఁ జెప్పెనో సాక్ష్యము కనఁబడదు. మరణకాలమునం దాతని యుద్దేశ మదియే యని మీరు మనః పూర్తిగా చెప్పి సర్వసాక్షియైన యీశ్వరుఁడు సాక్షిగా మీరాయుద్దేశమును నెఱవేర్పఁ దలఁచుకొన్నపక్షమున, మీ రిప్పుడు వివాహములు

చేసికొన్న వారి యభిప్రాయములను పోగుచేయుట కేల పూనుకొన్నారో నాకుఁ గారణము కానరాకున్నది. దాతయొక్క యుద్దేశ మదియని మీరాత్మసాక్షికముగా నమ్మినయెడల, వివాహములు చేసికొన్న వా రొప్పుకొన్నను ఒప్పుకొనకున్నను కూడ మీ రాయన యుద్దేశమును నెఱవేర్చి యుండవలెను. వర్షిని పండ్రెండుకుటుంబములలో సమానముగాఁ బంచుకొనుటనుగూర్చి నిబంధనలుగల తెలుఁగులేఖ ననుసరించి మీ రిప్పు డభిప్రాయములను పోగుచేయ నారంభించుటను బట్టి యది స్వప్రయోజనపరత్వమున కాధారము చేసికొని దీర్ఘాలోచన మీఁద తరువాత నేర్పఱుచుకొన్నట్లు కనఁబడుచున్నది; దాతయొక్క యుద్దేశ మది యగునా కాదా యని నాకు సందేహముగలుగుచున్నది. ఈ పండ్రెండుకుటుంబములలో నేదైన నొకటి నష్టపడిన యెడల దానివంతుకూడ తక్కినవారు సమముగాఁ బంచుకోవలెనని విధులు చెప్పుచున్నవి. ఎప్పుడైనను ఆఱుకుటుంబములు నష్టమగుట తటస్థించిన పక్షమున (సర్వదయాపరమూర్తియైన యీశ్వరుఁ డట్టి వైపరీత్యము పుట్టకుండఁ జేయును గాక!), వారి భాగములన్నియు మిగిలినవారికి రావలెననుట నాయభిప్రాయములో శుద్ధస్వప్రయోజనపరత్వము.

వర్షిని పండ్రెండుకుటుంబములలోమాత్రమే పంచిపెట్టుచు వచ్చినపక్షమున ముందు మనము వివాహములు చేయఁ గలుగుదుమా? వివాహములు చేయుటకుమాత్రము సొమ్ము పోగుచేయఁ గలిగిన యెడల, క్రొత్తగా వివాహములు చేసికొన్నవారు వెనుకటివారికున్న సదుపాయములు తమకుఁ గావలెనని కోరరా? మీకుమాత్రము లేవనెడుపక్షమున, కష్టముల కోర్చి సాయమేమియు లేకుండవారు మనపక్షమవలంబింతురని యెట్లు ప్రతీక్షింపవచ్చును? ముందు పెండ్లి చేసికొన్నను, వెనుక పెండ్లిచేసికొన్నను తమశక్తిలో నున్నంతవఱకు సమాజమువారందఱికిని కష్టసమయమునందు సాయము చేయవలెను.

ఈపక్షముయొక్క క్షేమముఁగోరువారు దీనిపురోభివృద్ధిని చూడవలెను గాని యిప్పటిసంఖ్యనుమాత్రమే చూడఁగూడదు. ఇప్పుడున్న వా రొకరితరువాత నొకరుగా నశించి పోవచ్చును. కాఁబట్టి మన మీ యుద్యమము జీవించునట్లు చేయవలెనుగాని చచ్చిపోవునట్లు చేయఁ గూడదు.

సొమ్ము నొక్కరికంటె నెక్కువమందిపేరిట సురక్షితమైనధనా గారములోనుంచి, వచ్చెడివడ్డీనాలు నెలలకో సంవత్సరమునకో యొక్క పర్యాయ మసలులోఁ జేర్చుచు, అవశ్యకమయినప్పుడు నిజముగా రిక్తస్థితిలోనున్నవారికిమాత్రము వడ్డీలోనుండి కావలసిన సాయము చేయుచు, ఈవ్యయములు పోఁగా వడ్డీలో మిగిలినదానితో వివాహ ములు జరపుచుండ వలెనని నాయభిప్రాయము.

రామకృష్ణయ్యగారియభిమతానుసారమని మీరు చెప్పెడు ప్రకారముగా వడ్డీని పంచిపెట్టుటవలనవివాహములుచేసికొన్నవారిలో సోమరితనము పెంపుచేయఁబడును. వారు స్వకాయకష్టములనునమ్ము కొనియుండవలెను. స్వయంకృషి చేసినను శక్తులు కానప్పుడుమాత్రమే వారికి సాయము చేయవలెను. స్వప్రయోజనపర్వతమును మాత్సర్య మును సంతోషపూర్వకముగా మనస్సులనుండి పాఱఁదోలి, దయచేసి యీయుద్యమమును వెనుకటి సచ్చింతతోనే ముందు నడిపింపుఁడు."

ఈయుపన్యాసమును తరువాత యిచ్చటిమా పెండ్లికొడుకులకును గల తారతమ్యము పైదానివలన తేటపడవచ్చును. తగినయుద్యోగము లలో నున్న కోదండరామయ్యగారు శేషయ్యగారు మొదలైనవారీ నూతనపథక మేర్పఱిచి వివాహములకు లేకుండ వడ్డీనంతను తామే పంచుకొని మ్రింగవలెనని విధులేర్పఱుకొనుటఁ దాము చదువుకొన్న విద్యకును తాము ఘోషించుకొనుచుండిన స్వార్థపరిత్యాగకథనము నకును అవమానకరము. వివాహములు కాకుండఁ జేసి నాకృషి కంత రాయము కలిగింపవలెనన్న మహోదారచింతతోడనే యీపన్నుగడ

పన్నిన మహానుభావులకుఁ బయిరీతి హితవాక్యములు రుచించునా! ఇంతకు సాహసించినవారు మఱియెంతకు సాహసింపరు? అటుతరువాత లక్ష్మీనరసింహముగారు రామకృష్ణయ్యగారి మరణశాసనములోఁ జేర్పఁబడిన వితంతువివాహసమాజము రాజమహేంద్రవరసమాజమే కాదని చెప్పునంతటిసాహసమునకుఁ గడంగిరి. ఆమరణశాసనము యొక్క మూలముమాట యటుండఁగా దాని ప్రతిలేఖ (నకలు) సహితము సామాజికులలో నెవ్వరియొద్దను లేదు. అందుచేత కార్యనిర్వాహకసంఘమువారిచే లక్ష్మీనరసింహముగారుకూడ వచ్చియుండిన డిసెంబరు 19-వ తేది సభలో

'4. That printed cop:es of P. Ramakrishnayya's Rs.10,000 instrument be circulated among the members of the managing committee.' పైడా రామకృష్ణయ్యగారి పదివేలరూపాయల లేఖ్యముయొక్క యచ్చుప్రతులను కార్యనిర్వాహకసంఘముయొక్క సామాజికులలోఁ జూపఁబడవలెను )

అని నిర్ధారణము చేయఁబడెను. ఈనిర్ధారణానుసారముగా లక్ష్మీనరసింహముగా రామరణశాసనమును తమవైదికముద్రాశాలలోనే ముద్రించి సామాజికులకుఁ బంపిరి. ఆయనకూడ వచ్చియున్న 1887-వ సంవత్సరము జనేవరు 2-వ తేదిని జరిగిన కార్యనిర్వాహకసంఘమువారిసభలో నీక్రింది నిర్ధారణములు చేయఁబడినవి.

'4. That whether the W. M. Assn referred to in Mr. Pida Ramakrishnayya's wills the Widow Marriage Association whose head quarters is at Rajahmundry be discussed at a special meeting of the managing committee. (వితంతువివాహసమాజమని పైడా రామకృష్ణయ్యగారిమరణశాసనములలోఁ జెప్పఁబడినది రాజమహేంద్రవరము ప్రధానస్థానముగాఁగల వితంతువివాహసమాజ మగునా యని కార్యనిర్వాహకసంఘముయొక్క విశేషసభ యందుఁ జర్చింపఁబడవలెను.)

5. That a special meeting of the managing committee be convened to discuss the question 'what is the best way of admi-instering Mr Pyda Ramakrishnayya's Widow Marriage Fund. (పైడా రామకృష్ణయ్యగారి వితంతువివాహనిధి నుపయోగించుట కేది యుత్తమమార్గమన్న ప్రశ్నను చర్చించుటకయి కార్య నిర్వాహకసంఘము యొక్క విశేషసభను సమకూర్పవలెను.)

6. That a special meeting of the managing committee to consider the above two questions be convened at 4 p. m. on the 9th instant at the Innespeta School house, and the members of the Assn. residing in this town be requested to attend this meeting.' 'Resolved, (పయిరెండు ప్రశ్నలను చర్చించుటకయి 9-వ తేది సాయంకాలము 4 గంటలకు ఇన్నీసుపేటపాఠ శాలలోఁ గార్యనిర్వాహకసంఘముయొక్క విశేషసభ సమకూర్పఁ బడి, ఈపట్టణములో వాసముచేయుచున్నసమాజముయొక్క సభ్యులు పూర్వోక్తసభకు వచ్చునట్లు ప్రార్థింపఁ బడవలెను.)

పయి నిర్ధారణప్రకారముగా 9 తేదిని సభ సమకూర్పఁ బడెనుగాని నాటిదినము లక్ష్మీనరసింహముగారు రానందున సభ 13-వ తేదికి విలంబింపఁ బడెను. ఆ 13-వ తేదిని సహితము లక్ష్మీ నరసింహముగారు సభకు రాలేదు. నాఁడాయన లేకయే సభ జరపఁ బడెను. ఆసభకు కార్యనిర్వాహకసంఘమువారుగాక మఱి 19 గురు సామాజికులు వచ్చిరి. అందఱియభిప్రాయములను గైకొన్నమీఁదట నీక్రింది నిర్ధారణలు చేయఁబడినవి —

'Resolved,

1. that. 'Widow Marriage Association' referred to in Mr. Pyda Ramakrishnayya's will relating Rs. 10,000 fund is the Widow Marriage Association whose head quarters is at Rajahmundry. (పదివేలరూపాలనిధినిగూర్చి పైడా రామకృష్ణయ్య గారిమరణశాసనములోఁ జెప్పఁబడిన "వితంతువివాహసమాజము"

రాజమహేంద్రవరము ప్రధానస్థానముగాఁగల వితంతువివాహసమాజమే.)

2. That such portion of the interest accruing on the said Fund be spent in affording the already married people, the present priest, Valluri Punnamma, her future husband and children such help as they may severally need and the balance in bringing about and defraying cost of future marriages. (వారివారికి వేఱు వేఱుగా కావలసినవచ్చెడు పూర్వోక్తనిధి నుండి వచ్చెడి వడ్డియొక్క యట్టివంటిభాగమును ఈవఱకు వివాహములయినవారికిని, ఇప్పటి పురోహితునకును, వల్లూరి పున్నమ్మకును, ఆమెభావిభర్తకును, బిడ్డలకును, కర్చుపెట్టి మిగిలినదానిని ముందు వివాహములు నడపి వానివ్యయములకును కర్చుపెట్ట వలసినది.)

ఈసభ ముగిసినతరువాత నాటిసాయంకాలమే పట్టణములోని వితంతువివాహసమాజమిత్రులును క్షేమకాంక్షులును సభచేసి, దానికి నన్నగ్రాసనాసీనునిగాఁ జేసి, పాఠశాలలపరీక్షకులైన (Inspector of Schools) సీ. నాగోజీరావు పంతులుగారు కర్తవ్యనిర్దేశము చేయఁగా రాజమహేంద్రవరశాస్త్రపాఠశాలప్రథమోపన్యాసకులైన (First Lecturer, Rajahmundry College) సి. సుందరరావు పంతులుగా రనుమోదింపఁగా నైకకంఠ్యముతోఁ బయినిర్ధారణల యర్థమిచ్చెడు నిర్ధారణలనే చేసిరి. ఆ సంవత్సరము జరిగిన వితంతువివాహసమాజముయొక్క సామాన్యసభయొక్క దినములనఁగా 1887-వ సం॥ జనేవరు 15, 16, 22-వ తేదులను మూఁడు దినములు జరగినది. సకల జనాకర్షకమైన వితంతువివాహనిధిసంబంధవిషయతర్కమున్నందున, ఆసభలకుఁ బట్టణములలోని ప్రముఖులందఱును దయచేసిరి. మొదటి రెండుదినములయందును లక్ష్మీనరసింహముగారే యగ్రాసనాసీనులుగాఁ జేయఁబడిరి. ఆసభలలో స్త్రీపునర్వివాహవ్యాపారముయొక్క భూత

వర్తమానస్థితులను గూర్చి నేనిచ్చిన యుపన్యాసమును, ఇతరు లిచ్చిన యుపన్యాసములును, చదువఁబడినపిమ్మట క్రొత్తసామాజికులను చేర్చుకొనుటయు, కార్యనిర్వాహకసంఘము నేర్పఱుచుటయు, కార్యదర్శి యొక్క సాంవత్సరికవృత్తినివేదనమును వినుటయు, సమాజనిధులను కొన్నిఁటిని మార్చుటయు, తప్ప విశేషవిషయము లేవియుఁ జర్చింపఁబడలేదు. మూఁడవనాఁటిసభ ముఖ్యమైనది. అందు లక్ష్మీనరసింహముగారితో సంబంధించిన యంశములు చర్చింపఁబడవలసియున్నందున దానికి పారసీ శ్రీనివాసరావు పంతులుగా రగ్రాసనాసీనులుగా చేయఁబడిరి. ఆ సభయందీ క్రిందినిర్ధారణములు చేయఁబడినవి.—

Resolved,

'2. That the trustee Mr A. L. Narasimham, be requested to associate with two other trustees for the best administration of late Pida Ramakrishnayya's fund of 10,000 (కీర్తిశేషులయిన పైడా రామకృష్ణయ్యగారి పదివేలరూపాయలనిధియొక్క యుత్తమకార్యనిర్వహణమునకు తమతోఁ గూడ మఱియిద్దఱు ధర్మకర్తలను జేర్చుకొనుటకు ధర్మకర్తయైన లక్ష్మీనరసింహముగారు కోరఁబడవలెను.)

3. That of the two trustees that are to be associated with him, one be elected by the ex-officio members from among themselves and the other be selected by the present trustee from among the members of the Widow Marriage Association. Rajahmundry, whether ex-officio or not. (ఆయనతోఁ జేర్చుకోఁబడవలసిన యిద్దఱు ధర్మకర్తలలో నొకరు వివాహములు చేసికొన్నవారిచేత తమలోనుండి కోరుకొనఁబడవలెను; రెండవవాఁడు వివాహము చేసికొన్నవాఁడయినను కాకపోయినను రాజమహేంద్రవరవితంతువివాహసమాజికులలోనుండి ప్రస్తుతధర్మకర్తచేత నేర్పఱుపఁబడవలెను.)

4. That the trustees be requested to communicate their proceedings quarterly to the Secretary, Widow Marriage

Association, Rajahmundry. (ధర్మకర్తలు తమచర్యను మూడు మాసముల కొకపర్యాయము రాజమహేంద్రవరవితంతువివాహ సమాజకార్యదర్శికిఁ దెలుపుచుండ కోరఁబడవలెను.

5. That the phrase 'Widow Marriage Association' referred to in Mr. Pida Ramakrishnayya's will relanting to Rs. 10,000 is the Widow Marriage Association whose Head Quarters is at Rajahmundry. (పదివేల రూపాయలనిధినిగూర్చి పైడా రామకృష్ణయ్యగారిమరణశాసనములోఁ జెప్పఁబడిన వితంతు వివాహసమాజమన్న పదము రాజమహేంద్రవరము ప్రధానస్థానము గాఁగల వితంతువివాహసమాజమే )

6. That such portion of the interest accuring on the said fund as may be necessary in the opinion of the trustees be spent in affording already married couples, the present priest. Valluri Punnamma, her future husband and children such help as that may severally need and the balance if any in bringing about and defraying cost of future marriages. (ధర్మకర్తల యభిప్రాయమునుబట్టి యావశ్యకముగాఁ గనఁబడిన పూర్వోక్తనిధినుండి వచ్చెడు వడ్డిలోని యంతభాగమును ఈ వఱకు వివాహమయినవారికిని, ప్రస్తుతపురోహితులకును, వల్లూరి పున్నమ్మకును, ఆమె భవిష్యద్భర్తకును, బిడ్డలకును వేఱువేఱుగాఁ గావలసివచ్చెడు సాయమును చేయుటయందు కర్చుపెట్టి, ఏమైన నున్న యెడల మిగిలినదానిని ముందు వివాహములను నడపి వాని వ్యయములకు కర్చుపెట్టవలెను.)

7. That the trustee or trustees be requested to take the advice of the Widow Marriage Association on all important matters in the disbursements thay make out of the sums realized in the way of interest on Mr. Pida Ramakrishnayya's Fund.

(పైడా రామకృష్ణయ్యగారినిధినుండి వడ్డీరూపమునవచ్చెడు సొమ్ములోనుండి వారు చేసెడువ్యయములలో ముఖ్యమైనవాని విష

యమునం దెల్లను వితంతువివాహసమాజముయొక్క యాలోచన నైకొనుచుండుటకు ధర్మకర్తగాని ధర్మకర్తలుగాని కోరఁబడవలెను )

8 That the Association records its sense of gratitude for and appreciation of the valuable services rendered by Mr. A. L. Narasimham (now leaving Rajahmundry for Gooty) to promote the widow marriage cause. (ఇప్పుడు గుత్తికి వెళ్ళుటకయి రాజమహేంద్రవరమును విడుచుచున్న ఏ. ఎల్. నరసింహము గారు వితంతువివాహ పక్షాభివృద్ధికయి చేసిన విలువయయిన సాహాయ్యమును గుర్తెఱిఁగి తన కృతజ్ఞతాభావమును సమాజము లిఖించుచున్నది.)

పైవానిలోని 1, 3, 4, 5, 6, 7, నిర్ధారణములకుఁ దమయభిప్రాయము నియ్యక లక్ష్మీనరసింహముగారు గోపము చేసికొనిరి. సభావసానమున లక్ష్మీనరసింహముగారు లేచి 'సామాజికులారా! నేను మీయాలోచన నడుగుచుండెదను గాని దాని ననుసరించి నడుచుకొనుటకు నేను బద్ధుఁడనుగాను' అని సెలవిచ్చిరి. ఆయన గుత్తికి వెళ్ళునప్పుడు రాజమహేంద్రవరసాంగవేదసభకని చందాలు చేర్చికొన్న వైదికముద్రాయంత్రమును విక్రయించి, రు. 1500 లు చందాలు పోగుచేసి తన్నిమిత్తమయి కొన్న వైదికపుస్తక భాండాగారమును పురజనులును చందాదారులును కొనిపోవలదని మొఱ్ఱపెట్టుచున్నను వినకఁ దమవెంటఁ గొనిపోయిరి. మాసమాజము మరల క్రొత్తగా నేర్పడిన తరువాత జరగిన మొదటి సంవత్సరసభయందే రామకృష్ణయ్యగారిని సమాజమునకు (President) అధ్యక్షునిగాను, నన్ను (Vice President) ఉపాధ్యక్షునిగాను, యావజ్జీవము నేర్పఱిచి, ప్రతిసంవత్సరసభయందును తక్కిన కార్యనిర్వాహకసభ్యులను కోరుకొనునట్లు నన్ను వేఱుగ కోరనక్కఱలేకయే నేను శాశ్వతముగా కార్యనిర్వాహక సంఘసభ్యుఁడుగా నుండునట్లు నిర్ధారణము చేసిరి.

నా కట్టిశాశ్వతాధికారిపదము లేకుండునట్లు చేయవలసినదని లక్ష్మీనరసింహముగారు గుత్తికిఁ బోవుటకు ముందు తా మొకవిజ్ఞాపనమును సమాజమునకుఁ బంపిపోయిరి కాని సమాజవా రాయనకోరికను నిరాకరించిరి. 1887-వ సంవత్సరము నవంబరు నెల 23-వ తేదిని తాను పులవర్తి శేషయ్యగారిని నల్లగొండ కోదండరామయ్యగారిని అధికధర్మకర్తలను (Additional trustees) గా తనతోఁ జేర్చుకొన్నట్టు తననిర్ణయపత్రమును బంపి, లక్ష్మీనరసింహముగారు రామకృష్ణయ్యగారినిధిధనమును సంవత్సరమునకు నూటికి కాఱురూపాయల వడ్డీచొప్పున నీలపల్లిగ్రామమమీఁద బదులిచ్చుటను గూర్చి సమాజమువారి నాలోచన యడిగెను కార్యనిర్వాహకసంఘమువారు 1888-వ సంవత్సరము జనేవరు నెల 19-వ తేదిని జరగిన తమసభలో క్రిందినిర్ధారణములు చేసిరి.

2. That the proceedings of Mr A. L Narasimham Garu trustee of Mr. P. R W. M Fund associating with him Messrs Seshiah and Kotnanda Ramiah as additional trusetees be approved. (శేషయ్యగారిని కోదండరామయ్యగారిని అధికధర్మకర్తలనుగా తనతోఁ జేర్చుకొనుచు పైని రామకృష్ణయ్యగారి వితంతువివాహనిధిధర్మకర్తయైన ఏ. ఎల్. నరసింహముగారు చేసిన చర్య సమ్మతింపఁబడినది.)

3. That the committee think it is not desirable to invest P. R. W. M Fund on Nilapalli at 6 p. c, they consider it safe I should remain in Govt. securities' (నూటికి ఆఱునడ్డికి రామకృష్ణయ్యగారి వితంతువివాహనిధిని నీలపల్లిమీఁద పెట్టుట కరణీయము కాదని సంఘమువారు తలఁచుచున్నారు. దొరతనమువారి పత్రములలో నుండుటయే క్షేమకరమని భావించుచున్నారు.)

కొన్నిమాసములయినతరువాత లక్ష్మీనరసింహముగారు నీలపల్లిమీఁద ఋణమిచ్చుటవలన లాభములను దెలుపుచు సమాజము

వారికి మరల వ్రాసిరి. కార్యనిర్వాహకసంఘమువా రావిషయమును 1888-వ సంవత్సరము జూన్ నెల 10-వ తేదిని జరగిన తమసభలో మరల నీక్రిందినిర్ధారణముచేసి యాయనకుఁ బంపిరి.

'1. Read Mr. A. L. Narasimham Chettiar's proposal to invest the late Pida Ramakrishnayya's fund on Nilapalli at 6 p. c. —The committee re affirm the resolution No. 3 passed in their meeting of the 29th January last The committee do not consider it expedient to invest P.R W M. fund on immoveable property in preference to Govt-securities.,(నూటికి కారు రూపాయలవడ్డికి గ్రించిన పైడా రామకృష్ణయ్యగారి నిధిని నీలపల్లి మీఁదఁ బెట్టుటకయి ఏ. ఎల్. నరసింహముగారుచేసిన కర్తవ్యనిర్దేశము చదువఁబడి సంఘమువారు కడచిన జనవరి 29-వ తేదిని తమ సభయందుఁ జేసిన మూఁడవ నిర్ధారణమును మరల దృఢీకరించు చున్నారు. పైడా రామకృష్ణయ్యగారినిధిని దొరతనమువారిపత్రముల నుండి తీసి స్థిరద్రవ్యముమీఁద బెట్టుట యుచితమని సంఘమువారు భావింపరు.)

లక్ష్మీనరసింహముగారు నీలపల్లిమీఁద నప్పిచ్చుప్రయత్నము నందుమీఁద మానివేసిరిగాని 1890-వ సంవత్సరము ఫిబ్రవరి 5-వ తేదిని తద్ధనమును సభాపతి ప్రత్తియంత్రములలోఁ బెట్టుటను గూర్చి మరల వ్రాసిరి. దానిపైని కార్యనిర్వాహకసంఘమువారు 1890-వ సంవత్సరము ఫిబ్రవరి 19-వ తేదిని జరగిన సభలో నిట్లు నిర్ధారణము చేసిరి.—

'1. Read Mr. A L. Narasimham Garu's letter dated 5th Feb.about investing P. R's fund of Rs, 10,000 in Mills &c., This committee in its resolutions dated 29th January and 10th June 1888 did not approve of the then proposal of Mr. A L. Narasimham to invest Mr Pyda Ramakrishniah's fund of Rs 10,000 on the mortgage of Nilapalli Estate The committee is of opinion that the present proposal of A. L.

Narasimham to invest it in Mr. Sabhapathi Moodaliar's mills on his personal guarantee is less safe than the former and resolves that the investment should remain in government securities as at present.

The committee notes with regret the form in which Mr. A. L Narasimham, trustee on behalf of the association and no other, seeks its advice. The committee wishes to be informed why Mr. A. L Narasimham has chosen the mope of treating it in the face of the resolutions passed at the general meeting on the 22nd January 1837 at which he himself was present.'

(పైడా రామకృష్ణయ్యగారి పదివేలరూపాయలనిధిని యంత్రములమీఁద పెట్టుటనుగూర్చిన 1890-వ సం॥ ఫిబ్రవరి 5-వ తేదిగల ఏ. ఎల్. నరసింహముగారియుత్తరము చదువఁబడినది.

ఈసభవారు 1885-వ సం॥ జనేవరు 29-వ తేదియు జూన్ 10-వ తేదియుఁగల తమనిర్ధారణములో రామకృష్ణయ్యగారి రు. 10000 ల నిధిని నీలపల్లిసొత్తుయొక్క ఆది (తనఖా) మీఁద బదులిచ్చెడి యప్పటి లక్ష్మీనరసింహముగారి కర్తవ్యనిర్దేశమునే సంఘమువారనుమతింపకపోయిరి. దానిని సభాపతి మొదల్యారిగారి స్వీయప్రాతిభావ్యముమీఁద నాతనియంత్రములలోఁ బెట్టుటనుగూర్చిన లక్ష్మీనరసింహముగారి యిప్పటికర్తవ్యనిర్దేశము పూర్వపుదానికంటెను తక్కువ క్షేమకరమని సంఘమువారభిప్రాయపడుచు, ఆనిధి ప్రస్తుతమున్నట్టుగా దొరతనమువారిపత్రములలోనే యట్లే యుండవలెనని నిశ్చయించుచున్నారు.

సమాజపక్షమున ధర్మకర్తయయి యంతకంటె భిన్నుఁడుకాని ఏ. ఎల్. లక్ష్మీనరసింహముగారాలోచన యడిగినరీతిని సంఘమువారు చింతతో నిరూపించుచున్నారు. తామకూడ స్వయముగా నుండఁగా 1887-వ సం॥ 22-వ జనేవరున జరగిన సామాన్య సభయందుఁ

జేయబడిన నిర్ధారణముల ననాదరించి లక్ష్మీనరసింహముగారు సమాజముపట్ల నిట్లు వ్యవహరించెడి పద్ధతి నేల చేసికొన్నారో సంఘము వారు తెలిసికొనఁ గోరుచున్నారు )

ఇది యిట్లుండఁగా కార్యనిర్వాహకసంఘమువా రొక కోమటి వివాహము జరగనున్నప్పుడు 1889-వ సంవత్సరము ఫిబ్రవరి 3-వ తేదిని జరగిన సభలోఁ జేయఁబడిన యీక్రింది నిర్ధారణమును,

'2. That the trustees of Mr. Pida Ramakrishnayya's fund be requested to contribute Rs. 50 for the celebration of the proposed Banya Marriage.' (ఉద్దేశింపఁబడిన కోమటి వివాహమును జరుపుటకు రు. 50 లు సాయముచేయుటకయి పైడా రామకృష్ణయ్యగారి నిధధర్మకర్తలు ప్రార్థింపఁబడుచున్నారు.) ఆసంవత్సరమే మెయినెల 25-వ తేదిని జరగిన తమసభలోఁ జేయబడిన యీక్రిందినిర్ధారణమును,

'5. That the trustees of the P. R. W. M. Fund be requested to pay from the first July the salaries of the priest and cook out of the interest of the said fund as the association can-not find means to pay them' (వారిజీతము లిచ్చుటకు సమాజమువారు ధనమును బడయఁజాలకున్నారుగనుక, పురోహితునియొక్కయు వంటబ్రాహ్మునియొక్కయు జీతములను పూర్వోక్తనిధియొక్క వడ్డిలోనుండి జూలయినెల మొదటి తేదినుండి యిచ్చుట పైడా రామకృష్ణయ్యవితంతువివాహనిధి ధర్మకర్తలు కోరఁబడుచున్నారు.)

ఇటువంటి వేమఁజేకొన్ని నిర్ధారణములను లక్ష్మీనరసింహముగారికిఁ బంపిరిగాని యాయన దేనిని సమాదరింపలేదు. రామకృష్ణయ్యగారు తనమరణశాసనములోఁ దామిచ్చిన ధనముయొక్క వడ్డిని వివాహముల నిమిత్తమయినను వినియోగింపవలసినదని స్పష్టముగ విధించినను, ధర్మకర్తగారు నాలుగుసంవత్సరములనుండి వడ్డి నవ్యవస్థితముగాఁ

గలవారికిని లేనివారికి పంచిపెట్టుచున్నను దానిలోనుండి యొక్క-కాసునైనను వివాహములనిమిత్తము వ్యయపెట్టనొల్లకపోయిరి. వివాహములు చేసికొన్నవారు తమసమాఖ్యపత్రములో సమాజము వారియ్యనప్పుడు పురోహితునిజీతమును తమభాగములలోనుండి యిచ్చుకొనుట కొడంబడికవ్రాసికొన్నను దానినిసహితము ధర్మకర్త లియ్య నొల్లకుండిరి. సమాజమువారియొక్క ప్రార్థనలనెల్ల లక్ష్మీనరసింహముగారిట్లు గణనసేయకపోవుచురాఁగా, 1891-వ సంవత్సరము జనేవరు 25-వ తేదిని జరగిన తమసాంవత్సరికసామాన్య సభయందు సమాజమువారీ క్రింది నిర్ధారణములను చేసిరి.—

'That this meeting records its regret that the resolutions Nos. 4, 5, 6, 7 of General Committee at its annual meeting held on the 22nd January 1887 have not been respected and carried out by the trustee Mr A.L. Narasimham Chettiar and regrets to find that he contidues to distribute the interest of Pida Ramakrishnayya's widow marriage fund *equally* among the remarried couples *in spite of* the above resolutions and that he has not contributed *anything* towards the celebration of marriages after the death of Mr. P. Ramakrishnayya or towards the pay of the priest and cook. (1887-వ సంవత్సరము జనవరు 22-వ తేదిని జరగిన సామాన్యసంఘముయొక్క 4, 5, 6, 7 సంఖ్యల నిర్ధారణములు ధర్మకర్తయైన లక్ష్మీనరసింహముగారిచేత గౌరవింపఁబడిజరపఁబడనందుకు ఈసభవారు తమవిచారమును తెలుపుచున్నారు; పైడా రామకృష్ణయ్య వితంతువివాహనిధియొక్క వడ్డిని పయి నిర్ధారణలకు విరోధముగా ఆయన యింకను పునర్వివాహ దంపతులకు సమానముగాఁ బంచిపెట్టుచునే వచ్చుచున్నట్టును రామకృష్ణయ్యగారి మరణానంతరమున వివాహములు

జరపుటనిమిత్తముగాని పురోహితునియొక్కయు వంటబ్రాహ్మణుని యొక్కయు జీతమునిమిత్తముగాని యేమియుసాయము చేయుచున్నట్టును కనుఁగొనుటకుఁ జింతిల్లుచున్నారు.)

'5. That Mr. A. L. Narasimham Chettiar be addressed on the subject for the last time and frther action in the matter be left to the decision of the managing committee'

(ఈవిషయమయి కడపటిసారి లక్ష్మీనరసింహముగారికి వ్రాసి, యీవిషయములో ముందు జరిగింపవలసినచర్య కార్యనిర్వాహకసంఘమువారినిర్ణయమునకు విడిచిపెట్టఁబడుచున్నది.)

ఈ కడపటి సిద్ధాంతప్రకారముగాఁ గార్యనిర్వాహకసంఘము వారు న్యాయసభలకుఁబోయి యేదో యొకవిధముగా వ్యవహారనిర్ణయమును పొందియుందురుగాని ధనాభావముచేత నట్టిపని జరగలేదు. సమాజము దుర్బలస్థితియందుండుటను గనిపెట్టి లక్ష్మీనరసింహముగారు స్వతంత్రించి యీనిధిని దొరతనమువారిపత్రములనుండి తొలఁగించి, ముందుగా వాణిజ్యధనాగారమునఁ (Commercial Bank) బెట్టి, తరువాత నాధనము నక్కడనుండి తీసి దానితోఁ జిత్తూరుమండలమునం దొక్క గ్రామమునుగొని, 'రాజా' యను బిరుదునామముతోఁ దన్నుఁబిలుచుకొనుచుఁ దనమరణపర్యంతమును పదికుటుంబములకు సంవత్సరమునకు మున్నూఱు రూపాయలు పంపుచుండిరి. ప్రథమవివాహము చేసికొన్న గోగులపాటి శ్రీరాములుగారికి మొదటినుండియు భాగము నియ్యమానివేసిరి; పులవర్తి శేషయ్యగారు కాలము చేసిన తరువాత నాతనివంతియ్య మానివేసిరి. శేషయ్యగారి కుమారుని నేను చేరఁదీసి విద్యచెప్పించి పెంచుచుండుటను బట్టి యతనిభాగమియ్యనక్కఱలేకపోయినది. ఒకవేళ లక్ష్మీనరసింహముగారా చిన్నవానిభాగమని నెలకు రు. 2-8-0 లు పంపుచుండియుందు రనుకొ

న్నను, అంత చిన్నమొత్తముతో నెవ్వ రాయేండ్లశిశువున కన్న వస్త్రము లిచ్చి పెంచి విద్యచెప్పింపఁ బూనుకొందురు ? మరణకాలము నందుఁ దాము సదుద్దేశముతో నిచ్చిన పదివేలరూపాయలధనము వివాహకార్యములకుఁగాని తల్లిదండ్రులను గోలుపోయి యగతికు లయిన శిశువులపోషణమునకుఁగాని యుపయోగపడక గతించుభర్తను పోగొట్టుకొని దుఃఖపడు రాచర్ల రత్నమ్మకువలెనే రాజమహేంద్రవర పురపారిశుద్ధ్యవిచారణసభ కార్యనిర్వాహకుండయి నెలకు నలువది రూపాయలుగ్రహించు, వల్లకొండ కోదండరామయ్యగారికిని నెలకు రు 2-8-0 ల చొప్పున భరణము క్రింద నుపయోగపడునని రామ కృష్ణయ్యగారు స్వప్నమునందైనను దలఁచియుందురా ? వివాహ ములకయి తాను ధనమిచ్చి యేర్పరచిన వడ్డీరూపమును దురాశచేఁ దామే యనుభవింపవలెనని కోరిన పుణ్యపురుషులకా రు 2-8-0 ల చొప్పున ననుభవించుభాగ్యము కలిగినను కొంతకాలము నిలిచినదికాదు లక్ష్మీనర సింహముగారితో కొంతకాలములోనే వడ్డీమాత్రమేకాక యానిధియం తయు సమూలముగా నంతరించి; యీనడుమను నష్టమయిన రెండు కుటుంబముల యాశ్రయమును గూడ పాళ్లువేసి పంచుకొను శ్రమకూడ వారికిఁ దప్పిపోయినది.

ఇఁక మనసమాజవృత్తాంతమునకు వత్తము. 1886, 1887 సంవత్సరములలో సమాజము వారొక్క వివాహమునైనను చేయఁ గలిగినవారుకారు. 1887-వ సంవత్సరాంతమున కార్యనిర్వాహక సంఘమువారి కార్యదర్శి శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగారు తమ కార్యనివేదన పత్రికలోని యాదాయవ్యయ పట్టికలోఁ జూపిన ప్రకా రముగా నేను తిరిగి పోగుచేసికొని వచ్చిన రు 742-12-4 లును, సమాజమువారు నెల చందాలమూలమునను దాన ధనరూపమునను పోగుచేసిన రు 1585-4-0 లును, (మొత్తము 2328-0-4) నెల జీత

ములక్రిందను వివాహదంపతుల కిచ్చిన ధనదానములక్రిందను (1888 సం॥ 1-వ జనేవరున నిలువయుండిన రు 212-13-4 లు గాక) వ్యయపడినవి. రామకృష్ణయ్యగారు మరణము నొందునప్పటికాయన మరణశాసనానుసారముగా విద్యార్థులకుఁ బంచిపెట్టవలసినవి రాజమహేంద్రవరములో రెండిండ్లుండినవి. ఆయిండ్లను పంచిపెట్టుటకుఁ గార్యనిర్వాహకసంఘమువారు ఉప్పూరి ఆత్మూరి నరసింహములుగారిని నియమించిరి. ఆవలనకే రెండుభాగములుగానున్న పులవర్తి శేషయ్యగారుండిన యిల్లు పంచిపెట్టవలసివచ్చినప్పుడు చావడిప్రక్కను తనభాగములోనిదని రాచర్ల రామచంద్రరావుగారును, తనభాగములోనిదని శేషయ్యగారును, తగవుపెట్టఁగా సమాజమువారే బదిరూపాయలు రామచంద్రరావుగారి కిచ్చి యిల్లు శేషయ్యగారి కిప్పించిరి. ఆవలనకు మూఁడుభాగములుగా నుండిన కోదండరామయ్యగారుండినయిల్లు కోదండరామయ్యగారును చేబోలు వెంకయ్యగారును కాపురముండిన భాగములాప్రకారముగానే యుంచఁబడి నడిమిభాగము రెండుగా విభాగింపఁబడి కోదండరామయ్యగారియింటితోఁ గలిసిన దక్షిణభాగము కోదండరామయ్యగారికిని, వెంకయ్యగారి యింటితోఁ గలిసిన యుత్తరభాగము వెంకయ్యగారికిని, పంచి యియ్యఁబడినవి.

ఈలోపల సమాజమునకుఁ గొన్నివిపత్తులు సంభవించినవి. 1888-వ సంవత్సరము ఏప్రిల్ నెల 19-వ తేదిని ద్వితీయవివాహవరుఁడైన రామచంద్రరావు లోకాంతరగతుఁడయ్యెను; ఆనెల 28-వ తేదిని చతుర్థవివాహవరుఁడైన శేషయ్యభార్య శేషమ్మ పరలోకగతురాలయ్యెను; ఆమాసమునందే ప్రథమవివాహవరుఁడైన గోగులపాటి శ్రీరాములు క్రైస్తవమతప్రవిష్టుఁడయ్యెను. శ్రీరాములుగారికిని భార్యకును పడకపోయినందును తన్నిమిత్తమయి 1882-వ సంవత్సరము సెప్టెంబరునెలలో గవర్రాజుగారిని విశాఖపట్టణము పంపినట్టును వెనుకనే చెప్పఁబడెను గదా! అప్పుడాయనచేసినసంధి

కొన్నిమాసములే నిలిచినది. శ్రీరాములుగారిభార్యను తీసికొని యామె తల్లి 1883-వ సంవత్సరము జనేవరు నెలలోఁ దనయూరికిఁ గొనిపోవలెనని రాజమహేంద్రవరమునకు వచ్చెను. నేను తల్లిని కూఁకలువేసి యామెను స్వగ్రామమునకుఁ బంపివేసి కూఁతును నాయొద్దనే యుంచుకొని శ్రీరాములకు వ్రాసి సమాధానపఱిచి యాచిన్నదానిని మరల గవర్రాజుగారివెంట భర్తవద్దకు విశాఖపట్టణము పంపితిని. ఆయన కొంతకాల మక్కడనుండి వధూవరు లిద్దఱు ననుకూలముగా నున్నట్టు కనఁబడిన పిమ్మట తిరిగి రాజమహేంద్రవరమునకు వచ్చెను. అతని భార్య యావత్సరాంతమున భర్తను విడిచి మరల రాజమహేంద్రవరమునకు వచ్చెను. నే నామెను కొంతకాలము నాయొద్ద నుంచుకొని బుద్ధులు చెప్పి యొప్పించి 1884-వ సంవత్సరము జనేవరి నెలలో మరల భర్తవద్దకుఁ బంపితిని. ఇట్లెన్నివిధములఁ బ్రయత్నముచేసినను తుదకీదాంపత్యము పొసఁగుపాటునకు రాలేదు. భార్యాభర్తల కిరువురకును శీఘ్రకాలములోనే మరల స్థిరవియోగము తటస్థించెను. భార్య కడసారి పుట్టినింటికిఁబోయి మరల రాకున్నతరువాత నాతఁడు విశాఖపట్టణములో నొంటిగానుండి వంటచేసికొని భుజించుచు వేళకుఁ గార్యస్థానమునకుఁబోయి పనిచేసి వచ్చుచుండెను. భార్య జీవించియున్న వానికి మరల వివాహము చేయనని నాప్రతిజ్ఞ యగుటచేత నే నాతనికిఁ బునర్వివాహప్రయత్నము చేయలేదు. విశాఖపట్టణములో వితంతువివాహము చేసికొన్నవాఁ డితఁ డొక్కఁడే కాని సాయము చేయుటకు వేరు కుటుంబములేదు. ఈతఁ డీప్రకారముగా బహుసంవత్సరము లొంటిగాఁ గష్టపడి కడపట 1888-వ సంవత్సరమునందు క్రైస్తవమత ప్రవిష్టుఁ డయ్యెను.

1888-వ సంవత్సరము జూలయి నెల 6-వ తేదిని కొమ్మరాజు గోపాలముగారివివాహము జరగినది. ఈతని కియ్యఁబడిన వధువు

వల్లూరి ప్రసన్నమ్మవివాహమునిమిత్తమయి రామకృష్ణయ్యగారే మున్నూరురూపాయలు తమమరణమునకు ముం దిచ్చియుండిరి. ఆమున్నూరురూపాయలలో నిన్నూరురూపాయలు వధువునగల క్రిందను, నూఱురూపాయలు వివాహవ్యయములక్రిందను, కర్చుపెట్టఁ బడినవి. రామకృష్ణయ్యగారి మరణశాసనప్రకారము మిల్లావల కేయుండి నది. నెల కెనిమిదేసిరూపాయలచొప్పున సంవత్సరకాల మిచ్చుట తప్ప మఱేమియు నియ్యవాగ్దానము చేయులేదనియు, తాను మఱేమియు నడుగఁగలవాఁడను కాననియు వరునిచేత వ్రాయించి పుచ్చుకొని దానిని సమాజమువారికిఁ బంపినమీఁదటనే నేనీ వివాహము చేసి తిని. రామచంద్రయ్యరుగారు బెంగుళూరినుండి పంపిన నూఱురూపా యలును నెల కెనిమిదేసిచొప్పున నీవరున కీయఁబడినవి. పయికష్ట ములు సంప్రాప్తమయినతరువాత నేను వ్రాసినయుత్తరమునకు లక్ష్మీ నరసింహముగారు గుత్తినుండి 26-8-88-వ తేదిని నా కిట్లు బదులు వ్రాసిరి.

'My dear friend,

Your tender and pathetic appeal to my conscience has almost put me out of my senses. I do not know what to do. Before I reply I ask our Heavenly Father to teach me and instruct me what I shall do in the matter. I am unable to solve the problem. I look up to him for assistance and guidance. You know I have no interest. I should do what justice requires. But you have tied down my hands. I can only do what my colleagues advice me to do. Any split will lead to unnecessary unpleasantness. Cannot you send for Seshayya and Kodandaramayyu and make any arrangement? Speak to them gently. Show your earnestness. If you then come to any arrangement, I shall gladly accept it, provided it does not touch the principal. As to the management or spending of the interest I leave it to you three. Consider the best arrangement and I shall gladly follow it. To your suggestion I have some remarks to offer.

You say 'Make an earnest appeal to your conscience and see whether it tells you to be giving Rs. 3 or 4 every

month to those who are not in need of it and who get Rs. 15 or so monthly or expects you to support only those that are really in need of help and to relieve, as far as possible, those wretched creatures whose lives would be made of continued misery if we don't lend our helping hand?'

This touches me very much. But how to remedy the evil. It is only Ramayya that is paid Rs. 4—0—0 a month. I think that he deserves it. Now the others are paid at Rs. 2—8—0 a month. Can you draw a line to whom this should be paid and to whome this need not be continued Take the other side of the question. No doubt some may not require assistance. But every one wants or pleads for assistance. Sreeramulu of Cocanada sends a telegram for immediate assistance. He sends letter to urgent necessity. How we to determine and who is to determine? He wanted Rs. 50 by wire. Of course I could now easily reply 'No more than fifteen you can get.' Chalapathi Row sends a number of letters for his wife's medical assistance. His letters, you will see, show that he is in great need and that he would otherwise severely suffer. What reply could I make if there is no rule or system? Now I can say adjust, no more than Rs. 15—0—0. Venkayya sends letter. Money is required for his child, send more money Kodandaramayya writes my house is uninhabitable. Unless send some hundred rupees, he says, it will fall down and cause irreparable loss Dear friend how to reply. Place yourself in that position, and see what answers you could make. If you want for one year I shall delegate my powers and see if you can make better arrangement. I do not like to be bothered by their various applications I want to give my undivided attention to Vedam............" (నా ప్రియమిత్రుఁడా! మృదువుగాను మనసుకరఁగు నట్లుగాను వ్రాయఁబడిన నీ పత్రము చేసిన మీ ప్రార్థన నన్నించుమించుగా మతిలేనివానినిగాఁ జేసినది. ఏమిచేయవలెనో నెఱుఁగను. ఈవిషయములో నేనేమిచేయవలెనో నాకు నేర్పి యుపదేశించుటకయి నేను ప్రత్యుత్తరమిచ్చుటకు ముందు మన స్వర్గమందున్న తండ్రిని (దేవుని) వేఁడుకొనుచున్నాను. ఈసందిగ్ధాంశము నిదమిద్ధమని నిర్ణయించుటకు నేను శక్తుఁడను గాకున్నాను. సాయము

కొఱకును దారి చూపుటకొఱకును నే నాయనకయి చూచుచున్నాను. నా కిందులో లాభము లేదని మీరెఱుఁగుదురు. న్యాయ మపేక్షించు దానిని నేను చేయవలెను. కాని మీరు నాచేతులను కట్టిపెట్టి యున్నారు. నాసహకారులు చేయుమని చెప్పినదానిని మాత్రమే నేను చేయఁగలను. మూలోపవిభాగ మత్యావశ్యకమయిన యప్రియ మునకుఁ గారణమగును. శేషయ్యను కోదండరామయ్యను పిలిపించి మీరేదైన నేర్పాటుచేయలేరా? వారితో శాంతముగామాటాడుఁడు; మీయోగ్యతను కనఁబఱుపుఁడు. అప్పుడు మీరేదైన నేర్పాటునకు వచ్చినపక్షమున, మూలధనమును ముట్టునది కాదేని నేను దాని సంతోషపూర్వకముగా సంగీకరించెదను. కార్యనిర్వహణవిషయము గాని వడ్డిని వ్యయపెట్టు విషయముగాని నేను మీముగ్గురికి విడిచి పెట్టెదను. ఉత్తమమైన యేర్పాటు నాలోచింపుఁడు, నేను దానిని సంతోషముతో ననుసరించెదను. మీరు చేసిన సూచనవిషయమయి నేను కొన్ని వ్యాఖ్యానములను చేయవలసియున్నది.

'మీయంతరాత్మ కేకాగ్రమయిన విన్నపముచేసి, అది యావశ్యకము లేనట్టియు నెలకుఁ బదునేనురూపాయలలో నెంతో సంపాదించుకొనునట్టియు వారికిఁ బ్రతిమాసమును మూఁడు నాలుగురూపాయ లిచ్చుచుండుమని చెప్పనో నిజముగా సాయము కావలసినవారికి మాత్రమే తోడుచూపి మనము సహాయహస్తము నియ్యకపోయిన యెడల నెవ్వరి జీవితములు నిరంతర దుఃఖభాజనములుగాఁ జేయఁ బడునో యట్టివంటియగతికులను సాధ్యమైనంతవఱకు దుఃఖవిముక్తులనుగాఁ జేయుటకై మిమ్మెదురు చూచునో చూచుఁ' డని మీరు చెప్పుచున్నారు.

ఇది నామనస్సును మిక్కిలివిస్తారముగాఁ దాఁకుచున్నది. కాని, యీయనర్థమునకుఁ బ్రతిక్రియ చేయుటయెట్లు? నెలకు నాలుగురూపాయ

లిచ్చుట యొక్క రామయ్యకు మాత్రమే. అతఁడు దాని కర్హుఁడని తలఁచుచున్నాను. ఇప్పుడు తక్కినవారికి నెలకు రు. 2-8-7 లచొప్పున నియ్యఁబడుచున్నది. ఇది యెవ్వరి కియ్యఁబడవలెనో యెవ్వరికి నుంది య్యఁబడ నక్కఱలేదో మీరొకగీతను గీయఁగలరా? ఈప్రశ్నము యొక్క రెండవవైపు పుచ్చుకొనుఁడు. నిస్సంశయముగాఁ గొందఱికి సాయమక్కఱ లేక పోవచ్చును. కాని ప్రతిపురుషుఁడును సాయము కావలెనని కోరుచున్నాఁడు. వెంటనే సాయము కావలెనని కాకినాడ లోని శ్రీరాములు తంత్రీవార్త నంపుచున్నాఁడు. అవిలంబ్యమైన యవశ్యకతతో నతఁ డుత్తరము పంపుచున్నాఁడు. మనమెట్లునిర్ణయిం పవలెను? నిర్ణయించువా రెవరు? తంత్రీముఖమున నతఁ డేబదిరూపా యలు కావలె ననెను. 'నీకు రాఁగలిగిన 15 కంటె నెక్కువరాదు' అని నే నిప్పుడు సులభముగాఁ జెప్పఁగలిగితినిగదా! తనభార్యయొక్క వైద్యసాహాయ్యకొఱకు చెలపతిరా వెన్నోలేఖలు వ్రాయుచున్నాఁడు. అతఁడు లేనిస్థితిలో నున్నాఁడనియు మఱియొకలాగైనచో నతఁడు మిక్కిలి బాధపడుననియు నతనియుత్తరములు చూపుట మీరు కనుగొనవచ్చును. విధిగాని పద్ధతిగాని లేనిపక్షమున నేనేమి యుత్తర మియ్యఁ గలుగుదును? '15 రూపాయలకంటె నెక్కువలేదు. సరిపెట్టుచుకో' అని నే నిప్పుడు చెప్పఁగలను. తనబిడ్డనిమిత్తము సొమ్ము కావలెను పంపుమని వెంకయ్య వ్రాయుచున్నాఁడు. 'నా యిల్లు వాసయోగ్యము కాకున్నది. నూఱురూపాయలు పంపనియెడల, అది పడిపోయి యప్రతికారమైన నష్టమును కలిగించును' అని కోదండరామయ్య వ్రాయుచున్నాఁడు. ప్రియమిత్రుఁడా! ఎట్లు ప్రత్యుత్తర మియ్యవలెను? ఆస్థితియందు మీరుండి మీరేమిప్రత్యుత్తరములియ్యఁ గలుగుదురో చూడుఁడు. మీరు కోరినయెడల సంవత్సరకాలము నాయధికారములను మీ కిచ్చెదను. మీరింతకంటె మంచి యేర్పాటు

చేయఁ గలుగుదురేమో చూడుఁడు. నా కివిధప్రార్థనలతో బాధింపఁబడుట నా కిష్టము లేదు. న్యాయవిరుద్ధమైన యవధానమును వేదమున కియ్యఁ గోరెదను.)

లక్ష్మీనరసింహముగారు కడపటివఱకు న్యాయము చేసినట్లు తొందరపడి యనాలోచితముగాఁ బనిచేయువారు కారు; స్వభావముచేత శాంత సమయమునందు న్యాయము చేయుటయందే దృష్టిగలవారు. ఇప్పుడాయన యెటుచేయుటకును పాలుపోని విషమావస్థయందుఁ దగులుకొని యుండిరి. సమాజమువారి నిర్ధారణానుసారముగాఁ దనతోఁ జేర్చుకొన్న ధర్మకర్తలను స్వేచ్ఛముగా న్యాయమార్గమునకు మరలు నంతటి ధైర్యము కలవారు కాకుండిరి. ఈ యధికధర్మకర్తలన్ననో సామాన్యలాభమునిమిత్తము స్వలాభమును వదలుకొను నంతటి యవివేకులు కానందున వారు ప్రతిపాదింపఁబడిన యేర్పాటునకు వచ్చుట యసాధ్యము.

1888-వ సంవత్సరము అక్టోబరునెల 17-వ తేదిని కోదండరామయ్యగారి ద్వితీయవివాహము జరిగినది. క్రొత్తగా నియ్యనక్కఱ లేక యీయన కట్నముతోనే యుంచెను; నగలును ప్రథమభార్యవే యుండినవి. ఈయన సమాజముతో సంబంధములేక తనవివాహమును తాను స్వతంత్రముగాఁ జేసికొనెనని చెప్పినను, కార్యదర్శి యొద్ద బదులని పుచ్చుకొనిన నూరిలో నిప్పుడు 75 ల సమాజధనముతోనే వివాహ వ్యయములు జరిగినవి, సమాజమువారివంటబ్రాహ్మణుఁడును పురోహితుఁడును వచ్చి వివాహతంత్రమును నడపిరి. తన వివాహమును తానే స్వతంత్రముగాఁ జేసికొంటినని వ్రాసి లక్ష్మీనరసింహముగారిద్వారమున సభాపతి మొదలియారిగారు పెండ్లియొకటికి సమాజమున కిచ్చెదమని వాగ్దానముచేసిన నూఱురూపాయలును కోదండరామయ్యగారే తప్పించుకొనెను; రామచంద్రయ్యగారిచ్చెడు,

నూఱురూపాయలును తనకే పంపుమని వ్రాసెనుగాని యాయన తన సహాయధనమును సమాజమునకే యిచ్చెను.

తనయింటిలోని యొకభాగమునకు గోదావరివరదచేతఁ గొంత చెఱుపు కలిగినతరువాత రామకృష్ణయ్యగారి మరణశాసనానుసారముగా మూడుభాగములుగా నుండిన యింటిని రెండుభాగములుగా ఆతఁడు లక్ష్మీనరసింహముగారు పంచియిచ్చినను పంచి యియ్యనే లేదనియు, గోదావరివరదలవలనఁ దనయింటిభాగమునకు నష్టము కలుగుటయు వెంకయ్య తనభాగమును వృద్ధిచేసికొనుటయుఁ జూచి కోదండరామయ్యగారిల్లు క్రొత్తగా పంచిపెట్టుఁడని కోరనే కాని ఇట్లు పంచియియ్యలేదనుట వాస్తవము కాదని కార్యనిర్వాహకసంఘము వారు నిర్ధారణము చేసినప్పుడు తనవ్యవహారమును సామాన్యసంఘము వారిముందఁ బెట్టవలసినదని దూషణోక్తులతో నుత్తరము వ్రాసియు, సామాన్యసంఘమువారు కార్యనిర్వాహకసంఘమువారి తీర్పునే స్థిరపరిచినతరువాత న్యాయస్థలమునకుఁ బోయెదనని బెదరించియు, తాను బదులుపుచ్చుకొన్నసొమ్ము తీర్చవలసినది లేదని కారణము చెప్పకయే తగవుపెట్టియు, తనకు ధన మియ్యకపోయినయెడల పునర్వివాహ పక్షమును విడిచి ప్రాయశ్చిత్తము చేయించుకొనెదనని భయపెట్టియు, ఉన్నసమాజమునకు విరోధముగా నత్యల్పకాలములోనే నశించిన యింకొకసమాజమును స్థాపించియు, తనకు ధనసాహాయ్యము చేయని వారిని తనపక్షమున మాటాడిని వారిని దూషించుటకయి వార్తాపత్రికనొకదానిని బైలుదేరఁదీసియు, కోదండరామయ్యగారును, ప్రతిపక్షుల ప్రేరణముచేత నల్పాంశములనుబట్టి మరియొకరిద్దరును అవిచారమూలకములయిన యెందరపనులుచేసి నాకును సమాజమువారికిని కొంత శ్రమ కలుగఁజేయుచు వచ్చిరికాని యట్టివానినెల్ల నిచ్చట వివరించుట యనావశ్యకము. అంతేకాక యవి సువిచారపూర్వకములు

కాని బాలవిచేష్టితము లగుటచే నుపేక్ష్యములును క్షంతవ్యములును నయి యున్నవి. కొందరు ధనాశచేతనే లబ్ధమనోరథులు కాక యిట్టి తొందరలను చూపుచు వచ్చిరి. అట్టివారు తామే స్వార్థపరిత్యాగు లయిన పరార్థపరులయినట్టు నటించుచుండగా మడిగినంత యియ్యకపోవుటచేత తమనిమిత్తము చందా లిచ్చి పాటుపడుచుండిన పుణ్యపురుషులను సహానుభూతి లేనివారని నిందింపఁ దొడఁగిరి. ఇక్కడి యీవితంతువివాహసమాజములో రాజమహేంద్రవరములోని ప్రముఖులుగా నుండిన వారు ముక్కాలు మువ్వీసము చేరియుండిరి. ఈ యిరువది సంవత్సరములలో సామాజికులుగా నుండినవారిలో 27 గురు పట్టపరీక్ష (బి.యే.) యందుఁ గృతార్థులయిన వారుండిరి; ఇద్దరు శాస్త్రోపాధ్యాయ (ఎమ్. ఏ.) పట్టము నొందినవారు. సామాజికులలో న్యాయవాదులు, రాజకీయోద్యోగులు, వర్తకులు మొదలయినవా రుండిరి. ఇట్లీసమాజము ఘనముగ నుండినను పూర్వోక్తములైన కారణములచేఁ గడచిన సంవత్సరముల కాలములోఁ గ్రొత్తవివాహ మొక్కటే జరిగినది. వెనుకటివానికి వలెనే దీనికిని రామకృష్ణయ్యగారిచ్చిన యిల్లే నివాసమయినది. 1889 వ సంవత్సరము మార్చి నెల 29 వ తేదిని జరిగిన యీ కడపటివివాహ దంపతులకుఁ గాకినాడలోని (తాపీ రామారావుగారి యింటిలోఁ జేరిన) రామకృష్ణయ్యగారిచ్చిన యిల్లియ్యనిశ్చయింపఁగా బ్రాహ్మణు లున్నయింటిలోఁ గాపురముండుట యనుచితమని తామారి రామారావుపంతులుగారు మొట్టపెట్టి సమాజమువారియనుమతితో నూతన దంపతుల కాపురమునకయి యిల్లుకట్టించుకొనుటకు మున్నూఱు రూపాయలిచ్చి యాయింటిభాగమును తాను స్వాధీనము చేసికొనెను. ఇంకముందు నూతనదంపతుల కిచ్చుటకు సమాజమువారివద్ద నిండ్లు లేవు; ఇండ్లుకట్టించి యిచ్చుటకయి ధనములేదు. మాసమాజమునకుఁ జందాలిచ్చి కూర్చినధనమును సేవకుల నెలజీతములకును వివాహము

లాడినవారికిని నిచ్చుచుండుటవలన ఫల మత్యల్పమును దూషణములును తప్ప వేఱులేదని కొందఱి మనస్సులకుఁ దోఁచినందున వారు చందా లిచ్చుట మానుకొనిరి. అందుచేత సంవత్సరమున నాలుగు రూపాయ లిచ్చుట భారముగా నున్నదని [illegible] లియ్యవలసిన చందాధన మాఱురూపాయలనుండి మూఁడు రూపాయలకుఁ దగ్గింపఁబడినది. ఆ మూఁడురూపాయ లిచ్చుటకు సహితము కష్టముగాఁ గనఁబడినందున మూఁ డొక్కటిగా చేయఁబడెను. ఆ యొక్కరూపాయను సహితము మనేకులు క్రమముగా నియ్యకుండిరి. అందుచే సేవకుల కొలుతము లిచ్చుటయే సమాజమువారికి దుర్ఘటమయినది. ఈ దురవస్థలో హితుని వంటి బ్రాహ్మణుని తొలఁగించి వా[illegible] పని నామీదఁ [illegible] దీనిబట్టి సమాజమువారికి లెక్కలు [illegible] భారము [illegible] తీర్పవలసిన భారమును తప్పి[illegible] మొదలుకొని సమాజమువారు [illegible] దేశీయసంఘ సంస్కరణసభకుఁ [illegible] చేయు సభలు తప్ప వేఱుసభలు లేక [illegible]. వివాహ ములను నా [illegible] నేనే సమాజము వారి యాదరణముక్రింద [illegible]ని. [illegible]-వ సంవత్సరములో రెండువివాహములను 18[illegible]-వ సంవత్సరములో రెండు వివాహము లును, ఈప్రకారముగా 1907-వ సంవత్సరము[illegible] నేను చెన్నపట్టణము నకు వెళ్లునప్పటికిఁ [illegible] వివాహములు చేసితిని. ఈవివాహదంపతుల కిండ్లిచ్చు పద్ధతినిగాని నగలుపెట్టు పద్ధతినిగాని నేను పెట్టుకోలేదు. మట్టెలు, మంగళసూత్రములు, నూతనవస్త్రములు, తాంబూలాదులు, వాద్యములు, భోజనములు మొదలయినవానిక్రింద నూఱు రూపాయలకు మించకుండ వ్యయముచేయ నిశ్చయించుకొని యాప్రకారముగాఁ జేయుచుంటిని. నాకు ధనము కావలసి వచ్చినప్పుడెల్లను

నామిత్రులయిన న్యాపతి సుబ్బారావుపంతులుగారు ప్రీతిపూర్వక ముగా నాకు బదులిచ్చి నేనిచ్చినప్పుడు వడ్డి గైకొనక యసలు మాత్రము పుచ్చుకొనుచుండెడివారు. ఇరువదియేడవవివాహము చేసి నేనక్కడనుండి చెన్నపురికిఁ బోయితిని. అక్కడ ముప్పదియైదవవివాహము జరుగుచుండఁగా అల్లూరి లక్ష్మీనరసింహము సోమయాజులు గారు నన్నుఁజూడవచ్చిరి. అప్పుడు నే నాతనితోఁ బ్రసంగవశమున ధనము లేకపోవుటచేత సత్కార్యములు సాగక నిలిచిపోవనియు, అప్పటికి రామకృష్ణయ్యగారిధనముతోఁ జేయఁబడినవానికంటె ద్విగుణముగా వారిధనసహాయ్యము లేకయే చేయఁబడినవనియు, ప్రస్తావించితిని. ఆయన వధూవరులకుఁ గట్నము చదివించి సంతోషించిపోయెను. తీరఁగా ధనము వచ్చునన్నయాశ లేకపోవుటచేత నిప్పటివరుల కతృప్తి లేదు. ధనాభావముగా నాకు వారివలన పీడలేదు. రాఁగా రాఁగా వివాహవ్యయమును నూటిపదికి దిగిపోయెను. ఏఁబదినుండి యిరువదింటికిని, దింపినాను. ఇప్పుడు చేయఁబడు కొన్నివివాహములకు వ్యయములను వరులు తామే భరించుచున్నారు.

ప్రయాసదశ యని చెప్పఁబడిన 1881 కిని 1890 కిని నడుమ నుండిన యీ పదిసంవత్సరములలోను నే నిరంతరపరిశ్రమలందును చుఱుకుగాఁ బనిచేయుచునే యుండెడివాఁడను. ప్రతిదినమును పగలు పదిగంటలకుఁ బాఠశాలకుఁ బోయి సాయంకాల మైదుగంటలవరకును పనిచేసి వచ్చుచుండెడివాఁడను. నేను తీవ్రమైన యుబ్బసపుదగ్గుచేత బాధపడుచుండినను పాఠశాలకుఁబోయి బాలురకు బోధింపనిదినము లత్యల్పముగా నుండెను. విద్యార్థిసంఘములకుఁ బోయి యుపన్యాసము లిచ్చి వారిని సత్కార్యములకుఁ బురికొల్పుచుండెడివాఁడను. ఇన్నీసుపేట పాఠశాలయొక్కయు, పట్టణపాఠశాలయొక్కయుఁ గార్యనిర్వాహకసంఘములలో నొక్కఁడనుగానుండి పనిచేయుచుండెడివాఁ

డను. మహమ్మదీయవిద్యాసంఘమునకు సహితము మహమ్మదీయుల ప్రార్థనమీఁద నేనే కార్యదర్శిగానుండి వారివిద్యార్థుల భోజనగృహమును నడపుచుండెడివాఁడను. పురపారిశుద్ధ్యవిచారణసంఘములోను (Municipal Council) తాలూకాస్థలనిధిసంఘము (Taluq Board) లోను, మండలస్థలనిధిసంఘము (District Local Fund Board) లోను సభ్యుఁడనుగా నుండి పనిచేయుచుండెడి వాఁడను. పురపారిశుద్ధ్యసంఘసభ్యుఁడనుగానుండి యాకాలమునందా సంఘములోనుండిన యుత్కోచగ్రహణాదిదౌష్ట్యముల నడఁచివేయుటకయి సర్వవిధములఁ బ్రయత్నము చేసితిని. సభ్యులలో లంచములు పుచ్చుకొనువారినామముల పుటాకారము లనేపాత్రముల పేరుల మొదటపెట్టి పారిశుద్ధ్యసంఘప్రహసనమును వ్రాసి వివేకవర్ధనిలో బహుపత్రికలయందుఁ బ్రకటించితిని. అప్పటి పారిశుద్ధ్యసంఘసభ్యులలో కొందఱు వేఱు జీవనాధారము లేనివారయి లంచములవలననే సుఖజీవనముఁ జేయుచుండిరి. ఆకాలములోఁ బౌరులయొక్క ప్రతివిజ్ఞాపనపత్రమునకును సభ్యునకియ్యవలసినది యింత, కార్యస్థానకార్యనిర్వాహకున కియ్యవలసినది యింత, ఆరోగ్యపరీక్షకున కియ్యవలసినది యింత, తమకు ఉత్తరువును దెచ్చెడి భటున కియ్యవలసినది యింత, అని మామూల్యప్రమాణములే యేర్పడియుండెను. సభ్యులు దీపస్తంభముల నుపయుక్తస్థలముల యందుఁ గాక తమయిండ్లముందరనే వేయించుకొనుచుండిరి; దీపముల గుత్తదారుఁడు వీధులలోని దీపములలోనుండి తగ్గించి చమురు సభ్యుల కొందఱియిండ్లలోని దీపములకుఁ బోయవలసివచ్చుచుండెను. బాటలు బాగుచేయుటకయి యేటేట నియ్యఁబడు ప్రజలసొమ్ములో విశేషభాగ మీదుష్టులసంచులలోనికే పోవుచుండెను. ప్రబలులైన ప్రజలు నిర్భయముగా తమవీధియరుగులను పెంచియు, ఇండ్లను ముందుకు జరపి కట్టియు, స్థలము నాక్రమించుకొని వీధు లంతకంతకు సన్న

మగునట్లు చేయుచుండిరి. పారిశుద్ధ్యశాసనవిధు లొక్క బీదలను మాత్రమే బాధించుచుండెనుగాని ధనికులు శాసనవిధులనే బాధించుచుండిరి. పారిశుద్ధ్యవిచారసంఘమువారి యధికారములోనున్న ధర్మవైద్యశాలలో ధనము కావలసినంత వ్యయపడుచుండినను రోగులకు బథ్యపానములు తిన్నగా జరగక యాధనములో సగపాలువైద్యశాలాసహాయు లనఁబడెడి యుల్పోద్యోగియులపా లగుచుండెను. ఈ యక్రమముల నన్నిటిని సాధ్యమైనంతవరకు మాన్పుటకయి పాటుపడఁ జొచ్చితిని. ఈవిషయములలో జరగిన రెండుమూఁడు కార్యములను మాత్రమిం దుదాహరించెదను.

రోగుల కెట్లు పథ్యపానములు పెట్టుచుండిరో పరీక్షించుటకయి యాసమయమునందు నేనొకదినమున ధర్మవైద్యశాలకుఁ బోయితిని. అప్పుడు రోగులకు లెక్కలలోఁ జూపఁబడినట్లు పాలును రొట్టెయుఁగాక గంజియు మెతుకులును పెట్టఁడుచుండెను. నేను పరీక్షించి రోగులను ప్రశ్నించుచుండుటచూచి యొక సేవకుఁడు పరుగెత్తుకొనిపోయి వైద్యశాలాప్రధానసహాయుఁడైన రంగయ్యనాయనిని దీసికొని వచ్చెను. అతఁడు వచ్చి తనగుట్టు బయలఁబడునని తలుపులు లోపల వేయించి నన్నులోపలకు రాక వెలుపలనుండవలసినదని నిషేధించెను. నేను వైద్యశాలను విడిచిపోయి యాతనిచర్యను పురపారిశుద్ధ్యసంఘమువారికిఁ దెలియఁబఱిచితిని. అందుచేత నతఁడు నాపైని ద్వేషముపూని యొకనాటిరాత్రి యొకపెద్దమనుష్యునియింట జరగిన సభలో నావంక కన్ను లెఱ్ఱచేసి చూచుచు నేదో దౌర్జన్యము జరగించుటకుద్యుక్తుఁడయి యుండినట్టు కనఁబడెను. ఆసంగతిని కనిపెట్టి మమ్ము తాంబూలములకుఁ బిలిచినగృహస్థునిమనుష్యులాతనిని పట్టుకొని బలవంతముగా వెలుపలకు లాగుకొనిపోయిరి. అతఁ డారాత్రి మద్యపానమువలని మత్తులోనుండినట్టు నాకుఁ గనఁబడినది. నాటిరాత్రి జరగిన

వృత్తమును సహితము నేను పురశుద్ధ్యసంఘము వారికిఁ దెలియఁజేసితిని. అందుమీఁద వారా వైద్యశాలోద్యోగిని మందలించి మఱియొక చోటికి మార్చవలసినదని చెన్నపట్టణము వైద్యశాలాముఖ్యాధికారికి వ్రాసిరి. మా వైద్యశాలాధికారి (Civil Surgeon) తనక్రిందియుద్యోగస్థునికిఁ దోడుపడి యుండక నన్ను లోపలికి రాకుండఁజేయుట యయుక్తముకాదని యతనివర్తనమును దూషించెను. అప్పుడు సీ. నాగోజీరావు పంతులుగారు పురశుద్ధ్యసంఘమున కధ్యక్షులుగా నుండెను. నేను చెన్నపట్టణమునకు వితంతువివాహసమాజపక్షమునఁ జందాలు వసూలుచేయుటకయి పోయియుండినప్పుడు నాగోజీరావు పంతులుగారు 1885-వ సంవత్సరము మేనెల 19-వ తేదిని నాకిట్లు వ్రాసిరి.

19th May 1885.
RAJAHMUNDRY.

My dear Viresalingam Garu,

I am in receipt of your letter from Madras and I am glad to hear that you are all right now. I hope you will succeed in raising money in Madras for the Remarriage Association here with or without the help of big wigs in Madras ..................................................

Rangiah Naidu has tendered an unqualified apology now and though some were anxious that the apology should be accepted at once and that the Surgeon General should be requested not to transfer him from here, it was resolved at my instance that the matter should be postponed till the apology was referred to you. A mahajarnama signed by about four hundred people was also presented to me requesting that Rangiah should be retained here. If you are willing to accept the apology tendered now, I shall not insist on his transfer as the man begs very hard to be saved. In reply to the Civil Surgeon's letter, the Surgeon General says you had every right to go and that Rangiah Naidu had no business to interfere with you in any way.' (మీరు చెన్నపట్టణమునుండి వ్రాసినయుత్తరము నా కందినది. మీ రారోగ్యముకలిగి యున్నారని విని సంతోషించుచున్నాను. చెన్నపట్టణములోని గొప్ప

వారియొక్క సాహాయ్యముతోగాని సాహాయ్యము లేకగాని యిక్కడి పునర్వివాహసమాజమునకు సొమ్ము సమకూర్చుటలో మీరు లబ్ధమనోరథులగుదురని నేను కోరుచున్నాను.................—

రంగయ్యనాయఁ డిప్పుడు నిర్ణయమైన క్షమార్పణమును చేసియున్నాఁడు; అతని క్షమార్పణము వెంటనే యంగీకరింపఁ బడవలసినదనియు, ఇక్కడినుండి యతనిని మార్పకుండునట్లు సర్జనుజనరల్ ప్రార్థింపఁబడవలెననియు కొంద ఱుత్కంఠులయి యుండినను, నాకోరికపైని క్షమార్పణమును మీకుఁ దెలిపెడువఱకును ఈవిషయము నిలుపుచేయఁబడవలసినదని నిర్ధారణ చేయఁబడినది. రంగయ్యే నిచ్చట నుంచవలసినదని కోరుచు సుమారు నన్నూఱుగురు వ్రాళ్ళు చేసిన సంఘవిజ్ఞాపన మొకటికూడ నాకుఁ బంపఁబడినది. ఇప్పుడు చేయఁబడిన క్షమార్పణము నంగీకరించుటకు మీరిష్టపడినపక్షమున, అతఁడు రక్షింపవలసినదని మిక్కిలి దీనముగా వేఁడుచున్నందున నే నతనిని మార్చు విషయమయి పట్టుపట్టను. సివిల్ సర్జనుయొక్క యుత్తరమునకు బదులుగా సర్జన్ జనరల్ వెళ్లుటకు మీ కధికారము కలదనియు దిమ్మాటంకి పెట్టుట కేవిధముచేతను రంగయ్యనాయనికి పనిలేదనియుఁ జెప్పుచున్నాఁడు.

ఈ రంగయ్యనాయఁడు రాజమహేంద్రవరములో నిల్లుకట్టుకొని కుటుంబముతో వాసము చేయుచుండెను. అతని నక్కడినుండి మార్చినయెడల క్రొత్తగాఁ గట్టుకొన్న యిల్లువిడిచి క్రొత్తస్థలమునకుఁ బోవలెను. నేనాతని క్షమార్పణము నంగీకరించి యాతనిని రాజమహేంద్రవరములోనే యుంచవచ్చునని వ్రాసితినిగాని రాజధాని వైద్యశాలాధికారి యతని నన్యస్థలమునకుఁ బంపివేసెను.

ఒకదినమున నేను భోజనముచేసి పగలు పదిగంటలవేళ పాఠశాలకుఁబోవుచుండఁగా పట్నాల వీరేశలింగమను స్వర్ణకారుఁడొకఁడు

నాలుగయిదడుగులు రాజవీధిలోనిస్థల మాక్రమించుకొని పునాదులు (అస్థిభారము) ముందుకు జరపి గోడ లేవఁదీయుచుండెను. ప్రాతగోడ యానవాళ్ళింకను స్పష్టముగాఁ గనఁబడుచుండెను. నే నదిచూచి యక్కడ నిలిచి లోపలనున్న గృహపతిని పిలిపించి యిట్లాక్రమముగా స్థలము నాక్రమింపఁ గూడదనియు, పని నిప్పుడు నిలుపుచేసి స్థలము నిమిత్తము పారిశుద్ధ్యవిచారణసంఘమువారికి విజ్ఞాపనపత్రిక పంపుకొని వారిచ్చినపక్షమున నిప్పుడు కట్టుచున్న రీతిగాను ఇయ్యని పక్షమున మునుపున్న రీతిగాను కట్టుకొనవలసినదనియు, చెప్పితిని. అతఁడు నా మాట యొప్పుకొని పనిమాని పనివాండ్రనింటికిఁ బంపివేసెను. నేను పాఠశాలలోఁ బనిచేసి సాయంకాల మయిదుగంటలకు మరల నా దారినే యింటికిఁ బోవుచుండునప్పటి కాయింటిపని మరల నారంభింపఁ బడినది. ఇది యేమని యడుగఁగా నతఁడు తాను పోయి యావిభాగపుపారిశుద్ధ్యసంఘసభ్యుల నడుగఁగా నిది మీవిభాగములోనిది కానందున దీని నాపుటకు మీకధికారము లేదనియు తమ విభాగములోని దగుటచేత మనసు వచ్చినట్లు చేయుటకు తమకే స్వాతంత్ర్య మున్నందున పెట్టుకోవచ్చునని సెలవిచ్చిరనియు చెప్పెను. నేనీవిషయ మయి మఱునాఁడు సభవారికి జ్ఞాపిక పంపితిని. ఈజ్ఞాపికసభలో విచారణకు వచ్చుటకు లోపలనే యిల్లు కట్టించి పూర్వపుగుఱుతు లేవియు లేకుండఁజేసిరి. ప్రధానరథ్యలోనే యీవిధముగా నాక్రమణము జరగుటనుగూర్చి నేను సభలో మాటాడునప్పు డాస్వర్ణకారుని కాలోచన చెప్పిన యా విభాగసభ్యులు మాటాడక మౌనముధరించి తామేమియు నెఱుఁగనట్టూరకుండిరి. ఆసభ్యులిరువురిలో నొక్కఁడు మండల సభలో న్యాయవాది. ఆక్రమణము తీసివేయించుటకు సభలో నిర్ధారణము చేయఁబడినది. ఆనిర్ధారణాను సారముగా సభవారి పక్షమున నేనుపోయి మనుష్యులచేత నాక్రమించుకొన్న పెణకను రంపముతో

కోయించివేసి, వీధియరుగులను ఒక యరుగుమీఁదనున్న గదిని గడ్డ పాఱలతోఁ ద్రవ్వించివేసితిని. స్థలము పోయినదానికంటెను ధనవష్టి కంటెను నెక్కువగాఁ గ్రొత్తగాఁ గట్టించుకొన్నయింట గృహప్రవేశోత్సవము నడపఁబోవుచున్నప్పుడు కట్టినయింటిని పడఁగొట్టించుట యశుభసూచకమని విలపించి, యితఁ డాసభ్యులనుతిట్టి మొదటనే నాహితబోధ వినవందుకుఁ బశ్చాత్తాపపడెను. ఆసభ్యులకుఁ దాను ముందుగా నిరువదియైదు రూపాయ లిచ్చితిననియు, నే నాటంకపెట్టిన మీఁదట వారు మరల డెబ్బదియైదు రూపాయలు కైకొనిరనియు, అతఁ డప్పుడు నాతోఁ జెప్పకొని దుఃఖించెను. ఆర్తులదుఃఖనివారణ చేయువిషయమున సాధారణముగా నాది జాలిగుండెయేయయినను, వారు దుర్నీతి పరులయినప్పుడు కఠినమయి దయమాలినదగును. అతని విలాపమును గృహముయొక్క దుస్స్థితియుఁ జూచినప్పుడు మనస్సులో నాకు నిజముగానే విచారము కలిగెను. ఇప్పుడు త్రవ్వి పడఁగొట్టుటచే నెగుడుదిగుడైన భాగమును తిన్నగా సమసూత్రముగాఁ గట్టించుకొనుటకయి పారిశుద్ధ్యసంఘమువారికి విజ్ఞాపన పత్రమును పెట్టుకొమ్మని యతనితోఁ జెప్పితిని. అతఁడు పంపుకొన్న విజ్ఞాపత్రముపైని వా రాతని కోరిక నంగీకరించిరి.

ఆకాలమునందు పండా మామయ్యయని రాజమహేంద్రవరములో నొక ప్రసిద్ధపురుషుఁ డుండెను. అతఁడు పడుచుతనములో నెటువంటి సాహసికకార్యములకును వెనుకతీయక యెల్లవారల మనస్సులకును భీతి గొలుపువాఁడయి యుండెనుగాని యిప్పుడు కాలము మాఱినందునను గతవయస్కుఁడయినందునను తొంటిదుడుకుతనమును మాని సాధువర్తనుఁడయి ముసలిపులివలె నుండెను. అతనికి నంగళ్ళ వీథదయైన ప్రధానరథ్యయందొక యిల్లును కొట్లును నుండెను. అతఁడు తనయింటియరుగులను పెంచికట్టెను. అది యెఱింగియుఁ గొందఱాతనికి భయపడి యూరకుండిరి. ఆయింటిసమీపముననే వాసముచేయు

వారును పారిశుద్ధ్యసంఘములో సభ్యులునయిన నాళము రామ రాజుగా రాయాక్రమణమును నాకుఁ జూపఁగానే నాయాక్రమణమును తీసివేయించుటకయి జ్ఞాపకపెట్టితిని. మా పట్టణములోని యొక గృహస్థుఁ డాయాక్రమణమును తీసివేయింపవలదని సభ్యులతో ననేకు లతోఁ జెప్పినందున వా రాక్రమణమే జరుగలేదని చెప్పఁదొడఁగిరి. ఈ విషయ మొకనాటి ప్రాతఃకాలమున జరిగినసభలో విచారణకు వచ్చెను. నేనా దినమున సభకుఁ గొంచె మాలస్యముగాఁ బోవుట తట స్థించెను. నాఁ డధ్యక్షప్రతినిధి (Vice President) సభకు రానందున సభ్యులలో నొక్కరైన మెట్కాఫుదొర (శాస్త్రపాఠశాలా ప్రధానో పాధ్యాయులు) గా రగ్రాసనత్వమును వహించిరి. నేను సభకుఁ బోవు నప్పటి కీవిషయమే విచారింపఁబడి నిర్ధారణమునకు సిద్ధముగా నుం డెను. నేను పోవుచునే యప్పుడు చర్చింపఁబడుచున్న విషయమే మని యడుగఁగా, పండా మామయ్య యరుగువిషయమనియు సభ్యులలో నధిక సంఖ్యాకు లాక్రమణము లేదనుచున్నారనియు దొరగారు చెప్పిరి. నేనులేచి 'యీసభ్యులలో నాక్రమణము లేదన్నవా రెవ్వరు?' అని బిగ్గరగా నడిగితిని. సభ్యు లెవ్వరును మాటాడక మూకీభావ మును వహించిరి. 'ఇది యాక్రమణమయినందుకు సందేహము లేదు. నేను స్పష్టముగా నెఱుఁగుదును. మీ రేమని చెప్పెదరు?' అని యావల కాక్రమణము లేదన్నవారి నడిగితిని. వారిలోఁ గొందఱాక్రమణ మున్నయెడల తీసివేయింపవచ్చుననిరి; కొందఱేమియు పలుకక మౌన ముద్ర ధరించిరి. అంతట నరుగులు తీయించివేయవలసినదన్న సిద్ధా రణమును వ్రాసి చదివి, నీతిలేక యన్యాయపక్షము వహించెడు సభ్యు లను గర్హించుచు మెట్కాఫుగారు మాటాడిరి; ఆక్రమణమున్న ట్లాయన యావలకే నిశ్చయముగా నెఱుఁగును. వితంతువివాహాది విషయములలోఁ గొందఱు నాతో నేకీభవింపకపోయినను, లంచములు

పుచ్ఛుకోక న్యాయపక్షావలంబులయిన సభ్యులందఱును నన్ను నాయకునిగా నంగీకరించిరి. ఆక్రమణము తీసివేయవలసినదని నిర్ధారణము జరగినను, ఆ యాక్రమణమును తీసివేయుట గొప్ప కష్టముగా నుండెను. ఆరోగ్యపరీక్షకుఁడు (Sanitary Inspector) మొదలైన పారిశుద్ధ్యసంఘము వారిసేవకులు తామా యాక్రమణమును తీయించి వేయ లేమనియు, తామా యరుగు ముట్టుకొన్నపక్షమున తలబద్దలు కొట్టుదనని మామయ్య దుడ్డుకఱ్ఱ చేతఁబట్టుకొని యరుగుమీఁదఁ గూరుచుండి దరిచేరనీయక పోయెననియు సభవారికి విన్నపము పంపుకొనిరి. దానిపైని సభవా రాయాక్రమణమును తమసేవకుల సాహాయమున తీసి వేయించుటకు నన్ను నియమించిరి. నేను కొందఱి సేవకులతో గడ్డపాఱలు పాఱలు పట్టించుకొనిపోయి నే నెదుట నిలుచుండి యరుగు త్రవ్వించుట కారంభించితిని మామయ్య లోపలినుండి వెలుపలికివచ్చి నన్నుచూచి 'యధికారులే యిట్లు నిలుచుండి యిల్లు త్రవ్వించుచుండఁగా బక్కవాండ్రము మేమేమిచేయఁగలము ?' అని పలికి మరల లోపలికిఁబోయెను. నే నరుగు త్రవ్వించివేసి యింటికి పోయితిని.

ఈప్రధానరథ్యలోనే పడఁగొట్టబడిన యగసాలియింటి కెదుటవైపున కొంచెము దూరములో నొక స్థలమునుగొని దానిలో నిల్లు కట్టించుకొనుటకయి దానికిముందు రథ్యప్రక్కనున్న యేడడుగుల స్థలము తనకిమ్మని గుడిసేవ వెంకటరత్నముగారు పారిశుద్ధ్యసంఘము వారికి విన్నపము పంపిరి. ఆయన ధనవంతుఁడు చెల్లుబడి గలవాఁడును నగుటచేత నాయన విన్నపము విచారణవచ్చినప్పుడు సభ్యులలో ననేకు లాస్థలము నియ్యఁదలఁచి యెంత స్థలమియ్యవచ్చునో తెలుపుటకు నన్నును మఱియిద్దఱు సభ్యులను ఉపసంఘముగా నేర్పఱిచిరి. నేనా సభనుండియే వారి నిరువురను వెంటఁగొని యాస్థలమునకువచ్చి

చూచి, స్థలము వంకరగానున్నందున వంకర తీఱునట్లుదాని కొన నుండి సమరేఖగీచినచో రెండవకొన నేర్పడెడి యడుగున్నరస్థలమును మాత్రమే యియ్య వచ్చుననియు, రథ్యలప్రక్కల విశాలముగా స్థలముండుట యావశ్యకమనియు, ఈనడుమనే కొంచెము తావు కలుపుకొనవన్న హేతువుచేత బీదవాఁడైన కంసాలియిల్లు కొయించి యడుగులు త్రవ్వించిన మనము ధనికుఁడయిన యీయనకే న్యాయమునుబట్టి యిప్పు డధికస్థలము కలుపుకొననుజ్ఞ యియ్య వచ్చుననియు, చెప్పఁగా నాతోడిసభ్యులు నాతో నేకీభవించి నేను వ్రాసిన నివేదనపత్రముమీఁద వ్రాళ్లుచేసిరి. అప్పటికి చెంతనున్న వెంకటరత్నమునాయుఁడుగారు తాను ముందున్నస్థలము కలుపుకొని రథ్యప్రక్కను మేడకట్టుటకయి యేర్పాటుచేసికొని తదనుసారముగా యిల్లుకట్ట నారంభించితిమనియు, ఆస్థల మియ్యకపోయిన యెడల వేయఁబడిన పథకమంతయు చెడిపోయి విశేషనష్టము కలుగుననియు, ఏలాగునను నన్నుగ్రహించి యాస్థల మిప్పింపవలసినదనియు ప్రార్థించిరి. ఆయన వేఁడికోలుకు మొగమోటపడి నాతోడివా రిరువురును కొంచెము మెత్తపడిరిగాని నేనుమాత్రము దృఢముగానుండి స్థలమియ్య వలనుపడదనియు, మీస్థలములోనే మేడకట్టుకొనుట కేర్పాటుచేసికొనక పైస్థలము నపేక్షించినందువలనఁ గలిగెడు నష్టమును మీరు భరింపవలసినదేయనియు, మొగమోటపడక చెప్పివేసితిని. అందుమీఁద నాయఁడుగారు పారిశుద్ధ్య సభాధ్యక్షులయిన నాగోజీరావు పంతులుగారి యొద్దకుపోయి జరగిన సంగతి విన్నవించిరి. ఆయన సభనుండి యింటికిపోవుచుండఁగా మార్గమధ్యమున నెక్కిన బండియొక్క చక్రము విఱిగిపోయినందున, ఇంటికాయన నాయఁడు గారి బండిలోనే యెక్కి పోవలసినవారైరి. నాయఁడుగారి విన్నపమును విన్నమీఁదట దాక్షిణ్యపడి నాగోజీరావు పంతులుగారు నాటి సభవారియుద్దేశ మాస్థలము నాయఁడుగారి కియ్యవలయుటయేయనియు

మీ నివేదనపత్రము సభవారి యందుఁ బెట్టఁబడినప్పుడు వారిచ్చుట కంటె ముందుగా మీరే మాట దక్కించుకొనుట బాగుండుననియు, నాకుత్తరము వ్రాసిరి. సభవారెంత స్థలమియ్యవలెనో నిర్ణయించుటకు మాకధికారమిచ్చిరనియు, ఆనిర్ణయవిషయమున మాతీర్పే సునిశ్చిత మైనదిగా నుండవలెననియు, మాతీర్పే సభవారెట్లు మార్చెదరో చూచెదననియు, నేను ప్రత్యుత్తరమిచ్చితిని. దానిపైని నాగోజీరావు పంతులుగారితోఁ బెనఁగులాడిన ప్రయోజనము లేదని నాయఁడు గారితోఁ జెప్పివేయఁగా, ఆయన వెనుకకు జరపి మేడను తమస్థలము లోనే కట్టుకొనిరి. సభవారియనుమతినిపొంది నాయఁడుగారిప్పు డా స్థలములో మేడముందు పందిరి వేసికొనియున్నారు. న్యాయవిషయమున మొగమోటపడక మిత్రునిమాటనైనను నేను నిరాకరించుచుండెడి వాఁడను.

నాగోజీరావుపంతులుగారు పాఠశాలలపరీక్షకులయి రాజమహేంద్రవరము విడిచినప్పు డప్పటియుపకరగ్రాహి (Sub-Collector) యయిన హాల్మెట్టు దొరగారు పారిశుద్ధ్యసంఘాధ్యక్షత్వమునకై ప్రయత్నించిరి. మాశాస్త్రపాఠశాలలలోఁ బ్రధానోపాధ్యాయులైన మెట్కాఫుదొరగారును ద్వితీయోపాధ్యాయులైన సుందరరావుగారును, నేనును ముగ్గురము పారిశుద్ధ్యవిచారణసంఘములో సభ్యులముగా నుండెడివారము. కొంచెముకాలముక్రిందట నిన్నీసుపేట పాఠశాలలో నిచ్చిన యొక యుపన్యాసమునందు సుందరరావుగారు యూరపియనులను మిక్కిలి నిరసించుచు మాటాడిరి. అందుచేత నాతఁడు యూరపియనులను లక్ష్యముచేయని స్వతంత్ర బుద్ధిగలవాఁడని నేను భావించియుంటిని. ఒకనాఁడు మెట్కాఫు దొరగారు పారిశుద్ధ్యవిచారణసంఘాధ్యక్షత్వమునకు హాల్మెట్టుగారి పేరు నిర్దేశించుచు నొకకాగితముపై వ్రాసి దాని కనుమోదించి క్రింద వ్రాలుచేయుట

కయి నాయొద్దకుఁ దీసికొనివచ్చిరి. దొరతనమువారు స్థానికప్రభుత్వము నిచ్చుటవలనప్రయోజనము సభ్యులు స్వతంత్రముగాఁ బనిచేయుటలో ఉకనియు, దండనాధికారము గలవా రధ్యక్షులయినప్పుడు సభ్యులు స్వతంత్రులయి నిర్భయముగా వర్తించుట పొసఁగదనియు, అందుచేత సభ్యులు దండనాధికారము లేనివారిని యధ్యక్షునిగాఁ గోరుకొనుట నాయభిమతమనియు, కాఁబట్టి నేనిందులో వ్రాలుచేయక పోవుటయే కాక నియామకదినమునందు నేను వ్యతిరేకముగా మాటాడెదన నియుఁ జెప్పితిని. నేనన్నమాట తిరుగువాఁడను కానని యెఱిఁగినవా రయి నన్ను విడిచి దొరగారు కాగితమును సుందరరావుగారి యొద్దకుఁ దీసికొనిపోఁగా, ఆయనతన స్వాతంత్ర్యమును విడనాడి మాఱుమాటా డక వెంటనే దానిమీఁద వ్రాలుచేసెను. అధ్యక్షుని నియమించుకొను దినము వచ్చినప్పుడు సభలో దండవిధాయకుఁడైన హాస్మెట్టుదొర గారిని గోరుకొనక యధ్యక్షత్వమునకు వేఱొకనిని గోరుకొనవలసిన దని నేను చెప్పితినిగాని సభ్యు లుపకరగ్రాహిగారియభీష్టమునకు వ్యతి రేకముగా నడచునంతటి ధైర్యశాలులు కానందున వారినే యధ్యక్షు నిగాఁ గోరుకొనిరి. కరగ్రాహక కార్యములలోను దండనీతిప్రయోగ కార్యములలోను విశేషకాలము గడపవలసినందునను తఱుచుగా రాజకార్యవిషయమున గ్రామాంతరసంచారము చేయవలసినందునను పురపారిశుద్ధ్యవిచారణసంఘకార్యములలోఁ దగినంత శ్రద్ధచేయుట కవకాశము లేనివారయి హాస్మెట్టుదొరగారు పారిశుద్ధ్యసంఘవ్యవ హారములను చక్కఁబెట్టుటకయి తమపక్షమున నొక్క ప్రతినిధి నేర్పఱుపఁగోరి సభ్యులలో నట్టిపని కెవ్వరు సమర్థులని మెట్కాఫు దొరగారి నాలోచన యడిగిరి. వారు సుందరరావుగారిని పేర్కొనక నాపేరు చెప్పిరి. అందుమీఁద హాస్మెట్టుదొరగారు నన్నడుగఁగా నుద్యోగనియామకములు మొదలుగాగల సమస్తవిషయములలోను నాకు సర్వస్వాతంత్ర్యము నిచ్చినఁగాని నే నాపని నంగీకరింప నంటిని.

ఆయన నందున కొప్పఁగొని సభ్యులయనుమతితో దనయధికారముల నన్నిటిని నాకు సంక్రమింపఁజేసెను. నేను యథాశక్తిని పనిచేసి ముఖ్యవిషయములలో నెల్ల దొరగారితో నాలోచించి యాయన యంగీకారమును బడయుచు లంచములు మాన్పుటకును కార్యస్థాన వ్యవహారము లవిలంబముగాను యథాక్రమముగాను జరుపుటకు పన్నులవిషయమున మార్పులుచేసి యాదాయమును వృద్ధిపఱుచుట కును పాటుపడితిని. అంతకు బూర్వ మిండ్లపన్ను లెక్కువగా నుండ వలసినవారికిఁ దక్కువగాను తక్కువగా నుండవలసినవారి కెక్కువ గాను కట్టఁబడి యుండెను. నేను ప్రతిగృహమును తిరిగి చూచి తక్కువపన్ను లున్న కొందఱుధనికుల యిండ్లకు హెచ్చుచేసి యెక్కువ పన్ను లున్న కొందఱు బీదలయిండ్లకుఁ దగ్గించి యంగడివీథినున్న కొట్లపైని న్యాయమైన పన్నులు విధించి మొత్తముమీఁద పారిశుద్ధ్య సంఘమునకు ధనాగమ మెంతో హెచ్చునట్లు చేసితిని. సరిగా నెలకుఁ బదేసిరూపాయలును అంతకంటె నెక్కువగాను అద్దెలు వచ్చుచుండిన కొట్ల కావఱకు నెల కెనిమిదణాలద్దె రాఁదగినట్టు నిర్ణయించి కట్టిన పన్నులను పెంపుచేయుటచేత ముఖ్యముగా నీధనాగమము హెచ్చి నది. ఈపన్నుల విషయమయిన మార్పుచేసిన తరువాత వితంతు వివాహవిషయమున నాకుఁ బ్రతిపక్షులుగా నుండిన వైదికులు తమకుఁ బన్నులు హెచ్చుచేయఁబడునని భయపడితిమనియు నట్లు జరుగక కొన్నివిషయములలోఁ దగ్గింపఁబడి న్యాయముజరిగెననియు, దమతోఁ జెప్పి నన్ను శ్లాఘించిరని చల్లపల్లి రంగయ్య పంతులుగారు నాతోఁ జెప్పిరి. హాస్పిటుదొరగా రిచ్చటనుండి మార్పఁబడి వెళ్ళునున్న సమయమునందు 1836-వ సంవత్సరము 17వ సెప్టెంబరున నాకిట్లు వ్రాసిరి.

'I must tender you my sincere thanks for the assistance you have given me and the untiring energy you have displayed in connection with the Municipality during the last few months. I am convinced that you are the best man

to fill the post of Chairman, but you see a system of free election by ballot does not always result in the best men being returned, (గడచిన కొన్నిమాసములలోను పారిశుద్ధ్యవిచారణసంఘసంబంధమున మీరు నాకుఁజేసిన సాహాయ్యమునకును మీరు కనఁబఱిచిన విరామములేని శక్తికిని నాహృదయపూర్వకములైన వందనములను మీకు సమర్పింపవలసియున్నది. అధ్యక్షపదమును పొందుటకు మీరు ప్రశస్తులని నేను జాతనిశ్చయుఁడనయి యున్నాను కాని గుళికాపాతముచేత స్వతంత్రవరణము చేయుపద్ధతి యెల్లప్పుడు నుత్తమపురుషులే నియోగింపబడుటలోఁ బర్యవసింప దని మీరు కనుఁగొనుచున్నారు.)

ఈప్రకారముగా దొరగారిశ్లాఘనను పడసినంతమాత్రముచేత నెల్లవిషయములందును నే నాయన యిష్టానుసారముగా వర్తించుచుండినట్లు మీరు తలఁపఁగూడదు. కొన్నిసమయములం దాయన చెప్పినదానికిఁ బ్రత్యక్షవిరుద్ధముగాచేసి, మీరు చెప్పినది తప్పని నిర్భయముగా మొగముమీఁదనే యనెడివాఁడను. నావర్తనమువలన ముందురాఁగల ఫలములు లేశమును విచారింప స్వదేశీయుఁడైనను విదేశీయుఁడైనను హిందువైనను యూరపియనైనను లక్ష్యముచేయక నేను మంచిదనుకొన్నదానిని మొగముముందఱ ననివేయుటయు నిర్భయముగాఁ జేయుటయు తొందరస్వభావము నాకుఁగల లోపములలో నొకటి. ఈవేగిరపాటువలన మనవారిలోఁ గొందఱు నాకప్పుడప్పుడు ద్వేషులగుటయు సంభవించుచు వచ్చెను. అధ్యక్షులను కోరికొనుస్వాతంత్ర్య మియ్యఁబడుటకుఁ బూర్వము పురపారిశుద్ధ్య విచారణ సంఘములకు మండల కరగ్రాహు లధ్యక్షులుగాను, ఉపకరగ్రాహులు కొందఱైనవా రధ్యక్షప్రతినిధులుగాను, ఉంచుచు వచ్చిరి. రాజమహేంద్రపుర పరిపాలకసంఘమున కుపకరగ్రాహి యధ్యక్షప్రతినిధిగా నుండినకాలములో జరిగిన యొకసభలో విచారణీయములైన

ముఖ్యాంశము లనేకము లుండెను. కొన్ని యంశములు చర్చింపఁబడి నిర్ధారణములు చేయఁబడిన తరువాత నప్పటికే కాలాతీతమయి నందున దొరగారు నిర్ధారణముల పుస్తకములో వ్రాలుచేసి సభను విడిచి వెడలిపోయిరి. అప్పుడు మిగిలియున్న కొన్నియంశములనుగూడ నీసభలోనే చర్చించి నిర్ధారణములుచేసి మఱి యిండ్లకుఁబోదమని నేను సభ్యులతోఁ జెప్పితిని. కార్యస్థానకార్యనిర్వాహకుఁ డన్నినిర్ధారణములను దొరగారు చేసియేపోయిరని చెప్పెను. మాయభిప్రాయములను గైకొనకఁ దమమనసు వచ్చినట్లు నిర్ధారణములు వ్రాసిపోవుటకు దొరగారి కేమియధికారము కలదని నేను పలికితిని. సభ్యు లందఱును నేనన్నది న్యాయమని తలఁచినను దొరగారు చేసినదానిని మార్చుట కెవ్వరికిని చొరవలేకుండెను. సభవారియనుమతితో నేను సాహసించి యగ్రాసనాసీనత్వము వహించి, దొరగారు కోపపడుదురని కార్యనిర్వాహకుఁడు మొఱ్ఱపెట్టుచున్నను వినక మార్పవలసిన నిర్ధారణములను మార్చి వానిక్రింద నావ్రాలు చేసితిని. సభ ముగియఁగానే కార్యనిర్వాహకుఁడు నిర్ధారణముల పుస్తకమును తీసికొనిపోయి నేను చేసిన దుండగమును దొరగారికి విన్నవించి పుస్తకమును జూపెను. దొరగా రామార్పులనుజూచి మంచిదని పలికి పుస్తకమును మరల నిచ్చివేసెను. ఆయన కాలవిలంబమున కోర్వక యావఱకున్న యాచారమునుబట్టి తమకుఁ దోఁచిన నిర్ధారణములను వ్రాసిపోయిరే కాని యట్లు చేయుటలో వారికి లాభమేదియు లేదు. సభ్యులలో ననేకులు దొరగారియభిప్రాయ మేదో మాయభిప్రాయ మదేయని తలయూఁచువారే కాని తమస్వతంత్రతను చూపువారు కాకుండిరి. సభ్యులే యాలోచించి తమస్వతంత్రాభిప్రాయము నిచ్చువారయి రేని, అధికారులు వారిసాయమును సంతోషపూర్వకముగాఁ బొందుచుండెడివారే. స్వతంత్రించి నిర్భయముగా నధికారుల యభిప్రాయమునకు వ్యతిరేకముగాఁ దమ యభిప్రాయమును దెలుపలేని లోపము మన

వారియందే విశేషముగా నున్నది. దీనికి నిదర్శనముగా నొక్క సంగతిని చూపెదను.

నా దేహ మస్వస్థముగా నున్నందున రాజమహేంద్రవరములోనే జరగిన యొక తాలూకాసంఘ (Taluq Pcard) సభకు నేను పోలేక పోయితిని. సభ ముగిసిన తరువాతఁ గొందఱు సభ్యులు నన్ను చూడవచ్చిరి. ఏమేమి విశేషములు జరగినవని నేనడిగినమీఁదట వారిలోని విద్యాధికులే యొకరు దొరగారు మమ్మడిగి మా యభిప్రాయములను గైకొన్నారా యేమేమి నిర్ధారణములు చేసిరో మాకుఁ దెలియనిచ్చిరా యని నాకుత్తర మిచ్చిరి. అట్లు జరగనిచ్చుట మీఁదే తప్పిదమనిపలికి నేనూరకుంటిని. ఆపయినెలలో జరగిన సభలో వారు మొఱ్ఱపెట్టిన మోబర్లీ దొరగారే యగ్రాసనాసీనులయియుండిరి. ఒక విషయమున దొరగారికిని నాకును నభిప్రాయభేదము కలిగి కొంత వివాదము నడచెను. దొరగారు తమయభిప్రాయమును సభ్యులకుఁ దెలుఁగులో వివరించి తెలుపవలసినదని సభలోనున్న తహశీలుదార్లతోఁ జెప్పిరి. వారట్లు చేసినపిమ్మట దొరగారియభిప్రాయముపైఁ గల యాక్షేపణలను తెలుఁగులో నేను సభ్యులకుఁ దెలిపితిని. దొరగారు నేను చెప్పినదాని కుత్తరము చెప్పిరి; దానికి నేను ప్రత్యుత్తరము చెప్పితిని. ఈప్రకారముగాఁ గొన్నినిమిషములు నడచిన తరువాత దొరగారు తమపట్టును విడిచి నాయభిప్రాయప్రకారముగానే నిర్ధారణముచేసిరి. అంతటరువాత సభ్యులయొక్కయు ముఖ్యముగా నాయొక్కయు నభిప్రాయమును గైకొనకుండ నొక్క నిర్ధారణమునైనను దొరగారుచేయలేదు. ఒక్క పురపారిశుద్ధ్య విచారణసంఘ వ్యవహారములలోనే కాక తాలూకాసంఘ (Taluq Board) వ్యవహారములలోను మండలసంఘ (District Board) వ్యవహారములోను కూడ తగినంత శ్రద్ధచేయుచునే యుండెడివాఁడను. సభాధ్యక్షుఁడుగాని యధ్యక్షప్రతినిధిగాని రానప్పుడు నేనగ్రాసనాసీనత్వము వహిం

చుటయుఁ గలదు. 1888-వ సంవత్సరము మేయినెల 29-వ తేదిని జరగిన గోదావరీమండలసంఘము (District Board, Godavari) సభలో 15గురు సభ్యులుండి వారిలో నిరువురు తహశ్శీలుదారు లుండినను, అగ్రాసనాధిపత్యమునకు నన్ను నియమించిరి.

ఈసమయమునందు నేను రెండు పాఠశాలలకుఁ గార్యనిర్వాహక సంఘసభ్యుఁడనుగా నుండుటయేకాక యిన్నీసుపేట బాలికా పాఠశాలకుఁ గార్యనిర్వాహకుఁడనుగా నుంటిని. బాలకుల పాఠశాలలో వలె బాలికలపాఠశాలలో బాలికలు జీతము లియ్యకపోవుటచేత దానిని భరించుట యెక్కువ కష్టముగా నుండెను. ఈపాఠశాలను నేను చందాలు మూలమునను పురపారిశుద్ధ్యసంఘమువారును దొరతనమువారును వేఱువేఱుగా నిచ్చుసహాయద్రవ్యమువలనను భరించుచుంటిని. ఇట్లుండఁగా 1885-వ సంవత్సరము మార్చినెల 2-వ తేదిని రాజమహేంద్రవరపురపరిపాలకాధ్యక్షునియొద్దనుండి నాకీ క్రిందియుత్తరము వచ్చినది. —

'In their order No. 292 dated 19th February 1885 reviewing the budget of the Rajahmundry Municipality for the year 1885—86, the Govt. have disallowed the payment of salary grant to your school for next year from the Municipal funds and said that salary grant to Girls' School will, under G. O. No. 206 dated 31st January 1885, be paid in future from Provincial funds I have therefore the honour to inform you that no salary grants will be paid to your school from the commencement of the next official year to the Municipal funds.' (1885-86, సంవత్సరమునకు రాజమహేంద్రపుర పరిపాలక సంఘముయొక్క యాదాయవ్యయ గణపట్టి కనువిమర్శించుచు 1885-వ సంవత్సరము 12-వ ఫిబ్రవరి 292-వ సంఖ్యగల తమయుత్తరువులో దొరతనమువారు మీపాఠశాలకు నగర పారిశుద్ధ్యవిచారణసంఘమువారి ధనములోనుండి జీతములసహాయ ద్రవ్యము నిచ్చుటను నిషేధించి, బాలికాపాఠశాలలకు జీతముల సహా

...ధనము 1885-వ సంవత్సరము జనవరు 31-వ తేది 206 సంఖ్య గల దొరతనమువారి యుత్తరువునుబట్టి యిఁకముందు రాష్ట్రీయధన ములోనుండి యియ్యఁబడునని చెప్పియున్నారు. కాఁబట్టి వయి వ్యావ హారిక సంవత్సరారంభమునుండి పురపరిపాలకసంఘధనములలోనుండి మీపాఠశాలకు జీతములసహాయద్రవ్య మియ్యఁబడదని నేను మీకుఁ దెలియఁజేయుచున్నాను.)

ఈయుత్తరము వచ్చిన శీఘ్రకాలములోనే చెన్నపురిరాజధానీ విద్యావిచారణకర్తగారు రాజమహేంద్రవరమునకు వచ్చుట తటస్థిం పఁగా, నే నాయునను కలిసికొని మాపాఠశాలవిషయమై మాటాడి యాయనచేత బలముగా మాబాలికాపాఠశాల కనుకూలముగా వ్రాయించినమీఁదట దొరతనమువారు విశేషవిషయముగా మాపుర పరిపాలకసంఘధనములోనుండి యథాపూర్వముగా సహాయధన మిచ్చున ట్లుత్తరువు చేసిరి. నాకు మొదటినుండియు స్త్రీవిద్యయందధి కాభిమానము. స్త్రీలస్థితి బాగుపడినఁగాని దేశము బాగుపడదని నావమ్మకము. ఇట్లు బాలికాపాఠశాల స్థిరపడినపిమ్మట వారవార ముగ ప్రకటింపఁబడు వివేకవర్ధని తోడిపాటుగా సతీహితబోధినియను స్త్రీల కుపయోగించు మాసపత్రిక నొకదానిని మూఁడుసంవత్సరములు నడపి స్త్రీలనిమిత్తమయి సత్యవతీచరిత్రము, చంద్రమతీచరిత్రము, సత్యసంజీవని, పత్నీహితసూచని, దేహారోగ్యధర్మబోధిని మొదలగు పుస్తకములను రచించితిని. ఈసమయమునందు మాయూరిప్రార్థన సమాజమునందు వారవారమును జరగెడు సభలలో నేను తఱచుగా ధర్మోపన్యాసములు చేయుచుండెడివాఁడను. 1881-90 సంవత్సరము లకు నడుమను పైనిజెప్పిన పుస్తకములనుగాక చమత్కార రత్నా వళి, రాగమంజరినాటకముల నింగ్లీషునుండియు రత్నావళీ మాళవి కాగ్నిమిత్రనాటకములను సంస్కృతమునుండియు తెలిఁగించి, ప్రహ్లాద

నాటకము, దక్షిణగోగ్రహణము, సత్యహరిశ్చంద్రనాటకము అను రూపకములను, కొన్ని నాటకకథలను, ప్రహసనములను, ఆంధ్రకవుల చరిత్రమును రచించితిని. ఇవిగాక వితంతువివాహవిషయమునను, ఇతరవిషయములను, పెక్కుపన్యాసములు వ్రాసి ప్రచురించితిని; పూర్వకవిప్రణీతగ్రంథములను కొన్నిటిని సంస్కరించి ప్రకటించితిని.

ఆకాలమునందు మాపట్టణములో బాలురవిద్య యత్యధమస్థితియం దుండెను. సునిర్మితములయిన సభలయొక్క పాలనము క్రిందనుండి చక్కగా నడపఁబడుచుండిన రెండుపాఠశాలలకును పోటీగా ధనార్జనాభిలాషచేతను కీర్తికామిత్వముచేతను కొందఱు బుద్ధిమంతులు నీతిమతధర్మబోధన మొనర్చెదమనియు సద్విద్య గఱపెదమనియు సులభజ్ఞానదానముచే బీదల కుపకారము చేసెదమనియుఁ బలుమిషలు పెట్టి యాస్తికపాఠశాలయనియు మహారాష్ట్రపాఠశాలయనియు స్వదేశాభిమానిపాఠశాలయనియు పెద్దపెద్ద పేరులుపెట్టి క్రొత్తక్రొత్త పాఠశాలలను పెట్ట మొదలుపెట్టిరి. ఇట్టి పాఠశాలలకెల్ల మొట్టమొదట దారి చూపినది నేతిబీరకాయవలె సార్థకనామము వహించిన యాస్తికపాఠశాల. ఈనూతనపాఠశాలల పోషణమునకయి నిధిలేదు, చందాలు లేవు, దానధనములేదు. ఉపాధ్యాయుల జీతములకు విద్యార్థు లిచ్చెడు నెలజీతములే యాధారము. ఇతర సుస్థిరపాఠశాలలనుండి విద్యార్థులను సాధ్యమైనంత యెక్కువమందిని తమపాఠశాలల కాకర్షించుటకయి పన్నిన యుపాయములు విద్యార్థులవలన తక్కువ జీతములను గ్రహించుట, తోడిబాలుర నెక్కువమందిని తెచ్చిన వారివలన జీతములు గైకొనకుండుట, బాలురను తగని తరగతులలోఁ జేర్చుకొనుట మొదలైనవి. బాలురవలన గ్రహించెడివి క్రమముగా గైకొనవలసినవానిలో నర్ధాంశమును చతుర్థాంశమును అష్ట

మాంశమును షోడశాంశమును మాత్రమే యుండినను ప్రకటితము లగు లెక్కలలో నిందు మొత్తములను, గుప్తములగు లెక్కలలో నిజమైన మొత్తములను, వేసికొని, వచ్చినసొమ్ములోఁ గార్యనిర్వాహకుని భాగము పోఁగా మిగిలినదాని నుపాధ్యాయులు వంతులవరుసను బంచుకొనుచుండిరి; ఉపాధ్యాయులకు ముట్టెడు మాసవేతనము లెనిమిదులును పదులును పదునైదులును మాత్రమే యయినను, ఇరువదులును ముప్పదులును నలువదులును ఏఁబదులును నైనట్టు లెక్కలలోఁ జూపఁబడి వానివలన నా పెద్దమొత్తముల కాదానికలు గైకొనఁబడుచుండెను; ఈపెద్దపెద్ద జీతముల నిచ్చుటకయి కార్యనిర్వాహకులు తమచేతిసొమ్మును వ్యయపెట్టుచున్నట్టు చూపి దొరతనమువారివలన సహాయద్రవ్యముగా విశేషవిత్తము గైకొనఁబడుచుండెను. ఇట్టి యనుచితకార్యములచేత నుపాధ్యాయులే నీతిమాలినవా రయినప్పుడు వారిశిష్యులైన విద్యార్థులేమి నీతిమంతు లగుదురు? ఇట్టి కుతంత్రప్రయోగమువలన నీతినిమాత్రమే కాక విద్యనుసహితము విద్యార్థులు కోలుపోవుచుండిరి. ఇవి యన్నియు సర్వజనవిదితములైన బహిరంగరహస్యములే యైనను వానిని స్థాపించుటమాత్రము దుర్ఘటము. ఈ విధమున విద్యకును నీతికిని నీళ్ళు విడుచుచున్న విద్యార్థులకంటె వారిసంరక్షకులలో నధికసంఖ్యాకు లెక్కువ వివేకులు కాకుండిరి. వారు తమబాలురను క్రమశిక్షగల పాఠశాలలకుఁ బంపక యెక్కడ తక్కువజీతములు చేకొనఁబడునో యెక్కడ బాలు రెక్కువతరగతులలోఁ జేర్చుకొనఁ బడుదురో యక్కడికే తమసంరక్ష్యులను బంపుచుండిరి. అందుచేత నిప్పుడు మాపట్టణములోని విద్యయొక్కయు విద్యార్థులయొక్కయు స్థితి దుస్థితికివచ్చి శోచనీయమైనదిగా నుండెను. కాఁబట్టి విద్యాభివృద్ధిని గోరువారికిని దేశాభిమానముగలవారికిని బాలుర నీతిపరులఁ గావింపఁ గాంక్షించువారికిని విద్యమానదుస్థితిని

తొలఁగించి సుస్థితిని నెలకొల్పఁబూనుట యనివార్యధర్మమయి యుండెను. అప్పటివిద్యావిషయకవిధు లిప్పటివలెఁ గఠినములుగాక యవ్యవస్థితములై యుండినందున విగతధార్మిక విద్యాలయములను లయము నొందించుట ఋజుమార్గవర్తనులకు శక్యము కాకుండెను. అందుచేత పాఠశాలాకార్యనిర్వాహకసంఘమున కధ్యక్షులయిన మెట్కాఫుదొరగారును సంఘసభ్యులయిన యస్మదాదులును ఏవిధముచేతనైనను పాఠశాలల నన్నిటి నొక్కటిగాఁ జేర్చి యొక్కకార్యనిర్వాహకసంఘముయొక్క యధికారముక్రిందికిఁ దెచ్చి విద్యను బాగుచేయవలెనని నిశ్చయించుకొని, ప్రతిపక్షపాఠశాలలవారు కోరిన నియమములనే యంగీకరించి, వారు చెప్పిన జీతములమీఁద వారిపాఠశాలలలోని యుపాధ్యాయులఁ దీసికొనుట కొప్పుకొని, వారిపాఠశాలాధికారి యైన రేలూరి లక్ష్మీనరసింహముగారినే ప్రధానోపాధ్యాయపదమునందు నిలిపి, పాఠశాలలనన్నిటి నొక్కటిగాఁ గలిపి యొక్కసభవారి కార్యనిర్వాహకత్వమునకు లోఁబఱుపఁ గలిగితిమి.

ఇట్లు కలుపఁబడిన యీనూతనోన్నతపాఠశాలనిమిత్తము మందిరము కట్టుటకై పట్టణమధ్యమునం దొకవిశాలస్థలమును బేరమాడి క్రయనిర్ణయముఁ జేసికొనుటకు సంసిద్ధులమయి యుంటిమి. ఇటువంటి మంచిస్థలము సులభక్రయమునకుఁ బోవుచున్నదని తెలిసికొని, దానిని తాను సంపాదింపవలెనని నిశ్చయించుకొని, మాసీమకుఁ దహశ్శీలుదారుఁడుగా నున్న బుద్ధిమంతుఁడు తక్షణమే యాక్షేత్రస్వామిని తనయొద్దకుఁ బిలిపించుకొని, ఆభూమిని తనవారిపేర వ్రాయించుకొనెను. ఆయన శక్తిసామర్థ్యాదుల నెఱిఁగిన మావారందఱును చేతఁజిక్కిన స్థలము పోయినదని విచారించుచు నిరాశులయి, యటువంటిప్రబుద్ధుని హస్తగతమైన భూమియొక్క పునరావాప్తియసాధ్యమని భావించి, ఉత్తరకర్తవ్యమును నాకు విడిచిపెట్టి యూరకుండిరి. పోయిన భూమిని మరల రాఁబట్టుటకయి యుపాయము నాలోచించి

నే నుపకరగ్రాహిగారియొద్దకుఁబోయి మాటాడి యాయనచేతనొత్తుడు కలిగించి పులినోటఁ బట్టి గోవును విడిపించి తెచ్చిన ట్లా నేలను మరల పాఠశాలాకార్యనిర్వాహకసంఘమువారి యధీనమగునట్లు చేసితిని. ఇప్పుడు బోధనకళాశాలాభవనము కట్టబడియున్న స్థల మిదియే.

దుర్బలశరీరుఁడనయ్యు వ్యాధిబాధితుఁడనయ్యు నప్పు డిన్నివిధముల పాటుపడఁగలిగిన నే నిప్పుడు తొంటిజవసత్వములను గోలుపోయి కోరిక లెప్పటివలెనే యున్నను కార్యములకు సమర్థుఁడను గాక యున్న నాప్రస్తుతావస్థను దలఁచుకొనఁగా, పూర్వపుపీఠశరీరింగముగాక తచ్ఛాయావిగ్రహముమాత్రయే నిలిచి యున్నదేమో యన్నట్టుఁ దోచుచున్నది. తొల్లిటిక్రియాశక్తిలోఁ గొంతయయినను నా కీశ్వరుఁడు మరలఁ బ్రసాదించునుగాక !

ఇన్నివిషయములలో నే నత్యంతోత్సాహముతోఁ బని చేయుచుండినకాలములో నాయుత్సాహమునకు భంగకరమైన వైపరీత్యమొకటి తటస్థించెను. మిత్రభావముతోనే కాక గురుభావముతోనేను చెప్పినదాని నెల్ల శిరసావహించి చేయుచు, నాకు కుడిభుజమైయుండి నేను పూనిన సమస్తసత్కార్యములలోను తోడుపడుచు, స్వభావదుర్బలుఁడనైన నన్ను శ్రమపడకుండ సదా కంటిని రెప్పవలెఁ గాచుచు వాగ్దానములు చేసినవారును ప్రతిజ్ఞలు పలికినవారును అందఱును విడిచినను తానుమాత్రము నన్ను విడువకుండిన బసవరాజు గవర్రాజుగా రాకస్మికముగా 1888 వ సంవత్సరము జూలయినెల 16 వ తేదిని లోకాంతరగతు లయిరి. అటువంటి సుగుణనిధియైన మిత్రరత్నమురొక్క మరణముతో నా కావఱకున్న కార్యోత్సాహము సగము తగ్గిపోయినది. సదా రోగపీడితుఁడ నగుచుండిన నేను చిరకాలముజీవింపననియు, నేను పూనిన మహాకార్యమును నాయనంతరమునం దాయన ధైర్యోత్సాహములతో నిర్వహించుననియు, నేను దృఢముగా నమ్మి

యుంటిని. అట్టి నాయాశ యకాలవినాశము నొందఁగా నేను విరక్తుఁడనయి, పురపరిపాలకసంఘములోను స్థానికనిధిసంఘములలోను నాసభ్యత్వములకుఁ బరిత్యాగపత్రికలను బంపి తదధ్యక్షులు నన్ను విడువనొల్లకున్నను వలదని యాపనులెల్ల నొక్కమాఱుగా మానుకొంటిని. గవర్రాజుగారు తనమరణమునకు నాలుగయిదుమాసములకు ముందొకనాఁడు నాయొద్దకువచ్చి నాజీవచరిత్రమును వ్రాయుటకయి సాధనముల నిమ్మని నన్నడిగెను; నేనాయనను నిరుత్సాహపఱిచి యిప్పు డాప్రయత్నమును మాని నామరణానంతరమున నేమైన వ్రాయఁదగియుండినచో వ్రాయవచ్చునని చెప్పితిని. ఈసంభాషణము జరిగిన కొన్నిమాసములలోనే నాజీవచరిత్రమును వ్రాయనెంచిన మిత్రునిజీవచరిత్రమును నేనే యాయనస్మృతిని శాశ్వతపఱుచుటకయి చేయఁబడిన పురమహాజనుల సభలో వ్రాసి చదువవలసినవాఁడనైతిని. నేను వ్రాసిన సంక్షేపచరిత్రమువలన నీమహాపురుషుని గుణసంపద కొంతవఱకు తేటపడవచ్చును. ఈయనస్మృతిస్థిరీకరణార్థమయి దాదాపుగా మున్నూఱురూపాయలు చందాలు వేయఁబడినవి; వేసినవారిలోఁ గొందఱు తక్క మిగిలినవారందఱును తాము వేసిన చందాలను సంతోషపూర్వకముగా నిచ్చిరి. వచ్చిన సొమ్ముతో నాది కొంతచేర్చి మున్నూటయేబదిరూపాయలకు నిజరూపపరిమాణముగల చిత్రాకృతిని వ్రాయించి రాజమహేంద్రపురమందిరమునందుఁ బెట్టించితిని. ఎవరివలన మదుద్దిష్టకార్యనిరంతరవ్యాప్తియు లోకోపకారమును కలుగునని నే నాశ పడియుంటినో యట్టివారిలో నకాలమరణము నొందుట కీయన ప్రథములు; ఈయన యనంతరము నాతరువాత నిరంతరాయముగా నత్యంతోత్సాహముతో లోకోపకారకార్యమును నడుపుదురని నేను ప్రతీక్షించిన రెండవవారగు సత్తిరాజు మృత్యుంజయరావుగారును వీరివలెనే యకాలమరణమునంది నాయా

శకు భంగము కలిగించిరి; ఆరంభింపఁబడిన సత్కార్యము నవిచ్ఛిన్నముగా జరపి లోకమునకు మేలు చేయుదురని నే నాశ పడిన కడపటివారయిన దేశిరాజు పెదబాపయ్యగారును పై యిరువురివలెనే యకాలమృత్యుదేవతవాతం బడిరి. వీరు మువ్వురును పట్టపరీక్షాసిద్ధులు; దేశాభిమానమాననీయులు; సత్కార్యానుష్ఠానదీక్షాపరులు; స్వార్థపరిత్యాగులు; పరోపకారరతులు; తాము సత్యము లని నమ్మిన వాని నాచరణమునకుఁ దెచ్చుటయం దుత్సాహమును ధైర్యసాహసములును కలిగిన కార్యశూరులు. వీరు మువ్వురును యౌవన మధ్యమున స్వకృత్యాచరణారంభదశలోనే స్వర్గస్థులయిరి. ఈలోకములో మంచిపదార్థములు చిరకాలముండవు కాఁబోలును! ఆహా! ఈశ్వరేచ్ఛావిచిత్రప్రభావముల నెవ్వరు గ్రహింపఁగలరు!

# సంపాదకీయ భూమిక

శ్రీరావు బహదూరు కందుకూరి వీరేశలింగము పంతులు గారి స్వీయచరిత్రలోని మొదటిభాగమును 1911 సంవత్సరములో, బ్రకటించి యున్నాము. అప్పటినుండి ప్రయత్నించుచున్నను, అనివార్యములగు కొన్ని కారణములచేత, రెండవభాగమును, ఇంతవఱకును బ్రకటింపఁ జాలమైతిమి.

ప్రథమసంపుటము వెలువడినప్పటినుండియు వారికి శరీరారోగ్యము చక్కఁగా లేకున్నను, అధికశ్రమలకోర్చి, దీనిని రచించి మాయుద్యమమునకుఁ బ్రోత్సాహముఁ గలిగించినందులకు వారికి మాకృతజ్ఞతాపూర్వకవందనముల నర్పించుచున్నాము.

గ్రంథమునందు సమకాలికులగు ననేకులంగూర్చి సందర్భానుసారముగ పంతులువారు, ఒక్కొకచో భూషించుచు ఒక్కొకచో దూషించుచును వ్రాసియున్నారు. స్వీయచరిత్రమువంటి గ్రంథమునందు, ఇట్టి దూషణభూషణము లుండుట వింతకాదు. అట్లు కానియెడల స్వీయచరిత్రము, స్వభావమైన యథార్థచరిత్ర కాఁజాలదు. కొన్నియెడలఁ బంతులువారికిని, మాకును అభిప్రాయభేదములున్నను గ్రంథరచనాస్వాతంత్ర్యము సంపూర్ణముగా వారిదియే యగుటచే వ్రాసినది వ్రాసినట్లు ప్రకటించితిమి.

మనసాంఘికవిషయము లనేకము లీగ్రంథమునందుఁ జర్చింపఁబడినవి. ఒక సంఘమునందలి మంచిచెడుగుల రెంటిని దెలిసికొనిననే తప్ప సంఘాభివృద్ధి కనువగు ప్రయత్నములఁ జేయ వీలుండదు. కావున నాంధ్రమహాజను లీ స్వీయచరిత్ర నాదరించుచు సంఘమునందలి గుణదోషములను గ్రహింతురుగాక యని కోరుచున్నాము.

చింతాద్రిపేట.<br>ఏప్రిలు 24-1915,

ఇట్లు విధేయుఁడు,<br>సంపాదకుఁడు.<br>విజ్ఞానచంద్రికామండలి.

# అవతారిక

ఈ స్వీయచరిత్రముయొక్క ద్వితీయభాగములోని మొదటి ప్రకరణము విశేషభాగము 1910–వ సంవత్సరము జూన్ నెలలో నాభార్య సజీవురాలయి యుండఁగా బెంగుళూరిలో వ్రాయఁబడినది. మిగిలిన భాగమునంతను 1913–వ సంవత్సరము వేసవికాలములో నేను బెంగుళూరికి వెళ్లినప్పుడు మెయి జూను నెలలలో వ్రాసితిని. 1912–వ సంవత్సరము డిశంబరునెల మొదలుకొని 1913–వ సంవత్సరము ఏప్రిల్ నెలవఱకును స్థానికపత్రికలలో రెంటిలో నాకు విరోధముగాఁ గొన్ని యారోపణములు చేయఁబడినందున, ఆవిషయమున నాలుగవప్రకరణములోఁ గొంత వ్రాసితిని గాని తరువాత నేత్రప్రకటనవిషయమున ధర్మస్థానములలో, దండశాఖలోను, వ్యవహారశాఖలోను, కొన్ని యభియోగము లారంభమయి యిది ముద్రింపఁ బడుచుండినప్పుడు ముగియకుండుటను వ్యవహారమధ్యమున దానిని ప్రకటించుట యుచితము కాదని నిలిపివేయ వలసినవాఁడ నైతిని. పుస్తక మంతయు నేకసంపుటముగా ముద్రింపఁ బడునప్పుడు తద్విషయమయి మఱియొకప్రకరణము చేర్పఁబడును. నా కిప్పు డఱువదియేఁడేండ్లు నిండి యఱువదియెనిమిదవయేఁడు ప్రారంభమయినది. ఏండ్లు గడచినకొలఁదిని నా కంతకంతకు దేహదార్ఢ్యమును, ధారణాసామర్థ్యమును తగ్గిపోవుచున్నవి. ఇటువంటి యవస్థలో నీ స్వీయచరిత్రములో భ్రమప్రమాదాదులవలనఁ గలిగిన దోషములేవేని పడినచో మహాజనులుపేక్షించి క్షమింతురు గాక !

రాజమహేంద్రవరము
1వ ఏప్రిల్ 1915-వసం

కందుకూరి వీరేశలింగము

# స్వీయ చరిత్రము

## రెండవ భాగము

### మొదటి ప్రకరణము

**పురమందిరాదిక నిర్మాణదశ. (1890 మొదలు 1900 వఱకు)**

1879 వ సంవత్సరమునందు వితంతువివాహవిషయమున నే నియ్యదలఁచుకొన్న కొన్ని యుపన్యాసములకుఁ దావొకపట్టున లభింపకపోయినప్పటినుండియు సర్వజనులకు నుపయోగపడెడి యుపన్యాస సభాభవన మొకటి పట్టణమున నుండిన బాగుండుననుగదా యన్న సంకల్పములోఁ దత్సిద్ధి యెట్లు కలుగునా యని యాలోచించుచుంటిని. మా యుత్తరమండలములలోఁ గొంతకాలము పాఠశాలాపరీక్షకులుగా నుండినట్టియు, తెలుఁగుదేశముపయి నధికాభిమానము కలవారయి యుత్తరమండలమునుండి పట్టపరీక్షయందును తదనుభావమునఁ బ్రథమ శాస్త్ర పరీక్షయందును కృతార్థతను బొందినవారిలో నగ్రస్థానమును బడసినవారి కేఁటేఁట బంగారుపతకము నిచ్చుట కేర్పాటుచేసినట్టియు, తరువాత చెన్నపురిరాజధానిలోని పాఠశాలల కెల్ల విద్యావిచారణకర్తయయి యుపకారవేతనమును బడయనున్నట్టియుకర్నల్ మక్డొనల్డుగారిపేర రాజమహేంద్రవరములోఁ బట్టణమందిరమును కట్టింపవలెనని 1880 వ సంవత్సరములోఁ బ్రయత్నించితిని. ఆ సంవత్సర మాగష్టునెల 15 వ తేదిని జరగిన పురజనులసభలో మక్డొనల్డు దొరగారిపేర పురమందిరము కట్టింప నిశ్చయింపఁబడి, చందాలు పోగుచేయుటకయి యేర్పాటుపఁబడిన సభకు నేను కార్యదర్శిగా నియమింపఁబడితిని. కాగితముమీఁద నేనూఱు రూపాయలవరకు చందాలు పడినను చాలినంతధనము వచ్చుజాడ కానరానందున నప్పటి నాకృషి సఫలమయినదికాదు. అయినను నేను నా యుద్యమము నంతటితో

విడిచిపెట్టక పట్టణమందిరనిర్మాణమునకై యీ పురమధ్యమున ధర్మవై ద్యాలయవీధియం దొక స్థలమును దామరాజు నాగరాజుగారి పేర కొని యుంచి, శ్రీ విక్టోరియామహారాజ్ఞిగారి జూబిలీమహోత్సవసందర్భ మున 1887 వ సంవత్సరమున చందాలుచేర్చి పురమందిరమును కట్టింపవలెనని మరల ప్రయత్నముచేసి యొకసభఁగూర్చితిని. పుర మందిర నిర్మాణార్థమయి శ్రీ పిఠాపురి రాజుగారు వేయిరూపాయలను దయచేసిరి; చందాలమూలమున నయిదారునూరులు పోఁగయినవి. మందిర నిర్మితికయి పలుమారులు సభలు చేయఁబడుచు వచ్చినవి. ఈసభలలోఁ బట్టుమని పదిరూపాయలియ్యసాహసింపని యుదారపురు షులు నేను కష్టపడి తిరిగి వ్రాయించితెచ్చిన భవనాకృతిలో లోపము లెంచుచు లక్షరూపాయలు వ్యయపెట్టి దివ్యభవనము కట్టింపవలెనని కొందఱును, నేను కొన్నస్థలము బాగులేదని దోషములెన్నుచు జనో ద్యానముగా నుపయోగింపఁదగిన సుందరవిశాలస్థలమును పురమధ్య మున సంపాదింపవలెనని కొందఱును, ఆచరణసాధ్యములుకాని చిత్ర విచిత్రాభిప్రాయముల నియ్యఁజొచ్చిరి. ఈప్రకారముగా రెండుసంవ త్సరములు సభలు జరిపినపిమ్మట వృథాకాలహరణమగుట తప్ప నిట్టి సభలవలనఁగార్యము కలుగఁబోదని నేను తలఁచి, ఒకనాఁటి పుర మహాజనులసభలో నాయభిప్రాయము వెల్లడించి 1889 వ సంవత్స రము మార్చి నెల 26 వ తేదిని ముద్రితమైన యీ క్రిందిలేఖను చందాదారులకుఁ బంపితిని.—

"Sir, I beg to inform you that, from my experience of the last ten years during which I have been working to secure a public hall for our town, I have had ample reasons to believe that there are no chances of our Town Hall ever coming into existence by means of public subscriptions and that I have therefore made up my mind to have the Hall built at my own expense (indipendantly of public subscriptions) in the site opposite to the Town School by the Hospi-

tal Road which I already purchased with my own money for the purpose. I am now prepared to devote the sale proceeds of my books and any remunerations that I may get in case of my being made an examiner in connection with University or other examinations, to the construction of the Town Hall for the speedy completion of which I intend raising loans. After completion of the building and discharge of all the debts contracted for this purpose, I will hand over the building for use of the Rajahmundry, public to committee of respectable townsmen, reserving to myself the right of using the Hall for my lectures and weekly, fornightly or monthly meetings organized by me in preference to those of others who may wish to have their lectures and meeting on the same day and at the same time. But I now promise that I will gladly place the Hall at the disposal of the Rajahmundry public without claiming any right whatever for myself, if any gentlemen come forward to pay me all the moneys I spend and the debts I contract for the construction of the Hall on the condition of placing the Hall in charge of a committee consisting of at least half a dozen respectable townsmen for the use of the Rajahmundry public without distinction of caste or creed. I gave out my intentions to the audience of a public meeting held on Sunday last in the Vizianagaram Maharajah's Girl's School to the same effect.

ఇదివరకు ఐదుసంవత్సరాలనుంచి చేస్తూవున్న ప్రయత్నములనుబట్టి చూడగా చందాలమూలంగా శీఘ్రకాలంలో టవున్‌హాలు కట్టించడం సాధ్యమయ్యేటట్టు నాకు కనపడడంలేదు. అందుచేత యేవిధమైన కమిటీలతోటిన్నీ చందాలతోటిన్నీ సంబంధం లేకుండా నేనే స్వయంగా ఆపనికి పూనుకోవడానికి నిశ్చయించుకొన్నాను. ఆసుపత్రివీధిని టవున్‌స్కూలు కెదురుగా నాళమువారిస్థలమునకు ప్రక్కను నేను దామరాజు నాగరాజుగారివద్ద టవునుహాలు నిమిత్తం నాస్వంత సొమ్ముతో కొన్నస్థలంలో కొంతసొమ్ము బదులుచేసిన్నీ, నాపుస్తకాల అమ్మకమువల్లనున్నూ నేను యెప్పుడైనా యేపరీక్షలోనైనా యెగ్జామినరు కావడం తటస్థించేపక్షమున దానివల్లనున్నూ వచ్చే

సొమ్మును పెట్టినన్ని టవునుహాలు కట్టించి, నేనప్పుడప్పుడు ఇచ్చే వుపన్యాసములకున్ను వారానికి ఒకసారిగాని పక్షానికైనా నెలకైనా ఒకసారిగాని నేను యేర్పరచబోయే సభలకున్ను అడ్డము రాకుండావుండే పద్ధతిమీద దానిమీదవుండే బాకీలన్ని తీరినతరువాత తగిన కట్టుదిట్టములతో నొకకమిటీని యేర్పరచి యీపురమహాజనుల యుపయోగమునిమిత్తమై హాలును వారి అధీనముచెయ్య నుద్దేశించుకొన్నాను. ఈలోపుగా యెవరైనా తగు మనుష్యులు టవునుహాలునిమిత్తమై నేను చేసిన ఋణములనున్ను నేను ఖర్చుపెట్టిన సొమ్మునున్ను నాకిచ్చివేసి, యీ మందిరమును జాతిమతభేదములు లేకుండా పురజనుల కందరకీ యుపయోగపడేలాగున అధమం ఆరుగురు పెద్దమనుష్యులకుం దక్కు-వగాకుండా యుండే కమిటీవారివశంలో నుంచడానికి పూచీపడేయెడల, యేవిధమైన స్వాతంత్ర్యములనున్ను నేను కోరకుండా యీ హాలున్ను స్థలమున్ను నేను వారిస్వాధీనము చెయ్యగలవాడను. కాబట్టి యీ సంగతులను మీకు విశదపరచినాను. ఈసంగతులనే మొన్న ఆదివారమునాడు విజయనగరము మహారాజులంగారి బాలికాపాఠశాలలో జరగిన పబ్లికు మీటింగులో సభికులకు విన్నవించి యున్నాను.

I beg to remain, Sir,

Rajahmundry,
26th March 1889, Tuesday.

Yours faithfully,
K. VEERASALINGAM."

ఈప్రకారముగా సభతోడి సంబంధమును వదల్చుకొని రెండు మూడువేల రూపాయలతో నొక చిన్నమందిరమును కట్టింపవలెనని పని కారంభించితిని. ఇంతకు ముందును మిత్రభావముతో నాకుఁ గావలసినప్పుడెల్లను వడ్డిలేక బదులిచ్చుచుండినట్లే యీపురమందిరము కొరకును న్యాపతి సుబ్బారావు పంతులుగారు నా కేనూఱు రూపాయలు బదులిచ్చిరి; నా శిష్యుఁడైన యింకొక మిత్రుఁడు డజ్జరపు వీరయ్యగారు రెండు సంవత్సరములలోఁ దీర్చుపద్ధతిమీఁద నన్నూఱు రూపా

యలను వడ్డి లేకుండ బదు లిచ్చిరి. ఈ రు. 900 ల తోను నావద్ద నున్న రూపాయలతోను ఇటుకలు కఱ్ఱలు మొదలయినవి సాధ్యమైనంత చౌకగాఁ గొనుచు పనివాండ్రను బెట్టి నేనే యొద్దనుండి పని చేయించు చుంటిని. ఈ విషయములో నా కీశ్వరసాహాయ్యము ముఖ్యముగా ననుగ్రహింపఁబడినది. క్రిందటిసంవత్సర మేనూఱు రూపాయల పుస్తకములే నావి యమ్ముడు పోయినను పనికిఁబూనిన యీ సంవత్సరమునందుఁ బుస్తకవిక్రయమువలన వేయిరూపాయిలకంటె నధికముగా వచ్చినవి; నేను కోరకయే యీ సంవత్సరమున నన్ను సర్వకలాశాల వారు పరీక్షకునిగా నియమించిరి; చెన్నరాజధానీ విద్యావిచారణకర్త గారు నన్ను మధ్యమపాఠశాలా పరీక్షకునిగా నేర్పఱిచిరి. ఈశ్వరప్రేరణముచేతఁగాక యివియన్నియు నయాచితముగాఁ జేకూరుట యెట్లు సంభవించును? మంచికార్యములకెల్లను దేవుఁడు తోడుపడు ననుటకు లేశమును సందేహములేదు. ఈ ప్రకారముగా నే నెదురుచూడని ధనప్రాప్తి కలుగఁగా, మూఁడువేలతో ముగింపవలెననుకొన్న మందిరమును పెంచి పెద్దదానినిజేసి యేడువేల రూపాయలు దాని నిమిత్తమయి వ్యయపెట్టితిని. ఈ పురమందిరనిర్మాణములో నాకు సాయము చేసిన పయి యిరువురు మిత్రులకును, యితర మిత్రులకును నా కృతజ్ఞతను దెలుపవలసి యున్నది. నాళము కామరాజుగారు పురమందిరము నిమిత్తమయి తమ స్థలమునుండి ముప్పదినలువది గజముల స్థలము నుచితముగా నిచ్చిరి; ఖాజా అహమదల్లాఖాన్ సాహేబుగారు కఱ్ఱలు కోయించుకొనుట మొదలయిన పనుల కుపయోగించుకొను నిమిత్తమయి తమస్థలములోఁ దావిచ్చిరి; మామిడి రామస్వామి గారును జూపూడి రామానుజముగారును తాము విశేషలాభము నపేక్షింపక యితరుల కమ్మెడుదానికంటె తక్కువవెలలకు నాకుఁ గొన్ని కఱ్ఱలిచ్చిరి; దొమ్మగూడెపు కలపవర్తకులైన జాన్ పీటర్సనుగారును

కొట్లు పోతన్నగారును జోగా చిన వెంకటస్వామిగారును నాయొద్ద మూల్యముగైకొనక యొక్కొక్కరై దేసి కట్టెల నిచ్చిరి; పురమందిరము నిమిత్తమయి కావలెనన్న నెక్కువవెల యడుగుదురన్న హేతువుచేత దామరాజు నాగరాజుగారిపేర కొన్నస్థలమును తనకే యుంచుకొని దానిలోఁ గొట్లు కట్టింపవలసినదని బంధువులును తమ కమ్మినపక్షమున కొన్న దానికంటె నైదురెట్లు ధన మిచ్చెదమని మిత్రులును బ్రోత్సాహపఱచినను వినక యాయన నాపేర వ్రాసియిచ్చిరి; నేను కొన్నస్థలమునకు వెనుక నున్నస్థలమును పురమందిరమునిమిత్తమయి తన పేరఁగొని బసవరాజు గవర్రాజుగారింతలోఁ గాలధర్మము నొందఁగా గవర్రాజుగారిభార్యలక్ష్మీదేవమ్మగారుకొన్న నూటయేఁబది మూడురూపాయలకే నాకా స్థలము నిచ్చెను. ఈ ప్రకారము నప్పుడప్పుడు కొనుచువచ్చిన స్థలములకయి వ్యయపడినది రు 653-8-0లు; మందిరనిర్మాణమునకు వ్యయపడినది రు 5149-15-3 లు; తరువాత పఠనమందిరమును బిల్లియర్డుగదిని దానితోఁ జేర్చి కట్టుటకయి వ్యయపడినది రు 1269-0-0లు; మొత్తముమీఁద నేను పురమందిర నిర్మాణార్థము కర్చుపెట్టిన మొత్తమంతయు రు 7072-7-3లు. ఇందునిమిత్తము నే నితరులవలన నేమియుఁ గైకొనకుండున ట్లేర్పఱుచుకొన్నను దొమ్ముగూడెపుకలపవర్తకులవలన మున్నూఱురూపాయలువెలచేయు పదునేను కట్టెలు ధర్మార్థముగా పుచ్చుకొనవలసి వచ్చినది. పటలబంధనముల (Trusses) నిమిత్తమయి కావలసిన పొడుగయిన టేకుకట్టెలు రాజమహేంద్రవరములో దొరకకపోయెను. అవి కట్టెలకు జన్మస్థానమయిన బస్తరులోను దొమ్ముగూడెములోను దొరకునని తెలియవచ్చినందున అట్టి కట్టెలనుకొని పంపవలసినదని నా శిష్యులును భద్రాచలము తహశ్శీలుదారును నయిన సయ్యదు వజీరుద్దీన్ సాహేబుగారి పేర వ్రాసితిని. ఈవిషయమయి కొన్నియుత్తరప్రత్యుత్తరములు

నడచిన యనంతరము నం దాయన భద్రాచలము తాలూకాలోని కూనూరునుండి 1889 సం॥ ఏప్రిల్ 29వ తేదిని వ్రాసిన యుత్తరములోని కొన్ని వాక్యముల నిందు వ్రాయుచున్నాను—

'Myself and the Buster Tahsildar Mr. Chintaman Ramachander tried our best to buy same timber at Dommugudem and send them on to you. There are some logs at Dommugudem now but they say the timber cannot now be taken down the river owing to the difficiency of water in the river. I herewith send you three letters to the addresses of

1. Nalam Kamaraja Garu
2. Alapati Bhaskarramiah Garu and
3. Joga Venkataswami

at Rajahmundry, given by the following Shaukars. *viz.*,

1. John Paterson
2. Kotla Potanna and
3. Joga China Venkataswami.

These Shaukars have some timber of their own for sale at Rajahmundry with their agents at Rajahmundry named above. I hope you will get the fifteen logs of the description you mentioned in your letter soon after you send these letters to the addressess. You can select the best logs from the lots. Myself and Mr. Ramachender asked the Dommugudem Shaukars to take from you the reasonable price for the logs, but your good reputation is such that the Shaukars refuse to take money from you and they say they contribute this timber towards the charitable purpose you have undertaken. I can say I have used no infiuence at all in this affair and I have thought it would be a great discourtesy to refuse the subscription they willingly offer for the construction of the Town Hall which is but a building for the use of the general public."

(నేనును బస్తరు తహశ్శీలుదారయిన చింతామణి రామచందర్ గారును దొమ్ముగూడెములోఁ గట్టెలుకొని మీకుఁ బంపుటకు సాధ్యమైనంత ప్రయత్నము చేసితిమి. ఇప్పుడు దొమ్ముగూడెములోఁ

గొన్ని కట్టెలున్నవిగాని, నదిలో నీరు తక్కువగా నున్నందున దిగువకు నదిలోనుండి యిప్పుడు కట్టెలు తీసికొనిపోవుటకు వీలులేదని చెప్పుచున్నారు. రాజమహేంద్రవరమునందున్న 1. నాళము కామరాజుగారు, 2. ఆలపాటి భాస్కరరామయ్యగారు, 3. జోగా వెంకటస్వామిగార్ల విలాసమునకు ఈక్రింది సాహుకార్లనఁగా జాన్ పీటర్సన్, కోట్ల పోతన్న, జోగా చినవెంకటస్వామి యిచ్చిన మూడు త్తరములను మీకిందుతోఁ బంపుచున్నాను. పైని చెప్పఁబడిన రాజమహేంద్రవరములోని తమ యేజంట్లవద్ద అమ్మకము నిమిత్తము ఈసాహుకార్లు తమ కలపనుంచియున్నారు. మీయుత్తరములో మీరు వివరించినరీతి 15 కట్టెలును మీ రీయుత్తరములను చిఱునామాదారులకుఁ బంపినతోడనే మీకులభించునని నమ్ముచున్నాను. రాశిలోనుండి మీరు మంచికట్టెల నేరుకోవచ్చును. కట్టెలకు న్యాయమైన వెలలను మీయొద్దనుండి పుచ్చుకోవలసినదని నేనును రామచందర్‌గారును దొమ్ముగూడెపు సాహుకారుల నడిగితిమికాని మీ మంచిపేరు ఎక్కువదైనందున సాహుకారులు మీవద్దనుండి సొమ్ము పుచ్చుకొనుట కంగీకరింపలేదు. మీరు పూనిన ధర్మకార్యము నిమిత్తమయి తా మీ కలప నిచ్చెదమని వారు చెప్పుచున్నారు. ఈ వ్యవహారములో నేనెంతమాత్రమును నాయధికారము నుపయోగింపలేదని నేను చెప్పఁగలను. మహాజనోపయోగార్థమయి కట్టఁబడుచున్న పురమందిరము నిమిత్తమయి వారు హృదయపూర్వకముగా నియ్యపూనిన సాయమును నిరాకరించుట గొప్పయమర్యాదగా నుండునని నేను తలఁచియున్నాను.)

మాకుఁ గావలసినరీతి కట్టెలు వేఱొకచోట దొరకనందున నేనా కట్టెల నంగీకరింపవలసిన వాఁడ నయితిని. తనయధికారము నెంత

మాత్రము నుపయోగింపలేదని నామిత్రుఁడు చెప్పుచున్నను, ఆకలప వర్తకులు తమ తహశ్శీలుదారుని జూచి యిచ్చియుందురుగాని యా కట్టెలను నన్నుఁజూచి యిచ్చియుండరు. ఇట్లు సాయముచూపిన నానెయ్యుఁడైన సయ్యదు వజీరుద్దీన్ సాహేబుగారియెడల నేనెంతయు కృతజ్ఞుఁడనయి యుండవలెను. 1890 వ సం॥ అక్టోబరు నెలలో దానిని తెఱచి గృహప్రవేశోత్సవసమయమునందు ప్రస్తుతము చెన్నపురి రాజధాని రాజకీయశాస్త్రపాఠశాలలో సంస్కృతోపన్యాసకులుగా నున్న రావుబహద్దరు రంగాచార్యులు (ఎమ్. ఏ.) గారు నన్నుఁగూర్చి యింగ్లీషున 23 వ తేది నొక యుపన్యాస మిచ్చిరి. అటుతరువాత కలకత్తాలోని సాధారణ బ్రహ్మసమాజ ప్రధానబోధకులైన పండిత శివనాథశాస్త్రి (ఎమ్. ఏ.) గారు రాజమహేంద్రవరమునకు వచ్చి నవంబరు నెల 15 వ తేదిని నన్నుఁగూర్చి కొంత చెప్పి, పురమందిరములో రాజమహేంద్రపురవాసు లప్పటినుండి నిరాటంకముగా సభలు మొదలయినవి చేసికోవచ్చునని ఘోషించిరి. తరువాత శాస్త్రిగారు రాదినమునసే నొకటియు మఱునాఁ డొకటియు పురమందిరములో రెం డుపన్యాసములు చేసి పోయిరి. పయి యిరువురు నన్ను గూర్చి చెప్పినదానిలో నాస్తోత్రపాఠములు తప్ప విశేషాంశము లేవియు నుండవు గనుక వాని నిచ్చట వివరించుట యనావశ్యకము. 1896 వ సంవత్సరాంతముతోఁ బట్టణమందిర నిర్మాణవిషయమున నేను చేసిన ఋణములన్నియుఁ బూర్ణముగాఁ దీఱిపోయినవి. మందిరమునకు నాపేరు పెట్టవలసినదని కొందఱును, నేనుకూడ ధర్మకర్తగా నుండుట యావశ్యకమని కొందఱును, నాతోఁ జెప్పిరికాని వారి మాటవినక నేను చెన్నపురికిఁ బోవుటకుముందు 1897వ సంవత్సరము డిసెంబరు నెలలోనే నీక్రింది నిక్షేపపత్రము (Trust Deed) ను వ్రాసి లేఖ్యరూఢము చేయించి మందిరముధర్మకర్తల కొప్పగించి పోయితిని.

"Rajahmundry Town Hall Trust Deed.

బ్రాహ్మణుఁడను, లేటు కందుకూరి సుబ్బారాయఁడుగారి కుమారుఁడను, ప్రస్తుతము రాజమహేంద్రవరము కాలేజిలోఁ బ్రథమ పండితుఁడను, అయిన కందుకూరి వీరేశలింగ మను నేను

1. శ్రీరాజా కొచ్చెర్లకోట రామచంద్రవేంకట కృష్ణారావు గారు.
2. ది ఆనరేబిల్ న్యాపతి సుబ్బారావు పంతులుగారు, బి. ఎ., బి. యల్.
3. నేతి వేంకట సోమయాజులుగారు.
4. చిత్రపు వేంకటాచలముగారు, బి. ఎ., బి. యల్.
5. గోపిసెట్టి నారాయణస్వామి నాయుఁడుగారు, బి. ఏ.
6. నాళము పద్మనాభముగారు, బి. ఏ.
7. ఖాజా అహమ్మదుల్లాఖాన్ సాహేబుగారు.
8. మంతపూడి కామేశ్వరరావుగారు, బి. ఏ.
9. కొటికలపూడి రామేశ్వరరావుగారు.
10. రెబ్బాప్రగడ పాపయ్యగారు.
11. శ్రీరాజా కంచుమర్తి వేంకటసీతారామచంద్రరావుగారు
12. అమెరికన్ లూథరన్ మిషన్ సీనియర్ మిషనేరీ.
13. జ్యూబిలీపబ్లిక్ లైబ్రేరీ రీడింగురూము సెక్రటరీ.

అను మిమ్ము ట్రస్టీలనుగా నియమించి, ఆసుపత్రిరోడ్డునదక్షిణ పార్శ్వమునందు నేను స్థలముకొని నాసొంతసొమ్ముతోఁ గట్టించిన టౌనుహాలును, దానితోఁ జేరిన స్థలమును, ౧౮౯౭ వ సంవత్సరము డిసెంబరునెల ౧ వ తేదికి సరియైన హేవిళంబ నామసంవత్సర మార్గశిర శుద్ధ ౮ బుధవారమునాఁడు దిగువ నుదహరింపఁబడిన షరతుల

ప్రకారముగా మీ యావజ్జీవమును వ్యవహారము జరుపుచుండుటకయి మీ కధికారమిచ్చి యీహద్దులమధ్యస్థమైన స్థలమును దానిలోఁ గట్టింపఁబడిన పురమందిరమును మీస్వాధీనము చేయుచున్నాను.

హద్దులు.

మొదటి ప్రతి - (టౌన్‌హాలున్న భాగము.)

ఉత్తరము—ఆసుపత్రిరోడ్డు.

తూర్పు—నాళము కామరాజుగారిచ్చిన స్థలములోఁ గట్టఁబడిన బిల్లియర్డు లైబ్రేరీ రూములు.

దక్షిణము—బసవరాజు గవర్రాజుగారు నానిమిత్తము రహిమాన్ బేగువద్ద కొన్న స్థలము.

పడమట—పూర్వము రహిమాన్ బేగుక్రిందనుండిన దారి కుపయోగించు స్థలము. దామరాజు నాగరాజుగారివద్ద నేను కొన్న యీ ప్రతి తూర్పు పడమరలు 27 గజములు, ఉత్తరదక్షిణములు 18 గజములు, వెరసి 486 చదరపు గజములు.

రెండవ ప్రతి.

ఉత్తరము—టౌనుహాలుస్థలము

తూర్పు—నాళము వారియొక్కయు ముత్తంగివారియొక్కయుఁ గాలీస్థలము.

దక్షిణము—రహిమాన్ బేగువద్ద నేనుకొన్న కాలీస్థలము.

పడమట—దారిక్రింద వదలిపెట్టఁబడిన స్థలము.

లేటు బసవరాజు గవర్రాజుగారు నాతరపున టౌన్‌హాలు నిమిత్తము తమపేర కొన్నట్టియు, ఆయనభార్య తరువాత నాపేర వ్రాసి యిచ్చినట్టియు, ఈప్రతి తూర్పుపడమరలు 27 గజములు, ఉత్తర దక్షిణములు 14 గజములు, వెరసి 378 చదరపు గజములు.

మూడవ ప్రతి.

ఉత్తరము—బసవరాజు గవర్రాజుగారు నానిమిత్తముకొన్న స్థలము.

తూర్పు—ముత్తంగి వారిస్థలము.

దక్షిణము— ముత్తంగి వారియొక్కయు చాకలివారి యొక్కయు స్థలము.

పడమట—ఖాజీ దాదాసాహేబుగారు మొదలైనవారి స్థలము.

18 గజములపొడవు సర్వస్వాతంత్ర్యములతోను, 13 గజముల పొడవు కొన్ని షరతులతోను, రహిమాన్ బేగువద్ద నేను కొన్న యీప్రతి తూర్పుపడమరలు 31 గజములు, ఉత్తరదక్షిణములు 18 గజములు, వెరసి 558 చదరపు గజములు.

నాలవ ప్రతి.

ఉత్తరము—ఆసుపత్రిరోడ్డు.

తూర్పు—నాళమువారి స్థలము.

దక్షిణము—ముత్తంగివారి స్థలము.

పడమట—టౌన్‌హాలును స్థలమును.

నాళము కామరాజుగారు టౌన్‌హాలున కిచ్చినట్టియు, ఇప్పుడు బిల్లియర్డ్సు లైబ్రరీరూములు కట్టఁబడినట్టియు, ఈప్రతి తూర్పు పడమరలు 8 గజములు, ఉత్తర దక్షిణములు 20 గజములు, వెరసి 160 చదరపు గజములు.

అయిదవ ప్రతి.

ఉత్తరము—ఆసుపత్రి వీధి.

తూర్పు—ప్రార్థనసమాజమందిరమును గవర్రాజుగారుకొన్న స్థలమును,

పడమట—దాదా సాహేబుగారు మొదలైనవారి కాలీ స్థలము.

మార్గముక్రింద నుపయోగపడెడి యీప్రతి తూర్పుపడమరలు 4 గజములు. ఉత్తరదక్షిణములు 32 గజములు, వెరసి 128 చదరపు గజములు.

1. ఈ స్థలములలో మొదటిప్రతిలోను నాలవప్రతిలోను నా సొంత సొమ్ముతోఁ గట్టించఁబడిన హాలును బిలియర్డు లైబ్రేరీరూము లును కలిసి రాజమహేంద్ర పురమందిరము (Rajahmundry Town Hall) అని పిలువఁబడ వలెను.

2. హాలుకు పడమటివైపున నున్న మెట్లదారియు, దానితోఁ జేరి గ్యాలరీలకు వెనుక నున్నగదియు, ఆగదిలోఁ జేరిన (మేడమెట్లున్న) వసారాయును, ఈనుహాలుకుఁ బ్రార్థనసమాజమందిరము నకును ఉమ్మడిగానుండి రెంటిక్రిందను వాడుకలో నుండవలెను.

3. ప్రార్థనసమాజ మెప్పుడయినను లేకపోవుట తటస్థించిన పక్షమున, ప్రార్థనసమాజమునిమిత్తము కట్టఁబడి దానియుపయోగ ములోనున్న పడమటిభాగమందలి హాలును దానిపైనున్న మేడ యును టౌనుహాలులో భాగముగనెంచఁబడి దాని యుపయోగము క్రిందనుంచఁబడవలెను. అప్పుడు ప్రార్థనసమాజమందిరపు ట్రస్టీలలోని పెద్దాడ సాంబశివరావు బి. ఏ., బి. యల్. గారును, గోటేటి కనక రాజు బి. ఏ., గారును, ఆ టౌన్‌హాలు అడిషనల్ ట్రస్టీలుగాఁ జేర్చుకొనఁబడవలెను. ఒకసారి పోయిన తరువాత మరల నెప్పుడయి నను ప్రార్థనసమాజ మను పేరితోగాని బ్రహ్మసమాజ మనుపేరితోఁ గాని (యవతారాదుల యర్చనయు విగ్రహారాధనమునులేని) యేకే శ్వరమానసి కోపాసనముగల పరిశుద్ధాస్తికసమాజ మేర్పడినపక్ష మున, ఆభాగము మరల దానిక్రింద నుపయోగ పడుచుండవలెను.

4. సమస్తవిషయములలోను జ్ఞానాభివృద్ధి కలుగుటకును నీతి మతకులాచారములయందలి మూఢవిశ్వాసములు తొలఁగుటకును నీతి పెంపొందుటకును దుర్నీతిదురాచారములు తొలఁగుటకును నీతి మతశాస్త్రరాజ్యాంగవిషయములలో గుణదోషవిచారము చేయుటకును అనుకూలములైన యుపన్యాసములు ప్రసంగములు వాదములు మొదలైనవానికొఱకును, మహనీయులను సత్కరించుట కొఱకును దేశాభివృద్ధికి తోడ్పడు కృషికొఱకును, జనులసంతోషమునకును వినోదమునకును, జరగెడి యాటపాటల కొఱకును, జనోపయుక్తములైన సమస్తేతరకార్యముల కొఱకును, హిందువు, యూరపియన కైస్తవుఁడు, మహమ్మదీయుఁడు, బ్రాహ్మణుఁడు, శూద్రుఁడు అననిట్టిభేదభావములేక యెల్లజాతులవారును, సర్వమతములవారును సభలు మొదలైనవి చేసికొనుటకీ మందిర ముపయోగపడవలెను.

5. దుర్నీతిని ప్రోత్సాహపఱచునట్టికాని జాతిమతద్వేషములను పుట్టించునట్టికాని రాజభక్తిని పోఁగొట్టునట్టికాని ప్రతిపక్షులను వారిగౌరవాస్పదులను దూషించుట కేర్పడినట్టికాని సంఘసంస్కారాదుల నిమిత్తము పాటుపడువారిని బహిష్కరించుటకొఱకు సూచింపఁబడునట్టికాని సభ లిందు జరగఁగూడదు.

6. అవయవాదులతో సంబంధించిన యుత్సవములు, భజనలు, విగ్రహపూజలు, వేశ్యల యాటపాటలు, జారిణులు వేషములు వేయునాటకాదులు, సురాపానాదులుగల విందులు, ఇందు జరగఁగూడదు.

7. ఈ హాలునందు సత్కార్యములను జేసినవారియొక్కయు సద్వర్తనముగలవారియొక్కయు పటముల నుంచవచ్చును. మతముతో సంబంధించినట్టి కాని వేఱువిధమైనట్టికాని బూతుబొమ్మలు దిగంబరరూపములను నిందు పెట్టఁగూడదు.

8. ఇక్కడ సంగీతము మొదలైన కళలను విద్యలను ప్రోత్సాహపఱచుటకు సభలు చేయవచ్చును. అయినను స్వలాభమునిమిత్తమాడు నాటకాముల కీ హాలు నియ్యఁగూడదు.

9. ఇక్కడకు వచ్చి చదువుకొను వారి కందఱకు నుపయోగపడుచు జూబిలీలై బ్రేరీ రీడింగురూము స్థిరముగా లాగ్ హాలులో నుంచఁబడుటకు వెనుక నేర్పఱిచిన షరతులను ట్రస్టీలు చెల్లింపవలెను.

10. ప్రార్థనసమాజమందిర మే హేతువుచేతనైన ననుకూలపడకయు మఱియొక స్థలముదొరకకయు నిక్కడనేచేయవలెనని కోరినప్పుడు వితంతువివాహములను జరపుకొనుటకు వివాహదినమున నీహాలు నియ్యవలెను.

11. ప్రార్థనసమాజమని కాని బ్రహ్మసమాజమని కాని వ్యవహరింపఁబడు పరిశుద్ధాస్తికమతవిశ్వాసముగల (ప్రార్థనమందిరములో నుండు) సమాజము వాడుచేయు విశేషసభలకును సంవత్సరోత్సవమునకును హాలు నిచ్చుచుండ వలెను. ఆ దినములలో వేఱుసభలనిమిత్తమయి యితరులు కోరినపక్షమున హాలు నియ్యఁగూడదు.

12. బిల్లియర్డ్స టేబిలు లాన్ హాలులోనే యుంచఁబడి దాని నిమిత్తమయి కట్టఁబడినగది టేబిలున్నంతవఱకు దానికొఱకే యుపయోగించఁబడవలెను.

13. ప్రజల యుపయోగార్థముగా రెండుమాసముల కొకసారియైనను తప్పక యిందొక యుపన్యాసము జరగుచుండునట్లు ట్రస్టీలేర్పాటు చేయవలెను.

14. వీధిపైపునున్న యూఱుకొట్లమీఁదను వచ్చేడియద్దెలో నాలవవంతుకు మించకుండ మరమ్మతునిమిత్త మవసరము వచ్చినప్పుడు ప్రార్థనసమాజమందిరపుట్రస్టీల కిచ్చి తక్కిన మూడువంతు

4. సమస్తవిషయములలోను జ్ఞానాభివృద్ధి కలుగుటకును నీతి మతకులాచారములయందలి మూఢవిశ్వాసములు తొలఁగుటకును నీతి పెంపొందుటకును దుర్నీతిదురాచారములు తొలఁగుటకును నీతి మతశాస్త్రరాజ్యాంగవిషయములలో గుణదోషవిచారము చేయుటకును అనుకూలములైన యుపన్యాసములు ప్రసంగములు వాదములు మొదలైనవానికొఱకును, మహనీయులను సత్కరించుట కొఱకును, దేశాభివృద్ధికి తోడ్పడు కృషికొఱకును, జనులసంతోషమునకును, వినోదమునకును, జరగెడి యాటపాటల కొఱకును, జనోపయుక్తములైన సమస్తేతరకార్యముల కొఱకును, హిందువు, యూరపియను క్రైస్తవుఁడు, మహమ్మదీయుఁడు, బ్రాహ్మణుఁడు, శూద్రుఁడు అను నిట్టిభేదభావములేక యెల్లజాతులవారును, సర్వమతములవారును సభలు మొదలైనవి చేసికొనుటకీ మందిర ముపయోగపడవలెను.

5. దుర్నీతిని ప్రోత్సాహపఱచునట్టికాని జాతిమతద్వేషములను పురికొల్పునట్టికాని రాజభక్తిని పోఁగొట్టునట్టికాని ప్రతిపక్షులను వారిగౌరవాస్పదులను దూషించుట కేర్పడినట్టికాని సంఘసంస్కారాదుల నిమిత్తము పాటుపడువారిని బహిష్కరించుటకొఱకుద్దేశింపఁబడునట్టికాని సభ లిందు జరగఁగూడదు.

6. అవయవాదులతో సంబంధించిన యుత్సవములు, భజనలు, విగ్రహపూజలు, వేశ్యల యాటపాటలు, జారిణులు వేషములు వేయునాటకాదులు, సురాపానాదులుగల విందులు, ఇందు జరపఁగూడదు.

7. ఈ హాలునందు సత్కార్యములను జేసినవారియొక్కయు సద్వర్తనముగలవారియొక్కయు పటముల నుంచవచ్చును. మతముతో సంబంధించినట్టి కాని వేఱువిధమైనట్టికాని బూతుబొమ్మలను దిగంబరరూపములను నిందు పెట్టఁగూడదు.

8. ఇక్కడ సంగీతము మొదలైన కళలను విద్యలను ప్రోత్సాహపఱచుటకు సభలు చేయవచ్చును. అయినను స్వలాభమునిమిత్తమాడునాటకాదులకీ హాలు నియ్యఁగూడదు.

9. ఇక్కడకు వచ్చి చదువుకొను వారి కందఱకు నుపయోగపడుచు జూబిలీలైబ్రరీ రీడింగురూము స్థిరముగా లాఞ్ హాలులో నుంచఁబడుటకు వెనుక నేర్పఱిచిన షరతులను ట్రస్టీలు చెల్లింపవలెను.

10. ప్రార్థనసమాజమందిర మే హేతువుచేతనైన ననుకూలపడకయు మఱియొక స్థలముదొరకకయు నిక్కడనే చేయవలెనని కోరినప్పుడు వితంతువివాహములను జరపుకొనుటకు వివాహదినమున నీహాలు నియ్యవలెను.

11. ప్రార్థనసమాజమని కాని బ్రహ్మసమాజమని కాని వ్యవహరింపఁబడు పరిశుద్ధాస్తికమతవిశ్వాసముగల (ప్రార్థనమందిరములో నుండు) సమాజము వారుచేయు విశేషసభలకును సంవత్సరోత్సవమునకును హాలు నిచ్చుచుండవలెను. ఆ దినములలో వేఱుసభలనిమిత్తమయి యితరులు కోరినపక్షమున హాలు నియ్యఁగూడదు.

12. బిల్లియర్డు టేబిలు లాన్ హాలులోనే యుంచఁబడి దాని నిమిత్తమయి కట్టఁబడినగది టేబిలున్నంతవఱకు దానికొఱకే యుపయోగించఁబడవలెను.

13. ప్రజల యుపయోగార్థముగా రెండుమాసముల కొకసారియైనను తప్పక యిందొక యుపన్యాసము జరగుచుండునట్లు ట్రస్టీలేర్పాటు చేయవలెను.

14. వీధిపైపునను న్న యూఱుకొట్లమీఁదను వచ్చెడియద్దెలో నాలవవంతుకు మించకుండ మరమ్మతునిమిత్త మవసరము వచ్చినప్పుడు ప్రార్థనసమాజమందిరపుట్రస్టీల కిచ్చి తక్కిన మూడువంతు

లును టౌన్‌హాలు మరమ్మతు నిమిత్తము ట్రస్టీ లుపయోగపఱుచు చుండవలెను.

15. ఈ మందిరమునుగాని కొట్లనుగాని దొడ్డినిగాని దీనితోఁ జేరిన మఱి యేభాగమునుగాని ట్రస్టీ లెప్పుడును విక్రయింపఁగూడదు; తాకట్టు పెట్టఁగూడదు? మఱి యేవిధముగాను అన్యాక్రాంతము చేయఁగూడదు. ట్రస్టీలు మందిరము నంతకుగాని కొంతభాగముగాని తమ సొంతపనుల కుపయోగించుకోఁగూడదు; అట్టి సొంతయుపయోగము నిమిత్తి మద్దెకుఁగాని వేఱువిధముగాఁగాని యితరుల కియ్యను గూడదు. ఆవశ్యకములైన మార్పులను అభివృద్ధులనుజేయవచ్చును.

16. ట్రస్టీలలో నొక క్రైస్తవుఁడును, ఒక మహమ్మదీయుఁడును, ఒక వైశ్యుఁడును, ఒకశూద్రుఁడును, ఎల్లప్పుడు నుండవలెను.

17. ట్రస్టీలలో నెవ్వరైనను, ఎప్పుడైనను, ట్రస్టీగానుండుట కిష్టములేనియెడల మానుకోవచ్చును. మరణమువల్లఁగాని మానుకొనుటవల్లగాని మఱియొకవిధముగాఁగాని ట్రస్టీలలోఁ గాళీలువచ్చినప్పుడు ప్రార్థనసమాజమందిరపుట్రస్టీలలోని గ్రాడ్యుయేట్లలోనుండి యొకరిని, టౌన్‌హాలులోనుండు జ్యూబిలీరీడింగురూముమెంబర్లలోని గ్రాడ్యుయేట్లలోనుండి యొకరిని, ఈ ప్రకారముగా వంతువరుసను (Alternately) మార్చి మిగిలినట్రస్టీలు బ్యాలెట్టుమూలమున కాళీలు పూర్తిచేయుచుండవలెను. కాళీలు వచ్చినప్పు డెప్పుడయిన టౌన్‌హాలు ట్రస్టీలలో మహమ్మదీయుఁడైనను క్రైస్తవుఁడైనను వైశ్యుఁడైనను శూద్రుఁడైనను లేకపోవుట తటస్థించినపక్షమున, ఆ యాతరగతిలో గ్రాడ్యుయేట్లు దొరకనియెడల నేతరగతిలోఁ గాళీవచ్చెనో యాతరగతిలోని తగుమనుష్యుని ప్రార్థనసమాజమందిరపు ట్రస్టీలలోనుండియు వారిలో లేనియెడల జ్యూబిలీరీడింగురూముమెంబర్లలోనుండియు వారిలోను లేనియెడల నితరులలోనుండియు గ్రాడ్యుయేట్లు

కాని వానినైనను ట్రస్టీగా బ్యాలెట్టుమూలమున తక్కిన ట్రస్టీలేర్పాటుచేయవలెను. దేశాభిమానమును పరోపకారచింతయు స్వకర్త్వ నిర్వహణమునందు శ్రద్ధయుఁ గలవాఁడన్న విశేషహేతువుచేత గ్రాడ్యుయేట్ కానివాఁ డెవ్వడైన ట్రస్టీగా నుండుట కర్హుఁడనియు, అట్టివానిని ట్రస్టీగా నియమించుట గ్రాడ్యుయేట్టు నేర్పఱుచుటకంటె నెక్కువ లాభకరముగా నుండుననియు, ట్రస్టీ లభిప్రాయపడెడు పక్షమున అతఁడు ప్రార్థనమందిరపు ట్రస్టీగాని జ్యూబిలీరీడింగురూము మెంబరుగానినైనను కాకపోయినను కాలి వచ్చినప్పు డట్టివాని పేరు నాకుఁ దెలియఁజేసి ట్రస్టీలు నా యనుమతిమీఁద నా జీవితకాలములోమాత్ర మట్టివానిని ట్రస్టీగా వేసికొనవచ్చును. కాలీలు పూర్తిచేయుటకొఱకు జరగెడి మీటింగులో గ్రామములో నుండని ట్రస్టీలు ప్రతినిధి (Proxy) మూలమున తమవోటు (Vote) నియ్యవచ్చును. ఈ ట్రస్టుదస్తావేజు రిజిస్టరయిన మూఁడుమాసములలోపల నిందలిషరతులకు భిన్నములు గాకుండునట్టుగాఁ దమపనిని నెరవేర్చుటకావశ్యకములైన నిబంధనలను ట్రస్టీలు చెయ్యవలెను. ట్రస్టీలు సభచేసి కార్యదర్శి (Secretary) నేర్పఱుచుకొను నంతవఱకును చిత్రపు వేంకటాచలముగారిని కార్యదర్శిగా నేర్పఱుచుచున్నాను.

18. ఎప్పుడైనను వరుసగా (Continuously) రెండుసంవత్సరములవఱకును దాము చేయవలసిన పనులను వేనిని చేయకయు, ఇందలి షరతులకు విరుద్ధముముగాఁ బ్రవర్తించియు, ఆవశ్యకమైనప్పుడు మరమ్మతులు చేయింపకయు, ఉపేక్షచేసినపక్షమున ట్రస్టీలను తొలఁగించి మందిరమును దమయధీనముఁజేసికొని పూర్వోక్తములయిన షరతులను చెల్లించుచుఁ బురజనులయుపయోగమునిమిత్తము ట్రస్టీలుగానుండి వ్యవహరించుటకయి లోకల్ ఫండుబోర్డువారికిఁగాని రాజమండ్రీమ్యునిసిపాలిటీవారికిఁగాని తమ కుచితమని తోఁచిన యితర

సంఘము నేర్పాటుచేసి దానికిఁగాని హాలును ఒప్పగింత పెట్టుటకయి గవర్నమెంటువారి కిందుమూలమున నధికారమిచ్చుచున్నాను.

ఈసయిని వివరింపఁబడిన షరతులకు లోఁబడి యిందులోఁ జెప్పఁబడిన హద్దులమధ్యస్థమయి యేడువేలరూపాయల వెలచేయు నించుమించుగా 1720 చదరపుగజములుగల స్థలమును దానిలోఁ గట్టబడినహాలును బిల్లియర్డురూమును లైబ్రేరీరూమును కొట్లను మార్గములను ఫలవృక్షములను సమస్తమును మీస్వాధీనముచేసి, వీనితో సంబంధించిన దస్తావేజులను మీకిచ్చివేసి, నాకుఁగల హక్కును బాధ్యతను సంబంధమును ట్రస్టీలయిన మీ కిందుమూలమున సంక్రమింపఁ జేయుచున్నాను.

రాజమహేంద్రవరము,
2వ డిసెంబరు 1897 సం॥ } కందుకూరి వీరేశలింగము."

పురజనులయుపయోగార్థము పురమందిరమును నేను కట్టించి యియ్యఁదలచినప్పుడు సంతోషించి పురజనులందఱును నాకుఁ దోడుపడి యుందురని మీరనుకోవచ్చును. మాపట్టణ మట్టిపాపము కట్టుకో లేదు. నేను పురమందిరమును కట్టించుటకుముందే యాస్థలవిషయమయి నాలుగు వాజ్యములు వేయఁబడి కొట్టుపడిపోయినవి. నేను నాగరాజుగారి పేరస్థలమును కొన్నసంవత్సరముసందే నాకుఁ బ్రతిపక్షియయి వితంతువివాహవిషయమున ఖండనవ్యాసములు వ్రాయుచువచ్చిన నూరి వేంకటకృష్ణశాస్త్రిగారు మాకు స్థల మమ్మిన మహమ్మదీయుని జ్ఞాతి నొకనిని జేరఁదీసి వానిచేఁ దనకు స్థలములో భాగమున్నదని 1884 వ సం॥ 407 నెంబరున సంక్షిప్తాభియోగము (Summary Suit) తెప్పించెను; అది కొట్టుపడి పోయినతరువాత 1885 వ సం॥ 241 వ సంఖ్యగల క్రమమైనవ్యాజ్యమును (Regular Suit) మాకు స్థలమమ్మిన

వానిని జేర్చి తాను పెట్టుబడిపెట్టి వేయించెను. అదియు కొట్టుపడి పోఁగా వ్యాజ్యమునకయిన కర్చులను వేంకటకృష్ణ శాస్త్రిలవారే యిచ్చుకోవలసిన వారయిరి. నేను పురమందిరమును కట్టుట కారంభించిన తరువాత స్థలము తనకాధి (Mortgage) లో నున్నదని వేంకటకృష్ణశాస్త్రిగారే తనపేరట 1889 వ సం॥ 181 వ సంఖ్యను అసలు వ్యాజ్యము తెచ్చెను. అది 1891 వ సంవత్సరము సెప్టెంబరు 5 వ తేదిని పురమందిరనిర్మాణమయిన తరువాత కొట్టివేయఁ బడినది. దానిపైని 1891వ సంవత్సరము అక్టోబరునెల 28వ తేదిని ఉపర్యభియోగమును దెచ్చెనుగాని దానికిని పూర్వపువ్యాజ్యములకును మూటికిని పట్టిన దురవస్థయే పట్టెను. ఇవి యిట్లుండఁగా 1889వ సంవత్సరము సెప్టెంబరునెలలో ఖాజా అహమ్మదల్లాఖాన్ సాహేబుగారు కట్టులు వేసికొనుటకయి యిచ్చినస్థలములో మేము అంపపుకోఁతకయి గోయిపెట్టి కట్టులు కోయించుచుండఁగా, ఒక పెద్దమనుష్యుఁడు ఖాజా సాహేబుగారి దూరజ్ఞాతియైన యొకబీదతురకవానిని పిలిపించి వాని పక్షమున నొక బ్యారిష్టరునుబెట్టి వానిచేత నేను తనతాతసమాధిని త్రవ్వించివేసినట్టు నాపయి నభియోగము నొకదానిని సంయుక్తదండవిధాయకుఁడైన మోబర్లీదొరగారియొద్ద తెప్పించెను. 1889వ సంవత్సరము సెప్టెంబరునెల 30వ తేదిని తేఁబడిన యాయభియోగము నా దొరగారు విమర్శచేసి తమకుఁ దెలియఁజేయ వలసినదని 16వ అక్టోబరున పోలీసువారికిఁ బంపిరి. అంపపుగోతిలోనుండి యేఱిన తనతాత యెముకలని బుట్టలోవేసి తెచ్చిన యెముకలబుట్టతో నాబీదతురకవానిని పోలీసువారు రాజకీయవైద్యునికడకుఁ గొనిపోయి పరీక్షింపించి, వాని తాతయెముకలన్నియు మేఁకయెముకలని డాక్టరు నిర్ణయపత్రమిచ్చిన తరువాత నితరులనుగూడ విచారించి, ఏలూరి లక్ష్మీనరసింహముగారి ప్రేరణముచేత తేఁబడినదిగాని యిది నిజమైన యభియో

గము కాదని 1889వ సం॥ నవంబరు నెల 13వ తేదిని దండవిధాయకు నికిఁ దెలియఁజేసిరి. దొరగారు (దండవిధాయి) సాహేబువద్ద దండ శాసనానుసారముగా వాఙ్మూలమునైనఁ బుచ్చుకొనక తాము నన్ను స్వయముగా నెఱుఁగుదుమనియు నేనట్టిపని చేయువాఁడను కాననియు వ్రాసి యాయభియోగమును నవంబరు 30 తేదిని కొట్టివేసిరి. దానిలో నప్పుడే పునర్విమర్శకు విన్నపము పెట్టించియుందురుగాని దొరగారా మహమ్మదీయుని ప్రేరేపించిన పెద్దమనుష్యు నసత్యాభియోగము తెప్పించినందునకయి విమర్శించి దండింతురేమోయని భయపడి యా దొరగారు మామండలమును విడిచిపోవువఱకు నూరకుండిరి. మోబర్లీ దొరగారు మామండలము విడిచి వెళ్ళినతరువాత నాతనితీర్పుపై నాలుగుమాసములకు 1890వ సంవత్సరము మార్చి 31వ తేదిని మామండలన్యాయాధిపతియొద్ద పునర్విమర్శకు విజ్ఞాపనమును బెట్టించిరి. ఆ విన్నపమును మండల దండన్యాయాధికారిగారు 1890వ సం॥ జూలయి 26వ తేదిని కొట్టివేసిరి.

నాకు బాల్యమిత్రుఁడయి యుండిన యేలూరి లక్ష్మీనరసింహముగారు నాపై నిట్టి తప్పుటభియోగము నేల తెప్పింతురని కొందఱడుగవచ్చును. ఆ స్త్రీక పాఠశాలాస్థాపనమునకుఁ దరువాత స్వల్పకాలమువఱకును మే మిరువురమును కలిసి పనిచేయుచువచ్చినను, ఆపాఠశాలావిషయమున నాతఁ డనుసరించుచు వచ్చినమార్గమును, రాత్రి పాఠశాలావిషయమున నాతఁడు త్రొక్కిన త్రోవయు, ఇతరవిషయములయం దతఁ డవలంబించిన పద్ధతులును, నింద్యములుగా నాకుఁ గనఁబడినందున పూర్వమిత్రభావమునుబట్టి నే నప్పుడప్పు డాయనను మందలించుచుండుటయు వివేకవర్ధనిలో వ్రాయుచుండుటయుఁ దటస్థించుచు వచ్చెను. అతఁడును తాను ప్రచురించెడు గోదావరీ వృత్తాంత (Godavary News) మను పత్రికలో నాకు వ్యతిరిక్తముగ

ప్రాయఁదొడఁగెను. ఇది యిట్లుండఁగా నతఁడు రాజమహేంద్ర వరోన్నత పాఠశాలకుఁ బ్రధానోపాధ్యాయుఁడును, రాజమహేంద్ర పురపారిశుద్ధ్యవిచారణసంఘమున కధ్యక్షుఁడును, అగుటతటస్థించెను. ఈకాలములో రాజమహేంద్రవరములో నున్న నెప్పల్లె రామబ్రహ్మ మను నొకగృహస్థునియింటిమీఁద రాళ్లు పడుచుండెను. రామ బ్రహ్మముగారివదినెగా రయిన శంకరమ్మ యనునామె తమయింటి మీఁద రాళ్లుపడుచున్నవిషయమయి యిరుగుపొరుగులవారితోను చుట్టుపట్టులనున్న పెద్దమనుష్యులతోను మొఱ్ఱపెట్టుకొనుచువచ్చెను. గాని యెవ్వరును దానిని నివారించుటకయి ప్రయత్నము చేయరైరి. ఇట్లు రాళ్లుపడుటకు ముఖ్యకారణము రామబ్రహ్మముగారి మూడవ యల్లుఁడు. అతఁడు పదునెనిమిదేండ్లప్రాయముకల తల్లిదండ్రులులేని దుండగీఁడు: అతనిభార్య పదునేనేండ్లప్రాయముగలది. అతఁడేలూరి లక్ష్మీనరసింహముగారిసన్నిధానవర్తిగాఁదిరుగుచుండెడివాఁడు. అతఁడు తనభార్యను తనవెంటఁ బంపవలసిన దనియు, తాను వేఱుచోట కాపుర ముండెదమనియు, అత్తవారి నడిగి నిర్బంధపఱుచుచు రాఁగా కాపుర ముండుట కిల్లు లేకుండుటనుబట్టియు నిరుద్యోగియగుటచే భార్యను పోషింప శక్తిలేనివాఁడగుటనుబట్టియు నాతనివెంట నాచిన్న దానిని పంపకపోయిరి. అంతేకాక యెవ్వరో దుర్మార్గ లేదో దురుద్దేశ ముతో నాచిన్నదానిని తీసికొని రమ్మని యతనిని ప్రేరేపించుచున్నా రనియు వారి కనుమానము కలిగెను. ఈకారణములచేత భార్యను తన వెంటఁ బంపక బోఁగా నాపిల్లవాఁ డత్తవారి యింటనుండి లేచిపోయి పూర్ణముగా లక్ష్మీనరసింహముగారిసంరక్షణములోఁ జేరెను. ఆయన పురపాలకసంఘమువారియధికారములో నున్న కంభమువారి సత్రములో నతనికి భోజనవసతి యేర్పఱిచి, మరణకాలమునందుఁ దండ్రి యిచ్చిపోయిన యేనూఱురూపాయలుగల రక్షణనిధిపుస్తకమును

**(Savings Bank Book)** తన యధీనములో నుంచుకొనెను. అతఁ డిల్లు వెడలిపోయినది మొదలుకొని యీరాళ్లుపడుట నెలలకొలఁది నడ చెను. ఎవ్వరో చాటున బలవంతులు తోడుపడువా రుండక యిటు వంటి పనిని నెలలకొలఁది జరుపుట యిల్లువాకిలిలేనియొక్క నిరాధార బాలునికి సాధ్యముకాదు. ఎవ్వరితోఁ జెప్పుకొన్నను పాలనములేకపట్ట పగలు రాళ్లింటిమీఁద నానాముఖముల వర్షపాతమువలెఁ బడుచుం డుట కోర్వలేక యొకదినము మట్టమధ్యాహ్నమున మాయింటి కేడ్చుచువచ్చి యొకమిత్రునితో మాటాడుచు మేడమీఁదనున్న నాతో లక్ష్మీనరసింహముగారు బుద్ధిహీనుఁడైన తమయల్లుని స్వాధీ నము చేసికొని తమచిన్నదానివిషయమైన పాపచింతతోఁదమయింటి మీఁద రాళ్లువేయించుచున్నాడని శంకనమ్మ చెప్పి యేలాగునైన తమబాధను మాన్పి రక్షింపుమని నన్ను దీనముగా వేఁడుకొనెను. లక్ష్మీ నరసింహముగారికిని నాకునుగల వైమనస్యమునుబట్టి యీవ్యవహార ములో సంబంధము కలుగఁజేసికొన నిష్టములేనివాఁడనయి పోయి పోలీసువారితోఁజెప్పుకొమ్మని చెప్పితిని. ఎవ్వరితోఁ జెప్పుకొన్నను కార్యము లేకపోయె నని యామె పెద్దపెట్టున నేడ్చుచుదీనాలాపములు పలుకఁజొచ్చినందున మనసు కరఁగినవాఁడనయి యార్తులకుఁ జేత నైనసాయముచేయ కుండుట ధర్మముకాదని భావించి లేచి మిత్రునిఁ బంపివేసి నే నామెవెంట వారియింటికిఁబోయితిని. ఆమె తమయింటి మీఁదను ముంగిటను పడియున్న యిటుకముక్కలనుజూపి యవి దుగ్గి రాలవారిదొడ్డిలోనుండి వేయబడినవని చెప్పెను. ఆయిటుకముక్కలను పరీక్షించి చూడఁగా అవిచిరకాలమునుండియుండి వానకుఁదడిసిపాకుడు పట్టినవిగాఁ గనఁబడెను. పిమ్మట నేను దుగ్గిరాలవారిదొడ్డిలోనికిఁబోయి చూడఁగా నక్కడ పాకుడుపట్టియున్న యిటుకముక్కలకుప్పలు పెక్కు లుండెను. ఆయింటిమీఁదఁబడుచుండినయిటుకముక్కలును, ఈదొడ్డిలో

నుండిన యిటుకముక్కలును, ఏకరీతివయి యుండినందున దుగ్గిరాల వారి యింటిదొడ్డిలోనుండి రాళ్ళు వేయబడుచుండుట స్పష్టమయినది. దుగ్గిరాలవారి యింటిలో లక్ష్మీనరసింహముగారి కాపురులును వారిపాఠ శాలలో నుపాధ్యాయులు నైన యిద్దఱు బ్రహ్మచారిబ్రాహ్మణులు వెంకటప్పయ్య తిరుపతిరాజు అనువారు వాసము చేయుచుండిరి. ఈ పని వారితోడుపాటుచేత జరుగుచున్నదని భావించి యింటిలోనికిఁ బోయి గృహయజమానుఁ డయిన దుగ్గిరాల ప్రకాశరావుగారిని కలిసి కొని యాబ్రహ్మచారులను తమయింటినుండి పంపివేయుటనుగూర్చి మాటాడి యాయనను వెంటఁగొని మరల రామబ్రహ్మముగారియింటికి వచ్చితిని. మేమక్కడ నిలుచుండి యుండఁగానే దొడ్డిప్రక్కనుండిగాక వీధిప్రక్కనుండి వచ్చి యొకరాయి యింటిమీఁదఁ బడి దానికప్పు నుండి జాఱి మేమున్నచోట పడెను. అది యిటుకబొంతగాక నల్ల రాతిముక్కయయి యుండెను. అది చిన్నస్వామిగారి మేడమీఁదినుండి వేయఁబడినదనియుఁ దత్క్షణముపోయి చూచినయెడలఁ దమయల్లుఁడా మేడమీఁద గనఁబడుననియు శంకరమ్మ కేకలువేసెను. నేను నామిత్రు నితోఁగలసి వెంటనే యామేడమీఁదికిఁ బోయిచూడగా నక్కడ నా బాలుఁడు కనఁబడలేదుగాని యింటిమీఁదపడిన రాతిముక్కలవంటి రాతిముక్కలు రెండు కనఁబడెను. ఈరాతిముక్కలేల యక్కడనున్న వని నే నడుగఁగా చిన్నస్వామిగారి పడవలగుమాస్తా బంగారము చి తుకకొట్టుటకయి తేఁబడినవని చెప్పెను. అతఁ డిచ్చిన యుత్తరము విశ్వాసార్హమయినది కానందున రామబ్రహ్మముగారి యింటిపైని రువ్వుటకే యారాళ్ళు తేఁబడెనని నిశ్చయించి, యిట్టి యనుచితకార్య మును చేయించుట మంచిది కాదని చెంతనున్న చిన్నస్వామిగారి రెం డవకుమారుని మందలింపఁగా నతఁడు లక్ష్మీనరసింహముగారి చాఁకలి వాఁడే పట్టపగలు రాళ్ళు వేయుచుండగా వానినేమియుఁ జేయక మప్తే

లనిందించెదరని యడిగెను. అందుచేత నీరాళ్ళు వేయుటలో లక్ష్మీనర సింహముగారి సంబంధము తప్పక యున్నదని నిశ్చయించి, ఆయనతో మాటాడుటకయి పోయితినిగాని యాయన గ్రామాంతరము పోయినం దున నేను మా యింటికిఁ బోయితిని. ఇది యంతయు 1889 వ సం॥ జూలయి నెల 28వ తేదిని జరిగినది. లక్ష్మీనరసింహముగా రూరినుండి రాఁగానే 30వ తేదిని నేనాయనపాఠశాలకుఁ బోయి యాయనప్రాణ మిత్రులయిన నిడమర్తి దుర్గాప్రసాదరాయఁడుగారును సహోపాధ్యాయుఁడైన దామరాజు బసవరాజుగారును దగ్గరనుండఁగానే రామ బ్రహ్మముగారియల్లుని జేరఁదీసి వారియింటిమీఁద మీరు రాళ్ళువే యించుచున్నారని చెప్పుచున్నా రెంతవఱకు నిజమని యడిగితిని. ఆ యన తా నేమియు నెఱుఁగననియు గిట్టనివా రట్టిప్రవాదములు వేయు చున్నారనియుఁ జెప్పఁగా నేను మరలి మాయింటికిఁ బోయితిని. నేను మాటాడిపోయినతరువాత లక్ష్మీనరసింహముగారు శిలాపాత విషయ మున నేమైనపని జరుగునేమోయని భయపడి మఱునాఁడు (31 వ తేది) తెల్లవాఱునప్పటికి తనమిత్రుఁడైన మాదిరెడ్డి వీరాస్వామినా యఁడుగారి యింటికిఁబోయి యాయనతో నేనూ మాటాడఁగా నా యఁడుగారు సన్నోకపర్యాయము దర్శన మిచ్చిపోవలసినదని వర్త మానము పంపిరి. ఆయన జరిగినదేమని యడుగఁగా 28వ తేదిని జర గిన సర్వవృత్తాంతమును జెప్పి రాళ్ళువేయుచున్నారన్న చాకలివాఁడు మొదలయినవారి పేరులెల్లఁ జెప్పితిని. అక్కడ కందరిని పిలుచుకొని వచ్చుటకయి మనుష్యులను బంపిరికాని, వారిలోఁ గొందఱురాలేదు. వెంకటప్పయ్యను తిరుపతిరాజును దుగ్గిరాలవారి యిండినుండి పంపివే యుటకు నిశ్చయింపఁబడినది. నేను విచారించిన దానినిబట్టి చూడఁగా రాళ్ళవ్యవహారములోఁ దప్పక యీ లక్ష్మీనరసింహముగారి సంబంధ మున్నట్టు స్పష్టమగుచున్న దని చెప్పఁగా, ఆయన బదులు పలు

కక యూరకుండెను. అప్పు డక్కడనున్న దామరాజు నాగరాజుగారు తా నీవిషయమయి లక్ష్మీనరసింహముగారిమీఁద ఫిర్యాదు దాఖలు చేసెద నని చెప్పెను. సామాన్యులకును గొప్పవారికిని తగవువచ్చిన ప్పుడు సామాన్యముగా దండవిధాయులవద్దను ముఖ్యముగా స్వదేశీయ దండవిధాయులవద్దను న్యాయము దొరకుట దుర్లభ మని యెఱిఁగిన వాఁడనయి తొందరపడి పనిచేయవలదని నాగరాజుగారితోఁ జెప్పితిని గాని యాయన నామాట వినక యుపదండవిధాయకునియొద్ద లక్ష్మీన రసింహముగారిపయి నభియోగము తెచ్చి నన్నునువీరాస్వామినాయఁ డుగారు మొదలైనవారిని సాక్షులనుగా కోరెను. త్రిప్పితిప్పి కడకు దండవిధాయి యాయభియోగమును కొట్టివేసెను. నన్ను విమర్శించు కాలములో లక్ష్మీనరసింహముగారి న్యాయవాదియు మిత్రుఁడు నైన దుర్గాప్రసాదరాయఁడుగారు ముందేదో నాపయి నభియోగము తెప్పిం పవలెనని మనస్సులో నుంచుకొని యప్పటి వ్యవహారముతో సంబం ధింపని ప్రశ్నలు నన్నడిగి నావలన నుత్తరములను బడసెను. ఈపగను తీర్చుకోవలెనన్న యుద్దేశముతోనే లక్ష్మీనరసింహముగారు సమాధిని త్రవ్వించితి నని నామీఁద మిథ్యాభియోగమును తెప్పించెను. వీరా స్వామినాయఁడుగారియింట సమావేశము జరిగిన రెండు దినములకు (ఆగష్టు 2 వ తేదిని) ప్రాతఃకాలముననే రామబ్రహ్మముగారు నా యొద్దకువచ్చి తమయింటిమీఁద మరల రాళ్లు పడుచున్నవనియు, తాముగు తమయింట కాపురము లున్నవారును దొడ్డిలోనికి వచ్చుట యే కష్టముగా నున్నదనియు నేలాగునైన రాళ్ళువేయుట మాన్పించి తమ్మపాయమునుండి రక్షింపవలసినదనియు నన్ను వేఁడుకొనెను. వచ్చి విచారించెద నని చెప్పి యాయననింటికిఁ బంపివేసి, పోలీసిన్స్పెక్ట రును వెంటఁబెట్టుకొనిపోయి యా స్థలమును జూపి యాఘోరకృత్య మును మాన్పవలసినదని యాయనను కోరితిని. భటులను కావలియుంచి

రాళ్ళు వేయువారిని పట్టుకొనుటకయి ప్రయత్నము చేసెదనని చెప్పి యాయన వెడలిపోయెను. నేను దుగ్గిరాలవారి దొడ్డిలోనుండి యావలకు వచ్చుచుండగాఁ దమ లోపలినుండి రెండవతరగతి న్యాయవాదియైన వేలూరి వేంకటరామయ్యగారు వెలుపలికివచ్చి నెప్పల్లెవారి విషయమయి జరుగుచున్న దౌర్జన్యమునుగూర్చి నాతో మాటాడ మొదలుపెట్టెను. ఆయన తాను విన్న కన్నవిషయములను నాతోఁ జెప్పనారంభింపఁగా నింతలో చుట్టుపట్టులవారును నెప్పల్లెవారియింటిలోఁ గాపురమున్నవారును వచ్చి తామెఱిఁగినది చెప్పఁజొచ్చిరి. మే మందఱమును వేంకట్రామయ్యగారి వీధియరుగుమీఁద గూరుచుండి వారువారు చెప్పినది వినుచుండఁగా లక్ష్మీనరసింహముగారి మిత్రుఁడైన బయపునేని వేంకటజోగయ్యగారచ్చటకువచ్చి యీసభయేమని యడిగెను. ఆయనతో జరిగినకథ నంతను జెప్పఁగా, లక్ష్మీనరసింహముగారి సమక్షమున నీ వ్యవహారము నడచుట మంచిదని చెప్పి తానుపోయి యేమో మాటాడి యాయన నక్కడకుఁ దీసికొనివచ్చెను. మిత్రబలముచేత లక్ష్మీనరసింహముగారు కొంత నిర్భయతపూని యీ యల్లరియంతయు నేను చేయుచున్నానుగాని నామీఁద నెవ్వడును సందేహ పడుచుండ లేదని చెప్పెను. అపయి నెవ్వరికేఁదోచిన మాటలు వారనఁదొడఁగిరి. అందఱు చెప్పినమాటలను విన్నపిమ్మట మిత్రుఁడైన వేంకట జోగయ్యగారుసహిత మింతమంది మీకు వ్యతిరేకముగాఁ జెప్పుచున్నప్పుడు మీరు మీనడతను శుద్ధపఱుచుకోవలసినదని లక్ష్మీనరసింహముగారితోఁ జెప్పవలసినవారయిరి. ఈ దినము మొదలుకొని రామబ్రహ్మముగారి యింటిమీఁద రాళ్లుపడుట నిలిచిపోయి నాకృషివలన వారియాపద నివారణ మయినందుకు నేను

ఈ వ్యవహారము నడచిన తరువాత దాదాపుగా సంవత్సర కాలమునకు మిత్రులతో నాలోచించి యాలోచించి లక్ష్మీనరసింహాముగారు నేను తన్నిండ్లమీఁద రాళ్లు వేయించినట్టును తననడత మంచిదికానట్టును పెద్దమనుష్యులయెదుట దూషించినందునకయి మూడు వేల రూపాయలు నష్ట మిప్పింపఁగోరి 1890 వ సం॥ జూలయి నెల 15వ తేదిని మండలన్యాయసభలో నామీఁద వ్యాజ్యము తెచ్చెను. నేను దీని కెంతమాత్రమును జడియక యీవ్యవహారవిషయమై నాతో మాటాడినవారితో నతఁడు రాళ్లు వేయించినట్టును అతని నడత మంచిది కానట్టును నేను ఋజువుచేసెదనని స్పష్టముగాఁ జెప్పితిని. అందుమీఁద నాతని మిత్రులును న్యాయవాదియైన దుర్గాప్రసాదరాయఁడుగారును ఆలోచించి, దండవిధి (Criminal) వ్యవహారములో నతనినడతయు వాసికయు విచారణీయములు కాకపోవుటచే నట్టియభియోగమును దెచ్చి యిది తమ కనుకూలముగాఁ దీర్పఁబడిన యెడల నీవ్యాజ్యమును తీసివేసికోవలెనన్న యుద్దేశముతో 1890 వ సంవత్సరము జూలై నెల 29వ తేదిని పయిని జెప్పఁబడిన దూషణము కొఱకే నామీఁద సంయుక్త దండవిధాయకునియొద్ద నభియోగము తెచ్చిరి. ఈ విషయమును మండల న్యాయాధిపతి తన తీర్పులో నిట్లు వ్రాసెను.

"There is no doubt whatever in my mind on the very strong testimony for the defence, that at the time when the imputation and insinuation under the 5th and 7th issues were made plaintiff's reputation was distinctly *bad*; and I cannot help thinking that it was his own consciousness of this fact (and there is the evidence of the plaintiff's 6th and defendant's 34th witnesses to support this conclusion) that prompted him after launching this suit, to proceed criminally against defendant in the Joint Magistrate's Court where his own character and reputation could not be gone into so

**that if he succeeded there he would be in a position to withdraw this suit without any exposure."**

(ప్రతివాది పక్షమున వచ్చిన మిక్కిలి బలమైన సాక్ష్యమును బట్టి 5, 7 సారాంశములక్రింద యారోపణమును వ్యాజోక్తియు చేయఁబడిన కాలములో వాదియొక్క పేరు స్పష్టముగాఁ జెడ్డదిగా నున్నందుకు నామనస్సులో సందేహ మెంతమాత్రమును లేదు; ఈ తత్వమునుగూర్చిన తనరెుుుకయే ఈ సిద్ధాంతమును పోషించుటకు వాదియొక్క 6 వ సాక్షియొక్కయు ప్రతివాదియొక్క 34వ సాక్షి యొక్కయు సాక్ష్యము గలదు. అందు తన నడతయు పేరును విచారింపబడనేరవు గావున తా నక్కడ జయము నొందినపక్షమున దోష ప్రాచుర్యమేమియు లేకుండ ఈ వ్యాజ్యమును తీసివేసికొను స్థితిలో నుందునని యీ వ్యాజ్యము వేసినతరువాత సంయుక్తదండవిధాయకుని సభలోఁ బ్రతివాదిమీఁద దండవిధివ్యవహారమును నడపుట కతనిని త్వరపెట్టిన దని నేను తలఁపకుండఁజాలను.)

ఈ యభియోగముతోడనే మహారణ్యపురాధిపత్య మన్న ప్రహసనము తన్నుద్దేశించి ప్రకటింపఁబడిన దనియు, తత్ప్రకటనమునకయి నన్ను శిక్షింపవలయు ననియు లక్ష్మీనరసింహముగారు నాపై నింకొక యభియోగమును గొండఁ దెచ్చిరి. ఈ వ్యవహారములను నడుపుటకయి తఱచుగా న్యాయసభలకుఁ బోవలసి వచ్చుచుండునని నేను సంవత్సరకాలము సెలవు పుచ్చుకొని పాఠశాలకుఁ బోవుటమాని నిలిచితిని. వాదిపక్షమున న్యాయవాదియైన దుర్గాప్రసాదరాయఁడుగారు నన్నేలాగుననైన శిక్షింపఁజేయవలె నని యెంతో పట్టుదలతోఁ బని చేయఁదొడఁగిరి; నాపక్షమున న్యాయవాదియైన న్యాపతి సుబ్బారావు పంతులుగారును మిత్రపక్ష మవలంబించి నన్నేలాగుననైన శిక్షనుండి తప్పింపఁజేయవలె నని వాదియొక్క న్యాయవాదికంటెను పదిరెట్లెక్కువ పట్టుదలతోఁ బనిచేయసాగిరి. మిత్రవిషయమయి పంతులుగారు

పడినశ్రమ యింతయని చెప్పుటకు శక్యముకాదు. ఈపనిలో నాయన నిద్రాహారములను గణన చేయలేదు; తమనిద్రను మానుకొని రాత్రి యెంతో ప్రొద్దుపోయినదాఁక మేలుకొని యీవిషయమయి గ్రంథమును చదువుట మొదలయిన పనిని చేయుచు వచ్చిరి; పగలు వేళకు భోజనమునకుసహితము పోవక యీ వ్యవహారవిషయమున సాక్ష్యమును చూచుట మొదలయిన పనిలో నెంతోసేపు కాలము గడుపుచుండిరి. ఆయనకు భోజనము చేయునప్పుడును వెలుపలికి పోయినప్పుడునుకూడ నీ విషయమైన చింతయేకాని కొంతకాలము వేఱు చింత లేకుండెను. ఆ సమయమునందు నావిషయమయి యాయనకుండిన మనోవ్యాకులతలో షోడశాంశమైనను నాకు లేకుండెను. నే నన్నమాటలు నిజములన్న నమ్మకముచేత వ్యవహార మెట్లు ముగిసినను సంతోషమే యని నేను నిర్విచారముగా నుండెడివాఁడను. వ్యవహార మడుసులోఁబాతిన కంబమువంటి దగుటచేత నే నంక కొఱగునోయన్న యాలోచనచేత కొన్నిసమయములయం దాయనకు రాత్రులు నిద్రసహితము తిన్నగాఁ బట్టకుండెను. ఈవిషయమయిన గ్రంథమును చదువుటకు రాత్రులప్పుడప్పుడు నన్నాయన తమయింటికి రమ్మనుచుండెడి వారు. నేను సుఖముగా భోజనముచేసి పోయి యాయన కష్టపడి గ్రంథమును చదువుచుండఁగా నేను పరుండి హాయిగా నిద్రపోవుచుండెడి వాఁడను. ఇన్ని వ్యవహారములు ధర్మస్థానములలో పైని నిలుచుండఁగా నిట్లు నిద్ర యెట్లు పట్టునని యాశ్చర్యపడి నన్నాయన లేపి మా యింటికిఁ బంపుచుండెడివారు. మిత్రకార్యతత్పరత్వముచేత నా విషయమయి యాయనపడినశ్రమకుఁ గృతజ్ఞతాపూర్వకములైన వందనములు సమర్పించుటతప్ప వేఱు ప్రతిక్రియ నేను చేయఁజాలను; లక్షరూపాయలిచ్చినను నాకు వారు చేసిన యుపకారఋణము తీఱదు; లక్షరూపాయలిచ్చినను వా రితరులవిషయమయి యింతశ్రద్ధ వహించి పనిచేసి

యుండరు. ధనికుఁడనుగాని నేనాయన కిట్లు శ్రమపడి పనిచేసినందున కొక్క చిల్లిగవ్వయయినను ప్రతిఫలముగా నియ్యలేదు; ఆయనయు మిత్రభావముచేతనే కాని ధనాపేక్షచేత పని చేయనులేదు. ఆయనయే నాకుఁ గావలసి నప్పుడెల్లను ధనసాహాయ్యమును జేయుచుండెడివారని యీవఱకె చెప్పియుంటినిగదా! ఆయన నాకుఁ జేసిన యుపకారమును నాజన్మమధ్యమున నే నెప్పుడును మఱలఁజాలను.

వ్యవహారము కొంతవఱకు నడచినతరువాత నాప్రతిపక్షులు సహిత మాచిక్కులోనుండి యేలాగునసైన గౌరవముతో వెలువడి యీవలఁ బడవలె నని చింతింప మొదలుపెట్టిరి. ఉభయపక్షముల కును సంధి చేయవలెనని ప్రముఖు లనేకులు ప్రయత్నించిరిగాని నామూర్ఖపుపట్టువలన వారికృషి సఫల మయినదికాదు. మా శాస్త్ర పాఠశాలా ప్రధానోపాధ్యాయులైన మోట్కూరుపుర్నారాగారు ఉభయపక్ష ముల గౌరవమును నిలుపఁగోరి, మీరు క్షమార్పణమునుగాని విచార సూచనమును గాని చేయవలసిన పనిలే దనియు, పూర్వ మాయన నడత మంచిదికాదని యభిప్రాయపడి యిప్పు డితరులు మంచిదే యని చెప్పుటచే నే నన్నమాటలు మరలించుకొనుచున్నా నని చెప్పిన చాలు ననియు దాని కెవ్వరికిఁ దోఁచిన వ్యాఖ్యానములు వారు చేసి కొందురుగాన నింతమాత్రమున కొడఁబడవలసినదనియు బహువిధ ముల నాతోఁ జెప్పిరికాని 'యిప్పుడుసహిత నతఁడు మంచివాఁడు కాఁడనియే నేను దృఢముగా నమ్ముచున్నందున నేనట్లు సందిగ్ధవచన ములు వ్రాయుటకుసహిత మొడఁబడ నేర' నని యాయనకోరికను నిరాకరించితిని. సుబ్బారావు పంతులుగారు నన్ను సమాధానపడకుండఁ జేసిరని కొంద ఱభిప్రాయపడిరి కాని వారనుకొన్నది సరికాదు. ముందు పర్యవసాన మెట్లు తేలినను ప్రస్తుత మీయాయాసమును ధనవ్యయ మును మనస్తాపమును తప్పించుకొని నిశ్చింతముగా నుండుట కయినను

వారు కోరినదాని కొప్పుకొని సంధిచేసికోవలసినదని పంతులుగారెంత దూరమో చెప్పిరిగాని నేనే నాపట్టును విడువకుంటిని. నేను నాకుఁ దోఁచినట్టేకాని యితరులు చెప్పినట్టుచేసెడు స్వభావముగల వాఁడను కాను; ముందుకార్య మేవిధమున ముగియునో యని భయపడుస్వభావము కలవాఁడనుకాను. ఈవ్యవహార మిట్లు జరుగుచుండఁగా రాణిగారి (జ్యూబిలి) యుత్సవమున కయి కర్చుపడఁగా మిగిలియున్నకొంచెముసొమ్ము నేజనోపయుక్తకార్యము నిమిత్తము వ్యయపెట్టవలెనో యాలోచించి నిశ్చయించుటకయి పురజనులసభ యొకటి జరగెను. ఆసభయందు రాజకీయవైద్యుఁడు ధర్మవైద్యశాలకుఁ జికిత్సనిమిత్తమయి వచ్చెడి నిరుపేదల యాచ్ఛాదన దానమునకయి దాని నుపయోగపఱుపవలసినదని కోరెను; విద్యార్థులు నా పక్షమున సాక్షులుగా నుండినవారును కొందఱు బంతులాటకయి చిత్రవస్తుప్రదర్శనశాలలోఁ జత్వరమును (Tennis Court) వేయించుటకయి దాని నుపయోగపఱుపవలసినదని కోరిరి. అప్పుడు నేను లేచి వ్యాధిబాధితులైన నిరుపేదలకు వస్త్రదానము చేయుటకయి యున్న యల్పధనమును వ్యయపెట్టవలసినదని యొకరు చెప్పుచుండఁగా ధనికులును విద్యార్థులు నయిన సంపన్నగృహస్థులు జనోపయుక్తమని చెప్పి తమ నిమిత్తమయి కందుకక్రీడాచత్వరమును దానితో వేయింపుమని కోరుట యవమానకరమును స్వప్రయోజనపరత్వము నని చెప్పితిని. నా మాటలువిని నాప్రతిపక్షులు కరతాళధ్వనులు చేసి నన్నభినందించిరి. సభనుండి మేమీవలకు రాగానే సుబ్బారావుపంతులుగారు నావద్దకు వచ్చి మీవ్యవహారము తుదముట్టువఱకును మీరిఁకముందుసభలకు వచ్చి మాటాడకుండుఁడని నన్ను గడ్డము పట్టుకొని బతిమాలుకొనిరి. మావ్యవహారములో సాక్షులవిచారణ మారంభమయినది. నాప్రతిపక్షమున వచ్చినసాక్షులలోఁ గొందఱు మిత్రరక్షణ తత్పరత్వము

చేతనో ధారణశక్తి లోపముచేతనో నేను తమతో ననినమాటలను గూడఁ గొన్నిటిని నేనన్నట్లు తమసాక్ష్యములోఁ జెప్పిరి. అందుచేత దండాధికారి వారిసాక్ష్యమును విశ్వసింపకపోవుట సహితము తటస్థించెను. నేను బ్రాహ్మణుఁడను లక్ష్మీనరసింహముగారు బ్రాహ్మణేతరుఁడు నగుటచేత మావివాదము మాలో మాకుఁగలిగిన విశేషవివాదమే యయినను బ్రాహ్మణులకును బ్రాహ్మణేతరులకును సంభవించిన సామాన్యవివాదమునుగాఁ గల్పించి నాప్రతిపక్షులును తన్మిత్రులు కొందఱును తమపక్షమును బలపఱుచుటకయి పాటుపడి కొంతవఱకు సఫలమనోరథు లయిరి కాని సంపూర్ణ మనోరథసాఫల్యమును బొందఁ జాలరైరి. బంధువులయొక్కయు కులమువారియొక్కయు నిర్బంధమును సరకుగొనక బ్రాహ్మణేతరులలో ననేకులు నాపక్షమున సాక్ష్యమిచ్చిరి. విమర్శ ముగిసినమీఁదట ముందుగా దండవిధాయకుఁడు 1891 వ సం॥ జూలయి నెల 27వ తేదిని తీర్పుచెప్పి నామీఁదఁ దెచ్చిన యభియోగములను రెంటిని కొట్టివేసెను. ఆదండవిధాయకుఁ డింటిమీఁద రాళ్లువేయుట విషయములోను నడత మంచిది కాదన్న విషయములోను నేనన్న మాటలు సరియైనవనియే యభిప్రాయపడెను. నాప్రతిపక్షియొక్క నడతనుగూర్చి తీర్పులో వ్రాయఁబడినదానిలోఁ గొన్ని భాగముల నిందు క్రిందఁ బొందుపఱుచుచున్నాను.

13. With regard to the Deft's statement that complainant was not a man of good character, the Defendant states that in making this remark he had in his mind the general reputation of the complainant as a man of adulterous charactor, untruthful and given to misappropriating money. If the word "character" is taken to mean merely reputation the Defendant's statement that the complainant was not a man of good character is proved by the evidence to be perfectly true..........................................................................

14. It is contended for the prosecution that the word character as used by the Defendant cannot be taken to mean merely reputation and that Defendant clearly expressed an opinion that complainant's conduct as well as his reputation was bad. The defence have produced a mass of evidence, to prove that complainant's conduct was as such as would lead any reasonable person to suppose that he was dishonest, unprincipled and of loose morals. It would have been sufficient to make out his case, if the Defendant had merely proved a few instances of complainant's bad conduct and I propose to touch only on a few incidents......................

15. One of the facts which the Defence has endeavoured to establish is that while the complainant was giving out to the public that he was working a number of schools as the Agent or Manager of the Theistic Society in the interests of religion and morality he was in reality working these schools as private proprietory schools of his own and misapplying if not misappropriating their funds. The facts proved are as follow:— In Ex LXIII a letter written on 28—12—82 by the complainant to the President of the Educational Commission he describes the Theistic Society as "chiefly an educational body". In Ex. LXVI a letter written by the complainant on 19—3—83 he makes mention of the "Theistic Society's Schools". In Ex. IX a letter written by the complainant on the 14th March 1882 he refers to the resolutions of the Theistic Society and promises to send a copy of the same to the person he addresses. In Ex. VIII dated 31—10—83 the complainant writes "I am finishing the accounts of the Society for the last two years." In Ex. LXIV a letter written by the secretary of the Theistic Society under the complainant's directions to the Director of Public Instruction, the writer alleges that the records of the Theistic Society have been filed in court in a certain case These documents in themselves, independantly of the oral evidence on the point clearly show that the complainant was giving out to the public that there was a regular organized society called the Thestic Society which recorded resolutions, kept accounts and started schools as an educational body and that he was Manager of those schools on behalf of the Society. What, however, was really the fact is clear from the complainant's own admissions in cross examination. He there says "I called myself, my teachers and sym-

pathisers the Theistic Society. * * The Society was to help me generally. * * It had no control over any of the school of its own. * * The Society did not hold meetings or pass pro ceedings as a society. It had no rules and no funds. * * I never rendered any accounts. No one had a right to call for accounts;" and further on he says "I treated my schools as part of my property." Such is the wide difference between the reality and the representations made by the complainant to the public regarding that great educational body the Theistic Society and its schools, its resolutions and its accounts.

That the Defendant knew that the complainant was imposing on the public in this way there can be no reasonable doubt. The Defendant has been intimately associated with complainant for years and Defendant was for a long time the editor of a local newspaper to whom as a matter of course all local news of importance would find its way. Knowing then as he must have known the differencebetween what complainant professed to the public and what he did there is small wonder that he formed the opinion that he was not a man of good character so far as straightforward ness and truthfulness are concerned.

16. As regards the way in which complainant dealt with the funds of his schools we have his own admission vizt "I treated my schools as part of my property." That they. were not part of his property and that he had no business to treat them as such is abundantly evident from the evidence and his own admissions in cross-examination. The Dowleswaram School, it is proved, was handed over to him as manager by a Committee with a surplus of over Rs. 500 in about August 1883. There is evidence to show that the Committee still continued to exist and take an interest in the school after the transfer. Complainant denies this, but even supposing the committee became extinct this did not make the school the complainant's private property. The school funds were clearly trust property which he was bound to account for and manage with the utmost care and prudence. Ex. LXXII the Educational Administration report for 1883—84 shows that the school was in a very flourshing condition during official year 1883—84. The whole of the expenditure was met from fees, subscriptions and Rs. 78 grants. Nothing was shown as drawn out of the endowment fund (viz, Rs. 475 deposited in the Savings Bank which the com-

mittee had handed over to the complainant). As a matter of fact, however, the Savings Bank book shows that on the 21st March 1884 the complainant drew out of the Bank Rs. 300, on the 2nd April 1884 he drew out Rs. 170 and on the 26th May 1884 he drew out Rs. 8. The fact that the sum of Rs. 300 drawn in March 1884 is not shown in the financial statement. Ex. LXXII is almost conclusive proof that it was not drawn for expenditure on the school, and if not drawn for the purpose the inference is almost irresistable that it was drawn for the complainant's private purposes and was therefore misappropriated. This inference is corroborated by the complainant's subsequent conduct in October 1884 when he handed back the management of the school to the committee, in debt and with the accumulated surplus he had received in August 1882 all spent (except about Rs. 18 in the Savings Bank). He at first distinctly promised to render accounts (Ex. LX). Subsequently the new Manager Mr. Vanstavern (the 20th Def. witness) found he could get no accounts out of him and no replies to his letters asking for accounts. After sometime one of the masters sued complainant for arrears of pay due to him and an arbitrator was appointed to enquire into the matter. To that arbitrator the complainant rendered a partial account Ex. EXXXVI of the money he had drawn from the Savings Bank in which occur the following items.

| | | |
|---|---|---|
| Pay to Head Master from 9th May to 19th July 1884. | Rs. | 106—14—6 |
| Pay of the above for September 1884 | „ | 50— 0—0 |
| Travelling allowance of the above | „ | 6— 0—0 |
| Mr. Muthuswami Iyer s pay for October 1884 | | 50— 0—0 |
| Mr. Venkayya Sastry for April, May&June 1884 | | 30— 0—0 |
| | Rs. | 242—14—6 |

Some more items are given without dates, but the above items are sufficient to show that out of the Rs. 470 drawn by the complainant out of the Savings Bank in March and April 1884 he can only account for Rs. 242 odd by saying that he paid sums which did not fall due till after he drew the money out. His pleader says that he sometimes paid advances to masters but there is no evidence to support

this and it is most improbable that he was making advances of pay to masters when we find that at least two of the masters sued for arrears of pay after he handed over the management. Moreover Muthuswami Sastri to whom Rs. 50 is shown as paid was not employed in the school till October 1884 and no advance could have been paid to him in March or April 1884.

We have further evidence to show that complainant was in debt and at the same time celebrated his sister's marriage in 1884. An unprejudiced person in possession of these facts would certainly have had ample grounds for saying that the complainant had misapplied if he had not misappropriated trust money entrusted to his charge. It may not be that Deft. knew all the facts now before the court, but he had ample opportunities of getting information from other sources and as long as the court finds that there is evidence of complainant's bad conduct about which Deft. might have come to know it is not necessary for the Deft. to put forward how exactly he derived his information.

17. Another instance of the complainant's misuse of money to which he had no right is in the case of the Peddapur school. He claims to have been appointed Manager of the school, but this fact is negatived by the oral evidence and the documents on which complainant himself relies do not support this contention. Ex. H is a letter written to the complainant by the previous Manager Mr. Perraz. In this letter Perraz no doubt asks the complainant to accept the management of the school, but the evidence of M. Subba Rao (19th Def. Witness) and the subsequent correspondence between him and the complainant show clearly that the Complainant never assumed management of the school and that Perraz subsequently changed his mind and transfered the management to a committee (Vide Ex. XXXVIII, Ex. J Ex. XLVIII, Ex. XLIX, Ex. Z, Ex. XLI).

The letter Ex. H asking complainant to become manager is dated 25—5—85. Immediately on receipt of this we find that the complainant wrote Ex. XXVIII dated 28—5—85 to the Secretary of the school asking him what funds he had got. On the 18th June 1885 he went down to Peddapur and although he did not assume management he took Rs. 80 from the Secretary under the pretence of getting furniture

for the school. For a space of three whole years after this the complainant would neither refund the Rs. 80 nor supply any furniture. This is clearly proved by the documentary evidence. At last after a suit was filed against him on the 18th June 1888 (vide Ex. XLV.) he paid up. His only explanation is that he took the money as manager, that Perraz had no business to subsequently transfer the management without his consent after putting him to the expense of going to Peddapur and that on this account he refused to recognize the School Committee and repay them the Rs. 80. Nothing can be more unsatisfactory than this explanation. Complainant's quarrel admittedly was with Perraz. If Perraz caused him any loss it was he whom he should have sued. There was not a shadow of justification for his refusing to part with the school money after he knew that the proposal made by Perraz to make him Manager was withdrawn and a committee was actually working the school. His retention of the Rs. 80 for these three years if not a misappropriation of money under the Penal Code is at any rate a most immoral and unjustiafible transaction for which he would well merit the epithet of a bad character.

18. I consider it unnecessary to touch on any more of the mass of evidence produced to prove the complainant's bad character. The above remarks are in my opinion sufficient to show that there were ample grounds for an unprejudiced person to describe him as a man who was not of good character.

(13. వాది మంచి నడతకలవాఁడు కాఁడని) ప్రతివాది చెప్పిన దానినిగూర్చి, తానీవిషయమును ముచ్చటించినప్పుడు వాది జారుఁడు, అసత్యవాది పరులసొమ్మపహరించువాఁడు, అన్న యాతని సామాన్య ఖ్యాతి తనమనస్సులో నున్నదని ప్రతివాఁది చెప్పుచున్నాఁడు 'నడత' అన్న పదమునకు 'ఖ్యాతి' అని మాత్రే మర్థముచేసెడుపక్షమున, వాది మంచి నడతకలవాఁడు కాఁడన్న సంగతి పూర్ణముగా సత్యమ యినట్టు సాక్ష్యమువలన ఋజువుచేయఁబడినది.

**14.** ప్రతివాదిచేత నుపయోగింపఁబడిన నడత యన్నపదము ఖ్యాతియనిమాత్ర మర్థమయినట్టు గ్రహింపఁగూడదనియు, వాది

యొక్క ఖ్యాతియు వర్తనమునుగూడ చెడ్డవని ప్రతివాది స్పష్టముగాఁ దనయభిప్రాయమును తెలిపియున్నాఁడనియు, వాదిపక్షమున వాదింపఁ బడినది. వాదివర్తనము వివేకముగల మనుష్యుని నెవ్వనినైన వాది యన్యాయపరుఁడు నీతినూలినవాఁడు వ్యభిచారి యని భావించునట్లు చేసెడునట్టిదని ఋజువుచేయుటకయి ప్రతివాదిపక్షమున కావలసినంత సాక్ష్యము తీసికొని రాఁబడినది. వాదియొక్క చెడునడతను గూర్చి కొన్ని సంగతులనుమాత్రమే ప్రతివాది ఋజువుచేసినను, తన పక్షమును స్థాపించుటకయి చాలియుండును. నేను కొన్ని సంగతులను మాత్రమే చేకొనుట కుద్దేశించుచున్నాను....................

15. ప్రతివాదిపక్షమున స్థాపింపఁ బ్రయత్నము చేసిన సంగతులలో నొకటి మతముయొక్కయు నీతియొక్కయు అభివృద్ధినిమిత్తము ఆస్తికసమాజముయొక్క ప్రతినిధిగానో కార్యనిర్వాహకుఁడుగానో పెక్కుపాఠశాలలను తాను జరుపుచున్నట్టు లోకమునకు వెల్లడించుచు వాది నిజమునకీపాఠశాలలను తన సొంతస్వామ్యముక్రింద తనపాఠశాలలనుగా జరిపుచు వానిమూలధనముల నపహరింపకపోయినపక్షమున దుర్వినియోగము చేయుచుండెననుట. ఈ క్రిందివి ఋజువు చేయఁబడిన సంగతులు—63 వ సంఖ్య నిదర్శనపత్రమయిన 28-12-82 తేదీని వాది విద్యాసంబంధ నియుక్తసభాధ్యక్షునకు వ్రాసిన యుత్తరములో ఆస్తికసమాజమును "ముఖ్యముగా విద్యాసంబంధ సంఘమునుగా వివరించెను." 66 వ సంఖ్య నిదర్శనపత్రమయిన 19-3-83 వ తేదిని వాదిచే వ్రాయఁబడిన యుత్తరములో "ఆస్తిక సమాజముయొక్క పాఠశాలలు" అని చెప్పుచున్నాఁడు. 9-వ నిదర్శనపత్ర మయిన 1883-వ సం॥ 14-మార్చి తేదిని వాదిచే వ్రాయబడిన యుత్తరములో ఆస్తికసమాజముయొక్క నిర్ధారణములనుగూర్చి చెప్పుచు వానియొక్కనకలును తానుత్తరము వ్రాసినవానికిఁ బంపెద

నని వాగ్దానము చేయుచున్నాఁడు. 31-10-83వ తేదిగల 8-వ సంఖ్య నిదర్శనపత్రములో "వాది సమాజముయొక్క కడచిన రెండేండ్ల లెక్కలను నేను ముగించుచున్నాను" అని వ్రాయుచున్నాఁడు. 64-వ సంఖ్య నిదర్శనపత్రమయిన వాదియొక్క యుత్తరువుమీఁద ఆస్తిక సమాజకార్యదర్శి చేత విద్యావిచారణాధికారికి వ్రాయఁబడిన యుత్తరములో ఆస్తికసమాజమువారి కాగితము లొకానొకవ్యవహారములో న్యాయసభలో దాఖలు చేయఁబడినవని యతఁడు చెప్పుచున్నాఁడు. ఈలిఖితములే వాగూ్రిపమైన సాక్ష్య మక్కఱలేకుండ వాది ఆస్తిక సమాజమను నామముతోఁ గ్రమముగా నేర్పాటుచేయఁబడిన యొక సమాజముస్నట్టును, అది నిర్ధారణములు చేసి లెక్కలుంచి విద్యాసంబంధసంఘముగాఁ బాఠశాలలను స్థాపించినట్టును, తాను దానిపక్షమున పాఠశాలలకార్యనిర్వాహకుఁడయినట్టును, లోకమునకుఁ బ్రకటించుచున్నాఁడని స్పష్టముగాఁ జూపుచున్నవి. అడ్డుపరీక్షలో వాది చేసిన యొప్పుదలలను బట్టియే వాస్తవ మేమో స్పష్టమగుచున్నది. అందులో నతఁడు "నన్నును, నా యుపాధ్యాయులను, అభిమానులను, ఆస్తిక సమాజమని పిలిచెడివాఁడను..." ... "సమాజము సామాన్యముగా నాకు సాయము చేయుటకే"......... "ఆపాఠశాలలలో దేనిమీఁదను దాని కధికారము లేదు"..."సమాజము సభలు చేయుటగాని సమాజముగా చర్యజరుపుట కాని లేదు. దానికి నిబంధనలు లేవు సొమ్ములేదు." ... "నే నెప్పుడును లెక్కలు చెప్పలేదు. నన్ను లెక్కలు చెప్పుమని యడుగుట కెవ్వరికిని అధికారములేదు." అని చెప్పుచున్నాఁడు. అటుతరువాత నతఁడు "నాపాఠశాలలను నా సొత్తులో భాగముగా నే నెంచినాఁడను" అని చెప్పుచున్నాఁడు. గొప్ప విద్యాసంబంధిసంఘమనియు దాని పాఠశాలలనియు నిర్ధారణము లనియు లెక్క లనియు, ఆస్తికసమాజమును

గూర్చి వారి లోకులకుఁ జెప్పుచున్న దానికిని సత్యములకును ఇంత గొప్పవ్యత్యాసమున్నది.

ఈవిధముగా వాది జనులను వంచించుచున్నాఁడని ప్రతివాది యెఱిఁగియుండె ననుటకు న్యాయమైన సందేహము లేదు. వాది ప్రతివాదితో సంవత్సరములకొలఁది నన్యోన్యముగాఁ గలిసియుండుటయే కాక ముఖ్యమైన స్థానికవృత్తాంతము లన్నియు సాధారణముగాఁ బంపఁబడు చుండెడు స్థానికవృత్తాంతపత్రికకుఁ జిరకాల మధిపతియయి యుండెను. తనకుఁ దెలిసియుండవలసినట్లుగా వాది ప్రజలకుఁ బ్రచురించుచున్న దానికిని తాను చేయుచుండిన దానికిని గల వ్యత్యాసము తెలిసినవాఁడయి ప్రతివాది యతఁడు ఋజుప్రవర్తనముతోను సత్యసంధతతోను సంబంధించి యున్నంతవఱకు మంచినడత కలవాఁడు కాఁడని యభిప్రాయ మేర్పఱచుకొని యుండుట వింతకాదు.

16. వాది తనపాఠశాలల సొమ్మువిషయమయి వ్యవహరించిన మార్గమునుగూర్చి "నా పాఠశాలలను నా సొత్తులో భాగముగా నేనెంచుకొన్నాను" అని యతఁడు చేసిన యొప్పుదలయే మనకున్నది. అవి తన సొత్తులో భాగము కావనియు వానినట్టి వానినిగా వ్యవహరించుట తప్పనియు సాక్ష్యము వలనను అడ్డపరీక్షలో నతఁడు చేసిన సొంతయొప్పుదలల వలనను చక్కఁగా విశదమగుచున్నది. ధవళేశ్వరము పాఠశాల యేనూఱురూపాయల కంటె నెక్కువగాఁ గల నిలువసొమ్ముతో సంఘమువారిచేత 1883-వ సం॥ ఆగష్టు నెల ప్రాంతమునందు కార్యనిర్వాహకుఁడుగా బనిచేయుట కాతని వశముచేయఁబడినట్టు ఋజువు చేయఁబడినది. ఈ కార్య నిర్వాహకత్వ సంక్రమణానంతరమున కూడ సంఘము నిలిచియుండి పాఠశాల విషయమయి శ్రద్ధవహించుచుండినట్టు చూపుటకు సాక్ష్యమున్నది. వాది యిది లేదనుచున్నాఁడు కాని సంఘము పోయిన దనుకొన్నను అందు

నెలలో తాను పాఠశాలయొక్క కార్య నిర్వాహకత్వమును మరల సంఘమువారి కప్పగించి నప్పటి వాదియొక్క తరువాత నడతచేత నీయూహ దృఢపఱుపఁబడుచున్నది. ఆతఁడు లెక్క చెప్పుటకు మొట్ట మొదట స్పష్టముగా వాగ్దానము చేసెను (60 నిదర్శన పత్రము). తరువాత క్రొత్త కార్యనిర్వాహకుఁడైన వాన్ స్టాపరన్ గారు (ప్రతివాదియొక్క 20 వ సాక్షి) అతని వద్దనుండి లెక్కలను లెక్కల నిమిత్తమయి వ్రాసిన యుత్తరములకు ప్రత్యుత్తరములను బడయ లేనట్టు కనుఁగొనెను. కొంత కాల మయిన తరువాత నుపాధ్యాయు లలో నొకఁడు తనకు బాకిపడియున్న వెనుకటిజీతము నిమిత్తము వాదిమీఁద న్యాయ్యము తేఁగా, ఆవిషయమును విచారించుటకు యొక మధ్యవర్తి యేర్పఱుపఁబడెను. ఆ మధ్యవర్తికి వాది తాను రక్షణ నిధిలోనుండి తీసిన సొమ్మునకయి యిచ్చిన యసంపూర్ణమైన లెక్కలో (86 వ నిదర్శన పత్రము) ఈక్రింది పద్దులు కనఁబడు చున్నవి:

| | |
|---|---|
| 1884వ సం॥ 9వ మెయి మొదలు 19 వ జూలై నఱకు ప్రధానోపాధ్యాయుని జీతము | రు. 106-14-6 |
| 1884 వ సం॥ సెప్టెంబరుకు పైవారి జీతము | 50- 0-0 |
| పైవారికి ప్రయాణవ్యయములు | 6- 0-0 |
| 1884వ సం॥ అక్టోబరు నెలకు ముత్తుస్వామి అయ్యరు గారి జీతము. | 50- 0-0 |
| 1884 సం॥ ఏప్రిల్, మే, జూన్ నెలలకు వెంకయ్య శాస్త్రిగారి జీతము. | 30- 0-0 |
| | రు. 242-14-6 |

తేదులు లేకుండ మఱికొన్ని పద్దులు [illegible] డినవి కాని 1884 వ సం॥ మార్చి ఏప్రిల్ నెలలలో రక్షణ నిధిలోనుండి వాదిచేత

తీయఁబడిన రు 470-0-0 లలోను తాను సొమ్ముతీసిన యనంతరము వఱకును బాకీపడని మొత్తములను తానిచ్చినట్టు చెప్పుటవలన రు 242 ల పయి చిల్లరకు మాత్రమే లెక్క చెప్పఁగలిగెనని చూపుటకు పయి పద్దులే చాలియున్నవి. అతని న్యాయవాది యతఁడు కొన్ని సమయములయందు పాధ్యాయులకు ముందుగానిచ్చెనని చెప్పుచున్నాఁడు కాని దీని కాధారముగా సాక్ష్యము లేదు; కార్యనిర్వాహకత్వము నొప్పగించి వేసిన తరువాత నధమ ముపాధ్యాయులలో నిద్దఱు తమజీతముల ప్రాతఁబాకీ నిమిత్తము వ్యాజ్యములు వేసినట్టు మనము కనుఁగొనుచున్నప్పు డుపాధ్యాయుల కతఁడు జీతములు ముందుగానే యిచ్చుచుండెననుట బొత్తిగా నమ్మఁదగినది కాదు. అంతేకాక యేఁబదిరూపాయలు ముందుగా నియ్యఁబడ్డట్టు చూపఁబడిన ముత్తుస్వామిశాస్త్రి 1884 వ సం॥ అక్టోబరు వఱకును పనిలో నియమింపఁబడలేదు; కాఁబట్టి యతనికి 1884 వ సం॥ మార్చిలోఁగాని యేప్రిల్‌లోఁగాని ముందుగా జీత మియ్యఁబడి యుండనేరదు.

వారి ఋణములో నున్నాఁడనియు నప్పుడే 1884 సంవత్సరములో నొకరి పెండ్లి చేసెననియు చూపుటకు మన కింకను సాక్ష్యమున్నది. ఈసంగతులను తెలిసియున్న నిష్పక్షపాతియైనవాఁడు వాది తన కప్పగింపఁబడిన నిక్షేపధనమును తా నపహరింపక పోయిన యెడల దుర్వినియోగము చేసెనని చెప్పుటకు నిశ్చయముగా కావలసినన్ని హేతువులను కలిగి యుండును. ఇప్పుడు న్యాయాధికారి యెదుటనున్న సంగతుల నన్నిటిని ప్రతివాని యెఱిఁగి యుండక పోవచ్చునుగాని యతఁ డితరమార్గములచేత సమాచారము సంపాదించుటకు కావలసినన్ని ప్రతివానికి తెలిసియుండవచ్చు నని సాక్ష్యమున్నట్లు న్యాయాధికారి కనుఁగొను చున్నప్పుడు తానీ సమాచా

రము నెట్లు సరిగా తెలిసికొననో తెలియఁబఱుచుట ప్రతివాది కావ శ్యకము కాదు.

17. తనకు స్వాతంత్ర్యములేనిదే ధనమును వాని మర్చినియో గము చేసినందున కింకొక యుదాహరణము పెద్దాపురపు పాఠశాల విషయములో అతఁడు తా నా పాఠశాలకు కార్యనిర్వాహకుఁడుగా నియమింపఁబడినట్టు చెప్పుచున్నాఁడుగాని యామాట వ్రాఁతసా క్ష్యమువలన నిరసింపఁబడుచున్నది; వాదియే తన కాధారముగాఁ జేకొన్న లిఖితములు తన వాదమును పోషింపవు. ఎన్. గుంటూరు నివ ర్తనపత్రము పూర్వపు కార్యనిర్వాహకుఁడైన పేరాజుగారిచేత వాదికి వ్రాయఁబడిన యుత్తరము. ఈ యుత్తరములో పేరాజు పాఠశాలయొక్క కార్యనిర్వాహకత్వము నంగీకరింపవలసినదని వానికి వ్రాసినట్టు సందేహము లేదుగాని యదే. సుగా రావు (ప్రతివాది 19వ సాక్షి) యొక్క సాక్ష్యమును తరువాత నాతనికిని వాదికిని మధ్య నడచిన యుత్తరప్రత్యుత్తరములును వాది చెప్పనును పాఠశాల యొక్క కార్యనిర్వాహకత్వమును వహింపలేకపోయెను పేరాజు తరు వాత తనమనస్సును మార్చుకొని కార్యనిర్వాహకత్వము నొకసభకు ఇచ్చివేసెననియు స్పష్టముగా చూపుచున్నవి. (నివర్తన పత్రములు 38, జే, 48, 49, జడ్, 41 చూడుఁడు.)

వాదిని కార్యనిర్వాహకుఁడుగా నుండవలసినదని కోరుచు ఎన్. గుంటూరు నివర్తన పత్రమైన యుత్తరము 25-5-85 న తేదిని ఆయు త్తరమునందనతోడనే పాఠశాల కార్యదర్శికి నిధి యొంతయున్నదని యడుగుచు 28-5-85 తేదిని 28 వ సంఖ్య నివర్తనపత్రమైన యుత్త రమును వాది వ్రాసినట్టు మనము కనుఁగొనుచున్నాము. 1885వ సం॥ జూన్ 18వ తేదిని వాది పెద్దాపురమునకు వెళ్ళి, కార్యనిర్వాహక త్వమును వహింపకపోయినను పాఠశాలకు బల్లలు మొదలయిన యుప

కరణములు చేయించెదనను మిషమీఁద కార్యదర్శివద్దనుండి రు. 80 లను పుచ్చుకొనెను. ఇది జరగిన తరువాత పూర్ణముగా మూడుసంవత్సరములవఱకును తాను పుచ్చుకొన్న రు. 80–0–0లను తిరిగి యియ్యను లేదు. పాఠశాలోపకరణములను చేయించి పంపను లేదు. లిఖిత సాక్ష్యమువలన ఇది స్పష్టముగా ఋజువు సఱుపఁబడినది. కడపట 1888వ సంవత్సరము జూన్ 18వ తేదిని తనమీఁద వ్యాజ్యము వేయఁబడిన తరువాత (45వ నిదర్శనపత్రము చూడుఁడు) అతఁడు సొమ్మిచ్చివేసెను. అతని యొక్క సమాధానము కార్యనిర్వాహక ధర్మమున తాను సొమ్ము పుచ్చుకొంటిననియు, తనకు పెద్దాపురమునకు పోవుటకయి వ్యయమును గలిగించిన పిమ్మట తన యనుమతిని బడయక వీర్రాజు కార్యనిర్వాహకత్వమును మఱియొకరి కియ్యవలసినదిలేదనియు, అందుచేత తాను పాఠశాలా కార్యనిర్వాహక సంఘము సంకరింప నిరాకరించి రు. 80–0–0 లను తిరిగి యియ్యలేదనియు, అయియున్నది. ఈ సమాధానమునకంటె సంతృప్తికరమైనది మఱియేదియు నుండదు. వాదియొక్క కలహము నిస్సందేహముగా వీర్రాజుతోడిది. వీర్రాజు తన కేమయిన నష్టికలిగించి యుండినయెడల, ఆతనిపైని వ్యాజ్యము వేయవలసియుండెను. తన్ను కార్యనిర్వాహకునిగాఁ జేయుటకయి వీర్రాజుచే చేయఁబడిన కర్తవ్యనిర్దేశము మరలించుకోఁబడి సంఘమువారు పాఠశాలా వ్యవహారములను ప్రత్యక్షముగా జరుపుచున్నారని యెఱిఁగిన తరువాత పాఠశాలసొమ్మును విడువ నిరాకరించుటకు న్యాయసమర్థన లేశమైనను లేదు. ఈమూఁడు సంవత్సరములు రు 80–0–0 లను తానట్టేయుంచుకొనుట శిక్షాస్మృతినిబట్టి ధనాపహరణముకాకపోయిన పక్షమున, ఏవిధముచేతనైనను చెడునడతగలవాఁ డన్నబిరుద నామమునకు తన్నత్యంతార్హునిచేయు మిక్కిలి నీతిమాలినదియు నసమర్థనీయ వ్యవహారమయియున్నది.

18. వాదియొక్క చెడునడతను ఋజువు చేయుటకయి తేఁబడిన సాక్ష్య రాశిలో నుండి మఱియే యితరవిషయమును ముట్టుట యనావశ్యక మని నేను తలఁచుచున్నాను. నిష్పక్షపాతియగు వాఁడతనిని మంచినడత గల వాఁడు కాఁడని నిర్దేశించుటకు కావలసినన్ని హేతువు లున్నవని చూపుటకు పయి నిరూపణములు నా యభిప్రాయమునందు చాలియున్నవి

నేను లక్ష్మీనరసింహముగారి నడత మంచిది కా దన్నానను విషయమును గూర్చి దండవిధాయకుని తీర్పులోనుండి పయిభాగమును తెనిఁగించి వ్రాసియున్నాను. ఇఁక నిండ్ల మీఁద రాళ్ళు వేయించుచున్నారని నేనన్న రెండవ విషయమునుగూర్చి వ్రాయవలసియున్నది. దానిని మండల న్యాయాధిపతియొక్క తీర్పులోనుండి యెత్తి వ్రాయుట కనుజ్ఞ వేఁడుచున్నాను. ఇది కొంత దీర్ఘముగానుండునుగాన చదువరులు విసుగుకొనక నన్ను మన్నింతురని వినయపూర్వకముగా ప్రార్థించు చున్నాఁడను.

"14. ఉభయ పక్షముల వారును చెప్పిడిప్రకారముగ రామబ్రహ్మము గృహముమీఁద రాళ్ళు వేయుట మధ్యమధ్య కొంచె మవకాశముతో నెలల కొలఁది 1889 వ సం॥ ఆగష్టు నెలవఱకును జరగుచు వచ్చెను; వాది ప్రతివాదుల సాక్ష్యమువల్లను ప్రతివాదియొక్క 3, 4, 5, 17 సాక్షుల సాక్ష్యము వల్లను రామబ్రహ్మమును ఇంటికి పెద్దదయిన యాతని వదినె శంకరమ్మయు తమ యల్లునిచేత రాళ్ళు వేయఁబడుచున్నవని తలఁచుగా మొఱ్ఱపెట్టిచుండిరనుట స్పష్టము; పిన్న వయసు వాఁడైన యల్లుని విషయమయి వాది నిర్వివాదముగా విశేషశ్రద్ధను వహించుచుండెను; ఆబాలుఁడీ సారాంశముతో సంబంధించిన కాలమునందు రామబ్రహ్మముతోను శంకరమ్మతోను తగవులాడి భార్యయొక్క (రామబ్రహ్మముయొక్క) యిల్లు విడిచి తన నిమిత్తమయి

వాదిచేసిన యేర్పాటుల ననుసరించి యొక సత్రములో ప్రత్యేకముగా వాసము చేయుచుండెను; ఆతగవులలో వేఱుగా కాపుర ముండుటకు తన భార్యను తన వెంటఁబంపుమని యీ బాలుఁడు కోరినట్టు వాది యే యొప్పుకొనుచున్నాఁడు. రామబ్రహ్మము చచ్చిపోయెను. శంకరమ్మ విచారింపఁబడలేదు; కాని తనతో వేఱుగా కాపురముచేయుటకయి యీ పిల్లవాని భార్యను పంపక నిరాకరించి నందున వాది యీ బాలుని తమ యింటిమీఁద రాళ్ళు వేయుటకు పురికొల్పుచున్నాఁడని తనకుఁ గలిగిన యనుమానములను దాఁచక శంకరమ్మ యింటింటికిఁ బోయి చెప్పుచున్నదని ప్రతివాది యొక్క పైని చెప్పఁబడిన సాక్షుల సాక్ష్యము పూర్ణముగా తెలుపుదు చేయుచున్నది; దీని సూచన తన సంరక్షణములోను స్వాధీనతలోను ఉన్న బాలునితో వేఱు స్థలమునకా పడుచును పంపునట్లు చేయుటకయి ప్రయత్నించుటలో వాదికి దురుద్దేశ మున్నదనుట. ఆ సాక్షులయొక్కయు ప్రతివాదియొక్క యొకటి రెండు సాక్షుల యొక్కయు సాక్ష్యమువలన ఆమె పూర్వపు మొట్టెల వేనివలసను కార్యము లేకపోయిన తరువాతను ప్రతివాది యొకసారి తా నిందులో సంబంధము కలుగఁజేసికొనని నిరాకరించి యధికారులతో చెప్పుకోవలసిన దని యీమెను పంపివేసిన తరువాతను శంకరమ్మ ప్రార్థనల వలన మనసు కరఁగినవాఁడయి ప్రతివాది 1889 వ సంవత్సరము జూలయి 28 వ తేదీని తనవిచారణవల్ల నామెకు సాయముచేయఁ బూనుకొన్నట్లు తేట పడుచున్నది.

15. ఆ దినమున శంకరమ్మ యేడ్చుచు తనవద్దకువచ్చి రాళ్లు పడుటను ప్రయత్నముచేసి మాన్పుటకయి యెవ్వరును తనకు సహాయము చేయలేదనియు, రాళ్ళప్పుడు సహితము పడుచున్నవనియు, రాళ్ళు దగ్గిరాలవారి దొడ్డిలోనుండియు మరణ శాసనాధికారిగానున్న మృత్యుఁజైన చిన్నస్వామిగారి సొత్తయిన పడవల కార్యస్థానముగల

మేడమీఁది నుండియు వచ్చుచున్నవనియు, చెప్పి, వాది విషయ
మయి తనకుఁగల నమ్మకముల నేకరువుపెట్టి, తనతో మొట్టి పెట్టు
కొనెనని ప్రతివాది చెప్పుచున్నాఁడు. అప్పుడు శంకరమ్మ రామ
బ్రహ్మముయొక్క యల్లునితోఁగూడ తిరుపతిరాజు వెంకటప్పయ్య
(వీరిలో మొదటివాఁడు వానియొక్క పాఠశాలలో నుపాధ్యాయుఁడు)
అనెడి యిద్దఱు బాలురనుగూడ కలిపిన దని ప్రతివాది చెప్పుచు
న్నాఁడు. ప్రతివాది దానినిగూర్చి విచారింప నలసినదని యామె
చేసిన ప్రార్థనలకు లోఁబడినవాఁడయి (ఈ పట్టణములో జనులు తమ
దుఃఖములను కష్టములను చెప్పుకొని సహాయము నిమిత్తమును ఆలో
చన నిమిత్తమును ప్రతివాది వద్దకు పోవుచుండు ననుటకు సందేహము
లేదు.) ప్రతివాదియొక్క 17 వ సాక్షితోఁగలసి పయి యిద్దఱు బాలు
రును కాపురమున్న దుగ్గిరాలవారి దొడ్డిలోఁ జేరియున్న యింటి
యజమానుఁడైన దుగ్గిరాల సూర్యప్రకాశరావు (ప్రతివాది పంపిన
సాక్షి) వద్దకు మొదట వెళ్ళెను.

16. వాని క్రిందనున్న యున్నత పాఠశాలయొక్క పట్టా
శాఖకు ప్రధానోపాధ్యాయుఁడుగా నున్న ప్రతివాది మొదటిసాక్షి
కె. రామేశ్వరరావు శంకరమ్మకును ప్రతివాదికిని జరిగిన సంభాషణ
సమయమునందు కలసియుండెను; అతఁడు వారి సంభాషణలోని
వివరముల నన్నిటిని జ్ఞాపకముంచుకొన్నట్టు చెప్పకపోయినను, శంక
రమ్మ చెప్పిన సంగతులవిషయమయి ప్రతివాది సాక్ష్యమును ముఖ్య
ముగా స్థిరపఱచుచు, ఆమె కష్టముయొక్క యాథార్థ్యము తన మన
స్సులో నాటుకొనఁగా తానుగూడ తన ప్రధానోపాధ్యాయుఁడైన
వాదిపై నామె చేసిన దోషారోపణములను తత్క్షణము నమ్మితినని
చెప్పుచున్నాఁడు.

17. ఆదినమున దుగ్గిరాలవారి దొడ్డిలోను రామబ్రహ్మము
గృహమువద్దను చిన్నస్వామి మేడమీఁదను ప్రతివాది చేసిన విచార

న్నాఁడు; ప్రతివాదియొక్క రెండవసాక్షి తనయొద్దనున్న సాధనములపైని రాళ్ళు వేయుటలో వాదికి సంబంధమున్నదని తాను నభిప్రాయమేర్పఱుచుకొని యాయభిప్రాయమును ప్రతివాదికి తెలిపి, దుగ్గిరాలవారి యింటిని వొడ్డిని విడిచిపెట్టినైన నలువురును సదా సంచరింపఁబడిన బాలుడైన తిరుపతిరాజును వెంకటప్పయ్యను వెడలగొట్టవలయునని ప్రతివాది 17వ సాక్షిక ముందుగా హెచ్చరించి యిచ్చుటవలన తనయభిప్రాయమును సార్థకపఱిచితినని చెప్పుచున్నాఁడు. కొన్ని దినముల తరువాత వారంపడి వెడలఁగొట్టబడిరి.

18. పైని చెప్పఁబడిన సాధనములుగాక యీసారాంశము క్రింద నష్టమిప్పింపవలెనను కొనుటకు కాస్పదము లయిన మాటలన్న కాలము వఱకు ప్రతివాని కెక్కువ సాధనసామగ్రిని గలిగి యుండెను.

19. జూలయి 28వ తేదిని వాది రాజమహేంద్రవరములో లేఁడు; కాని పట్టణము తిరిగి రాఁగానే ప్రతివాది తిన్నగా నాతనియొద్దకుపోయి జూలయి 30వ తేదిని మొదటి సారాంశముక్రింద చెప్పఁబడిన సంభాషణము నాతనితో నున్నతిపాఠశాలలో జరపెను. మఱునాఁడు న్యాయవాదియైన పేరాస్వామి నాయని (వాదియొక్క 11వ సాక్షి) యింటివద్ద నీపని కైన సభయే జరగెను; ఈసభకు వాది కోరికమీఁదనే ప్రతివాది పిల్పింపఁబడెను. ఈసభలో తానావలకు చేసిన విచారణనుబట్టి వాది రాళ్ళు వేయుటకు ప్రోత్సాహపఱిచినట్టు తాను నమ్మకమని ప్రతివాది వాదితో తెలియఁబలికినప్పుడు వాది యూరకుండెనని యీ సాక్షి ప్రతివాది చెప్పినదానిని స్పష్టముగా బలపఱుచుచున్నాఁడు. ఈసదత శంకరమ్మ చేసిన దోషారోపణములను బలపఱుచుటకు ప్రబలముగా తోడుపడునదిగా నున్నది. అనుపరీక్షలో వాదియే యీ యంశమును ఒప్పుకొనెను; తిరుగు పరీక్షలో దానికి వ్యాఖ్యానము చేయుట కేమియు నడుగఁ బడలేదు; కాని కూరూరు

11 వ సాక్షి యీ విషయమయి వేంకట్రామయ్య (ప్రతివాది 4 వ సాక్షి) యింటివద్ద వాదికిని ప్రతివాదికిని వేడిమాటలు నడచినందున నాతఁడూరకుండె నని చెప్పుచున్నాఁడు. అయినను ఆగష్టు 2 వ తేదివఱకును వేంకట్రామయ్య యింటివద్ద సమావేశమే నిశ్చయముగా జరగనందున ఈ సమాధాన మంగీకరింపఁబడఁ దగినది కాదు.

20. జూలయి 30వ తేది సభలో వాదియొక్క 11వ సాక్షి కుత్తరముగా ప్రతివాది తనకు సమాచార మిచ్చినవారి పేరులను చెప్పెను; అనుమానింపఁబడిన పిల్లవాండ్రతోకూడ వారందఱును పిలిపింపఁబడిరి; అక్కడజరగిన దానినిబట్టి వాదికి వ్యతిరిక్తమయిన తనసమ్మకము స్థిరపడెనని ప్రతివాది చెప్పుచున్నాఁడు; వాదియొక్క 11 వ సాక్షి సహితము సందేహింపఁబడిన ముగ్గురు బాలురను పంపేయఁబడవలసిన దన్న నిశ్చయమునకు వచ్చితినని చెప్పుచున్నాఁడుపి సభయందు దప్పుచున్న ప్రతివాదియొక్క 17 వ సాక్షి పిల్లవానిభార్య నతనితోనుండుటకు పంపవలెనని వాదిచేసిన ప్రార్థనను తా నంగీకరింపక నిరాకరించిన పేరుచేత వాది యీ శిష్యులమ రాళ్ళు వేయు పురికొల్పినట్లు శంకరమ్మ తనతోనే మొఱ్ఱ పెట్టుకొన్నదని తా నప్పుడు వాది యెదుటనే చెప్పితినని ప్రమాణము చేయుచున్నాఁడు. రాళ్ళువేత వ్యవహారములో శంకరమ్మ యొక్కయు రామబ్రహ్మము యొక్కయు న్యాయవాదియైన ప్రతివాదియొక్క 5 వ సాక్షి కూడ ఆసభలో నుండెను. అతఁడు తాను చేసిన విచారణయొక్క పర్యవసానమును ప్రతివాదితో చెప్పితిననియు, ఆసభలో తాను వాదిపై నభియోగము తేనున్నాఁడనని చెప్పినప్పుడు వాది పలుకక యూరకుండెననియు, చెప్పుచున్నాఁడు. అంతేకాక యీసాక్షి తొందరపడి యభియోగము తీసికొని రావలదనియు సమాధానము చేయుటకయి మాటాడుచున్న వాదియొక్క 11 వ సాక్షితో మును మునుగా నీవిషయు

రమ్మ తనతో మొట్టపెట్టుకున్నప్పుడు తాను (సాక్షి) వారితో నాకాలమందలి శంకరమ్మయొక్క వాది మీఁది సందేహములను చెప్పితినని ప్రతివాది 4 వ సాక్షి చెప్పుచున్నాఁడు; ఆగష్టు 1 వ తేదిని జరగిన సభలో తనమీఁద నెవ్వరును సనుమాన పడలేననియు ప్రతివాదిమాత్రమే తనమీఁద గోపారోపణము చేయుచున్నాఁ డనియు వాది బహిరంగముగా చెప్పినప్పుడు శంకరమ్మ సందేహము లను తాను నావలనే తెలిసియుండిన సంగతిని వాదికి స్మరణకుఁ దెచ్చితి నని యతఁడు దూఢిగా చెప్పుచున్నాఁడు. ఇది వాది లేదనుచున్నాఁడు; కాని యది యేనిశ్చితమార్గమున చేయఁబడవలెనో స్పష్టము కాక పోయినప్పటికిని ఈసభలో జరగిన దానియొక్క పర్యవసానము వాది 4వ సాక్షియైన జోగియ్యచేత సూచితము వాది తన నడతను శుద్ధ పఱుచుకోవలెనన్న యభిప్రాయము తెలుపుట యయినందును సందే హములేదు. అట్లనుటలో తన యభిప్రాయమంతియు ప్రతివాది గౌర వముగలవాఁడు గనుకను నేరము మోపుచున్నాఁడు గనుకను వాని ప్రతివాది నద్దకుపోయి శాంత సమయమునందు సంగతులను వివరించి చెప్పి నన్ను శుద్ధపఱుచుకోవలె ననుటయే యని వాది 4 వ సాక్షి చెప్పుచున్నాఁడు. అంతిమంది మనుష్యులతనికి వ్యతిరేకముగా చెప్పు చున్నప్పుడు వాది న్యాయ సభలో తన నడతను శుద్ధపఱుచుకోవల సినదని వాది 4వ సాక్షియొక్క యభిప్రాయమయినట్టు తాను గ్రహిం చితి నని ప్రతివాది 4 వ సాక్షి చెప్పుచున్నాఁడు

14. ఈసభ జరగిన తరువాత మూడువారములకు రాళ్ళువేఁత యభియోగము తాలూకా దండ విధాయకుని సభలో తేఁబడినది; తాను చేసిన విచారణల వన్నిటిని బట్టి వాది రాళ్లువేయుటను ప్రోత్సాహపఱచినాఁడని యభియోక్త చేసిన గోపారోపణమునకు మంచియాధార మున్నదని ప్రతివాది తన 27 వ సాక్షియైన పి. శ్రీని వాసరావుతో చెప్పినట్టు యింతకు కొంత కాలము మునుపు.

15. రాళ్లు వేయుట రామబ్రహ్మముయొక్క యింటిలో కాపురమున్న వాడియొక్క పనియనియు, దానికి నిజమయిన కారణము స్త్రీలతో వనపాలనోద్యోగి (ప్రతివాది 54 వ సాక్షి) యొక్కయు యుక్తసంబంధమనియు, బాలుఁడు తన భార్యను వేఱుగా కాపురముండుటకయి యంపుమనికోరుట కిది యే కారణమనియు, తాను చేసిన విచారణలలో ప్రతివాది సాధారణమైన జాగ్రత్త నుపయోగించియుండినయెడల నీ పర్యవసానమునకు వచ్చియుండవలెననియు; వాదియొక్క వాదము. ఆ బాలుఁడు వనపాలనోద్యోగిపై నారోపణము చేయుచు తనతో నొకకథ చెప్పెననియు, వనపాలనోద్యోగిని గూర్చిన కలహముల మూలమున నిల్లు విడిచెననియు వాది చెప్పుచున్నాఁడు. అయినప్పటికిని తరువాత నొకప్పుడు తాను వనపాలనోద్యోగితో మాటాడుచు నక్కడ కూరుచుండియుండఁగా నింటిమీఁద నొక రాయి ప్రత్యక్షముగా పడినప్పుడు సహితము సంగతిని తా నెప్పుడును వనపాలనోద్యోగితో చెప్పలేదని యతఁ డొప్పుకొనుచున్నాఁడు. ఉన్నతపాఠశాలలోను వీరాస్వామి నాయని యొక్కయు వెంకటప్పయ్య యొక్కయు గృహములలో జరగిన సభలలోను ప్రతివాది తన ముఖముమీఁదనే తన్ను నిందించినప్పుడు వనపాలనోద్యోగిపయి బాలుఁడు నిందమోపిన విషయమయి తానెప్పుడు నొక్క మాటయినను పలుకలేదనియు రాళ్లు వేయుట యింట కాపురమున్నవాని పనియని చూపుటకు దారిదీసెడు సమాచారమును దేనిని తా ననుగ్రహింపలేదనియు కూడ వాది యొప్పుకొనుచున్నాఁడు. తనవాదమున కేమైన నాధారముండినపక్షమున వాది స్వాభావికముగా తన ప్రస్తుతవాదము నుదాహరింపఁగోరుట కివి యన్నియు సమయములు; ఇటువంటి యవకాశములు తటస్థించినప్పుడు ప్రతివాది తనకు విరోధముగా తన నమ్మక

మును నెల్లడిచేయుచున్న సాధనములను మాత్రమే కలిగియుండునట్లు ప్రతివాదిని విడిచి యూరకుండిన యెడల నతఁడు తన్ను మాత్రమే తాను నిందించుకొనవలెను.

16. ఒకసారి రామబ్రహ్మముయొక్క యింటిమీఁద రాళ్లు పడకుండ నిలుపుటకయి చిన్నస్వామి పడవమనుష్యులలో కొందఱిని వాని యిచ్చెదనన్నట్టును, ఇంకొకసారి రామబ్రహ్మముయొక్క కొమార్తెలలో నొకతె రాళ్లువేయుచుండఁగా నొకకూలివాఁడు చూచెనని తాను విన్నట్టును, వాది చెప్పినట్టు ప్రతివాది 4వ సాక్షి చెప్పుచున్నాఁడు; కాని యిది తాను నమ్మనందున ప్రతివాది కీవిషయము తెలుపలేదని సాక్షి చెప్పుచున్నాఁడు. 1889 వ సం॥ఆగష్టు నెల నడుమను తాను చాకలి వానిని పనిలోఁబెట్టుకొలేదని వాది చెప్పుచున్నాఁడు గాని వీరాస్వామినాయని (11వ సాక్షి) యింటి వద్ద సభకు ఆ సేవకుఁడు పిలిపింపఁబడి యక్కడ నుండినట్టు గౌరవార్హు లయిన సాక్షులయొక్క ప్రమాణము మీఁద చెప్పిన సాక్ష్యమున్నది; దానిని సందేహించుటకు నాకు హేతువు కనబడదు. ఇంకను పట్టుదలతో వాదింపఁబడినవి – చిన్నస్వామియొక్క పడవల కార్యస్థానమైన యేటు నంటి బహిరంగ స్థలమునుండి రాళ్లు వేయఁబడునని ప్రతివాది నమ్మకూడదనియు, అక్కడనుండి రాళ్లు వేయఁబడినను రాళ్లువేయుటతో వాది సంబంధమును స్థిరపఱుచుటకు సంగతు లతిదూర మైనవనియు, ఇరుగు పొరుగులనున్న పెద్దమనుష్యులు (ప్రతివాదియొక్క 2, 3, 4 సాక్షులవంటివారు) తమలో శంకరమ్మ యంతకుముందు పెట్టుకొన్న మొట్టలలో నామె కేల సాయము చేయకపోయెనో కనుఁగొనుటకయి ప్రతివాది యేమయిన విచారణ చేసియుండినయెడల రాళ్ళువేయుట యింటిలోని వారిచేత జరుపఁబడుచున్న హేతువుచేతనే యని యతఁడు కనిపెట్టియుండవలెననియు,—అనునవి. అడ్డపరీక్షలో నీ సాక్షులనుండి

యిటువంటి దేదియు వెడలఁదీయఁబడలేదు. ఇందుకు ప్రతికూలముగా ప్రతివాదియొక్క 1, 2, 3, 5, 17 సాక్షులు ప్రతివాదికంటె తక్కువ పరికరములతోను నిస్సందేహముగా సద్విశ్వాసముతో నడచుచును ప్రతివాదియొక్క నిర్ణయమునకేవచ్చి వాది రాళ్లువేయించినాఁడని నమ్ముటను మన మెఱిఁగియున్నాము.

27. తన యిటువంటి నమ్మకమునకుఁ గలఁగల హేతువులలో నొకదానినిగా వాది మంచి నీతి వర్తనముగలవాఁడు కాఁడని (దీనిని 5వ సారాంశముక్రింద సత్యమని వాదించుచున్నాము) తానెఱుఁగుటను ప్రతివాది చెప్పియున్నాఁడు; అతఁడు తానును వాదియు 1881,82 వ సంవత్సరములనుండి స్నేహితులుగానుండుట మానివేసినట్లొప్పుకొను చున్నాఁడు. 1889 వ సంవత్సరములో వాదిమీఁద తనకు ద్వేషమున్నట్లొప్పుకొనఁడుగాని సాంఘికమత విషయములలో వాది యభిప్రాయములను తాను ద్వేషించుచున్నాఁడనని చెప్పుచున్నాఁడు. అయినను భిన్నపక్షముల వారిలోఁగల మనోభిన్నస్థితిలో నిటువంటి సూక్ష్మవిభేద వర్ణన మంగీకరింపఁబడ నేరదని నిరూపించుటకు చాలినంత సాక్ష్యములో బయటఁదీయఁబడినది. ప్రతివాదియొక్క "వివేకవర్ధని" లో వాదియొక్క వ్యాసములను ప్రకటించుటనుగూర్చిన వివాదములు (ఏగురుతు నిదర్శనపత్రము), వాదియొక్క యాస్తికపాఠశాల విషయమయి ప్రతివాదియొక్క ప్రతికూలాభిప్రాయములు ప్రతివాదియొక్క పత్రికయందు క్రమ్మర వాదియొక్క ప్రతికూలాశయములు (8, ఈ, నిదర్శన పత్రములు), రాత్రిపాఠశాలలలోను ప్రార్థన సమాజములోను కలిగిన విదళనములలో రెంటిలోను వాదిప్రతివాదులు ప్రతిపక్షులగుట, వాదియొక్క యొక్క స్నేహితునిచేతను వాదియొక్క దుర్బోధచేత తాను ప్రతికూలలేఖ వ్రాసితినని ప్రతివాదితో చెప్పిన యింకొక స్నేహితునిచేతను విధవాపునర్వివాహసమాజ సంబంధమున వ్రాయఁబడిన

ప్రతివాదిమీఁది ప్రతికూలలేఖలు, వాది ప్రతివాది దానికి విపక్షపత్రి కను బైలుదేఱఁ దీయుట, పారిశుద్ధ్య విచారణసంఘములోను దాని యుపసంఘములలోను వాదిప్రతివాదుల నిరంతర ప్రాతికూల్యము,— 1880 మొదలు 1889 వఱకును పరస్పర ఘర్షణము యొక్క వివిధ కారణములను గూర్చిన యశేషసాక్ష్యముయొక్క ఫలము. 1889 వ సంవత్సరము జూలయి నెలలో శాళ్ళవేఁత వ్యవహారములో ప్రతివాది తనవిచారణల నారంభించినప్పు డుభయులమధ్య నిప్పుడున్న గర్భ శత్రుత్వమును సమీపించెడి దేదియు కాకపోయినను వాదిపయి స్పష్ట మయిన ప్రతికూలభావమును కలిగియుండె నని నామనస్సులో సందే హమును విడువకుండుట యయియున్నది.

28. కాని యీ సారాంశముక్రింద నిష్క్రామిక్షన ముఁగఁబ డిన ప్రతివాది వాక్యములు ద్వేషముచేత చెప్పఁబడిన వని యే విధ ముచేతను దీని ననుసరించి యేర్పడును. ప్రతివాది వాక్యములు, సం బంధులచేత నంగీకరింపఁబడిన విచారణసరణిలో తిననుండి పైకి తీయఁబడినట్టియు వట్టిమనుష్యుల బాధమునకయి వారియెడను లో కము నెడలను ప్రేలయున రామబ్రహ్మముయొక్క యింటిమీఁద రా ళ్లువేయుటవంటి దీర్ఘనిరంతర దోషకృత్యము లోకాపఖ్యాతికర మయి నందుకు సందేహములేని గలకర్తృత్వతాబుద్ధితో తనచేత చేయఁబడి నట్టియు వాది శిలాపతనమును ప్రోత్సాహపరచుచున్నాఁడన్న పరిశు ద్ధవిశ్వాస నివేదనము లయిన పక్షమున, అప్పుడు ప్రతివాది చేసిన విచారణలు న్యాయముగను, సామాన్యమైన పుణ్యముతోను, జాగరూ కతతోను చేయఁబడిన పక్షమునను తద్వాక్యములు విచారణతో సంబంధింపనివి కాకపోయిన పక్షమునను ఇతరవిషయములలో నతఁ డు వానికి ప్రతికూలభావమును వహించియున్నాఁడన్న యేకసంగతి యీతనివాక్యముల కంటియుండు స్వాతంత్ర్యతను నశింపఁజేయుటకు

ప్రోత్సాహ పఱిచెనని ప్రతివాది నిష్కపటముగా నమ్మెననుటకు సందేహముండ జాలదని నేను తలంచుచున్నాను. ఈవాక్య మతడు సాధ్యమైన యెడల చిరకాలమునుండి జరుగుచున్న నేరమును నిలుపుటకై శంకరమ్మకును రామబ్రహ్మమునకును ప్రజలకును తనధర్మమును వారిచేత నియ్యబడిన యధికారమునుబట్టి నిర్వహించుచున్న సమయములో బీ. వీ. జోగయ్యచేతను శ్రీనివాసరావుచేతను (వాది 4వ సాక్షి, ప్రతివాది 27వ సాక్షి) అతనినుండి పైకి తీయబడిన దయియుండెను; అతని వాక్యము విచారణముతో సంబంధింపనిది కాదనుట స్పష్టము. తాలూకాదండవిధాయకుడు తనముందున్న సాక్ష్యమంతటితోను (ప్రతివాదిది కలుపుకొని) వాది మీద తేబడిన యభియోగము నబద్ధమని కడపట కొట్టివేయుట సహజమే; కాని యీ సభవారు వాది నిశ్చయముగా ఈ నేరము ప్రోత్సాహపఱిచినాడా యని కాని న్యాయానుసారముగా పనిచేసెడి వాడు ప్రతివాదివలెనదే పర్యవసానమునకు వచ్చియుండునా యని కాని. వివేకియైనవాడిటువంటి సంగతి సందర్భములలో నిట్లు చేసియుండునా యనియైనను కాని, చూడవలసిన పనిలేదు. ఈ సభవారు చూడవలసినది రాళ్ళ వేతను వాది ప్రోత్సాహ పఱిచినాడని ప్రతివాది వాస్తవముగా నిర్వ్యాజబుద్ధితో నమ్మెనా యనుట; దీనిని గుఱించి పూర్వోక్త సాక్ష్యమునుబట్టి నా కెంతమాత్రమును సందేహము లేదు.

30. పూర్వోక్తము లయిన హేతువు లన్నిటిమీదను బీ. వీ. జోగయ్యతోను, వీ. శ్రీనివాసరావుతోను ప్రతివాది పలికిన వాక్యములు రామబ్రహ్మముగారియొక్క యింటిమీద రాళ్లువేయుటను వాది ప్రోత్సాహపఱిచెనన్న యాతని నమ్మకమును తెలిపెననియు, ఆవాక్యము లే సందర్భమున నవి చేయబడినవో యా సంగతులలో విశేషాధికార విశిష్టము లనియు, ఈ సారాంశములో నేను నిర్ణయించుచున్నాను.

14. According to both sides, stone-pelting had been going on at intervals for some months up to August 1889, on Ramabrahmam's house; and from the evidence of plaintiff himself as well as that of defendant and the defendant's 3rd, 4th, 5th and 17th witnesses it is clear that Ramabrahmam and his sister-in-law Sankaramma who was the senior lady of the house, had repeatedly complained that the stones were being thrown by their son-in-law, a boy in whom plaintiff admittedly took a special interest, and who, at the time with which this issue is concerned, was living separately in a choultry under arrangements admittedly made for him by the plaintiff, having left his wife's (Ramabrahmam's) house because of disputes with Ramabrahmam and Sankaram in the course of which, as plaintiff himself acknowledges, the boy had wanted his wife to be sent to live seperately with him. Ramabrahmam is dead and Sankaramma has not been examined; but there is the testimony of the foregoing defence witnesses which sufficiently shows that Sankaramma had been going about making no secreat of her suspicions that plaintiff was instigating the boy to pelt stones on their house because they had refused to send the boy's wife away to live separately with him, the suggestions being that plaintiff had an improper object in endeavouring to get the girl sent to live elsewhere with this boy, who was under his protection and influence. From the evidence of those witnesses and defendant's 1st and 2nd witnesses it is also plain that it was only after nothing had come of all her previous complaints and after defendant had once declined to interfere in the matter and had referred her to the authorities, that defendant was moved by Sankaramma's appeals on the 28th July 1889 to assist her by his enquiries.

15. Defendant says that, on that day, Sankaramma in tears came to him complaining that nobody had helped her to try and stop the stone-pelting which was going on even then, and re-iterated her convictions against plaintiff adding that the stones were coming from the Duggirala yard and the upstairs building in which the boat-office of late Chinnaswamy's estate, of which plaintiff is admittedly an executor, was located. Sankaramma, defendant says, then implicated two lads Tirupatirazu and Venkatappayya (of whom the

former was an assistant teacher in plaintiff's school) along with Ramabrahmam's son-in-law; and defendant, yielding to her entreaties to enquire into the matter (and defendant there is no doubt, is a man to whom people with grievances and difficulties in this town do resort for assistance and advice) went first to Duggirala Suryaprakasa Row (and defence witness) the owner of the house attached to Duggirala yard, in which those two lads were living with the 17th defence witness.

16. The 1st defence witness K. Rameswara Row who is Headmaster of the town branch of the High school under plaintiff was present thoughout that interview between Sankaramma and defendant; and through not professing to remember the whole details of their conversation, he substantially corroborates defendant's testimony as to Sankaramma's statements, adding that he himself was so impressed with the genuineness of her distress that he at once believed her accusations against his own head - master the plaintiff.

17. The 2nd defence witness fully corroborates defendant as to what occurred in the course of defendant's enquires that day at the Duggirala yard, at Ramabrahmam's house and at Chinnaswamy's upstairs. In the yard found a heap of bricks, and on Ramabrahmam's roof they found pieces of brick of the same kind — one circumstance going to corroborate Sankaramma's complaints. While they were in Ramabrahmam's house, some stones fell on it. She repeated that Ramabrahmam's son-in-law was pelting them at plaintiff's instigation because his wife was not sent to live separately with him, and she added that the boy whould then be found in Chinnaswamy's upstairs from which direction the stones were coming. On going to Chinnaswamy's upstairs they did not find the boy there, but they foud two stones similar to those which had just fallen on the house; some Goomastah said that these stones were kept there to beat out gold ornaments — an explanation not commending itself to their minds; and Chinnaswamy's 2nd son (38th defence witness) told them that plaintiff's washerman servant had been seen throwing stones and running to plaintiff's house — more circumstances going to corroborate Sanka

ramma's accusations. The Forester (54th defence witness) who lodged in Ramabrahmam's house told defendant that plaintiff had asked him to speak to Ramabrahmam to send the boy's wife to live separately with him; and 2nd defence witness told defendant that he had heard the stone-throwing had ceased during a period when the boy's wife had been sent away to Narsapur. The Forester (54th defence witness) corroborates defendant; and the 2nd defence witness states that on the materials then before them he himself formed the opinion that plaintiff had had a hand in the stone-pelting and communicated that opinion to defendant giving practical effect to it by warning the 17th defence witness to vacate the Duggirala house and yard or to send away the suspected lads, Tirupatirazu and Venkatappayya — which was done a few days afterwards.

18. But, besides the foregoing materials, defendant had more before him by the time that he made the statements on which damages are claimed under this issue.

19 Plaintiff was not in Rajahmundry on that 28th July, but on his return defendant went straight to him and had that interview with him in the High School on 30th July, which has been referred to under 1st issue. Next day, there was a regular meeting about the business at the house of pleader Veeraswamy Nayudu (plaintiff's 11th witness) to which defendant was summoned at plaintiff's own request. This witnesses distinctly corrborates defendant in stating that when defendant at that meeting, expressed to plaintiff his belief as the result of his enquires that plaintiff had instigated the stone-pelting, plaintiff was silent-conduct strongly calculated to corroborate Sankaramma's accusations. Plaintiff himself practically admitted this fact in cross-examination and was not asked, in re-examination to explain it, but his 11th witness says that he kept quiet because there had been hot words between him and defendant at Venkatramayya's (4th defence witness's) house about the same matter. This explanation, however, cannot be accepted because it is certain that there was no meetting at Venkatramayya's house till the 2nd August.

20. In reply to plaintiff's 11th witness at the meeting on 30th July, defendant gave the names of his informant

who, with the suspected lads, were sent for, and in consequence of what passed, defendant says he was confirmed in his belief against plaintiff while plaintiff's 11th witness himself says he came to the conclusion that the three suspected lads should be sent away. The 17th defence witness who was present at that meeting, swears that he then mentioned in plaintiff's presence that Sankaramma had complained to himself that plaintiff had instigated these pupils to pelt the stones because she had refused to plaintiff's request to send the boy's wife to live with him. Tha 5th defence witness, who was Sankaramma's and Ramabrahmam's pleader in the stone-pelting case, was also present at that meeting and says that he had told defendant the result of his own enquires and that when, at the meeting he intimated his intention of filing a charge against the plaintiff, plaintiff said nothing. This witness adds that defendant urged him not to be precipitate in filing the charge, but to discuss the matter first with plaintiff's 11th witness who was talking about a compromise.

21. On 2nd August, in consequence of information that stones had again been thrown on Ramabrahmam's house, defendant went there with the Acting Police Inspector (6th defence witness who after seeing the premises, went away and defendant says that he was talking with his 4th defence witness Venkatramayya near the latter's house, when one T. Nagaraju, an inmate of Ramabrahmam's house came up and informed them that he had seen Tirupatirazu (plaintiff's assistant aforesaid) throw stones. The 4th defence witness adds that he then communicated to defendant the results of his own enquiries on Sankaramma's previous complaints to himself.

22. It was while this conversation between defendant and Venkatramayya was going on, and after so much had passed calculated to make defendant believe Sankaramma's implication of plaintiff that plaintiff's 4th witness B. V. Jogayya came up and asked what the conversation was about; and it was then that defendant told this witness his belief that plaintiff had instigated the stone-pelting. It was this witness who thereupon went and fetched plaintiff to Venkatramayya's (4th defence witness's) house, and the meeting took place which has already been refereed to as that a which hot words ensured.

23. The 4th defence witness says that when Sankaramma complained to him of the son-in-law throwing stones and that she suspected plaintiff of instigating him, he (the witness) told plaintiff at the time of Sankaramma's suspicions against him; and he is positive that when plaintiff at the meeting of 2nd August declared that he was suspected by no body and that defendant alone was implicating him he reminded plaintiff of having already told him Sankaramma's suspicions. This the plaintiff denies; but there is no doubt although it is not clear in what precise way it was to be done, that the upshot of what passed at this meeting was an expression of opinion, even by plaintiff's 4th witness Jogayya that plaintiff should clear his character. Plaintiff's 4th witness says all he meant was that, as defendant was a rspectable man and was accusing him, plaintiff should go to defendant and clear himself by explaining matters to him in their calmer moments. The 4th defence witness says he understood plaintiff's 4th witness to mean that plaintiff should clear his character in Court when so many people were speaking against him.

24. Three weeks after that meeting the stone-pelting charge was filed in the Taluq Magistrate's Court; and it was at sometime before then that defendant told his 27th defence witness P. Srinivasa Row of his conviction, from all the enquires he had made, that the complainant's accusation, that plaintiff had instigated the stone-pelting, was welfounded.

25. Plaintiff's theory is that the stone-pelting was the work of inmates of Ramabrahmam's house, that the real cause of it was the Forester's (54th defence witness's) improper relations with the females that *that* is why the boy wanted his wife to be sent away to live separately with him, and that if defendant had exercised ordinary care in his enquiries he must have arrived at these conclusions. Plaintiff says that the boy told him a story implicating the Forester, and left the house in consequence of disputes about the Forester. Yet he admits that he never told the Forester this even when, on a subsequent occasion, a stone actually fell on the house while he was sitting there talking to the Forester. Plaintiff also admits that when defendant was accusing him to his very face at the High School and at the

meeting at Viraswamy Naidu's and Venkataramayya's houses he never mentioned a word about the boy's implication of the Forest or vouchsafed any information directed to show that stone-throwing was the work of inmates of the house. All these were occasions when plaintiff would naturally mention his present theory if he had any foundation for it; and he has only himself to blame if, with such opportunities, he left defendant possessed of only the meterials on which defendant was expressing his belief against him.

26. The 4th defence witness speaks to one occassion when plaintiff offered to lend some of Chinnaswamy's boatmen to Ramabrahmam to stop the stone-pelting and to another occasion on which he was told that a cooly had seen one of Ramabrahmam's own girls throwing stones; but the witness says he did not believe this and did not communicate these matters to defendant. Plaintiff says, his washerman servant was not employed by him till August 1889 but there is the sworn testimony of respactable witnesses, which I see no reason to doubt, to that servant having been sent for and present at the meeting at Viraswamy Naidu's (11th witness's) house. What is further urged is that defendant could have believed that stones would be thrown from so public a place as Chinaswamy's boat office, that even if they were thrown from there the circumstances were too remote to justify the connection of plaintiff with the stone throwing and that if defendant had made any enquiry to out why the respectable neighbours (the 2nd 3rd and 4th defence witnesses for instance) had not helped Sankaramma in her previous complaints to them, he would have discovered it was because the stone-throwing was being done by inmates of the house. Nothing of this sort was elicited from these witnesses in cross-examination. On the contrary we have the 1st, 2nd, 3rd, and 17th defence witnesses, though with *less* information than defendant and presumbly acting *bona fide*, coming to the same conclusion as defendant and believing the plaintiff did instigate the stone pelting.

27. Defendant has stated it as one of his reasons for his similar belief, that he knew plaintiff not to be a man of good moral character (which under the 5th issue he pleads to be true); and he admits that he and plaintiff had ceased to be on good terms since 1881 or 1882. He does not ack-

nowledge *personal* ill-feeling in 1889 towards plaintiff but says he disliked plaintiff's opinions on social and religious matters. Quite sufficient, however, has been elicited in evidence to show that this qualified description of the state of feeling between the parties cannot be accepted. The effect of the whole evidence as to various causes of friction from 1880 to 1889 disagreements about publishing plaintiff's articles in defendant's "Vivekavarthani" (see Exhibit A), defendant's attacks on plaintiff's Theistic School with plaintiff's counter-attacks on defendant's paper (see Exhibits VIII and E), a split in the night school followed by a split in the Prardhana Samaj in both of which the parties were opposed, attacks on defendant in connection with the Widow Re-marriage Association by one friend of plaintiff and by another who informed defendant he had written his attack at plaintiff's instigation, plaintiff starting a rival paper to defendant's and constant opposition between plaintiff and defendant in the Municipal Council and on Municipal sub-committiess—the effect is to leave in my mind no doubt that when defendant entered upon his enquiries in the stone-throwing affair in July 1889 he had a distinct personal feeling against the plaintiff though nothing approaching the bitter enmity which now exists between them.

28. But by no means follows defendant's statements, on which damages are asked under this issue were maliciously made. If defendant's statements were expressions of this honest belief hat plaintiff instigated the stone-pelting, elicited from him in the course of his enquiries authorised by the persons concerned, and made by him in the interest of those persons from a sense of duty to them and to the public (for a long continued offence such as that stone throwing on Ramabrahmam's house was undoubtedly a public scandal), then if defendant's enquiries were made fairly and with ordinary care and caution and his statements were not irrelevant to that enquiry, the single circumstance that he had a personal feeling against the plaintiff in other matters will not suffice by itself to destroy the privilege which would attach to his statements. He has to be judged by his whole conduct in the matter from the time of Sankaramma's first complaint to him; and as to this the evidence above set out can, I think leave little doubt.

29. Had defendant been actuated by malice, he would surely have taken the earlier opportunity he had when Sankaramma was going about making no secret of her suspicions against plaintiff. His whole proved conduct shows that he entered upon his enquires under pressure from Sankaramma and with the distinct authority of herself and Ramabrahmam that he went straight to plaintiff at the earliest opportunity and that he discouraged any precipitancy in filing the charge. No doubt he omitted to have the premises watched and might perhaps have sifted the matter more minutely than he did, but I can find nothing in the evidence to show that he acted without ordinary care or in any unfair or undue manner and he was acting in the most obvious interests of the persons concerned. The evidence shows what defendant had before him pointing to plaintiff's hand in the stone-throwing especially plaintiff's own silence and no alternative theory or information was vouchsafed to him by plaintiff. And in all the circumstances before him, there can, I think, be little doubt that defendant did honestly believe that plaintiff instigated the stone pelting. That was his statement elicited from him by B. V. Jogayya and Srinivasarao (plaintiff's 4th witness and defendant's 27th witness) in the course of his duty to Sankaramma and Ramabrahmam and the public under the authority given him by those persons and to stop, if possible, a long continuing offence, and his statement was plainly not irrelevant to his enquiry. No doubt the Taluk Magistrate, with all evidence before him (including defendant's) ultimately dismissed the charge against plaintiff as false; but this Court has not to see whether plaintiff did in fact instigate the offence, or whether a person acting judicially would have come to the same conclusion as defendant, or even whether a reasonable man would, in the same circumstances, have done so. What the Court has to see is whether defendant did in fact honestly believe that plaintiff instigated the stone-throwing, and of this, on the fore-going evidence, I have no doubt whatever.

30. On all the foregoing grounds, I find under this issue that defendant's statements to B. V. Jogayya and P. Srinivasa Row expressed his belief that plaintiff had instigated the stones-throwing on Ramabrahmam's house and that

those statement were privileged in the circumstances in which they were made.

సంయుక్త దండవిధాయకునియొద్ద 1890 వ సంవత్సరము జూలయినెల 29వ తేదిని నామీఁద తేఁబడిన యభియోగములు రెండును సంవత్సర కాలము విమర్శనములో నున్నమీఁదట 1891 వ సంవత్సరము జూలయినెల 27 వ తేదిని కొట్టివేయఁబడెనని యీవఱకే తెలిపి యున్నానుగదా. 1890 వ సంవత్సరము జూలై నెల 15వ తేదిని మండలన్యాయసభలో మూఁడువేల రూపాయలు మాననష్టమునకయి యిప్పింప వలసినదని నాపైని లక్ష్మీనరసింహముగారు తెచ్చిన వ్యాజ్య మంత శీఘ్రముగా ముగియక దాదాపుగా (మూఁడుమాసములు తక్కువగా) మూఁడు సంవత్సరముల కాలము నడచిన పిమ్మట 1893 వ సంవత్సరము మార్చినెల 10 వ తేదిని తీర్పఁబడెను. ఈ తీర్పులో మండల న్యాయాధిపతి యించుమించుగా సారాంశముల నన్నిటిని నాకనుకూలముగానే నిర్ధారణము చేసినను, 'ఇండ్లమీఁద రాళ్ళువేయించువారు పెద్దమనుష్యులుగా పరిగణింపఁ బడుచున్నారు' అనినేను వివేకవర్ధనిలో ప్రకటించిన దానిని గూర్చి నాకు ప్రతికూలముగా నిర్ణయము చేసి, 'వాది యీ వ్యాజ్యమునే తీసికొని రాకుండ వలసినది' 'తిరస్కార నష్టమున కర్హమయిన వ్యవహార మెప్పుడైన, నుండిన యెడల ఇది యొకటి' అని వ్రాసి, నేనొక యణా వాదిపరువునష్టిక్రింద నిచ్చునట్లును ఎవరి వ్యయములు వారే భరించునట్లును తీర్పు చెప్పెను. ఈవ్యవహారము లిట్లు తీర్పఁబడిన తరువాత సహితము లక్ష్మీనరసింహముగారు నాయెడల మంచి యభిప్రాయమును విడువనివా రయి, కనఁబడినచోట నెల్ల నాకు నమస్కారము చేయుచు, నాతో మాటాడుచు వచ్చిరి.

పురమందిర నిర్మాణమును గూర్చి యీవఱకే చెప్పఁబడినది. దానితోఁ జేర్చి కట్టఁబడిన ప్రార్థన మందిరమును గూర్చి కొంచెము

చెప్పవలసి యున్నది. పురసుందిరమునకు వలె ప్రార్థనమందిర నిర్మాణమున కయిన వ్యయముల నన్నిటిని నే నొక్కఁడనే భరింపలేదు. వ్యయములలో విశేషభాగము చందాల మూలమున సమకూర్పఁబడినది. రాజమహేంద్రవర ప్రార్థనమందిరమును గూర్చి 1897 వ సంవత్సరము మెయి నెలలో 'సత్యసంవర్ధని' యందు నేను వ్రాసినదానినిందు క్రిందఁబొందు పఱుచుచున్నాను:—

'ఈ మండలములోని పెనుమంట్రలో డెల్టా సూపరింటెండెంటుగా నుండిన మ. రా. శ్రీ టీ. శేషాచలము నాయఁడుగారు మూఁడు సంవత్సరముల క్రిందటఁ దమ మరణశాసనములో నూఱు రూపాయలు రాజమహేంద్రవర ప్రార్థనసమాజమున కిచ్చునట్లువ్రాసి లోకాంతరగతులు కాఁగా, తదనంతర మాయనయన్నగారగు మ. రా. శ్రీ రామదాసు నాయఁడుగారా నూఱురూపాయలును నాయొద్దకుఁ బంపిరి. అప్పుడా నూఱు రూపాయలను స్థిరమయిన యేదో యొకపని కుపయోగింపవలె నని యాలోచించుచుండఁగా నీశ్వరప్రేరణముచేత ప్రార్థనమందిరమును గట్టింపవలెనన్న బుద్ధి నాహృదయమునం దుదయించినది. అప్పుడు నాసంకల్పమును వెంటనే శ్రీ రాజా గోడే నారాయణ గజపతిరావు బహుదూరు సీ. ఐ. ఈ గారికిఁ దెలిపి సహాయము వేఁడఁగా, వారు తమ సహజౌదార్యముతో మున్నూఱు రూపాయలను నాయొద్దకుఁ బంపిరి. ఆరూపాయలకు నావి యిన్నూఱు రూపాయలను జేర్చి మా సామాజికులకును మిత్రులకును దెలుపఁగా, మ. రా. శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగారు నూఱురూపాయలును, నాళము పద్మనాభముగారు నూఱు రూపాయలును, రెబ్బాప్రగడ పాపయ్యగారేఁబది రూపాయలును, కనపర్తి శ్రీరాములుగారేఁబది రూపాయలును, ఆర్. వేంకటరత్నము నాయఁడుగారేఁబదిరూపాయలును, పెద్దిభట్ల వెంకటప్పయ్యగారేఁబది రూపాయలును,

రాయసము వెంకట శివుఁడుగారేఁబది రూపాయలును, చందాలు వేసి యీ సత్కార్యమునకుఁ దోడుపడిరి. ఈ చందాల విషయమున నిక్కడ నింకొక యంశమును ముఖ్యముగాఁ జెప్పవలసియున్నది. మేము ప్రార్థన మందిరమును గట్టింపఁబోవుచున్నామని విని ముగ్గురు స్త్రీలు మే మడుగకయే హృదయపూర్వకమయిన భక్తితో నొకరు మూఁడు రూపాయలును, మఱియిద్దఱు దేసి రూపాయలును, మొత్తముమీఁద పదుమూఁడు రూపాయలను నావద్దకుఁ బంపిరి. వారి నామములను నే నిక్కడఁ గృతజ్ఞతాపూర్వకముగాఁ దెలిపియుందునుగాని వారి కోరికనుబట్టి యిప్పుడు ప్రచురింప నశక్తుఁడ నయినందునకుఁ జింతిల్లుచున్నాను. ధనికులును ధనార్జనము చేయుచున్నవారు నైన పురుషులిచ్చిన నూఱులు నిన్నూఱులు మున్నూఱులకంటె నస్వతంత్రములయిన యబలలు భక్తిపూర్వకముగా నిచ్చిన యీ మూఁళ్ళును నైదులును భగవంతుని కధిక ప్రీతికరము లని నేను భావించెదను. పురుషులతోడ్పాటువలన స్త్రీలలో నిట్టి పరిశుద్ధాస్తిక భక్తి యంతకంతకు వర్ధిల్లును గాక !'

ఈ మందిరములో నుపాసన కుద్దేశింపఁబడిన క్రిందికూటము మాత్రమే కాక పయిని మేడకూడ కట్టఁబడినది. మేడమీఁద విశాలమైన పెద్దగది యొకటి యున్నది. ఈమందిర నిర్మాణసమయమునందు దగ్గఱనుండి పనిచేయించుచు నాకు తోడ్పడినందున కయి రెబ్బాప్రగడ పాపయ్యగారికి వందనము లాచరించుచున్నాను. ఈ మందిర నిర్మాణమునకు దాదాపుగా రు 1500 లయినవి. నేను స్థలము నిచ్చుటయేకాక చందాల మూలమున వచ్చినదిగాక మిగిలిన దానిని కూడ నేనే భరింప వలసినవాఁడ నయితిని. సంవత్సరోత్సవ సమయమునందు మ. రా. శ్రీ ఆర్. వేంకటరత్నమునాయఁడుగారు బందరునుండి వచ్చి మందిరమును తెఱచి 1897 వ సంవత్సరము ఏప్రిల్ నెల 17 వ తేదిని గృహప్రవేశోత్సవమును నడపిరి.

1893 వ సంవత్సరారంభమున నూతన సంవత్సరపు బిరుదు లలో నింపీరియూ దొరతనమువారు నాకు రావు బహదూరు బిరుదము ననుగ్రహించిరి. ఈబిరుదాంకితమునకు నే నర్హుఁడ నగుదునో కానో కాని బహుస్థలములనుండి నేనెఱిఁగినవారును ఎఱుఁగనివారునుకూడ న న్నభినందించుచు లేఖలు వ్రాసిరి. ఇట్లు నూటికంటె నెక్కువగా వచ్చిన లేఖలలో కొన్నిటిలోని కొన్నిభాగములను మాత్ర మిం దుదాహరించుచున్నాను.—

1. "Let me lose no time in congratulating you on your new honour. I have known of it for a long time but could not speak of it, as it was referred to me confidentially. As I said then and now say again there is no one within my knowledge that has better deserved it"—E. P. Metcalfe Esq., M. A. Principal, Rajahmundry College.

(మీయొక్క నూతనగౌరవమున కయి మి మ్మభినందించుట లో నేను కాలహరణము చేయకుందునుగాక ! దీనినిగూర్చి నేను చిర కాలమునుండి యెఱిఁగి యున్నానుగాని నా కాంతరంగికముగా నాలో చనకు పంపఁబడినందున దీనిని గూర్చి నేను మాటాడ లేకుంటిని. నే నప్పుడు చెప్పినట్టుగానే యిప్పుడును నే నెఱిఁగినంతవఱకు దీనికి మీ కంటె నెక్కువయర్హత గలవారు లేరని మరల చెప్పుచున్నాను.— మెట్కాపు దొరగారు.)

2. "How glad I was last night when 'The Hindu' put your name before my eyes and how rejoicing I am now when I am constantly thinking of the truly deserved honour conferred on your good self. In the long list of the recipients of honous. I cannot think of a more deserving recipient."..........S. Rangiah Chetty. B. A., Telugu Traslator to Govt., Madras.

(గతరాత్రి హిందూపత్రిక మీపేరును నాకన్నుల యెదుటఁ బెట్టినప్పుడు నే నెంత సంతసించితిని ! మీకియ్యఁబడిన నిజముగా నర్హమైన గౌరవమునుగూర్చి తఱచుగా తలఁచుకొనుచు నేనిప్పు

డెంత సంతోషమును పొందుచున్నాను! బిరుదులను పొందినవారి పెద్దపట్టికలో మీకంటె నెక్కుడుపాత్రత గల వానిని నేనూహింపలేను......స. రంగయ్య చెట్టిగారు, చెన్నపట్టణము.)

3. "Although we are strangers to you we have much pleasure in conveying our sincere and cordial congratulations to you on the well deserved distinction conferred on you none too soon by the Government of India.

Our regret that we do not accept your theories in regard to social reforms concerning betrothal and marriage does not in the least mitigate against our admiring your single mindedness of purpose and perseverance in the paths of practical reform"........N. Pattabhirama Rau. T. Varada Rao, Calicut..

(మేము మీకు క్రొత్తవార మయినప్పటికిని యుక్తకాలములో నిండియా దొరతనమువారిచేత మీకు దయచేయఁబడిన యత్యంతార్హమయిన ఘనతను గూర్చి మాహృదయ పూర్వకము లైన ససౌహార్దాభినందనములను మీకు తెలుపుటయం దానందము పొందుచున్నాము.

ప్రధానమునుగూర్చియు వివాహమునుగూర్చియు సంఘసంస్కారవిషయములలో మీయూహలను మే మంగీకరింపమన్న విచారము, కార్యవిషయమైన మీ యేకాగ్రమనస్కతను ఆచరణీయసంస్కార మార్గములయందలి మీ పట్టుదలను ప్రశంసించుట నుండి మ మ్మణుమాత్రమును విముఖులను చేయదు........నెమలి పట్టాభిరామారావుగారు, తుమ్మలపల్లి వరదరావుగారు, కల్లికోట)

4. "Though I have not known you in person. I have heard a great deal about you through the columns of the Press and through friends like Mr. M. Rangacharyar. M. A. and Mr. Venkata Sivavadhani &c. I am very glad to congratulate you on the well merited honour that was lately conferred on you by the Government of Ihdia. and it is no mean credit to you to say that your services in the cause of Social Reform have been

recognised by the learned world and tne Govt.........' M. B. Sreenivsaingar; Head master, High School, Kolar, Mysore.

(నేను మిమ్ము ప్రత్యక్షముగా నెఱుఁగియుండక పోయినను, వార్తాపత్రికలవలనను ఎమ్. రంగాచార్యులు ఎమ్. ఏ, వెంకటశివావధాని మొదలయినవారివలనను మిమ్మునుగూర్చి విశేషముగా విని యున్నాను. ఈమధ్యను ఇండియా దొరతనమువారిచేత మీకొసఁగఁబడిన యత్యంతార్హ్యమైన గౌరవమునుగూర్చి సంతోషపూర్వకముగా మిమ్మభినందించుచున్నాను. సంఘసంస్కార విషయమున మీపని పండిత ప్రపంచము చేతను ప్రభుత్వమువారి చేతను అంగీకరింపఁబడినదని చెప్పుట మీకు తక్కువ ప్రతిష్ఠావహము కాదు......... ఎమ్. బీ. శ్రీనివాసయ్యంగారు, ఉన్నతపాఠశాల ప్రధానోపాధ్యాయుఁడు, కోలారు, మైసూరు.)

ఈనలుగురిలో మొదటివా రిద్దఱు నే నెఱిఁగినవారు; కడపటి వారిద్దఱు నే నెఱుఁగనివారు. ఎఱుఁగనివారిద్దఱిలో మొదటిలేఖ వ్రాసినవారు సంఘసంస్కార విషయమున నాయభిప్రాయములతో నేకీభవింపనివారు. నా కభినందన పత్రికలను బంపినవారిలో ననేకులు ఆంధ్రభాషాభివృద్ధి విషయమునను సంఘసంస్కార విషయమునను నేను చేసిన యల్పకార్యమును మహాకార్యముగా పొగడిరి. లేఖలు వ్రాసినవారు గాక యనేకులు నాకు తంత్రీముఖమున నభినందనముల నందించిరి. కొన్నిసమాజములవారు న న్నభినందించుచు నిర్ధారణములు చేసి నాకుఁ బంపిరి. అట్టివానిలో నొక్కదాని నిందు క్రిందఁ బొందుపఱుచుచున్నాను.—

"We the members of the Literary Association, Cocanada' feel highly rejoiced that Government has been pleased to bestow on you the distinction of "Rao Bahadur" and, on offering you our hearty congratulations on this recognition of your invaluable services to the country. we feel proud to note with great satisfaction that the choice could not have

fallen upon a worthier person than one who distinguished from his early days for a taste for letters, for high conception of duty and for strong individuality of character, has so long devoted himself to the task of social and religious reforms, to the improvement of Vernacular Literature, for diffusing useful knowledge among his country-men and women and to the improvement of the moral tone of society, and has made large and noble sacrifices in endeavouring to attain the objects he has set for himself without hoping for any rewards.

We pray to the Almighty to give you long life and enable you to continue your labours in the field of good work.

We have the honor to be

Dear Sir,

Your obedient Servants,

Duriseti Seshagiri Rao, Chairman &c"

(కాకినాడ సాహిత్యసమాజముయొక్క సభ్యులమయిన మేము దొరతనమువారు "రావుబహదూరు" అను గౌరవమును మీకొసఁగ ననుగ్రహించినందుకు అత్యంతానందభరితుల మగుచున్నాము. దేశమునకు మీరు చేసిన యమూల్యములైన సేవ లిట్లు బహిరంగాంగీకృతము లైనందున మీకు మాహృదయపూర్వకములైన యభినందనముల నందించుటలో, ఎవ్వరు తన తరుణవయసునుండియు విద్యాభిరుచి కొఱకును ఉన్నత కర్తవ్యతాభావనకొఱకును బలమైన ప్రపర్తనా ప్రత్యేకత్వముకొఱకును ప్రసిద్ధికెక్కి, సాంఘిక ధార్మిక సంస్కారకార్యమునకును తన దేశపుపురుషులలోను స్త్రీలలోను ఉపయుక్తజ్ఞానమును వ్యాపింపఁజేయుట కొఱకయి దేశభాషా వాఙ్మయాభివృద్ధికిని సంఘముయొక్క నీతిబలాభ్యుదయమునకును తన జీవితము నర్పించెనో యెవరు ప్రతిపలాపేక్ష యేమియు లేక తానేర్పరచుకొన్న యుద్దేశముల నెఱవేర్చు ప్రయత్నములలో ఘనమైన యుత్తమ సుఖత్యాగములను చేసియున్నాఁడో యటువంటి వానికంటె యోగ్యతరు

డైన పురుషుని మీఁద నీ యెన్నిక పడియుండఁజాలదు గదా యని గొప్ప తృప్తితో వ్యక్తీకరించుటకు గర్వపడుచున్నాము.

మీకు దీర్ఘాయుస్సు నిచ్చుటకును సత్కార్య క్షేత్రమునందు మీకృషి నింకను నడుపుచుండుటకు మిమ్ము శక్తునిగాఁ జేయుటకును సర్వశక్తుఁడైన దేవుని మేము ప్రార్థించుచున్నాము.)

చెన్నపురి రాజధానిలోను ఇతరస్థలములలోను ప్రకటింపఁబడిన యింగ్లీషు వార్తాపత్రికలలోను తెలుఁగు పత్రికలలోను నన్నభినందించుచు వ్యాసములు వ్రాయఁబడినవి. వానిలో నొక్క యాంధ్ర ప్రకాశికలోనిదానిని మాత్ర మిందుదాహరించుచున్నాను.—

"రావు బహద్దర్ కందుకూరి వీరేశలింగము పంతులుగారు-రాజమహేంద్రవరము గవర్నమెంటు ఫస్టుగ్రేడు కాలేజీలో ప్రధాన పండితులగు మ. రా. రా. శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులు గారికి ఈసంవత్సరారంభమున ఇండియా గవర్నమెంటువారు "రావు బహద్దర్" అను బిరుదు నొసంగిరి. ఇది సర్వజనులకును ఆహ్లాదకరముగదా! ప్రస్తుతము ఇంగ్లీషువిద్య నభ్యసించిన నాగరికు లందఱిలోను ఈయన మహనీయులు. ఈయనయొక్క అత్యద్భుతమగు నీతి ప్రవర్తనయును, తెలుఁగు గ్రంథముల వ్యాప్తికిని అభివృద్ధికిని ఈయన పడిన ప్రయాసమును, సంఘసంస్కరణము కొరకు ఇరువది సంవత్సరములనుంచి ఈయన పడుచుండిన పాటును, ముఖ్యముగా స్త్రీపునర్వివాహమునకై తమధనమును కాలమును శక్తిని వినియోగపరచుటయును, సుగుణవంతులైనట్టియు దేశక్షేమమును కోరునట్టియు, బుద్ధిమంతులైనట్టియు సర్వజనులలోను ఆ మహనీయునకు మిగుల విఖ్యాతిని కలుగఁజేసినవి. ఆయన సర్వసత్కార్యములను కీర్తి నేమియు నపేక్షింపకయె భగవంతుని నమ్ముకొని తాము విధిగా చేయవలసినపను లనియే చేయుచుందురు. ఆయన సాధారణ కృత్యములం

దును ఆకారమందును బహునెమ్మదియు సాధుత్వమును కలిగియు న్నను తాము చేయు సత్కార్యములందు అధికపట్టుదలయు సాహసమును కలిగి యుండుటయే కాక, సర్వవిధ పాపకార్యములయందును డంబములయందును అసహ్యముకలిగి, సర్వజనోపయోగకరము లగు పనులను సదా చేయుచుండును. ఆయనను క్రొత్తగా జూచువారందఱును ఆయన డంబవేషాదులు లేక సాధువుగా నుండుటవలన 'ఈయనేనా వీరేశలింగము పంతులుగారు?'' అని ఆశ్చర్యపడుచుందురు. ఆయన తెలుఁగు భాషయందు వచనకావ్యములు, పద్యకావ్యములు, నాటకములు, ఉపన్యాసములు, శాస్త్రములు మొదలగునవి సుమారు ఎనుబది గ్రంథములవరకును జేసెను. ఈయనను తెలుగువచనకావ్యములకు తండ్రియని చెప్పవచ్చును. కొందఱు మహాపండితులవలె పెటుకుశైలినిగాక ఈయన గ్రంథము లన్నియు మృదుమధుర సులభశైలిని వ్రాయబడి, నీతి పూరితము లయి యుండుటయేగాక హిందూదురాచారరోగ రసాయనములుగా నుండును. ఈమహనీయుఁడు పూర్వనాగరికపరాయణులచేతను ఆయన ఘనకార్యములయందు ఈర్ష్యగల మఱి కొందరిచేతను నసహ్యింపఁబడుచున్నను, సర్వదా,దుర్దశనుండి తొలఁగింపబడిన సుమారు ఇరువదియువతుల యొక్కయు స్వదేశాభిమానులయొక్కయు ఆంధ్రవిద్యాభివృద్ధిని కోరు అనేక జనులయొక్కయు నవనాగరికులయొక్కయు దీవనలకు సత్పాత్రుఁడుగదా! ఈయన కీ బిరుదు నీయుటలో గవర్నమెంటువారు మిగుల ఘనకార్యమును జేసినను ఆయనమాత్రము ఈబిరుదునకు విశేషలక్ష్యము చేయువారని ఆయన దివ్యగుణముల నెఱిగినవా రెవరును తలంచరు. ఆ బిరుదు ఈ మహనీయుని నామమునకు చేర్పబడుటవలన దానికే యెక్కువకాంతి కలిగినది. ఆయనకు మాసమునకు సుమారు నలుబది యేబది రూప్యములే వేతన మయినను సుమారు ఏడు ఎనిమిదివేల రూప్యములు

వ్యయపరిచి సర్వజనోపయోగము కొరకు పట్టణమందిరము నొక దానిని రాజమహేంద్రవరమునందు కట్టించిరి. ప్రస్తుతము స్త్రీపునర్వివాహములకు ఎవరును ధన మిచ్చుటవలన నయినను తోడ్పడనందున అయన పట్టణమందిరము కట్టుటవలన కొంత ఋణగస్తులయి యున్నను స్వంతధనము వ్యయపరిచి నూతన వివాహములను జేయుచున్నారు. బిరుదులు కలవారును విశేష విద్యాధనమును కలవారును అనేకులు మన దేశమం దున్నను ఈయనవలె ధైర్యసాహసములతో అనేక కష్టములకు లోనయి దైవమును మాత్రము నమ్మి పనిజేయుయువారు మన దేశమందు బహు అరుదు గదా! దక్షిణ హిందూదేశ విద్యాసాగరునకు ప్రస్తుత మీ బిరుదు నొసంగుట కొందరు మహాశయులకు కండ్లలో నిసుక వేసిన ట్లున్నను ఉండనిండు. సత్పురుషులయెడల నీర్ష్యకలవా రెప్పుడును ఏడ్చుచునే యుందురుగదా! వీరు ఇంకను చిరకాలము జీవించి పరోపకారము చేయుచుండునటుల సత్పురుష వాత్సల్యుం డనుగ్రహించుంగాత!" ఆంధ్రప్రకాశిక. 1893 వ సంవత్సరము జనవరినెల 14 వ తేది.

రాజమహేంద్రవర పురవాస్తవ్యులు రాజకీయ కళాశాల ప్రధానాధికారియైన మెట్కాపు దొరగారి యాధిపత్యముక్రింద పురమందిరములో నొక సభచేసి నా కభినందనము చేసిరి. అటు తరువాత చెన్నపురి రాజధానీ విద్యావిచారణాధికారి డంకను దొరగారు రాజమహేంద్రవరము వచ్చినపుడు కళాశాలాభవనములో నొక సభచేసి యుపాధ్యాయుల యొక్కయు బాలుర యొక్కయు సమక్షమున దొరతనమువా రంపిన సనదును నాకు బహిరంగముగా దయచేసిరి.

వితంతు వివాహప్రయత్న ప్రారంభదశలో నాకు విశిష్టజనుల కంటె విద్యార్థిజనులే యెక్కువ సహాయులుగా నుండిరి. అట్లుండుటకు

కారణ మేతద్విషయమయిన నాబోధనలు వారి మనస్సుల కెక్కు-టయే. పిన్నవారికిని పెద్దవారికిని గూడ నేను సమానముగానే బోధించినను పెద్దవారి మనస్సులలో కంటె పిన్నవారి మనస్సులలో నామాట లెక్కువ దృఢముగా నాటుకొనుటకు కారణ మేమి? పెద్దవారి హృదయములలో నావఱకే యేవో యభిప్రాయములు కుదురుపడి యవి కాలిన కుండలవలె గట్టిపడి యుండుటచేత నూతనోపదేశములు తాత్కాలికముగా పయి పయినె కొంతకాలము నిలిచి లోతుగా దిగకుండెను. పిన్నవారి హృదయములలో నావఱ కేయభిప్రాయములును స్థిరపడియుండక పచ్చికుండలవలె మెత్తనయి యుండుటచేత నూతనోపదేశములు సులభముగ నాటుకొని లోతుగా దిగి తొలఁగకుండెను. సత్కార్య బీజములను హృదయ క్షేత్రములయందు నాటించి సఫలము లగునట్లు చేయుటకయి బాల్యావస్థయే యుత్తమమైనది. అందుచేత బాలురకు భగవద్భక్తియు పరోపకారాసక్తియు బోధించెడు పాఠశాల యుండినయెడల శీఘ్రకాలములో దేశాభివృద్ధి కలుగునని మొదటినుండియు నా నమ్మకము. ఈనమ్మకము చేతనే యేలూరి లక్ష్మీనరసింహముగా రాస్తికపాఠశాలను స్థాపింపఁ దలఁచినప్పుడు నేనాయనను ప్రోత్సాహ పఱిచితిని. ఆపాఠశాల 1889 వ సంవత్సరము వఱకు నుండినను మొదటఁ దలఁచుకొన్న యుద్దేశము లేవియు దానివలన నెఱవేఱలేదు. పాఠశాల కాస్తికపాఠశాల యని పేరుపెట్టినమాత్రమున సదుద్దేశములు నెఱవేఱ నేరవు; ఆసదుద్దేశములను బాలురహృదయములలోఁ బట్టించుటకుఁ దగిన శక్తిసామర్థ్యములును శ్రద్ధాభక్తులునుగల యుపాధ్యాయులుకూడ కావలెను; అట్టి యుపాధ్యాయులను సమకూర్చి యాస్తికమత పాఠశాలను స్థాపింపవలె నని నాయొద్ద చదువుకొని పట్టపరీక్షయందు కృతార్థులయి యున్నవారిని పట్టపరీక్ష తరగతిలోను ప్రథమశాస్త్ర పరీక్షతరగతిలోను చదువుకొనుచున్న వారిని కొందఱిని దేశోపకారార్థ

ముగా నధ్యాపకులుగానుండి పనిచేయునట్లు పురికొల్పి యొప్పించితిని. ఏఁటేఁట నిద్దఱి నుపాధ్యాయ పట్టమును బడయుట కయి సైదాపేట పంప నిశ్చయింపఁ బడినది. మొదటి సంవత్సరమునం దనఁగా 1893 వ సంవత్సరమునందు పట్టపరీక్షయందు కృతార్థులయియుండిన రాయసము వేంకటశివుఁడు గారును సత్తిరాజు మృత్యుంజయరావు గారును ఈసదుద్దేశముతోనే ఎల్. టీ. పరీక్షకు చదువుట కయి సైదాపేటకు పోయిరి. పయి సంవత్సరము సైదాపేట బోధనాభ్యసన కళాశాలకుఁ బంపుట కయి మఱి యిద్దఱు పట్టపరీక్షాసిద్ధులను సంసిద్ధులనుగాఁ జేసి యుంచితిని. పనిచేయువారి తోడిపాటుగా పాఠశాలా భవనమునుగూడ సంపాదింపవలె నని నేను ప్రయత్నముచేయ నారంభించితిని. ఇన్నిసుపేట మధ్యముననున్న విశాలమయిన తమతోటను వాడేవు శ్రీరాములుగారు రు. 1600-0-0లకు విక్రయించుట కొప్పుకొనిరి. ఆ రూపాయలను న్యాపతి సుబ్బారావు పంతులుగా రిచ్చుట కొప్పుకొనిరి. కాకినాడ వాస్తవ్యు లయిన గంజాము వెంకటరత్నముగారు వేయి రూపాయ లిచ్చునట్లు వాగ్దానము చేసి యాసొమ్ము నాయొద్దకుఁ బంపిరి. మఱికొందఱు మిత్రులుకూడ సాయము చేయుటకుఁ బూనుకొనిరి. కాని రాజమహేంద్రవరరాజకీయ కళాశాలాధ్యక్షుని సాహాయ్యము కూడ నీపనిలో నత్యావశ్యకము. ఆయనయు నస్మదాదులునుగలిసి యెంతో ప్రయత్నముచేసి బాలురు చెడిపోకుండుటకై పట్టణములోనున్న పాఠశాలల నన్నిటిని కొంచెము కాలముక్రిందటనే యొక్కటిగా కలపి మా కార్య నిర్వాహణము క్రిందనే యున్నతపాఠశాలను స్థాపించితిమి. దానిని దొరతనమువారు పుచ్చుకొని దాని శాఖలుగా పట్టణములో రెండు మూడు మధ్యమ పాఠశాలలఁ బెట్టించు ప్రయత్నము నడచుచున్నది. ఇంతలో నేనే మఱియొక పాఠశాలను పెట్టిన

యెడల తత్ప్రయత్నమునకు విఘాతము కలిగించు నుద్దేశముతో స్థాపించిన ప్రతిపక్షపాఠశాలయని దొరగారనుకొనవచ్చును. అందుచేత నేను నూతన పాఠశాలోద్దేశమును దెలుపుచు మెట్కాఫు దొరగారికి వ్రాసి పాఠశాలాస్థాపనములో సాయము చేయవలసిన దనియు, ఏవిధముచేత నైనను పాఠశాలాస్థాపనము సాగకపోయినయెడల సైదాపేటలో బోధనాభ్యసనకళాశాలలో క్రమశిక్షనుబడయుచున్న వేంకటశివుడుగారిని మృత్యుంజయరావుగారిని రాజమహేంద్రవరములో నుపాధ్యాయపదమునం దుంచుటకు ప్రయత్నింపవలసిన దనియు కోరితిని. మెట్కాఫుదొరగారు నా కిచ్చిన ప్రత్యుత్తరములోని ముఖ్యభాగము నిందుదాహరించుచున్నాను.—

"I have read your letter and assure you I deeply sympathise with you in all you say............ If Govt. cannot entertain Venkatasivudu and Mrityunjayarao in the enlarged staff which will be needed for the large middle department another branch School will certainly be necessary and I see no reason why you or the Municipality should not carry iton.

Supposing Govt. do not provide for all the pupils at first it might be possible for you to continue on of the branches as you propose and allow it to be absorbed in Govt school afterwards. I have told Mr. Munro we must have *Telugu* L. Ts. and though I had to make some sort of a compromise and suggest two Southern men for our last appointments in the College, I have stated my preference for those two young men of ours, Venkatasivudu and Mrityunjayarao undergoing Training. I recommended the former to Mr. Kuder very strongly and I think he intends to take him. If not I will try my best to provide for both sooner or later. Assuring you of my high appreciaticn of your self - denying life, I am &c. E. P. Metcalfe."

(నేను మీయుత్తరమును చదివియున్నాను. మీరు చెప్పుచున్నదానిలో నంతలోను నేను మీతో నత్యంత సానుభూతిని గలవాండనై యున్నానని మీకు నిశ్చయముగా చెప్పుచున్నాను........

గొప్ప మధ్యమ నియోగమునకు కావలసివచ్చెడు పెద్దశిక్షక వర్గములో దొరతనమువారు వెంకటశివునకును మృత్యుంజయరావునకును పని యియ్యలేకపోయిన పక్షమున, ఇంకొక శాఖాపాఠశాల తప్పక యావశ్యకమగును. మీరు గాని పారిశుద్ధ్య విచారణసంఘము వారు కాని దానిని కొనసాగింప కూడదనుటకు నాకు కారణము కనఁబడుచుండలేదు. దొరతనమువారు మొట్టమొదటనే యందలివిద్యార్థులకును తగినయేర్పాటు చేయనిపక్షమున మీరు చెప్పినట్లుగా శాఖలలో నొకదానిని మీరు జరుపుచు తరువాత దొరతనమువారి పాఠశాలలో చేరనిచ్చుట మీకు సాధ్యము కావచ్చును. మాకు తెలుఁగు ఎల్. టీలు కావలెనని నేను మన్రోగారితో చెప్పియున్నాను. కాలేజిలోని మనకడపటి రెండుపనులకును దాక్షిణాత్యుల నిద్దఱిని సూచించి నేనొక విధమైన సమాధానము చేయవలసినవాఁడ నైనప్పటికిని క్రమశిక్షను పొందుచున్న వేంకటశివుఁడు మృత్యుంజయరావు అను మన యిద్దఱు లేఁబ్రాయపువారికిని నే నాధిక్య మిచ్చెద నని చెప్పియున్నాను. వీరిలో మొదటివాని విషయమయి కూడరుగారితో మిక్కిలి బలముగా శ్లాఘించి చెప్పియున్నాను. ఆయన యతనిని తీసికొన నుద్దేశించుకొన్నాఁడని తలఁచుచున్నాను. కానిమొదల శీఘ్రముగానో యాలస్యముగానో యిద్దఱికిని పను లిప్పించుటకు నేను చేయఁదగిన దంతయు చేసెదను.

మీయాత్మ సుఖత్యాగజీవితముయొక్క నాయున్నత గుణగ్రాహకత్వమునుగూర్చి మీకు దృఢీకరించుచు............ఇ- వీ- డుట్నా-పుగారు.)

ఈ యుత్తరమునకు తరువాత దొరగారితో నేను స్వయముగా మాపాఠశాల విషయమయి మాటాడితిని. ఆయన యున్నత పాఠశాలను నేను పెట్టుట కొప్పుకొన లేదు కాని నేను మధ్యమ

పాఠశాలతో తృప్తి పొందిన పక్షమున, పూర్వము పురజనుల వలని చందాల మూలమున కట్టఁబడినట్టియు నిప్పుడు మ్యునిసిపల్ వారి యధీనము చేయఁబడి యున్నట్టియు, పురమందిరమున కెదురుగానున్న పాఠశాలాగృహమును కూడ మా కిప్పించెద నని చెప్పెను. మధ్యమ పాఠశాలలో పనిచేయుటకు వెంకటశివుఁడుగా రొప్పుకొనలేదు; ఉన్నత పాఠశాలను పెట్టుటకు దొరగా రొప్పుకొనలేదు. అందుచేత నేను విఫలమనోరథుఁడనై నావద్దకువచ్చిన వేయిరూపాయలును గంజాము వేంకటరత్నముగారికి మరలనిచ్చివేసి యప్పటికి నా ప్రయత్నమును విడువవలసినవాఁడ నైతిని. సత్తిరాజు మృత్యుంజయరావుగారును గోటేటి కనకరాజుగారును తామెంత తక్కువ జీతమునకైనను మధ్యమ పాఠశాలలో నైనను, పరోపకారమున కయి పాటుపడెదమని నిలిచియుండిరి. ఇంతలో పరీక్షాపర్యవసానము తెలిసినది. ఎల్. టీ పరీక్షలో మృత్యుంజయరావుగా రొక్కరే కృతార్థులయిరి; వేంకట శివుఁడుగారు తప్పిపోయిరి. నామాటను మన్నించి మెట్కాఫు దొరగారు మృత్యుంజయరావుగారికి రాజమహేంద్రవర రాజకీయ శాస్త్రపాఠశాలలో నొక్కసారిగా నూఱురూపాయలపని నిప్పించిరి. కొంతకాలమయిన తరువాత తమ తొంటి నియమమును మానుకొని మధ్యమ పాఠశాలలోనే పనిచేసెదమని రాయసము వేంకట శివుఁడుగారును వల్లూరి నరసింహరాయఁడుగారును తమ సమ్మతిని దెలిపిరి కాని వేంకటరత్నముగారు మొదలైనవారి కెవరిసొమ్మును వారికిఁ బంపివేసి నా యేర్పాటుల నన్నిటిని త్రిప్పివేసికొన్నందున నప్పటికే కార్యము మించిపోయెను. వేయిరూపాయలను వాగ్దానముచేసిన గంజాము వేంకటరత్నముగారు కాకినాడలో న్యాయవాదిగా నుండి విశేషవిత్తమార్జించి దేశాభిమాని యయి చెన్నపురి దొరతనమువారి శాసననిర్మాణసభలో సభ్యులయి కీర్తిశేషులయిన యుదార పురుషులు.

ఈయన నాయందు గౌరవము కలవారయి యుండి 1896 వ సంవత్సరమునందు నా పేరిట కాకినాడ కాలేజీలో విద్యార్థివేతనము స్థాపించుట కుద్దేశించి తన రెండువేలరూపాయల భీమా పత్రమును పంపినట్టు కార్యదర్శిగారు నా పేర వ్రాసినప్పుడు నన్ను విడిచి నాకంటె నర్హతరు లయినవారి పేరిట స్థాపించవలసిన దని నేను కోరఁగా నా కిట్లు బదులు వ్రాసిరి—

" I came to the resolution you refer to after long deliberation. I do not know if I ever in all my life came to a sounder resolution than this one. I am sure you stand in need of no memorial of the kind, but you will not certainly grudge me the honour of bәing one o! your humble, yet ardent, admirers. you cannot realize how much I used to admire you when I was quite a boy— though I never came under your direct influence— how far your example has influenced my public life and how admiration has grown as I saw more and more of you. It is only patriotic on the part of every educated man to try to hand down your noble life and example to posterity in the best way he thinks fit and I beg therefore you will kindly accede to my proposal and settle the terms of the Scholarship."

(మీ రుదాహరించిన నిశ్చయమునకు దీర్ఘాలోచనమీఁదనే నేను వచ్చితిని. దీనికంటె నెక్కువ మంచిదైన నిశ్చయమునకు నేను నా జీవితకాలములో నెప్పుడైన వచ్చితినేమో నే నెఱుఁగను. ఈవిధమైన స్మరణ చిహ్నము మీకు కావలసి యుండలే దని నేను నిశ్చయముగా నెఱుఁగుదును; కాని వినమ్రు లయ్యును ప్రోత్సాహులైన మీ సాశ్చర్యప్రశంసకులలో నొక్కఁడనుగా నుండు నట్టిగౌరవమును నాకు కలిగింప మీరు నిశ్చయముగా నిష్టపడ కపోరు. నే నెప్పుడును మీ ప్రత్యక్ష ప్రాబల్యముక్రిందికి రాక పోయినను నేను కేవల బాలుఁడగాను గా నున్నప్పుడును మీవిష యమయి నేనెంత యద్భుతపడుచుండెడివాఁడనో మీదృష్టాంతము

నా బహిరంగ జీవితము నెంతవఱకు బలపఱచినదో మిమ్మును గూర్చి నే నెక్కువగా తెలిసికొనుచు వచ్చినకొలఁదిని నాశ్లాఘనపరత్వ మెట్లు హెచ్చుచు వచ్చినదో మీరు తెలిసికొనఁజాలరు. మీ మహనీయజీవితమును దృష్టాంతమును తాను యుక్తమని భావించినయుత్తమమార్గమున పుత్రపౌత్ర పరంపరలో వ్యాప్తికలుగఁ జేయుట కయి ప్రయత్నించుట విద్యాధికుఁడైనవాని కెవనికైనను దేశాభిమానమే యయి యుండును; కాఁబట్టి మీరు దయాపూర్వకముగా నాకర్తవ్యనిర్దేశము నంగీకరించి విద్యార్థివేతనమును గూర్చిన యేర్పాటులను నిర్ణయపఱుతు రని వేఁడుచున్నాను.")

ఈపయి ప్రత్యుత్తరమునకు కారణమైన నాయుత్తరమునకు మూలకారణమైన కాకినాడ కాలేజి కార్యనిర్వాహక సభా కార్యదర్శియైన (దివాన్ బహద్దర్) దురిశేటి శేషగిరిరావుగారి లేఖను గూడ నిందు ప్రచురించుట యుక్తమని భావించి యట్లుకావించుచున్నాను-

"Mr. Ganjam Venkataratnam has endowed the Pittapur Rajah's College with his policy for Rs. 2,000, interest on which, when realized, is to be utilized as a scholarship to some poor boy in the College in your name and has requested me to write to you regarding the terms of the scholarship. I therefore request you will be good enough to furnish me with your views on this question."

దానిమీఁద వడ్డి వచ్చినప్పుడు మీపేరను కాలేజిలోని యొకబీదబాలునికి విద్యార్థివేతన మిచ్చుట కుపయోగించు నిమిత్తమయి తన రెండువేలరూపాయల భీమాపత్రము పిఠాపురరాజా కాలేజి కిచ్చి గంజాము వెంకటరత్నముగారు విద్యార్థివేతనముయొక్క యేర్పాటులనుగూర్చి మీకు వ్రాయవలసినదని నన్ను కోరియున్నారు. కాఁబట్టి యీవిషయమయి మీ యభిప్రాయములను దయచేసి తెలియఁజేయ గలందులకు మిమ్ము వేఁడుచున్నాను."— డి. శేషగిరిరావు, కార్యదర్శి.)

ఆస్తిక పాఠశాలలో పనిచేసెద నని యుత్సాహముతో ముందుకు వచ్చిన గోటేటి కనకరాజుగారు కొన్ని సంవత్సరముల క్రిందట చెన్నపట్టణప్రభుత్వమువారి తెలుఁగు భాషాంతరీకర్త లయిరి. శాస్త్ర పాఠశాలలో నూఱురూపాయలజీతముమీఁద సహాధ్యాపకుఁడుగానియమింపఁబడిన సత్తిరాజు మృత్యుంజయరావుగారు నిగర్వియు నిష్కృటియు నయి లోకహిత కార్యకరణమునందు నిరుపమానోత్సాహము కలవారు; కేవలవాక్శూరతతో తృప్తినొందియుండక క్రియాశూరత్వమునకు త్రోవత్రొక్కుచుండినవారు; నేను వ్రాసిన కార్యమును నాయనంతరమున కొనసాగింపఁగలవా రొక్కరు బైలుదేఱుచున్నారని నమ్మి నేను గనక రాజుగారి మరణదుఃఖమును కొంత మఱచుచుండెడివాఁడను, తా నొకటి తలఁచిన దైవ మొకటి తలఁచునన్న సామెత మనలో నున్నదేకదా! నే నిట్లింతో యాశపడియుండఁగా నాతని దేహములో వ్యాధిప్రవేశించి యంతకంతకు ప్రబలి తుదకు క్షయలోనికి దిగి శీఘ్రకాలములోనే యాతని నీశ్వరసాన్నిధ్యమును జేర్చెను. ఈశ్వరభక్తియు ప్రార్థనసమాజ కార్యనిర్వాహణాసక్తియు సత్కార్యాచరణానురక్తియుఁ గలవారయి సత్యసంవర్ధనిని నడుపుచు వచ్చిన తరుణవయస్కులలో నితఁ డొక్కఁడు. ఇతఁ డాస్తిక పాఠశాలాభ్యుదయమున కయి తన జీవితమును సమర్పింప నిశ్చయము చేసికొన్న నిష్కలంక హృదయుఁడు. ఈతఁడు యౌవనదశారంభములోనే యకాలమృత్యుదేవతవాఁతఁ బడినను ఈతనివంటి వారితో పనిచేయ నుద్యమించిన యాస్తికపాఠశాలప్రయత్న మంతటితో నంతరింపలేదు. చిరకాలమడఁగి యుండి పైకిరాకుండిన యాయుద్యమబీజము కొన్ని సంవత్సరములక్రిందట నంకురించి మరల తలయెత్తి పాఠశాలాస్థాపనరూపమున సఫలత నొందిన దయి శ్రీపిఠాపురపు రాజుగారి యనుగ్రహమువలన దివ్యభవనమునుబడసి యాస్తిక పాఠ

శాలానామమున వెలయుచున్నది. ఈ పాఠశాలనుగూర్చి ముందు యుక్తసమయమున వివరముగా వ్రాయఁబడును.

1898 వ సంవత్సరమునందు చెన్నపురి దొరతనమువారు నన్ను సర్వకళాశాలా సభ్యునిగా (Fellow of the Madras university) జేసిరి.

నా యారోగ్యహీనతనుబట్టి వివేకవర్ధని నిలుపుచేయఁ బడిన తరువాత 1891 వ సంవత్సరమునందు న్యాపతి సుబ్బారావుపంతులు గారు తెలుగులో చింతామణి యను మాసపత్రికను స్థాపించి మా వివేకవర్ధనీముద్రాక్షరశాలలోనే దానిని ముద్రింపించుచు వచ్చిరి. దానికి నేను వ్రాఁతలో సహాయుఁడ నయి వ్రాయుచుంటిని. దాని కయిన సమస్తవ్యయములను సుబ్బారావు పంతులుగారే భరించు చుండెడు వారు.

1897 వ సంవత్సరము జూన్ నెలలో గోదావరీ మండలసభ యేలూరు పట్టణమునందు జరిగినది. ఆ సంవత్సరము జూన్ నెల 9 వ తేదిని మండల సాంఘిక సభకూడ నక్కడనే జరిగినది. ఈ సభకు గౌరవనీయులైన న్యాపతి సుబ్బారావుపంతులుగా రగ్రాస నాధిపత్యము వహించుట కేర్పాటు చేయఁబడినను కార్యాంతరము చేత వా రాదినమున నక్కడకు రాలేక పోవుట యనివార్యమయినం దున వారిస్థానమున నన్నగ్రాసనాసీనునిగా నియమించిరి. మా మండ లములో సాంఘిక మండల సభలు జరగుట కదియే యారంభము. వ్యావహారికసభ కెందఱు జనులువచ్చిరో యంతమంది యీసాంఘిక సభకును వచ్చినందున మా మండలములో జనులు సాంఘిక విషయ ములయందుకూడ శ్రద్ధవహించుట కారంభించి రనుట స్పష్టమగు చున్నది. ఈ నెలలలోనే కృష్ణామండలసభ కూడ కూడెనుగాని యా మండలమునందు సాంఘికసభ జరగలేదు. ప్రత్యేకముగా

సాంఘిక సభలు జరగక పోయినను వ్యావహారిక సభలలోనే సంఘ సంస్కారవిషయములు కొన్ని చర్చింపఁబడుచు వచ్చుట యాచార మయియుండెను. కాని వ్యావహారిక సంస్కార పక్షమువారి నాయకులు సాంఘిక సంస్కార పక్షాభిమానులు కాకపోవుటచేత నాసంవత్సరమున కృష్ణామండల సభలో నావఱకు చర్చించుట కేర్పఱుపఁబడిన సాంఘిక విషయములు కొన్నియు కూడ కాలము చాలదన్న మిషమీఁద విడిచిపెట్టఁ బడినవి. వింజమూరి భావనాచార్యులుగారు మొదలయిన సాంఘిక సంస్కార పక్షావలంబుల సంఖ్య యత్యల్పమయినందున వా రేమియు చేయలేక పోయిరి. ఏలూరిలో జరగిన మామండల సాంఘికసభలో నింకొక విశేషముకూడ నడచినది. ఆవఱకెప్పుడును స్త్రీలు పురుషులసభలకు వచ్చుట యాచారము లేదు. సాంఘిక విషయములు సాధారణముగా స్త్రీలతో సంబంధించిన వగుటచేత నట్టి విషయము లాలోచింపఁ బడునప్పుడు స్త్రీలుండుట యభ్యర్థనీయ మని నే నచ్చటి పెద్దమనుష్యులతో కొందఱితో ముచ్చటించితిని. నామాటలు విన్నప్పుడు కలిగిన యుత్సాహములో తమ భార్యలను జేపటి సభకుఁ దీసికొనివచ్చెద మని యనేకులు వాగ్దానము చేసిరి. అందుచేత స్త్రీలు కూర్చుండి వినుటకయి ప్రత్యేకముగా సభాశాలలో నేర్పాటు చేయఁబడినది. ఈసంగతి పట్టణములో తెలియఁగానే పూర్వాచార విరుద్ధమయిన కార్యము జరగఁబోవుచున్నదని సంక్షోభము పుట్టినది. ఈ సంక్షోభమునకు భయపడి యుత్సాహములో మొదట ముందుకు వచ్చిన వాక్శూరులు కొందఱు సభకు తమభార్యలను తీసికొని రాలేకపోయినను ధైర్యశాలు లనేకులు తాముచేసిన వాగ్దానములను చెల్లించుకోఁ గలిగిరి. వారిలో నిద్దఱి నామముల నిందుఁ బేర్కొనుచున్నాను. అం దొకరు దాసు శ్రీరాములు పంతులుగారు. ఆయన భార్య యాదినమున

బహిష్ఠ యగుట తటస్థించెను. అయినను తాము మాట తప్పిరని నే ననుకొందునేమో యని యామెను స్నానముచేయించి సభకు వారు తీసికొనివచ్చిరి. రెండవవారు సత్తిరాజు కామేశ్వరరావుగారు; ఈయన సత్తిరాజు మృత్యుంజయరావుగారి తమ్ముఁడు. భార్యను సభకు తీసికొనిపోయిన పక్షమున, ఆయనతోడి తమసంబధమును వదలుకొనెద మని యన్నలు బెదరించినను లక్ష్యముచేయక యాయన నాఁటియుదయమున భార్యను సభకు సాహసముచేసితీసికొనివచ్చెను.

నేను కొన్నిసంవత్సరములనుండి చెన్నపట్టణమునకు పోవలె నని తలఁచుచుండినవాఁడనయి 1894 వ సంవత్సరమునందు వేసవి కాలపు సెలవులలో నక్కడకుఁ బోయినప్పుడు పరశువాకములో నాస్నేహితులైన మన్నవ బుచ్చయ్యపంతులుగారియింటి కెదురుగా నొక యిల్లు కొని, తరువాత నేను వాసముచేయుటకు యోగ్యముగా నుండునట్లు దానిని పడఁగొట్టించి మేడయిల్లు కట్టించితిని. జన్మస్థల మును బాల్యమిత్రులను విడిచి దూరస్థలములో క్రొత్తవారిలో నుండునట్లు నన్ను ముఖ్యముగా ప్రేరేచిన ప్రయోజనములు రెండు- అందొకటి నా పుస్తకములను చెన్నపట్టణములో సంపుటములనుగా ముద్రించుకొనవలె ననుట; రెండవది సంఘసంస్కార విషయమున రాజధానిలో పనిచేయవలె ననుట. నేనుచేసిన పుస్తకములసంఖ్య నానాఁటికి పెరుగుచున్నది. మంచి పనివాండ్రు దొరకకపోవుటచేత వానిని నేత్రాకర్షకముగా ముద్రింపించుట రాజమహేంద్రవరము వంటి చిన్నపట్టణములో నాకు సాధ్యము కాలేదు. ఒకవేళ మంచికా గితములమీఁద పుస్తకములను చక్కఁగా ముద్రింపించుట సాధ్యమైన ను వాని కిచ్చుట స్వర్ణాక్షరములతో మంచిగుడ్డయట్టలు కట్టించుట నా కసాధ్యముగా కనఁబడెను. అందుచేత పుస్తకముల పనిని చెన్న

పట్టణమునకు పోయి చేయించుటకయి నిశ్చయించుకొంటిని. ఈపని విశేషవిత్తసాధ్యము; ఆయ మెంత వచ్చినను నాసొమ్మెప్పటిదప్పుడే యేదోయొక పనికి వ్యయపడుచుండుటయే కాని నాచేతిలో ధనము నిలువయుండుట యెప్పుడును తటస్థింపలేదు. నాపుస్తకముల నితరుల ముద్రాయంత్రములలో ముద్రింపవలెనన్నచో వేలకొలఁది రూప్యములు కావలసియుండును. అంత సొమ్ము నే నెక్కడనుండి తేఁగలుగుదును? అందుచేత సులభముగా పని జరప శక్తుఁడ నగుటకయి యొక నూతన ముద్రాయంత్రమును చెన్నపట్టణములో స్థాపించి దానిలో పని నడప నుద్దేశించుకొంటిని. అంత గాక పోయిన కొంతయైనను ఈ పనికి సహితము ధనము కావలసియున్నది. ఈ ధనమును సమకూర్చుట కయి నా వివేకవర్ధనీ ముద్రాక్షరశాలను చిత్రపు నరసింహారావు గారి కమ్మివేయుటయే కాక నా మిత్రు లయిన న్యాపతి సుబ్బారావు పంతులవారియొద్ద వేయిరూపాయల ఋణము చేయవలసినవాఁడ నైతిని. నే నడిగినందునను నా తోడ్పాటు లేక చింతామణి పత్రికను రాజమహేంద్రవరములో నడపుట కష్టముగా కనఁబడినందునను సుబ్బారావు పంతులుగా రాపత్రికను చెన్నపురిలో నడుపుటకు నా కిచ్చివేసిరి. నే నింగ్లండునకు వ్రాసి యావిరితో పని చేయుటకు తగిన మంచి ముద్రాయంత్రమును చెన్నపురికి తెప్పించి యుంచి దానికి చింతామణి ముద్రాక్షరశాల యని పేరు పెట్టితిని.

ఆరంభములో నున్నతపాఠశాలకంటె నెక్కువపాఠశాల లేకపోవుటచేత విద్యావ్యాప్తితక్కువగా నుండినట్టియు చిరకాల మయోమార్గసంబంధము సహితము లేకపోవుటనుబట్టి నవనాగరికతా సంపర్కము కొఱవడి యుండినట్టియు గోదావరీ పుణ్యనదీప్రాంతమగుటచేత ఛాందసబ్రాహ్మణమండలితో నిండియుండి కర్మఠతులకు నివాస మయిన సదాచార విద్వేషమునకు ప్రసిద్ధికెక్కినట్టియు మాఱుమూల

నున్న రాజమహేంద్రవరమునందు సంఘసంస్కారకార్యము నారంభించితిని. ఊషరక్షేత్రమునందు బీజావాసముచేసి పెంటకట్టి రేయింబగళ్ళు కష్టపడు కర్షకుని కృషివలె నాకృషి యిక్కడ నాకోరికకు తగినంత ఫలదాయకము కాకపోవుటచేత, చిరకాలమునుండి సర్వకళాశాలాది సమస్త విద్యాలయములకును నిలయ మగుటచేత విశేష విద్యావ్యాప్తి కలిగి యుండినట్టియు నానా ముఖములనుండి వచ్చి సంధించెడి యయోమార్గములచేతను ఖండాంతరములనుండిసహితము వారవారమునకు వచ్చెడుధూమనౌకలచేతను వివిధనవనాగరికజనతా సంసర్గము కలిగియుండినట్టియు వివిధ దేశాగత వివిధాచార వివిధ మత వివిధవ్యవహార సమ్మిశ్ర మగుటచేత పూర్వాచార పరాయణ శుద్ధశ్రోత్రియ జనసమాకీర్ణము కానట్టియు రాజ్యమధ్యస్థమయి సముద్రతీరమున నున్న చెన్నపట్టణమందు నాకృషి సారవంత మైన దివ్యక్షేత్రమునందు విత్తనములు చల్లిన కృషీవలునికృషివలె శీఘ్రకాలములో ననాయాసముగా విశేష ఫలప్రద మగు నని నమ్మి నేను చెన్నపురిలోనే స్థిరనివాస మేర్పఱచుకొన నుద్దేశించితిని. ఈ యుద్దేశముతో ముందుగా జీతము ముట్టని పద్ధతిమీఁద రెండు సంవత్సరములు సెలవు పుచ్చుకొని తదనంతరము పనిమానుకొని యచ్చటనే నిలిచిపోవలె నన్న నిశ్చయముతో మనస్సులో వియోగచింతాక్లేశము లేనివాఁడను కాకపోయినను ముందధికోపయోగకర కార్యమును జేయఁగలుగుదు నన్న యూఁజటతో జన్మస్థలమును విడువ శంకింపకుంటిని.

నేను తమ నడుమనున్న కాలమున నెట్లున్నను, నేను తమ్ము విడిచిపోవ నున్నట్టు తెలియఁగానే తమ తొంటిభేదభావమును మఱచి నా యభిప్రాయములతో నేకీభవింపనివారును కూడ నాకు గౌరవము చూపుటలో నొక్కటిగాచేరి రాజమహేంద్రపురవాసులు నాతోడి

వియోగమును గూర్చి తమ విషాదమును దెలుపుచు సభలలో ప్రసంగములు చేసియు నాపైని పద్యములు వ్రాసియు నాకు విందులు చేసియు బహువిధముల నామీఁద నాదరమును జూపిరి. అనేక సమాజములవారు నన్ను నడుమఁగూర్చుండఁబెట్టుకొని ఛాయాప్రతిమలను దీయించిరి. నా స్తోత్రపాఠములను వార్తాపత్రికలకుఁ బంపిరి. ఇట్లు చేయఁబడిన కోలాహలములను వార్తాపత్రికలవలనఁ దెలిసికొని నా మిత్రులయిన రంగయ్యసెట్టిగారు 1897 వ సంవత్సరము నవంబరు 13 వ తేదీని చెన్నపట్టణమునుండి నా కిట్లు వ్రాసిరి.—

"I have with immense pleasure read reports of the grand entertainments given in your honor. At last Rajahmundry has shown, though unpardonably late, its gratitude to you for your untiring exertions in the cause of Telugu Literature and all-important social Reform. Surely it must be excruciating to one's feelings to think of leaving his birth-place after such a long course of successful career. But the very fair prospect before you in the adopted city may to some extent cheer you up. I ardently hope Madras will appreciate your disinterestedly voluntary services. Of course the social Reform party will muster strong around you; but, alas! will the influencial and educated gentlemen of position and fame extend their right hand to so worthy a person as thy good self? May God help them to do the needful for the cause and for themselves!"

(మీ గౌరవార్థముగా నియ్యఁబడిన గొప్పసత్కారములను గూర్చిన ప్రకటనలను నే నత్యంత సంతోషముతో చదివియున్నాను. క్షమింపఁగూడని యాలస్యముతో నైనను నప్పటికిని తుదకు రాజమహేంద్రవరము తెలుఁగు భాషాభివృద్ధిలోను సర్వప్రధానమైన సాంఘిక సంస్కారములోను మీ యెడతెగని ప్రయత్నముల కయి మీ యెడల తనకృతజ్ఞతను జూపియున్నది. జయప్రదమయినచర్యయొక్క యటువంటి దీర్ఘాచరణమునకు తరువాత తన జన్మస్థలమును విడువఁదలఁచుట తన మనస్సునకు నిశ్చయముగా నెంతో సంతాపకరముగా

నుండవలెను. కాని మీ స్వీకృత పట్టణములో మీ ముందున్న మిక్కిలి యనుకూలమైన యుత్తరాపేక్ష కొంతవఱకు మీ కుత్సాహమును కలిగింపవచ్చును. ఫలాపేక్షలేక మీరయాచితముగా నర్పించెడు సేవను చెన్నపట్టణము గ్రహించి మెచ్చుఁగలుగు నని నేను మనఃపూర్తిగా కోరుచున్నాను. సాంఘిక సంస్కారపక్షమువారు నిశ్చయముగా మీచుట్టును బలముగా చేరుదురు. కాని, అక్కటా! అధికారమును ప్రసిద్ధియుఁగల ప్రబలులైన విద్యాధురీణులు మీవంటి యర్హ్యపురుషుని కయి తమ కుడిహస్తమును చాపుదురా? కార్యము కొఱకును తమకొఱకును ఆవశ్యకమైనవి చేయుటకయి దేవుఁడు వారికి తోడ్పడును గాక!)

ఈ ప్రకారముగా నన్నాదరించి వీడుకొనిన దొక్క రాజమహేంద్రవర నివాసులు మాత్రమే కారు. కాకినాడ పురవాసులును సభచేసి యీ ప్రకారముగానే నన్ను సత్కరించి వీడుకోలిచ్చిరి. ఇట్లు స్వదేశీయుల దీవనలను బడసి 1897 వ సంవత్సరాంతమునందు సకుటుంబముగా నేను చెన్నపురిఁ జేరితిని. నేను రాజమహేంద్రవరమును విడుచునప్పటి కిక్కడ నిరువదియేడు స్త్రీ పునర్వివాహములు జరిగినవి. వానినిగూర్చి చెప్పవలసిన విశేషము లంతగా లేవుగాని 1892 వ సంవత్సరము నవంబరు నెల 6 వ తేదీని జరిగిన 19 వది యైన మానూరి పురుషోత్తము పంతులుగారి వివాహమును గూర్చి మాత్రము కొంచెము చెప్పవలసి యున్నది.

అప్పుడు పదునాఱు సంవత్సరముల ప్రాయము గల యొక చక్కని మాధ్వ బాలవితంతువు కాకినాడలో నున్నదనియు, ఆ చిన్నదానికి వివాహము చేయవలె నని తండ్రి కిష్టమున్నను బంధువులకును స్వాములవారికిని భయపడి యతఁడు పైకి రాఁజాలకున్నాఁడనియు, తాయి సూర్యప్రకాశరావు నాయఁడుగారు మొదలైన

వారు నాకు కాకినాడనుండి వ్రాసిరి. ఆ కాలమునందు మాధ్వ మత స్వాములవారు మా మండలమునందు శిష్యసంచారము చేయుచుండిరి. స్వాములవారు గురుదక్షిణ గైకొని శిష్యులకు తప్తముద్రాంకనము చేయుదురు; ఉద్యోగములలో నున్నవా రందఱును మూడేసి నెలల జీతము గురుస్వాములవారికి సమర్పింపవలసి యుండును; స్వాములవా రేయే గ్రామములకు విచ్చేయుదురో యాయా గ్రామములలోని బాలవితంతువులకు కేశఖండన మహోత్సవము నడచుచుండును. ఈ స్వాములవారి బారినుండి తప్పించుట కయి యా చిన్నదాని తండ్రి స్వాములవారు రాజమహేంద్రవరములో నుండినంతకాలము తన కొమారితతో కాకినాడలో నుండెను. స్వాములవారు రాజమహేంద్రవరమునుండి కాకినాడకు విజయము చేయఁగానే యాయన కాకినాడ విడిచి కుటుంబ సహితముగా రాజమహేంద్రవరమునకు వచ్చి యిన్నీసుపేటలో నొక యింటిలో కాపురముండెను. ఆ యింటిలోనే యా కాలమునందు పట్టపరీక్ష తరగతిలో చదువు చున్న సత్తిరాజు మృత్యుంజయరావుగారును కుటుంబసహితముగా గాపురముండుట తటస్థించెను. ఆయన తమ్ముఁడైన కామేశ్వరరావు గారు ప్రథమశాస్త్రపరీక్ష తరగతిలో చదువుకొనుచుండెను. ఆ బాల వింతతువు తనకు వివాహము చేసికోవలెనన్న యిచ్ఛ గల దనియు, తగిన వరుని కుదిర్చి తెలుపఁగానే బైలుదేఱి వచ్చెద ననియు, మృత్యుంజయరావుగారి భార్యతో చెప్పెను. ఆమె యీ సంగతిని భర్తకు చెప్పఁగా నతఁడు నాకుఁ దెలిపెను. ఇఁక వరాన్వేషణము చేయవలసి యున్నది. ప్రథమశాస్త్రపరీక్ష తరగతిలో కొంతకాలము నావద్ద చదువుకొని యప్పుడు తాళ్ళపూడిలో తాలూకా హెడ్డు గుమాస్తాగా నున్న మానూరి పురుషోత్తము పంతులవివాహితుఁ డయి యుండెను. ఆయనకు వ్రాసి పిలిపించి విచారింపఁగా వితంతు

వును వివాహమాడుట కతఁ డంగీకరించెను. అంతట నాతనిని మృత్యుంజయరావుగారి యింటికిఁ బంపి, యచ్చటి కాయనభార్యచేత వధువును పిలిపించి, ఉభయులను మాటాడించితిమి. వధూవరు లిరువురును పరస్పరానురాగము గలవారయి వివాహమున కొప్పుకొన్న తరువాత రెండు మూడు సారులు వారిని మృత్యుంజయరావుగారి యింటనే మాటాడించి యొక భానువారమునాఁడు వివాహముహూర్తము నిర్ణయించి యా దినమున ప్రాతఃకాలముననే వచ్చి మా యింట నుండవలసిన దని వరున కుత్తరము వ్రాసితిని. ఆ దినముననే మాయింటికి వచ్చుట కయి వధువుతోఁ గూడఁ దెలిపి యేర్పాటు చేసితిని. వధూవరు లిట్లు రహస్యముగా మాటాడుకొనుచున్న సంగతి తల్లిదండ్రులకుఁ గాని బంధువులకుఁ గాని యితరులకుఁ గాని తెలియదు. చూచినవారు వరుఁడు తన మిత్రుఁడైన మృత్యుంజయరావుగారిని చూచి మాటాడి పోవుటకొఱకే యచ్చటికి పోవుచున్నాఁడనుకొనిరి గాని వధువుతో మాటాడుటకొఱకని యెవ్వరును భావింపలేదు. నాయుత్తర ప్రకారముగా ముహూర్తదినమున వరుఁడు వచ్చి మా యింట ప్రవేశించెను. వధువురాకను ప్రతీక్షించుచు నేను సాయంకాలము నాలుగు గంటలవఱకును మాయింట వేచి యుంటిని గాని యప్పటికిని వధువు రానందున రాఁగానే సమాచారము పంపవలసిన దని నాభార్యతో చెప్పి నేను నామిత్రులయిన సుబ్బారావు పంతులుగారియింటికిఁ బోయి మాటాడు చుంటిని. ఇంతలో నొక భృత్యుఁడు వచ్చి యమ్మగారింటికి రమ్మన్నా రని చెప్పెను. నేను సంగతి గ్రహించి వెంటనే యాయనవద్ద సెలవుగైకొని జైలుదేటి వచ్చునప్పుడు త్రోవలో నా మిత్రులైన పోలీసు ఇన్స్పెక్టరు గుమ్మడిదల మనోహరము పంతులుగారిని కలిసికొని నేను వర్తమానము చేసినప్పుడు పంపుటకు రక్షకభటులను కొందఱిని సిద్ధ

ముగా నుంచుమని చెప్పి యింటికి వచ్చితిని. వధువుయొక్క బంధు వులుకొందఱు పట్టణములో ప్రముఖులుగా నున్నారని యెఱిఁగినవాడ నయి వారేదో తొందరచేయక యూరకుండరని తెలిసికొని సాయం కాల మాఱుగంటలయిన తరువాత,యింటికి రండని యావఱకే విద్యా ర్థులకు చెప్పిపుచ్చితిని. వివాహమునకుఁ గావలసిన సమస్త సన్నా హములను నేను ముందుగానే చేసియుంటిని. తనంత వచ్చుటకు వధు వునకు మాయిల్లు తెలియదు; ఎవ్వరయినను తీసికొనివచ్చి యామెను మాయింట నప్పగింపవలెను; వచ్చునప్పుడు మావా రెవ్వరైన వెంట నుండినయెడల జను లనుమానపడి బంధువులకుఁ దెలిపినచో కార్య మునకు విఘ్నము కలుగును. కాఁబట్టి ముం దేఁబది గజముల దూరములో మృత్యుంజయరావుగారి తమ్ముఁడు కామేశ్వరరావుగారు పోతగట్టుమీఁద నడుచునట్టును, వెనుక దూరములో వధు వాయన ననుసరించి నడుచుచు నతఁడేవీధులలో తిరుగునో తానా వీధులలో తిరుగుచుండునట్టును, అతఁడేయింటి వీధిగుమ్మము మెట్లెక్కెడిగునో యది మా యిల్లని గ్రహించి యందు ప్రవేశించునట్లును, సంకేత మేర్పఱిచితిమి. ఆ సంకేత ప్రకారముగా వధువు సాయంకాలము తండ్రి యిల్లు విడిచి బైటికి పోయిన తరువాత తల్లిని అక్కగారిని ఏమఱించి కామేశ్వరరావుగారి వెనుక నడిచివచ్చి మాయిల్లు చొచ్చెను. నేను సుబ్బారావుపంతులుగారి యింటినుండి వచ్చునప్పటికి నన్ను చూచుటకయి వధువునకు సన్నిహితబంధువును పట్టణమునకు స్థిరదండవిధాయియునైన తాడూరి లక్ష్మీనరసింహారావు పంతులు గారు వచ్చియుండిరి. ఆయనను మేడమీఁదికి తీసికొనిపోయి కూరు చుండఁబెట్టి, క్రిందికి దిగివచ్చి తోరణములు మొదలయినవి కట్ట నియమించి, నే నాయనతో మాటాడి పంపివేయుటకు మరల పైకి పోయితిని. నే నెంత తొందరపడినను శీఘ్రముగా నన్నాయన విడిచి

పెట్టనందున సాగనంపుట కయి యాయనను వెంటఁగొని క్రిందికి దిగునప్పటికి దాదాపుగా నాలుగంట లయినది. ఆయన వీధిద్వారమునకు తోరణములు కట్టియుండుట చూచి "నేఁడేదో శుభకార్యములాగున నున్నది" అని నాతో ననెను. "ఆలాగుననే యున్నది" అని నేను బదులు పలికితిని. "వధూవరు లెవ్వరు?" అని యాయన నన్నడుగఁగా, "తేపు మీకు తెలియవచ్చు" నని చెప్పి యాయనను పంపివేసి యేర్పాటులు చేయుటకయి లోపలికి వచ్చితిని. ఇంతలో విద్యార్థులు సన్నద్ధులయి వచ్చినందున వారిని ప్రతిద్వారముకడను ఐదాఱుగురిని నిలిపి నేను లోపలికి రానిమ్మన్నవారిని దప్ప నితరుల నెవ్వరిని లోపలికి రానీయవలదని నియమించి, వధూవరులను పీటలమీఁద కూరుచుండఁబెట్టి పెండ్లితంతు నడుపుట కయి యుపక్రమించితిని. ఇంతలో నన్ను చూచుటకయి మాశాస్త్రపాఠశాలలో నుపాధ్యాయుఁడుగా నున్న కోలాచలము అప్పయ్య దీక్షితులుగారు రాఁగా నే నాయనతో మాటాడుచు నిలుచుండియుండఁగానే సింహద్వారము వద్ద పెద్ద కలకలము వినఁబడెను. వధువుయొక్క బంధువులు గుంపుగా వచ్చి లోపల చొరఁబడఁబోఁగా విద్యార్థులు రానీక వారిని వారించినందున నాకలకలము కలిగెను. కోలాహలముయొక్క కారణమును విచారించుట కయి నేను సింహద్వారము వద్దకు పోఁగా, అక్కడ వధువు పినతండ్రి యైన తాడూరి అంతన్నపంతులుగారు మొదలయినవారియొక్క పెద్దగుంపు కనఁబడెను. అంతన్నపంతులుగారు రాజమహేంద్రవర ప్రేషణకార్యస్థానాధ్యక్షులు. అంతన్నపంతులుగారు తమ్ము "మా సీతమ్మను చూచి మాటాడనియ్యవలసినది" అని నన్ను కోరిరి. వధువుపేరు సీతమ్మ. తండ్రి మాత్రము వచ్చి మాటాడవచ్చునని నేను చెప్పితిని. అక్కగారిని తన్నునుగూడ రానియ్యవలసినదని యంతన్నపంతులుగా రడిగిరి. అల్లరి చేయక దూర

ముగా నిలుచుండి వధువుతో మాటాడిపోవుటకు వా రొప్పుకొన్న మీఁదట వారిని ముప్వురను లోపలికి రానిచ్చితిని. వారివెంట మఱి కొందఱు తోసికొనివచ్చి లోపలఁ బ్రవేశింపఁ బ్రయత్నించిరి కాని విద్యార్థులు జాగరూకులయి వారి నావలికి గెంటివేసిరి. వారు దొడ్డి దారిని లోపలఁ బ్రవేశింపఁ జూచిరి కాని యక్కడ సహితము విద్యార్థులచేత బలవంతముగా వెడలఁగొట్టఁబడిరి. ఆవచ్చిన వారిలో విశేష భాగము వంటబ్రాహ్మణులును అంచెలు మోచుధావకులును అయి యున్నారు. వీండ్రసాహాయ్యముచేత వధువును బలవంతముగా నీడ్చుకొనిపోవ నిశ్చయించుకొని వచ్చిరి కాని పరమవిశ్వాసు లయిన విద్యార్థుల బలముచేత వారు లోపల నడుగుపెట్ట శక్తులు గాక విఫలమనోరథు లయిరి. ఇఁక లోపలికి వచ్చినవారిలో వధువు యొక్క యగ్రసోదరి పెండ్లిపీటమీఁద వరుని సరసను గూరుచున్న చెల్లెలిపయినిబడి కట్టుకొన్న పెండ్లిచీరను చింపి యీడ్చుకొని పోవఁ జూచెను గాని యింతలో నాయాజ్ఞమీఁద విద్యార్థు లడ్డుపడి కాళ్లొక్కరును చేతులొక్కరునుబట్టి యెత్తుకొనిపోయి యఱచుచుండఁగా నామెను వీధిలో నిసుకలోఁ గూలవేసిరి. మగవారి నిరువురను నే నీవలకుఁ గొనివచ్చి మాటాడుచు, వధూవరులవద్దనున్న రబ్బాప్రగడ పాపయ్యగారు మొదలైనవారితో మంత్రములు చదివి వివాహము కానియ్యవలసినదని కేక వేసితిని. అంతట వారు విఫలప్రయత్నులయి మాయిల్లు వెడలి యక్కడనుండి తిన్నగా నారక్షక కార్యస్థానమునకుఁ బోయి యుక్తవయస్సు రానిపడుచును బలవంతముగా తండ్రిసంరక్షణమునుండి యెత్తికొని వచ్చినట్టు నామీఁద నారాత్రియే యభియోగమును దెచ్చిరి. ఆరక్షకశాఖవారి కోరికమీఁద మఱునాఁడు రాజకీయ వైద్యుఁడు మాయింటికి వచ్చి వధువును పరీక్షించి యామెకు పదునాఱేండ్లు దాఁటినవని నిర్ణయపత్రము నిచ్చెను.

అందుమీఁద నభియోగము త్రోసివేయఁబడెను. ఆ రాత్రి జరగిన చర్యను చెంతనుండి చూచుచుండిన యప్పయ దీక్షితులుగారప్పుడు తన కాళ్లు సహితము నడఁకఁ జొచ్చె నని చెప్పి నా ధైర్యమున కద్భుతపడుచున్నట్లు పలికెను. వరుఁడు సహితము తన కప్పుడు దేహ మంతయు కంపమెత్తె ననియు, ఆ భయసమయములో నేమూల నుండియైన గోడ దూకి పాఱిపోయి ప్రాణములు దక్కించుకోవలె నన్న బుద్ధి పుట్టెననియు, తరువాత నాతో ననెను. ఈవరుఁ డిప్పుడు కాకినాడ మండలకరగ్రాహి కార్యస్థానములో నెల కఱువది రూపా యల జీతముగల పనిలో నున్నాఁడు. వివాహమువలనఁ గలిగిన ప్రథమ సంతానమైన కొమారితను పట్టపరీక్షాసిద్ధుఁ డయి బందరు నోబిలుకాలేజిలో నుపాధ్యాయుఁడుగ నున్న యొక ధీరుఁడు వివాహ మాడి సంతానలాభమునొంది సుఖించుచున్నాఁడు. చీరచించి పెండ్లి పీటలమీఁద నున్నవధువు నంత యల్లరిచేసిన యక్కగారే నాలవ దినమున మరల మాయింటికి వచ్చి చెల్లెలి తల దువ్వి పోవుటయే కాక తరువాత చెల్లెలి కెన్నియో పురుళ్లు పోసెను.

దీని తరువాత జరిగినవివాహ మనఁగా 20 వ వివాహ మిప్పుడు పిఠాపుర సంస్థానమునం దుద్యోగములో నున్న యాది పూడి సోమనాథరావుగారిది. ఈయన వివాహమాడిన సీతమ్మ యను బాలవితంతువు గంజాము మండలములోని యాసికాగ్రామము నుండి రాజమహేంద్రవరము వచ్చినది. ఆకాలమునం దయో మార్గములేదు; అక్కడనుండి రాఁ దలఁచిన వారు రాజమహేంద్ర వరమునకు మోటుబండ్లమీఁద రావలెను. ఈచిన్నది రాజ మహేంద్రవరములో వితంతువులకు వివాహము చేయుచున్నా రని యన్నగారు వృత్తాంత పత్రికలలో చదువఁగా విన్నదఁట! అంతేకాక య్యామె యన్నగారు నాపుస్తకములను గొన్నిటిని తెప్పించి చదువు

చుండెనఁట! వితంతువివాహములు జరుగుచున్నట్టు వినెడు బాలవితంతువులకు తాముకూడ వివాహసౌఖ్య మనుభవింపవలెనన్న యభిలాష పుట్టుట యస్వాభావికము కాదు కదా! అట్టివారు లోకనిందకు వెఱచి తమ యభిమతమును వెలిబుచ్చక సాధారణముగా మనసులోనే యడఁచుకొనువా రయినను, ఈ చిన్నది మాటల ధోరణిని మెల్లగా తనవదినెగారితో "రాజమహేంద్రవరములో బాలవితంతువులకు వివాహములు చేయుచున్నారఁట" అని నోరుజారవిడిచెనఁట! ఆ మాట వినఁగానే వదినెగారు "ఆమాట అనఁగూడదు. తప్పు" అని మఱఁదలిని మందలించెనఁట! ఆమె మనస్సెఱిఁగిన దయి యా చిన్నది మఱి యెప్పుడును వివాహముపేరు తలపెట్టక తానును తనవలెనే పసితనములోనే పతిని గోలుపోయిన మఱియొక బాలవితంతువును గలిసి యాలోచించుకొని రాజమహేంద్రవరమునకు పోవ నిశ్చయించుకొని యొకనాఁ డెవ్వరికిని దెలియకుండ గ్రామము విడిచి బైలుదేఱి విశాఖపట్టణ మండలములోని విజయనగరమునకును వచ్చునప్పటికి రెండవ చిన్నదాని ధైర్యముచెడి ముందుకు సాగ సాహసింపలేక యామె యక్కడనే నిలిచిపోయెనఁట! ఈ చిన్నది మాత్రము వెనుకడుగు పెట్టక యొక్కతెయు బైలుదేఱి చేతిపెట్టెలలోని బంగారము సహిత మమ్ముకొని కొంతదూరము బండిచేసికొనియు కొంతదూరము నడిచియు నెంతో కష్టపడి ముందు సుఖపడఁగల నన్న యాశాపాశ మీడ్చుకొనిరాఁగా నిరంతరప్రయాణములు చేసి తుదకెట్లో శరీరమును రాజమహేంద్రవరమునకుఁ జేరిచి మాయింటఁబడి లబ్ధమనోరథ యయ్యెను. చిఱుతప్రాయముగల యొక యనాథ కాంత యొంటిగా బైలుదేఱి మండలములు దాఁటి చేత సొమ్ములేక నూఱులకొలఁది మైళ్లు ప్రయాణము చేయఁగలుగుట శ్లాఘాపాత్రము కాదా! ఈమెను సోమనాథరావుగారు 1893–వ సంవత్సరము జూను నెల 28–వ తేదీని పరిణయ మయిరి.

నేను 1897-వ సంవత్సరము డిసెంబరు నెలలో చెన్నపట్టణము చేరి పరశువాకములోని స్వగృహమునందు ప్రవేశించి యందే చింతామణీ ముద్రాయంత్రమును స్థాపించి నాపుస్తక ముద్రణమున కారంభించి పనిచేయఁ జొచ్చితిని. నా పుస్తకములపని ముగియునప్పటికి రెండు సంవత్సరము లయినది. నా పుస్తకము లన్నియు పది పెద్ద సంపుటములలో ముద్రింపఁబడినవి. అచ్చుతప్పులు దిద్దుచుండెడు బండ పనిని నేనే స్వయముగా చేయవలసినవాఁడనగుటచేత దుర్బల మయిన నాశరీరము మఱింత దుర్బలపడినందున సంవత్సరకాలము నడపిన తరువాత చింతామణిపత్రికను నడపలేక నిలుపు చేయవలసినవాఁడ నైతిని. సంఘసంస్కారణ సమాజమునకును, దక్షిణహిందూస్థానబ్రహ్మ సమాజమునకును, నే నధ్యక్షుఁడనుగాఁ జేయఁబడితిని. చెన్నపురి పాఠశాలాపుస్తక దేశభాషా సంఘమువారు తమ కార్యనిర్వాహక సభ్యులలో నన్నొకనిగాఁ జేసికొనిరి; దొరతనమువారు తమ పఠనీయ గ్రంథసభలో నన్నొక సభ్యునిగాఁ జేసిరి; సర్వకళాశాలవారు తమ ద్రవిడభాషాధ్యయనసభలో నన్ను సభ్యుని గావించిరి; కట్టకడపట ప్రభుత్వమువా రుపకారగ్రాహులు మొదలైనవారిని జేయు తెలుఁగుపరీక్షలలో నన్నొకపరీక్షకునిగా నియమించిరి.

సంఘసంస్కారణ సమాజకార్యములందును, బ్రహ్మసమాజధర్మవ్యాపనమునందును, నాకు విశేషాభిమానము. ఈవిషయములో సహితము కార్యశూరత నాకు ప్రియము; క్రియాశూన్యమైన కేవల వాక్శూరత నాకు అప్రియము. నేను చెన్నపురి పోవునప్పటికి వార్తాపత్రికలలో సంఘసంస్కారణసమాజమువారిచే నేర్పాటుచేయఁబడిన సంస్కారభోజనములు శ్లాఘింపఁబడుచు వచ్చినవి. జయప్రదముగా జరుగుచున్న వని శ్లాఘింపఁబడుచు వచ్చిన సంస్కారభోజనముల కాహూతుఁడ నయి యొకసారి నేను పోయితిని. భోజనమునకు పోవఁదలఁచినవా రియ్యవ

లసిన యర్ధరూప్యమును నేను ముందుగానే చెల్లించితిని; రాకపోకలకు నాకు బండికూలి యెనిమిదణాలయినది. ఈభోజనములు పురమందిరములోని యొకగదిలో నేర్పాటు చేయఁబడినవి. దాక్షిణాత్యబ్రాహ్మణుఁ డొకఁడు వంటచేసి యొకగదిలో వడ్డన చేయఁగా నేడెనమండ్రు కలిసి భోజనములు చేసిరి; అట్లు భోజనములు చేసినవారిలో నిద్దఱు బ్రాహ్మణేతరులు సహితముండిరి. చేతిరూపాయి వదలినను దాక్షిణాత్యభోజనము నాకు సరిపడనందున నింటి కాఁకలితోవచ్చి మరల భోజనము చేయవలసినవాఁడ నైతిని. భోజనమయిన తరువాత సావకాశముగా కూరుచుండి సంస్కారభోజనముయొక్క శ్లాఘ్యతను గూర్చి యాలోచింపఁగా దాని యాధిక్యముగాని యందలి విశేషముగాని నాకు బోధపడినదికాదు. ఇంకొకసారి యడిగి తెలిసికోవలెనని తలఁచియుండఁగా మరల సంస్కారభోజనదినము వచ్చినది. ఆ సారియు వెనుకటివలెనే నేను భోజనమునకుఁబోయితిని గాని వెనుకటి భోజనమును బట్టి యెక్కువ తెలివిగలవాఁడ నయి యీసారి యింట భోజనముచేసి మఱి పోయితిని. తక్కినవారు భోజనమున కారంభించి యాఁకలి తీర్చుకొనుచుండఁగా కడుపు నిండియుండినవాఁడ నగుటచేత మాటల కారంభించి నేను నాసంశయములఁ దీర్చుకొంటిని. ఈ సంస్కారభోజనములో విశేష మేమి యని మొదట నడిగితిని. ఇందు బ్రాహ్మణులును బ్రాహ్మణేతరులును గలిసి సహపంక్తిని భోజనము చేయుటయని యుత్తరము చెప్పిరి. ఈవచ్చినవారిపేరులను భోజనము చేసినవారిపేరులను వృత్తాంత పత్రికలలో ప్రచురింతురా యని మరల నడిగితిని. పేరులు ప్రకటింపఁబడినయెడల నీ భోజనములే యుండవని యొకరు బదులుపలికిరి. మాయవేషములయందు స్వభావద్వేషముగల నేను విని యూరకుండజాలక పేరులితరులకు తెలియుట కిష్టములేని కార్యశూరులు మహాశూరులవలె నేటిసంస్కారభోజనము బహుజయప్రద

ముగా జరిగినదని వార్తాపత్రికలలో ప్రకటించి దూరపువారిని ప్రతారించుట యేమి పౌరుషమని తూలనాడితిని. అటుతరువాత సంస్కారభోజనములు జరుగుచు వచ్చినవో లేవో నాకు తెలియదు. కాని నన్నెప్పుడును మరల సంస్కారభోజనములకు పిలువనులేదు; సంస్కారభోజనప్రశంసను జేసిన ప్రకటనలను వార్తాపత్రికలలో నే నెప్పుడును చదువనులేదు.

నేను చెన్నపురిచేరిన శీఘ్రకాలములోనే సంఘసంస్కరణ సభాసమావేశ మయినప్పుడు క్రియలేని పయిపయి వేషములతో ప్రయోజనము లేదనియు, స్థిరముగానుండెడు పనిని దేనినైనను చేయవలయుననియు, సభలోఁ జెప్పితిని. సభవారు నామాటల కానుమోదించి వితంతు శరణాలయము నొకదానిని స్థాపింతమని మహోత్సాహములో నిశ్చయించిరి; దాని కిల్లు కావలసియున్నందున, ఇల్లుకొనుటకై కావలసిన ధనమును తాను పెట్టుబడి పెట్టెదనని ఎస్. కే. రామస్వామయ్యగా రుదారమనస్సుతో సభలో చెప్పిరి. సభవారాయనకు వందనము లాచరించి చందాలు పోగుచేసి చందా ధనములోనుండి యింటికయిన సొమ్మును వ్యయపెట్టవలయు ననియు, ఈలోపల రామస్వామయ్యగారివద్ద నూటికి నెలకు మూడుపావలాల వడ్డికి కావలసినధనము బదులు పుచ్చుకొని యిల్లు కొనవలసినదనియు, నిశ్చయముచేసి తగిన గృహమును విచారించి కొనుటకయి నా కధికారమిచ్చిరి. సమాజమువారు పూనుకొన్నందున తలపెట్టిన పని నిర్విఘ్నముగా నెఱవేఱునని నేనెంతో సంతోషించి, యాదినము మొదలుకొని మా యింటి సమీపమున నెక్కడైన నొక యిల్లు సంపాదించుటకయి ప్రయత్నముచేయ నారంభించితిని. వెల్లాల వీధిలో నేనున్న యిల్లు 23-వ సంఖ్యగలది. ఆవీధిలోనే 20-వ సంఖ్యగల గృహ మమ్మకమునకు రాఁగా రు. 3800-0-0 లకు బేరము నిశ్చయ

పటిచి యింటి స్వత్వపత్రములను గైకొని నాయొద్ద నుంచుకొంటిని. తరువాత నింటివారు కొన్నిదినములకు నావద్దకు వచ్చి వేఱొకరు తమయింటికి నాలుగువేల రూపాయ లిచ్చెదమని వచ్చినా రనియు, తమ పత్రములను తమ కిచ్చివేయవలసిన దనియు కోరిరి. బేరము నిశ్చయమయినందున సొమ్మును మాత్రమే యిత్తునుగాని పత్రముల నియ్యనని నేను నిరాకరించితిని. ఋణము నిమిత్తమై రామస్వామయ్యగారి నడుగఁగా, ఆసొమ్ము ప్రత్యేకముగా తనది కాక యుక్తవయస్కురాని తనతమ్మునివంతుతోఁ జేరియున్నదనియు తగినంతప్రాతిభావ్యము లేక తాను బదు లియ్యఁజాలననియు చెప్పెను. ఇప్పుడు కొనఁబోయెడి యింటిని మాత్రమే కాక యీవీధినేయున్న నాయింటినిగూడ నాధార ముంచెదననియు, వడ్డితోఁగూడ ఋణము తీర్చుటకు నేను పూటపడెద ననియు, చెప్పితిని. నామాట లాయన తలకెక్కక యప్పటికిని నప్పియ్యఁజాల నని తెలియఁబలికెను. వితంతుశరణాలయము నిమిత్తమయి యాయన యప్పిచ్చెదనన్న సొమ్ములో విశేషభాగ మాయన సంఘసంస్కరణ సమాజకార్యదర్శిగారి కింటి తాకట్టుమీఁద బదులియ్యఁగా నాయి ల్లావఱకే యింకొకరికి కుదువ పెట్టఁబడి యుండినందున నష్టమైనదని విన్నాను. ఈలోపల నింటివారు నేను సొమ్మియ్య లేకపోయినందున పదునేను దినములలోపల క్రయధన మియ్యక పోయినయెడల నింటినెలకును నష్టికిని న్యాయసభలో వ్యాజ్యము తెచ్చెదమని న్యాయవాదిచేత నాకు నివేదనపత్రమును బంపిరి. అప్పుడు సంఘసంస్కరణ సమాజమువారి సభ సమకూర్పించి యప్పటి నాస్థితిని సర్వమును వారికి నివేదింపఁగా, గృహస్వామిని వ్యాజ్యమువేసికో నియ్యవలసిన దనియు సంవత్సరములోపల తీర్పు కాదనియు నప్పటిమాట చూచుకోవచ్చుననియు వారు సెలవిచ్చిరి. నిష్కారణముగా సభలకెక్కుట నా కిష్టము లేదు. అందుచేత నేనింటివారి న్యాయవాదితో మాటాడి ప్రస్తుత మేనూఱుదూపా

ఫలిచ్చునట్లును తక్కిన మొత్తము మూడు నెలలలోపల నిచ్చి యిల్లు స్వాధీనము చేసికొనునట్లును సొమ్మాలోపల నియ్యలేకపోయిన పక్షమున నప్పుడిచ్చిన యేనూఱురూపాయలను వదలుకొనునట్లును ఒడంబడిక చేసికొని, సర్వకలాశాలా పరీక్షకుఁడను గా నుండుటచేత నాకు వచ్చిన మూల్యములోనుండి యేనూఱురూపాయలు సంచకరు విచ్చితిని. మూడుమాసములలోపల మూఁడువేలమున్నూఱు రూపా యలను చెల్లింప వలసియున్నందున దానికొఱకు మిత్రుల నడిగియు వ్రాసియు ప్రయత్నముచేయ నారంభించితిని. చెన్నపట్టణములో మన్నవ బుచ్చయ్యపంతులుగా రేనూఱు రూపాయలును డాక్టరు సీ. బీ. రామారావుగారు నన్నూఱు రూపాయలును కాకినాడలో దుగ్గిరాల ప్రకాశరావుగా రేనూఱురూపాయలును రాజమహేంద్ర వరములో న్యాపతి సుబ్బారావు పంతులుగా రేనూఱురూపాయ లును పోలవరము జమీందారు గారు వేయిరూపాయలును నూఁటి కెనిమిదణాల వడ్డికి నాకు బదులిచ్చి నన్నాయాపదనుండి తొలఁగిం చిరి. వీరిలో దుగ్గిరాల ప్రకాశరావుగారు నావద్ద వడ్డిని పుచ్చుకొన లేదు; పోలవరము జమీందారుగా రసలే పుచ్చుకొనలేదు. ఈసాయ ము చేసినందునకయి నేను కృతజ్ఞుఁడ నయి వీరికి వందనముల సమ ర్పించుచున్నాను. తక్కినవారి ఋణములు తీర్చినపిమ్మట పోలవరము జమీందారుగారి యప్పును సావకాశముగాఁ దీర్పఁదలఁచితిని. నేను 1901వ సంవత్సరము మార్చి 12వ తేదిని వారి ఋణవిమోచన ముఖ కయి యేనూఱు రూపాయలను మొదటఁ బంపినప్పుడు వారీ క్రిందియుత్తరమును వ్రాసి సొమ్మును తిరిగి పంపివేసిరి.—

COSMOPOLIT AN CLUB
12—3—01.

Dear and respected Sir'

Your kind letter and the amount of Rs. 500 you sent per bearer are just to hand. Kindly accept this amount as dona·

tion for the widows' Home and oblige. I return it with thanks and hope you will not be displeased with me for so doing. I am sorry I could not find time to see you again. I am going to-night and shall see you again in about two weeks.

With my best regards,
I am, yours very sincerely and faithfully.
K. R. V. KRISHNA RAU."

(మీదయాపూర్వకమయిన లేఖయు మనుష్యునిచేత మీరు పంపిన రు. 500 లును ఇప్పుడే చేతికి చేరినవి. దయచేసి యీమొత్తమును వితంతుశరణాలయమునకు నా దానముగా నంగీకరించి యనుగ్రహింపుఁడు. నేను దానిని వందనపూర్వకముగా తిరిగి పంపివేయుచున్నాను; ఇట్లు చేసినందుకు నా విషయమయి యతుష్టి పొందరని నమ్ముచున్నాను. నేను మిమ్ము తిరిగి చూచుటకు సమయము చేసికోలేనందుకు చింతిల్లుచున్నాను. నే నీ రాత్రిపోవుచున్నాను. సుమారు రెండు వారములలో మిమ్ము మరలఁ జూచెదను. నా యుత్తమప్రేమతో.........కే. ఆర్. వీ. కృష్ణారావు.)

ఈయన నన్ను మరలఁ గలిసికొన్నప్పుడు తక్కిన యేనూఱు రూపాయలను గూడ తనదానముగా స్వీకరించి వితంతు శరణాలయము నిమిత్త ముపయోగపఱుప వలసినదని చెప్పిరి. నేను వందనపూర్వకముగా వారిదానము నంగీకరించి, యాదృచ్ఛికమైన వారి యౌదార్యమునకు సంతోషించితిని. ఈయన పాఠశాలలో నాయొద్ద చదువుకొనునప్పటినుండియు వినయవిధేయతలను నాయెడల నాదరగౌరవములును గలవారయి యుండిరి. చమురు రంగులతో చేయఁబడిన నాచిత్రపటమును వేయిరూపాయల వెలగల దంతగోళక్రీడాఫలకమును (Billiards table) రాజమహేంద్ర పురమందిరమునకు బహుమానము చేసిరి.

వితంతుశరణాలయమును చెన్నపురిలో స్థాపించెదమని సంఘసంస్కరణ సమాజమువారు ప్రకటనపత్రికలను బంపినప్పుడు—

మిస్ (డాక్టరు) మేక్ఫెయిలు దొరసానిగారు రు 50–0–0లును మిస్ మ్యానింగు దొరసానిగారు రు 20–0–0లును, భాస్కరభట్లలక్ష్మమ్మగారు రు 1–0–0యు, కొటికలపూడి సీతమ్మగారు రు 5–0–0లును, రాచర్ల రత్నమ్మగారు రు. 4–0–0 లును, దామరాజు సుందరమ్మగారు రు. 4–0–0 లును. సత్తిరాజు శేషమాణిక్యాంబగారు రు 2–0–0 లును, కందుకూరి రాజ్యలక్ష్మమ్మగారు రు. 5–0–0 లును, ఆదుర్తి రామారావుగారు రు. 25–0–0 లును, యస్. యన్. సుబ్రహ్మణ్య అయ్యరుగారు రు. 3–0–0 లును, శ్రీ రాజా రామచంద్రరాజుగారు రు. 15–0–0 లును, వినాయకదేవరగారు రు. 25–0–0 లును మొత్తముమీఁద రు. 159–0–0 ల నాయొద్దకుఁ బంపిరి. ఈసొమ్మొక్కని వశమున నుండుటకంటె సమాజమువద్ద నుండిన నెక్కువ సురక్షితమని భావించి యీ మొత్తములో నాసొమ్ము కొంతచేర్చి రు 375–0–0లను వితంతుశరణాలయ మూలధనముక్రింద సమాజనిధిలో నుంచుట కిచ్చితిని. ఏఁటేఁట సమాజపు లెక్కలలో పయి మొత్తము కనఁబఱుపఁబడుచు వచ్చెను కాని కార్యదర్శి యుద్యోగాంతరముమీఁదఁ బొంబయికి వెళ్ళునప్పుడు నే నాతని యధీనములో నున్న సమాజపు సొత్తు నప్పగించుకొనఁ బోఁగా పయి మొత్తము కాగితము మీఁదనే కాని పెట్టెలో కనఁబడలేదు. ఆ సొమ్మేమయిన దని నే నాయన నడుగఁగా సమాజముయొక్క యితర కార్యములకు కర్చయిపోయిన దని యాయన సమాధానము చెప్పెను. సమాజము నిజముగా ధనవిషయమున బీదస్థితిలోనే యుండెను. 1900 వ సంవత్సరారంభములో నింటియద్దెక్రింద తొంబది రూపాయలు బాకీ పడియుండెను. అది తీర్చుటకు సమాజమునకు శక్తిలేదు. ఈ ప్రకారముగా వప్పు

లతో సాగనిచ్చినయెడల కొంతకాలమునకు సమాజమే యుండదని నే ననుకొని సమాజము నిమిత్తమయి సొంత యింటి నొక దానిని కట్టించి యియ్యవలెనని యుద్దేశించి పరశువాకము గంగాధరేశ్వరుని కోవెల వీధిలో నొక స్థలము సంపాదించి 1900 వ సంవత్సరములో నొక యిల్లు కట్టించి 1902 వ సంవత్సరములో దానిపైని మేడ వేయించి యిచ్చితిని. దీనికంతకును నాకు రు. 1250-0-0 లు వ్యయ పడినవి. సమాజమును లేఖ్యారూఢము (Register) చేయింపవలసిన దనియు చేయింపఁ గానే నేను దానిని సమాజము పేర వ్రాయించి యిచ్చెద ననియు చెప్పుచువచ్చితిని గాని నేను చెన్న పురిలోనున్న కాలములో వారట్లు చేయలేదు. ఆయిల్లు సమాజము యొక్క యనుభవములోనే యుండినది. ఇట్లుండఁగా రెండుమూడు సంవత్సరములక్రిందట సమాజకార్యదర్శి మాఱుమూల నుండుటచేత సామాజికుల కక్కడకుపోవుట కష్టముగా నున్నదనియు, దానిని రు 650 లకు విక్రయించి దానిని బీజధనముగా నుంచుకొని పట్టణ మధ్యమున సమాజమందిరమును కట్టించెదమనియు, నాకు వ్రాసెను. నే నామందిరమును జనోపయోగరముగా నుండుటకొఱకే కట్టించి తినిగాని యెవ్వరికో తన కాఁపురమునిమిత్త మమ్మివేయుటకు కట్టింప లేదనియు, అది లోకోపయోగకరమైన పనికొఱకే యెప్పుడు నుండ వలయుననియు, నేనుత్తరము వ్రాసితిని. ఆ మందిరముయొక్క క్రింది భాగములో దక్షిణహిందూస్థాన బ్రహ్మసమాజమువారు తమ రాత్రి పాఠశాల నుంచుకొని నెలకు నాలుగు రూపాయ లద్దెయిచ్చుచుండిరి. వారా యిల్లు రు 650 లకు తమకే విక్రయించునట్లు చేయవలసిన దని నాకు వ్రాసిరి. ఆ యింటి నెప్పుడును కాఁపురముకొఱ కమ్మి వేయకుండునట్లును, జనోపయోగకరములైన పనులకే యుపయోగిం చుచుండునట్లును, నేనుచెన్నపట్టణము వెళ్ళినప్పుడు నన్నక్కడనుండ

నిచ్చునట్లును, వారొప్పుకొన్నమీఁదట సంస్కరణ సమాజమువారి చేత బ్రహ్మసమాజమున కాయింటిని రు 650-0-0 లకు అమ్మించి సొమ్మిప్పించితిని. ఈక్రయధనమును మహారాజా గజపతిరావుగారి ధర్మపత్ని బ్రహ్మసమాజమువారి కిచ్చెను. సంఘసంస్కరణ సమాజమువారు నాకప్పటి కియ్యవలసియుండిన యిన్నూఱురూపాయలును నేను క్రయధనములోనుండి తీసికొని వంటయింటిని మఱుఁగుదొడ్డిని నీటిగొట్టమును సమకూర్చుట కయి బ్రహ్మసమాజమువారి కిచ్చివేసితిని. ఆయిల్లు తమకిప్పించినయెడల వేయి రూపాయలును అంతకంటె నెక్కువయు నిచ్చెదమని కొందఱు గృహస్థులు నాయొద్దకు వచ్చిరి కాని కాపురములుండుటకయి నే నిప్పింపనని వారితోఁ జెప్పి పంపివేసితిని.

నేను వితంతు శరణాలయమును చెన్నపట్టణములో స్థాపించి మాయింటనే జరపుచుంటిని. ఇద్దఱో ముగ్గురో నలుగురో వితంతువు లెప్పుడును మాయింట నుండుచునే వచ్చిరి. నేను వారిని విద్యానిమిత్త ముపాధ్యాయినుల బోధనాభ్యసన పాఠశాలకుఁ బంపి జీతములిచ్చి చదువు చెప్పించుచు, వారి కన్న వస్త్రాదులను పుస్తకములను ఇచ్చుచు, వ్యాధిసమయములయందు వైద్యముచేయించుచు, వితంతు శరణాలయమును నడుపుచు వచ్చితిని. ఈశరణాలయమును రాజధానియైన ద్రావిడదేశమునం దుంచినను, అందు చేరినవారిలో నిద్దఱు తప్ప తక్కినవారందఱును తెలుఁగుదేశమునుండి వచ్చినవారేయయి యుండిరి ఆయిద్దఱిలో నొక్కతెమాత్రమే యఱవబాల వితంతువు; రెండవ యామె తిరునల్వెల్లినుండి తండ్రిచేత తీసికొని రాఁబడిన తెలుఁగు బాలవితంతువు. ఈ కడపటి చిన్నదానిని సోమనాథరావుగారి తమ్ముఁడైన గోపాలశర్మగారికిచ్చి వివాహము చేసితిని. మొదటి చిన్నది మిక్కిలి తెలివిగలదయి పాఠశాలలో బహుమతు

లను బహుసంవత్సరకాల ముండినమీఁదట తండ్రి వచ్చి వేసవి కాలపు సెలవులలో తనయొద్దనుంచుకొని మరలఁ బంపెదనని నాతో నమ్మఁబలికి రానని యేడ్చుచుండఁగా పిల్లదానిని బలవంతముగా తీసికొనిపోయి బంధువులబాధచేత మరలఁ బంపకపోయెను. నే నక్కడ నున్న కాలములో మాయింట పది వితంతువివాహములు జరిగినవి. ఈ పదింటిలో మూడవదియు నేను చేసినదానిలో ముప్పదవదియు నైన యొక్క వివాహమును గూర్చి మాత్ర మిందు ముఖ్యముగా ముచ్చటింపవలసి యున్నది.

గోదావరి మండలములో నుపదండవిధాయియు నాతోడ సహాధ్యాయియు నయి యుండిన కసపత్తిసంజీవరాయఁడుగారి కోడ లును, కొంతకాలము సహాయకరగ్రాహిగా నుండిన కొమ్మూరి వేంకటాచలము పంతులుగారి కొమారితయునైన శ్రీమహాలక్ష్మమ్మ యను నామె కాకినాడనుండివచ్చి రెండు సంవత్సరములు చెన్నపట్టణములో నాయొద్ద నుండెను. ఆమె కొంతరూపవతియు విద్యావతియు ధీమతియు నయి యుండెను. ఆమె పూర్వచరిత్రమును గూర్చి కొన్ని ప్రవాదము లుండెనుగాని నాయొద్దనున్నప్పుడు సత్ప్రవర్తనము కలది గానే యుండెను. నా యొద్దకు వచ్చినవారిని సాధారణముగా నేను చెడునడత కవకాశము కలుగకుండునట్లు నిర్బంధములోనే యుంచు చుందును. ఆమె కప్పటికిరువదిసంవత్సరములు దాటియుండవచ్చును. ఆమె తాను పట్టపరీక్షయందు కృతార్థుఁ డయియున్న వానినిగాని వివాహము చేసికోనని నియమము చేసికొనెను. ఆ నియమమున కను కూలముగా పట్టపరీక్షాసిద్ధుఁడయిన విధురుఁ డొక్కఁ డామెను కామించి పరిణయముచేసికొనుట కంగీకరించెను; ఆమెయు నాతనిని కామించి వివాహమాడుట కొప్పుకొనెను. నేనును సమ్మతించి రెండు మూఁడు సార్లులు మాయింట నాయెదుట నుభయులను మాటాడుకో

నిచ్చితిని. ఇట్లించుమించుగా కార్య నిశ్చయ మయిన తరువాత నాకు కొన్ని క్రొత్తసంగతులు తెలియవచ్చినవి. అవి విన్నపిమ్మట నే నాదాంపత్యము సుఖప్రదము కానేరదని భావించి యా సంబంధమును మాన్పింపఁ జూచితిని గాని యెంతో కష్టముమీఁదఁ గాని నా కది సాధ్యమైనదికాదు. ఈలోపల రెండుమూఁడుత్తర ప్రత్యుత్తరములు నడచిన మీఁదట వరుఁడే యావఱకు జరగిన వాగ్దానము జరప వక్కఱలేదని నాకు వ్రాసెను. ఇట్లు కార్యభంగ మయిన తరువాత శీఘ్రకాలములోనే నాకు పరమ మిత్రులయి యుండిన న్యాపతి సుబ్బారావు పంతులుగారి తమ్ముఁడు నలువదేండ్లు దాఁటినవాఁడు పట్టపరీక్షా సిద్ధుఁడు గొప్ప రాజకీయోద్యోగి యయి యున్నవాఁడు విధురుఁడైన శేషగిరిరావు పంతులుగారు నావద్దకు వచ్చి తనకు వితంతువును వివాహ మాడవలెనని యిచ్ఛ గలదనియు నాయొద్దనున్న వారిలో తగినవారిని తెలుపవలె ననియు నన్ను కోరిరి. అప్పు డిద్దఱే నాయొద్దనుండిరి. ఆయిద్దఱిని గూర్చియు నాకు తెలిసినది చెప్పితిని. ఆయిరువురిలో నీమె నాతఁడు వరించెను. ఆయనకడ నే నేమియు మఱుఁగు వెట్టక నేను విన్నప్రవాదములను చెడిపోయిన వివాహ వృత్తాంతమును సవిస్తరముగాఁ దెలిపి నాయొద్దనున్న యుత్తరముల నాతని కిచ్చితిని. వధూవరు లొకరి నొకరు చూచుకొని యొండొరులతో మాటాడుకొని పరస్పరానురాగము గలవారయి వివాహమున కొప్పుకొనిరి. నేనును కార్యనిశ్చయము చేసితినిగాని వివాహమునకు ముందీకార్య విషయము సుబ్బారావు పంతులుగారికి తప్పక తెలుప వలెనని చెప్పితిని. తెలుపఁగానే యాయన తప్పక యొప్పుకొందు రని నానమ్మకము. ఆయనదీనికి ప్రతికూలురుగా నుందురని నే నెప్పుడును తలపఁలేదు. శేషగిరిరావు పంతులుగారు తా నొకసారి వితంతువివాహమునుగూర్చి సూచనగా నన్నగారితో ప్రస్తావింపఁగా, అందులో

కష్టము లున్నవని చెప్పుటయె కాక అట్టి వివాహము కర్త వ్యము కాదని నిరుత్సాహపఱచె ననియు, వివాహమునకుఁ బూర్వ మాయనకుఁ దెలియనిచ్చుట యుక్తము కాదనియు, నాతోఁ జెప్పిరి. నేనా యాలోచన కంగీకరింపక పంతులుగారికి తెలియకుండ వివా హము జరగ నేర దనియు, తెలియఁజేసినచో నీ వివాహమున కా యన తప్పక సమ్మతించు ననియు, ఒక వేళ సమ్మతింపక పోయినను నేను వివాహమును జరిపెదననియు, ఈ వివాహనిశ్చయమునుగూర్చి నే నాయనకు వ్రాసెదననియు, శేషగిరిరావుగారితో చెప్పితిని. ఆయన కొంచెమునే పాలోచించి మీరు తెలుపుటకంటె నేనే తెలు పుట సముచితముగా నుండుననియు, తాను రాజమహేంద్రవరము పోయి యన్నగారితోఁ జెప్పి తాను త్తరము వ్రాసెదననియు, చెప్పి న న్నుత్తరము వ్రాయవలదని వేఁడెను. నే నందునకు సమ్మతించి వ్రాయక యూరకుంటిని. ఈయాక్షేపణమే లేకయుండిన పక్షమున వివాహము బహుదినములక్రిందటనే చెన్నపట్టణములో జరిగియుం డును. ఇంతలో శేషగిరిరావుగారికి సెలవుదినము లయిపోవచ్చినవి; ఆయన బొబ్బిలికి పోయి పనిలోచేరవలెను. అందుచేత శేషగిరిరావు పంతులుగారు నావద్ద సెలవు పుచ్చుకొని, రాజమహేంద్రవరము నుండి యన్నగారితో మాటాడి యుత్తరము వ్రాసెదననియు, ఉత్తర మందగానే వధువును వెంటఁబెట్టుకొని వచ్చి వివాహము చేయించి పోవలసినదనియు, చెప్పి పోయెను. చెప్పినట్టు రాజమహేంద్రవరము నుండి యుత్తరము వ్రాయలేదుగాని, వధువును దీసికొనిరావలసినదని యాయన బొబ్బిలినుండి తంత్రీవార్తను బంపెను. ఆ తంతిసమా చార మందఁగానే తమ్ముఁ డన్నగారితో చెప్పి యనుమతి పొందె నని యూహించి, వధువును వెంటఁగొని భార్యాసహితముగా బైలు దేఱి యదెూమార్గమున రాజమహేంద్రవరముమీఁదుగా పోయి

విజయనగరమును జేరితిని. శేషగిరిరావుగారి భటులు నన్ను విజయ నగరములో కలిసికొని, బండ్లమీఁద గజపతినగరమునకుఁ గొని పోయిరి. శేషగిరిరావుగా రావలకే యచ్చటకు వచ్చియుండి వివాహ మునకుఁ గావలసిన సన్నాహముల నన్నిటిఁ జేసియుంచిరి. నే నా యనను చూడఁగానే మొదట వేసిన ప్రశ్న "మీయన్నగారు చెప్పఁ గానే సమ్మతించిరా?" అని. తా నాయనలో చెప్పలే దనియు, వివా హానంతరమున వ్రాయ వచ్చుననియు, చెప్పినప్పుడు నా మనసునకు కలిగిన విచార మింతంత యని చెప్ప నలవి కాదు. అంతదూరము వచ్చిన తరువాత వివాహము జరపకుండ పోవుట యుచితము కాదని తలఁచి 1900-వ సంవత్సరము ఫిబ్రవరి నెల 26 వ తే దీని కార్యమును జరపి వధువును మగనివద్ద విడిచి నేనును నా భార్యయు రాజమహేంద్రవరమునకు వచ్చితిమి. వచ్చిన దినముననే మార్గాయాసము కొంచెము తీఱినతరువాత సాయంకాలమున పుర మందిరమునకుఁ బోయితిని. అక్కడ సుబ్బారావు పంతులుగారు మొదలైన మిత్రులనేకు లుండిరి. సుబ్బారావు పంతులుగారితో మాటాడి నేను విజయనగరము వఱకును బోవుటయు, గతదినముననే గజపతి నగరములో నాయన తమ్ముని వివాహమును జరపి చెన్న పట్టణము పోవుటకయి తిరిగి వచ్చుచుండుటయు చెప్పి తమ్మునివివాహ వార్తను నేనే ఆయనకు మొట్టమొదట నివేదించితిని. నే నా వార్త తెలిపినప్పు డాయన మొగమునందు కొంచెము వైవర్ణ్యము కనఁబడెను గాని కోపచిహ్నము లేవియుఁ గానరాలేదు. ఆయన యిఁక నచ్చట నుండక బండియెక్కి వెంటనే యింటికిఁ బోయిరి. నేను పురమందిరమునందు మఱి కొంతసే పుండి మిత్రులవద్ద సెలవుపుచ్చుకొని యింటికి బోయితిని. మఱునాఁడు మిత్ర సందర్శనార్థముయి నేను సుబ్బారావు పంతులుగారి యింటికి

పోయినప్పుడు మాయిరువురకును జరిగినసంభాషణము మిత్రసమావేశ సమయమున జరగఁదగినదిగా నుండలేదు. ఆయన నన్నేమియు పరుషభాషణము లాడకపోవుటయేకాక దూషణము చేయఁదొడఁగిన తల్లిని వారించినను నావిషయమై కోపమును ననాదరమును జూపిరి. నేనచ్చట నిలువక వెంటనే సెలవు పుచ్చుకొని బైలుదేఱి యాయన యప్పటి కోపోద్రేకమును దలఁచుకొని, యాయనకు వివాహమునకు ముందు చెప్పకపోవుటయే మంచిదయ్యె ననియు, చెప్పి యుండిన మొదల తల్లియు నన్నగారును ముందు నిలిచి శోకించుచు కోపించుచు వలదని వారించుచున్నప్పుడు వారిని నిరాకరించి కార్యముచేసికొని నంతటి ధైర్యము శేషగిరిరావు పంతులుగారి కుండియుండ దనియు, త్రోవపొడుగునను నాలో నేననుకొనుచు మా యింటికి నడచితిని. మొదటి నుండియు వితంతు వివాహకార్యములయం దంత యభిమానము కలవారయి కార్య నిర్వాహణ విషయమున నాకెన్నియో విధముల సహాయపడుచుండిన సుబ్బారావు పంతులుగారికి తమ్ముఁడు వితంతువును వివాహము చేసికొన్నంత మాత్రముచేత నంత యాగ్రహ మేలకలుగవలెనో నే నప్పు డూహింపలేక యల్పకాలములోనే యాకస్మికముగా నుదయించిన యా కోపాగ్ని చల్లారిన తరువాత మా యిరువురి మైత్రియు యథాపూర్వముగానె యుండునని నేననుకొంటినిగాని నేననుకొన్నట్లు గాక యీ పని జరుగుటకు బహు సంవత్సరములు పట్టినది. మిత్రులుగా నుండి తనవలన నుపకారము పొందిన వారె యమిత్రులయి తన కపకారము చేసినారని మనస్సునకు దృఢముగా తోఁచినప్పు డాకస్మికముగాఁగలిగిన యాగ్రహావ్యగ్రతవలన తొంటి స్నేహవిశేషము ద్వేషముగా పరిణమించి యొకకొననుండి యింకొకకొనకుఁ బోవుట యనివార్యమైన మానుషస్వభావమే కదా! నేను మాత్రము మనస్సులో నిది యంతగా పెట్టు

కొనక మిత్రులందఱికంటెను పరమమిత్రుఁ డయిన యీశ్వరుని యాజ్ఞను నిర్వహించినప్పు డేమి జరిగినను జరగ నిమ్మని యుదాసీనుఁడనయి యూరకుంటిని. ఇట్లాకస్మికముగా నాపయిని కలిగిన కోపము కొంతకాల మాయనను నన్ను ద్వేషించునట్లు మాత్రమే కాక నేను పూనిన సంఘసంస్కరణకార్యమును గూడ కొంత ద్వేషించునట్లు పురికొల్పినది. ఎంతగొప్పవారి దైనను మనుష్య ప్రయత్నము చేత భగవత్సమ్మత మయిన సత్కార్యము నశింప దని నాకు దృఢవిశ్వాసము. నాకును నా సంస్కరణ కార్యమునకును చెఱుపు చేయుట కయి పంతులవా రుద్దేశించినట్టు వాడును వీడును నాతోఁ జెప్పసాగిరి. ఇటువంటి విషయములలో కొంత సత్య ముండవచ్చును గాని మధ్యవారి కల్పనలు విశేషముగా నుండును. సంస్కార కార్యమును వారే గాక మఱెవ్వఁడును నశింపఁ జేయఁజాలఁడని నా నమ్మకము; ఇఁక నావిషయమునన్ నేను బాకీయున్న యప్పునిమిత్తమయి నామీఁద వ్యాజ్యమువేసి నాకు తొందర కలుగఁజేయుటకంటె నధిక మేమియుఁ జేయఁజాలరని నేననుకొంటిని. వారట్టి పనినైనను వేగిరపడి చేయరని వారి స్వభావమునుబట్టి నే నెఱిఁగినవాడ నైనను, ముందుగానే మెలఁకువపడుట యెందుకైనను మంచిదని యెంచి నాపుస్తకముల సంపుటముల పని పూర్తియయినందున పెద్ద ముద్రాయంత్రముతో పని లేకపోవుటను బట్టి చేతి యంత్రము నొక దానిని గొని దాని నమ్మివేసి యా సొమ్ముతో రాజమహేంద్రవరమునకు వచ్చితిని. రాఁగానే సుబ్బారావు పంతులుగారి కియ్యవలసిన యసలు మొత్తము రు. 1500 లను, అప్పటి కయిన వడ్డీ యించుమించుగా నిన్నూఱురూపాయలను, కలపర్తి శ్రీరాములుగారిచేతి కిచ్చి పంతులవారికిఁ బంపితిని. ఆ వఱ కెప్పుడును నా వద్ద వడ్డీని పుచ్చుకొనకుండుటనుబట్టి వడ్డీని పుచ్చుకొనుటకు మొదట సంశయించి తుదకుఁ

గైకొని వారామొత్తములోనుండి నా సంపుటముల క్రయము క్రింద నిరువది రూపాయలను చెల్లుపెట్టి నా పత్రములను నాకు బంపిరి.

కాల మెప్పుడును నేకరీతిగా నుండదు. కాలమహిమచేత బాహ్య పదార్థములలోని మార్పులమాట యటుండఁగా నంతరంగములు సహిత మత్యంత కఠినము లయినవి క్రమక్రమముగా మృదువులగును; దీర్ఘవైరములును ప్రణయములుగా మాఱును. సుబ్బారావు పంతులుగారును నేనునుగొంతకాలము పరస్పర సంభాషణము లేనివారమయియుండినను చెన్నపురిలో సర్వకళాశాలాసభ్యుల సభ జరుగుచున్నప్పుడు పంతులుగారే నేను కూరుచున్నచోటికి వచ్చి నన్ను పలుకరించి యాదర పూర్వకముగా నా యోగక్షేమములను విచారించిరి; నేనును సంతోషపూర్వకముగా వారి యారోగ్య సౌఖ్యములడిగి తెలిసికొంటిని. అటుతరువాత మా యిరువురమైత్రియు క్రమక్రమముగా వృద్ధినొంది మరల పూర్వరీతికి వచ్చెను. రాజమహేంద్రవరము వచ్చినతరువాత కూడ వారు రెండు మూడు పర్యాయములు మాయింటికి వచ్చి నన్ను చూచిరి. వారి హిందూ సమాజము యొక్క యొక సభాదినమునందు నన్నాహ్వానముచేసి వీధిలోని కెదురుగావచ్చి లోపలికిఁ దీసికొనిపోయి యీ దినమున మన సభ కొక ప్రసిద్ధపురుషులు వచ్చినారని సభవారితోఁబలికి గౌరవముచేసి నన్ను పీఠుకొల్పిరి. ఈ హిందూసభ యెప్పు డేలవచ్చిన దని తెలియనివారడుగవచ్చును. పంతులువారికి నామీఁద కోపమువచ్చిన కాలములో నప్పటి సంఘసంస్కరణ సమాజమునకుఁ బ్రతిపక్షముగా హిందూ సమాజమును స్థాపించి, హైందవాభివృద్ధి (Indian Progress) యను నామమున నొక పత్రికను బ్రారంభించిరి. సంఘసంస్కార కార్యముల యందు చిరకాలము పనిచేసినవారి కొక్కపట్టున సంఘసంస్కార కార్యములకు సంపూర్ణవిరోధముగా పనిచేయుట

సంభవింపదు గదా! ఈ హిందూసభోద్దేశము దేశీయపద్ధతుల మీఁదనే సంస్కారము మెల్ల మెల్లఁగా జరపవలెను ననుట. తల్లి దండ్రులను తిరస్కరించి లేచివచ్చిన వితంతు యువతులకు వివాహములుచేయక జననీజనక లంగీకరించిన వారికే వివాహములు చేయవలె ననుట యీసభవారిలో కొందఱి యభిప్రాయము; వితంతు వివాహము లసలే మాని వేయవలెనని మఱికొందఱి యభిప్రాయము; బాల్యవివాహములు లేనిచో బాలవిధవ లుండుటయే తటస్థింపదు గాన వితంతు వివాహప్రయత్నమును విడిచి రజస్వలానంతర వివాహములను ప్రోత్సాహపఱుప వలయుననుట యందఱి యభిప్రాయము. ఈసభ రాజమహేంద్రవరమునుండి రాజధానియైన చెన్నపట్టణము వరకును వ్రాకి చెన్నపురీపౌరమందిరములో అనీబెసెంటు దొరసాని గారి యధ్యక్షతక్రింద చేయఁబడిన మహాసభలో మహాఘోషము చేసి యాయాసముచే నక్కడ విశ్రాంతిగొందెను. ఆసభాకార్యదర్శివితంతు వివాహములతో పనియే లేకపోవును గావున రజస్వలా వివాహములను ప్రచారమునకు దెచ్చుట విద్యాధికులకెల్లరకును ప్రథమకర్తవ్యమని ప్రసంగముచేయుచు నెనిమిదేండ్లు దాఁటని తన కొమారితకు ప్రౌఢా వివాహము చేయఁగానే జనుల కా సభవారి శుద్ధమనస్కత యందే సందేహము కలిగెను!

ఇప్పుడు పిఠాపుర సంస్థానమునందు రెండవ దివానుగానున్న కోశా వేంకటసుబ్బారావు నాయఁడుగారి వివాహము చెన్నపట్టణములో జరగిన వానిలో నాలవది. 1901 వ సంవత్సరము జనవరి నెల 8 వ తేదీని జరగిన యీ ముప్పదిమూఁడవ వివాహమే నాయఁడు శాఖవారిలో మొదటిది. ఈవివాహము వలననే చెన్నపురి సంఘసంస్కార సమాజములోని స్వశాఖవారి కొందఱి ధైర్యస్థైర్యములు వెల్లడియగుట తటస్థించినది. వివాహములో భోజనము చేసినందుకు

కులమువారు సభచేసి బహిష్కరించెదమని బెదరించినప్పుడు నిజము చెప్పుటకు ధైర్యముచాలని మగతన మేమి మగతనము?

చెన్నపట్టణములో నే నుండుట బ్రహ్మ సమాజమునకు బొత్తిగా లాభకరముగా నుండకపోలేదు. విశాఖపట్టణములోని శ్రీ మహారాజా గొడే గజపతిరాయనింగారు దక్షిణహిందూస్థాన బ్రహ్మ సమాజమునకు రామమోహనరాయల రాత్రిపాఠశాల మొదలయిన వాని వ్యయముల నిమిత్తము సంవత్సరమున కేనూఱు రూపాయల నిచ్చుచుండెడివారు. అది యేహేతువుచేతనో కాని కొన్ని సంవత్సరములనుండి నిలిపివేసిరి. సమాజమువా రెన్నివిన్నపములు పంపుకొన్నను కార్యము లేకపోయెను. వేంకటరత్నము నాయఁడుగారు మొదలయినవారిని ప్రతినిధులనుగా నేర్పఱచి నియోగి గణమును విశాఖపట్టణమునకు పంపినను ఫలము కలుగలేదు. నేను చెన్నపట్టణము నివాసముగా చేసికొని బ్రహ్మసమాజమున కధ్యక్షుఁడ నయిన తరువాత సమాజమువారు నన్నీవిషయమై శ్రీమహారాజా గొడే గజపతిరాయనింగారికి వ్రాయుఁడని ప్రార్థించిరి. నేను వ్రాసిన పిమ్మట మహారాజాగా రాసంవత్సర మేనూఱురూపాయలు నాయొద్దకుఁబంపి తరువాత నేఁటేఁట నేనూఱేసిరూపాయలు నాయొద్దకే పంపుచుండిరి. ఇది యాయన యనంతరమునఁగూడ నవిచ్ఛిన్నముగా జరుగుటకయి తగిన స్థిరమయిన యేర్పాటు చేయవలసినదని నేను కోరినమీఁదట శ్రీమహారాజాగారు తమ మరణశాసనములో నీదానము శాశ్వతముగా జరుగుటకయి యేర్పాటుచేసిరి. శ్రీమహారాజా గజపతిరాయనింగారికి నాయం దత్యంత గౌరవముండెను. నేను రాజమహేంద్రవరములో నున్నప్పుడు క్రొత్తగా విశాఖపట్టణమున కయోమార్గము వేసిన కాలములో నే నొకసారి నవరాత్రములలో కుటుంబసహితముగా విశాఖపట్టణము వెళ్లుట తటస్థించెను. నేనప్పుడు వారి బంగా

శాలలో వారి యతిథిగానుండి వారి సత్కారమును బొందవలసినవాఁడ నైతిని. వారు ప్రతిదినమును మాకు కావలసిన దానికంటె నధికముగా భోజన పదార్థములను బంపుచు, వంటచేయుటకు బ్రాహ్మణుల నియమించి,తమ రెండుగుఱ్ఱముల బండిని నా యధీనములోనుంచి, నాయెడల నెంతో యాదరముచూపిరి. విజయదశమినాఁడునాకును నాభార్యకును బహుమానము చేయుటకయి మిక్కిలి విలువగలబట్టలు మొదలయిన వానిని తెప్పించిరి. నా కవి వలదని యెన్నివిధముల నేను ప్రార్థించినను వారు నామాట విననందున, నే నవి పుచ్చుకొనకుండవలెనని నిశ్చయించుకొని విజయదశమినాఁడు ప్రాతఃకాలమున వారివద్ద సెలవు గైకొనకయే యావిరిబండినెక్కి భార్యాసహితముగా రాజమహేంద్రవరమునకు వచ్చితిని. నేను తమ బహుమానము స్వీకరింపనొల్లక రాజమహేంద్రవరమునకుఁ బోయితినని తమనియోగిజనమువలన విని విచారపడి తమయుద్యోగస్థులచేతి కిన్నూఱు రూపాయలిచ్చి మఱునాటి యావిరిబండిలోనే యిద్దఱిని నాయొద్దకుఁ బంపిరి. వారు నే నాసొమ్మంగీకరింపక పోయినపక్షమున శ్రీ మహారాజాగా రది తమ కవమానముగాఁ జూతురని దానిని స్వీకరించుటకు బలవంతపెట్టగా, సాధనాంతరము లేక యిన్నూఱు రూపాయలను పుచ్చుకొని, ఆ సొమ్ము నాసొంతమున కంగీకరింపననియు ధర్మకార్యము నిమిత్తమైన పక్షమున నంగీకరించెద ననియు వారిపేర వ్రాసి వారిసమ్మతిని బడసి పురమందిర నిర్మాణమునకయి చేర్పఁబడిన చందాధనములో దీనిని జేర్చి పుస్తకభాండాగార స్థాపనార్థమయి పురమందిరములోనున్న ప్రహర్షపఠనమందిరము (జూబిలీ రీడింగురూము) వారి కిచ్చివేసితిని.

నేను జీతము ముట్టని పద్ధతిమీఁద రెండు సంవత్సరములు సెలవుపుచ్చుకొని రెండుద్దేశములతో చెన్నపట్టణమునకు వెళ్లినట్లుచెప్పి యుంటినిగదా! అందు మొదటి యుద్దేశమయిన పుస్తక ముద్రణము

రెండు సంవత్సరములలో తీఱిపోయినది. ఈ పుస్తకము లన్నియు పది సంపుటములుగా ముద్రింపఁబడినవి. ఇఁక రెండవదియైన సంస్కారకార్యము నా దేహములో ప్రాణమున్నంతవఱకు నుండునదియే కాని రెండు మూడు నాలుగు సంవత్సరములలో ముగియునది కాదు. రెండేండ్లు సెలవుకాల మయిన తరువాత పనిని మానుకొని వచ్చినంత యుపకారవేతనము నొంది చెన్నపట్టణములోనే నిలిచిపోయి జీవితాంతమువఱకును సంఘ సంస్కార విషయములలో పనిచేయుచుండవలెనని సంకల్పించుకొంటిని గాని యది తుదముట్టక కొన్ని సంవత్సరములలో దానికి వికల్పము సంభవించెను. అప్పటి విద్యావిచారణాకారి యైన డంకను దొరగారు నాయం దధికాదరముగల వారయి, సర్వకళాశాలా సభాసమయములయందు తప్పక నావద్దకు వచ్చి నాక్షేమమును విచారించు చుండిరి. ఇట్లు కలిసికొన్నప్పు డొకసారి యాయన నీ కిక్కడ పనిలోనుండ నిష్టమున్నదాయని యడిగెను. పని యున్నను లేకపోయినను నేను మరల రాజమహేంద్రవరముపోవక యిక్కడనే నిలిచి పనిచేయఁ దలఁచుకొన్నానని బదులు చెప్పితిని. ఆవిషయ మంతటితో నిలిచిపోయినది. విద్యావిచారణాధికారిగారి స్వీయసహాయక పదమునం దుండిన శేషాద్రి ఆచారిగారును నను బోటులు మఱి కొందఱును జేరి ద్రావిడభాషలయభివృద్ధికయి చెన్నపట్టణములో నొక సమాజము నేర్పఱచితిమి. ఆసంబంధమున నాయనయు నేనును తఱచుగా కలిసికొనుచుండెడి వారము. ఆయన నివాసగృహము పరశువాకములో మాయింటికి చేరువనే యున్నందున, ఆయన సాయంకాల మప్పుడప్పుడు మాయింటికి వచ్చి నన్ను తన బండిలో విహారమునకు తీసికొనిపోయి మరల మాయింటివద్ద విడిచి పోవుచుండెడివాఁడు. ఇట్లు విహారార్థము వెడలినదినములలో నొకనాఁడాయన నవ్వుచు మీకిక్కడనే పనియైన దని పలికెను. దానిపైని

నన్నేల పరిహసించెదరని నే నంటిని. "పరిహాసముకాదు నిజముగానే నియోగాజ్ఞాపత్రము వచ్చినతరువాత నైన మీరు నామాట నమ్మెదరా? అని యాయన మరలఁ బలికెను. అప్పటికి నే నాయన మాటలు నమ్మక, దొరతనమువారి పండితపద మొక్క రాజధానీ పాఠశాలలోఁ దక్క వేఱొకచోట లేకుండుటను బట్టియు చెన్నపురిలో నాపదమునందు కొక్కొండ వేంకటరత్నము పంతులుగా రుండి యుండుటను బట్టియు పండితుల నొకచోటనుండి యొకచోటికి మార్చుట యాచారము లేకుండుటను బట్టియు నే నాయన తప్పక పరిహాసార్థమేపలికెనని నమ్మి యా విషయమయి మఱిమాటాడక యూరకుంటిని. ఇట్లుండఁగా నొకనాఁ డుత్తరములు తెచ్చుభటుఁడు విద్యావిచారణాధికారి కార్యస్థానమునుండి వచ్చిన యొక యాచ్ఛాదన పత్రమును తెచ్చి నాచేతిలోఁ బెట్టెను. అది విప్పిచూడఁగా నందులో రాజమహేంద్రవరమునుండి నన్ను రాజధానీ కలాశాలకు మార్చినట్లును నాస్థానమున కొక్కొండ వేంకటరత్నముపంతులుగారిని రాజమహేంద్రవరమునకు వేసినట్లును నియోగాజ్ఞాపత్ర ముండెను. ఆ యుత్తరువులోనే యిష్టమున్న యెడల మిగిలియున్న సెలవును రద్దుచేసికొని వెంటనే పనిలోఁ జేర వచ్చుననియు వ్రాయఁబడి యున్నది. అది చూడఁగానే నా కాశ్చర్య సంతోషములు కలిగినవి. నా కింకను సెలవుదినములు రెండు మాసము లుండినవి. సెలవుదినము లయిన తరువాత పనిలోఁ జేరవలెనని తలఁచుకొంటిని. అప్పటికి నాపుస్తకములపని యింకను పూర్తిగా తీఱలేదు. డంకన్ దొరవారు నన్నేలాగునసైన చెన్నపట్టణము రప్పింపవలెనని నిశ్చయించికొని కొక్కొండ వేంకటరత్నము పంతులుగారి కింగ్లీషు రాదన్న మిషమీఁద నన్నక్కడకు వేసి యాయన నిక్కడకు వేసిరి. నేను పనిలోఁ జేరులోపల నొక్కసారి రాజధానీకలాశాలాధికారి యైన

స్టూఆర్టు దొరగారిని చూచి వచ్చుట మంచిదని యెంచి యొక నాఁటి మధ్యాహ్న మాయనను చూడఁబోయితిని. ఆయన నన్ను తన గదిలో చెంతఁ గూరుచుండఁబెట్టుకొని యత్యాదరములో మాటాడి పనిలో నెప్పుడు చేరెద వని యడిగెను. నా సెలవు దినము లయిన తరువాత చేరెదనని చెప్పితిని. కొక్కొండ వేంకట రత్నము పంతులు గారు తన్నిక్కడనే యుంచవలసిన దని విన్నపము పంపెననియు, తాను దానిని విద్యావిచారణాధికారిగారికి పంపఁదలఁచుకో లేద నియు, తత్క్షణమే పనిలోఁ జేరవలసిన దనియు చెప్పి, భటునిచేత దేశ భాషా పర్యవేక్షకు లైన శేషగిరి శాస్త్రిగారిని పిలిపించి, నన్నుఁ దీసి కొనిపోయి పని యొప్పగింపవలసినదని యుత్తరు విచ్చెను. ఆయన నన్ను వెంటఁగొని మేడమెట్లు దిగి యాంధ్రోపాధ్యాయుని గదివఱ కును వచ్చి, లోపలికి నన్నుఁదీసికొని పోవుటకు సంశయించి, యక్క డనే నిలిచి యొక భటునిఁ బిలిచి యీయనకు పని యొప్పగింప వల సినదని వేంకటరత్నము పంతులుగారితో చెప్పుమని, తాను వెనుకకుఁ బోయెను. నేను గదిలోనికిఁ బోవునప్పటికి వేంకటరత్నము పంతులు గారక్కడ లేరు. నేను వచ్చి దొరగారితో మాటాడుచున్నట్టు వినఁ గానే యాయన తన గదిలో నిలువనేరక విచారముతో లేఖకుని గదిలోనికిఁ బోయి కూరుచుండి భటుఁ డడిగినప్పుడు పెట్టె తాళము చెవి యాతనిచేతి కిచ్చి పంపి తా నక్కడనుండియే యింటికిఁబోయిరి. తన స్థానభ్రంశమునకు నేను కారకుఁడ నని భావించి పంతులవారు రాజమహేంద్రవరము చేరిన తరువాత మీయనుగ్రహమువలన నాకు గోదావరీస్నాన పుణ్యఫలము లభించినదని నా కుత్తరము వ్రాసిరి. రాజధానిశాస్త్రపాఠశాలలో నేను పరీక్షాగ్రంథములను బోధించు టయే కాక యన్నితరగతులకును భాషాంతరీకరణము కూడ నేర్ప వలసినవాఁడ నగుటచేత నాకు పని యధిక మయ్యెను. మాయిల్లు

ాఠశాలకు మూఁడుమైళ్ళ దూరములో నుండుటచేత గుఱ్ఱపుబండిని పెట్టుకోవలసినవాఁడ నైనందున నాకు మాసవ్యయము సహితమధిక మయ్యెను. నేను మొట్టమొదట నొక చిన్నగుఱ్ఱపుబండిని పెట్టుకొంటిని గాని తరువాత దాని నమ్మివేసి పెద్ద గుఱ్ఱమును పెద్దబండినికొని యుంచితిని. ఈ పెద్ద గుఱ్ఱమును తాను బొబ్బిలికి పోవునప్పుడు విక్రయించి వేయుటకయి శేషగిరిరావుగారు నా యొద్ద విడిచి పోయిరి. దానికి సుళ్ళు మంచివి కాకపోవుటచే దాని నెవ్వరును కొన కుండిరి. అది నెలలకొలఁదిని నా యొద్ద నుండవలసి వచ్చెను. దానికి గుఱ్ఱపువాఁ డొకఁడును గడ్డితెచ్చువాఁ డొకఁడును ఉలవలు మొదల యినవియు కావలసినందున నెలకిరువదియైదు రూపాయలు కర్చగు చుండెను. తమ ప్రథమభార్య మరణమున కీగుఱ్ఱమే కారణ మని మనసులోఁ దలఁచియుండి నందున శేషగిరిరావు పంతులుగారు దానిని తమవెంటఁ దీసికొని పోవ నొల్లరైరి. నే నెన్నిసారులు దానిని వేలమునకుఁ బంపుచు వచ్చినను సుళ్ళు చూచి యేఁబది యఱువది రూపాయలకంటె నెక్కువ పాటపాడ కుండిరి. నే నొకసారి శనివార మునాఁడు స్వయముగా పోయి యేలములో నూఱురూపాయలకు పాడఁగా పయిపాట రానందున నాపాటమీఁదనే కొట్టుపడిపోయెను. దాని కావఱకైన కర్చులకును క్రయధనమునకు సరిపోయెను. నేనొక దానికి మాఱుగా రెండు గుఱ్ఱములను భరింపవలసవాఁడనయి నందున మొదటి చిన్నగుఱ్ఱమును బండిని తక్కువ వెల కమ్మివేసి యీ పెద్దగుఱ్ఱమునకు తగిన పెద్దబండినికొంటిని. సుళ్లు మంచివి కాక పోవుటచేత దుష్ఫల మేమి కలుగునో చూడవలెన్న యభిలాషము చేతనే కొంతవఱకు నీగుఱ్ఱమును గొంటిని. నేను చెన్నపట్టణమువిడిచి రాజమహేంద్రవరము వచ్చువఱకును ఈ గుఱ్ఱము నా యొద్దనుండి నది; ఉన్నంతకాలము చక్కఁగా పని చేసినది; మిక్కిలి సాధువుగా

నుండినది. ఒకనాఁడు నేను నా భార్యతోఁగూడ రాత్రిప్రార్థన కయి యీ గుఱ్ఱపుబండిలో నెక్కి యుపాసనా మందిరమునకుఁ బోయితిని. ఉపాసన ముగియునప్పటికి రాత్రితొమ్మిది గంట లయినది. మేము లోపలికి పోయినప్పుడు బండివాఁడు తప్పత్రాగి మేము బండిలో మరల నెక్కు నప్పటికి స్మృతి యంతగా లేకుండెను. బండి నడుచు చుండుటఁజూచి వాఁడు తోలుచున్నాఁడనుకొని నేనును నాభార్యయు బండిలో మాటాడుకొనుచుంటిమి. బండి వేఱు దారిని పోవుచుం డఁగా జూచి యీదారి నేల తోలుచున్నావని బండివాని నడిగితిని గాని వాఁడు చెప్పిన దేమో నాకు తెలియలేదు. అరగంట సేపటికి మూఁడు మైళ్ళు నడిచివచ్చి బండి మాగుమ్మము ముందువీధిలో నిలి చెను. తలుపు తీయుటకయి బండివాఁడు దిగనందున తలుపుతీసికొని నేను దిగి బండివానిని పిలువఁగా నిఁక పావుగంట సేపులో మనయిల్లు చేరుదుమని వాఁడు చెప్పెను. వాఁడుత్రాగి స్మృతితప్పి యున్నాఁ డన్న సంగతి నా కప్పుడు తెలియవచ్చెను. ఇటువంటి మంచిగుఱ్ఱము నమ్మివేయుట కిష్టము లేనివాఁడ నయినను రాజమహేంద్రవరము వచ్చునప్పుడు బండిని గుఱ్ఱమును గూడ సుళ్ళు మంచివి కాకపోవుట చేత తొంబదిరూపాయలకే యమ్మివేయవలసినవాఁడ నైతిని. ఈ గుఱ్ఱము నావద్ద నాలుగు సంవత్సరము లున్నను సుళ్లేవియు నాకు కీడు చేయలేదు.

నేను చెన్నపట్టణము వెళ్ళిన తరువాత హైందవ దేశీయ మహాసభ 1898 వ సంవత్సరమునం దక్కడ జరగెను. ఆ సభతోడి పాటుగా హైందవ దేశీయ సాంఘికమహాసభ కూడ జరగెను. ఆ స భకు న న్నగ్రాసనాధి పత్యమును వహింప వలసినదని కోరిరి. అంతటి గౌరవమునకు నే నర్హుఁడను గాననియు, వ్యాధి బాధితుఁడ నయి యుండుటచేత నింకొకరిని గోరవలసిన దనియుఁ జెప్పి యెన్నివిధముల

తప్పించుకోఁ జూచినను నన్ను విడిచిపెట్టక బలవంతముగా నన్నా యగ్రాసనాసీనుని జేసిరి. ఆసభలో శ్రీమహాదేవ గోవిందరానడేగారు 'దక్షిణహిందూదేశ విద్యాసాగరుఁ'డని నాకు నూతన నామకరణము చేసిరి. నాది మొదలే పెద్దగొంతుక కాదు; ఆమీఁద శ్వాసకాస రోగ పీడితుఁడ నయి యుండుటచేత మఱింత హీనస్వరముపడినది. ఈహీన స్వరములోనే నా యధ్యక్షోపన్యాసమును గొంతవఱకు చదివి దగ్గు చేత చదువలేక పోఁగా శేషమును నాకు మాఱుగా నామిత్రు లయిన న్యాపతి సుబ్బారావుపంతులుగారు చదివిరి. అప్పుడు దయ చేసిన సభ్యులు వేయిమందికంటె నెక్కుడుగా నుండిరి. ప్రాసంగికు లెంత పెద్దగొంతుకతో మాటాడుచున్నను 'బిగ్గరగా బిగ్గరగా' నని యఱపులు సభలోనుండి లేచుచునచ్చెను. చిన్నగొంతుకతో నేను నావ్యాసమును జదువ నారంభించినప్పుడు దగ్గరనున్న వారికిఁ గొంద ఱికితప్ప నేను చెప్పినది వినఁబడకుండెడి దనుటస్పష్టము. అట్లయ్యును సభ్యులు నాయందత్యంతగౌరవమునుజూపి 'బిగ్గరగా' నన్నమాటయై నను బలుకక నిశ్శబ్దముగానుండి నామాటలను చెవులొగ్గి వినఁ బ్రయత్నించిరి. ఇట్లు నన్ను గౌరవించుటకుఁ గారణము వారికి నా యెడలఁ గలిగిన యనుగ్రహము తప్ప వే ఱేదియులేదు. తరువాత 1902 సంవత్సరముజూన్ 14వ తేది కాకినాడలో జరగిన చెన్నరాజధానిదేశీయ సాంఘికమహాసభకు నన్నగ్రాసనాధిపతిగాఁ జేసిరి. ఆసభలో జరగిన యుపన్యాసములను వినుటకయి వ్యావహారిక సభకు వచ్చినవారికంటెను నెక్కువమంది వచ్చి యెక్కువ యుత్సాహముతోఁ బనిచేసిరి. నే నప్పుడుచేసిన యుపన్యాసములోని భాగములను రివరెండు మర్డాకు దొరగారు తమగ్రంథములలో నుదాహరించిరి. కాకినాడ పురవాస [illegible] నత్యంతాదరమును గనఁబఱిచిరి.

1903-వ సంవత్సరమునకు మెయినెలలో బెజవాడలో జరగిన కృష్ణా మండల సాంఘికసభకు నన్నగ్రాసనాసీనునిగాఁ జేసి గౌరవించిరి.

1903-వ సంవత్సరమునందు చెన్నపట్టణములో హిందూ దేశాస్తిక మహాసభకును నేనగ్రాసనాధిపతిఁగా జేయఁబడితిని. ఆసంవత్సరమునందుజరగిన హైందవ దేశీయసాంఘిక మహాసభకుపూర్వమునందుకొన్ని వివాదములు సంభవించినవి. హిందూసభ చెన్నపురియందప్పుడే తల చూపి విజృంభింప నారంభించినది. అందులో ప్రముఖు లనేకులుచేరిరి. ఆ సభవారు సాంఘికసంస్కారమునకు విరోధుల మని చెప్పక సంస్కారమును దేశీయ పద్ధతుల ననుసరించి జరపవలెనని చెప్పుదురు; ఆసభ్యులలోబహుసంఖ్యాకులు మనస్సులలో సంఘసంస్కారమునందే యిష్టములేనివారు. ఈసమాజస్థాపకు లేలాగున నైన నాసంవత్సరపు సాంఘిక మహాసభలో వితంతువివాహవిషయము నెత్తుకోకుండఁ జేయవలెనని విశ్వప్రయత్నములు చేసిరి. అందునిమిత్తమయి వారు ముందుగా తమలో నేర్పాటుచేసికొని వితంతూద్వాహమునకు విరోధులుగానున్నవారి పట్టిక నొకదానిని సిద్ధముచేసికొనివచ్చి యాండర్సను హాలులో నొక సభచేసి యీపట్టికలోనివారి నందఱిని సాంఘిక మహాసభకు చెన్నపురివారి ప్రతినిధులనుగా నేర్పఱిచినట్టు నిర్ణయము చేయించిరి. అట్లుచేయుటయందలి వారి యుద్దేశము సభలో తా మెక్కువసంఖ్యగలవారయివితంతువివాహ విషయమును నిర్ధారణాంశములలోనుండి తొలఁగింపవలెనని. నేనును వారి యుపాయమునకు ప్రతిక్రియ నాలోచించి వితంతువివాహపక్షమువారి పట్టిక నొకదానిని వారిపట్టికకంటెను పెద్దదానిని సిద్ధముచేయించి చెన్నపురి హిందూ సంఘసంస్కరణ సమాజపక్షమున అండర్సను హాలులోనే సభ సమకూర్చించి, యీ క్రొత్తపట్టికలోనివారి నందఱిని సాంఘికమహా

సభకు ప్రతినిధులనుగా నేర్పఱిచినట్టు సభవారిచే నిర్ణయముచేయించి తిని. ఈక్రొత్తప్రతినిధుల సంఖ్య హెచ్చుగా నుండుటచేత హిందూ సమాజమువారు చేసినకృషి విఫలమగునట్లు కనఁబడెను. అది చూచి వారు సమాధానమునకువచ్చి సంఘసంస్కారపక్షమువారిలో రెండు విభాగములుండుట యుక్తముగాదనియు, ఉభయపక్షములవారును నొక్కటిగాఁజేరి యీసంవత్సరపు సాంఘిక మహాసభను జయప్రదముగాఁజేయుట ధర్మమనియు, అందుచేత రెండవమారు జరిగినసభను రద్దుచేసికొని మొదటిసభనే యుభయుల సభనుగా భావింపవలసినదనియు, వారు నాయొద్దకు రాయబారులను బంపిరి. మొదటిసభలో నేర్పఱుపఁబడిన ప్రతినిధులలోను నావంటి సంస్కారప్రియులనామములు కొన్ని యుండినవికాని యట్టివారిసంఖ్య యత్యల్పమైనదిగా నుండెను. ప్రతిపక్షులమాయోపాయములకు నేను లోఁబడక వారిది యీసంవత్సరమే యీపనినిమిత్త మేర్పఱుపఁబడిన దగుటచేత నిజమైన సభయేకాదనియు, అందుచేత వారిచే నెన్నుకోఁబడిన ప్రతినిధులు ప్రతినిధులే కారనియు, కలిసి పనిచేయ నిష్టమున్న యెడల రెండుసభల వారిచేతను నెన్నుకొనఁబడిన ప్రతినిధుల నట్టే నీ రెండటిని కోరుదురో వా రందటిని కోరి యీ క్రొత్త సంఖ్యను పూర్వపు సంఖ్యకు చేర్పవచ్చుననియు, నేను జెప్పితిని. సాంఘిక మహాసభకు చెన్నరాజధాని కార్యదర్శిని నే నగుటచేతను, చిరకాలమునుండి యుండియున్న హిందూ సంఘసంస్కార సమాజమునకు నేనధ్యక్షుఁడనగుటచేతను,ఏవి నిజమయినసంసస్కార సభలో ఎవరు మహాసభలో మాటాడుట కర్హులయినప్రతినిధులో నిర్ణయముచేసెడి యధికారము నాయం దుండినది. అంతేకాక యీ సంవత్సరపు మహాసభా నిబంధనలలో స్థానిక కార్యదర్శిచేత క్రమ

మైన సంఘసంస్కార సమాజముచే నెన్నుకొనఁబడినవా రని యంగీ కరింపఁబడిన ప్రతినిధులనేకాని యితరులను మహాసభలో మాటాడ నియ్యఁగూడదన్న యొకక్రొత్త నిబంధన చేర్పఁబడినది. ఈ నూతన నిబంధనము తమ ప్రతినిధులను నిరాకరించు నుద్దేశముతో నాప్రేరణ ముచేత చేయఁబడినదని హిందూసమాజమువారు భావించి, దానిని మార్పవలసినదని సాంఘిక మహాసభా సామాన్యకార్యదర్శి యైన న్యాయమూర్తి చంద్రావార్కరుగారిపేర బొంబయికి వ్రాసిరి కాని వారా విన్నపమును నిర్ణయము నిమిత్తము నాయొద్దకే పంపిరి. వా రేవిధముచేతను లబ్ధమనోరథులు కాక కట్టుకట్టి తా మందఱును మహా సభకు రాక నిలిచిపోయిరి. వారిలో దివాన్ బహదూరు ఆదినారా యణయ్యగారు మొదలైన యేకపక్షావలంబులు కానివారు కొందఱు మాత్రము సభకు వచ్చిరి. ఆసంవత్సరపు సాంఘిక మహాసభ వెనుకటి సభలకంటెను నధికజయప్రదముగా జరగెను. ఈసభ జరగిన తరు వాత హిందూసమాజమువారు పురమందిరములో ఆనీబెసెంటు దొర సానిగారి యాధిపత్యముక్రింద నొక మహాసభను చేసిరి కాని యీ యొక్క సభతోనే యీ సమాజమంతరించినది.

1902 వ సంవత్సరములో గుంటూరునందు ప్రథమ వితం తూద్వాహము జరిగినది. ఆ వివాహమును జరిగించి పోవలసినదని యక్కడి ప్రాడ్వివాకులైన విశ్వనాథశాస్త్రిగారు నన్ను కోరిరి. వారి కోరిక నంగీకరించి నేను భార్యాసహితముగా అక్టోబరు నెల 10 వ తేదికి గుంటూరువెళ్ళి విశ్వనాథశాస్త్రిగారిలోపలనే దిగితిని. నేనక్క డికి పోఁగానే గుంటూరులో పెద్ద సంక్షోభ మారంభమయ్యెను. విశ్వనాథశాస్త్రిగారి వంటబ్రాహ్మణుఁడు వారిని విడిచి లేచిపోయెను. వివాహము తమయింట జరపవలదని యాయనభార్య పట్టుపట్టెను. అంతదూరమునుండి నన్ను పిలిపించిన తరువాత నా కాశాభంగము

కలిగించుట యుక్తముకాదని యాయన లోఁబడక దృఢచిత్తుఁడయి నిలిచెను. 1902 వ సంవత్సరము అక్టోబరునెల 11 వ తేదిని గుంటూరులో ప్రథమ వితంతువివాహము వారియింటనే నడచినది. ఈ వివాహములో వరుఁడు బేతపూడి జోగిప్రకాశరావుగారు; వధువు రాజమహేంద్రవర నివాసినియైన శ్రీమతి వేంకటరమణమ్మ. ఉన్నవ లక్ష్మీనారాయణగా రీవివాహములో భోజనమునకు వచ్చి యీపక్షమునఁ జేరిరి. తరువాత గుంటూరులోఁ జేయఁబడిన స్త్రీ పునర్వివాహము లన్నియు నీ లక్ష్మీనారాయణగారిచేతనే చేయఁబడినవి. మఱు నాఁటిరాత్రి నాగౌరవార్థముగా గుంటూరు నాటక సమాజమువారు మద్విరచితమైన శాకుంతలనాటకమును ప్రదర్శించిరి. నేనా రాత్రి నాటకమును జూచి మఱునాఁడు బైలుదేఱి యింకొక పునర్వివాహము చేయించుటకయి కుటుంబసహితముగా రాజమహేంద్రవరమునకుఁ బోయితిని. 1902 వ సంవత్సరము అక్టోబరునెల 14 వ తేదిని రాజమహేంద్రవరములో నుద్దేశింపఁబడిన వితంతువివాహము జరిగినది. ఇందు వరుఁడు రాజమహేంద్రపురవాసియు చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి పాఠశాలలో సహాయోపాధ్యాయుఁడు నైన తిరుమెళ్ళ వేంకటసుబ్బారావుగాడు; వధువు తిరువళ్లూరు సమీపములో నున్న యవిచ్చేరి గ్రామనివాసియైన తిరుమలాచార్యులుగారి పుత్రిక వేంకటలక్ష్మమ్మ. ఈ యాచార్యులుగా రావఱకు రెండుసంవత్సరములనుండి కొమారితె వివాహనిమిత్తమయి నాయొద్దకు వచ్చుచుండెడువారు. ఆయన మొట్టమొదట వరుఁడు వైష్ణవుఁడే కావలె నని పట్టుపట్టినందునను వైష్ణవులలో తగినవాఁడు దొరకనందునను వివాహమగుట కింతకాలమైనది. ఆయనతగిన వైష్ణవవరుఁడు దొరకునందున నాహితోపదేశమునకు లోనయి తుదకు కన్యకను వైష్ణవేతరున కిచ్చుట కొప్పుకొనెను. వరునిగూర్చి చిలకమర్తి లక్ష్మీనరసింహము

గారు శ్లాఘించుచు వ్రాయఁగా నాతని నక్కడకు రప్పించి కాఁబోయెడి మామగారికి చూపి యాయన నొప్పుకొన్నమీఁదట కొమారితను దీసికొని బైలుదేఱి బెజవాడవద్ద గుంటూరినుండి వచ్చునప్పుడు నన్ను కలిసికొనునట్లేర్పాటు చేసితిని. వారట్లు కలిసికొనఁగా వారిని వెంటఁబెట్టుకొని వచ్చి రాజమహేంద్రవరములో వివాహము చేసి నా భార్యతో నేను మరల చెన్నపట్టణమునకుఁ బోయితిని. ఈయాచార్యులుగారు తమ వితంతు కుమారికయందు ప్రేమాతిశయముగల వారయి రు. 1,200 ల సొత్తు నామె కిచ్చుటకు వివాహమునకు ముందే యొప్పుకొనిరి.

రాజమహేంద్రవరములో పురమందిరమును, చెన్నపట్టణములో సంఘసంస్కార సమాజమందిరమును కట్టించి యిచ్చుటయే కాక నేను చెన్నపురిలో నున్న కాలములోనే సుమారు రు. 1,200 లు కర్చుపెట్టి రాజమహేంద్రవరములో స్త్రీలకు ప్రార్థనమందిరమును కట్టించితిని. నేను 1907 వ సంవత్సరమునందు నా భార్యతోఁ గలిసి వేసవికాలములో బెంగుళూరికి పోయితిని. అప్పుడు బెంగుళూరిలోని యరుళపేట బ్రాహ్మసామాజికులు నన్నును నాభార్యను తమ యుపాసనాసమయమందు రావలసిన దని యాహ్వానము చేయఁగా మేమక్కడకుఁ బోయితిమి. పగలెల్లను మగ్గములు వేసి నేత నేసిన యింటిలో మగ్గము లెత్తిపెట్టి రాత్రి యుపాసనము జరపిరి. ఆయింటి మిద్దె యెత్తులేని దయి యించుమించుగా నెత్తికి తగులుచున్నట్లుండెను. అక్కడ నుపాసన చేసిన సామాజికులు చదువుకొన్నవారును ధనవంతులును గాకపోయినను నిక్కమయిన భక్తిపరులుగా మాకుఁ గనఁబడిరి. వారిలో కొందఱు నన్ను చూచుటకు చెన్నపట్టణము వచ్చినప్పుడు వారిమెడలో పెద్దపెద్ద వెండిలింగకాయలుండెను. వారిప్పుడు లింగములను దీసివేసి యేకేశ్వరారాధనపరులయి యుండిరి.

వారిభక్తికి సంతోషించి త్రోవలో నేనును నాభార్యయు వారి విషయమయి ముచ్చటించుచు వారి కొక చిన్నమందిరమును కట్టించి యిచ్చిన బాగుండునని యాలోచించితిమి. ఒకపనిని సంకల్పించుకొనఁగానే దానిని నెఱవేర్చువఱకును నామనస్సున కూఱట యుండదు. అందుచేతనే నాసామాజికులను బిలిపించి నేనుండిన చామరాజపేటలో నొకమందిరమును కట్టించి యిచ్చెదనని చెప్పితిని. రాత్రి యంతదూరము తాము రాలేమని చెప్పి పట్టణములోనే మందిరమును కట్టించి యిమ్మని వారు కోరిరి. అరుళపేటలోనే యిల్లు కొనుటకయి ప్రయత్నించితినిగాని నేనున్నకాలములో నేదియు దొరకలేదు. 1908 వ సంవత్సరమునం దొక యిల్లే నూఱు రూపాయల కమ్మకమునకు వచ్చిన దని వారువ్రాయఁగా వెంటనే సొమ్ముపంపి యాయిల్లు కొనునట్లు చేసితిని. ఆప్రాఁతయిల్లు తరువాత పడఁగొట్టించి వేయిరూపాయల కొక మందిరమును ఆస్థలములో కట్టించి యిచ్చితిని. ఈమందిర నిర్మాణమునకు నాకు రు. 1,500 లు వ్యయపడినవి. కొన్ని సంవత్సరములనుండి యీమందిరములోనే ప్రతివారమును బ్రాహ్మసామాజికులు తమ యుపాసనమును జరపుకొనుచున్నారు.

వితంతుశరణాలయమునకయి నేను పడుచున్న శ్రమనుచేయుచున్న వ్యయమును జూచి నామిత్రులయిన రంగయ్యసెట్టిగారు వితంతురక్షణార్థముగా నెలకు పదేసి రూపాయలు 1903 సంవత్సరమునుండి నాకు పంపుచు వచ్చిరి. బళ్ళారిపురవాస్తవ్యులైన కోలాచలము వేంకట్రావుపంతులుగారు నన్ను చూడ వచ్చినప్పుడు మాలోపల నున్న వితంతువులను జూచి సంతోషించి బళ్ళారి సభాపతి యంత్రములోనే మూఁడువేలరూపాయల తమ భాగములను 1901-వ సంవత్సరములో వితంతు సంరక్షణార్థమయి నాపేర వ్రాసియిచ్చిరి. పోలవరము జమీందారుగా రిచ్చిన వేయిరూపాయలును, చందాలవలన

వచ్చిన నూటయేఁబదితొమ్మిది రూపాయలును, రంగయ్యసెట్టిగారు నెలనెలకిచ్చెడు పదేసిరూపాయలును, వెంకట్రావుగారిచ్చిన మూఁడు వేలరూపాయలభాగమువలన వచ్చినలాభమును తప్ప చెన్నపట్టణములో వితంతుశరణాలయ రక్షణార్థమయి నాచేతికి వచ్చిన దేదియు లేదు. చేసిన పదివివాహములకును వితంతువులయొక్క పోషణమునకును విద్యాదికమునకును చేతికివచ్చిన సొమ్ముకంటె నెక్కువసొమ్మే వ్యయపడినను వితంతు శరణాలయమున కేదైన కొంతనిధి చేర్చిపెట్టవలయు నన్నయుద్దేశముతో పోలవరము జమీందారుగా రిచ్చిన వేయిరూపాయలను ఆర్బత్తునట్టుకంపెనీలో పెట్టితిని. నాచేతికి సొమ్ము వచ్చినప్పుడెల్లను కొంతకొంత చేర్చుచు నచ్చి దానిని రెండువేల యిన్నూఱు రూపాయలవఱకును పెంచితిని.

చెన్నపట్టణములో మాయింట నుండుచువచ్చిన వితంతువులను విద్యాభ్యాసము నిమిత్తము ఎగ్మూరులోనున్న దొరతనమువారి స్త్రీబోధనాభ్యసన పాఠశాలకుఁ బంపుచుంటినని ముందే తెలిపియుంటినిగదా. అక్కడకుఁబోవు వితంతువులు కొందఱు సాయంకాలమింటి కాలస్యముగా వచ్చుచుండిరి. రాజధానికళాశాలనుండి సాయంకాలము నేనింటికి వచ్చునప్పటికైన వారిల్లుచేరకుండుటచూచి యనుమానపడి "యేల యిట్లింటి కాలస్యముగా వచ్చుచున్నా"రని యడిగితిని. ఉపాధ్యాయిని పలకమీఁద లెక్కవేయఁగా దానిని పుస్తకములో నెక్కించుకొనుట కాలస్యమయిన దని యొకనాఁడును, త్రోవలోనున్న యుపాధ్యాయినియింటికి పాఠము చెప్పించుకొనుటకు పోవుటచేత నాలస్యమైనదని యొకనాఁడును, వారు సాకులుచెప్పుచు వచ్చిరి. నే నాయుపాధ్యాయిని యింటికిఁబోయి 'నిన్న సాయంకాలము వారు మీయింటికి వచ్చిరా' యని యడుగఁగా నామె రాలేదని చెప్పెను. ఈలోపల నొక చిన్నది తనకు జ్వరము వచ్చుచున్నదని తిన్నగా

నన్నము తినక మూల్గుచు మూలుగుచు నుండఁగా వైద్యులచేత మందు లిప్పించితిని. వైద్యులెన్నాళ్ళు మందిచ్చినను దేహ మామెకు స్వస్థపడలేదు. అందుచేత నేనామెను వైద్యురాలి (Lady doctor) యొద్ద కుత్తరము వ్రాసిపంపి, యామెను పరీక్షించి వ్యాధిస్వభావ మేమో తెలుపవలసినదని కోరితిని. ఆమె పరీక్షించి యీమె సుఖరోగములచేత బాధపడుచున్నదని నాకు వ్రాసెను. ఆయుత్తరమును చదువఁగానే నామనస్సులో విషాదఖేదములు కలిగి, బాలవితంతువుల నాపాఠశాలకు పంపుట క్షేమకరము కాదని తలఁచితిని. ఆపాఠశాల లోని యుపాధ్యాయినులలో, సహవాసినులైన తోడి విద్యార్థినులో యెవ్వరో యొక కీవితంతుయువతి కన్యాపురుష సంధానము చేసియుందురు. మాయింటనే పాఠశాల యుంతమన్న నాకున్న రెండిండ్లలోను దేనిలోను పాఠశాలనుంచుటకు చాలినతావులేదు. అందుచేత వేఱొక యింటినైనను కొనవలెను; విశాలమైనస్థలమునుగొని దానిలోపాఠశాలకును కాపురమునకును దగినయింటినైనను కట్టవలెను. మాయింటికి కొంచెముదూరమున కీల్పాకములో నొకసరుగుడుతోట యమ్మకమునకు రాఁగా రు 900-0-0 లకు దానిని నాభార్య పేరిటకొంటిని. అది సుమా రెకరము నేల యుండును. దానిలోనున్న చవుకుచెట్లనుకొట్టించివేసి, నడుమగా పాఠశాలకుఁ దగిన నాలుగు గదులుగల యిల్లొకటి కట్టించి, దాని నేఁటిదాఁకు చేర్చి వసారా దింపించి దానిలో వంటలు చేసికొనుటకు మూఁడు నాలుగుగదులనువేసితిని. శరణాలయములోని వితంతువు లీగదులలో వంటమాత్రముచేసికొని భోజనముచేసి, తక్కిన కాలమంతయు పాఠశాలలోనే గడపి రాత్రులా పాఠశాలలో వారం డఱు నిద్రింపవలయునని నాయభిప్రాయము. తొందరపడి యిల్లు కట్టించితినిగాని కట్టించినతరువాత నాకొక పెద్దకష్టము కానఁబడెను. వితంతువులనక్కడ ప్రవేశపెట్టినప్పుడు వారిని పయినుండి విచారించు

చుండువారు కావలెను. సాంఘికసమాజ సభ్యులలో నెవ్వరి నడిగి నను వా రాపని తమచేత కాదనిరి. నేనే వెళ్లి యందు కాపురముందు నన్నను, అది పాఠశాల కుపయోగించునట్లే కట్టఁబడినదిగాని కాపుర ముండుట కనుకూలముగా కట్టఁబడలేదు. నే నందులోనికి నీటిగొట్ట మును (pipe) తెప్పించి, దొడ్డిలో నంటుమామిడితోఁట వేయించి నాలుగువేల రూపాయలు కర్చుపెట్టినను ప్రయోజనము కనఁబడలేదు. అక్కడ కాపుర ముండువా రెవ్వరును లేకపోవుటచేత నింటికి చెదలు పట్టియు, దొడ్డిలోను వసారాలోను కుక్కలును గాడిదలును నివాస మేర్పఱచుకొనియు, ఇల్లు పాడగునట్లు కనఁబడెను. అంతేకాక రాత్రులు దొంగలు తలుపులెత్తుకొనిపోవుదు రేమో యని భయముఁ తోఁచెను. అందుచేత మాయింటనున్న వితంతువులలో నలువదేండ్లు దాటిన యిద్దఱి నక్కడకు కాపురమునకుఁ బంపి నేను ప్రతిదినమును ప్రాతఃకాలమునను సాయంకాలమునను పోయి చూచుచుంటిని. నా కక్కడ సాయముచేయువారు లేకపోయినను వితంతువుల నొంటిగా నక్కడ నుంచితినని తప్పులు పట్టువారు మాత్రముండిరి. ఈహేతువు చేత నాకు చెన్నపట్టణ నివాసమెత్తివేయవలెనన్న బుద్ధి పుట్టినది. రంగయ్యసెట్టిగారిచ్చెడు పదిరూపాయలును తప్పనాకక్కడధనసాహా య్య మేమియులేదు; మనుష్యసాహాయ్య మంతకు మునుపే లేదు. వచ్చిన కొన్ని రూపాయలను సమాజము మ్రింగివేసినది. మఱి యే స హాయము లేకపోయినను మాటలకు కఱవులేదు గనుక సభలలోను సంభాషణములలోను వాక్సహాయము కావలసినంత వచ్చుచున్నను కార్యకారి గాక యది క్రియాశూన్యమయినది. రెండుమైళ్ళ దూర ములో నొకరును మూడుమైళ్ళదూరములో నొకరును నుండుటచేత మిత్రసమావేశసహితము తఱుచుగా లభింపకుండెను. కార్యములలో నాకు తోడుపడెడు మిత్రులు బుచ్చయ్యపంతులుగారు స్వర్గస్థులైరి.

వితంతు శరణాలయములోనికివచ్చెడువారు సాధారణముగా దూరము నందున్న గంజాము విశాఖపట్టణము గోదావరీ కృష్ణామండలముల నుండి వచ్చు తెలుఁగువారే కాని చేరువనున్న యఱవదేశమునుండి వచ్చువా రొక్కరును కనఁబడలేదు. మిత్రులైన రంగయ్యసెట్టిగారు తామిచ్చెడు చందాధనమును నే నెక్కడనున్నను నిత్తురు. ఈ హేతువు లన్నిటిచేతను నాకు చెన్నపురి విడిచి రాజమహేంద్రవరము మరలఁ జేరినచో నెక్కుడుపని జరగవచ్చునని తోఁచినది. వివాహములుచేసి కొన్నవారు పదుగురునుగాక శరణాలయములోనుండిన వితంతువు లలో నిద్దఱు ప్రాథమిక. పరీక్షలోను నొక్కరు మధ్యమ పరీక్షలోను కృతార్థురాండ్రయిరి. మఱి యిద్దఱు భోజనమునకుఁ దక్క మఱి యెందునకును బనికిరానివా రయిరి.

ఇతర దేశములో నెన్ని సౌఖ్యము లున్నను ఎంతగౌరవ మున్నను మనస్సెప్పుడునుస్వదేశమువంకను జన్మస్థలమువంకను బాఱు చుండును. ఈ స్వాభావిక వాంఛకూడ పయిహేతువులతోడిపాటు నన్ను స్వస్థలగమనమునకుఁ బురికొల్పఁజొచ్చెను. అయినను నే నిండ్లు కొని స్థిరనివాస మేర్పఱుచుకొనుట కన్నియేర్పాటులు చేసినప్పుడు చెన్నపట్టణము నెట్లు విడుతునాయనియు నాలోచించుచుంటిని. రాజ మహేంద్రవరమునకు వెళ్లినను వెళ్ళకపోయినను వచ్చినంత యుప కారవేతనమునొంది పనిచాలించుకొనుటకు నేను నిశ్చయించుకొంటిని. పనిలోనుండుటచేత నాకాల మంతయు దానిలోనే పోవుచుండెను. మూఁడుమైళ్ళదూరములో నున్న పాఠశాలకు పదిగంటలకు పోఁగలుగు ట కింటివద్ద నెనిమిది గంటలకే భోజనప్రయత్నములో నుండవలసివ చ్చెను; ఇఁక సాయంకాల మైదుగంటలకు పైని గాని యిల్లు చేరలే కుండుటచేత నటుపై నేమియు చేయలేకుంటిని; నాలుగుతరగుతులకు పరీక్షాగ్రంథములు గాక భాషాంతరీకరణము కూడ నేనే నేర్పవలసి

యుండుటచేత వారు వ్రాసినదానినింటికిఁ దీసికొనివచ్చి దిద్దవలసివచ్చెను. వ్యాధిపీడితమైన నాశరీరదౌర్బల్యమున కీపనులు తోడ్పడి నన్ను శోకమున కంతగా నుపయోగపడకుండఁ జేసెను. అందుచేత నేఁబదియైదేండ్లెప్పుడు నిండునా, పనిలోనుండి యెప్పుడు విముక్తి నొందఁగలుగుదునా యని ప్రతీక్షించుచుంటిని. నా సేవాపుస్తకలేఖనమునుబట్టి 1904-వసంవత్సరము మార్చి నెలతో నా కేఁబదియైదేండ్లు నిండును గాన నా కుపకారవేతనమునకు వ్రాసి యప్పటినుండి నన్ను పనినుండి విడుదల చేయవలసిన దని యధికారులకు విన్నపము దింపుకొంటిని. నా పయియధికారులకు నన్ను విడిచిపెట్టుటయిష్టము లేదు. నాతో చెప్పకయే మాపాఠశాల ముఖ్యాధికారి నేను పనిచేయుటకు శక్తుఁడనుగా నున్నానని విద్యావిచారణాధికారికి వ్రాసెను. నా కెనుబదిరూపాయల పని యిప్పించెదనని చెప్పెను. నా కప్పు డఱువదిరూపాయల జీతమయినందున నెనుబదిరూపాయలపని యిప్పించినను సంవత్సరమయినతరువాతఁ గాని రెండురూపాయ లెక్కువ రావు. నే నెదురు చూడనిచిక్కింకొకటికూడ వచ్చెను. నేను మొదటపనిలో ప్రవేశించినప్పుడు రాజకీయవైద్యుఁడు నన్ను పరీక్షించి నావయస్సు నిజమయిన దానికంటె నొకసంవత్సరము తక్కువ వేసెను. ఈ హేతువుచేత నే నింకొకసంవత్సరము కొలువు చేయవలసియుండెను. అప్పుడు నాకుపకారవేతనము నాజీతములో సగము ముప్పదిరూపాయలు వచ్చియుండును. నేను కొలువు సాధ్యమయినంత శీఘ్రముగ వదలుకోఁదలఁచుకొన్నందునను, జాగుచేయుటచే శీతకాలము దాటిపోయినపక్షమున వైద్యుని నిర్ణయపత్రము దొరకుట నాకు సులభము కానందున, డాక్టరువద్ద కుత్తరముతో పోయి నేను కొలువునకు పనికిరా నన్న నిర్ణయపత్రము సంపాదించితిని. చిన్నప్పటినుండియు నన్ను బ్బసపుదగ్గు బాధించు

చుండెను. అది శీతాకాలములో హెచ్చుగా నుండును గాన పనికి పనికి రానట్టునిర్ణయపత్రమును బడయుటకు శీతకాలమే మంచిసమయము. ఈయేర్పాటువలన నాకుపకారవేతనములో నాలుగురూపాయలు తక్కు వయి నే నిరువదినాలుగు రూపాయలతో నేత్ర ప్తిపొంద వలసినవాఁడ నైతిని. నేను రాజమహేంద్రవరమునుండి బైలుదేఱివచ్చునప్పు డిఱు వదిరూపాయల యుపకార వేతనముతో నేత్ర ప్తిపొంద నిశ్చయించు కొని వచ్చితిని. వైద్యనిర్ణయపత్రము రాఁగానే యధికారులునన్నిఁక విడువకుండుట కవకాశము లేక యుపకారవేతనము కొఱకు వ్రాసి పనినుండి నన్ను విముక్తుని జేసిరి. విద్యార్థులు నన్నెప్పుడును ప్రేమించు వారగుటచేత నాలుగు తరగతులవారును తమ నడుమ నన్నుఁ గూ ర్చుండఁబెట్టుకొని ఛాయాపటముల నెత్తించిరి. ఉపకారవేతనముపొం దుటకు ముందు నాసొంతయుపయోగము నిమిత్తము వేయి రూపా యలను నిలువచేసికోవలెనని మొదటినుంటియు నాకోరిక. తదనుగుణ ముగా నేను పని చాలించుకొనుటకు పూర్వమే వేయి రూపాయలను కూడఁబెట్టి యా మొత్తమును పరశువాకములో నుండిన జనోపకారి ణీనిధియందు నిలువయుంచుకొని యుంటిని.

రాజమహేంద్రవరమునకంటె చెన్నపట్టణములో నాకెక్కువ గౌరవమును సౌఖ్యములును నుండిన వనుటకు సందేహము లేదు. నే నక్కడ గొప్పవారిలో నొక్కఁడనుగాఁ బరిగణింపఁబడి, సభలకెల్లను నాహ్వానము చేయఁబడి గౌరవము చేయఁబడుచుంటిని. విద్యార్థులు మొదలైనవారునన్ను తమ సభలకగ్రాసనాధిపతినిగా గోరుకొని నన్ను ప్రశంసించి పూలదండలు మొదలయినవి వేయుచుండిరి. నేను పెద్ద గు ఱ్ఱపుబండి నెక్కి భార్యాసహితముగా సముద్రతీరమునకును జనోద్యాన మునకును, సైన్యవాదిత్ర శ్రవణార్థమును, విహారార్థమును ప్రతిసాయంకా లమును వెడలుచుంటిని. నీటి సౌలభ్యమును వస్తుసంపాదన సౌలభ్య మును ఇతరసౌఖ్యములును చెన్నపురిలో నధికముగా నుండెను.

ఇట్లుండినను నామనస్సు వీని నన్నిటిని విడిచి స్వస్థలమునకు ప్రయాణము కట్టుటకయి త్వరపెట్టసాగెను. ఉపకారవేతనమును బొందినతరువాత దాదాపుగా సంవత్సరకాలము చెన్నపురిలోనే యుంటిని. ఈలోపల రాజమహేంద్రవరమున కొకసారిపోయి రెండు మూడు మాసము లక్కడనుండి మిత్రులతో నాలోచించి రాజమహేంద్రవరములో స్థిరముగా నుండుటకు నిశ్చయముచేసికొని మరల చెన్నపట్టణమునకు వచ్చి యిండ్లు మొదలయినవాని నన్నిటిని వచ్చిన వెలలకమ్మివేసితిని. వితంతుశరణాలయము నిమిత్తమయి నాలుగువేలరూపాయలు వ్యయముచేసి కట్టించిన యింటిని తోటను మూడువేలరూపాయలకే యియ్యవలసినవాడనైతిని. నాపెద్దగుఱ్ఱమును బండిని తొంబదిరూపాయల కమ్మివేసితిని. చింతామణి ముద్రాయంత్రమును, దాని పరికరములను, ముద్రాక్షరములను గూడ విక్రయింప నుద్దేశించుకొంటినిగాని రాజమహేంద్రవరములోని మిత్రులు దానిని తెమ్మని కోరినందున మున్నూఱురూపాయ లయోమార్గభృతి నిచ్చి తీసికొనివచ్చితిని. ఈ ప్రకారముగా చెన్నపురిలో నాకున్న వన్నియు నమ్మివేసి 1905-వ సంవత్సరములో మరల స్వస్థలమయిన రాజమహేంద్రవరము చేరితిని.

# రెండవ ప్రకరణము

## గ్రంథకర్తృదశ



**1870 వ సం॥ మొదలు 1900 వ సం॥ వఱకు.**

నేను పాఠశాలలో నాలవ తరగతిలో చదువుకొనుచుండి నప్పటినుండియు తెలుఁగులో తెలివిగలవాఁడ నని యొకవాడుక యుండెను. అప్పటి మా యాంధ్రోపాధ్యాయులైన పులిపాక గురుమూర్తి శాస్త్రులుగారికిని నాపై నట్టి యభిప్రాయమే యుండి మా తరగతి తెలుఁగుపాఠములను నాచేతనే బాలురకు తఱచుగా చెప్పించుచుండెడివారు; మా పయితరగతిలోని విద్యార్థులును తమ పఠనీయ గ్రంథములను తెలియనిచోట్ల నాచేత చెప్పించుకొను చుండెడివారు. మా తరగతికి భాషాంతరీకరణమును నేర్పెడి యుపాధ్యాయులు నేనుచేసిన భాషాంతరమును జూచి మెచ్చుకొనుచుండెడివారు. అందుచేత "నిరస్తపాదపే దేశే ఏరండోఽపి ద్రుమాయతే" * యన్నట్లు చదువులేనివారిలో నేనే పండితుఁడనయి నాయల్పపాండిత్యమును వెల్లడించుటకయి యేదైన వ్రాయవలెనని తలఁచితిని. ఆకాలమునందు పద్యములు చేసినవారికే కాని వచనము వ్రాసినవారికి గౌరవము లేదు. వినోదార్థము శతకములను కావ్యములను చదివినప్పు డాప్రకారముగా నేనును పద్యములుచేసి గ్రంథములను రచియింప వలె

* చెట్టులేని దేశములో ఆముదపుచెట్టే మహావృక్షము.

నన్నయామాశ నాకు లోలోపల నుదయించుచుండెను. మనస్సులోనొక సంకల్పము పుట్టఁగానే శక్యాశక్య విచారము చేయక దానిని చేయ నారంభించెడు స్వభావము నాకు మొదటినుండియు నుండెను. నాస్వాభావిక చిత్తవృత్తిని మరలించుకోలేక ఛందస్సు నేర్చుకొని పెద్దపెద్ద మాటలతో పద్యములనల్ల నారంభించితిని. అప్పటి నామూఢభక్తిననుసరించి నేను చేసినవి మార్కండేయ శతకము గోపాల శతకమును. 'కందము చేసినవాఁడు కవి' యని యొక వాడుక యుండుటచేత నీరెండు శతకములను కందపద్యములతోనే చేసితిని: నేనప్పుడు మూఢభక్తిగల విగ్రహారాధకుఁడనే యైనను పక్షపాతము లేక నాభక్తి శివకేశవులయందు సమానముగానే యుండెను. కఠినమైన పనికి వెనుకతీయకుండుట నా కింకొక స్వభావము. మొదటిశతకములో నంత్యభాగమును "మార్కండేయా" యని వేసికొని ప్రతిపద్య చతుర్థ చరణమును మకారముతోడ మైత్రిగల యక్షరముతో నారంభించెడు కష్టము నొకదానిని పెట్టుకొని శతకము నెట్లో పూర్తిచేసితిని. ఈ శతకము ముగిసిన తరువాత మఱికొంత ధైర్యము నవలంబించి రెండవదియైన గోపాలశతకముయొక్క యవసానమును "శ్రీరాజమహేంద్రవరపురీ గోపాలా" యని వేసికొని ప్రతిపద్యమును రకారప్రాసముతోఁ జేయవలసిన యెక్కువకష్టమును బెట్టుకొంటిని. ఈ శతకమును సహితమెట్లో ముగించితిని. చిన్నతనములో చేసిన ప్రథమ కవిత్వమెట్లుండునో తెలిసికొనుటకైన నవకాశము లేకుండ చిరకాలము క్రిందటనే యీరెండుశతకములు నశించెనుగాని యవి తప్పక తప్పుల తడికలయి యుండును. అభాగ్యోపాఖ్యానములో వేసియుండుటచేత రెండవ శతకములోని యీక్రిందిపద్య మొక్కటిమాత్ర మిప్పుడు నిలిచియున్నది.

క. శ్రీరమణీహృల్లోలా !
కారుణ్యలతాలవాల కాంచనచేలా !
ఘోరాహవజయశీలా !
శ్రీరాజమహేంద్రవర పురీగోపాలా !

రాజమహేంద్రవరములోనున్న శివునకు మార్కండేయస్వామి యనియు విష్ణునకు వేణుగోపాలస్వామియనియు నామధేయములు. ఈశతకములను జదివిన యప్పటి నామిత్రులు మాత్రము నాకవనమును మెచ్చుకొనిరి. అప్పటి నామిత్రులు నాకంటెను తక్కువచదువుగల తోడి విద్యార్థులు. మెచ్చుకొన్న వా రెట్టివారయినను వారి శ్లాఘనలవలన కొంత యుత్సాహము గలవాఁడనయి మఱింత కఠినమైన కావ్యమును రచియించుట కున్ముఖుఁ డనైతిని. మాపాఠశాలలో పలుమాఱు పఠించుచువచ్చిన మిశ్రకావ్యమయిన భారతములోని నలచరిత్రమును శుద్ధాంధ్రచంపూకావ్యమునుగాఁ జేయ నుపక్రమించితిని. అది కొంచెము చేసిన తరువాత నందులో విశేషమేదియు లేదనియు, ఈవఱకెవ్వరును త్రొక్కని క్రొత్తత్రోవ త్రొక్కవలెననియు, నామనస్సునకు తోఁచినది. (అచ్చతెలుఁగు గ్రంథములను పొన్నిగంటి తెలగనార్యుఁడును కూచిమంచి తిమ్మకవియు మాత్రమే రచియించిరి. నిర్వచన గ్రంథము నొక్క తిక్కన సోమయాజి రచియించెను, నిరోష్ఠ్య గ్రంథముల నిద్దఱు కవులు మాత్రమే చేసిరి. ఈ మూఁడు విధములైన ప్రయాసములను సమీకరింపఁజేసి యేకగ్రంథమునం దిముడ్చుట యెక్కువ ప్రశంసనీయమని తలఁచి, మొదటచేసిన పద్యములను తీసివేసి శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధమను పేర గ్రంథరచన కారంభించి ముగించితిని.) ఇన్ని నిర్బంధములతో తుదముట్టించిన గ్రంథము, పడిన కష్టమునకు మాత్రము పొగడఁదగియుండునుగాని, యర్థసారస్యాది యోగ్యతలచేత నెంతమాత్రమును పొగడఁ

దగినదిగా నుండనేరదు. అయినను సర్వకళాశాలవా రంగీకరించి దీనిని పట్టపరీక్షకు పఠనీయ గ్రంథముగా నిర్ణయించి యున్నారు. ఈ నియమములు పెట్టుకొనక యథేచ్ఛముగా కవితా ప్రవాహమును సాగ నిచ్చినచో నెక్కువ హృద్యముగా నుంచియుండవచ్చును గాని యిన్ని నిర్బంధములతో నింతకంటె నెక్కువ రమ్యముగా రచించుట నావంటి యారంభకునకు సాధ్యముకాదు. ఇందలి కవిత్వరీతిని జూపుటకయి రెండుపద్యముల నిందుదాహరించుచున్నాను.

సీ. ఎల్లచో నారాక కెదురు చూచుచునుండు
నెలనాఁగ యెద నెంత తలఁకె నొక్కొ!
యేరేయు న న్నింటి నిలుదాఁటనీకుండు
కన్నతల్లి యదెంత కలఁగె నొక్కొ!
తోడునీడలలాగు తొలఁగని చెలికాండ్రు
సోలి నన్గన కెంత తూలిరొక్కొ!
నేఁ జేరుట యెఱింగి నెనరునఁ జనుదెంచు
కొడుకులు తా రెంత కుంది రొక్కొ!
కూడి యెల్లరిది తెలిసికొన్న యంతఁ
గటకటా! తాత! నీచేతఁ గడకు నేఁడు
చిక్కఁగాఁ జేసె నే నెద్ది చేయు టెంక!
హాళి నన్నేలుజేఁడ! నే ననద నైతి.

చ. చిలుకలకొల్కి యక్కరణిఁ జెన్నుగఁ జుట్టలయొద్ద నుండియున్
నలు నెదలోఁ దలంచుచు ననల్ తలఁదాల్చక నేల సెజ్జగా
నలయురచీరతో నొడలనంటి తొలంగనిధూళితోఁ గనుం
గొలుకులనీటితో నెసఁగె గూరుకు చెందని కన్నుదోయితోన్.

ఈ గ్రంథము నారంభించినప్పుడే మిశ్రప్రబంధము నొక్కదాని నారంభించి రసికజనమనోరంజనమను పేర చిత్రాంగదాపరిణయములో

రెండాశ్వాసములు రచియించితిని. దీనిని నాక్రింది తరగతిలో చదువు కొనుచుండిన నామిత్రులయిన కనపర్తి యోగానందముగారు నామా తృకనుజూచి శుద్ధప్రతిని వ్రాసిరి. అంతవఱకు చేసినతరువాతఁ దెలుఁగు మిశ్రప్రబంధములు నూఱులకొలఁది నున్నప్పుడు డిది వానిలో నొక్కటి యగునుగాని దీనికాధిక్యమేమి కలుగఁబోవునను బుద్ధిపుట్టి దీనిఁనచ్చ తెలుఁగులోనికి మార్చినచో శ్లాఘ్యతరముగా నుండునని భావించి సాధ్యమైనంతవఱ కాపద్యములను తెలిఁగించియు సాధ్యముకానిచోట్ల క్రొత్తపద్యములను రచించియు నైదాశ్వాసముల శుద్ధాంధ్రప్రబంధ మును జేసితిని. దీనిని జూచినవా రచ్చతెలుఁగులో నిటువంటి ప్రబం ధము వేఱొకటిలేదని మెచ్చుకొనఁజొచ్చిరి. కడపటి యాశ్వాసమును దక్క మిగిలినదానినంతటిని నేను సర్వకళాశాలాప్రవేశపరీక్షకు చదు వుచుండిన కాలములోనే చేసితిని. తక్కిన శృంగార ప్రబంధముల యందువలెనే దీనియందును శృంగారరస మతి విస్తారముగానున్నది. ఆకాలమునందు నేనువసుచరిత్రము మొదలైన శృంగారప్రబంధముల నమితముగా చదివియుండినందున పూర్వగ్రంథకర్తలు చూపినమార్గ మునే నే ననుసరించి దీనిని జేసితిని. ఇందు నాక్రొత్తకల్పనలును విశే షముగా నున్నవి. దీని నిప్పటికిని పండితులు మొదలైనవారు మెచ్చు చున్నారు. సర్వకళాశాలవారు ప్రథమశాస్త్రపరీక్షకుం దీనినిపఠనీయ గ్రంథముగాఁ జేసిరి. "అచ్చతెనుఁగు రామాయణము పాకముకంటెఁ దమ యచ్చతెనుఁగు గ్రంథముయొక్క పాకము మేలయిన దని నా నిజమయిన యభిప్రాయము." అని శబ్దరత్నాకరనిఘంటువును జేసిన బహుజనపల్లి సీతారామాచార్యులుగారును, ఇతరపండితు లనేకులును దీనిపై సదభిప్రాయముల నిచ్చియున్నారు. ఐనను నే నటువంటి శృం గార ప్రబంధముల కామోదింపను. ఇప్పుడు పద్యకావ్యమును రచి యింపవలసి యుండినయెడల నే నిట్టి శృంగారకావ్యమును రచియించి

యుండను. ఇప్పుడు కూర్పఁబడుచున్న నాసంపుటములలో నా చిన్నతనపు పద్యకావ్యములలోని మృదువు తప్పినవాక్యములను పద్యములను దీసివేయుచున్నాను. ఇది యచ్చతెలుఁగుపుస్తక మయినను చెప్పకపోయినపక్షమునఁ జదివెడువారిఁ కిది యచ్చతెనుఁగుగా గనఁబడక మిశ్రకావ్యమువలె ధారాళముగా నడుచును. అప్పటిశైలిని దెలియఁ జేయుటకయి యిందులో పద్యములను గొన్నిటి నిందు క్రిందఁ బొందుపఱుచుచున్నాను.

చ. పలుకులలాగు నెమ్మొగముబాగును మీసముసాగు నొక్కలై
యులపుట కోర్తె యబ్రపడి యప్పటిపాఱునిగా నెఱింగి నె
చ్చెలిగమిఁ జీరి చెప్పె మన చెంగట మున్ బువ్వుఁదోఁట నేఱిమిం
బలికిన యల్లబూటకపుమాటలమాట యితండె యంచటన్.

చ. ముఱుగులు జాఱఁ జెమ్మటలు ముద్దుమొగంబునఁ గాఱ ముత్యపు
న్సరు లొకయోరఁ జేరఁ జిఱునవ్వులు మొల్కలుదేఱ నంటుఁజో
ళ్ళిరుదెసలందుఁ జెక్కులపయి న్వడిఁ దూగుచు డాలువాఱ నా
దొర తలఁబ్రాలు పోసె నలతొయ్యలియాఁదలమీఁద దోయిటన్.

ఉ. గుట్టునఁ జేడె వీడకుగఁ గోరిక లీరికలెత్తి నోటికిం
దొట్టిన యంతఁ బంతమున దోసపు సిగ్గొక టడ్డువచ్చి నన్
గట్టిగ నోరునొక్కఁ దమి గన్పడనీయక కట్టిపెట్టి యా
పట్టున రాచనీటు కనుపట్టఁగ వట్టిమెఱుంగు పెట్టితిన్.

సీ. కప్పుకొప్పులనుండి కాఱుచుండెడునీరు
చిఱుతమబ్బులవానచినుకులట్లు
గబ్బిగుబ్బలనుండి కాఱుచుండెడునీరు
బలితంపుమలల పెన్వాకలట్లు
కమ్మమోములనుండి కాఱుచుండెడునీరు
సొగసుచందురు మంచుసోనలట్లు

కలికికన్నులనుండి కాఱుచుండెడునీరు
నెత్తమ్మిపూవుఁ దేనియలయట్లు

గీ. వాతెఱలనుండి తఱ జాలువాఱునీరు,
పలుచనగు దొండపండులపాలయట్లు,
వింతవింతలఁ దనరెఁ గన్విందుగాఁగ,
లేమ లట నీటిలో మున్గి లేచునపుడు.

గీ. పడఁతిమిన్నలు కొలఁకు వెల్వడెడునప్పు
డొడల నంటిన నీటిబొట్లొప్పు మీఁదె
నేవళంబుగఁ బెరుఁగు క్రొంకీవగిములు
మొగ్గతొడిగినకై వడి ముద్దు గులుక.

చ. ఒరులకుఁ జేర దవ్వగుచు నొజ్జలకొంపను నీపి తమ్ములం
గరము బడల్పడం బఱపి కాంచినతండ్రికిఁ బోటు తెచ్చి సం
కరతన మల్ల చిన్నపుడె కాంచి కరంబును నీవు గేయిద్రి
మ్మరివని పేరు పొంది యిఁక మన్ననఁ జూతువె యాఁడువారలన్

ఉ. వీఁడుగదమ్మ నావలపు వీక్షఁడి చేసినవాఁడు, పొన్నపూ
వీడుగదమ్మ లోఁతయిన యీతని పొక్కిలి, కింక నావెతల్
వీడుఁగదమ్మ నన్నిపుడు వేయెదఁ జేర్చిన, నీతఁ డున్న యీ
వీడుగదమ్మ నేలఁగల వీడులలోపల మేటి బోటిరో!

ఉ. ఈ రిటుపల్కఁ గల్కి యన నెవ్వతె? మేమన నెవ్వరయ్య? మీ
వారము గామె యందఱము? వారల వీరల నట్లు మమ్మునన్
వేఱుగఁ జేయ మీకుఁ దగునే? యిది యిట్లనుచెల్ల మాదెసన్
గూరిమికల్గుకై వడియొ? నూఱును మీకడ నింక నేటికిఁ?

ఉ. చాలరొ! పోలు పొం డెఱుఁగఁజాలక యూరకకుందనేల? 'మె
ద్దీన వనంగఁ గొట్టమున నీవలిగుంజను గట్టు' మన్న నే

మైనను జెప్పఁగాఁ దరమె? యాతఁడు నాఁడటు మాఱు పల్కకే
మానిన దానికిం గతము మన్నన విన్నను గాక నాకిటన్.

శా. నేలం గల్గుపులుంగు లెల్ల నెపుడున్ జెల్వారఁ బల్కంగ నే
నేలా పల్కఁగ నేరనైతి నని యెంతేఁ గెంపుకన్నుల్గు తా
లోలోనం దలపోసి నేర్చె నవలాలోఁ జేరి కాదంటి రే
నేలా కోయిలపల్కులంత్రపు వినువారెల్లం బుపుంబోడికిన్?

ఈపుస్తకమును శ్లాఘించినట్లే దీని తరువాత నేను జేయ నారంభించిన శుద్ధాంధ్రోత్తరరామాయణమును సహితము పత్రికాధిపతులును పండితులును పలువిధముల శ్లాఘించుచు వచ్చిరి. ఆకాలమున కృష్ణామండలములోని బృందావనపురమునందు ప్రకటింపఁబడుచుండిన పురుసార్థప్రదాయినీ పత్రిక నా శుద్ధాంధ్రోత్తరరామాయణములోని పద్యములను కొన్నిటిని ప్రకటించి వానిక్రింద 1872 వ సంవత్సరము మెయి నెలలో వ్రాసిన యభిప్రాయములోని కొన్ని పంక్తుల నిందుదాహరించుచున్నాను.

"ఈ పద్యములు అచ్చతెలుఁగుభాషయందు మధురమైన కదళీపాకమున నాతికఠినముగా పదగుంభనయును యుక్తిచమత్కారములును గలిగి రసయుక్తమగునటుల బహుసరసముగ రచింపఁబడినవి. కవిత్వము బహు జాతీయముగాను, మృదువుగాను, సరసముగాను, ఉన్నదని ఇచ్చటి గొప్ప పండితులును శాస్త్రజ్ఞులును కవీశ్వరులును వక్కాణించియున్నారు. నిశ్చయముగా నిది సరసమయిన పండితకవిత్వము."

"The above beautiful verses (from Andhra Uttara Ramayanam) composed with propriety and taste in pure Telugu Language, which emanated from the poetical genius of Kandukuri Viresaligam Garu (who has also a fair knowledge of English) are worthy of praise from all who have any taste for poetry.

"They are written sweetly in a superior kind of flowing and pleasing style. So consider our pundits here, and we add that if all the works (named above) of our young poet be published, they form an interesting and a very good addition to our refined sweet Telugu Literature. They also reflect much credit on their able author in these days when original Telugu works of standard merits (either in poetry or prose) or of so rare a production. When all the works of Viresalingam Garu only complete their publication we are sure his name will be well remembered by all with reverence and be associated with the poets and worthies of the Telugu Literature."

—*Purushartha Prathaini May 1872.*

1870-వ సంవత్సరమునందు రాజమహేంద్రవరములోని దొరతనమువారిపాఠశాలకు బాన్ దొరగారు ప్రధానోపాధ్యాయులుగా నుండి గోదావరీ విద్యాప్రబోధిని (The Godavary Educationist) యను మాసపత్రికను నడిపెడువారు. ఆ సంవత్సరమునందు నేను ప్రవేశపరీక్షకుం జదువుచు బాన్ దొరగారికిని మఱియొకదొరగారికిని తెలుఁగు చెప్పి నెల కిరువదియైదు రూపాయలు సంపాదించుచు, గోదావరీవిద్యాప్రబోధినిలోం దెలుఁగుభాగమునకు వ్రాయుచుండెడివాఁడను. ఆసంవత్సరముననే నేను ప్రవేశపరీక్షయందుం గృతార్థుఁడ నయి, పాఠశాలయం దుపాధ్యాయపదమునందుఁ గుదిరియుండియు నేను పదిగద్యములను వ్రాయుచుండుట మానలేదు 1872-వసంవత్సరమునందు నేను కోరంగిలో నాంగ్లోదేశభాషాపాఠశాలకు ప్రధానోపాధ్యాయుఁడనుగానుండి శుద్ధాంధ్రోత్తరరామాయణమును రచియింప నారంభించి క్రొత్తగా బృందావనపురమునంద (Masulipatam) స్థాపింపఁబడిన పురుషార్థప్రదాయినికి పద్యములన బంపుచుంటిని. నాపద్యములను జదివి మెచ్చుకొని పలువురు నన్నభినవతిక్కన మొదలైన నామములతో లేనిపోని స్తోత్రములను జేయ నారంభించిరి. అప్పటికి నాకు పరిచితులయి బందరులో ప్రథమశాస్త్రి

పరీక్షకుం జదువుచుండిన బ్రహ్మశ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు 1872-వ సంవత్సరము జూలయి నెలలో నాకు వ్రాసిన ప్రథమ లేఖలో నీ క్రిందివాక్యములను వ్రాసియున్నారు.

"భవదీయ స్తవనీయకవితాధౌరంధర్యము ప్రతిమాసమునఁ బురుషార్థప్రదాయినీముఖమునఁ జూచుచున్నాఁడ. తారు పాఠశాలాప్రధానోపాధ్యాయులరయి యుండియు, గొలంది తీఱిక చేసికొని నిజభాషాభివర్ధనాభిలషమానులై సౌజన్యపూర్ణులైన యెల్లరచే మెప్పొందఁబడుచున్నప్పుడు నాకొనియాట సముద్రపుకాకికెట్లుం బోల వెల్లు?.....ఇట నేను 73-వ F A కుఁ జదువుచున్నాఁడ. దీనుఁడ నగు నన్ను మీ స్నేహితకోటిలోఁ జేర్చుకొనవలెను"

వా. వాసుదేవశాస్త్రి.

ఈ కోరంగిలోనున్న కాలములో నేను సంగ్రహవ్యాకరణమును, పద్యరూపమున నీతిచంద్రికను, చేసి ముద్రింపించితిని. అవఱకు పాఠశాలలో బాలురకు సులభముగా బోధింప తెలుఁగు వ్యాకరణ మేదియు లేదు. ఉన్నవి సంజ్ఞాపరిచ్ఛేదము, సంధిపరిచ్ఛేదము, అజంతపరిచ్ఛేదము, హలంతపరిచ్ఛేదము, క్రియాపరిచ్ఛేదము, అని యైదుభాగములనుగల యీ కాలమునకుఁ దగని పురాతన పద్ధతిని వ్రాయఁబడినవయి యున్నవి. సంజ్ఞాపరిచ్ఛేదములో ప్రథమేతర విభక్తులు శత్రర్థక చువర్ణకము మొదలైనవి ద్రుతప్రకృతికములని చెప్పఁబడినప్పుడు అజంతపరిచ్ఛేదము చదివినఁగాని విభక్తులేవో క్రియాపరిచ్ఛేదమును చదివినఁగాని శత్రర్థక మేదో బాలురకు బోధపడదు. కాని ముందుగానే యజంతపరిచ్ఛేదమునో క్రియాపరిచ్ఛేదమునో చెప్పరాదా యన్న, చువర్ణకము పరమగునప్పు డుకార ఋకారాంతములకు నగాగమంబగునని యజంతపరిచ్ఛేద మారంభించినచో సంధిపరిచ్ఛేదము ముందుగా చదివినఁగాని యాగమ మనఁగా

నేమో తెలియదు. సంధిపరిచ్ఛేదమే ముం దారంభింతమన్నను క్త్వార్థక ఇకారమునకు సంధి లేదనుచో క్రియాపరిచ్ఛేదము చదివినఁ గాని క్త్వార్థక మన నేదో తెలియదు. ఇట్టివంటిచిక్కులను వదలించి (బాలురకు సుబోధ మగునట్లుగా వర్ణపరిచ్ఛేదము, పదపరిచ్ఛేదము, వాక్యపరిచ్ఛేదము, కావ్యపరిచ్ఛేదము, అని యింగ్లీషుపద్ధతి ననుసరించి నేను సంగ్రహవ్యాకరణము చేసితిని.) క్రొత్తపద్ధతి పూర్వాచారము ననుసరింప నలవాటుపడినవారికిని పండితులకును సరిపడదు. అప్పుడు పాఠశాలలోఁ బెట్టుటకయి విద్యావిచారణాధికారి పుస్తకముల నంగీకరింపవలసినపనిలేదు. పాఠశాలానిర్వాహకులు స్వతంత్రించి తమ మనసువచ్చిన పుస్తకములను తమ పాఠశాలలో పెట్టుకొనవచ్చును గాని పెట్టుకొనుటకు పుస్తకములు లేవు. పాఠశాలా పరీక్షకులు పెట్టుమని చెప్పిన పుస్తకములనే పాఠశాలా నిర్వాహకులు సాధారణముగా పెట్టుచుందురు. అప్పుడు గ్రాంటుదొరగా రుత్తరమండలముల పాఠశాలా పరీక్షకులు. ఆయన కోపస్వభావులయి తనక్రింది యుద్యోగస్థులమీఁదను పాఠశాలల యుపాధ్యాయుల మీఁదను కేకలు వేయుచుండెడివారు. ఆయన నేను ప్రధానోపాధ్యాయుఁడనైన కొంత కాలమునకే ధవళేశ్వరము పాఠశాలను పరీక్షించుటకు వచ్చిరి. ఆయన ద్వితీయోపాధ్యాయుఁడు క్షేత్రగణితము నేర్పుచున్న తరగతికిఁ బోయి యొకప్రతిజ్ఞనిచ్చి దానిని పలకమీఁద చేసి చూపుఁడని విద్యార్థుల నడిగెను. వారు చేయలేక తప్పిపోయిరి. నల్లబల్లమీఁద దానిని వేసి విద్యార్థులకు చూపుమని దొరగారు నన్నడిగిరి. ఆపాఠము ద్వితీయోపాధ్యాయుఁడు పుచ్చుకొనునదిగాన చేసిచూపవలసినవాఁ డతఁడని నేను చెప్పితిని. 'కాదు నీవే చూపవలసిన' దని నన్నాయన నియమించెను. నేను చూపనని నిశ్చయముగా నిరాకరించితిని. ఈ సంగతి నాయన తనస్మరణ పుస్తకములో వ్రాసికొనెను. అంతకుమునుపే

యింకొక వ్యతిక్రమము జరిగినది. పాఠశాలలో దొరగారొక్కరు కూరుచుండుటయు, ఉపాధ్యాయులు మొదలయినవారు నిలుచుండుటయు, ఆచారము. నేనాప్రకారముగా చేయక పరిచారకునిచేత కుర్చీ తెప్పించి వేయించుకొని యాయన నరసనే కూరుచుంటిని. పాఠశాలా పరీక్ష యయినతరువాత దొరగారు నాతో కొంతసేపు మాటాడిరి. నావర్తనమునుబట్టి దొరగారికి నాయందు కొంత యనిష్టము కలిగినను నాస్వతంత్రస్వభావమునకు సంతోషించి నా వ్యాకరణమును పాఠశాలలలో పెట్టుటకు కార్యనిర్వాహకుల కుత్తరవు చేసెను. అందుచేత నా వ్యాకరణముయొక్క మొదటికూర్పంతయు నల్పకాలములోనే యమ్ముడుపోయెను. ఆపుస్తక మిప్పుడును మన దేశమునందలి పాఠశాలలో మాత్రమే కాక నైజామురాజ్యమునందును వాడఁబడుచున్నది.

నీతిదీపిక యీ కాలమున కనుకూలమయిన నీతులనుగలదయి క్రింది తరగతులలోని బాలురకొఱకు సులభమైన గీతపద్యములలో వ్రాయఁబడినది. ఇదియు బహుకాలము పాఠశాలలయం దుపయోగింపఁబడినది. అందులోని పద్యములు కొన్ని యిందు క్రింద నుదాహరింపఁ బడుచున్నవి.

గీ. అన్నవస్త్రాదులకు నైన నధికమైన
భోగభాగ్యంబులకు నైన భూమిమీఁద
నొరులనే నమ్ముకొని యెప్పు డుండరాదు
తనదు చేతుల నమ్ముంగఁజనునుగాని.

గీ. తాత ముత్తాత లెంతెంత ధనము కూడఁ
బెట్టి, పెట్టెలునిండఁగఁ బెట్టియున్నఁ
గష్టపడి, తాను న్యాయమార్గమునఁ బడయు
స్వార్జితం బొకగవ్వతో సమము గాదు.

ఆ. వె. పరులు నీకు నెట్లు వాంఛింతువో చేయఁ
బరుల కట్లు చేయవలయు నీవు;
సర్వశాస్త్రములను జర్చింపఁ దేలెడు
సారమైన ధర్మసరణి యిదియె.

నేను వచనమువలెనే పద్యములనుగూడ తడవుకోకుండ వ్రాసిన దానిని మరల శుద్ధముగా వ్రాయవలసిన యావశ్యకము లేకుండ నత్యంత శీఘ్రముగా వ్రాయఁగలిగెడు వాఁడను. స్త్రీవిద్యావిషయమయి పురుషార్థప్రదాయినిలో జరిగిన వాదప్రతివాదములలో ప్రతిపక్షులు దినములకొలఁది నాలోచించి చేసిన పద్యములకు నే నొక్క దినములో పద్యరూపమునఁ బ్రత్యుత్తరము వ్రాసి పంపఁగలిగెడివాఁడను. ఇట్లాశువుగాఁ జెప్పిన యాపద్యములలో నొకసారి బంధకవిత్వమును గర్భకవిత్వమును గూడఁ జొప్పించితిని. పురుషార్థప్రదాయినిలోఁ బ్రకటింపఁబడిన యాపద్యములలోఁ గొన్నిటి నిందుక్రింద నుదాహరించుచున్నాను.

మత్తేభవిక్రీడిత కందగర్భసీసము.

సీ. వినయమొప్పారఁగ విన్నవించెద నిదే
న్యాయంబుగాఁ జూచి మీరెడఁ గను
సదయలీలం దగ సారసాననల వి
ద్యాసంవివాదంబులో సరళిగ
విజయ మెవ్వారికి వీఁకమైఁ గలిగెనో
సామాన్యధీమైఁ సుధీమదేభ
నిచయము మెచ్చఁగ నీతితో నుడువుఁడీ
జాల్పాకులై సజ్జను ల్పొసంగ
గీ. వెలఁదులకు విద్యకూడదు కలుగు నఘము
దాన నిజముగా నని యనఁ దా రెలమిని

దలపడినను నార్యులు చెప్పుపలుకులనె వ
లయును గనఁబఱుప న్నాకు లక్ష్యములుగ.

(పయిపద్యములోని) గర్భమత్తేభము.

మ. సయమొప్పారఁగ విన్నవించెద నిదే న్యాయంబుగాఁ జూచి మీ
దయ శీలం దగనారసాననల విద్యాసంవివాదంబులో
జయ మెవ్వారికి పేర్కమైఁ గలిగెనో సామాన్యధీమై సుధీ
చయము ల్మెచ్చఁగ నీతితో నుడువుఁడీ జాల్పాకు లై సజ్జనుల్.

గర్భకందము.

క. నెలఁతుకలకు విద్య కూడదు
కలుగు నఘము దాన నిజముగా నని యనఁ దా
రెలమినిఁ దలపడినను నా
ర్యులు చెప్పు పలుకులనె వలయును గనఁ బఱుపన్.

♦ ♦ .

సుగంధి. వారు ము న్నుదాహరించి వ్రాసినట్టి శ్లోకమం
దారఁ జూపినారు విద్యయున్నదంబు వింతగా
నారయంగ నేలయింక నట్లు సందియంబు పో
నేరు పొప్పఁ బూడియున్న నిగ్గు దెల్లగింపఁగాన్.

చిత్రపదము. కొమ్మలవిద్యకు స్వాతం
త్ర్యమ్మునకుం దగు సంబం
ధమ్ము త్రిదండికి సంసా
రమ్మునకుం గలమాడ్కిన్.

అచ్చతెలుఁగు.

సీ. ముద్దియవిద్దియ మున్నున్న దంటకుఁ
గబ్బము ల్పెక్కు లాణ్కాణ గాఁగఁ

జూపితిఁ గాదన నోపెద రేనియుఁ
జేతనైనంతయుఁ జేయవలయుఁ
గాకది పోనాడి కన్నులపాటలఁ
దప్పినంబులు గొప్పకప్ప లనుచు
నిప్పటివాదున కేమియుఁ బొసఁగని
చప్పిడిసుద్దులఁ జమవు టేల?
చదువకుండినయంతనె చాన లెల్ల
ఱంకుటాండ్రౌదురని మున్ను ఱంపు చేసి
యన్నవా రెవ్వరో వారి నడుగ వలయు
నేను విద్దెచే నెలిచవి మానునంటి.

ఉ. ఏమిటికీ వృథాచలము లింతటి కన్నియ విద్య నీకఁ గా
లామృత మాదిగా మిగిలె నందును గాదన నేల చారు పదం
గామిని కక్షరాభ్యసనకార్యము కల్గుట దానిఁ గాంచి తా
రీమఱి పూర్వనాగరికు లేమనియందురొ చూత మీపయిన్.

కందము గోమూత్రికాబంధము.

క. వారిఁగ వీరిఁగఁ గొనినను
వారలు మఱిగూయఁ దగదు వాదముపోలన్
గోరిన వీఁకఁగడు నిలను
గారవ మగుఁగూడ దసదుగాఁ ధలపోయన్.

కూచిమంచి తిమ్మకవి తెలిగింపఁగా మిగిలిన రామాయణములోని యుత్తరకాండమును శుద్ధాంధ్రోత్తర రామాయణమను పేర తెనిఁగించి శుద్ధాంధ్రభారతమను పేర మహాభారతమనంతయు నచ్చతెనుఁగున రచియింపవలె నని యెంచి సభాపర్వము నారంభించి దానిలోఁ గొంతభాగము నాంధ్రభాషాసంజీవనిలోఁ బ్రకటించితిని. ఈ బుద్ధి యీప్రకారముగానే యుండియుండినయెడల మహాభారత

మంత్రగ్రంథమును పద్యములతో నింపియుందునేమో కాని యింతలో నాబుద్ధి మాఱి యింకొకసంకకు మరలినది. (తెలుఁగులో వచనకావ్యములంతగాలేవు.) వచనకావ్యమని చెప్పఁదగినది చిన్నయసూరిగారి నీతిచంద్రిక యొకటి యున్నది; అదియు పూర్తిగాక యర్ధమే యయి యున్నది. విక్రమార్కుని కథలు, పంచతంత్రము, కాశీమజిలీలు, అను గ్రామ్యగ్రంథములు కొన్ని యున్నను వానిని పామరులే కాని పండితులు చదువకుండిరి. ఈ స్థితిని విచారింపఁగాఁ దెనుఁగులో పద్యకావ్యములకంటె వచనకావ్యములను వ్రాయుట యెక్కువ యుపయోగకరమని నాకు తోఁచినది. ఈ యాలోచన మనస్సులో పుట్టఁగానే నాకాలమును వచనకావ్యరచనయం దుపయోగించవలెనని నిశ్చయించుకొని సగము సగము వ్రాసియున్న పద్యకావ్యములను విడిచి (నీతిచంద్రిక యుత్తరార్ధమును పూరించుట కుపక్రమించి విగ్రహమును వ్రాసి ముగించితిని.) ఇంతలో బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారు విగ్రహతంత్రమును వ్రాసి ప్రచురించిరని వార్తాపత్రికల వలనఁ దెలిసికొంటిని. నేను పడిన ప్రయాసమంతయు వృథాపోయెను గదాయని యప్పుడు నామనస్సున కెంతో సంతాపము కలిగెను. రచించిన పుస్తకమును ముద్రింపక మూలపడవేయవలెనని నేను మొదట చింతించినను పంతులువారి విగ్రహమును గొని యామూలాగ్రముగాఁ జదివినపిమ్మట కథాభాగములో కొంత తప్ప వారి పుస్తకమునకును నాగ్రంథమునకును సంబంధము లేదనియు వారిపుస్తకమున్నను నాపుస్తకము కూడ ముద్రింపఁదగినదేయనియు, తోఁచినందున, దానిని చెన్నపురిలోని కళారత్నాకర ముద్రాక్షరశాలయందు 1874-వ సంవత్సరాంతమున ముద్రింపించి ప్రచురించితిని. నాపుస్తకమును జూచినవారి కందఱికిని దానియందు మంచి యభిప్రాయమే కలుగ నారంభించినది. చెన్నపురి క్రైస్తవకళాశాలలో

గణితశాస్త్రోపన్యాసకుండును, దేశభాషాపర్యవేక్షకుండు నైన సమర్థి రంగయ్యసెట్టి బి.యే. గారు నేను కోరకయే నాపుస్తకమును తమకళాశాలలో పాఠ్యపుస్తకముగాఁ బెట్టిరి. అవఱకు నా కాయనతోడి పరిచయములేదు. పుస్తకమును పాఠముగాఁ బెట్టించి నాకు ప్రోత్సాహము కలిగించినందుకు సంతోషించి నే నాయనకు కృతజ్ఞతాపూర్వకములయిన వందనముల నర్పించుచు నా ప్రథమలేఖను వ్రాసితిని. దానికుత్తరముగా శ్రీ రంగయ్యసెట్టిగారు 1875 వ సంవత్సరము ఫిబ్రువరి 8 వ తేదిని చెన్నపట్టణమునుండి నాకిట్లు వ్రాసిరి.

" My dear sir,

Kindly allow me to call you so. I have just received your letter of the 3rd instant. Therein you speak as if I had done you a bit of favour in introducing your book into my school. But you are mistaken. The truth is that you are under no obligation to me, for I introduced the book not out of any favour, but on its real merits I have already glanced over a few pages and felt and still feel proud to have such a master-piece as your book in the Telugu Literature. Consequently I am much obliged to you for the liberal interpretation you kindly put on my introducing the book into my school. Let me assure, I will spare no pains to speak to my friends, particularly Mr. Seshayengar of the presidency College about your book. I can advise you to place a few copies under my disposal so that I may send them to my friends in the Mofussil asking them to introduce the same in the respective schools under their charge.• I am very glad you possess a very fair knowledge of English to your High Proficiency in Telugu. You ask me to excuse you for mistakes you might have committed in your letter. I challenge my B.A boys to write as well as you have done. Can you not undertake the writing of an original Novel in Telugu ? More in my next. No time. Excuse.

I am yours faithfully,
S. RANGIAH CHETTY."

(నా ప్రియార్యా,

మిమ్మిట్లు పిలుచుటకు దయచేసి యంగీకరింపుఁడు. 3-వ తేదీని మీరు వ్రాసినయుత్తరము నాకిప్పుడే యందినది. మీ పుస్తకము నాపాఠశాలలో పెట్టించుటలో నే నేమో మీ కుపకారలేశము చేసినట్లు దానిలో మీ రనుచున్నారు. ఏదో యనుగ్రహము చూపుటకుఁగాక దాని నిజమైన యోగ్యతల మీఁదనే పుస్తకమును నేను పెట్టితినిగాన మీరు నా కుపకారఋణముక్రింద నుండకపోవుట సత్యము. నే నిదివఱకే కొన్ని పుటలు చదివియున్నాను, ఆంధ్రభాషా వాఙ్మయమునందు మీ పుస్తకమువంటి సహాయకరగ్రంథమును కలిగి యుండుటకు గర్వపడితిని. ఇప్పుడును పడుచున్నాను. కాబట్టి పుస్తకమును నాపాఠశాలలో పెట్టినందుకయి మీరు దయతో చేసిన యుదారార్థమునకయి నేను మీకు మిక్కిలి ఋణపడియున్నాను. మీ పుస్తకము విషయమయి నా స్నేహితులతోను ముఖ్యముగా ప్రెసిడెన్సీకాలేజిలోని శేషయ్యంగారితోను మాటాడుటలో నేను లేశమును ప్రాలుమాలనని నిశ్చయముగా చెప్పుచున్నాను. వారివారి క్రిందనున్న పాఠశాలలలో మీ పుస్తకమును పెట్టుఁడని కోరుచు పరిస్థలములందున్న నామిత్రులకు పంపుటకయి కొన్ని ప్రతులను నావశమునం దుంచుటకయి మీ కాలోచన చెప్పుచున్నాను. తెలుఁగులోని మీ యున్నతపాండిత్యమునకు తోడుగా మీ రింగ్లీషులో మిక్కిలి మంచిజ్ఞానము కలవారయి యుండుట సంతోషించుచున్నాను. మీరాయుత్తరములో మీరు చేసియుండవచ్చునని పొరపాటులను మిమ్ము క్షమింపవలసినదని కోరుచున్నారు. మీరు వ్రాసినంత చక్కగా వ్రాయుటకయి రండని నాపట్టపరీక్షావిద్యార్థులను సంతోషించి పిలుచుచున్నాను. తెనుఁగులో నొకసంయుంకలితమైన వచనప్రబంధమును వ్రాయుటకు

మీరు పూనుకొనలేరా? ఇంకొకలేఖలో నధికముగా వ్రాసెదను. కాలములేదు. క్షమింపుఁడు—

ఎస్. రంగయ్యసెట్టి.

ఈ పుస్తకముపయిని తెలిసినవా రనేకులు మంచియభిప్రాయములనిచ్చిరి. పట్టపరీక్షా సిద్ధులును రాజమండ్రి కాలేజిలో సహాయోపన్యాసకులును తరువాత సర్వకళాశాలపరీక్షకులును నయిన బ్రహ్మశ్రీ వావిలాల వాసుదేవ శాస్త్రిగా రీపుస్తకమును గూర్చి యిట్లు వ్రాసిరి—

క. మీపుస్తక మొకపఱి నే
నేపారం జూడఁగానె యిట్టి దగునె? వ
హ్వా! పూర్వమాంధ్రభాష మ
హాపుణ్యముఁగాంచెఁ బోలు ననిపించె మదిన్.

సీ. వాటంబుగానిష్ట పేటమాటలచేత
నొప్పుమీ పెనుశైలి నొక్కచోట
సంస్కృతపదములు చాలఁగ్రాలఁగ నింపు
గ్రక్కుఁ గోకనీ మఱియొక్కచోటఁ
గనరాని కలయికకల రెండుభాషల
సూక్తులఁదగుకీర్తి యొక్కచోటఁ
బొదరిల్లువిధమున మృదులతాకీర్ణమై
యుబ్బవగుశక్తి వేఱొక్కచోటఁ

గీ. గాఁగ నాయాయిపట్టులఁ గరము వింత
గొలుపుచును సజ్జనార్థులకోర్కె లెల్ల
సఫలములుగాఁగఁ బొడముకోశంబు నాఁగ
వెలయు నీనీతిచంద్రికా విగ్రహంబు.

క. ఎచ్చటఁ జూచిన శ్లేషలు
విచ్చలవిడిఁ గానఁబడెడు వింతగఁ దెలుఁగం
దిచ్చొప్పున ద్వ్యర్థగతుల
నెచ్చోఁ గానంగఁగలమె యెన్నికఁజూడన్.

ఈపుస్తకరచనమజూచి సంతోషించియే చెన్నపురిలోని పండితులు నన్నచ్చటకు రప్పించి యాదరించి నాకొక వెండిపాత్రమును బహుమానము చేసి నా ఛాయాపటము నెత్తించి సత్కరించి పంపిరి. అప్పటి వార్తాపత్రికలు సహితము దీనిని బహువిధముల మెచ్చుకొన్నవి. ఆకాలమునందు చెన్నపురిలోఁ బ్రకటింపఁబడుచుండిన నేటివ్ పబ్లిక్ ఒపీనియన్ (స్వదేశీయ మహాజనాభిప్రాయము) అనెడి యింగ్లీషువారపత్రిక దీనిని గూర్చి యిట్లు వ్రాసినది—

Mr. Kandukury Viresalingam, already known for his beautiful Telugu Poems, has now written a prose work call. ed the *Vigraha Tantra*. We have had the pleasure of going through the book once and we have no hesitation in pronouncing it good. The examples selected are suitable and the morals are well illustrated and made impressive. The style is easy and flowing and at the same time idiomatic and grammatical. The book may be made a Text book for the university Matriculation. We wish the author would persevere in his good endeavours— THE NATIVE PUBLIC OPINION

(తన సుందరాంధ్ర పద్యకావ్యములకయి యీవఱకే ప్రసిద్ధికెక్కియున్న కందుకూరి వీరేశలింగముగారిప్పుడు విగ్రహతంత్రమనెడియొక వచనకావ్యమును రచియించియున్నారు. పుస్తకమును మేమొకసారి సాంతముగా చదివెడు సంతోషమును కలిగియున్నాము. అది మంచిదని ఘోషించుటయందు మాకు సంశయములేదు. చేకొనఁబడిన దృష్టాంతములర్హము లయినవి గానున్నవి; నీతులు చక్కని నిదర్శనములతో మనస్సునకు నాటుకొనునట్లు చెప్పఁబడినవి. శైలి సుల

భముగాను ప్రవాహతుల్యముగాను నుండుటయే కాక భాషీయము గాను వ్యాకరణ యుక్తముగా నున్నది. పుస్తకము సర్వకలాశాలా ప్రవేశపరీక్షకు పఠనీయముగా చేయఁబడవచ్చును. గ్రంథకర్త తన మంచి ప్రయత్నములో పూనిక విడువక పనిచేయునని కోరుచున్నాము—స్వదేశమహా జనాభిప్రాయపత్రిక.)

సర్వకళాశాలవారీ పుస్తకమును ప్రవేశపరీక్షకుఁ బఠనీయముగా నిర్ణయించిరి. అందుమూలమున నాకాసంవత్సరము దీనివలన వేయి రూపాయలు చేతిలోఁ బడినవి. అన్నిరూపాయ లొక్కసారిగా కన్నులఁ బడగానే ఉద్యోగమునకంటె గ్రంథకర్తృత్వమునవలననే యెక్కువ సంపాదింపఁ గలుగుదుమన్న ధైర్యమును, సేవక వృత్తిని విడిచి స్వతంత్రజీవనము చేయవలెనన్న యభిలాషయును, నామనస్సునం దంకురించెను.

తెనుఁగులో నొకవచనప్రబంధమును వ్రాయుటకు మీరు పూనుకొనవలెరా యని రంగయ్యసెట్టిగారు తమ ప్రథమలేఖలో వ్రాసి నప్పుడే యాపనికి పూనుకొనవలెనని నాకుద్దేశము కలిగినది. మొట్టమొదట నొక చిన్న యింగ్లీషుప్రబంధమును దేనినైనను తెలిఁగించి శైలి కుదురుపఱుచుకొని తరువాత స్వకపోలకల్పితమైన వచనప్రబంధమును వ్రాయఁబూనుకొనవలెనని తలఁచి గోల్డుస్మిత్తనెడి యింగ్లీషు కవి చేసిన "వైకర్-ఆఫ్ వేక్ఫీల్డు" అను కథను తెనిఁగింపనారంభించి రెండు మూడు ప్రకరణములు వ్రాసితిని. విదేశకథయు దాని భాషాంతరమును మనవారి కింపుగానుండవని తోఁచి చేసినభాగము నామనస్సునకే తృప్తికరముగా నుండనందున దానిని మానివేసి రాజశేఖర చరిత్రమును వ్రాయ నారంభించితిని.) ఇంగ్లీషు కథకును దీనికిని విశేష సంబధము లేదు. అదియొక యుద్దేశముతో చేయఁబడినది; ఇది వేఱొక యుద్దేశముతో చేయఁబడినది (మనలోఁగల మూఢ

విశ్వాసములను పోఁగొట్టవలెనన్న ముఖ్యోద్దేశముతో నేను దీనిని వ్రాసితిని. ఇది యించుమించుగా స్వకపోలకల్పిత మనియే చెప్ప వచ్చును. దీనిని మొట్టమొదట భాగభాగములుగా 1878–వ సంవత్సరమునందు వివేకవర్ధనిలోఁ బ్రచురించి తరువాత పుస్తకముగాఁ బ్రకటించి యప్పటి విద్యావిచారణాధికారియగు కర్నల్ మెక్డానల్డు దొరగారికి కంకితము చేసితిని. మెక్డానల్డుదొరగారు నాయందు మంచియభిప్రాయము గలవారయి, ప్రెసిడెన్సీ కాలేజిలోని రెండవ పండితపదమును నాకిచ్చెదమని వ్రాసిరి కాని నే సంగీకరింపలేదు. పిమ్మటతరువాత శీఘ్రకాలములోనే యుపకారవేతనమును పొంది స్వదేశమునకు విజయముచేసిరి. రాజశేఖర చరిత్రము పత్రికాధిపతులచేతను తదితరులచేతను బహువిధముల పొగడఁబడెను గాని సామాన్య జనులు దానిని గ్రహింపలేకపోయినందున దానివలన నట్టి పొగడ్తలే కాని రశ్మియేమియు నాకు కలుగలేదు. వేయిప్రతులుగల మొదటికూర్పమ్ముడు పోవుటకే బహు సంవత్సరములు పట్టినది. అందుచేత నిప్పుడు నవలలనఁబడెడు వచనప్రబంధములను వ్రాయు ప్రయత్నమును మానివేసితిని. అయినను చదివి తెలిసికొనఁగలిగిన వారు దీనిని మెచ్చుకొనఁజొచ్చిరి. అనేకులు దీని నితరభాషలలోనికి భాషాంతరీకరింపఁ బ్రయత్నించిరి. ఈపుస్తకవిషయమయి యింగ్లండునుండి జనరల్ మెక్డానల్డుదొరగారు 1881–వ సంవత్సరము డిసెంబరునెల 23 తేదీని నాకిట్లు వ్రాసిరి—

"80, OXFORD GARDENS, N. KENSINGTON,
*23rd December 1881.*

Mr dear Sir,

Miss Manning, Secretary of the National Indian Association, proposes publishing serially in the Journal, 'translations of good Indian fiction, in which the Engish reader

will see Indian Home life delineated and thus a very attractive feature will be added to the Magazine," I believe a Bengal story will be the first of the series, but I have suggested to Miss Manning that a translation of your Rajasekhara might perhaps be found suitable, and she seems much pleased with the idea.

I write therefore to ask whether you would like your novel to be published in the Journal and whether you would in that case send an English translation of it for publication, with permission to omit or abridge any passages, which the Editor might deem suitable.

I wish I would add that the publication of your novel in this form would bring you some profit as well as reputation, but the contributors to the Journal are not paid for their articles.

Yours truly,
**R. M. MACDONALD.**"

(దేశీయ హైందవ సమాజముయొక్క కార్యదర్శిని యైన మానింగుకన్యక పత్రికలో "నింగ్లీషు పాఠకులు హైందవ గృహ జీవన వర్ణనమును గాంచునట్టియు నందు మూలమున పత్రిక కాకర్షక లక్షణము చేర్పఁబడునట్టియు మంచి హిందూ దేశ కల్పితకథయొక్క భాషాంతరమును" వరుసక్రమమున ప్రచురించుచుండవలెనని యుద్దేశించుచున్నది. ఈవరుసలో నొక బంగాళీ కథ మొదటిదిగా నుండునని నేను నమ్ముచున్నాను గాని మీరాజశేఖరచరిత్రయొక్క భాషాంతరము తగినదిగా నుండవచ్చునని నేను మానింగు కన్యకు సూచించి యున్నాను. ఈయభిప్రాయమున కామె మిక్కిలి సంతోషించినట్టు కనఁబడుచున్నది.

కాఁబట్టి మీవచన ప్రబంధము పత్రికలో ప్రచురింపఁబడుటకు మీకిష్టమున్నదో, ఉన్నయెడల తాను తగియుండవని తలఁచెడి వచనములను విడుచుటకుఁ గాని సంగ్రహపఱుచుటకుఁగాని పత్రికాపతి కనుజ్ఞ యిచ్చుచు ప్రాచుర్యము నిమిత్తము దాని యింగ్లీషు

భాషాంతరమును పంపుటకు మీకిష్టమున్నదో, తెలిసికొనుటకు నేను వ్రాయుచున్నాను.

ఈరూపమున మీ వచనప్రబంధ ప్రకటనము మీకు కొంత లాభమును ప్రసిద్ధిని తెచ్చునని నేను చేర్పఁ గోరుచున్నాను కాని యీ పత్రికకు విషయములను బంపువారిగ్రంథముల కేమియు నియ్యఁబడదు...ఆర్. ఎమ్. మక్డానెల్డు).

ఆ కాలమునందు నేను వితంతువివాహ కార్యభారములో మునిఁగియుండి యేయితర కార్యనిర్వహణమునకు నవకాశము లేనివాఁడ నయి యుంటచేత రాజశేఖర చరిత్రమున కింగ్లీషు భాషాంతరము చేయించుటకును ప్రకటనార్థమయి యింగ్లండులోని యీ పత్రికకు పంపుటకు ప్రయత్నము చేయలేదు. ఈ యుత్తరము వచ్చినపుడు నా మిత్రులయిన బసవరాజు గవర్రాజుగారు దానిని తామింగ్లీషు చేసెదమని చెప్పిరి కాని నేనాయనను నిరుత్సాహపఱచితిని. తరువాత క్రైస్తవ మతాచార్యులు కొందఱు దీని నింగ్లీషునకు భాషాంతరీకరింప ననుజ్ఞ యిమ్మని నన్ను కోరిరి. (శ్రీకాకుళమునందుండిన యమెరికా క్రైస్తవమతాచార్యులైన రివరెండు హచ్చిన్సనుగారు నాయనుమతిపైని దీని నింగ్లీషుచేసి చెన్నపురి క్రైస్తవ కళాశాలాపత్రికయందు మొదట 1886-వ సంవత్సరమున భాగములుగా ప్రకటించి, తరువాత 1887-వ సంవత్సరమునందు 'అదృష్ట చక్రము' (Fortune's Wheel) అను పేరితో పుస్తకరూపమున చిత్రపటములతో లండనునగరమునందు ప్రకటించిరి. దీనికి జనరల్ మెక్డానల్డు దొరగారు ఉపోద్ఘాతమును వ్రాసిరి. దీనిని హిందూదేశములోని వార్తాపత్రికలు మాత్రమే కాక యింగ్లండులోని పత్రికలు సహితము శ్లాఘించెను.) దీనిని దొమ్మగూడెములో నున్న యింగ్లీషు క్రైస్తవ మతాచార్యులు రివరెండు కెయినను దొరగారుకూడ విశేషభాగ

మింగ్లీషునకు భాషాంతరీకరించిరి గాని యింతలో మీదటిభాషాంతరము ప్రచురింపఁబడ నారంభించినందున ముగింపక విడిచిపెట్టిరి. 1887-వ సంవత్సరము సెప్టెంబరు 30 వ తేదిని ప్రకటింపఁబడిన లండన్ టైమ్సు (London Times) పత్రిక యీ పుస్తకమునుగూర్చి యిట్లు వ్రాసెను.

"Fortune's Wheel" (Elliot Stock) is an almost unique example of a Hindu novel. The author, Pandit K. Viresalingam, is described by the translator as an ardent reformer who having had some degree of English education, has adopted the form of a fictitious story to convey to his readers a knowledge of the inner life and thought of the Hindu race. This knowledge is to to be very difficult to be obtained by Europeans, owing to the seclusion which caste entails in India. The story itself is simple and from an Europeon point of view, of no great interst; but the pictures of Hindu domestic life, of religious ideas, modes of worship and superstitions, and the condition of women, with their denial of all rights of choice in marriage, are so well drawn and illustrated that the book will have a charm for all readers who concur in the author's desire for an amelioration in the social status of the native race generally The translator from the original Telugu is Mr. J. R. Hutchinson, and a preface is added by General Macdonald, late Director of Instruction in the Madras Presidency, strongly recommending the work to the notice of the British puclic — LONDON TIMES, 30TH SEPTEMBER 1887.

('అదృష్ట చక్రము'-రాజశేఖర చరిత్రము) ఇంచుమించుగా హిందూవచనప్రబంధముయొక్క యద్వితీయ మయిన దృష్టాంతముగా నున్నది. గ్రంథకర్తయైన వీరేశలింగ పండితుఁడు కొంతవఱ కింగ్లీషువిద్యఁ గలవాఁడయి హిందూజాతియొక్క యంతర్జీవనమును మనోగతమునుగూర్చిన జ్ఞానమును తన చదువరులకు కలుగఁజేయుటకయి యొక కల్పితకథారూపమును స్వీకరించిన సోత్సాహసంస్కర్తయైనట్లు భాషాంతరీకర్తచేత వర్ణింపఁబడుచున్నాఁడు. హిందూ

దేశమునందు వర్ణభేదమువలనఁ గలిగిన సంసర్గరాహిత్యమునుబట్టి యాజ్ఞానము యూరపియనులకు లభించుట మిక్కిలి కష్టము. కథ మట్టుకు సరళమయినది; యూరపియనుల దృష్టియందు విశేష మనోహరమయినది కాదు. కాని హిందూగృహజీవనముయొక్కయు, మతాభిప్రాయముల యొక్కయు, ఉపాసనాపద్ధతులయొక్కయు, మూఢవిశ్వాసములయొక్కయు, వివాహములో వరించు స్వాతంత్ర్యములన్నియు తొలఁగింపఁబడియున్న స్త్రీల యవస్థలయొక్కయు వర్ణనలు మిక్కిలి చక్కఁగాను నిదర్శన పూర్వకముగాను చేయఁబడినందున, సామాన్యముగా స్వీయ జాతివారియొక్క సాంఘిక స్థితిని బాగుచేయుటకయి గ్రంథకర్తయొక్క యభిలాషములో నేకీభవించు చదువరుల కంటికి నీపుస్తకము చిత్తాకర్షకముగా నుండును. మొదట తెలుఁగునుండి భాషాంతరీకరించిన యతఁడు జే. ఆర్. హచిన్సన్ అను నాయన; బ్రిటీషు మహాజనులయొక్క యవధానమునకై పుస్తకమును బలముగాఁ బ్రశంసించుచు పూర్వము చెన్నపురి రాజధానికి విద్యాధికారిగా నుండిన జనరల్ మక్డానాల్డుగారిచేత దీనికొక యుపోద్ఘాతము చేర్పఁబడినది.)

ఈ పుస్తకమునుగూర్చి యీ దేశములోని వార్తాపత్రికలిచ్చిన యభిప్రాయములలో నొకదాని నసఁగా 1878-వ సంవత్సరమున నింగ్లీషుభాషయందు చెన్నపట్టణములోఁ బ్రకటింపఁ బడుచుండిన 'హిందూ' పత్రికాభిప్రాయములో కొంతభాగము నిందుక్రిందఁ బొందుపఱుచుచున్నాను.

"As yet the complaint has been that the Vernacular literature is barren of good and useful books and the few that it contains are unintelligible to the general reader, their style being too highly artificial and difficult to be of any interest to students of ordinary attainments. This defect especially in the Telugu literature, of sacrificing ideas at

the shrine of gingilng words, is somewhat being remedied by the useful publications of the school book Society. But we are afraid that these works err in the opposite extreme. In aiming at simplicity they too often set at nought the first principles of Grammar and somtimes violate very genius of the languge. Though written by able Pundits who are obliged for earning their honororium to conf ormto the beau-ideal style of the society, these works lack the force of originality and devoid of a vigorous style, they seem to be dull, inert and lifeless. We consider that golden mean is somewhere between the rigid and artificial style found in standard books and carried into the daily business of life by the Editor of the late *Andhra Bhusha Sanjivani*, and the loose, lifeless style of the various translations of the Vernacular Literature Society, which we are sorry, have found their way into the University curriculum, though they do not deserve to be ranked with the classical works in as much as they do not soar above common place style and diction. We are glad therefore, to find that Mr. Kandukuri Viresalingam pantulu has struck on the happy mean between the two. His style is pleasant and idiomatic, neither cumbrous and difficult nor flagging and tame. There is a flow in his works which we seek in vain in the publications of the Vernacular Literature Society The author of Rajasekhara is at home with his theme, and has the knack of adapting his surroundings to the subject Though he professes to follow the Vicar of Wakefield as his model, he does not, like many of the aspiring Telugu writers, blindly think that there is an intrinsic vitrue in retaining English names and words. On other hand the author takes up the materials around him and works them up into harmony and shape. We did not think that the author of *Vigraham* which was intended to be a sequel to Chinnaya Soore's *Neethi Chandrika* could altogether cast away his old associations and take to a totally different path in Telugu Literature. We must confess, therefore, we are agreably surprised by the appearance of the two books under review. We may well say the Rajasekhara marks an era in the annals of Telugu Literature. It is the first Telugu novel that has yet appeared, and as an attempt in a new direction, we must consider it a success. . . .

*We sincerely hope that Mr. Viresalingam will be long spared to his country and by his laudable efforts create an oasis in the barren desert of Telugu Literature.

We picture to ourselves a period in the history of *Telugu* literature when the country will look back with pride to the *man* who in the midst of an ignorant multitude and indifferent public, and during times when the study of the English language was at premium and Vernaculars at discount, stood alone from the English learning propensities of his countrymen, laid the foundation stone of Modern Literature and led the way in devoloping the latent powers of the language into harmony and perfection — *The Hindu, Madras.*

(దేశ భాషా వాఙ్మయము నందివియు నుపయుక్తములైన పుస్తకముల విషయమున వంధ్యముగా నున్నదనియు, ఉన్న కొన్ని పుస్తకములును సాధారణ సామర్థ్యముగల చదువరులకు నెంత మాత్రమును మనోహరముగా నుండనంత యతికృత్రిమకఠినశైలియందుండుటచేత పాఠకసామాన్యమునకు సుగ్రాహ్యములు కాకున్నవనియు, ఇంతవఱకు మొఱ్ఱయిడియున్నది. ముఖ్యముగా తెలుఁగు భాషయందుఁ గనుపట్టు పటపటాయమాన పదాటోప బలిపీఠము ముందు భావములను బలి పెట్టెడి యీలోపము కొంతవఱకు పాఠశాలాపుస్తక సమాజ ప్రకటితపుస్తకములవలనఁ దొలగింపఁబడుచున్నది. కాని, యీగ్రంథములు వేఱుకొనకుఁ దప్పుదారిని బడుచున్నవని భయపడుచున్నాము. సౌలభ్యముకొఱకు యత్నించుటలో తఱచుగా నవి వ్యాకరణముయొక్క ప్రాథమికనియమములనే యుల్లంఘించుచు కొన్ని సమయములందు భాషయొక్క స్వభావ ధర్మమునే యతిక్రమించుచున్నవి. పారితోషికమును సంపాదించుకొనుటకయి సమాజముయొక్క కృత్రిమకాల్పనికశైలి ననుసరింపవలసినవారైన సమర్థులైన పండితులచేతనే వ్రాయఁబడినవైనను, ఈ గ్రంథములు నవకల్పనాసామర్థ్యవిహీనములయి, బలమైన శైలిలేనివయి, నిస్తేజ

ములుగాను, నిస్సారములుగాను, ప్రాణము లేనివిగాను, గనుపట్టు చున్నవి. ఉత్తమమయిన మధ్యపథము, ప్రామాణిక గ్రంథములలోఁ గానఁబడుచు గతించిన యాంధ్రభాషాసంజీవనీ విలేఖకునిచేత ననుదిన వ్యవహారమునకు సహితము తీసికొనిరాఁబడిన కఠినకృతకశైలికిని, దేశభాషాసాహిత్య సంఘమువారి వివిధభాషాంతరీకృత గ్రంథముల లోని నియమశూన్యమైన నిర్జీవశైలికిని నడుమగా నెందేనియుండునని మేము భావించుచున్నాము;-ఈకడపటివి శైలియందును, పాకమునందు ను, సామాన్యస్థితిని మించినవికానందున సత్కావ్యకోటిలోఁబరిగణిం పఁబడుట కర్హములయినవి కాకపోయినను సర్వకలాశాలా పఠనీయ పుస్తకావళిలో నడఁగిడఁ బడసినందుకు మేము చింతిల్లుచున్నాము. కాఁబట్టి కందుకూరి వీరేశలింగము పంతులుగారీ రెంటికిని నడిమి సమ్మోదప్రద మైనత్రోవ ద్రొక్కుచున్నారని కనుఁగొనుటకు మేము సంతోషించుచున్నాము. క్లేశప్రదమును, కఠినమును గాక, సంస్కారహీనమును గ్రామ్యమును గాక, యీయనశైలి మనోహర ముగాను జాతీయముగాను నున్నది. దేశభాషాసాహిత్యసమాజము వారి ప్రకటనములలో వెదకినను గానరాని ధార యీయన గ్రంథ ములయం దున్నది. రాజశేఖర గ్రంథకర్త తనవిషయముతోఁ బరి చితుఁడయి తనపరిసరములను విషయమునకుఁ దగినట్టుగా మార్చు నట్టి నైపుణ్యమును గలవాఁడయి యున్నాఁడు. ఈయన వైకర్ ఆఫ్ వేక్ఫీల్డును (Vicar of Wakefield) తనయాదర్శముగానుంచుకొన్నట్టు చెప్పుచున్నను, కీర్తికాములైన యనేకాంధ్రగ్రంథకర్తలవలెనింగ్లీషు పేరులను మాటలను అట్లే యుంచుటలో స్వాభావిక యోగ్యతగలదని యంధప్రాయముగా తలచువాఁడుకాఁడు. అంతేకాకయీగ్రంథకర్త తనచుట్టును గల సాధనసామగ్రిని గైకొని వానికి పొందికయు రూప మును కలుగునట్లుగాఁ బనిచేయుచున్నాఁడు. చిన్నయసూరియొక్క

నీతిచంద్రిక కుత్తరభాగముగా నుద్దేశింపఁబడిన విగ్రహముయొక్క గ్రంథకర్త తనపూర్వసాహచర్యములను బూర్తిగా విడనాడి తెలుగు వాఙ్మయమునందు సంపూర్ణనూతనమార్గము నవలంబింపఁగలుగునని మేము తలఁచి యుండలేదు. కాఁబట్టి యిప్పుడు విమర్శనీయములయి యున్న రెండుపుస్తకములయొక్క యావిర్భావమువలన మే మనుకూలముగా నాశ్చర్యపడితిమని యొప్పుకొనవలసియున్నది. తెలుఁగు వాఙ్మయముయొక్క చరిత్రమునందు రాజశేఖరచరిత్రము నూతన శకము నేర్పఱచుచున్నదని మేము చక్కఁగాఁ జెప్పవచ్చును. ఇది యీవఱకు బొడచూపిన తెలుఁగు నవలలలో మొదటిది. ఒక క్రొత్త మార్గము నందలి ప్రయత్నముగా నిది జయప్రదమయినదని మేము తలఁపవలసి యున్నది. ♦ ♦ ♦ ♦

♦ వీరేశలింగముగారు చిరకాలము తమ దేశముకొఱకు రక్షింపఁబడుదురనియు, తమసంస్తవనీయము లయిన ప్రయత్నములవలనఁ దెలుఁగువాఙ్మయమనెడి వంధ్యమైన యెడారియం దొక ఫలవంతమైన ప్రదేశము నిర్మింతు రనియు మేము మనఃపూర్తిగాఁ గోరుచున్నాము.

ఎవ్వఁడు మూఢదశలోనున్న ప్రజాబాహుళ్యముయొక్కయు, ఉపేక్షాపరులైన మహాజనులయొక్కయు, మధ్యమునందు, ఇంగ్లీషు విద్యాభ్యాసము లాభకరముగాను, దేశభాషావిద్యాభ్యాస మలాభకరముగాను, ఉన్నకాలములో తనదేశమువారియొక్క యింగ్లీషు విద్యాభ్యాసశీలతనుండి వేఱుగా నిలిచి, యాధునికవాఙ్మయ నిర్మాణమునకు శంకుస్థాపనముచేసి, భాషయొక్క నిగూఢశక్తులను, పొందికను, పరిపూర్ణతకును, వర్ధిల్లఁజేయుటలో మార్గదర్శకుఁడయ్యెనో, యాపురుషుని గర్వముతో వెనుకకుఁ జూచునప్పటికి

తెనుఁగు వాఙ్మయముయొక్క చరిత్రమునందలి కాలమును మేము మా మనసున చిత్రించుకొనుచున్నాము.—హిందూపత్రిక.

రాజశేఖరచరిత్రము కన్నడభాషలోనికి భాషాంతరీకరింపఁబడి బెంగుళూరిలో ముద్రింపఁబడినది. అఱవలోనికిని మళయాళము లోనికిని భాషాంతరము చేయుటకయి కొందఱు నాకు వ్రాసి యనుజ్ఞ పుచ్చుకొనిరిని గాని యాభాషాంతరములు ప్రకటింపఁబడి నట్టు కనఁబడదు.

రాజశేఖర చరిత్రమునకు ముందు కౌపరనెడి ఇంగ్లీషు కవీశ్వరుఁడు రచియించిన జాన్‌గిల్పినను పుస్తకమును, అభాగ్యోపాఖ్యానమనెడి చిన్న హాస్య ప్రబంధమును, పద్యములతోఁ జేసితిని. ఇంచుమించుగాఁ దెలుఁగుభాషలోనున్న ప్రబంధము లన్నియు కామినీ కచ కుచ సంభోగాదివర్ణనలతో నిండియుండి యేకరీతిగా నుండుట చేతను, అట్టి ప్రబంధములను రచించినవారిలో నే నొక్కఁడనై నను నాకు వెనుకటి యభిప్రాయములు మాఱి శృంగారప్రబంధములు చేయు మేలుకంటె కీడెక్కువగా నుండునన్న సిద్ధాంతమునకు వచ్చిన వాఁడ నగుటచేతను, ప్రబంధప్రణేతృపథమును బరిహసింపవలెనన్న యుద్దేశముతో నభాగ్యోపాఖ్యానము చేసితిని. ఈ యభాగ్య ప్రబంధ రచనయు నాకిప్పుడు సమ్మతముకాదు. 1875-వ సంవత్సరము వేసవి కాలములో నేను చెన్నపట్టణము వెళ్ళియుండినప్పుడు నామిత్రుని ప్రోత్సాహ వచనములచేతను కొల్లా గురుసామిసెట్టిగారి సాదర పూర్వకములైన ప్రియవచనములచేతను నేను వేగిరపడి భారతసంగ్రహమును వ్రాసి యిచ్చెదనని వాగ్దానము చేసితిని. తెలుఁగులో పద్యకావ్యములు వలసినన్ని యున్నందున పద్యకావ్య విరచనమును మాని వేసి వచనకావ్యములులేని కొఱఁతను దీర్చుటకయి తద్రచనమునందే నాకాలమును వినియోగింపఁ దలఁచి యున్నవాఁడ నగుటచేత నిష్ట

ములేకయు తీఱిక లేకయు దేహస్వాస్థ్యములేకయు భారతసంగ్రహమును వ్రాయక రెండు మూడు సంవత్సరములు గడపి తుదకు చెన్నపట్టణమువారి తొందర యెక్కుడగుచు వచ్చుటచేతను చేసిన వాగ్దానమును తప్పుట ధర్మము కాదని తలఁచుటచేతను రాజశేఖరచరిత్రరచనానంతరమున రెండుమాసములలో 1878-వ సంవత్సరాంతమున శుద్ధాంధ్ర భారతసంగ్రహమును వ్రాసి ముగించి చెన్నపురికిఁ బంపితిని. ఇది ముద్రింపఁబడి ప్రకటింపఁబడిన తరువాత సర్వకళాశాలవారు దీనిని ప్రథమశాస్త్ర పరీక్షా పఠనీయగ్రంథముగా నిర్ణయించిరి. ఈ పుస్తకమును, ఆరంభించి ముగింపక విడిచిపెట్టిన శుద్ధాంధ్రోత్తర రామాయణమును, పలువురు ప్రశంసించియున్నారు. ఈ రెండు శుద్ధాంధ్రకావ్యములనుండియు కొన్ని పద్యముల నిందుదాహరించుచున్నాను.

భారతసంగ్రహము

ఉ. హొత్తులఁ గత్తలానులను నందపురోవిరిబోండ్ల జాళువా
మొత్తముఁదెచ్చియిచ్చినతమున్నది మెచ్చుచుఁ గొల్చుచుండుదుర్
క్రొత్తగ నాల్గు సంద్రములకున్ నడుమం గల రాచసింగముల్
మొత్తములై యటం గొలువులోపల నొప్పెడు నేలదాలుపుల్.

సీ. పలుమానికపుఁగోళ్ళ పసిఁడిమంచముమీఁద
నంచపాన్పునఁ బవ్వళించునీవు!
కటకటా! యిటువంటికటికినేలఁ బరుండ
నోర్చితి వెట్లు దుర్యోధనుండ!
వేనవే లెప్పుడు వెనుకముందులఁ జేరి
కొలువుచేయుచునుండ నలరునీవు!
దాయ లుబ్బఁగ నక్కటా! యొంటిఁ బడియుండఁ
జాలితి వెట్లు దుశ్శాసనుండ!

తే. ఎండకన్నును వానక న్నెఱుఁగ కెపుడుఁ
గడమపడకుండ సుకములఁ గాంచువారు
వానకును నెండకును నెట్లు వరుస సైఁచి
కుందుకున్నారు? నాముద్దుకుఱ్ఱలార!

సీ. దుస్సల నిమ్మాడ్కి దోసఁగులపా ల్చేసి
చనితివే మముఁ బాసి సైంధవుండ!
నిను నమ్ము దుర్యోధనునకుఁ గా నుసురులు
తొఱఁగితే ద్రోణుండ! తోడు వచ్చి
యొజ్జలంచును నైన నొక్కింత మోమోట
మెన్నక కెడపితే నిన్నుఁ గృపుఁడ!
మఱచెనొకో మేనమామనుమాటయు
శల్యుండ! నినుఁ జంపు జమునిపట్టి
తండ్రిపోయినబిడ్డలఁ దగఁగఁ బెంచి,
చదువుసాములు చెప్పించి సాకినట్టి
నిన్నుఁ బడనేయఁ జేయాడెనె యకటకట!
పాండునికొమాళ్ళ కోయి భీష్ముండ యిట్లు!

సీ. మడిసినమగలపైఁబడి సొమ్మసిలి లేచి
యేడ్పులు మిన్నుముట్ట నఱచువారుఁ
బొలిసినచెలికాండ్రఁ దిలకించి కత్తిమైఁ
బుడమిమీఁదను బడి పొరలువారుఁ
గన్నబిడ్డలమేను కాకులు పొడువంగఁ
గనలేక యెద మోదుకొనెడువారుఁ
జాపకట్టుగఁ బడ్డ సైదోడులను గాంచి
యెడఁద వ్రయ్యలువాఱ నేడ్చువారు

తే. నగుచు వగచెడుమగువల యడలుటులివ్వు,
పుడమియును నాకసంబును ముంచుకొనియె
నేమి చెప్పుదు! నదిగన్న నెట్టిరాతి
గుండెవానికి వగ పుట్టకుండ దపుడు.

వీనిలో మొదటిపద్యము, భారత మంతయు నచ్చతెలుఁగునఁ జేయవలెనని యారంభించి కొంతవఱకు చేసిన సభాపర్వమునుండి యందుఁ గైకొనఁబడిన పద్యములలో,

మ. మదమాతంగ తురంగ కాంచనలసన్మాణిక్యగాణిక్యసం
పద లోలిం గొనివచ్చి యిచ్చి ముదమొప్పం గాంచి సేవించి ర
య్యుదయాస్తాచలసేతు శీతనగమధ్యోర్వీపతు ల్సంతతా
భ్యుదయుం ధర్మజుఁ దత్సభాస్థితుఁ జగత్ప్రాణప్రతాపోదయున్.

అను నన్నయభట్టారకుని పద్యమునకు సరియైన తెలుఁగు.

## ఉత్తరరామాయణము

సీ. చెలువంబుగానాడు వెలయాంద్రబంగారు
చిఱుగజ్జియలమ్రోఁత చెవులు దనుప
విరిబోడు లిరుగ్రేవ వింజామరలు వ్రేయ
వెడలుచల్లనిగాలి విందుగొలుప
రహిమీఱఁ దాల్చిన రతనంపుపనిసొంపు
తొడవులతళతళ ల్కడలు నిండఁ
బగడాలకంబాలపజ్జ ముద్దినుసుల
కెంబట్టుపఱుపులు డంబు చూపఁ
తే. గొలువ నేతెంచుదొరలెల్ల గుములుకూడి
యుదు నొదవుదాఁక నందంద యొదిగి యుండి

యడుగుడోయికి మ్రొక్కుచు నవల నిలువఁ
బసిఁడిగద్దియఁ గొలువుండె బలియుఁ డతఁడు.

చ. అలరులకొమ్మలో మరునియమ్ములొ బంగరుకీలుబొమ్మలో
వలపులదీవులో తొవలబావులొ చక్కని గుజ్జుమావులో
తొలకరిమించులో యనఁగఁ దూకొని యచ్చరలేమ లచ్చటన్
బెళుకుఁ గనుంగవ ల్బళుకుఁ బెన్డొడలుం దగ సందడించుచున్.

సీ. ఒకచోట నునుబాట లొకతేటగాఁ బాడు
దురు నల్లతా లెల్ల గరఁగి పాఱ
నొకయోర వగమీఱ మొక మోరగ నొనర్తు
రలమి దట్టంపు వెన్నెలలు గాయ
నొకచాయఁ గనుగాయలకు డాయవత్తురొ
య్యారంపు నడకల హావునిండ
నొకదండ విరిదండ లొడినిండఁ గూర్తురు
కమ్మనితావులు గ్రమ్ముకొనఁగఁ
బిలుతు రొకచక్కి నెచ్చెలిపింకు నిక్కి
కలికిపలుకులఁ జిలుకలు కలఁగి చూడ
నడుతు రొకక్రేవ సొలపుగా నడిమిత్రోనఁ
గదియ నేతెంచి యంచలు కాళ్ళఁ బెనఁగ.

చ. వడినడిఁ బాఱుతెంచి మొకపై దలి యూర్పులు పుచ్చి నవ్వినన్
బడఁతుక యోర్తు 'చా లిపుడె నవ్వకు మంతయు తేపు గట్టిగాఁ
గొడుకులతల్లి వాదు వొక కొంచెము నాటికి దాఁచుకొమ్మ' నా
నుడికె నెలంతయుం గడుపు లుబ్బఁగ నవ్విరి కొమ్మ లందఱున్.

(నీతిచంద్రికలోని విగ్రహమును సంధిని చేసినతరువాత) నాకొక
యాలోచనము కలిగెను. (సంధినికూడ నించుమించుగా విగ్రహతంత్ర

ముశైలినే చేసి) దానిని మా శాస్త్రపాఠశాలాధికారి యైన మెట్కాఫుదొరగారి కంకితముచేసితిని. దీనినిగూడ సర్వకలాశాల వారు విగ్రహామువలెనే పలుమాఱు పరీక్షలకు పఠనీయ గ్రంథము గా నిర్ణయించుచువచ్చిరి. భాషవలని ప్రయోజన మేమి? జనులు తమ యభిప్రాయముల నొండొరులకుఁ దెలుపుకొనుట. భాషలోని గ్రంథములవలని ప్రయోజనమేమి? తమ భావములను దూరమున నున్నవారికిని రాఁబోవు తరములవారికిని సులభముగా తెలుపుట. అట్టిసౌలభ్యము విగ్రహామువంటి పుస్తకములవలనఁ గలుగునా? కలుగదు. అందలి పదములయొక్కయు వాక్యములయొక్కయు నర్థమును దెలిసికొనుటకయి సామాన్యజ్ఞానముగలవారికి నిఘంటువుల యొక్కయు పండితులయొక్కయు సాయముకావలెను. ఇంత కష్టపడి యర్థము గ్రహింపఁ గలిగినను వారిందు క్రొత్తగా నేర్చుకొన్న దేమి? సులభవచనరూపముననున్న పంచతంత్రములోనున్న దానికంటెవిశేష మేదియులేదు. అట్లయినచో గ్రంథములెట్లుండవలయును? అందఱికిఁ దెలియునట్లు సులభముగా నుండవలెను; అని నాలో నే నాలోచించు కొని ముందు వ్రాసెడు పుస్తకములను విగ్రహామువలెఁ గాక సుగ మములుగా నుండునట్లు వ్రాయ నిశ్చయించుకొని నాయభిప్రాయ మును నాలోపలనే యుంచుకొనక పత్రికాముఖమునఁ దెలిపితిని. పండి తులు నాతో నేకీభవింపక యట్లు చేసినచో భాషయొక్క గౌరవమే పోవుననియు, బోసినోటివాఁడు బొక్కవలసిన పేలపిండివలె నిస్సార ముగానుండుననియు, పేలవముగా నుండుటచేత రసికులయినవారి కట్టి వ్రాతలు రుచింపక చప్పిడిపాకమువలె నగ్రాహ్యముగా నుండునని యు, నిరసించుచు పరిహసించుచు నానావిధముల నెకసక్కెము లాడఁజొచ్చిరి. ఆంధ్రభాషాసంజీవన్యధిపతులు గ్రంథములు మాత్ర మే కాక వార్తాపత్రికలు సహితము కఠినమైన గ్రాంథికశైలినే

యుండవలెనని వాదింపఁజొచ్చిరి. అందుపైని నేను నాపత్రికలో నీక్రింది సీసపద్యమును వ్రాసితిని—

సీ. భాషాభివృద్ధియే పత్రికఫలమని
చెన్నపురంబున నున్నతెలుఁగు
పత్రికాలేఖకుల్ ప్రకటించి, వచనకా
వ్యములట్లు పత్రికల్ వ్రాయుమనిరి
నాదుమతం బది కాదు భాషాజ్ఞాన
మలవడ్చుకొంటకుఁ గలవు పెక్కు
పద్యకావ్యంబులు గద్యకావ్యంబులు
పత్రికల్ గ్రాంథికఫణితి నున్నఁ
బండితులు గానివారికిఁ బనికిరావు,
పత్రికోద్దేశమే కొఱవడును దానఁ,
గాన నెపుడు సర్వజనోపకారమొదవఁ
బామరులకును దెలియంగ వ్రాయవలయు.

(గ్రంథములను సాధారణముగా సలక్షణమైన సులభ శైలిని రచియింపవలెననియే నాయభిప్రాయ మైనను విషయానుగుణముగా తత్తదుచితరీతిని గ్రామ్యభాషయందు సహితము గ్రంథములను వ్రాయవచ్చునని కూడ నాయభిప్రాయము.) పూర్వవ్యాకరణము లన్నియుఁ బద్యకావ్యరచనకొఱకే వచనకావ్యములు లేనికాల ములో పుట్టిన వగుటచేత నందలి లక్షణము లనేకములు వచన కావ్యాభివృద్ధికి తగవనియు నిప్పటికాలమునకుఁ దగినట్లుగా వ్యాక రణమును మార్చుకోవలయు ననియు నే ననుకొని యీ కాలము నకును వచనరచనాభివృద్ధికిని తగినట్లుగా నొక నూతన వ్యాకరణ మును వ్రాసి దానికి లక్ష్యముగా నొక వచనకావ్యమును జేయవలె

ని పలుమాఱు దలపోసితిని. అయినను వృద్ధుఁడను దుర్బలశరీరుఁడను నగుటచేత నట్టిపని నాకిప్పుడు సాధ్యముకాదేమో! కాదననేల! ఈశ్వరానుగ్రహ మున్నయెడల సాధ్యముకానువచ్చును.

ఏవిషయమునను నే నితరులుచూపిన దారినే పోవువాఁడను గాక మనసు తిరిగినప్పుడు నాదారినే నేను నడచువాఁడ నగుటచేత ంలభవచనరచనావిషయ మయి యితరులమాటలను పాటి చేయక గా నూతనమార్గానుసారముగా సంభాషణరూపమున బ్రహ్మవివాహమును వ్రాసి హాస్యసంజీవని మొదటి పత్రికలో కొంతభాగమును ప్రకటించితిని. ఆవఱకు సంభాషణరూపమున పుస్తకములు లేకపోవుట చేతనో, అందలి విషయనూతనత్వము చేతనో, పురుషులును, స్త్రీలును, పండితులును, పామరులును, బాలురును, వృద్ధులును కూడ దాని నత్యాసక్తితోఁ జదువఁజొచ్చిరి. పుస్తకము వెలువడిన కొన్ని దినముల వఱకును జనులు గుంపులు గుంపులుగాఁగూడి వీధి యరుగులమీఁదఁగూర్చుండి దానిని చదివి పక పక నవ్వుచుండిరి. మొదటి సంచిక ప్రకటింపఁబడిన తరువాత రెండవ సంచిక వెలువడులోపల వచ్చిన చందాదారుల సంఖ్య పేరుల నన్నిటిని బ్రకటించినచో నితరవిషయముల కవకాశములేక పత్రికయంతయు పేరులతోనే నిండిపోవునంత యధికమయినందునఁ బత్రికానుబంధముగా పేరులను వేఱొక కాగితముమీఁద ముద్రింపింపవలసిన వాఁడనైతిని. ఆకాలమున బ్రాహ్మవివాహమును సాధారణముగా జనులు పెద్దయ్యగారి పెండ్లి పుస్తకమని వాడుచు వచ్చిరి. ఈగ్రంథమును నేను కేవల వినోదముకొఱకు మాత్రమేకాక యతిబాల్యవివాహము వృద్ధవివాహము కన్యాశుల్కము మొదలైన దురాచారములవలని యనర్థకములనుజూపి జనులను వానినుండి విముఖులనుజేయు తలంపుతోఁగూడ వ్రాసితిని. నేను రచించి ధర్మశాస్త్రములలోనివని కొన్ని పాత్రముల

నోటఁ బలికించిన ఈగ్రంథములోని శ్లోకముల రెంటినిం దుదాహరించుచున్నాను—

శ్లో. వృద్ధాయ కన్యాం యోదత్వా, తద్భారద్విగుణం ధనం
నోహరేత్స పుమాన్ నింద్య స్తత్పిత్రాణా మధోగతిః.

శ్లో. వృద్ధవిప్రాయ యః కన్యాం, దదాతి ధనకాంక్షయా
స కోటికన్యాదానస్య, లభతే హి ఫలం మహత్ .

(హాస్య సంజీవినిలో బ్రాహ్మవివాహము ముగిసినతరువాత వ్యవహార ధర్మబోధినియను పేర మఱియొక గ్రంథమును గ్రామ్య భాషలో వ్రాసి ప్రచురించితిని. బ్రాహ్మవివాహమునందువలెనే యందలి పాత్రము లనేకములు నిజమైనవి; ఇందలివిషయములనేకములు నిజముగా జరిగినవి. బ్రాహ్మవివాహమునువలె దీనినిగూడ జనులు విశేషముగా చదువుచు ప్లీడరునాటక మని దీనిని పిలుచుచు వచ్చిరి.) నేనొకసారి కాకినాడకు పడవమీఁద బోయినప్పుడు గాలికి తెరచాపయెత్తి పడవనడుపువాఁ డొక్కఁడు పయిని గూర్చుండి యీ పుస్తకమును జదువుచుండుటయు వానిచుట్టును జేరి విద్యావిహీనులయినవారు విని యానందించుచుండుటయుఁ జూచి యత్యాశ్చర్యపడితిని. వ్యవహారధర్మబోధిని మొట్టమొదట వినోదార్థముగా విజయనగరము మహారాజుగారి బాలికాపాఠశాలలోఁ బ్రదర్శింపబడినప్పుడు నూఱులకొలఁది జనులు చూడవచ్చుటయే కాక యందులో వర్ణింపఁబడిన న్యాయవాదులు సహితము కొందఱు చూడవచ్చిరి. ఒక న్యాయవాదియొక్క మేనల్లుఁడు ప్రథమశాస్త్రపరీక్షకు చదువుచుండినవిద్యార్థి యొక్కఁ డా న్యాయవాదియొక్క వస్త్రములనే ధరించివచ్చి కథ వినిపించుచుండఁగా జను లాన్యాయవాదివంకఁజూచి పకపక నవ్వఁజొచ్చిరి. ఆన్యాయవాది యప్పు డేమియు ననక యందఱివలెనే తానును నాటకమును జూచి సంతోషించి యింటికిఁ బోయి

నతరువాత తనబట్టలు వేసికొన్నందునకై మేనల్లుని మందలించెను. ఆకాలమునందు చెన్నపురిలోనున్న దివాన్ బహాదూర్ వల్లూరి జగన్నాథరావు పంతులుగారు 1880-వ సంవత్సరము ఆగష్టునెల 3-వ తేదీని నాపేర వ్రాసిన యుత్తరములో వ్యవహారధర్మబోధినిని గూర్చి యిట్లు వ్రాసిరి—

"I see you are mercilessly exposing the faults of the young Rajahmandrians. Harsh expositions will some times do more harm than good, while they lower the whole community in the estimation of foreign nations. As a Journalist you must perhaps take also into consideration the indirect evil influence which your assertions may some times exert on foreign mind. Think not that vernacular papers are left unnoticed by the authorities. If you will pardon me, I will point out that some of the passages in your వ్యవహారధర్మబోధిని are too sweeping and condemnatory. You have over drawn the picture altogether. The plot and design are no doubt admirable."

(రాజమహేంద్రయువజనులయొక్క తప్పులను మీరు నిర్దయతో వెల్లడించుచున్నారని చూచుచున్నాను. అన్యదేశీయుల గణనయందు ప్రజాసముదాయమంతయు లాఘవపఱచుచు, కఠినమైన దోషప్రాచుర్యము కొన్ని సమయములయందు మేలుకంటె కీడు నెక్కువచేయును. మీ మాటలు కొన్ని సమయములయం దన్యదేశీయుల మనస్సులలో నప్రత్యక్షమైన దురభిప్రాయమును గలిగింపవచ్చునని కూడ పత్రికావిలేఖకులైన మీ రాలోచింపవలసి యుండునేమో! దేశభాషా పత్రిక లధికారులచేత నలక్ష్యముగా విడిచి పెట్టఁబడుచున్నవని మీరు తలఁపవలదు. మీరు నన్ను క్షమించెదు పక్షమున మీ వ్యవహార ధర్మబోధినియందలి వాక్యములలో కొన్ని యత్యంతముగా సముదాయమునకుఁ జెందునవిగాను నింద్యములుగాను నున్నవని నేను చూపెదను. మీరు ప్రతిరూపమును కేవలాత్యధికముగా వ్రాసి

యున్నారు. నిస్సందేహముగా కథయు కల్పనయు శ్లాఘ్యమైనవిగా నున్నవి.)

ఈయభిప్రాయము నాకనుకూలముగా నున్నదని నేనిందుదాహరింపలేదు. లోకములో నభిప్రాయభేదము లెప్పుడు నుండును. అట్లుండుటయే దేశాభివృద్ధి కత్యంతావశ్యకము. మనతప్పులను కప్పిపుచ్చి మంచివారని యితరులకు తోఁచునట్లు చేయవలెననుట కొందఱి మతము. మనతప్పులను వెల్లడించి వానిని తొలఁగించి మనవారిని నిజముగానే మంచివారిని చేయవలెననుట మఱికొందఱి మతము. నేను రెండవ తెగవారిలోఁ జేరినవాఁడను. పుండు పుట్టినప్పుడు దానిని కోసి చికిత్సచేసి మాన్పింపక పుండే లేనట్లు నటించుటలో లోపలకుళ్లుచుండఁగా పైపై నిరామయ స్థితిలోనున్నట్లు పొగడుచుండుటవలన లాభ మెప్పుడును గలుగనేరదని నాయభిప్రాయము. కాఁబట్టి నేను వారి శ్రేయస్సునుగోరియే మనవారిలోఁగల దుర్నీతి రుజలను జూపి యిటువంటి యప్రియ గ్రంథౌషధ ప్రయోగమువలన బాగుచేయఁ జూచితినిగాని వారియందలి ద్వేషభావముచేతఁ గాదు. ఇటువంటి నాచికిత్సలు కొన్ని సమయములయం దనిష్టములును కార్యకారులు కాకపోయినను మొత్తముమీఁద విశేషప్రయోజనమును గలిగించినవనియే నానమ్మకము. నామిత్రులు విషయమునుగూర్చి కాకపోయినను విరచనావిదగ్ధతనుగూర్చి యైనను మెచ్చుకొనిరి.

1880-వ సంవత్సరమునందు ధార్వాడనాటకసమాజమువారు మాపట్టణమునకు వచ్చి గొప్పపాక వేసి దానిలో తమ నాటకములనాడిపోయిన తరువాత పాక తీసివేయకముందే యానాటకశాలలో నాడింపవలెనన్న కుతూహలముతో శ్రీహర్షదేవ విరచితమైన రత్నావళీనాటికను సంస్కృతమునుండి పద్యగద్యములతోను, ఇంగ్లీషుకవులలో నగ్రగణ్యుఁడుగా పరిగణింపఁబడెడు షేక్స్పియరు మహాకవి

విరచితమైన కామెడీ ఆఫ్ ఎఱ్ఱర్సు నాటకము నింగ్లీషునుండి గద్యాత్మకముగాను, అత్యంత శీఘ్రకాలములో తెలిఁగించి యారెంటిని తన్నాటకశాలలో జయప్రదముగా ప్రదర్శింపించితిని. దీనిలో రత్నావళీనాటిక తరువాత నొకసారి ప్రథమశాస్త్ర పరీక్షకు పఠనీయగ్రంథముగా నిర్ణయింపఁబడినది. (1880-వ సంవత్సరమున వివేకదీపిక యను పేరితో స్త్రీపునర్వివాహమును గూర్చిన నాటకములో మూడంకములను, షేక్స్పియరు మహాకవియొక్క నాటకములలో నొక్కటియైన మర్చెంట్ ఆఫ్ వినీస్ (Merchant of Venice) అను నాటకములోని ప్రథమద్వితీయాంకములను వినీసువర్తకచరిత్రమను పేర ద్విపదకావ్యముగాను చేసి ప్రకటించితినిగాని వానిని తరువాత ముగింపలేదు. ఈసంవత్సరములోనే స్త్రీ పునర్వివాహ నాటకము నొకదానిని పద్యకావ్యముగాఁ జేయ నారంభించితినిగాని దానిని సహితము ముగింపలేదు.) ఈ కడపటి పుస్తకములోని పద్యములను గొన్నిటి నిం దుదాహరించుచున్నాను—

సీ. వినవయ్య చెప్పెద విస్పష్టముగ నీకు!
మన దేశమందలి మగువలందు
వైధవ్యదశ నొందువారల దురవస్థఁ
గనుఁగొన్న నెంతటి కఠినునకును
హృదయంబు నీరయి యెంతయు దుఃఖంబు
పుట్టును వారిలో ముఖ్యముగను
బాల్యకాలమునందు పతిహీన లైనట్టి
యబలలదుర్దశ లాత్మలోనఁ
దలఁచు మాత్రన దేహంబు జలదరించి
వారి యాపద వారింపవలయు ననెడు

బుద్ధి పుట్టకపోవదు భూమిలోన
మానవశరీర మెత్తినవానికెల్ల.

ఉ. బాలవితంతుసంతతి వివాహము లేక యథేష్టలీలలన్
జాలఁగ సంచరించుటను సంభవమయ్యెడు కీడులైనఁ దా
మేల యెఱుంగలేరు? పతిహీనలబాధలఁ జూడ వారికిన్
జాలి యొకింత పుట్టదె? నిజంబుగ వారివి ఱాతిగుండెలే?

* * *

గీ. భర్తృహీనలకయి కుంద ఫలము గలదె?
దైవ మీక్షితిఁ బనిలేని తిరుగణీమణుల
'మాఁగిపసుపుఁ' డని మూఁడు బంతులను వ్రాయ
దానిఁ దప్పింప నెవ్వరితరము చెప్పుమ?

* * *

గీ. అయ్యయ్యో! సర్వకారుణ్యుఁ డైనయట్టి
యీశ్వరుఁడు స్త్రీల దుఃఖంబు నెసయుకొఱకె
యనవిమీఁదను సృజియించె నందు మేని
దైవదూషణ మగుఁ గాదె తప్పకుండ!

క. కరుణానిధి యగు దేవుఁడు
ధరణీస్థలి దేనినైనఁ దఱుఁగని వెతలన్
బొరసెడుకొఱకు సృజించునె?
దురితంబగు నతనిమీఁద దోషము నోపన్.

ఈ క్రింది ద్విపదములు విసీసు వర్తకచరిత్రములోనివి—

ద్వి. సమబుద్ధిఁ జూడ నీక్ష్మామండలంబు
రమణీయ నాటకరంగంబు సుమ్ము;
ఎల్లవారును దమకేర్పడ్డ కథను
జెలువు వినిపింపఁ జెడని వేషమున;

కలయ దుఃఖకరంపుఁ గథ వినిపింప
వలయువం తిప్పుడు పడియె నాపాల.

ద్వి. ఇతఁడు 'వినీసు' లో నెల్లరకంటె
నధికంబుగ నిరర్థకాలాపములను
వృథవచించుచునుండు; వివరించి చూడ
గంపెడుపొల్లులోఁ గలిసి లోపలను
నింపుగా వరిగింజ లెందేని రెండు
గలవారీక్రి నితని వాక్యంబులలోనఁ
గలుగును యుక్తియుక్తము లైనవియును,
కనుఁగొన వానిని దినమెల్లఁ బట్టు;
కనుగల్గి శోధించి కనుఁగొంటిమేని,
పడినశ్రమమునకుఁ బ్రతిఫల మింత
పడయంగఁజాలము వాస్తవముగను.

ద్వి. తనచేయు నుపదేశమునుబట్టి నడుచు
కొనువాఁడు దేవుఁడే యని చెప్పవచ్చు;
నేనుపదేశించు నీతులఁ గ్రమము
గా నాచరింపంగఁ గలవారిలోన
నొక్కతె నయి నైన నుండుటకంటెఁ
జక్కనిసద్ధర్మ సమితిని నేను
గరమును సులభంబుగా నన్యజనుల
కిరువదిమందికి నెఱిఁగింపఁ గలను.

* * *

నన్నును నావ్రాఁతలను దూషించుటకయి వేంకటరత్నము పంతులవారు 'హాస్యవర్ధని' యని పేరుపెట్టి యొకపత్రికను బైలు దేఁరదీయఁగా నేనును దానికి విరోధముగా హాస్యసంజీవని యని పేరుపెట్టి మఱియొక పత్రికను బైలుదేఁరదీసితిని. ఇట్లు మా యిరువురకును వాగ్యుద్ధము నడచుచున్నకాలములో పంతులవారు శివశంకర పాండ్యాగారి పేరుపెట్టి తమవిగ్రహతంత్రమునకు వ్రాసినటిప్పణములో శివశంకరపాండ్యాగా రింగ్లీషున పీఠిక వ్రాసి దానిలో మద్రచితమయిన విగ్రహతంత్రము పంతులవారి విగ్రహము ననుసరించి యొకమచేతి వ్రాఁతగా వ్రాయఁబడినట్లు నుడివిరి. దానిపైని నేనును కినుక పొడమినవాఁడ నయి కొక్కొండ వేంకటరత్నకవికృత విగ్రహతంత్ర విమర్శనమును 'గుణాగుణ ప్రదర్శనీసమాజకుఁ' డను పేరితో వ్రాసి ప్రకటింప నారంభించితిని. చూచినవా రెల్లరు నేనే వ్రాసితినని గ్రహించి దానిశైలి కచ్చెరుపడసాగిరి. మొదటఁ బత్రికలోఁ బ్రకటింపఁబడిన మొదటి యెనిమిది పుటలను జదివి రంగయ్యసెట్టిగారు 1876-వ సం॥ అక్టోబరు 27 వ తేదిని నాకిట్లు వ్రాసిరి—

"The article about the 'Pandya's Notes' in your journal has given me immense pleasure. I read and re-read it with great interest. It is an excellent criticism excellently expressed."

(పాండ్యాగారి టిప్పణమునుగూర్చిన మీపత్రికలోని వ్యాసము నా కత్యంత సంతోషమును గలిగించినది. నేను దానిని చదివి యత్యాసక్తితో మరల చదివితిని. అది దివ్యముగా తెలుపఁబడిన దివ్యమైన విమర్శనము.)

నేను దీనిని పెద్ద పుస్తకముగా వ్రాసి ప్రకటించియుందును గాని పంతులవారు మొదటి యెనిమిదిపుటలను జదువఁగానే తమ యొుకలేకయే పాండ్యాగా రామాటలను వ్రాసిరి గాన క్షమించి విమర్శనమును మానవలసినదని నాపేర సుహృద్భావముతో వ్రాసి

నందున నేను మొదట నుద్దేశించుకొన్నట్లు వ్రాయ కక్కడక్కడ కొన్ని భాగములను మాత్రమే విమర్శించి సంక్షేపించి ముగించితిని. నావ్రాంతయొక్కయు విమర్శనముయొక్కయు రీతిని జూపుట కయి యుపోద్ఘాతమును కథా విమర్శనములో నొకభాగమును మాత్ర మిందు బొందుపఱుచుచున్నాను—

'కొన్నిదినములక్రిందటం జెన్నపురిలో బ్రహ్మశ్రీ మహారాజశ్రీ రా. శివశంకర పాండ్యా, బీ. ఏ. గారి పేరిటం బ్రకటింపంబడిన బ్రహ్మశ్రీ కొక్కొండ వేంకటరత్నము పంతులవారి విగ్రహతంత్ర టిప్పణ పుస్తకమొక్కటి నాలోచనగోచరంబయి, చేకొనిచూచు నప్పుడది మన్మనంబు నద్భుత ప్రమోదంబులపాలుచేయుటయె కాక తనమీఁద విమర్శనమును వ్రాయంబురికొల్పి, నాస్వాంతము నెంత యుం బీడింపంజొచ్చినది. నేనును దాని నిర్బంధమును మానుపుకొం జాల కెట్టకేల కాపని కీకొంటిని. లోకములో నిష్పక్షపాతియగు విమర్శకునకు గుణబాహుళ్యముగల కృతుల విమర్శించుటయే మిగుల వ్యసనకరమైన పనిగానుండును. అట్టి మహాకావ్యముల విషయము లోనే యట్లుండుననంగాం గుమ్మరావములో నిత్తడిముంతలకొఱకు వెదకునట్లు గుణలేశములనేనిం గనిపెట్ట బహుప్రయాసముతో వెదకం దగిన యీ విగ్రహతంత్రమునంటి పుస్తకముల విమర్శకుం బూను కొనుటకంటెం జింతాకరమయిన పని నాబోటులకు వేఱొక్కటి కను పట్టకపోవుట వాస్తవమేయైనను, లోకప్రయోజనమును, న్యాయ మును, పలువిధముల మాటిమాటికిం బ్రేరేప, విధిలేక యిట్టి పాడు పనికి నేను మొట్టమొదటం జొరవలసివచ్చెంగదాయని స్వాంతంబున నెంతయుం జింతిల్లుచున్నాండను. అయిన నిప్పుడు నాచేయు విమర్శ నమునందు న్యాయముగాం బూర్వోక్తవిమర్శనీయ గ్రంథము కోరు నది యంతయు వ్రాయ నాకలమును సాగనీయక, న్యాయముయొక్క

కాఠిన్యమును గొంతవఱకు దయారసంబు పెంపున మార్దవపఱిచి, గ్రంథమునంతటిని మొదలంటఁ గదలింపక స్థాలీపులాకన్యాయముగా నందందుఁ గొంచెము కొంచెముగాఁ బట్టి చూచుచు, మృదువుగ నా యభిప్రాయము నీయ నిశ్చయించినాఁడను. నిర్దాక్షిణ్యముతో గ్రంథమంతయు విమర్శించునెడ నీతిచంద్రిక విగ్రహతంత్రములవంటి పొత్తము లయిదు నిండుట యనివార్యమే యయినను, కాలము చాలకయు మనసుగొలుపకయు నట్లు చేయనొల్లక కరము సంగ్రహపఱుపనెంచిన నా చాంచల్యమునకు గుణగ్రహణపారీణులందఱు మన్నింతురని వినయముతోఁ బ్రార్థించుచున్నాను. మఱియు నీ గ్రంథవిమర్శనమునకుం బ్రారంభకముందే వేంకటరత్నము పంతులుగారి యందుఁ గాని తచ్ఛిష్యులగు శివశంకర పాండ్యాగారియందుఁగాని నాకేవిధమైన ద్వేషమును లేదనియు విమర్శనీయ గ్రంథమునందు గుణములేవేనిఁ గానిపించినచో నట్టిగుణములను సహితము దీనికడపట లిఖియించెదననియుం గూడ విన్నవించుచున్నాను.'

'ఆవలఁ గొంతదూరము సాగిన వెనుకఁ జిత్రవర్ణునిపాలనున్న కీరమొక్కఁడు దుర్జనునితోఁడఁగూడి పోఁగూడ'దని చూపుటకై తన స్వామితోఁ జెప్పిన కథను దెనిఁగించుచున్నా మనుకొని, పంతులవారు తలయుందోఁకయు లేకుండ వెఱ్ఱివ్రాఁతను వ్రాసిరి. దానివలనఁ బంతులవారికి సంస్కృతవాసనయేని లేదని తెలియవచ్చుటయే కాక వారికిం గల బుద్ధికౌశలముగూడ బట్టబయలగుచున్నది. ఆకథ యేదనఁగా:-

'దేవ వర్తకవార్తామపి కథయామి ఏకదా సర్వపక్షిణో భగవతో గరుడస్య యాత్రాప్రసంగేన సముద్రతీరం చలితాః తత్ర కాకేన సహ వర్తక శ్చలితః అథగచ్ఛతో గోపస్య శిరస్థితదధిభాండా ద్దధి వారంవారం తేన కాకేన ఖాద్యతే తతో యావదసౌ దధిభాండం భూమౌనిధా యోర్ధ్వ మవలోకతే తావత్తేన కాకవర్తకౌ దృష్టౌ

తత స్తేనభేదితః-కాకః పలాయితః- వర్తక స్స్వభావనిరపరాధో మందగతి స్తేన ప్రాప్తో వ్యాపాదితః' అనునది.

సంస్కృతమున వర్తకశబ్దమునకు 'బేహారి' యను నర్థము మృగ్యమగుటయు, 'కోయష్టిక ష్టిట్టిభకో వర్తకో వర్తికాదయః' అను నమర నిఘంటువునుబట్టి 'వెలిచెపిట్ట' యను నర్థము సుప్రసిద్ధమగుటయు నటుండఁగా నీమహాపండితులవారు పయికథ నిందు క్రిందఁ బొందుపఱచినరీతిఁ దెనిగించి తమ యజ్ఞతను లోకమునకంతకు వెల్లడించుకొనిరి.

'మఱియు వర్తకునికథ వినుతు వినుఁడు. తొల్లి పిట్టలెల్ల భగవంతుఁడగు గరుత్మంతుని యాత్రాకౌతుకంబునం బారావారతీరంబుఁ జేరఁబోతె. అపు డొక కాకముతోడఁగూడ నొక బేహారి బయలు వెడలె. పిమ్మట నామార్గమున నే యల్లంతట గొల్లఁడొకఁడు గొంగళిఁ గప్పికొని తలమీఁదిచుట్టకుదురుపైఁ గుదిరిక గుదరఁ బెరుగుకుండఁ బదిలపఱిచికొని చనుచుండెను. ఆ భాండములోని దధి వేమా ఱా పలుగాకికాకి యక్కున మెక్కసాగెను. అల్లన నాగొల్ల తనతల మీఁది పెరుగుకడవ దిగువదించి మీఁద వీక్షించి లక్షించి రాయి యువ్వ ధ్వాంక్షం బాఱాతిరాఁకుడువడ కురువడి నూడనిఁబాఱెను. అవ్వణిజుండు స్వభావనిరపరాధుండగుట నిర్భీకుండై సమాగతుండై యాబాలిశాభీరునిచేతఁ జిక్కి యక్కఱి చక్కాడంబడె.'

'తొల్లి పక్షులెల్ల గరుత్మంతునిఁ జూచుటకుఁ బోవునపుడు 'బేహారి' కూడ, బయలు వెడలనేల? బేహారి కాకముతోడఁ గూడ నేగుట యెట్లు పొసఁగును? ఆత్రోవఁ బట్టుకొనిపోవుచున్న గొల్ల వాని తలమీఁది పెరుగుకుండలోని దధిని కాకము భక్షింపఁగా వాఁడాత్రోవను జనుచున్న వణిజుని నిష్కారణముగా నేల చంపును? ఎందునకయి యీకథ యిచ్చటఁ జెప్పఁబడెనో యాయుద్దేశమును

నెఱవేఱలేదు. ఇచ్చట దుర్మార్గునితో నెవ్వఁడును జనను లేదు. చనినందుచేత వచ్చిన హానియును లేదు. 'వృషతాడనా ద్దంతభంగ' యన్నట్టు తన పెరుగు కాకి తిన్నదను (పంతులవారి) హేతువును బట్టి గ్రహచారముచాలక యీదారిని నడవఁ దటస్థించిన నిరపరాధి యగు వర్తకునిఁ జంప నొడిగట్టినట్టి మహాపుణ్యుఁడు నిజముగాఁ గాకి పెరుగు భక్షింపకున్నను నెవ్వని నైనఁ జంపవచ్చును. ఇంత కంటెఁ గాకిని గొట్ట విసరినరాయి తగిలి వర్తకుఁడు మృత్యుఁ డయ్యె నన్నను యుక్తిసహితముగానుండును. పంతులవారి సంస్కృతజ్ఞాన శూన్యత నొక్క యీ గ్రంథమే కాదు, శివశంకరపాండ్యాగారు సహస్రముఖములఁ గొనియాడిన వారి పత్రికారత్నమును బ్రతిమాస ముం దాను బయలువెడలినప్పుడెల్లఁ దాటికాయలంతలేసి యక్కర ములతో శక్తివంచన లేక లోకమున కెల్లఁ జాటి చెప్పుచున్నది. పత్రికాముఖమ్మున 'శ్రీ యాంధ్రభాషా సంజీవని' యని నిమ్మకాయ లంతలేసి యక్కరములతో ముద్రింపఁబడియున్నది. అందు 'శ్రీ' యనునది విశేష్యమా ? విశేషణమా? విశేష్యమైనయెడల నర్థమేమి? విశేషణమైనచో శుద్ధసంస్కృత సమాసమున 'శ్రీ + ఆంధ్ర = శ్రీ యాంధ్ర' యని తెలుఁగు సంధి యెట్లు వచ్చినది ?'

ఇట్లు కొంతదూరము వ్రాసి కడపట 'పంతులవారి వచన గ్రంథములలో నిది మొదటిది కాఁబట్టియే దీనియందిట్టి పొరపాటులు మెండుగఁ బడియుండును. తరువాత వీరు వ్రాయుచువచ్చు సంజీవని శైలి యీ పుస్తకము శైలికంటెఁ బెక్కు మడుంగులు మిన్నగా నున్నది. అందుచేత వీర లలవాటువలనఁ గ్రమక్రమముగా వృద్ధి నొందుచున్నట్టు తోఁచుచున్నది. కాఁబట్టి వీరింతటితోనే నిరుత్సా హులు గాక, మఱియుఁ దెలుఁగున వచనకావ్యములను వ్రాయఁ బ్రయత్నింతురని వారి నత్యంతముఁ బ్రార్థించుచున్నాను. 'పండిన

వృక్షమునకే తాతిదెబ్బ' లన్నట్టు, పుస్తకముల వ్రాయువారికే విమర్శనములను రాళ్లు తాఁకును. అయిన నవి మొదలఁ గొంతనొప్పి గలిగించియు గ్రంథకర్తను గాలక్రమమున గట్టివానిం గావించుటయే కాక యాతని మహోన్నతుఁ జేసి విమర్శనములగుఱి కందనివానిగాఁ జేయును' అని నిట్టి వాక్యములతో విమర్శనమును ముగించితిని. తప్పులకేమి యెన్నియైనను పట్టవచ్చును. లోకములో నెవ్వరును సర్వజ్ఞులు కాఁజాలరు. ఎంతటి విద్వాంసులు చేసిన పుస్తకములలోను తప్పులుండవచ్చును. వెదకి విమర్శించువా రున్నచో నా పుస్తకముల లోను తెలిసియు తెలియకయుఁ జేసిన తప్పులు కుప్పలుగా నుండ వచ్చును. 'తప్పు లెన్నువారు తండోపతండంబు, లుర్వి జనుల కెల్ల నుండుఁ దప్పు, తప్పు లెన్నువారు తమ తప్పు లెఱుఁగరు' అన్న వేమన యొక్క సత్యోక్తి యందఱు నెఱిఁగినదే కదా? కొందఱి కవిత్వము కఠినముగాను శ్రుతికటువుగాను నుండవచ్చును; కొందఱిది మృదువుగాను శ్రావ్యముగాను నుండవచ్చును. పంతులవా రిటీవలఁ జేసిన కావ్యములలో తను స్వభావపనాన్వయ కాఠిన్యమును మాని వేసి తొంటి యభిప్రాయము మాఱుటచేతఁ గాఁబోలును సాధ్యమై నంతవఱకు స్పష్టపదఘటితమయిన సులభశైలి ననుసరించుచు వచ్చిరి. వార్తాపత్రికలను గూడఁ గఠినమైన గ్రాంథికశైలినే వ్రాయ వలెనని వాదించిన వీరే నేఁటికనాఁడు చెన్నపురి రాజకీయకళాశాల లోని యాంధ్రభాషాభివర్ధనీ సమాజముయొక్క సాంవత్సరికోత్సవ సమయమున నగ్రాసనాధిపత్యము వహింపఁ దటస్థించిన తఱిని తమ యుపన్యాసములో పుస్తకరచనము నాదానివలె సుగమముగా నుండ వలెనని శ్లాఘించినప్పుడు నాకత్యంతాశ్చర్యము కలిగినది.

1875-వ సంవత్సరమునందు కాళిదాసుని యభిజ్ఞానశాకుంతల నాటకమును తెనిఁగింపవలెనని తలఁచి కలకత్తా బొంబాయి మొద

లైన బహుస్థలములనుండి ముద్రితపుస్తకములను రాజమహేంద్రవరములోని యొక పండితునియొద్ద లిఖితపుస్తకమును సంపాదించి చదువనారంభింపఁగా నొకదానిలో నున్నట్లొకదానిలోనుండక శ్లోకములలో పాఠభేదము లుండుటయేకాక కలకత్తాప్రతిలో తక్కినప్రతులలో లేని క్రొత్తశ్లోకములు సహితము కొన్ని కానఁబడెను. అన్ని ప్రతులను దగ్గఱ నుంచుకొని చదువుచు, పాఠభేదము లున్నప్పుడు దేనిలోని పాఠము సమంజసముగా నున్నదని నాబుద్ధికి తోఁచినదో దాని ననుసరించుచు సరసముగా నున్నవని తోఁచిన క్రొత్తశ్లోకములను గైకొనుచు రెండంకములు తెలిఁగించి 1876-వ సంవత్సరమునందు వివేకవర్ధనిలోఁ బ్రకటించితిని. విశాఖపట్టణములోని పరవస్తు వేంకటరంగాచార్యులయ్యవారలంగారు శాకుంతలమంతయు దెనిఁగించిరనియు, అది విశాఖపట్టణములోని సకల విద్యాభివర్ధనిపత్రికలోఁ బ్రకటింపఁ బడుచున్నదనియు విని నే నాపత్రికను దెప్పించి చదువుచు వారిది ముగిసిన తరువాత పూర్ణముగా చదివి యావశ్యకమైనచో నాది పూర్తిచేయవలెనని నా భాషాంతరమును నిలిపివేసితిని. వారును రెండంకములు మాత్రమే యందు ప్రకటించి నిలిపివేసిరి. వారి పుస్తకమును సాంతముగాఁ జదివినపిమ్మట నాపుస్తకమును పూర్తిచేయవలెనని, నాటకశేషమును రచింపక నేను నిలిపివేసినట్లే నాపుస్తకము ప్రకటింపఁబడినపిమ్మట తమది ప్రకటింపవలెనని వారును నిలిపియుందురు. నేనెంతకాలము ప్రతీక్షించినను వారి పుస్తకము ప్రకటింపఁబడుజాడ కానరాకపోయెను. ఇంతలో శాకుంతల నాటకము తెలుఁగులిపిలో చెన్నపురిలో ముద్రింపఁబడినందున నేనా ప్రతిని దెప్పించుకొంటిని. అంతట నేను విదేశపుప్రతుల నొకమూలఁ బడవైచి చెన్నపురిప్రతి ననుసరించియే మిగతభాగమును భాషాంతరీకరించి 1883-వ సంవత్సరమునందు పుస్తకరూపమునఁ బ్రకటించితిని.

'కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకుంతలా' యని మనపూర్వులు నాటకములలో నెల్ల శాకుంతలనాటక మత్యంత రమణీయమైన దని చెప్పియున్నారు. అంతటి రమణీయమైన నాటకరాజము నంత రసవంతముగాఁ దెలిఁగించుటకు నావంటి యప్రౌఢుఁడు సమర్థుఁడు కాఁజాలఁడని నే నెఱుఁగకుండినవాఁడను గాను. అట్లయ్యును తప్పిపోయి నను కాళిదాసునివంటి మహాకవియొక్క యుత్తమ నాటకరచన యందే తప్పిపోవలయునన్న బుద్ధిచాపల్యమును మరలించుకోలేక దీని యాంధ్రీకరణమునకుఁ బూని నాచేతనైన ట్లిట్లో దీని నిర్వహింపఁ గలిగినాఁడను. (నాపుస్తకమును జదివినవా రాకాలమున నాభాషాంతరము మనోహరముగా నున్నదనియే చెప్పుచు వచ్చిరి. వా రట్లనుటకు నామీఁది యాదరణమే కారణ మయియుండవచ్చును. ఇదియొకసారి ప్రథమశాస్త్రపరీక్షకుఁ బఠనీయగ్రంథముగా సహితము నిర్ణయింపఁబడెను. నాటకసమాజములవారు దీనిని బహుస్థలములయందుఁ బ్రదర్శించిరి.) నేను దీనిని రచించినతరువాత దాఁదాపుగాఁ బదేండ్లకు దీనికంటె నెక్కువమనోహరముగా నుండవలెనని క్రైస్తవ కళాశాలాపండితులగు రాయదుర్గము నరసయ్యశాస్త్రిగారు శాకుంతలమును మరలఁ దెలిఁగించిరి; ఈరెంటికంటెను నధికరమ్యముగా నుండవలెనని రెండుమూఁడేండ్ల తరువాత చెన్నపురి క్రైస్తవ కళాశాలా సంస్కృతపండితులగు వేదము వేంకటరాయశాస్త్రిగారు వెండియుఁ దెలిఁగించిరి; తరువాత మఱి రెండేండ్లు తాళి మూఁటికంటెను ముద్దుగా నుండవలెనని దాసు శ్రీరామ పండితులవా రింకొక భాషాంతరము చేసిరి; ఇవన్నియు నిట్లుండఁగా నన్నిటిని మించి యత్యంతహృద్యముగా నుండవలెనని మఱియెనిమిదేండ్లకనఁగా నేనుభాషాంతరీకరించిన యిరువదేండ్లకు తరువాత వడ్డాది సుబ్బారాయడుగారు వేరొక భాషాంతరము చేసిరి. నాభాషాంతరము గూఢపదములను

ప్రౌఢాన్వయములను లేనిదయి పామరులును గ్రహించునట్లుగా తేట తెల్లమయి యుండును. తక్కినవారిభాషాంతరములు కఠినపద భూయిష్ఠములయి ప్రౌఢతరాన్వయ విశిష్టములయి పండితజన గ్రాహ్యములుగా నుండును. అయినను సామాన్యజనులు మాత్రము నా పుస్తకమునే యెక్కువగాఁ జదువుచు నిప్పటికిని సమాదరము చూపుచున్నారు. అందుచేత నాపుస్తకము పెక్కు తడవలు ముద్రింపఁబడవలసినదయ్యెను. నా భాషాంతరీకరణరీతిని జూపుటకు నా శాకుంతలములోని పద్యములను గొన్నిటి నిచ్చట నుదాహరించుచున్నాను.

ఉ. చల్లనివై శ్రమం బడఁపఁజాలిన తామరపాకు వీవనల్
మెల్లన గొంచు వీచుదునొ మిక్కిలిశీతలమైనవాయువున్ ?
సల్లలితారుణాబ్జసదృశంబగు నీచరణద్వయంబు నో
పల్లవపాణి! నాతొడలపై నిడి హాయిగఁ బట్టువాఁడనో ?

చ. ఎవతె జలంబు మీకిడక యెన్నఁడుఁ ద్రాగదు తాను ముందుగా
నెవరితె ప్రేమచేఁ జిదుమ దీప్సితభూషణయయ్యు మీచిగు
ళ్లెవతెకు మీకు తొల్త ననలెత్తుట పండువుగాఁగనుండు నా
ప్రవిమలగాత్రి యేగుఁ బతిపజ్జకు నంద అనుజ్ఞ యీయరే!

ఉ. క్రొందలమందె డెందము శకుంతల తానిపు డేగునంచయో!
క్రందుగ బాష్పరోధముచేఁ గంఠమునుం జెడె దృష్టి మాంద్యముం
బొందె నొకింత పెంచినతపోధనులే యిటుకుంద నెంతగాఁ
గుందుదురో తమంతఁగనుకూఁతులఁ బాయుగృహస్థు లక్కటా!

ఉ. మమ్ములసత్తపోధనుల మాన్యభవత్కులమున్ స్వబంధులన్
సమ్మతివేఁడ కీమె యెటొ సల్పిన నీపయికూర్మి నెంచి మా
కొమ్మను నేలుకొమ్ము సరికొమ్మలతో సమగౌరవంబునన్
బిమ్మటిదెల్ల భాగ్యమగుఁ జేర్కొనరా దది యింతిబంధువుల్.

చ. గురులకు సేవఁజేయు మనుగుంగతిఁ జూడుము నీసపత్నులన్
వరుఁ డలుక న్వహించినను భర్తృవిరుద్ధవు గాకు మీసునన్
పరిజనులందుఁ జూపుము కృపం గడుఁ బొందకు భాగ్యగర్వమున్
తిరిగిన నిట్లు కాంతురు సతీత్వము కాంతలు నింద్య లొండుచోన్.

శాకుంతలనాటకమును తెనిఁగించినతరువాత భవభూతి విరచితమైన యుత్తరరామచరిత్రమును తెలిఁగింపఁ దలఁచితిని గాని దానిని నామిత్రులైన వావిలాల వాసుదేవశాస్త్రిగారు తాము తెనిఁగించెద మని చెప్పినందున దానిని మానివేసితిని. నేను తరువాత తెనిఁగించిన సంస్కృతనాటకము కాళిదాసప్రణీతమైన మాళవికాగ్నిమిత్రము. ఇది రత్నావళివలెనే నాటిక యయి బహువిషయములయందు దానిని బోలియుండును. దీనిని 1885-వ సంవత్సరమునందు నేను ముద్రింపించి ప్రకటించి, కృష్ణమిశ్రవిరచితమైన ప్రబోధచంద్రోదయమును దెనిఁగింప నారంభించి ప్రథమాంకమును వివేకవర్ధనిలోఁ బ్రచురించితిని. శైలిని జూపుటకయి మాళవికాగ్నిమిత్రములోనుండి రెండుమూఁడు పద్యముల నిం దుదాహరించి తరువాత ప్రబోధచంద్రోదయనాటకమునకు వచ్చెదను.

ఉ. కొందఱు విద్య నన్యులకుఁ గోవిదులయ్యును నేర్పలే రిలన్;
గొందఱు బోధచేయుదురు గొప్పఁగఁ గొంచెమెతాము నేర్చియున్;
బొందుగ రెండిటం దెలివిఁ బొంది వెలింగెడు బుద్ధిశాలులే
యెందును నగ్రగణ్యు లని యెన్నిక గాంతురు శిక్షకాళిలోన్.

చ. తరుణులు వేడ్కతోఁ బ్రథమదర్శనకాలమునందుఁ దద్దయుం
బురుషులరూపము ల్నయనము ల్తనియంగను జూడఁగోరియున్
ధరఁ దరళాయతాక్షులు మనఃప్రియులం దిలకించుపట్టులన్
గరమును విప్పి కన్గొనరు గాఁ గనుదమ్ములనిండ నెప్పుడున్.

గీ. సర్వమును బ్రాఁతదని యెందు సాదు గాదు;
క్రొత్తదనియె కావ్యమునకుఁ గొఱఁతరాదు;
యోగ్యులు గ్రహింతురారసి యుత్తమంబు;
మూఢుఁ డన్యులనే నమ్ము బుద్ధి లేక.

1885-వ సంవత్సరమునం దారంభించి యప్పటికి నిలిపివేసిన ప్రబోధచంద్రోదయ నాటకమును మరల నందుకొని చింతామణి మాసపత్రికయందుఁ గొంత కొంతగాఁ బ్రకటించి 1891-వ సంవత్సరరమునందు పుస్తకరూపమున ముద్రింపించితిని. ఇది యద్వైతమత సిద్ధాంతమును బ్రతిపాదించుటకయి చేయబడిన వేదాంతనాటకము. ఇందు వివేకునకును మహామోహునకును పోరాటము జరిగి కడపట వివేకునకు జయము కలిగినట్లు వర్ణింపఁబడినది. ఇందలి పాత్రానుగుణముగా కొన్ని పద్యములు నా సామాన్య సులభశైలిని కాక యీక్రింది చందమున కఠినశైలిని రచియింపఁబడినవి,

ఉ. ఈ నిశితోగ్రఖడ్గ వినికృత్తభవద్గళనాళికోచ్ఛల
త్ఫేనిల బుద్బుదౌఘయుత భీకర శోణిత భూరిధారలన్
నే నిదె తృప్తిచేసెద వినిశ్చలభక్తికి దుర్గకిప్డు క్రీ
డానినదోల్లసడ్డమరుఘాంకరణాగత భూతవర్గకున్.

మ. ప్రచురోద్ధూత రజశ్ఛటానుమిత శుంభద్యాన ధావత్ఖురా
గ్రచయోష త్పరిచుంబితోర్వ్యపరిభాగంబుల్ మహావాహముల్
ప్రచలన్మందర మథ్యమాన జలధిధ్వానోగ్ర ఘోషంబుగా
నుచితప్రౌఢిని వ్యోమమార్గమున నోహో! తేరు గొంపోయెడిన్.

శా. ధారాయంత్రపతజ్జలోదిత నితాంతధ్వాన సంయుక్తముల్
నీరేజారికరప్రభాధవళముల్ చెల్వొందు సౌధాగ్రముల్
భూరిప్రేక్ష్యము లై శరద్ధవళ జీమూతాంతరాజత్తటి
చ్ఛ్రీరమ్యంబు లవే పతాక లెసఁగుం జిత్రద్యుతి న్మేడలన్.

అందుచేతఁ గొంద ఱసూయాపరులీపద్యములే నావికావనియు నంది మల్లయ్య, ఘంట సింగయ్యకవుల గ్రంథములోనుండి తీసికొనఁబడిన వనియు ప్రవాదము వేసిరి. ఎఱుఁగనివారు నిజమేమో యని సందేహపడఁజొచ్చిరి. పయి యిరువురు కవులును ప్రబోధచంద్రోదయ నాటకకథను గైకొని పద్యకావ్యము నొకదానిని రచియించి యుండిరి. నేను దానిని ముద్రించి ప్రకటించిన తరువాత నితరులు సత్యము నెఱిఁగి యడుగుచు రాఁగా పూర్వ మపవాదములు వేసిన యసూయాగ్రస్తపండితులు సిగ్గుపడి మౌనముధరించి యూరకుండిరి. నేను ప్రబోధచంద్రోదయ నాటకమును ప్రచురించినతరువాత వడ్డాది సుబ్బారాయఁడుగారు తమ ప్రబోధచంద్రోదయనాటకమును ప్రకటించిరి, ఇట్లు తమది ప్రకటింపక పూర్వమును నాపుస్తకము ప్రకటింపఁబడిన తరువాతను తాము చేసిన గీతపద్యము నొకదానిని దానికిసరియైన నాపద్యమును తమమిత్రులకుఁ బంపి తమదే మంచి దయినట్టు వారివలన నభిప్రాయములను బడసి సుబ్బారాయఁడుగారు వాని నొక పత్రికలో ప్రకటింపించిరి. అందుమీఁద వారి పుస్తకము బయలఁబడఁగానే వివాదము లారంభమయినాపుస్తకమును దానితోఁ బోల్చుచు విమర్శనములు పైపైబయలుదేఱసాగినవి. ఒకరు వ్రాసినపద్యమును జూచి మఱియొకరాపద్యమునకంటె రమ్యముగా మఱియొకపద్యమును వ్రాయవచ్చును. ఎవరిపుస్తకము వారి కితరులదానికంటె నధికరమణీయముగ కనఁబడుటయు స్వాభావికమే. అయినను నాపుస్తకమునకే యధికవ్యాప్తి కలిగియున్న దని నే ననుకొనుచున్నాను. నా ప్రబోధచంద్రోదయమునుండి మఱి మూఁడు పద్యముల నిందుఁ జూపుచున్నాను.

ఉ. సుందరమందిరంబులును సోయగపుంజవరాండ్రు పట్టుదా
మందరవోల్లసల్లతలు మల్లెలతావులనొప్పు గావులున్

జందురతోఁడి రేలు నెట నాకు నమోఘబలంబులౌట గె
ల్పొందఁగ నవ్వివేకుఁ డెటులుండుఁ? బ్రబోధుఁడు నెట్లుపుట్టెడున్!
చ. కలదఁట యాత్మ యొక్కటి జగంబున దేహముకంటె వేఱుగా!
ఫలమది మీఁదఁ గాంచునఁట భద్రముగాఁ బరలోకమం దహో!
వలవని యీదురాశయు నభ స్తరురాజము పూచి స్వాదుస
త్ఫలముల నిచ్చునన్ భ్రమమునంటిది కాదె తలంచి చూడఁగన్
ఉ. దారిని బాంథు లేటివఱదం దరుకాండము లాకసంబునన్
వారిదముల్ సముద్రమున నావికులుం వడిఁగూడి పాయున
ట్లారయఁ దల్లిదండ్రులును నాత్మజులున్ సఖులున్ సహోదరుల్
చేరుచుఁ బాయుచుందు టిది సిద్ధము ప్రాజ్ఞుల కేడ శోకముల్?

ఈపుస్తకమునకుఁ బూర్వమున నేనొక నాటకసమాజమువారు తా మాడుటకయి ప్రహ్లాదునికథను నాటకముగా వ్రాసిపెట్టుమని నన్నడుగఁగా 1885-వ సంవత్సరమునం దతిత్వరితముగా ప్రహ్లాదనాటకకమును వ్రాసి ముద్రింపించితిని. సంఘమురాచార సంస్కరణమును పరిశుద్ధమతధర్మ ప్రకటీకరణమును నామనస్సు నెప్పుడును బాయకుండును గాన నేనేపుస్తకము జేసినను దానిలో నవకాశ మున్నయెడల నే సందర్భముననైనను వాని నించుక చొప్పించుచుందును. కాఁబట్టి యీపుస్తకమునందును వాని చిహ్నములు కానవచ్చును. ఇందు నృసింహమూర్తి నోటఁ బలికించినమాటలను వినుఁడు.

సీ. శ్రీమహావిష్ణుండ సింహముఖంబును
నరరూపమును దాల్చి కరుణతోడ
భక్తునిఁ గావంగ వచ్చితి నిచటికి
వినరయ్య జనులార! పీను లలర!
దుడ్డునామము పెట్టి తులసిపేరులు దాల్చి
మ్రొక్కుమాత్రన మీకు ముక్తిలేదు

నాపాదభక్తులై నను దృప్తుఁ జేయంగఁ
దలఁతు రేనియు మీరు తెలియ వినుఁడు
ముందుగా మీరలు భూతకోటులయందు
దయ గల్గి సత్యంబు తప్ప కెపుడు
కామాదుల జయించి కరుణాప్రపూర్ణులై
పరవంచనము లేక పరవనితల
తోడఁబుట్టువులట్లుఁ దోడిమానవులను
సోదరులట్లును జూచుకొనుచు
నీతిమార్గంబున నిత్యాదరముతోడ
మీరెల్ల నిరతంబు మెలఁగ వలయుఁ
జిత్తశుద్ధిలేని సేవచే నింతయు
ఫలము లేదు గాన భక్తితోడ
నన్నుఁ గొలుచుచుండి నాకుఁ దృప్తిగొనర్చు
పనులు సలిపి ముక్తిపదవి గనుఁడు.

(ఈ నాటకముతరువాతఁ జేయఁబడిననాటకము రాగమంజరి. ఇది 'షెరిడన్' అను నింగ్లీషుకవిచే రచియింపఁబడిన 'ద్యూయీనా' యనునాటకకథ ననుసరించి చేయఁబడినది. ఇందలి కథ మిక్కిలి రమ్యమయి యుండును. కథ యెంత మనోహరముగా నున్నను కొంచెము చిక్కుగా నుండుటచే సామాన్యజనులు దీనిని చక్కఁగా గ్రహించి పొందవలసి నంత యానందమును బొందఁజాలరు. ఈక్రిందిపద్యమును ద్విపదమును రాగమంజరిలోనివి.

ఉ. పుత్రిక లుద్భవిల్లినను పోవును సౌఖ్యము కొంత తండ్రికిన్
చిత్రము! శాంతి యుండ దిఁకచిత్తములో క్షణకాల మేనియున్
ధాత్రిని నిర్వదేండ్లు కడఁదాటకులోనను చెప్పుబుద్ధులన్
బుత్రిక లిట్లు మీఱి కరము న్వెతగూర్తురు కన్నవారికిన్.

ద్విపద. కాలమా! ఱెక్కలుగట్టుకొం చీవు
హేలాగతిని నిల్వ కెగసెద వంచు
నేకవి నినుఁ బొల్త నిలను వర్ణించె
నోకాని యాతఁ డీయుర్విలోఁ దాను
బ్రియురాలి నెన్నఁడుఁ బెడఁబాయనట్టి
వయసువాఁ డయి యుండవచ్చు సత్యముగ.
దినమొక్కటేనియుఁ జిన్నగాఁ దాను
బెనుపొందువలపుతోఁ బ్రియురాలిఁ బాసి
విరహాగ్ని వేఁగినవెంగలి యెవఁడు
పరుగెత్తెదు వటంచుఁ బలుకను నిన్ను ?

దీనిని రచించిన 1885-వ సంవత్సరమునందే భారత విరాట పర్వములోని దక్షిణగోగ్రహణ కథను పద్యగద్యాత్మకముగా నైదంకముల నాటకముగా రచియించి ముద్రింపించినాఁడను. రాగ మంజరికథవలెఁ గాక యీకథకు మనవా రలవాటుపడి దీని నెక్కువ యాదరముతో చదువుచు వచ్చిరి. దీనినుండి కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను.

మ. బక కిమ్మీర హిడింబముఖ్య దనుజవ్రాతంబు నెవ్వాఁడు మ
త్తకరీంద్రంబులఁద్రుంచుసింహముగతిన్ దాఁద్రుంచె, నెవ్వాఁడుయా
చకబంధున్ భుజవీర్యసింధుని జరాసంధున్ హతుం జేసె, నా
పరికటక్షేముని భీమునిం దలఁప నాప్రాణంబు భీతిల్లెడున్.

మ. లయ కాలాంతక భీషణాకృతిని లీల న్నీదు సేనాటవిన్
రయమారంగ శరార్చులం బొదివి తీవ్రప్రక్రియం గాల్చుచున్
భయదాస్త్రంబుల నవ్విరాటుఁడు నినున్ ధర్మోద్ధతిం దాకఁ ద
ద్దయుఁ బ్రాణంబును మానమున్ రణమునం దక్కించుకోనేర్తువే?

చ. వనితరో! గ్రీష్మతాపమున వాడినపూసరమట్టులున్న యీ
తనువును దుఃఖవహ్ని నిటు తాపమునొందఁగఁ జేసెదేల? న
మ్మనమునఁదాల్మిపూని యిఁక మానుము శోకము; నిన్నుఁజూచి నీ
తనయులు నేముఁ గుందెదము; ధైర్యమున న్మము నూఱడింపుమా!

ఉ. గోపకులార! చింతపడకుం డణుమాత్రము మీరు దీనికిన్;
తూపు లవెన్ని మీయెడల దూఱెనొ వానికి నూఱురెట్లుగాఁ
దూపులు వానిదేహమున దూర్చెదఁ, గార్చెద నెత్రుటేరులన్,
బాపెద మీపరాభవము, పంపెద నంతకుచెంతకు న్రిపున్.

రాజమహేంద్రవరమునందలి నాటకోజ్జీవక సమాజమువారు ప్రయోగించుటకయి హరిశ్చంద్రోపాఖ్యానమును నాటకరూపముగా కథను మార్పక వ్రాసియిండనికోరఁగా వారికోరిక ననుసరించి 1886-వ సంవత్సరమునందు రెండుమూఁడు వారములలో నాలుగంకములు రచించితిని; గాని వారప్పుడు దానిని ప్రదర్శించుటకు వలనుపడనందున నంతటితో నిలిపితిని. తరువాత కాకినాడలోని యొకనాటక సమాజమువారు దానిని తామాడుటకయి పూర్తిచేసి యిండని యడుగఁగా వారముదినములలోఁ బంచమాంకమునుగూడఁ జేసియిచ్చితిని. వారు దాని నాడినప్పుడు విశాలమైన నాటకశాలయంతయు చూడవచ్చిన జనులతోఁ గ్రిక్కిఱిసిపోయెను. చూచినవా రందఱును నాటకమును బహువిధముల శ్లాఘించిరి. ఈనాటకమును నేను మొదట వివేకవర్ధనిలోఁ బ్రకటించి 1889-వ సంవత్సరమునందు పుస్తకరూపమున ముద్రింపించితిని. ఈపుస్తకము వార్తాపత్రికలలోఁ బ్రశంసింపఁబడినది. హరిశ్చంద్రకథ సర్వజనప్రియమైనదిగానఁ బత్రికాధిపతులు గాక తదితరులును గొందఱు దీనివిషయమయి పత్రికలకు వ్రాయఁజొచ్చిరి. అట్టివారిలోఁ గొందఱు నాపుస్తకమును బ్రశంసించుటతోఁ దృప్తి నొందక, పోలికలకు దిగి నాపుస్తకమును శంకరకవిదానితోఁ బోల్చి,

నాదే శ్రేష్ఠమైనదని జోలిమాలిన వాదములలోఁ బ్రవేశించిరి. ఒక పక్షమువారు చంద్రమతిని విక్రయింపఁజూపినప్పుడు శంకరకవిజెప్పిన

సీ. నిద్దంపు నునుమించుటద్దంబుఁ బ్రిహసించు
 ముఖమండలముగల మోహనాంగి
వెలిదమ్మిరేకుల విభ్రమంబుల గెల్చు
 కన్నులుగల కలకంఠకంఠిఁ
బూవుగుత్తులతోడఁ బోరాడనోపు
 వక్షోజముల్గల మృగరాజమధ్యఁ
గాదమతుమ్మెదలకుఁ గాదఘుటింపఁగఁజాలు
 కుంతలంబులుగల గురునితంబఁ
బచ్చిపగడంపుదీఁగకు హెచ్చుఁజూపు
కెంపువాతెఱగల రాజకీరవాణిఁ
బ్రణుతిఁగాంచిన నాపాలిభాగ్యలక్ష్మి
విక్రయించెదఁ గొనరయ్య వేగ వచ్చి.

అనుపద్యమును, ఆసందర్భమున నేనుజెప్పిన

సీ. కలలోననైన నవ్వులకైన నిసుమంత
 బొంకియెఱుంగని పుణ్యశీల
తప్పుచేసిననైనఁ దన్నుదూఱిననైనఁ
 గోపించియెఱుఁగని గుణధురీణ
పెఱలను దనవారి వేఱుగాఁ జూడక
 సమత నారయునట్టి సదయహృదయ
కానిమాటలు తన్నుఁగలుషాత్ములాడినఁ
 గలహింపనొల్లని గరితమిన్న
పరులసొమ్ము తృణంబుగ భావమందుఁ
దలఁచి యెప్పుడు వర్తించు ధన్యచరిత

చంద్రమతి నాదుభార్య నీసాధ్వీమణిని
విక్రయించెదఁ గొనరయ్య విబుధులార!

అను పద్యముతోడఁ బోల్చి, కులకాంతను విక్రయించున ప్పుడు వదన నయనములను కుచకచములను శంకరకవివర్ణించుటసమ యోచితముగా నుండలే దనియు, సత్యశాంతాదిగుణములను నేను వర్ణించుట సమయోచితముగా-నున్నదనియు వాదించిరి. రెండవ పక్షమువారు విక్రయమునకు తేఁబడినప్పుడు సౌందర్యవర్ణనమును జేయుటచేత కొనఁగోరుపారి కధికాసక్తి గలుగును గాన శంకరకవి మార్గమే ప్రశస్తమయినదని వాదించిరి. ఇది యెవ్వరికిని ప్రయోజన కరముగాని శుష్కవాదము. నా కవిత్వ మెట్లున్నను, శంకరకవి కవి త్వము ప్రశస్తమయినదనుటకు సందేహములేదు. నేనా పుస్తకమును కూడ దగ్గఱనుంచుకొనియే సత్యహరిశ్చంద్ర నాటకమును జేసితిని. నావి యిప్పటికాలపు టూహలచేత శంకరకవియొక్క పూర్వకా లపు టూహలకంటెఁ గొన్ని విషయములలో భిన్నములుగా నుండుట యనివార్యము. నూతనకావ్య మెట్లున్నను-బురాతన కావ్యమునం దెక్కువ యభిమాన ముండుట సర్వసాధారణము. ఈవిషయమయి కాళిదాసు తన మాళవికాగ్నిమిత్రమునందుఁ జెప్పినదానినే యీ క్రింది పద్యములో నేనిపుస్తకమునందు జెప్పియున్నాను.

ఉ. ప్రాఁతదియన్న కారణముఁ బట్టియె సర్వము మేల్మిఁ జెందునే?
నూతనమన్న హేతువున న్యూనతఁ జెందునె క్రొత్త వన్నియున్?
ఖ్యాతిగ నుత్తము ల్గుణము నారసి మంచి గ్రహింతు రెప్పుడున్
భ్రాఁతవె మంచివందు రవిమర్శతఁ గేవల మూఢమానవుల్.

గుణగ్రహణ-పారీణులగు బుద్ధిమంతు లారసి గుణ మొందు న్ననుగ్రహింతురుగాక! నాసత్యహరిశ్చంద్రనాటకమును సర్వకలాశా లవారు ప్రథమశాస్త్రపరీక్షకుఁ బఠనీయగ్రంథముగా నిర్ణయించిరి.

పాఠశాలాపరీక్షకులు బోధనాభ్యసన పాఠశాలలు మొదలైనవానిలో బాఠము గాఁ బెట్టిరి; మహాజనులు తెలుఁగుదేశమునం దెల్లయెడలను మహాసక్తితోఁగొని చదువుచున్నారు. ఈపుస్తక మీావఱ కాఱేడు తడవలు ముద్రింపఁబడినది. అందుచేత నేనీపుస్తకరచనయందు పడిన ప్రయాసము వ్యర్థముకాలేదని నమ్మినవాఁడ నయి యీా పుస్తకము నుండి గుణదోష నిర్ణయమునకుఁ దగినన్ని పద్యముల నిం దుదాహ రించుచున్నాను.

చ. పరసతులెల్లఁ దల్లులు స్వభావగుణంబులు ధర్మవర్తనల్
పరమ సుహృత్తు సూనృతము బంధుచయంబు జగజ్జనంబు స
త్కరుణ విభూషణంబు సముదంచిత శాంతత విత్త మట్టి యా
నరపతి స్వప్నమందయిన సవ్యులకైనను కల్లలాడునే?

ఉ. రాజులు మున్ను వేఁటలకు రారె? మదించిన దుష్టజంతులన్
దేజముచూపి కానలను దీవ్రశరంబుల రూపుమాపరే?
యాజననాథు లే యెడల నాశ్రమభూములఁ జొచ్చి సీవలెన్
నైజమదోద్ధతిన్ మునివనంబుల సాధుమృగాళిఁ గూల్చిరే?

చ. తడవుగఁ జిక్కలం బెనిచి దారుణలీలను గంపఁబిల్లికిం
గడపట నప్పగించి చనుకైవడి, మ మ్మిటు లింతకాలమున్
గొడుకులకన్న నెక్కుడుగఁ గూరిమి నారసి మీాఁద లిప్పు డీ
చెడుమునివాతఁదోచి చనఁజెల్లునె నిర్దయవృత్తి నక్కటా!

సీ. తతహంస తూలికా తల్పంబుననుజేర్చు
మృదుతర దేహమా యిది కుమార!
కమ్మసంపెఁగనూనె కడురాచిపెంచిన
ముంగురులా యివి ముద్దుకుట్ట!
నవరత్నమయభూషణంబులఁ బెనఁగొన్న
హస్తంబులా యివి యనుఁగుపట్టి!

చిఱుగజ్జియలుమ్రోగఁ జెలువొప్ప నడయాడు
చరణంబులా యివి వరకుమార!
నేలఁబొరలాడుచును బెనుధూళి బ్రుంగి
తాలుమాలుగఁ బడి చెల్వుతప్పి యున్న
నీదు కోమలాంగకము లీనేత్రములను
గాంచి యె ట్లోర్తురా ననుగన్నతండ్రి!

చ. అకటకటా! కుమార! చతురబ్ధిపరీత మహీతలం బకం
టకముగ నేలినట్టి ప్రకటప్రతిభుండగు చక్రవర్తిపు
త్రకునకు నీకుఁ బ్రేతవసుధాస్థలిలోపల మూఁడుమూర్ల నే
లకును ముహూర్తకాలము నలంతి స్వతంత్రత లేకపోయెనే?

ఉ. కానల నుంట నిష్ఫలముగాఁ జను నింద్రియ నిగ్రహంబు లే
దేని; మనుష్యుఁ డింట వసియించియు నింద్రియనిగ్రహం బొగిన్
దా నొనరించు నేని, సతతంబును సత్ఫలమొందు; శాంతుఁడౌ
మానవుఁ డెందునున్న వినుమా యదె యాశ్రమరాజమౌఁ జుమీ!

చ. ఒనరు గృహాది భోగములు యోగములే? వ్రతివృత్తి వ్రేల్పు నిం
ధనములె యాధనంబులు? ఘనావృణిఘోషలు వేద ఘోషలే?
మొనసిన పూవుఁదోటలు తపోధనపాటులె? రాజ్యమాజ్యమే?
మునికి నివేల భూవిభవముల్? వెతపెట్టఁగఁ గాక సాధులన్.

చ. తన కుపకారము ల్బలుపు రాతయొడం గరముం గృతఘ్నుఁడై
ముని యపకారముం జేసినను భూమిపయిం గడు దస్సి యాకటన్
వసరుచుఁ జెట్టుచేరఁ జని బాగుగ నీడను విశ్రమించి పం
డ్లనుదిని యమ్మహీజ మొకటం డెగఁగొట్టుకిరాతుఁ బోలఁడే?

చ. వినుము ధనంబు పేదలను పేరులఁగాఁగను పోఁపఁ జేసెడున్
ఘనకర బుద్ధిమంతులుగఁ గన్పడఁ జేయును బుద్ధిహీనులన్

బనుపడఁ దోఁపఁజేయు గుణవంతులఁగా గుణహీనుల న్సదా
జనులను మోసపుచ్చి ధనసంపద చిత్తము మత్తిగొల్పెడున్.

ఉ. నీతికి హేమభూషణ మణిప్రకరంబుల వన్నెరా దిలన్
నీతికి వన్నెపోదు కనన్ వెలమాలిన చింపిగుడ్డలన్
నీతికి గౌరవం బెపుడు నిల్చుఁ జుమీ సహజంబుగాన వి
ఖ్యాతిగ నీతివర్తనము నెంతయు మానక యుండఁగా వలెన్.

1889-వ సంవత్సరమునందు నేను 'తిర్యగ్విద్వన్మహాసభ' 'మహారణ్యపురాధిపత్యము' అను రెండు పుస్తకములను జేసితిని. వీనిలో మొదటిది నామిత్రులైన బసవరాజు గవర్రాజుగారు మరణమునొందినప్పుడు వారిబంధువులను పురోహితులు మొదలయినవారు పెట్టిన బాధలను జూచినప్పుడు వారి దుశ్చర్యలను వెల్లడి చేయవలెనన్న యుద్దేశముతో చేయఁబడిన యాక్షేపగర్భసంభాషణము. ఈ చిన్న నాటకములోని పాత్రములన్నియు పశువులును పక్షులును. వానివాని సంభాషణములు మిక్కిలి మనోహరములుగా నుండును. ఇది భారతములోని గృధ్రజంబుకోపాఖ్యానము మూలాధారముగాఁ గొని చేయఁబడినది. ఇదియును మూషకాసుర విజయమును నొక్కటిగాఁ జేర్పఁబడి జంతుపాత్రములను దెలుపు చిత్రపటములతో ముద్రింపఁబడినది. ఏలూరు లక్ష్మీనరసింహముగారు నామీఁదఁ దెచ్చిన యభియోగములో కొందఱు విద్వాంసు లీచిన్నగ్రంథములోని యాయా పాత్రములు తమ్ముతమ్ము నుద్దేశించి వ్రాయఁబడెనని తమసాక్ష్యములోఁ జెప్పిరి.

రెండవది యైన 'మహారణ్యపురాధిపత్యము'ను పై దానియట్లే యాక్షేపగర్భ నాటకమే. ఇందలి పాత్రములును తిర్యగ్జంతువులే. నక్క నీలికుండలోఁబడి తన శరీరమున కంటుకొన్న నీలిరంగునుబట్టి తన బంధువులను మోసపుచ్చి తన్ను రాత్రి దేవతలు స్వర్గమునకుఁ గొని

పోయి మృగరాజ్యమున కభిషిక్తుని జేసి నీలవర్ణము ప్రసాదించి పంపిరని బొంకి వాని సాహాయ్యమున మృగరాజయి కడపట సత్యము తేటపడఁగా నొక వ్యాఘ్రముచేతఁ జంపఁ బడెనన్న పంచతంత్రములోని కథ దీనికి మూలాధారము. ఇది సంఘములోఁ గల వివిధ దురాచరణములను వెల్లడిపఱిచి వానిని మాన్పింపవలెనన్న ముఖ్యోద్దేశముతో వినోదకరముగా వ్రాయఁబడిన గ్రంథము. ఇది మొట్ట మొదట వివేకవర్ధనిలో భాగభాగములుగాఁ బ్రకటింపఁబడి తరువాత చిత్రపటములతో పుస్తకరూపమున ముద్రింపఁబడినది. ఇది తమ్ముద్దేశించి వ్రాయఁబడినదని వేలూరి లక్ష్మీనరసింహముగారు నాపైని న్యాయసభలలో నభియోగములు తెచ్చిరి.

నాచేత రచియింపఁబడిన నాటకములలోఁ గడపటిది కళ్యాణకల్పవల్లి యనునది. ఇది 'షెరిడన్' అనెడి యింగ్లీషుకవిచేత 'రైవల్సు' (The Rivals) అను పేరితో సత్యాంతమనోహరముగా రచియింపఁబడిన యైదంకముల నాటకమునకు తెలుఁగు. ఇందలి కథ రాగమంజరి యితివృత్తమునకంటెను నధిక హృదయాకర్షకముగా నుండును. అయినను మనవారి కాదేశస్థుల యాచారవ్యవహారములు క్రొత్తవిగాను తమవానికి విరుద్ధములుగాను కనఁబడుటచేత నిట్టివాని నంతగా నాదరింపరు. దీనిని 1894-వ సంవత్సరమునందు ముద్రింపించి ప్రకటించితిని.

నాకు స్త్రీవిద్యయందును స్త్రీలయభివృద్ధియందును విశేషాభిమానము. స్త్రీల దురవస్థకుఁ బలుమాఱు పరితపించి వారి దుస్థితిని దొలఁగింపఁ బ్రయత్నింప వలయుననియు, స్త్రీలను ప్రస్తుతస్థితిలోనే యుంచి తాము పైకి లేచుట పురుషుల కెన్నఁడును సాధ్యము కాదనియు, తాము బాగుపడవలెనన్నచో వారిని గూడ విద్యావివేకాదులయందు మంచిస్థితిలోనికిఁదెచ్చి వారితోఁ గలిసి యున్నతపదవికి లేవ వలయుననియు, తాము మాత్రమే వృద్ధినొంది వారిని నిజమైన మైత్రి

కనిష్ఠమైన దాస్యమునందే యుంచఁదలఁచిన పక్షమునఁ దెలియకయే, దినదినక్రమమునఁ దా మున్నతపదము నారోహించుచు వచ్చుటకు మాఱుగా నొక్కొక్క మెట్టు దిగుచు వచ్చి కడపటవారితోఁ గూడ నడుగంటుట యనివార్యమనియు, నేను దలంచుచుండెడువాఁడను. వారు చదువుటకు తెలుఁగులో మంచిపుస్తకములు లేకుండుటఁ దలపోసి యాలోపమును నాచేతనైనంతవఱకు తొలఁగింపవలెనని 1883 వసంవత్సరమునందు స్త్రీలకొఱకు 'సతీహితబోధిని' యను పేరితో తెలుఁగున నొక మాసపత్రికను బ్రకటించుట కారంభించితిని. ఆ సంవత్సరమునందే స్త్రీల యుపయోగార్థముగా సత్యవతీ చరిత్ర మనెడి యొక చిన్నవచనప్రబంధమును జేసితిని. దానిని స్త్రీలు మాత్రమే కాక పురుషులు సహిత మత్యాసక్తితోఁ జదువసాగిరి. దానిని చదివి యానందించినవారి నేకులు తమకుఁ బుట్టిన స్త్రీసంతతుల కందలి కథానాయకురాలయిన సత్యవతి పేరు పెట్టిరి. ఈపుస్తక మఱవములోనికిని, కన్నడములోనికిని, ఇంగ్లీషులోనికిని భాషాంతరము చేయఁబడినది. ఇది [illegible] ప్రాడ్వివాకులు మొదలయినవారి పరీక్షలకుఁ గూడ పఠనీయగ్రంథముగా నిర్ణయింపఁ బడినది.

1884-వ సంవత్సరమున స్త్రీల నిమిత్తమయి చంద్రమతీ చరిత్రమును జేసితిని. ఇందు హరిశ్చంద్రుని ధర్మపత్నియైన చంద్రమతి తనబాల్యావస్థయందు గురుప్రసిద్ధ నేర్చుకొన్నట్లుగా మతవిషయమును నీతివిషయమునను ప్రాథమిక ధర్మములు తెలుపఁబడినవి. కడపటి భాగమునందు చంద్రమతియొక్కయు హరిశ్చంద్రుని యొక్కయు కథ కొన్నిమార్పులతోఁ జెప్పఁబడినది.

1887-వ సంవత్సరమున స్త్రీలకొఱకు 'సత్యసంజీవిని' యను నీతిబోధకమయిన యొక పుస్తకమును జేసితిని. దీనిలోని కథను నేనేదో యింగ్లీషు పుస్తకమునుండి గ్రహించితినిగాని యేపుస్తకము

నుండి గ్రహించితినో నా కిప్పుడు స్మరణమునకు రాలేదు. ఈపుస్తకమునం దసత్యమాడుటవలని యనర్థములు నిదర్శన పూర్వకముగా మనస్సున నాటుకొనునట్లు చెప్పఁబడినవి. ఈపుస్తకమును జదివినప్పుడొక బాలిక తా నావఱకాడిన యసత్యము స్మరణకురాఁగా పుస్తకము క్రిందఁబెట్టి యేడువఁదొడఁగెను.

1891-వ సంవత్సరమునందు స్త్రీలవిషయమున మనవారు చేసిన యన్యాయములు తేటపడునట్లుగా వ్యాజరీతిని సత్యరాజపూర్వదేశ యాత్రలయొక్క ప్రథమభాగమును రచించి ప్రకటించితిని. నే నింగ్లీషును 'గల్లివర్సు ట్రావెల్సు' (Gulliver's Travells) చదివినప్పుడు వ్యాజరూపమున మనలోని దురాచారములను మూఢవిశ్వాసములను పరోక్షముగాఁ బ్రదర్శించుచు నట్టి పుస్తకమును నాలుగు భాగములుగాఁ జేయవలెనని బుద్ధిపుట్టి మొదట నీభాగమును జేసితిని. దీనిని మనవా రత్యద్భుతపడి చదువఁదొడఁగిరి. మనలో నింగ్లీషురానివా రనేకులు కల్పితకథకును సత్యచరిత్రకును భేదము కనిపెట్టలేకున్నారు. ఈపుస్తకము ప్రకటింపఁబడినప్పుడు సత్యరాజనునతఁడు నిజముగానే యున్నాఁడనియు నిజముగానే యతఁడీ యాత్రలు చేసినాఁడనియ భ్రమపడి యాతనికి వ్రాసి తాము స్వయముగా నెక్కువ వివరములను దెలిసికోవలెనన్న యభిలాషముతో నాతనికి వ్రాయవలసిన యుత్తరముయొక్క పైవిలాసమును దెలుపవలసినదని బహుస్థలములనుండి నాకు లేఖలువ్రాసిరి. ఈపుస్తకమింగ్లీషులోనికిని కన్నడములోనికిని భాషాంతరము చేయఁబడినది. ఈభాగమును సాధారణముగా ఆడుమళయాళమని వాడుదురు. జ్యోతిశ్శాస్త్రములోని జాతకభాగముయొక్కయు ముహూర్తభాగముయొక్కయు నవిశ్వసనీయతను పరోక్షముగాఁ దెలుపుటకయి పయి

యట్లు లంకాయాత్రయను రెండవభాగమునుగూడఁ జేసి ప్రకటించితిని గాని మూఁడు నాలుగు భాగములను జేయలేదు. ఈ రెండవభాగము కూడ కన్నడములోనికి భాషాంతరీకరింపఁ బడినది.

1897-వ సంవత్సరమునందు స్త్రీలకొఱకు శ్రీవిక్టోరియా మహారాజ్ఞిగారి చరిత్రమును బటములలోఁ బ్రకటించితిని. ఈపుస్తకమును జేయునప్పటికి రాణిగారు సజీవులయి యుండుటచేత నామె యంత్యదశ యందుఁ జెప్పఁబడలేదు.

1893-వ సంవత్సరమునందు నీతికథామంజరిని జిత్రపటములతో రెండుభాగములుగాఁ బ్రకటించితిని. ఈపుస్తక మింగ్లీషులో నున్న యీసపుకథల ననుసరించి చేయఁబడినది. ఈ కథలు మిక్కిలి మనోహరముగాను నీతిబోధకములుగాను నుండును. ప్రతికథయొక్క యంతమునందును కథవలన నేర్చుకోవలసిన నీతిని దెలిపెడు పద్య మొకటి చేర్పఁబడియున్నది. అట్టి పద్యములలోఁ గొన్నిటి నిందు క్రింద నుదాహరించుచున్నాను—

గీ. ఇంట నూరక కూర్చుండి యెందరైనఁ
గానఁబడుదు రూపాయము ల్గఱపువారు;
కాని, కానరా రొక్కరుఁ గష్టమైన
పనిని బయివేసికొని చేయు బాహుబలులు.

గీ. వసుధలోపల నరులను బాదుచేయ
స్తోత్రపాఠులమించు శత్రువులు లేరు;
లాభమొందఁ ముఖస్తుతు ల్సలుపువారి
వలలఁ దగులక కను గల్గి మెలఁగ వలయు.

గీ. అన్యులను మోసపుచ్చంగ నరయువారు
తామె మోసపోవుదు రెందు ధరణిలోన;

పరులకును గీడుఁ గోరెడు వారలకును
మేలుచేయునె దైవంబు మేరమీఱి?

గీ. కష్టపడునట్టివారు లోకంబుతోడ
మొఱ్ఱపెట్టరు తమకష్టములనుగూర్చి;
వట్టివారలె యఱతురు మిట్టిపడుచు
గొడ్డుగేదెల కఱపులు గొప్పగావె?

గీ. పరులలోపంబులను జక్కపఱతునను నెడు
వాఁడు తీర్చుకోవలె స్వలోపములఁ దొలుత;
తనదు రోగంబునే మాన్పుకొనఁగలేని
వైద్యుఁ డొరులరోగము లెట్లు బాగుచేయు?

గీ. అనుభవంబునుబట్టియే యనవియందు
జనులకును దెల్పి యబ్బుట సహజగుణము;
కాలుగాలి భ్రమంపడు గండుఁబిల్లి
నిప్పువద్దకుఁ బోవునే యెప్పుడైన?

గీ. అన్యునకుఁ దాసుఁడై యుండి యనవరతము
పాయసాన్నంబు గుడుచుచు బ్రతుకుకంటెఁ
దాను బరువేఁడబోక స్వతంత్రవృత్తి
గంజిద్రాగుచు బ్రతుకుట కరము లెస్స

గీ. దాపునఁ గరస్థమయి యున్నదాని విడిచి
దవుల సందిగ్ధమగుదానిఁ దగదుఁ గోర;
మింటిమేఘంబులను నమ్మి యింటిచెఱువు
జలముఁ బాఱజల్లించెడుజడుఁడు గలఁడె?

గీ. ప్రాజ్ఞునకు ప్రాణహీనమగా బ్రతుకుకంటె
గౌరవముతోడి మరణంబె కరము మేలు;

జీవనంబునకై కీర్తి చెఱుపుకోక
యశము నెల్లరు గడనచేయంగవలయు.

గీ. పరుల మోసముచేసెడువారు కూడఁ
బోగులుదురు తమ్ముఁ బరులింత మోసపుచ్చ;
కడకు వంచన వ్యధ తెచ్చుఁగాన మనుజు
లొండొరుల మోసపుచ్చక యుండవలయు.

గీ. ప్రజలు తమదోషముననె విపత్తులొంది
నిలుపుదు రదృష్టదేవతతలను దప్పు;
ధరణిఁ దమకీడుమేళ్లకుఁ దామె కాని
కాదు భాగ్యదేవత యెందుఁ గారణంబు

గీ. క్రొత్తవారికి మది భీతిఁ గొలుపుచున్నఁ
బరిచితులకు హాస్యాస్పదుఁడౌ నమరుఁబోతు;
అడవులనుబట్టి సింహంబులట్లయున్న
గాడిదలె చేష్టలందుఁ బెక్కండ్రు జనులు.

గీ. ప్రజల నందఱ సంతోషపఱుపఁ గోరి
యెల్లరకు నింపుగ మెలంగ నెంచువాఁడు
పిదప నెవ్వరి సంతోషపెట్టలేక
యన్నిటికిఁ జెడ్డ మతిహీనుఁడగును జుమ్ము.

1889-వ సంవత్సరమునందు స్త్రీలకత్యావశ్యకములైన శరీరారోగ్యధర్మములను బోధించెడు "దేహారోగ్య ధర్మబోధిని" యను గ్రంథమును జేసితిని. 1896-వ సంవత్సరమునందు "పత్నీహితసూచని" యను గ్రంథమును జేసి ప్రకటించితిని. ఇందు స్త్రీలయొక్క యార్తవకాలమునందును, గర్భధారణస్థితియందును, శిశుపోషణసమయమునందును, నడవవలసిన మార్గములును జేయవలసిన ధర్మములును

రాఁదగిన రోగములును తన్నివారణార్థ మాచరింపవలసిన చికిత్సలును సామాన్యముగా వివరింపఁబడినవి.

1889-వ సంవత్సరమునందు సతీహితబోధిని యను నామముతో తన్నామమును వహించిన స్త్రీలపత్రికలోని యుపయుక్తములయిన ముఖ్యవ్యాసముల నేర్చి కూర్చి పుస్తకరూపమునఁ బ్రకటించితిని. అవలనే 'స్త్రీనీతిదీపిక' యను పేరితో నీతిబోధకమైన శతకము నొకదానిని బాలికలకై చేసితిని. అటుతరువాత 'సత్యా ద్రౌపదీసంవాదము' 'మాతృపూజ' 'పితృపూజ' అనువానిని స్త్రీల యుపయోగార్థము ద్విపదములుగాఁ జేసితిని. వీనిలోనుండి కొన్ని భాగముల నిం దుదాహరించుచున్నాను—

## స్త్రీ నీతిదీపిక

గీ. విద్యవలనను జ్ఞానంబు వెలయుఁ గాన
నవని 'నిది మంచి' 'యిది చెడ్డ' యనుచుఁ దెలియ
బాలురును బోలెఁ దప్పక బాలికలును
విద్య నేర్వంగ వలయును హృద్యముగను.

గీ. చక్కఁదనమునకును దోడు చదువుకూడఁ
గలిగియుండిన, సంత మహా నలరునకును
దావికలిగిన వసువునఁ దనరుచుండ్రు
పూవుఁబోండ్లు, విద్యాగంధమునను గుమ్ము.

గీ. పువ్వులును మంచి బట్టలు భూషణములు
సుగుణములయట్లు యెన్నఁడు సుందరులకు
శోభ తేనేర వదిగాన సుదతులార!
సుగుణసంపద గడియింపఁ జూడుఁ డెపుడు!

గీ. తానుజేసిన ధర్మంబె తన్నుఁ గాచు
ననెడు లోకోక్తి చిత్తంబునందు నిలిపి,
భర్తయును బంధులును నియ్యఁబనిచినట్టి
ద్రవ్యమున బీదసాదలఁ దనుపవలయు.

గీ. కొమ్మ! యఱకాలునను ముల్లుగ్రుచ్చుకొన్న
నెంతనొప్పిగ నుండునో యెఱిఁగి నీవు
జీవహింస యెన్నండును జేయఁబోకు;
జంతువులకన్నిటికి బాధ సమమె గాన.

గీ. ఆపదలు వచ్చినప్పుడు నలరుఁబోఁడి
తాను ధైర్యంబు విడువక, తక్కఁగలుగు
వారి నూఱార్చి దుఃఖంబుఁ బాపవలయు;
ధైర్యమున నాపద సగంబు తగ్గిపోవు.

సత్యా ద్రౌపదీ సంవాదము

పాట

(ఏకపాదవృత్తము)

శ్రమ యింతయును లేక చల్లఁగా నుండి మంగళ మాఁటల మంత్రతంత్రములఁ
బతుల వశ్యులఁజేయ భ్రమపడుటెల్లఁ బెద్ద వెఱ్ఱితనంబు బింబఫలోష్ఠి!
చెలువుని కావార్త చెవిసోఁకకని మునుపున్న ప్రేమయు మొదలంట విడిచి
త్రాచుపామునుబలెఁ దలఁచు నాసతిని, మఱియు నామందులు మాయలఁ జేరి
వికటించి మగలకు వివిధరోగములఁ బుట్టించి బాధించి మృత్యువు దెచ్చు.
దాన నాయింతి నందఱును దూషింప లోకనిందయుఁ బరలోకహానియును
దలకూడి మిక్కిలి దలవంపులౌదవు, కావున సాధ్వులు కాంతుల యెడలఁ
గావింపఁదగ దెప్డుఁ గపటకర్మముల; కాంతుని మనసును గనిపెట్టి మెలఁగ
నన్నియౌషధములు నవియె యోయమ్మ..............................
ఫలియించెడునట్టి పరమబాంధవుఁడు వరదేశ్వరుని శ్రీ మహిమాన్విత గతిఁ,

సర్వసౌఖ్యములొంద సాధ్వీమణులకుఁ-బతియె నిధానంబు పర్వేందువదన!
పతియనుగ్రహమున బడయు కాంతలకు-సకలగౌరవములు సర్వవస్తువులు
భూషణాంబరములుఁ బుత్రసంపదయు సద్గతియును గీర్తి సకలంబుగలుగు.
కావునఁ బతియాజ్ఞ కలలోననైన మీఱక మెలఁతుక మెలఁగంగవలయు.
కష్టపడినఁగాని కరము సౌఖ్యంబు కలుగ దెవ్వరికిని క్ష్మామండలమున.

## మాతృపూజ

ద్వి. మునుమున్న దేవతా పూజ సల్పి మననిమిత్తము చాల మహిఁ గష్టమొంది
తొలుత గర్భంబునఁ దొమ్మిదినెలలు వలనొప్ప మనలను వహియించి కాంచి
కన్నపిమ్మటఁగూడఁ గడగండ్లఁదోర్చి చన్నులపాలిచ్చి సతతంబుఁ బ్రోచి
యుయ్యెలలోనుంచి యూఁచి లాలించి యెయ్యెడ నొక్కింత యేడ్చినఁగాని
పరుగెత్తుకొనివచ్చి పాటలుపాడి యురమునఁ జేర్చి యోదార్చి పిదప
ననుఁగన్నతల్లి! యో నా చిన్నిపాప! యనిపిల్చుచును జెక్కులాస్యంబు నోరు
ముద్దాడి శిరమును మూర్కొని యావలఁ దద్దయుఁ బ్రేమంబు దైవారఁగాను
మునుఁబొమ్ము మీఁదను బుజములమీఁద వెనుకతట్టునను వేడ్క మోయుచును
నవ్వించి యాడించి నయము చూపుచును బవ్వళించిన యట్టిపట్టుననైన
నేమఱియుండక యెడనెడవచ్చి సేమంబుతో నుంటఁ జేరిచూచుచును
దనకిష్టమైనట్టిదానినిగూడఁ దనప్రాణసమముగ దాఁచిపెట్టుచును
దేహమునకొకింత తెవులు చూపట్ట నాహారనిద్రల నవలఁ బోఁద్రోచి
పరితాపమొందుచు బహువిధంబులను సరసఁబాయక యుపచారముల్సేసి
కాయము స్వస్థతఁ గాంచినదాఁక హాయిగానుండక యటమటించుచును
మనబాగె యెప్పుడు మదిని గాంక్షించి చనవుకు బలిమిని సమయోచితముగ
మంచిబుద్ధులు నేర్పి మనవర్తనమునఁ గొంచెమేనియు నిలఁ గొదవలేకుండ
వర్తించునటు చేయ వడిఁ బాటుపడుచుఁ గీర్తికెక్కెడు మాత కేవల మిలను
మనపాలిఁటికి వేల్పు మాటలేమిటికి? మన మామె మాటను మఱితప్పఁదగదు;
భయభక్తులను జూపి భజియింపవలయు దయలోడఁ జూచుచుఁ దల్లి నెల్లపుడు;
మనమూలమున నామె మది నొచ్చెనేని మనకది శ్రేయస్సు మహిఁ గాదుసుమ్ము.

## పితృపూజ

ద్వి. కడుహర్ష మిడఁ దల్లిగర్భంబునందుఁ బడినది మొదలుగా బహుకష్టపడుచు
మనపోషణమె తన మనసులోనుంచి ధనముధాన్యంబును దక్కువస్తువులు

ముందుగా పాండిరముగఁ గూడఁ బెట్టి మంచులు మాటలు మఱి సిద్ధపఱిచి
యెపుడు పుట్టుదు మెయం చెదురుచూచుచును గృపమీఱఁ గోరుచుఁ గీడురాకుండ
మనము పుట్టినవెనక మనకెందులోను నణుమాత్రమున లోప మగపడకుండ
చేయికన్నులతోడ వెలయఁ జూచుచును హాయిగాఁ బెరుగఁగ కౌఁగిఁ బొంగుచును
పలుపలు నగలాటవస్తువు లెఱియు వలసినవన్నియు వరుసనిచ్చుచును
తినతిండిరైనను తగ్గించి మనకు ననమునఁ జేఱుతిండి తెచ్చియిచ్చుచును
మనదేహమున వ్యాధి మఱియించుకంత కనఁబడెనేనియుఁ గళవళపడుచు
పడికేయిరైనను నడిచిపర్వెత్తి పడి గృహంబునకును వైద్యునిఁదెచ్చి
మందులు వేయించి మాన్పించి తెగులు తొందఱయెల్లను దొలఁగియామీఁద
వవలికిఁబనిమీఁద వరిగినప్పుడును బ్రతిమలదయతోడఁ బ్రాణంబులెల్ల
మనమీఁద నే యుంచి మరల నింటికిని జనుడెంచులోడను చాలమద్దాడి
యెత్తుకతిరుగుచు నెలమి చూపుచును విత్తంబు వ్యయపెట్టి విద్యచెప్పించి
మన మెప్పుడును మంచిమార్గంబునందుఁ జనునట్లు బుద్ధులు చాలంగ జెప్పి
తనయనంతరమును దడవుగ మనకు ఘనసుఖానందము గ్గలిగి వర్ధిల్ల
హృదయంబునను గోరి యీశ్వరు వేఁడి మదమొంద తండ్రిని ముఖ్యంబుగాను
ఘనగౌరవంబునఁ గాంచి ప్రేమించి యనమాతనియాజ్ఞ మన్నించి సతము
వినయవిధేయతల్ వెలయించి యతని మనసునొవ్వకయుండ మంచిమార్గమున
మెలఁగుచుఁ బుట్టిన పెట్టినయింటి కెలమిఁ గూర్పఁగ జెల్లు నిలలోన మనము.

(స్త్రీలు వినోదకరముగాఁ జదువుకొని యానందించుటకు తగి యుండునని తలఁచి షేక్స్పియరు మహాకవియొక్క నాటకముల ననుసరించి యింగ్లీషులో ల్యాం బనునతఁడు వచనరూపమున రచి యించిన కథలలో పదునాలుగింటిని నేను సులభశైలిని తెలిఁగించితిని.) చమత్కార రత్నావళి, సతీమణివిజయము, సుమిత్రచరిత్రము, రఘు దేవరాజీయము, కరంగేశ్వర వర్తక చరిత్రము, కళావతీ పరిణ యము, గయ్యాళిని సాధుచేయుట, చిత్రకేతు చరిత్రము, దాన కేసరివిలాసము, పైదర్శివిలాసము, భానుమతీ కళ్యాణము, సరసజన మనోభిరామము, ధర్మకపటోపాఖ్యానము, కుమారద్వయవిలాసము,

పద్మినీ ప్రభాకరము, మాలతీమధుకరము, అనునవి యాకథలకు నేను పెట్టినపేరులు. ఆనాటక కథలను నేను తెలిఁగించునపుడు మునుపున్న పేరులకు మాఱుగా మనదేశపు పేరులు పెట్టి అందున్న దేశములను మన భరతఖండములోని దేశములనుగా మార్చి, కథలో మన యాచారవ్యవహారములకుఁ బ్రతికూలముగానున్న భాగముల ననుకూలముగా నుండునట్లు చేసి, సాధ్యమైనంతవఱకు మనవారి కింపుగా నుండునట్లుచేసితిని. ఈకథలు స్త్రీలకుమాత్రమే కాక పురుషులకును జదువఁదగిన వయి హృదయాహ్లాదకరములుగా నుండును. వీనిలోఁ గొన్నిటిని సర్వకలాశాలవారు ప్రవేశపరీక్షకుఁ బఠనీయ గ్రంథములనుగా నిర్ణయించిరి. కొన్నిటిని పాఠశాలలలోఁ బాఠ పుస్తకములనుగాఁ బెట్టుచున్నారు. సామాన్యముగా జనులును వీనిని వినోదమునకొఱకు చదువుచున్నారు. స్త్రీలకుపయోగించెడు పూర్వోక్త పుస్తకముల నన్నిటిని జేర్చి రెండు పెద్ద సంపుటములనుగా ముద్రించియున్నాను.

జనులలోఁగల మూఢవిశ్వాసములు పోవుటకుఁ బ్రకృతిశాస్త్రజ్ఞాన మావశ్యకమని తలఁచి, తెనుఁగులోఁ బ్రకృతిశాస్త్రములు లేకుండుట విచారించి, యాలోపమును సాధ్యమైనంతవఱకుఁ బోఁగొట్టవలెనన్న యుద్దేశముతో నేను 1878-వ సంవత్సరమునకుఁ బూర్వమునందే పదార్థవివేచక శాస్త్రమును బ్రశ్నోత్తర రూపమున తెనిఁగించి ప్రకటించుచుంటిని. ఆ కాలమునందు రాజమహేంద్రవరమునం దుండిన కులాచార సంస్కార సమాజము (The Social Reform Association) వారి సభలోఁ దత్సమాజికుఁడును మన్మిత్రుఁడును నైన యొక పట్టపరీక్షాసిద్ధుఁడు తాను పదార్థ వివేచక శాస్త్రమును దెనిఁగింపవలెనన్న యుద్దేశముతో దానికి వలయు పరికరములనెల్ల సమకూర్చుకొనియున్నట్టు తెలుపఁగా నాసభవారు

నాయనుమతిమీఁద, పదార్థవివేచక శాస్త్రముచేయ నాయనను నియమించిరి. నన్ను శారీర శాస్త్రమునుజేయ నియమించిరి. ఈ నియామకమయిన తరువాత నా మిత్రుఁ డిరువదియేండ్లు జీవించినను దన పదార్థవివేచక శాస్త్రమును జేయకయే స్వర్గస్థుఁ డయ్యెను. నేనును నాకు నియమించిన శారీరశాస్త్రరచనకుఁ గావలసిన సాధన సంపాదన ప్రయత్నములో నుంటిని. నా కృషివిషయమయి కొంత తెలుపును గాన 1888-వ సంవత్సరాంతమునఁ బ్రకటింపఁబడిన నా శారీరకశాస్త్రముయొక్క యుపోద్ఘాతములోని కొంతభాగము నిం దుదాహరింప ననుజ్ఞ వేఁడుచున్నాను.

'తెనుఁగుభాషయందుఁ బ్రకృతిశాస్త్రములు లేనిలోపము విస్తారముగా నున్నందున, దానిని కొంతవఱకు నివారించుటకయి యీశారీరశాస్త్రమును మొట్టమొదట నారంభించి యొకవిధముగా ముగింపఁగలిగినాఁడను. విద్యాశాఖవారును మహాజనులును దీని నాద రించి తగిన ప్రోత్సాహమును గలిగించినయెడల, ప్రకృతిశాస్త్రసం బంధములయిన యితరశాఖలలోఁగూడ సులభశైలిని బ్రతిమలతోఁ గ్రమక్రమముగా గ్రంథములుచేసి ప్రచురింప నుద్దేశించియున్నాను. ఆంధ్రభాషయందు జ్యోతిశ్శాస్త్రమును రచించుటకయి యీవఱకే యారంభించియున్నాను. నేను మొట్టమొదట పదార్థవివేచక శాస్త్ర మును బ్రశ్నోత్తరరూపమునఁ దెనిఁగించి ప్రచురించుచుండఁగా, ఆకాలమునందీ పట్టణములోనుండిన కులాచార సంస్కరణ సమా జమువా రాపనిని మఱియొకరికి నిర్ణయించి శారీరశాస్త్రమును దెనిఁ గింపుమని నన్నుఁగోరిరి. వారికోరిక ననుసరించి యింగ్లీషుభాషలోని శారీరశాస్త్రములను బెక్కింటిని జదివితిని. అయినను నిదర్శనపూర్వ కముగాఁ బరీక్షించినంగాని కొన్నియంశములను బూర్ణముగాఁదెలిసి కొనుట యసాధ్యముగాఁ గానఁబడినందున, నామిత్రుఁడైన యొక

వైద్యశాలా సహాయుని సాహాయ్యమున మేఁకయొక్క హృదయము శ్వాసాశయము మొదలయిన యవయవములను వానియందలి భాగములను సతఁడు ఛేదించి చూపఁగా నావఱకు దురవగాహములుగా నుండిన యంశము లనేకములు గ్రహించితిని. అటుపిమ్మట హిందూ శారీరశాస్త్రమునుగూడ చదువ నుద్దేశించి గ్రంథసంపాదనమునిమిత్తమయి ప్రయత్నింపఁగా ముద్రితగ్రంథము లేవియు దొరకక విశేష ధనవ్యయముచేసి తాళపత్ర లిఖిత గ్రంథములను సంపాదింప వలసిన వాఁడ నయితిని; అవిగాక కలకత్తానుండి నాగరాక్షరములతో ముద్రింపఁబడిన శుశ్రుతాది గ్రంథములను గూడఁ గొన్నిటినిదెప్పించితిని. ఇటీవల శుశ్రుతములోని శారీరస్థానము చెన్నపురియందు ముద్రింపఁబడినది. వ్యయప్రయాసములకు లోనయి సంస్కృత గ్రంథములను తెప్పించి చదివినను, కొన్ని పారిభాషికపదములను గ్రహించుటలోఁ దప్ప నాకు వానివలన విశేషప్రయోజనము కలుగలేదు.'

కొంత ధనవ్యయము చేసి సంపూర్ణమయిన మనుష్యకంకాళము నొకదానిని సంపాదించితిని. మేఁకలయొక్క హృదయశ్వాసాశయాదులకంటె మనుష్యులయొక్క హృదయ శ్వాసకోశాదులను బరీక్షించి చూచుట యెక్కువ యుపయోగకరమని భావించి శవపరీక్ష నిమిత్తమయి క్రొత్తశవము వచ్చినప్పుడు నాకు వర్తమానము చేసి నాయెదుట కోసి చూపించునట్లు వైద్యశాలాధికారులతో నేర్పాటుచేసితిని. వా రొకసారి నన్ను పిలిపించి శవమును నాయెదుట కోయనారంభింపఁగా నేను చూడలేక కన్నులు దిరిగి లోపలినుండి వికారమువచ్చి మూర్ఛపోయితిని. వా రప్పుడు నామొగముమీఁద చల్లనీళ్ళుకొట్టి న న్నివలకుఁగొనివచ్చి తెలివివచ్చిన తరువాత నింటికిఁ బంపివేసిరి. నే నటుతరువాత మనుష్య హృదయాది శోధనమునకయి మరలఁ బ్రయత్నింపలేదు. ఈపుస్తకమునకయి కావలసిన చిత్రరూప

ములను విశేష ధనవ్యయముచేసి యిరువదిరెంటిని కలకత్తాలో కఱ్ఱ మీఁదఁజెక్కించి తెప్పించి యుపయోగించితిని. మొదటికూర్పంతయు నాలుగు సంవత్సరములలో వ్యయమగుటచూడఁగా నాంధ్రదేశస్థులు నాపుస్తకము నాదరించినట్లే కనఁబడుచున్నది. రెండవకూర్పునందుఁ బదునేనును, మూఁడవ కూర్పునందుఁ బదునాలును, క్రొత్తపటము లింగ్లండులోఁ జేయించి తెప్పించి చేర్చి, కొన్ని క్రొత్తవిషయములను మార్పులను బుస్తకమునందుఁ బొందుపఱిచితిని. ఇప్పటిది నాల్గవ కూర్పు. పుస్తకమును విద్యార్థులును వైద్యులును మహాజనులును గూడఁ దెప్పించుకొని చదువుచున్నారు. దీనిని జదువఁ దటస్థించినవా రందఱును దీనిమీఁద మంచి యభిప్రాయముల నిచ్చుచున్నారు. దీని మొదటికూర్పు పంపఁబడినప్పుడు బందరునందుఁ బ్రకటింపఁబడుచుండిన 'హిందూదేశాభిమాని' పత్రికాధిపతులు 1889-వ సంవత్సరము ఏప్రిల్ 6-వ తేది పత్రికయం దిట్లు వ్రాసిరి:—

"Mr. Kandukuri Veerasalingam Pantulu, the Senior Pundit of the Government College, Rajahmundry, has published a free Translation of Professor Huxley's Phisiology, a copy which we have received just now. From the preface of the book we learn that the Pandit has taken great pains in going through all the books relating to the subject both English and Telugu, such as Anatomy. *Susruta Astanga Hrithaya* and many others, some of which have not as yet seen the light of publication It is true that some of the techinical words and phrases which he has been obliged to use in the Translation are not colloquial and household terms and consequently rather difficult to be easily understood by the commonality, yet had he not used those terms, he would have made a mess of the Translation. And to avoid this difficulty he has added an Appendix in the terminus of the book giving the English equivalents or those techinicalities for the guidance of the reader. The book has 22 diagrams illustrative of the different parts of the body which he got made at the Art studio of Calcutta at an enormous expense.

The book also contains two representations of the author one on the bind and other on the title page which add beauty to the book.

We think it will not be uninteresting to our readers to pen a few lines about the author himself here. He is one of the greatest Telugu Pundits and poets living and lived who has been blessed with that keen foresight of observing nature in its true colours which any school boy can perceive in any of his Telugu Dramas, such as the Pleader's Drama or the Brahma Vivaha. Born a genius he has also got that moral courage and exemplary character which the English seople say, are wanting in the majority of the Hindus; and his undaunted courage and perseverance are very well exemplified in this one fact that while almost all the Natives for reform of the widow-marriage have recoiled back from the attempt, although they are convinced of the necessity and advisability of the marriages of young widows' this gentleman has taken the leading part in that reform and stood like the Monument in the midst of troubles and turmoils engendered by the weight of public opinion, like Columbus in the discovery of America. Madras Presidency may very well feel proud of having a native like Mr. Veerasalingam in her bosom and "a does of carlyle does no good at all to such personages.!'......... He is the author of scores of books of prose and poetry and it is the duty of the public and the 'educational authorities to give him every encouragement.

(రాజమహేంద్రవరము గవర్నమెంటుకాలేజీలో నగ్రపండితుఁడైన కందుకూరి వీరేశలింగము పంతులుగారు ప్రొఫెసరు హాక్సిలీగారి శారీరశాస్త్రముయొక్క యనర్గళ భాషాంతరమును ప్రకటించియున్నారు; దాని ప్రతియొకటి యిప్పుడేమాకు చేరినది. పుస్తకముయొక్క యవతారికనుబట్టి యీవిషయముతో సంబంధించిన యింగ్లీషులోను తెలుఁగు (సంస్కృతము) లోనుగల శరీరనిర్మాణశాస్త్రము శుశ్రుతము అష్టాంగహృదయము మొదలైన కొన్నియింకను అచ్చుపడకున్న గ్రంథములను చదువుటలోఁ బండితులెంతయు శ్రమపడినట్లు

మేము తెలిసికొనుచున్నాము. ఆయన భాషాంతరములో నుపయోగింపవలసివచ్చిన పారిభాషికపదములలోను వాక్యభాగములలోను కొన్ని సామాన్యమైనవియు నింట వాడఁబడునవియు కాకపోవుటను బట్టి సామాన్యజనులు సులభముగా గ్రహించుటకుఁ గష్టమైనవగుట సత్యమేయయినను, ఆయన యాపదముల నుపయోగింపకుండిన పక్షమున భాషాంతరమును జిక్కుచేసియుండును. ఈచిక్కును వారించుటకయి చదువువారి యుపయోగార్థముగాఁ బారిభాషిక పదముల యొక్క సమార్థకములైన యింగ్లీషు పదముల నిచ్చుచు నొక యనుబంధమును బుస్తకముతుదను జేర్చియున్నారు. విస్తారముగా సొమ్ము వ్యయపఱచి కలకత్తా శిల్పచిత్రశాలయందు చేయించిన శరీరముయొక్క వివిధావయవద్యోతకములైన 22 ప్రతిరూపముల నీ పుస్తకము కలిగియున్నది. పుస్తకమున కంద మెక్కునచేసెడు గ్రంథకర్త ప్రతిరూపములను రెంటిని, అట్టమీఁద నొక దానిని ముఖపత్రముమీఁద నొక దానిని, ఈపుస్తకము కలిగియున్నది.

ఇక్కడ గ్రంథకర్తనుగూర్చి కొన్ని పంక్తులు వ్రాయుట మాచదువరులకు హృదయరంజకముగా నుండక పోదని తలంచుచున్నాము. జీవించియున్నట్టియు గతించినట్టియు గొప్ప తెలుఁగుపండితులలోను, కవులలోను, ఈయన యొక్కఁడు; సృష్టిని దాని నిజమైన స్వరూపములోఁ గనిపెట్టెడి సూక్ష్మమయిన దూరదృష్టి యీయన కనుగ్రహింపఁబడినది; దానిని ప్లీడరునాటకము, బ్రాహ్మవివాహము, మొదలయిన యీయన తెలుఁగు నాటకముల దేనిలోనైనను, పాఠశాలావిద్యార్థి యైనను కనఁగలఁడు. మేధావిగాఁ బుట్టినవాఁడయి, హిందువులలోని యధికసంఖ్యాకులలో లేవని యింగ్లీషువారు చెప్పెడి నీతికార్యధైర్యమును, మార్గదర్శక వర్తనమును

కూడ, ఆయనకలిగియున్నాఁడు; ఆయనయొక్క నిశ్శంకమైన ధైర్య
మును, పట్టుదలయు, ఈయొక్కసంగతిలో మిక్కిలి చక్కఁగా
దృష్టాంతీకరింపఁ బడినవి—బాలవితంతువుల వివాహముయొక్క
యావశ్యకమును గూర్చియు, యుక్తతనుగూర్చియు, జాతివిశ్వాసు
లయినవారయి నప్పటికిని వితంతువివాహ సంస్కారమున కనుకూలు
రుగా నున్న స్వదేశీయు లించుమించుగా నందఱును దత్ప్రయత్నము
నుండి వెనుక తీయఁగా నీ మహాపురుషుఁ డాసంస్కారములోఁ
బ్రధానభాగమును వహించి జనాభిప్రాయ భారమువలనఁ గలిగిన
కష్టములయొక్కయు, సంక్షోభములయొక్కయు, నడుమను జయస్తం
భమువలె, అమెరికాను కనిపెట్టుటలో కొలంబసురీతిని నిలువఁబడెను.
చెన్నపురి రాజధాని తనలోపల వీరేశలింగమువంటి స్వదేశీయుని
గలిగియున్నందున కత్యంతము గర్వపడవచ్చును. "కాన్గ్రెలుయొక్క
మాత్ర యటువంటి వారి కెంతమాత్రమును మేలుచేయదు." ఆయన
యిరువదుల కొలఁది గద్యపద్యకావ్యములకుఁ గర్త; ఆయనకు సర్వ
విధములఁ బ్రోత్సాహము కలిగించుట మహారాజులకును, విద్యాశాఖా
ధికారులకును గర్తవ్యము.)

1895-వ సంవత్సరమునందు జ్యోతిశ్శాస్త్ర సంగ్రహమును
బటములతోఁ బ్రకటించెను. జ్యోతిశ్శాస్త్రము ప్రకృతిశాస్త్రము
లలో నుత్తమ మయినదని చెప్పవచ్చును. ఈశాస్త్రమును జదివి
గ్రహణములు మొదలైనవి కలుగుటకుఁగల నిజమైనకారణములను
దెలిసికొన్న పక్షమున, ఏతద్విషయమున జనులలోఁగల మూఢ
విశ్వాసములును, మూఢాచారములును నశించి సుజ్ఞానము కలుగు
ననుటకు సందేహములేదు. ఈ శాస్త్రము మన దేశమునకు క్రొత్తది
కాదు. మన పూర్వులు చిరకాలముక్రిందటనే దీని విషయమయి

కృషి చేసి బహు సత్యములను దెలిసికొనియుండిరి. ఈ భాషాంతరమునకు నేను వ్రాసిన యుపోద్ఘాతములోనుండి కొన్ని వాక్యములిం దుదాహరించుచున్నాను.—

"ఈశాస్త్రమున మన పూర్వులు వేదమంత్రములు రచియింపఁబడిన కాలమునుండియుఁ గృషి చేసియున్నారు. ఆకాలమునందు ఋషులు సంవత్సరమును బన్నెండుమాసములుగా భాగించుకొన్నట్లు "వేదమాసో ధృతవ్రతో ద్వాదశ ప్రజావతః, వేదాయ ఉపజాయతే."

అను ఋగ్వేదము మొదటిమండలములోని యిరువదియైదవ సూక్తముయొక్క యెనిమిదవఋక్కు మొదలగువానివలనఁ దెలియవచ్చుచున్నది. ఋగ్వేదముయొక్క యెనిమిదవపదవమండలములలోఁ జంద్రుఁడు కొన్ని నక్షత్రములయం దున్నట్లు సూచింపఁబడినందున, వారి కాకాలమునందు చంద్రగతినిబట్టి చంద్రుని గృహములగు నిరువదియేడు నక్షత్రములను గూర్చియుఁ దెలిసియుండునని యూహింపవచ్చును. సూర్యునిగతినిబట్టి సంవత్సరమును గణించు విధమును సహితము తెలిసికొని, కాలవ్యత్యాసము గాకుండుట కయి వారయిదేసి సంవత్సరముల కొకపర్యాయ మప్పు డధిక మాసమును జేర్చుకొనుచుండెడువారు. ఆకాలమునందు గ్రహముల నామములుగాని, గ్రహగతులుగాని, వారికిఁ దెలియవు. ఒక తైత్తిరీయారణ్యకమునందు దక్క వేదమునం దెక్కడను గ్రహముల పేరులేలేవు. ధర్మశాస్త్రములలో నెల్లను మొదటిదగుచున్న మనుస్మృతి యందును గ్రహముల నామములు కానరావు. వేదములయం దెక్కడను సూర్యగతిబట్టిన రాశిచక్రముదాహరింపఁబడలేదు. రాశిచక్రమును మనపూర్వులు మొదట యవనుల (గ్రీకుల) నుండి గ్రహించిరి. అందుచేతనే వరాహమిహిరుఁడు తన బృహజ్జాతకమునందు,

శ్లో. "క్రియతాంబురి జితుమ కులీర లేయపాథోనజూక కౌర్ప్యాఖ్యాః
తాక్షిక అకోకేరో హృద్రోగ శ్చాంత్యభం చేత్థమ్."

అని క్రియ (మేషము,) తాంబురి(వృషభము), జితుమ (మిథునము), కులీర (కర్కాటకము), లేయ (సింహము), పాథోన(కన్య), జూక (తుల), కౌర్పి (వృశ్చికము), తాక్షిక (ధనస్సు), అకోకేర (మకరము), హృద్రోగ (కుంభము), అంత్యభం (మీనము), ద్వాదశరాసులకు గ్రీకుభాషానామములు పెట్టియున్నారు. ఇందు కులీర, హృద్రోగ, అంత్యభశబ్దములు తక్క మిగిలినవన్నియు గ్రీకునామములే, వరాహమిహిరుఁడు క్రీస్తుశకము ౫౦౫-వ సంవత్సరమునఁ బుట్టి౫౮౭-వ సంవత్సరమున మృతినొందెను. ఈయనకాలమునకుఁబూర్వమునందుండిన సిద్ధాంతగ్రంథములలో సహితము గ్రీకులు(యవనులు) జ్యోతిశ్శాస్త్రము సందును గట్టివారయినట్టు చెప్పఁబడియున్నది. మిక్కిలి పురాతనమగు గర్గసిద్ధాంతములో

శ్లో॥ మ్లేచ్ఛాహి యవనా _స్తేషు సమ్య క్శాస్త్ర మిదం స్థితమ్
ఋషివ _త్తేపి పూజ్యంతే కింపున ర్దైవవ ద్ద్విజాః,

(యవనులు మ్లేచ్ఛులయినను వారియం దీశాస్త్రము చక్కగానున్నది, వారును ఋషులవలెఁ బూజింపఁబడునప్పుడు దైవజ్ఞులయిన ద్విజులను జెప్పవలసినదేమి?) అని వ్రాయఁబడియున్నది."

దీనిని బట్టిచూడఁగా నిప్పటివారివలెఁ దామే సర్వజ్ఞులమని యుఁ దమపూర్వులు చెప్పిన దొక్కటియే సత్యమనియు భావించుకొనువారుగాక యప్పటివారు తాము స్వయముగాఁ గృషిచేసి శాస్త్రజ్ఞానమును వృద్ధిపఱిచియుఁ దమకుఁదెలియనిదాని నితరదేశస్థులవలన గ్రహించియు నభివృద్ధిఁజెందుచు వచ్చినట్టు కనఁబడుచున్నది. తామే సర్వజ్ఞుల మన్న గర్వమును తా మితరులవలన నేర్చుకొన్నచో గౌరవ

లోపమును దురభిమానమును, గలవారెప్పుడును వృద్ధినొందక క్రమక్రమముగా క్షీణదశకు వత్తురు. కాబట్టి పురోవృద్ధిగోరువారు తాము సర్వమును సర్వవిధముల సంపాదింపఁ బ్రయత్నించుచు మంచి యెందున్నను గ్రహించుచుండవలెను. పైనిజెప్పిన దురభిమానము మన దేశమునందుఁ బ్రబలి సర్వమును మనశాస్త్రములలోనే యున్నదనియు మన మితరులవలన నేర్చుకోవలసిన దేదియు లేదనియు దురభిప్రాయము బలపడనారంభించినది మొదలు శాస్త్రజ్ఞానమంతకంతకు వృద్ధినొందక క్రమక్రమముగా క్షీణదశకువచ్చుచుఁ మన కిప్పటి హీనస్థితికి వచ్చినది. ఈ నడిమికాలములో నొక్క భాస్కరాచార్యుఁడు దక్క చక్కని సిద్ధాంతగ్రంథములను రచియించినవారెవ్వరును గానరారు, ఈభాస్కరాచార్యుఁడు తాను రచించిన సిద్ధాంతశిరోమణియను జ్యోతిశ్శాస్త్రమునందలి గోళాధ్యాయములోఁ దాను జననమొందిన శకసంవత్సరము 1036 అనియు, గ్రంథరచనచేసినది తనముప్పది యారవయేటననియుఁ జెప్పుకొనియున్నాఁడు. యూరపుఖండములో 1543-వ సంవత్సరమునందుఁ బరలోకగతుఁడయిన కోపర్నికస్సను జర్మను పండితుఁడు సయుక్తికముగా స్థాపించువఱకును భూభ్రమణ సిద్ధాంతము వ్యాపించలేదు. ఈ భరతఖండములోఁ గ్రీస్తుశకమున నైదవశతాబ్దములోనుండిన యార్యభట్టాచార్యులవారు వరాహమిహిరునకుఁ బూర్వమునందే భూభ్రమణ సిద్ధాంతమును బోధించిరి. కాని యదిప్రబలక మధ్యగా భూమి స్థిరముగా నుండి దాని చుట్టును సూర్య చంద్ర నక్షత్రాదులు తిరుగుచున్నవన్న యపసిద్ధాంతమే నేఁటివఱకును వ్యాపించియున్నది. మనపూర్వులకు గ్రహముల గతులు తెలియునుగాని గ్రహములకును భూమికిని గల దూరములు సరిగాఁ దెలియవు. ఆకాలమునందు సహితము నళికాది యంత్రము లేవో కొన్ని యున్నను గ్రహవేధకయి యిప్పుడున్న

దూరదర్శకయంత్రాదు లప్పుడు లేనందున నిప్పుడు తెలిసికొన్న యనేకాంశములు వారి కప్పుడు తెలియుట యసాధ్యమయ్యెను.

ఈగ్రంథమును రచించుటకయి నే నింగ్లీషుభాషలోనున్న కొన్ని జ్యోతిష గ్రంథములను జదువుటయేకాక సంస్కృతభాషలో నున్న సూర్య సిద్ధాంతము, సిద్ధాంతశిరోమణి, పంచసిద్ధాంతిక, మొదలయిన సిద్ధాంత గ్రంథములను సహితము చదివితిని. మనలోని తెలిసినవారి సాయమువలన రాత్రుల గ్రహములు నక్షత్రములు మొదలయినవానిని జూచి వాని స్థానములను రూపములను గ్రహించితిని. నేను చెన్నపురికిఁబోయి యుండినప్పు డచ్చటి నక్షత్రశాలాధికారుల సాహాయ్యమువలన పగలు శని గ్రహాదులను శని గ్రహము యొక్క యుంగరములను దూరదర్శక యంత్రముతో నచ్చటి యుద్యోగస్థులు చూపఁగాఁ జూచితిని. ఈపుస్తకమునందు నేను సాధ్యమైనంతవఱకు పారిభాషిక పదములను రాసియక సుగమముగా నుండునట్లు సులభశైలినే యుపయోగించినను శారీరశాస్త్రమునందు వలెనే నీనియమమును ఇంగ్లీషు పర్యాయపదములతో పారిభాషిక పదములపట్టికను తుదను జేర్చితిని. పటములు లేనియెడల విషయము సుబోధముగా నుండదుగనుక విశేషవ్యయముచేసి యాయా గ్రహ నక్షత్ర ధూమకేతు సూర్య చంద్రోపరాగాదులను జూపెడు పటముల నేఁబదింటికంటె నెక్కువగా నింగ్లాండునుండి చేయించి తెప్పించి యిందు యుక్తస్థలములయందు వేయించితిని. గ్రహణ విషయమున సామాన్య జనులలో వ్యాపించియున్న పిచ్చి నమ్మకము బోఁగొట్ట వలెనన్న యుద్దేశముతో గ్రహణములకు నిజమైన కారణములను దెలుపుటకు ముందవతారికగా జ్యోతిశ్శాస్త్ర సంగ్రహమునందుఁ గొంత వ్రాయఁబడినది. చదువరుల కింపుగా నుండవచ్చునవి దానినిం దుదాహరించుచున్నాను.

"సూర్యబింబముయొక్కయో చంద్రబింబముయొక్కయో కాంతి యంతయుఁగాని కొంతగాని మాయుట గ్రహణమనఁబడును. బింబముయొక్క కాంతియంతయు నడఁగినచోఁ బూర్ణగ్రహణమనియు, కొంతమాత్రమే యడఁగినచోఁ బార్శ్వగ్రహణమనియు, చెప్పఁబడును. సంపూర్ణ సూర్యగ్రహణము పట్టినప్పుడు సర్వమును వింతగాఁ గానఁబడును— పట్టపగలు మింట నక్షత్రములు కానిపించును; పక్షులు కొలకొలమని కూయుచు గూండ్లుచేరఁ బాఱుతెంచును; ఘూకములు గుహలు వెలువడి నానాముఖముల సంచరించును; మూఢుల మనస్సులలో భయమంకురించును. వేయేల? పగలే రాత్రియగుట సంభవించినప్పుడు లోకములోని వేపిరీతులు మాఱుకావు! ఈప్రకారముగా నస్వస్థదశ సంభవించుటచేత నాలోచనలేని మృగపక్ష్యాదులు సహితము తమతమ స్వభావగుణములను విడిచి తేజోవిహీనములయి నిరుత్సాహములయి యుండునప్పుడు, ఆలోచన పరుఁడయిన మనుష్యుని హృదయమునందు భీతిచేత నెన్ని యూహలుపుట్టవు? మనదేశమునందలి జనులు గ్రహణసమయములయందు సూర్యచంద్రులకేదో పెద్దపాము మ్రింగుటచేత, మహావిపత్తి సంప్రాప్తమయినదనియు, తమ్ము మైలసోఁకినదనియు భావించి, స్నానములు చేసియు, నుపవాసములొనర్చియు, దోషపరిహారార్థముగా దానధర్మములాచరించియు, నానావిధకర్మలుచేయుదురు. దేశమజ్ఞానదశయందుండిన కాలములో సాధారణముగా జనులమౌఢ్యమహిమచేత నిట్టియాచారములు మొట్టమొదట నుద్భవమొందును; పిత్రాచారమన్న గౌరవమునుబట్టి యాలోచనమాని తెలివిగలవారు సహిత మాచరించుచు రాఁగాఁ గొంతకాలమున కామూఢాచారములు శిష్టాచారములగును. అటువంటి స్థితిలో బుద్ధిమంతులయిన యాచార్యపురుషులు బైలుదేఱి

యంధపరంపరగా జను లాచరించెడి యాయాచారములనే తామును నవిచారపూర్వకముగా ననుసరించుచును వానిని దమకు జీవనాధారములుగా మార్చుకొని లాభకరములయిన యట్టి యుత్తమాచారములను గల్పించిన పూర్వులబుద్ధిసంపదను శ్లాఘించుచు స్వార్థపరత్వముతో వానికి హేతుకల్పనము చేసి పుస్తకములను రచించి పామరులను మోహింపఁజేయుదురు. దురాచారము లెప్పుడును బ్రవేశించినంత సులభముగా వదలిపోవు. ఎంత యవివేకమూలకమయినదైనను, దేశమునం దొక్కసారి నెలకొన్న యాచారపిశాచము చిరకాలము పలువురు పలుప్రయత్నములు చేసి కష్టపడి వెడలఁగొట్టఁబాటుపడినంగాని యొక పట్టున కాలు కదల్పదు. గ్రహణములకు ధీమంతులయిన మన పౌరాణికులు కల్పించిన కారణముల నెల్లవారు నెఱుఁగుదురుగదా! విప్రచిత్తికిని సింహికకును జనియించినవాఁడయి పుట్టిన రాహువనెడు రాక్షసుఁ డొకఁడుండెనఁట! దేవదానవులు పాలసముద్రమును మథించి పడసిన యమృతము నుభయపక్షములకును నిష్పక్షపాతముతోఁ బంచిపెట్టెద నని చెప్పి విష్ణుఁడు జగన్మోహినీవేషమును ధరించి వచ్చి దేవతలకుఁ బోయుచుండఁగా వారు త్రాగి యానందించుచున్నప్పుడు విష్ణుమాయకులోనయి భ్రమపడి యూరక గుటుకలు మ్రింగుచుఁ జూచుచున్న రాక్షసపంక్తిని విడిచి బుద్ధిమంతుఁడయిన రాహువు మోహినీవేషమునకుఁ బ్రతిగాఁ దాను దేవతావేషమును ధరించి దేవతాపంక్తిలోఁ గూర్చుండి యెల్లవారిని మాయచేసిన విష్ణువునే మాయచేసి యమృతపానము చేయఁజొచ్చెనఁట! సూర్యచంద్రులారహస్యమును గనిపెట్టి విష్ణుదేవునితో విన్నవింపఁగా నతఁడు చక్రధారచే నాదుష్టరాక్షసుని శిరస్సు ఖండించెనఁట! అమృతపాన విశేషముచేత రాహువు చావక తల యొకటియు మొండె మొకటియుఁగా రాహుకేతునామములతో రెండు ఘోరరూపములఁ దాల్చి యొక్కఁ డిద్దఱయి సూర్యచంద్రులు చేసిన

యుపకారమునకయి పగపట్టి వారినిబట్టి పర్వదినములయందు పెద్దపాము వలె వారిని మ్రింగి విడుచుచుందురట! ఇటువంటి మూఢవిశ్వాసములు నశించి దేశములో గ్రహణవిషయమున మంచిజ్ఞానము వ్యాపించుటకయి నిజమయిన కారణములను దెలుపుదము. నిజమైన కారణములు సర్వజనులకును దెలిసినతరువాత సహితము గ్రహణ సంబంధము లయిన కర్మ లభ్యాసవశముచేతఁ గొంతకాలము జనులను విడువక పోవచ్చును.''

ప్రకృతిశాస్త్రములలో నేను రచించిన మూఁడవది జంతుస్వభావచరిత్రము. దీనియొక్క ప్రథమభాగమును 1896 వ సంవత్సరమునందు దాదాపుగా నలుబది జంతుపటములతోఁ బ్రకటించితిని. జంతువు లన్నిటిలోను జరాయుజము లనఁగా మావిలోనుండి పుట్టిన జంతువులు శ్రేష్ఠములయినవి. మనుష్యుఁడును జరాయువునుండి పుట్టినవాఁడే. ఈజంతువులు పిల్లలకు పాలిచ్చి పెంచును. మావినుండి పుట్టినపిల్లలకు స్తన్య మిచ్చెడి యీజాతి జంతువులను గూర్చియే యీప్రథమభాగమునందు వ్రాసియున్నాను. పుస్తకము చదువువారికి మనోహరముగా నుండుటకయి జంతువుల స్వభావాది వర్ణనము చేయుటయే కాక యక్కడక్కడ వానినిగూర్చిన కథలను మనుష్యులకు వానినిగూర్చి గల యభిప్రాయములను గూడ చేర్చియున్నాను. మనదేశమునందలి హనుమద్వానరములనుగూర్చి యిట్లు వ్రాసియున్నాను.

''చక్కగా నెదిగిన హనుమానులు ముక్కుమొదలుకొని తోఁక మొదటికి మూఁడు నాలు గడుగుల పొడుగుండును. తోఁక దేహమునకంటెను పొడుగుగానుండును. ఈవానరముయొక్క వర్ణము మనము సాధారణముగాఁ జూచెడు పండుకోఁతివంటి రంగుకలదిగానే యుండును గాని పీవు పొడుగునను నల్లనిచాఱ యుండును. ఈ జాతి వానరములే పూర్వకాలమునందు రామరావణయుద్ధములో రాము

నికిఁ దోడుపడి రాక్షసులతో యుద్ధము చేసెనని చెప్పుదురు. అందు చేత నీహనుమానులయందు హిందువుల కత్యంతభక్తి కలిగియున్నది. ఇవి యే యల్లరి చేసినను జనులు వాని జోలికి పోక నమస్కరించి యూరకుందురు. కాఁబట్టి యీవానరములు నిర్భయముగా గ్రామ ములయందు వీథులలో సంచరించుచు, గ్రామములోని తోఁట లన్ని యు తమవే యయినట్లు మనసువచ్చిన తోఁటలోఁ బ్రవేశించి పండ్లు మొదలయినవి యథేష్టముగా ననుభవించుచు, అంగళ్ళలోని ధాన్యా దులను దమ సొత్తయినట్లుగా నంగడివాండ్ర నేమఱించి భక్షించుచు ఇండ్లనడికప్పులమీఁది నెక్కి లోపలకి గాలి పోవుటకు మార్గము లేర్ప డునట్లుగా పెంకులు తిరుగవేసి నలగఁద్రొక్కుచు, సర్వాధికారము చెల్లించుచుందురు. గ్రామస్థులు వీరిబాధపడలేక తమయిండ్లమీఁద ముండ్లకంపలు మొదలయినవి వేసికొందురు. ఇవి యేహాని చేసినను వీనిని కొట్టకపోవుటయే కాక యెవ్వఁడైన మతాంతరుఁ డీకోఁతిని హింసించినపక్షమున గ్రామస్థులందఱును వానిమీఁద దండెత్తుదురు.”

కుక్కలయొక్క స్వభావలక్షణములనుగూర్చి వ్రాయుచో నొకచోట నీక్రిందికథ చెప్పఁబడినది.

“ఒకఁడు కొంతకాల మొకకుక్కను బెంచి తరువాత దానిని తనమిత్రునకిచ్చివేసెను. నాలుగుసంవత్సరములైన తరువాతి మొదటి యజమానుఁ డొకనాఁ డొక యడవిమార్గమునఁ బోవుచుండఁగాఁ గుక్క యెదురుపడి యున్నవాలు పట్టలేక యూఁడించి తనసంతోష మును గనఁబఱచెను. ఇంతటిలో నతని మిత్రుఁడైన క్రొత్తయజమా నుఁడును వచ్చెను. వారిద్దఱును కొంతసేపుమాటాడి విడిపోయిన తరు వాత కుక్క క్రొత్తయజమానుని వెంటఁ బోయెను. ప్రాఁతయజమా నుఁడు కొంతదూరము నడచిన తరువాత గడియసేపటిలో కుక్క మరల వచ్చి యాతని కద్భుతము కలుగఁజేసెను. అతఁడు కుక్క తన

యజమానునివిడిచి యేల వచ్చెనాయని యాలోచించుచుండఁగాఁ బొదలోనుండి దుడ్డుకఱ్ఱలు చేతఁ బుచ్చుకొని యిద్దఱు మనుష్యులాతనివంక వచ్చిరి. అప్పుడా కుక్క యరణ్యము ప్రతిధ్వని యిచ్చునట్లుగా మొఱుగుచు వారివంక పరుగెత్తఁగా వారిద్దఱును పాఱిపోయిరి. తన ప్రాతయజమానుఁ డడవిఁ దాఁటి మంచిమార్గమునఁ బ్రవేశించిన తరువాత నతనిని విడిచి కుక్క తన క్రొత్తయజమానుని కలిసికొనుటకయి పోయెను. కఱ్ఱలు పుచ్చుకొనివచ్చిన యిద్దఱుమనుష్యులయొక్క యుద్దేశ మేమో మీ రూహించి తెలిసికోవచ్చును. గతదినమునం దక్కడనే యొకమార్గసుని గొట్టి వా రాతని సొత్తు దోఁచుకొనిపోయిరి. కుక్క యా దొంగలు వచ్చుచుండుటను చూచెనో, అది దొంగలుకొట్టినస్థలమని యెఱిఁగెనో, పూర్వయజమానుని రక్షణముకొఱకు వచ్చియుండెను. కుక్కయొక్క విశ్వాస మెంతయైనను శ్లాఘనీయముగదా!'

ప్రకృతిశాస్త్రవిషయకములైన గ్రంథములలోఁ బదార్థవివేచకశాస్త్రమును, భూగోళశాస్త్రమును, నేను గొంతవఱకుఁ జేసితినిగాని వానిని బూర్తి చేయలేదు. సంగ్రహవ్యాకరణము, కావ్యసంగ్రహము, అలంకారసంగ్రహము, ఛందస్సంగ్రహము అనెడు నేను రచించిన గ్రంథములు శాస్త్రసంబంధములైనవే కాని ప్రకృతిశాస్త్రములతో సంబంధించినవి కావు.

నేను చేసిన గ్రంథములలో నెల్ల నాంధ్రకవులచరిత్రము ప్రధానమైనదని చెప్పవచ్చును. దీనియొక్క ప్రథమభాగమును నేను 1887 వ సంవత్సరమునందుఁ బ్రకటించితిని. ఈప్రథమ భాగము పూర్వకవులను గూర్చినది. హూణశకము 1450-వ సంవత్సరము వఱకును గలకవులు పూర్వకవులనియు, 1450-వ సంవత్సరమునకుఁ దరువాతను 1650 వ సంవత్సరమువఱకును గల కవులు మధ్యకవు

లనియు 1650 వ సంవత్సరమునకుఁ దరువాత నున్న వా రాధునిక
కవులనియు, నేను సంకేతమేర్పఱచుకొంటిని. రెండవభాగము మధ్య
కవులనుగూర్చినది. మూఁడవభాగ మాధునికకవులను గూర్చినది.
ఈమూఁడుభాగములయందుఁ జెప్పఁబడిన కవులసంఖ్య యిన్నూటి
కంటె హెచ్చుగా నున్నది. పూర్వకాలమునుండియు మనదేశములోఁ
జరిత్రములను వ్రాసెడి యాచార మంతగా లేదు. అందుచేత కవుల
చరిత్రమును వ్రాయుట యెంతో కష్టసాధ్యమయ్యెను. ఎవ్వరో నలుగు
రైదుగురుతప్ప కవు లెవ్వరును, దమవంశ వర్ణనములలోఁ దాము
పుట్టినకాలము నైనను దెలుపుకొనలేదు. గ్రంథరచనచేసినకాలము
నంతకు ముందె తెలుపుకొనలేదు. గ్రంథకర్తలనేకులు తమగ్రంథ
ములను రాజులు మొదలైనవారి కంకితముచేయుచుండుటచేత రాజుల
కాలమును గనుఁగొని దానినిబట్టి కవులకాలమును గనుఁగొనవలసి
వచ్చెను. రాజులకాలములను గనుఁగొనుటకైన మనలోచరిత్రములు
లేవు. వారు తాము బ్రాహ్మణులకు భూదానాదులను జేసినప్పుడును,
గుళ్లు గోపురములు కట్టించినప్పుడును, తామ్రశాసనములను శిలా
శాసనములను వ్రాయించుచువచ్చిరి. ఆశాసనములలో సాధారణ
ముగాఁ దాము దానాదులుచేసిన కాలమును వేయించుకొనుచు
వచ్చుటచేత తన్మూలమున రాజులకాలనిర్ణయమును, వారుకృతుల
నందుటచేతఁ దద్వారమునఁ గృతికర్తల కాలనిర్ణయమును, చేయ
వలసివచ్చెను. కృతికర్తలలో నధికసంఖ్యాకులు తమ గ్రంథములను
రాజుల కంకితమొనర్పక దేవతల కంకితము చేయుచువచ్చిరి. అట్టి
వారియొక్క కాలమును గనుఁగొనుటకయి వారు తమ గ్రంథముల
యందు పూర్వకవులనుగాఁ బేర్కొని స్తుతించినవారి నామములు
తక్క వేఱాధారములేవియు కనఁబడలేదు. ఆయల్పాధారమునుబట్టి
సరిగా వారి కాలనిర్ణయముఁ జేయుటకు వీలుకలుగలేదు. కొందఱు

కవులు తా మాధునికు లయ్యును భారతకర్తలయిన కవిత్రయమును దక్క నితీవలివారి నెవ్వరిని కవిస్తుతిలోఁ జేర్పకుండిరి. కవుల కాలనిర్ణయమును జేయుటలో లక్షణగ్రంథములు కొన్ని కొంతవఱకు సాయపడినవి. లక్షణ గ్రంథములను జేసినవారు కొందఱు తాము చెప్పిన లక్ష్యములుగా పూర్వకావ్యములనుండి పద్యముల నుదాహరించుచు వచ్చిరి. అప్పకవి తాను గ్రంథరచన కారంభించిన కాలమును దన పుస్తకమునందే వ్రాసికొనియున్నాఁడు. ఇట్లాతని కాలము తెలియుటచేత నప్పకవీయమునందుఁ జేర్పఁబడిన కవులందఱును నాతనికిఁ బూర్వమునం దుండిన వారగుట నిశ్చయమే యయినను, వారిలో నెవ్వ రెంత పూర్వులో తెలిసికొనుట కాపుస్తకము సహితము సహకారికాలేదు. ఇట్లెన్నియో కష్టము లున్నను నేనెంతో శ్రమపడి కాలనిర్ణయమును గొంతవఱకుఁ జేయఁ గలిగినాఁడను. దీని విషయమై దొరతనము వారిచేఁ బ్రకటింపఁ బడిన స్యూయల్దొరవారి దక్షిణ హిందూదేశ శాసనపుస్తకములను మాత్రమే కాక చెన్నపురియందును నితరరాజధానులయందును మైసూరునందును బ్రకటింపఁబడుచు వచ్చిన తామ్రశిలాశాసనాదులనుగల పత్రికలను పుస్తకములను చరిత్రములను దెప్పించి నేను చదివితిని. చెన్నపురి చిత్రవస్తుప్రదర్శనశాలలోనున్న తామ్రశాసనములనుజదివితిని. ధనమిచ్చికొనియు మిత్రులసాహాయ్యమున నెరవు పుచ్చుకొని మాతృకలకుఁ బ్రతులువ్రాయించియు కట్టలుకట్టి మూలఁ బడియున్న పుస్తకములను గొంద ఱూరక యియ్యఁగా వందనపూర్వకముగాఁగైకొనియు ముద్రితములుకాని తాళపత్రపుస్తకములను విస్తారముగా సంపాదించితిని. తంజావూరిలోని సరస్వతీభాండాగారములో తెలుఁగుపుస్తకములున్నవని విని యాకాలమునం దక్కడమండల న్యాయాధిపతిగానుండిన హామ్మెట్టుదొరగారి సాహాయ్యమున నక్కడ నున్న తెలుఁగుపుస్తకములపట్టికనుసంపాదించి నేనుస్వయముగానక్క

డకుఁబోయి పుస్తకములు చదివి వానిలోనుండి నాకుకావలసిన భాగములను వ్రాసికొని వచ్చితిని. అంతేకాక యక్కడనున్న పెక్కుపుస్తకములకుఁ బ్రతులను వ్రాయించి తెప్పించితిని. మూఁడుసంవత్సరములు వరుసగా వేసవికాలము సెలవులలో చెన్నపట్టణమునకుఁ బోయి యక్కడి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమునకు ప్రతిదినమును పగలు పదిగంటలకు భోజనముచేసి పోయి సాయంకాల మైదుగంటలవరకు నక్కడనుండి తాళపత్రలిఖితపుస్తకములనుజదివి వానిలోనుండి కావలసిన భాగములను వ్రాసికొనుచుంటిని. ఒకనాఁడుట్రాము బండిలో నెక్కిపోయి సముద్రతీరమున దిగి పుస్తకభాగములను వ్రాసికొనవలెనన్న యుద్దేశముతో నక్కడనుండి కోటకు నడిచిపోయి కావలసిన పుస్తకమును పుస్తకభాండాగారమునుండి పైకితీయించి వ్రాసికోఁబోఁగా నాకంచుకకోశము (పొక్కా-జేబు) లోని వ్రాఁతపుస్తకము కనఁబడలేదు. ట్రాముబండిలో దానిని విడిచి వచ్చితినని వెంటనే మరల సముద్రతీరమునకుఁ బోయి మఱియొక్క ట్రాముబండి నెక్కి విద్యుచ్ఛలోత్పాదక స్థానమునకు వెళ్ళి యచ్చట మొదట నెక్కివచ్చిన బండిని నడుపువానిని కనుఁగొని యడుగఁగా నతఁడేనో వ్రాఁతపుస్తకము బల్లమీఁదనుండఁగ క్రిందపాఱవైచితినని చెప్పెను. అతనిబండిలో మరల నెక్కి యాతఁడు పుస్తకమును పాఱవేసితినన్న స్థలమునకు వచ్చి దిగి యాసమీపమున వెదకి చుట్టుపట్టులవారిని విచారించి పుస్తకమిచ్చినచో సొమ్మిచ్చెదనని యాశపెట్టితినిగాని పుస్తకము జాడ యెక్కడను కానరాలేదు. పుస్తకము తెచ్చియిచ్చినవారి కిరువదియైదు రూపాయలు పారితోషకమిచ్చెదనని ప్రకటించినను కార్యములేకపోయెను. ఇందుమూలమున నేను నెలదినములు పడిన కష్టమంతయు నిష్ఫలమయ్యెను. అందుచేత నేను కోటకుఁబోయి చదివిన పుస్తకములనే మరల చదివి వ్రాసినదానినే మరల వ్రాసికోవలసి

వచ్చెను. ఆకాలమునందు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము కోట లోనుండెను. ఈప్రకారముగా విశేష శ్రమపడి నేను కవులచరిత్ర మును వ్రాసి ముగించితిని. అప్పటికంటె నిప్పుడు కవుల చరిత్రమును వ్రాయుటకెక్కువ సౌలభ్యము లేర్పడినవి. పునస్సంశోధనము చేసి కవుల చరిత్రము నిప్పుడు వృద్ధిపఱిచి బాగుచేయవచ్చునుగాని వృద్ధుఁడనయి దుర్బలుఁడనయి యుండుటచేత నట్టి సంశోధమునకు నలఁయు శక్తియు నోపికయు నాకిప్పుడు లేకున్నవి. పైకిచూచువారికి కవుల చరిత్రవిషయమున నేను పడినపాటు తెలియకపోవచ్చును గాని యే యితర గ్రంథరచనావిషయమునను నేనింత కష్టపడలేదని నమ్ముచు న్నాను. దీనిని సర్వకలాశాలవారు బహుసంవత్సరములు పరీక్షాపఠ నీయ గ్రంథముగా నిర్ణయించి యుండుటచేత నేనుపడిన ప్రయా సము సఫలమయినదనియే సంతోషించుచున్నాను. ఈగ్రంథ ప్రకట నమువలన మనవారిలో కవుల విషయమున నాదుకొనియుండిన యభిప్రాయ ము లనేకములు మాఱిపోయినవి. ఆదుకొను నన్నయభట్టును తిక్కన సోమయాజియు సమకాలీనులయినట్టును, నన్నయభట్టారకుని మరణానంతరమున రాజనరేంద్రుఁడాంధ్రభారతమును పూర్తిచేయింప వలెనన్న యుద్దేశముతో "నింకు మసంబు నవ్యనవనీతసమాన" మన్న పద్యమునో "మదమాతంగతురంగకాంచన" యన్న పద్యము నో వ్రాయించి పంపఁగా తిక్కన సోమయాజి మరల నాపద్యమునే వేఱుగా వ్రాసి వర్ణము వేసిపంపఁగా నతఁడు భారతశేషమును రచిం చుటకు తగినవాఁడని నిర్ణయించి రాజనరేంద్రుఁ డాతనిని తనయాస్థా నమునకుఁ బిలిపించినట్టును, సర్వజనులును నమ్ముచుండిరి. ఈకవుల కిద్దఱకును నడుమ నిన్నూఱు సంవత్సరము లంతర మున్నదని సహే తుకముగా నేను నిరూపించిన పిమ్మట చదువుకొన్నవారిలో పూర్వా భిప్రాయము పూర్ణముగా మాఱిపోయినది. అయినను కవి జీవితము

లను మొదట వ్రాసిన గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగారు మొదలైనవారు కొంత అలుతరువాత సహితము వారిరువురును సమకాలికులని సాధించుటకయి హేత్వాభాసములను కల్పించి కొంతకాలము పెనఁగులాడిరి. కాని కడపట కార్యములేదని తమవాదము నుజ్జగించి యూరకుండవలసినవా రయిరి. లోకము సామాన్యముగా సత్యము తెలిసిన తరువాత సహితము తన తొంటి యభిప్రాయమును మార్చుకొనుట కొకపట్టున నిష్టపడదు గదా!

నన్నయభట్టీయమని సాధారణముగాఁ జెప్పఁబడెడు ప్రక్రియాకౌముది నన్నయభట్టకృతము కాదనియు, తనపుస్తకమునకు వ్యాప్తియు గౌరవమును గలుగుటకయి బాలసరస్వతియో మఱియొకరో రచించి నన్నయభట్టునకు కర్తృత్వము నారోపించి రనియు, నేను హేతుపూర్వకముగా నాకవులచరిత్రమునందు వ్రాసితిని. దాని నంగీకరింపక నాయభిప్రాయమును పూర్వపక్షము చేయుటకయి కొందఱు వృత్తాంతపత్రికలలో ఖండనములు వ్రాయఁ బ్రియత్నించిరి. వారి పూర్వపక్షములకు నేను చెప్పిన సమాధానములు విన్నపిమ్మట వారిలో ననేకులు తమయభిప్రాయములు మార్చుకొనిరి. అట్టివారిలో నొక్కరైన గురుజాడ శ్రీరామమూర్తి పంతులుగా రొకసందర్భమున నా సిద్ధాంతము నంగీకరించుచు వ్రాసినప్పు డముద్రితగ్రంథచింతామణి పత్రికాధిపతులైన పూండ్ల రామకృష్ణయ్యగారు "మనవాదమును నిలువఁబెట్టవలసిన మీరేయిట్లు ప్రతిపక్షులలోఁ జేరినఁ జెప్పవలసిన దేమున్న" దని వ్రాసిరి. మనలో ననేకులకు తమవాదము గెలువవలెనన్న యభిలాషమే కాని సత్యమును గ్రహింపవలెనన్న యభిలాషము లేదు. తాఁనుపట్టిన కోడికి మూఁడేకాళ్ళను వారితో వాదించి వారి నెవ్వ రొప్పింపఁ గలుగుదురు? ఇప్పు డధిక సంఖ్యాకు లీవిషయ

మున నాయభిప్రాయముతో నే యేకీభవించుచున్నట్లు కనఁబడు
చున్నారు.

యతిప్రాసములందు రేఫఱకారమైత్రిని గూర్చి కూడ బమ్మెర పోతరాజు చరిత్రమునందు విశేషముగా వివాదము చేయఁబడినది. నేను నాపుస్తకములందు రేఫఱకారమైత్రి చేసినవాఁడను కాకపోయినను, ఈభేదము భాషకనావశ్యకమనియు పూర్వమునందీ భేదము లేక నడుమ తెచ్చి పెట్టఁబడిన దనియు దానిని తొలఁగించుట కర్తవ్యమనియు నామతము. చదువరుల కీవిషయము మనోహరముగా నుండునని తలఁచి యందలి కొన్నిభాగముల నిం దుదాహరించు
చున్నాను.

“రేఫఱకారములకు మైత్రి యుండఁగూడ దని నన్నయభట్టారకాదుల యభిప్రాయ మగునా యనియు సంశయింప వలసియున్నది. నన్నయభట్టు రేఫలములనుగాఁ బ్రయోగించిన వానిని గొన్నిటిని శకటరేఫములనుగాను శకటరేఫములనుగాఁ బ్రయోగించిన వానిని గొన్నిటిని రేఫములనుగాను తిక్కన ప్రయోగించియున్నాఁడు. అయినను రేఫశకటరేఫముల విషయమును తెనుఁగు లాక్షణికులు వాని కన్నిటికిని ద్విరూపములు గలవని చెప్పెదరు. అట్లననిపక్షమున రేఫములకును ఱాలకును మైత్రిలేదను తమవాదము పడిపోవునన్న భీతిచేత పన్నిన పన్నుగడ కాని యిది మఱియొకటి కాదు. ఒకపదమునందలి యొకక్షరము రేఫమును శకటరేఫమును నగుననుటవలనఁ దన్మైత్రి కూడదను వాదమునకే దౌర్బల్యము కలుగునని నాయభిప్రాయము. ఒకపదమునందలి రేఫము ఱకారముగా మాఱునప్పుడు ప్రత్యేకముగా రేఫ ఱకారములకు మైత్రి కలిగియున్న నేమి బాధ కలుగునో నే నూహింపఁజాలకున్నాను. తెలుఁగుపదములం దివి ఱాలని నిర్ధారణము చేయుటకు వారి కేమి

యాధారము లున్నవో మొట్టమొదట నాకుఁ దెలియకున్నది. కవిత్రయమువారి ప్రయోగములందు సంస్కృతపదములతో యతిప్రాసములయందుఁ జేరనివాని నన్నిటిని శకటరేఫములనుగా నిర్ణయించియున్నారు. రేఫములను గలిగియుండియుఁ దెలుఁగుపదములు యతిప్రాసములయందు సంస్కృతపదములతోఁ జేరక యుండరాదా? 'నాన్యేషాం వైధర్మ్యం లఘ్వలఘూనాం రయోస్తు నిత్యం స్యాత్' అని వాగనుశాసనుఁడు చెప్పియుండుటచేత లఘ్వలఘు రేఫములకు మైత్రి కూడ దందురేమో! ఆంధ్రశబ్దచింతామణి నన్నయభట్టు చెప్పినదయి యుండదని యూతని చరిత్రమునందు నిదర్శనపూర్వకముగాఁ జూపఁబడియున్నది. కాఁబట్టి రేఫ ఱకార వైరము నన్నయభట్టుమతము కాదని సందేహింప వలసియున్నది. ఈ భేద మావశ్యకమని చెప్పిన బాలసరస్వతిసహిత మీభేదమును గనిపెట్టలేక తన చంద్రికాపరిణయమునందు రేఫఱకారములకుఁ బ్రాసమైత్రి చేసియున్నాఁడు. రేఫఱకారమైత్రి కూడ దని పూర్వకాలమునందు కొందఱి మతమైనను [illegible]నియుఁ బలువగు మతమై యున్నది. భారతాదుల నామూలాగ్రముగాఁ బరిశోధించి యుభయభాషలయందును సర్వతోముఖపాండిత్యము గలవారయిన బమ్మెర పోతన, పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడు, పింగళి సూరన, అలసాని పెద్దన మొదలైన తొంటికవు లనేకులు రేఫఱకారమైత్రి నంగీకరించిన పక్షమువాడు ........................................

కవిత్రయమువా రొక్క పదములోని యొకక్షరమునే యొకప్పుడు రేఫమునుగాను మఱియొకప్పుడు శకటరేఫమునుగాను ప్రయోగించుట చేతనే వారికా భేదమంత సమ్మతము కాదని స్పష్టపడుచుండలేదా? అప్పకవి మొదలైనవారీ ద్విరూపములను నడుమఁ దెచ్చి పెట్టినారు. మఱియొక హల్లుతోఁ జేరియున్నప్పుడు బండిఱా రేఫముతో యతి

ప్రాసములందు మైత్రి చెందుచుండఁగా, రేఫము సవర్ణములుగాని ఋకారముతోను లకారముతోను మహాకవి ప్రయోగములయందు యతిప్రాసల మైత్రిని బొందుచుండఁగా, సవర్ణమగు ఱ బండిఱాతో నేల మైత్రి చెందరాదో తెలియరాదు. అనావశ్యకములైన నిర్బంధములను దీసివేసి భాషను సుసాధ్యము చేయుట పరమ ప్రయోజనకరమగుటచేతను, రేఫఱకారభేదమువలన భాషకొక ప్రయోజనము కలుగకుండుటచేతను పూర్వకవు లనేకులు వానిమైత్రి నంగీకరించి యుండుటచేతను, మన పండితులు సర్వగ్రాహ్యమయిన యీభేదమును పాటింపక భాష చిక్కు కొంతవఱకు సమ్మతింతురని నమ్ముచున్నాను. పదములు రేఫభేదమునఁ గలిగియున్నచో నర్థభేదమునుండఁ గలిగి యుండు నందురేమో? సలక్షణవేత్తలు చేసిన నిర్ణయమునుబట్టియే యెన్నిపదములు సమానార్థములుగలవే యుభయ రేఫములుగా నుండలేదు? అర్థభేదమును నిర్ణయించుటకుఁ బ్రకరణ సాహచర్యాదులు సాధనములుగాని వ్రాయఁబడిన రూపము గాదు.'

నడుమ విడువఁబడిన భాగములో రేఫఱకారములకుఁ గవిజనాశ్రయమునందు యతిప్రాసమైత్రి చెప్పఁబడెననియు శారదాదర్పణమునందు యతిమైత్రి చెప్పఁబడినదనియు, రేఫఱకారమైత్రిని దూషించి యామత మవలంబించినవారిని కుకవు లని దూషించిన యప్పకవియే తనకా భేదము తెలియక రేఫఱకారమైత్రిచేసి తాను దానభివర్ణించిన కుకవికోటిలోనే చేరెననియు, అలసానిపెద్దన, కృష్ణదేవరాయలు, పింగళి సూరన్న, అయ్యలరాజు రామభద్రుఁడు, పిల్లలమఱ్ఱి పినవీరన్న, సంకుసాల నృసింహకవి రేఫఱకారములకుఁ దమగ్రంథములయందు యతిప్రాస మైత్రి చేసిరనియు, పూర్వులు తద్భవములందును దీర్ఘములమీఁదను బండిఱా లేదని చెప్పఁగా నిప్పటివారు రెండుచోట్లను గూడ నున్నదని చెప్పుచున్నారనియు, కూచిమంచి తిమ్మ

కవి బండిఱా సంయుక్తమయినప్పుడు రేఫముతో మైత్రి చెందునని చెప్పఁగా నిప్పటివా రట్టిచోట్ల బండిఱా రేఫముగా మాఱునని చెప్పు చున్నా రనియు, పద్యముల నుదాహరించుచు లక్ష్యసహితముగా వ్రాయఁబడినది.

(కవిచరిత్రములను వ్రాయుటకయి తెలుఁగులోనున్న యముద్రితములును ముద్రితములును నయియున్న గ్రంథశతములనుజదువుచు కొంద ఱాధునికుల గ్రంథములను జదివినప్పు డిటువంటి గ్రంథము లేల వ్రాయఁబడెనా యని మనస్సులో చింతయుఁ గోపమును కలిగి వానివిషయమునఁ గొంత కఠినముగ వ్రాయవలసినవాఁడనైతిని. ఇటువంటిగ్రంథములలో నొక్కటియైన గణపవరపు వేంకటకవియొక్క ప్రబంధరాజ వేంకటేశ్వరవిలాసమునుగూర్చి వ్రాయుచు నాతని చరిత్రములో మొదట తెలుఁగుకవిత్వ మెట్లారంభ మయి కడపట నేటిస్థితికి వచ్చుచున్నదో నాయభిప్రాయ మిట్లు వ్రాసితిని—

"సంస్కృతములోనున్న జ్ఞానధనమును జనులకు వెదచల్లవలె నన్న పరమార్థచింతతో మొట్టమొదట నన్నయభట్టారకాది మహాకవులు పదునొకండవశతాబ్దారంభమునుండి సులభశైల్యను సంస్కృత గ్రంథములఁ దెలిఁగింపఁ దొడఁగిరి. ఈ భాషాంతరీకరణ కార్యము పదునైదవశతాబ్దారంభమువఱకును నవిచ్ఛిన్నముగా జరుగుచువచ్చెనుకాని యిట్లు భాషాంతరీకరణమునకుఁ బూనుకొన్నవారిలోఁ గడపటివారగు శ్రీనాథులు దమపూర్వులకన్నఁ దాము ఘనులనిపించుకొనవలెనన్న చింతచేతనో, మఱి యేహేతువుచేతనో, సంస్కృతపదభూయిష్ఠములైన దీర్ఘసమాసములతో నింపిరసమును జెఱుపకపోయినను దమగ్రంథములు బహుజనులకు దుర్గ్రాహ్యమైన కఠినశైలిని జేసిరి. ఇట్లాకాలములో భారతభాగవత రామాయణాదిముఖ్యగ్రంథములన్నియుఁ దెలిఁగింపఁబడఁగా, అటుతరువాతఁ బదునాఱవశతాబ్దా

రంభమునం దల్లసానిపెద్దనాదు లాక్రొత్తత్రోవను ద్రొక్కి కేవల భాషాంతరములు కాకుండఁ బురాణములలోని కథలను గైకొని స్వకపోలకల్పితములైన వర్ణనలను జేర్చి పెంచి శ్రీనాథాదుల శయ్యాననలంబించి రసవంతముగాఁ బ్రబంధములను జేయ నారంభించిరి. ఈపని నూటునూట యేఁబది సంవత్సరములవఱకును జరుగుచు రాఁగా, 1650-సంవత్సరములోపల బహుమార్గముల నూతన ప్రబంధము లనేకములు తెలుఁగునఁ జేయఁబడినవి. అంతటితో నూతనసృష్టి బహుతరముగా నంతరింపఁగా, ఈవలివారు వసుచరిత్రమును మాతృకనుగాగొని దానికి పాఠాంతరములో యున్నట్లు పూర్వవర్ణనములనే తలలుమార్చి ప్రయోగించుచు వెనుకటిప్రబంధముల ననుకరించి తమప్రబంధముల నల్లఁజొచ్చిరి. చేసినదానినే పేరులుమార్చి మరలఁ జేయుచుండుటచేత నూతనార్థ కల్పనలను జేయుట దుష్కరమయినందున నిటీవలివారిలోఁ గొందఱు మహానుభావులగు పురుషు లాయర్థలోపమును బదాటోపముతోఁ బూరింపఁ బ్రయత్నించిరి. పూర్వపువా రక్కడక్కడ సముచితముగా శబ్దాలంకారములను జేర్చుచువచ్చినను భాషావధూటికిఁ బ్రాణమైన యర్థసారస్యమును జెడఁగొట్టకుండిరి. ఇటీవలివా రర్థసారస్యము నంతగాఁ బాటింపక నిఘంటువులను వెదకి పదములేరికూర్చి బంధించి తమసరస్వతిని, హృదయాకర్షకము కాకపోయినను, కర్ణరసాయనముగా నైనను జేయఁ బాటుపడిరి. ఇట్టివారిలో నెన్నికగన్న కొందఱుబంధాదుల పతిమాత్రముగాఁ జేర్చి యర్థసారస్యమును బూర్ణముగాఁ జెఱిచి యవయవములు విఱిచిచిత మభాషావధూటిని విరూపినిజేసి శవప్రాయను జేసిరి. మన యీవేంకటేశ్వరవిలాసకృతికర్తయు బలరామచరిత్రకృతికర్తయైన గుడారు వేంకటదాసకవియుఁ గొంతవఱకీ కడపటితెగలోఁ జేరినవారు...నవరసరసికు లెప్పుడును హృదయాహ్లాదకరముగా నర్థకల్పనము చేసియు, కర్ణరసా

యనముగా మృదుమధురవాగ్గుంభనలలో భావములఁ గూర్చియు, మానసోద్దీపకముగా నీతిపోషణ మొనర్చియు వర్ణనలు చేయఁగలిగిన కవిని మాత్రమే మెచ్చుకొందురు కాని కావ్యదోషములకు లక్ష్యము లగునట్లుగా నర్థగౌరవమును జెఱిచి పదములు విఱిచి పద్యములలోఁ బద్యములను దూర్చినవారిని మెచ్చుకోరు.''

పయినాయభిప్రాయములను జనులహృదయములలో నాటునట్లుగా తేటపఱచుటకయి నే నాకాలమునందు 'సరస్వతీనారదవిలాప' మనుపేర నొక చిన్న పద్యపుస్తకమును జేసితిని. అందలి పద్యములఁ గొన్నిటిని మదాహరించుచున్నాను.

మ. రమణీయోక్తులచేత నర్థగుణసారస్యంబు గల్పించుచుం
దమి నాయంగచయంబునన్ సహజసౌందర్యంబు పెంపొందఁ గొం
చె మలంకారము లుంచి తొల్లిటికవుల్ చేష్టాచమత్కారభా
గ్యము హెచ్చించుచు దీర్ఘకాలము ననుంగాపాడి రర్థక్రియన్.

చ. అటు సుఖయించుచుండఁగ మదాస్యమునందు నిరర్థకంబులై
పటపటలాడు శబ్దముల బల్మిని బెట్టి, రసంబు నెట్టి, య
క్కటికములే కలంకరణకై తనముం గొని మేను కుట్టి, యి
ప్పటిఘను లార్తి పెట్టెదరు ప్రాణము తీసి ననుం గలంచుచున్.

క. తెలియమి సుమ్మిప్పుడు నా
పలుకుల యర్థంబు నాకె భావము లేమిన్;
వెలసామ్ములుగా కివి సం
కెల లయి కడు నాదు మేనికి న్వెత నించున్.

సీ. దయ మాలి తుదముట్టఁ దలకట్టు నిగిడించి
ధీరుఁడై నన్ను బాధించు నొకఁడు;
పాదంబులోపలఁ బాదంబు లిమిడించి
వీరుఁడై నన్ను నొప్పించు నొకఁడు;

ప్రాసంబుపై బెక్కు ప్రాసంబు లడరించి
పోటుబం టయి నన్నుఁ బొడుచు నొకఁడుఁ
బెండుపల్కులు గూర్చి నింపించి నగలంచు
దిట్టయై చెవులు వేధించు నొకఁడు;
ఖడ్గచక్రాదిరూపము ల్గానిపించి
వర్ణముల్ మార్చి ననుఁ జిక్కుపఱుచు నొకఁడు;
కుమతు లొడలెల్ల విఱిచి ప్రాణములు తీయ
నొడలి పసలేక శుష్కించి యున్నదాన.

క. సుందరబహురసపుష్టి న
మందానందంబు బుధులమది కిడ దేనిన్
ఛందోబద్ధంబగు పద
బృందాటోపంబు తాఁ గవిత్వం బగునే?

క. రసములు కావే ప్రాణము
లసమానకవిత్వకాంతి కవనీస్థలిలో
రసహీనమైన కవితకుఁ
బొసఁగించు నలంకృతి శవమున కిడు తొడవౌ.

క. విను ఛందోబద్ధంబను
ఘనకారణమున నె బ్రతుకుఁ గననగు నేనిన్
తనువది వదలి వెసం జ
క్కనిమ్మృతినొందుటయె లెస్స కవితా సతికిన్.

క. కవితాసతి జీవకళ
శ్రవణోత్సవభాషణంబు సలిపెడున ట్లుం
డవలెం గాక యొకప్పుడు
శవమువలె న్నిద్రితవలెఁ జన దుండంగన్.

సరస్వతీ నారదవిలాపము, నారదుఁడు తనతల్లియైన సరస్వతి యొక్క యప్పటిరూపమును జూచి యానవాలుపట్టలేక కారణమడుగఁగా నామె తనదురవస్థ చెప్పుకొని విలపించినట్లున్న యుత్తరప్రత్యుత్తరరూపమైన సంవాదగ్రంథము. ఇందలి పయి మొదటి మూఁడు పద్యములును సరస్వతిచేత నారదునితోఁ జెప్పఁ బడినవి. ఇందలి మూఁడవ పద్యమునందలి తలకట్లు, పాదములు, ప్రాసములు, రెండు పల్కులు, ఖడ్గచక్రాదులు, వర్ణములు, అనుపదములలో శ్లేషములున్నవి. తలకట్లనఁగా శిరోబంధనములు, అకారములు; పాదములనఁగా కాళ్లు, పద్యచతుర్థభాగములు; ప్రాసము లనఁగా ఈటెలు, పద్య ద్వితీయాక్షరములు; రెండుపల్కులనఁగా, జీలుగుబెండుముక్కలు, నిస్సారపదములు; ఖడ్గచక్రాదు లనఁగా కత్తులు చక్రములు మొదలైన యాయుధములు, ఖడ్గచక్రాదిబంధములు; వర్ణములనఁగా (మొగము) వన్నెలు, అక్షరములు.

హాస్యసంజీవనియొక్క మొదటి రెండవ మూఁడవభాగములు, వివేకవర్ధనియొక్క ప్రథమ ద్వితీయ తృతీయభాగములు, ఉపన్యాస మంజరి, అనునవి నేను పత్రికల కప్పుడప్పుడు హాస్యరసప్రధానములుగాను వివిధవిషయ వివరణములుగాను నీతిమత ధర్మబోధకములుగాను వ్రాసిన వ్యాసములెత్తి ప్రత్యేకముగా ముద్రింపఁబడిన పుస్తకములు. ఇందుఁ బ్రకటింపఁబడినవి గాక నేను వ్రాసిన హాస్యసంభాషణములును వ్యాసములును నీతి ధర్మ విశేషములును పెక్కులుగలవు. అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము, విచిత్రవివాహ ప్రహసనము, మహాబధిర ప్రహసనము, పునస్స్మరణ ప్రహసనము, బలాత్కార గానవినోద ప్రహసనము, కలహప్రియా ప్రహసనము, మహామహోపాధ్యాయ ప్రహసనము, యోగనిద్రా ప్రహసనము, మహానందక ప్రహసనము, అసహాయశూర ప్రహసనము, అను పదియు నింగ్లీషుభాష

లోనున్న ప్రహసనముల ననుసరించి వేషలను కొంతకథను తెనుఁగువారి కనుకూలముగా నుండులాగున నేను మార్చివేసిన ప్రహసనములు. కలిపురష శనైశ్చరవిలాసము, వేశ్యాప్రియ ప్రహసనము, కౌతుకవర్ధని, వినోదతరంగిణి, నాస్వకపోల కల్పితములైన ప్రహసనములు. కలిపురుష శనైశ్చర విలాసములోని సురాపాన విషయకమైన సంభాషములోని కొంతభాగమును వినోదార్థముగా నిందుదాహరించుచున్నాను—

"మద్యప్రియుఁడు— ఈరెండు పానాలుగా చాలకపోతే సురాపానం కూడా చెయ్యవచ్చును. అది కడుపులోపడితే స్వర్గసుఖమంతా భూలోకంలోనే కలుగుతుంది. దాని తల్లికడుపు చల్లగా కల్లమ్మవారు వెయ్యేళ్ళు వర్ధిల్లవలెను. కల్లుముంతకు వెయ్యినమస్కారాలు చేస్తాను. (డాంభికునితో నేకాంతముగా) ఒరే నోటికాడి కల్లు పడగొడితే పాపంవస్తుందిసుమా. అక్కడ చెప్పబోకు.

డాంభి— (తనలో) ఈ శనిగాడిచేత సురాపానం చేయిస్తే ఆమయికంలో వేశ్యమాట మరచిపోతే యిప్పటికి నాశని వదులుతుంది. నేనుప్రోత్సాహంచేస్తాను. (బిగ్గరగా) సురదివ్యమైనది. భూలోకంలోవున్న దివ్యమయిన వస్తువల్లా దక్క-కల్లే. అందుచేతనే మాపెద్దలు దానికి దివ్యులతో సమానంగా 'సుర' అని పేరు పెట్టినారు.

శని—దానియందంత సుగుణమున్నదా? మనుష్యులు యజ్ఞాలలో దేవతలకు సమర్పించే సోమరసం నేను పానంచేసిననాను. అది అమృతముకంటెనూ బాగావుంటుంది. అంత రుచిగా వుంటుందా!

డాంభి—వెధవరసం సోమరసంయేమిటి? మధురసం తాగితే మీరు మళ్ళీవదిలిపెట్టరు. మీరు వెళ్ళేటప్పుడు ముంతెడుకల్లు తీసుకువెళ్ళి కాస్తకాస్త దేవతలకు చవిచూపిస్తే రేపటినుంచి దేవతలంతా కల్లంగళ్ళకాడనే వుంటారు. సోమరసమే మెచ్చుకునేవాడు మధురసం

రుచి మరిగితే మళ్ళీవదలిపెడతారా? నేను వెనుక యజ్ఞంచేసినప్పుడు సోమిదేవితోకలసి సోమరసం కొంచెం పానంచేసి చప్పగా యేడిసి నట్లే వుండేటప్పటికి తెప్పుక్కున అధ్వర్యుడి మొఖం మీద వుమ్మేసి నాను. తరువాత శాక్తేయంలో ప్రవేశించి కల్లు వక్కసారి చవి చూచిన తరువాత అప్పటినుంచీ మళ్ళీ వదలడంలేదు. దాని మహిమ మహా దొడ్డది. మీరు సేవించవలెను.

శని—ఆలాగయితే దేవతానివేదనకు తీసుకురండి.

మద్య—అయ్యో! నేను కృతార్థుణ్ని అయినాను. నేను తాగగా మిగిలింది కల్లుముంతలో సగంవున్నది. అది దేవతానివేదన చేసుకుంటాను. అది యెంగిలిదని దేవరవారు సందేహపడవలసిన పని లేదు. మూడువిధాలపానాలలో దేనికీ వుచ్ఛిష్టంలేదు...(అని కల్లు ముంత చేతికిచ్చుచు) ఓసురాదేవీ! అమ్మవారూ! తల్లీ! నీవీదేవుడి హృదయంలోచొచ్చి నీమహిమ చూపించి భక్తునికి వరాలు యిచ్చే టట్టు చెయ్యవలెను. నీకు మ్రొక్కుతాను. నేను కోరేవరమల్లా నన్ను యీ దేవుడు కల్లు సముద్రం చూడ పంపవలెను. నేను యెన్ని దేశాలు తిరిగినా పురాణాలలోనే కాని కల్లు సముద్రం యెక్కడా కనపడకుండా వున్నది. నాకు కల్లుసముద్రం యెరకు చూపితే నా పాలి కతడే దేవుడు.

శని—(పుచ్చుకొని కల్లుత్రాగి) రుచి దివ్యంగా వున్నది.

మద్య—కొంచెంసేపు తాగితే తలకెక్కి మరీ దివ్యంగావుం టుంది. సురయొక్క మహిమ సురలకైనా దుర్వగాహమే. అది తాగితే వెయ్యేళ్లు తపస్సుచేసిన యోగులకైనా సాధ్యంకాని అద్వైత సిద్ధి వక్కనిముషంలో అవుతుంది. అప్పుడు ద్వంద్వాలు యేమీవుం డవు. బ్రహ్మానందం కలుగుతుంది. మురికికాలువలు హంసతూలికా తల్పాలవుతవి. బట్ట విప్పివేసుకున్నా కట్టుకున్నా వక్కటేలాగు వుం

టుంది. బట్ట విడిచిపోయి దిగంబరినై నేను మొన్న మురికికాల్వలో పడి వీధి పక్కను సురాపాన మహిమచేత బ్రహ్మానందం అనుభవిస్తూ వుంటే ఆనందపరవశుడనై వున్న నాకు మాబంధువులు వచ్చి బ్రహ్మరథంపట్టి యింటికి తీసుకునివెళ్ళి బిందెడునీళ్ళు నెత్తిమీద అభిషేకం చేసినారు.

దాంభి—సురాపానంలో యిటువంటి సిద్ధులు యింకా యెన్నో వున్నవి. అప్పుడు సరస్వతీదేవి తనచిన్ననాటి తడబాటు పలుకులతో జిహ్వాగ్రమందు నటిస్తూవుంటుంది. కొందరు మూఢులు సురాపానం పాపమంటారుగాని, పాపమే అయితే తాగినవాళ్ళను బ్రాహ్మలు యెందుకు కులంలో వెలివెయ్యరని ఆలోచింపరు.

శని—(నాలుక తడబడి) అ్రె్రె్రే. బ్రోబ్రోబ్రోగంది.

మద్య—అదుగో! అదుగో! అదుగో! దేవుళ్ళే కల్లమ్మ వారు పూనింది. సురాదేవి ఆవేశవశంచేత యిప్పటికిప్పుడే వాక్కు వస్తూవున్నది. ఓయీ! దాంభికా! చుట్టతీసుకున్నావా? ధూపంవేసి యీదివ్యజ్ఞానంలో వుండగానే మనం యీదేవుళ్ళను అడిగి పురాణాలలోవుండే మన సంశయాలన్నీ తీర్చుకుందాము.

దాంభి—సందేహాలు తీర్చుకోవడానికి యిదే సమయం. స్వామీ! యిప్పటివాళ్ళు భూమి తిరుగుతూ వున్నదంటారు. అది నిజమేనా!

శని—అ్రె్రె్రే. అంతా నిజం భూమి తిరుగుతూవున్నది. ఇల్లు తిరుగుతూ వున్నది. సమస్తమూ తిరుగుతూవున్నది. నాదేహం కూడా తిరుగుతూవున్నది.

జన్మాంతరము, అతిబాల్య వివాహము, విగ్రహారాధనము, ఈశ్వరదత్తపుస్తకములు, ఈశ్వరోపాసనము, ప్రార్థన, మానుషధర్మము, విద్యాధికులధర్మములు, మనుష్యజీవితముయొక్క పరమార్థము

దానిని పొందు మార్గము, వైరాగ్యము, విద్యార్థులయర్హా కృత్య ములు, సత్యము, హిందూమతాచారములు, స్వయంకృషి, సహాయకష్ట కర్మలు, వేశ్యాకాంతల యుపన్యాసము. ఐకమత్యము, దానములు, స్త్రీపునర్వివాహ ప్రసంగము, స్త్రీపునర్వివాహ విషయ కోపన్యాసము, స్త్రీపునర్వివాహవిషయక ప్రథమ విజ్ఞాపనము, స్త్రీ పునర్వివాహ విషయక ద్వితీయ విజ్ఞాపనము, స్త్రీపునర్వివాహ శాస్త్ర సంగ్రహము, స్త్రీపునర్వివాహ వ్యాపారము నొక్క భూతవర్తమాన స్థితులు, దేశాభిమానము దాని యుద్దేశములును, శంకరాచా ర్యులు, జనకరాజు నకరాజుగారి జీవచరిత్రము-ఇవి యప్పుడప్పుడు నేను సభలలో వ్రాసికొనివచ్చి చదివిన యుపన్యాసములు. వ్రాసి కొనిరాక కేవలవాగ్రూపముగా సభలలో నే నిచ్చుచువచ్చిన యుప న్యాసములు వీనికంటె నాలుగురెట్లయినను గలవు. ఆరంభదశలో నామిత్రులు నేను చక్కఁగా నుపన్యాసములనుగాని మాటాడలేనని భావిం చుచుండిరి. క్రైస్తవమతపాఠశాలలోని తాలూకాలో ప్రాడ్వివాకుఁడు (Dt. Munsiff) గా నుండిన నామిత్రులు వల్లూరి రంగయ్యపంతులు గారు 1877 వ సంవత్సరము ఫిబ్రవరి 4-వ తేదిని నాకు వ్రాసిన యుత్తరములోని కొన్ని వాక్యముల నిందు నుదహరించుచున్నాను—

"Don't neglect your studies for F. A. Let me know if you like to accept a post the emoluments of which will not be less than your present salary and will not exceed Rs. 50 in the collectorate. The only defect I can find in you is that you are too mild and that your words are not at all as forcible as your writing and composition. You are like the author of "The Traveller." You cannot shine as a pleader. Of course, this is my simple opinion and I cannot say that I am right in my supposition. I would advise you to accept a post in the Revenue Department."

(ప్రథమశాస్త్ర పరీక్షకు మీరు చదువుటను నిర్లక్ష్యము చేయకుడు. వేత నము మీ యిప్పటి జీతము (రు 25-0-0) న కంటె తక్కువగాను

ఏఁబదిరూపాయల కంటె ఎక్కువగాను ఉండని కరగ్రాహికార్య స్థానములోని యొకయుద్యోగము నంగీకరించుట మీ కిష్టమేమో నాకు తెలియదు. మీలో నేను కనుఁగొనఁ గలిగిన లోపమెల్లను మీ రతి శాంతులగుటయు మీమాటలు మీవ్రాఁతవలెను అంతవీర్యవంతములంతమాత్రమును గాకుండుటయు నయి యున్నది. మీరు "మార్గస్థుఁడు" (The Traveller) గ్రంథకర్తవంటివారు. న్యాయవాదిగా మీరు ప్రకాశింపఁజాలరు; ఇది నిశ్చయముగా కేవలము నాయభిప్రాయము; నాయూహ సరియైనదని చెప్పఁజాలను. కరగ్రాహక శాఖలో పని నంగీకరింపవలెనని మీకు హితము చెప్పుచున్నాను.)

తరువాత నాలుగు సంవత్సరముల కనఁగా 1883-వ సంవత్సరమునందు రంగయ్యపంతులుగారు విశాఖపట్టణములో ప్రాడ్వివాకుఁడుగానుండిన కాలములో నే నక్కడకుపోయి యిచ్చిన యుపన్యాసములను విని యాశ్చర్యపడి తమతొంటి యభిప్రాయమును పూర్ణముగా మార్చుకొనిరి. నేను గంటలకొలఁది తడవుకొనకుండ నుపన్యాసములుచేయఁ గలిగినను, నావ్రాఁతరూపములైన యుపన్యాసము లెప్పుడును నాలిఖితోపన్యాసము లంతశక్తిమంతములుగా నుండకపోవుట సత్యమే. మొదట నాకంఠధ్వని గంభీరము కాదు; రెండవది చెప్పునప్పుడు నా కభినయము లేదు; మూఁడవది వినువారివంకఁ జూడక తలవంచుకొని నాకాగితమునే చూచుచు సాగక చెప్పుకొనిపోవుట. ఇవి మంచి వక్తకుండవలసిన లక్షణములు కావు. అయినను నేను చెప్పునది యుక్తియుక్తముగాను హృదయాంతరాళమునుండి వచ్చిన యవ్యాజమైనదిగాను వినువారికి తోఁచుచుండెను. నాయుపన్యాసధోరణిని దెలుపుటకయి 'విద్యాధికుల ధర్మముల' నుండి కొన్ని పంక్తులిచట నెత్తి వ్రాయుచున్నాను—

"ఇప్పుడు యుద్ధ మారంభమయినందున భగవదాజ్ఞను శిర
సావహించి మన సామాజికు లిక నెట్టి పౌరుషముతో దురాచార
పిశాచములతోఁ బోరాడుదురో యెంతవఱకు విజయమునొంది యీ
శ్వరమతమును దేశమునందు వ్యాపింపఁ జేయుదురో చూడవలసి
యున్నది. యుద్ధమే యారంభము కానిపక్షమున భక్తివిశ్వాసముల
తో నీశ్వరసేవయందుఁ దమ ప్రాణముల నర్పించి పోరాడు వీరభటు
లెవ్వరో, యీశ్వరద్రోహు లయి పాఱిపోయి యసత్యపిశాచముల
వాతఁబడు పిఱికిపందల లెవ్వరో, తెలియరాదుగదా? ఇంతవఱకును
మనమీఁదికి రాక యూరకున్న ప్రతిపక్షు లింత సేనతో మనపయికి
దండు వెడలుటకు వారికిప్పుడేమిబలము వచ్చెనని కొందఱు సందేహ
పడవచ్చును. మునుపే వంక నుండువారు సహితము భయపడి తమ్ము
ననుసరింపఁగా నధిక సంఖ్యతో మనమీఁద దాడి వెడలుటకు మన
ప్రతిపక్షుల కిప్పు డితర బలము లేకపోలేదు. వారి కిప్పుడు మనుష్య
బలముమాత్రమే కాక తమ్మిప్పు డాశ్రయించియున్న తమపాలిటి
భాగ్యదేవతయొక్క బలముకూడ సమకూడినది. సృష్ట్యాదినుండియుఁ
బ్రపంచములోని వివిధజాతులవారిచేతను గల్పింపఁబడిన సమస్తదేవ
తల కంటెను బలాధికురాలయి గూఢార్థవిశేషసంపదచే నారాధింపఁ
బడుచున్న మహాదేవతయొకటి వారికిఁ గాపయి నిలిచి సకలవిధ
ములఁ దోడుపడుచున్నప్పుడు వారు మనమీఁద దండెత్తి సాహసింపక
యేల వెనుకతీయుదురు? వారి దేవతతో సమానమయిన చుఱుకుఁదనము
గలది నా బుద్ధికి మఱేదియు గోచరముకాలేదు. దాని కిప్పుడును బడ
లికయే లేదు. అటువంటి విచిత్రశక్తిగల యపూర్వదేవత మనలను
గెలుచుటకయి వారి కెన్నో విద్యల ననుగ్రహించి యున్నది; ఎన్నో
యద్భుతసాధనములఁ బ్రసాదించి యున్నది; ఎన్నో యపూర్వ దర్శ
నములను తనంతనే కరుణించి యున్నది. తన శక్తిచేత దేవుని రాజ్య

యందు అల్లాఉద్దీన్ చిత్తూరు కోటను ముట్టడించినప్పుడు పద్మిని విషయమున నడచిన యద్భుతపరాక్రమ చర్యలు మొదలయినవి వర్ణింపఁబడినవి.

1894-వ సంవత్సరమున వేసఁగికాలపు సెలవులలో నేను చెన్నపట్టణము వెళ్ళినప్పుడు తెలుఁగున జీసస్ చరిత్రమును వ్రాయనారంభించి యాఱు ప్రకరణములు చేసితిని. అది యప్పటినుండియు ముగియక యట్లే యుండఁగా ఈ 1913-వ సంవత్సరము ఏప్రిల్ నెలలో చల్లదనముకయి బెంగుళూరు పోయియుండి యచ్చట మిగిలియున్న రెండు ప్రకరణములను వ్రాసి పుస్తకము నేనోవిధముగా ముగింపఁ గలిగితిని. పుస్తక మంతయు దాదాపుగా నూటయిరువదిపుట లుండును. దీనియందుఁ గొన్ని చిత్రపటములును గలవు. 1894-వ సంవత్సరమునందలి నాశైలికిని దాదాపుగా నిరువది సంవత్సరములకు 1913-వ సంవత్సరమునందు వృద్ధ దుర్బల దశలో వ్రాసిన నా యిప్పటి శైలికిని మిక్కిలి వ్యత్యాసముండి యుండవచ్చును.

ఉత్తమస్త్రీ చరిత్రములలోని మొదటిభాగమును క్రొత్తగాఁ బ్రకటించితిని. ఇది చిత్రపటములతోనున్న యెనుబది పుటల గ్రంథము. ఈపుస్తకమునందు గ్రేస్ డార్లింగుకన్య, ఆర్లియన్సు కన్య యనఁబడు జోన్ ఆఫ్ ఆర్కు, ఎలిజబెత్ ఫ్రైదొరసాని, లేడీ జేన్ గ్రే, మేరీ కార్పెంటరు, అను నింగ్లీషుకాంతలయొక్క చరిత్రములును, ఉత్తమమాతయను నుపన్యాసమును ఉన్నవి.

రాజా రామమోహనరాయల చరిత్రమును బహుసంవత్సరముల క్రిందట నారంభించి కొంతవఱకు వ్రాసి విడిచిపెట్టితిని. ఈశ్వరానుగ్రహము వలన దానినిగూడ ముగించి ప్రకటింపఁ గలుగుదునేమో !

సత్యవాదినిలోఁ బ్రకటించిన కొన్ని యుపన్యాసములను, అద్వైతమత సంగ్రహమును, విశిష్టాద్వైత మతసంగ్రహమును, ద్వైతమత సంగ్రహమును, జేర్చి కూర్చి సత్యవాదిని యనుపేరితో 64 పుటలుగల గ్రంథమును నూతనముగాఁ బ్రకటించితిని.

1892-వ సంవత్సరమునం దింగ్లీషులో గోల్డుస్మిత్తను కవీశ్వరుఁడు రచించిన 'మార్గస్థుఁడు' అను పద్యకావ్యమును పథికవిలాసమను నామముతోఁ బద్యరూపమునఁ దెనిఁగించితిని. ఆచారవ్యవహారములును శీలములును దేశములును మనవారికి వింతగాఁ గనఁబడును గాన కేవల మూలానుసారముగా భాషాంతరీకరింపఁబడిన పాశ్చాత్య గ్రంథములు మనవారి కంతగా రుచింపకపోవచ్చును. భాషాంతరము సుగమముగాను మనోహరముగాను నున్నదని ప్రకటింపఁబడిన కాలమునందు మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నము పంతులవారు మొదలయినవారు శ్లాఘించిరి గాని దానిని గొని చదువు మహాజనుల సంఖ్యనుబట్టి మనవా రంతగా నాదరించిరని నేను భావింపను. పథికవిలాసములోని కొన్ని పద్యముల నిం దుదాహరించుచున్నాను.

మ. ఘన లోభాత్మకుఁ డొంటిగాఁ దనధనాగారంబు దర్శించి, మో
లినిగూర్చుండి ధనంబుఁబల్మఱునుదా లెక్కించి, లెక్కించి, యా
ధనముల్ కుప్పలుకుప్పలై కనుఁబ్రమోదంబియ్య, నుప్పొంగు; ద
ద్ధనరాసు ల్మఱిచాలవంచుఁ బదపం దాఁబుచ్చు నిట్టూర్పులన్.

మ. నడిచెన్ హెచ్చుగ దక్షిణాపథముకన్నం జంచలంబై, వడి
న్నడి వాణిజ్యము వేఱుతీరములకున్ నౌకాళితోఁ సంతటన్;
కడకుం బౌరులు లేనియూళ్ళు, భటశూన్య శ్రీప్రభూత్తంసముల్,
కడవంగా సిరి తెచ్చిపెట్టినది వెళ్ళంబోయె నిశ్శేషమై.

చ. తనదుకుటీరనైచ్యమును దద్దయు గేలియొనర్పఁ జెంగటన్
గనుఁగొనఁ జెందు సౌధములు గర్వమునం దల యెత్తుచుండఁగా;
తనదగు శాకపాకకలితంబగు భోజన మేవగింపఁగాఁ,
గనుఁగొనఁ జెందు విందు ధనికప్రభులున్నతిఁ గోడఁ జేయఁగన్.

చ. వెఱపును గొల్పుశబ్దమున నుఱిలినప్పుడు తల్లి యొమ్ముఁ దా
మఱిమఱి యంటి పట్టుకొను మాణవకుండునుబోలెఁ, గొండయో
ళ్ళఱిముఱి మ్రోయుచున్ వెడలునప్పుడు వాత్యలు వీచునప్పుడున్
మఱిమఱి పాయకుండఁ గనుమక్కువతోడనతండు స్వాద్రులన్.

చ. క్షితిని స్వతంత్రతాగరిమ చేయఁగఁజాలు ప్రయత్నమంతయున్
హితముగ నెల్లవారలపయిన్ సమభారముఁ బూన్పు పేకదా ?
అతిఘనవృద్ధి నొక్కతెగ యాదరమెంచి యతిక్రమించినన్
హిత మొనరించు దానిద్విగుణంబగు భారము క్రిందివారలన్.

తెలుఁగుభాషలో వచనకావ్యములేని కొఱఁత విశేషముగా నున్నందున దానిని కొంతవఱకైనను దీర్పవలెనన్న నిశ్చయముతో పద్యకావ్యములు వ్రాయుట మానుకొన్నను పలుల ప్రార్థనమీఁదను కొన్ని యవసరములందును పద్యములను జేయవలసినవాఁడ నగుచు వచ్చినాఁడను. 1883 వ సంవత్సరమున నప్పటి రాజప్రతినిధి యగు రిప్పన్ ప్రభువుగారు చెన్నపురికి వచ్చినప్పుడు బాలికలు చదువుటకును పాడుటకును కొన్ని పద్యములను పాటలను జేయుఁ డని మిత్రులు కోరఁగా నీక్రిందివానిని వ్రాసి సతీహితబోధినిలోఁ బ్రకటించితిని.-

ఉ. శ్రీ మహనీయ సత్కృపను జీవమొసంగ దైవదంబునాఁకఁ దా
సీమహిఁ గల్గు జంతువుల నెల్ల సతంబు సమానదృష్టితోఁ
బ్రేమను బ్రోచు నీశ్వరుఁడు విశ్వగురుండు రిపన్ ప్రభూత్తమున్
క్షేమచిరాయు రున్నతులఁ జెన్ను వహింపఁగఁ జేసి ప్రోచుతన్ !

సీ. ఎలమితో నెవ్వాఁడీ హిందువులకు స్థాని
కస్వపాలన మియ్యఁ గట్టుచేసె
నాంగ్లేయు లపరాధులైనను శిక్షింప
నెవఁ డిచ్చె నధికార మిచటి ప్రజకుఁ
బరదేశములనుండి సరకులఁ దెప్పింప
కిచటి వృత్తు లెవండు వృద్ధిపఱచె
నుప్పుమీఁద పన్ను నొక కొంత తగ్గించి
యెవఁడు బీదలకష్ట మింకఁ జేసె
నెవఁడు వృత్తాంతపత్రిక కిచ్చె స్వేచ్ఛ,
నెవఁడు యత్నించె విద్యాభివృద్ధి గూర్ప
నట్టిఘనుఁడు రిపన్ ప్రభు వడుగుడెంచు,
నేఁడు మనరాజధానికి నెలఁతలార !

ఉ. కావున నిట్టిగొప్పయుపకారము లెన్నియొ చేసినట్టి యా
ధీవిభవున్ నృపప్రతినిధిన్ మనమెల్లను గాంతలార ! సం
భావనచేసి మంగళముపాడి కృతజ్ఞతఁ జూపఁజెల్లు ము
న్నావరపాలకుల్ మనకు నంపినవారల యందుఁ గూరిమిన్.

నాదనామక్రియరాగము—చాపుతాళము

పల్లవి

మంగళమ్, మహీపాలచంద్రా ! మంగళమ్.

అనుపల్లవి

మంగళమ్. కరుణాంతరంగ దుర్జనభంగ
రంగదఖిలమహారాజ సంసేవితా ! మంగళమ్.

చరణములు

1. శ్రీ రిపన్ ప్రభువునకు ధీరునకు సతని
దారకు విమలవిచారకు ఘనునకు

మారుని కతనికుమారునకును మిత్ర
వారమునకు బంధువర్గంబునకు నిల. . .మంగళమ్.

2. అవని శ్రీ విక్టోరియా మహారాజ్ఞికి
యువరాజున కతనియువతికి సుతలకు
సువివేకులగు రాజసుతులకు సుతలకు
సవినయులగు వారిసతులకుఁ బతులకు. . .మంగళమ్.

3. ఈమహాప్రభువరు నిచటికిఁ బంపిన
ధీమంతులగు మంత్రితిలకుల కచ్చటి
శ్రీ మహాసభకును చెలఁగ నీదేశపు
క్షేమముఁగూర్చెడు స్థిరపుణ్యమతులకు. . .మంగళమ్.

1885-వ సంవత్సరమునందు నేను చెన్నపురికిఁబోయి యుండి నప్పుడు నా మిత్రులైన మన్నవ బుచ్చయ్యపంతులుగారి కోరిక పయిని బ్రహ్మోపాసనామందిర ప్రతిష్ఠాపన సమయమునం దీ క్రింది పద్యములను జేసితిని—

ఉ. శ్రీకరుఁడై నయీశ్వరుఁడు శ్రేయములం దయచేసి కూరిమిం
గైకొని ప్రోచుఁగాత గుణగణ్యులఁ బుణ్యుల సత్యశీలురన్
బ్రాకటభక్తియుక్తులను బ్రాహ్మసమాజమతానలంబులన్
లోకచయోపకారులఁ బ్రలోభవిదూరుల ధర్మచారులన్.

చ. మును మనహిందు దేశమున మూఢత మిక్కిలి పర్వి యెల్లెడన్
జనములు విగ్రహంబులకె చాలఁగఁ బూజలుసల్పుచుండఁగాఁ
గని యది మాన్పఁగోరి బహుకష్టములంబడి తొల్త రామమో
హనుఁ డిలమీఁద బ్రాహ్మమత మల్లన స్థాపనచేసె దక్షుఁడై.

చ. అటువలె నొక్కయీశ్వరుని యర్చనమున్ భువిమానసంబుగాఁ
బటుమతిఁ జేయుపద్ధతిని భాసిల నేఁబదియొండ్ల క్రిందటన్

ఘటనఁ బొనర్చి దేశమునఁ గల్గుజనంబులకెల్లఁ జాటి యా
దట నొనరించె నాతఁడు మతంబునకెల్ల మహోపకారమున్.

మ. ఘనుఁ డాతండు దివంబుఁ జేర వెనుకం గాపాడి యద్దానఁ బొం
దెను సత్కీర్తి మనీషులెల్లఁ బొగడన్ దేవేంద్రనాథుం డహో
వినుతిం జెందదె యాదిబ్రహ్మమతమన్ పేరన్ జనంబందు నీ
యనస్థాపించిన సత్సమాజ మిపుడొయ్యా న్సర్వసమ్మాన్యమై!

ఉ. ఈయనపండితోత్తముల నేవురఁ బంచెను వారణాసికిన్
బోయి సమస్తవేదచయముంబఠియింపఁగ, వారువచ్చి యా
మ్నాయములం బరీక్షఁగ విమర్శనయొనర్పఁగ నందుదోషముల్
పాయక కొన్ని కన్పడియెఁ బాసెను వానిప్రమాణభావమున్.

చ. వెనుకను బ్రాహ్మధర్మమనుపేరను గ్రంథ మొకండుజేసె నీ
యనఘుఁడె తా శ్రుతిస్మృతులయందలివాక్యము లేర్చికూర్చి యీ
యన ఘనకీర్తిఁగాంచె ముదమారఁగ కేశవచంద్రసేనుఁడున్
ఘనతరభక్తిఁ జేరెను ఘనంబుగ బ్రాహ్మసమాజము న్వడిన్.

చ. ఇతఁడు ప్రసంగముల్సలిపి యెల్లర రంజిలఁ జేయు దక్షుఁడై
ప్రతిభ మెయిన్ జగంబునను బ్రాహ్మసమాజము వన్నె కెక్క నం
చితగతిఁ జేసి శ్లాఘ్యతనుజెంది సమాజముకార్యదర్శి యై
యతులితసాహసంబున సహాయులఁగూడి త్యజించె వర్ణమున్.

ఉ. కేశవచంద్రసేను లిటు కేవలధైర్యముతోడ వర్ణమున్
పాశముత్రెంచి యాదిమపుబ్రాహ్మసమాజమువారు తన్నుఁ గ్రూ
రాశయులై వడి న్విడువ నంతట వీడియు వారినెయ్యపుం
బాశము హిందుదేశపు సమాజముస్థాపన చేసె వేడ్కగన్.

శా. హిందూదేశపుబ్రాహ్మసంఘమును స్థాపించెంగదా యంతకున్
ముందే కేశవచంద్రసేనుఁ డెలమి నుగ్రోక్తి పరాఙ్యు మొ

ప్పందా నీపురికేగుదెంచి యిచటం బచ్చుప్పవిద్యాలయం
బందుం బ్రాహ్మమతంబుఁగూరిచి యుపన్యాసంబు చేసెం దగన్.

శా. ఈలీలన్ మృదుమాధురీ మహిమతో నెన్నో యుపన్యాసముల్
లీలంజేసిన నాలకించి మది హాళింజెంది శ్రీరాజ గో
పాలాచార్యులు లోనుగాఁగలఘనుల్ బ్రహ్మంబు సేవింపఁగాఁ
బోల న్వేదసమాజము న్నిలిపి రీప్రోలందు సద్భక్తితోన్.

ఉ. ఈతఁడె తత్త్వబోధినిని నిష్పురమందును ద్రావిడంబులో
నాతరువాతఁ బూన్కిమెయి నాంధ్రమునం బ్రచురించి చాలఁబ్ర
ఖ్యాతినహించె ద్రావిడులయందలి మూర్ఖతపోవునట్లు స
ద్ధేతువులిచ్చి పుస్తకములెన్నియొ తా రచియించె దక్షతన్.

ఉ. ఈయనకున్ సహాయుఁడయియెంతయు నిశ్చలభక్తితోడ సు
బ్రాయలుసెట్టి పాటుపడి నన్నికుఁదెచ్చె సమాజమెంతయున్
బోయినఁ గొంతకాలమిటు పుణ్యశరీరులు వీర లిర్వురున్
గాయములం దొఱంగిరి యొకంటసమాజము పెంపుతూలఁగన్.

ఉ. ఈగతి వీరలిద్దఱును నీశ్వరసన్నిధిఁ జేరఁ బిమ్మటన్
వేగమె తాను శ్రీధరులు వేదసమాజము కార్యదర్శియై
బాగుగఁ గార్యనిర్వహణ భారముఁగైకొని బ్రాహ్మధర్మమున్
లోకకద్రావిడంబునఁ దెలుంగునను న్రచియించెఁదేటగన్.

ఉ. బ్రహ్మమునే భజించుచును నచ్చట దక్షిణహిందు దేశపున్
బ్రాహ్మసమాజమంచు నవనామముదీనికిఁ బెట్టి యిచ్చటన్
బ్రహ్మమతంబు శ్రీధరులు వ్యాపన మించుక చేసి యింతలో
బ్రహ్మపదంబుఁ జేరెఁ దరువాత సమాజము చెందె క్షీణతన్.

చ. తగిన సహాయముంగనక తద్దయుక్షీణత నొందుచుండఁగా
మగుడని భక్తితోఁగడఁగి మన్నవబుచ్చయ పంతులెంతయున్

దగుపనిచేసి తానొక విధంబున నిల్పె సమాజమిట్లు యుపన్
దెగువను దేశము ల్తిరిగి తెచ్చి ధనంబును సుస్థిరంబుగన్.

చ. నిలిపెను బ్రహ్మమందిరము నిత్యుని నిర్మలుసేసుఁ గొల్వఁగా
సలిపెను సాయమీపనికిఁ జాలఁగఁ దా శివనాథశాస్త్రియున్
వెలయునుగాక చెన్నపురి పేరను జెన్నగు నీ పురంబునన్
సలలితభక్తి నెక్కుడగు సామినిగొల్చెడు పుణ్యమీపయిన్.

1887–వ సంవత్సరమున శ్రీ విక్టోరియా మహారాజ్ఞిగారి పంచాశద్వత్సర పరిపాలన మహోత్సవసమయమున మిత్రవాంఛానుసారముగా 'శ్రీ విక్టోరియా జ్యూబిలీ నవరత్నము' లను పేరిట నీ క్రింది పద్యములనురచించి ప్రకటించితిని—

క. శ్రీకరుఁడగుపరమేశుఁడు, ప్రాకటకరుణాప్రపూర్ణ భాసముతోడన్
జేకొని ప్రోచుత గుణ, రత్నాకర విక్టోరియా మహారాజ్ఞిమణిన్.

సీ. ఏసాధ్వి తాఁ బదునెన్మిదివందల
బందొమ్మిదవయేఁట బ్రభవమొందె
నేరాణిపూజ్యయై తారాజ్యమునహించెఁ
బందొమ్మిదవయేటఁ బ్రజలుపొగడ
నేతల్లి గృహిణియై యేపుడుకూఁతులఁ
దనయుల నలువురఁ గనియె నెలమి
నేమాత యేఁబదియేండ్లనుండియుభూమిఁ
బాలించుచున్నది ప్రౌఢలీల
నేసతి దశాబ్దముల క్రింద హిందుదేశ
చక్రవర్తిని పట్టంబు సంగ్రహించె
నట్టి విక్టోరియారాజ్ఞి నాదిదేవుఁ
డాయురారోగ్యములనిచ్చి యరయుఁగాత!

సీ. బాల్యకాలమునందె బహుభాషలను నేర్చి
యతులవిఖ్యాతి యేయమ్మ గాంచె
వృక్షశాస్త్రమునందు వివిధప్రకృతిశాస్త్ర
వితతి నేయమ్మ ప్రవీణయయ్యె
సంగీతసాహిత్య సరసచిత్ర విలేఖ
నాదులఁ బ్రౌఢ యేయమ్మయయ్యె
దేశచరిత్రలఁ బేశలధర్మార్థ
శాస్త్రాళి నేయమ్మ జాణయయ్యె
కుట్టుపనియందు నేయమ్మ కుశలయగుచుఁ
గొడుకుబిడ్డలకిచ్చుఁ దాఁగుట్టినవియె
యిన్నివిద్యలఁ బాండిత్య మిట్లుపడసి
యున్న యాయమ్మధీబల మెన్నఁదరమె?

ఉ. ఏయమ రాణియయ్యు స్వమహీస్థలి బీదలయాకుటిండ్లకున్
బోయి ధనౌషధంబులును బుట్టములు న్నిఁ బేదవారికిన్
గేయముగాఁగ నిచ్చి తగ క్షేమములారసి వచ్చుచుండునో
యాయమ సద్గుణాళిఁ గొనియాడఁగలండె సహస్రవక్త్రుఁడున్.

సీ. ఈకుటుంబిని రాజ్యమేలుచునున్నట్టి
పంచాశదుత్తమాబ్దములలోన
భరతఖండమునకు బహుబాధలు తొలంగి
సకలసౌఖ్యంబులు సంఘటిల్లె
ధూమనౌకల కల్మిఁ దురగయానసమంబె
యయ్యె ద్వీపాంతరయాన మిపుడు
తంత్రీముఖంబున దవ్వులవార్తలు
క్షణములో శ్రవణయోగ్యంబు లయ్యె

ధూమశకటంబులంబున దూరదేశ
యాత్ర లత్యల్పకాల సాధ్యంబులయ్యె
నహహా! పొగడంగఁదరమె? రాజాధిరాజ్ఞి
యైన విక్టోరియారాజ్యయాత్రమహిమ!

సీ. నదులు కాల్వలు పాఱఁ బెదచౌటిపఱ్ఱలు
కలమధాన్యము పండు పొలములయ్యె
బెబ్బులులకుఁ జోరవితతికిఁ దావు లౌ
వనవాటములు పెద్ద బాటలయ్యె
దఃప్రభుత్వముపోయి తుల్యమౌన్యాయంబె
యెల్లవారికిఁగల్గె నెల్లయెడల
విద్యాలవము లేని వివిధజాతులవారి
కమలవిద్యాప్రభావములు గలిగెఁ
గఱవులకుఁజూడఁగాఁ బెద్దకఱవు వచ్చె,
నరబలు ల్సహగమనముల్ నాశమయ్యె
స్థానికప్రభుత్వమొకింత జనులకొదవె,
మేలు! విక్టోరియారాజ్యకాలమునను.

క. మున్నెన్నఁడు లభియింపని,సన్నుతసత్పాలనంబుసమకొనుచుండన్
మిన్నంది యెల్లయెడలను, జెన్నారదె రాజభక్తి సేతువు వఱకున్!

సీ. సత్రము ల్మిపేర సమకొల్ప నొకచోట
విద్యాలయములుంచ వేఱుచోట
పట్టణభవనము ల్గట్టింప నొకచోట
వృత్తిశాలలు నిల్పవేఱుచోట
జనమహోద్యానముల్ స్థాపింపనొక చోటఁ
బెనుబావులను ద్రవ్వవేఱుచోట

నీటియంత్రంబులు నెలకొల్ప నొకచోట
బీదగృహములుంచ వేఱుచోట
పట్టణములందు మీపేరు పాదుకొల్ప,
యత్నములు సాగుచున్నవి యవనియందు
నేఁబదేఁడులు రాజ్యమీ రేలితిరన,
సంతసమున విక్టోరియాసాధ్వి! నేఁడు,

సీ. ఏమూలఁజూచిన నింపైన పందిళ్లు
నేతట్టునను గన్నఁ గేతనములు
నేవంక వీక్షింపఁ బూవులతోరణా
లేపట్టునను గన్న దీపచయము
లేకడఁదిలకింప నాకాశబాణంబు
లేపట్టునను గన్న గానములును.
పట్టణంబులు మొదల్ పల్లెలవఱకును
వెల్లిగొనుచునున్న వెల్లయెడల
నఖిలజన మనోహారిణివైన నిన్నుఁ,
స్థిరతరాయురారోగ్యసుస్థితుల నిచ్చి
యీశ్వరుం డేలుఁగావుత నెలమితోడ,
రాజ్ఞి విక్టోరియాదేవి! ప్రమదమెసఁగ.

1892–వ సంవత్సరరమునందెవ్వరో నవనాగరిక పంచరత్నములని కులాచార సంస్కారపరాయణులయందు లేనిదోషముల నారోపించుచు వారిని దూషించుచు నైదుపద్యముల నొక పత్రికయందుఁ బ్రచురించిరి. వానిని చదువఁగానే నాకుఁ గొంత చిత్తోద్రేకము కలుగఁగా వెంటనే కులాచారసంస్కార పూర్వనాగరిక పంచరత్నములని వానికిఁ బ్రతిగా నీక్రింది పద్యములనుజేసి సత్యసంవర్ధనిలోఁ బ్రచురించితిని—

సీ. పరుల సొమ్మపహరింపఁబన్ను నకర్మలు
వెలయవంచును విలపించు నొకఁడు:
జనులమూఢులఁ జేయ నొనరించుకృషియెల్లఁ
జెడిపోయెడునటంచు నడలు నొకఁడు;
వలదు విద్యయటంచుఁ బశువుఁ జేయఁగ నెంచి
వనిత చదువునంచు వగచు నొకఁడు;
తలగొఱిగించి వెతలఁ బెట్టఁగ తలంచు
నింతి సుఖించు నంచేడ్చు నొకఁడు;
పసితనంబుననే పెండ్లిపోసఁగకున్నఁ
గూఁతు నెట్లమ్ముకొన నంచుఁ గుందు నొకఁడు;
వీరు పూర్వనాగరికులౌ పెద్దలిపుడు,
దుష్కులాచారరక్షణోద్యోగు లకట!

సీ. మగఁడుపోయిన భామ మరలఁ బెండ్లాడుచో
సొత్తు దక్కుటంచు సోలునొకండు
పతిపోయిన యువతి పరిణీత యైనచోఁ
బనికత్తె లేదంచు వనరునొకఁడు;
ధవుఁ బాయుకాంత యుద్వాహంబునాడుచో
జారత్వమెట్లంచు సణుఁగునొకఁడు.
భర్తృహీనాంగన భర్తఁగైకొన్నచో
వ్రతము లడఁగునంచుఁ గొతుకునొకఁడు;
మృతపతిక సాధ్విగా శిశుమేధయాఁగ
మూలదక్షిణపోనంచు మూల్గు నొకఁడు
వీరు పూర్వనాగరికులౌ పెద్ద లిపుడు
దుష్కులాచారరక్షణోద్యోగు లకట!

సీ. నీరజాక్షి చదువు నేర్చుచో నరమాంస
విక్రయం బెట్లంచు వెఱచు నొకఁడు;
మానవతి విదుషియైనచో వెఱ్ఱినో
ములుపట్టు టెట్లంచుఁ బొక్కునొకఁడు;
కమలాక్షి సద్విద్యకఱచుచో నను దేవు
నిగనెంచు టెట్టంచుఁ బొగులునొకఁడు;
పికవాణి పాండితి బెరయుచో దెబ్బలు
పడుట యెట్లంచును బనవునొకఁడు;

హంసయాన విద్యావతియయ్యెనేని
బ్రతిమలనుగొల్చు టెట్లంచుఁ బదనొకఁడు;
వీరు పూర్వనాగరికులౌ పెద్దలిపుడు
దుష్కులాచారరక్షణోద్యోగు లకట!

సీ. తరవాణి ముందుగాఁ ద్రాగి శ్రాద్ధముపెట్టి
నిష్ఠాపరులమంచు నిక్కువారు
సంధ్యవార్వక చల్దిసాపాటు గావించి
కర్మిష్ఠుల మటంచుఁ గవియువారు
కల్లుసంద్రములాది పేళ్లెన్నొ వల్లించి
శాస్త్రవేత్తలమంచుఁ జాటువారు
కల్లుకంప డఁగంగఁ బెల్లుచుట్టలుత్రాగి
యాహితాగ్నులమంచు నడరువారు

న్యాయసభలందుఁ దప్పుసాక్ష్యంబులిచ్చి
శిష్టజనవరిష్ఠులమంచుఁ జెలఁగువారు
వీరు పూర్వనాగరికులౌ పెద్దలిపుడు
దుష్కులాచారరక్షణోద్యోగు లకట!

సీ. బాలరండల కాశపడి చెడి విధవల
పెండ్లిండ్లు వలదంచుఁ ద్రేలువారు,
రాళ్ళఁగొల్చుచుఁ దూలి బ్రహ్మంబు సేవించు
వారె భ్రష్టులటంచు వదరువారు,
కన్నకూఁతుల నమ్మఁగాఁగోరి బాల్యవి
వాహము ల్మేలంచు వాగువారు,
చాటునఁ గలు ద్రాగి చనుదెంచి తేయాకు
నీరానువారి నిందించువారు,
స్త్రీలవంచించి మించి బాధింపనెంచి,
యబలలకు విద్య కీడంచు నఱచువారు,
వీరు పూర్వనాగరికులౌ పెద్దలిపుడు,
దుష్కులాచారరతులౌ దోద్యోగు లకట!

ఈపైని జెప్పినవి గాక నేను వ్రాసినపుస్తకము లింకనుగొన్ని కలవు. కర్నల్ మక్డానల్డు దొరగారు విద్యావిచారణాధికారిగానున్న కాలములో దొరతనమువారి రెండవపాఠ పుస్తకమును వ్రాసితిని. దానికి దొరతనమువా రిన్నూటయేఁబది రూపాయలను నాకిచ్చిరి. మార్సుడన్ దొరగారి కోరికమీఁద మాక్మిల్లన్ కంపెనీవారికి నాల్గవ వాచక పుస్తకమును, అయిదవవాచకపుస్తకమును. ఆఱవ వాచక పుస్తకమును, నేను చెన్నపట్టణములో నున్నకాలములో వ్రాసి యిచ్చితిని. ఈమూఁడు పుస్తకములకును వారు నాకు వేయి రూపాయల నిచ్చిరి. ఈవాచకపుస్తకములలో నొకదానిని వారు ముద్రింపించు చుండినప్పుడు ముద్రాశాలవారి యజాగ్రత్తవలనఁ గొంతభాగము పోయెను. అప్పుడు వారు నావద్దనున్న చిత్తుప్రతినిబట్టి పోయిన భాగమును వ్రాసి యియ్యవలసినదని యడిగిరి. చిత్తువ్రాయుట నాకభ్యాసము లేదనియు, సొమ్మిచ్చినయెడల మరల వ్రాసి యిచ్చెదనని

యు, బదులు చెప్పవలసినవాఁడ నైతిని. వారాప్రకారముగా మరల సొమ్మిచ్చి పోయినభాగమును నాచేత క్రొత్తగా వ్రాయించుకొనిరి. ఈశ్వరుఁడు నాకు వేగముగ వ్రాసెడు శక్తినిప్రసాదించి యున్నాఁడు. పద్యమునుగాని వచనమునుగాని నేనొక్కసారియే వ్రాయుచుందును; వ్రాసినదానిని మరల దిద్ది వ్రాయుట నాకలవాటులేదు. అందుచేత నావ్రాఁత దిద్ది దిద్ది మరల మరలవ్రాయుచుండువారి దానివలె నంత మెఱుఁగుగా నుండదనుకొనెదను. నేను వ్రాసినపుస్తక మొక్కసారి పోవుట తటస్థించిన పక్షమున, అది యెప్పటికిని పోవలసినదే కాని చిత్తును బట్టి మరల వ్రాయవచ్చునన్న యాశ లేదు.

తెలుఁగుభాషను వృద్ధిచేయవలెనన్న యభిలాషము నాకు మొదటినుండియు విశేషముగా నుండెను. నేను నాకాలమంతయు భాషాభివృద్ధినిమిత్తమే యుపయోగించి పాటుపడిన పక్షమునఁ గొంతవఱకు నాయభిలాషము నెఱవేఱియుండునేమో! వెనుకటి ప్రకరణములను మీరుసావధానముగా చదివియుండినయెడల నేనొక్కపనితోఁ దృప్తి నొందక యేకాలమునం దెన్నిపనులను పైని వేసికొని నిర్వహింపఁ జూచుచుండెడివాఁడనో మీకు విశదమయియుండును. ఇన్ని పనుల నొక్కసారిగా పైని వేసికొనుటచే నే నేపనిని తృప్తికరముగా నిర్వహించుటకు సమర్థుఁడను కాకపోతిని. దీనికి తోడు నేనెప్పుడును దృఢగాత్రుఁడనుగాక ప్రకృతిచేత రోగశీలమైన దుర్బలశరీరము గలవాఁడను. ఇట్లయ్యును నేను కొంచెములో కొంచెము నాయభిలాషసిద్ధిని బడసితి ననుకొనెదను. నేనారంభించినకాలమునందు తెలుఁగులో నిప్పటివలె వివిధములైన పుస్తకములు లేవు. వివిధము లేమి? ఇంచుమించుగా నేవిధమైనవియు వచనరూపమున లేవనియే చెప్పవచ్చును. అప్పు డన్నియు నూతనసృష్టి చేయవలెను; అందుచేత నప్పటివారికి కష్టము లెక్కువ; సౌలభ్యములు తక్కువ. అయినను తెలుఁగులో మొదటి

వచన ప్రబంధమును నేనే చేసితిని; మొదటినాటకమును నేనే తెనిఁగించితిని; మొదటి ప్రకృతిశాస్త్రమును నేనే రచించితిని; మొదటి ప్రహసనమును నేనే వ్రాసితిని; మొదటి చరిత్రమును నేనే విరచించితిని; స్త్రీలకై మొదటివచన పుస్తకమును నేనే కావించితిని; అయిన నుప్రథమప్రయత్నము లెప్పుడును ప్రథమప్రయత్నములే. అవి దోష బహుళములయి యుండుట స్వాభావికము. మనము వృద్ధిపొందఁ గలుగుట చేసినతప్పులను బట్టియే కాఁబట్టి మొదట చేయఁబడిన నాపుస్తకములును తరువాతివారి గురుతరపుస్తకరచనకుఁ గొంత తోడు పడవచ్చును.

నేనిట్లు క్రొత్తపుస్తకములను రచించుచు వచ్చుటయే కాక ప్రాఁతపుస్తకములను బ్రకటించుటకుఁ గూడ శ్రమపడితిని. శబ్దరత్నాకర నిఘంటుకర్తలైన బహుజనపల్లి సీతారామాచార్యుల వారు తమనిఘంటువుయొక్క యవతారికలో కొన్ని పూర్వపుస్తకముల పేరులుచెప్పి వానిపేరులు వినఁబడుటయే కాని పుస్తకము లెక్కడను గానరావని వ్రాసియున్నారు. వారట్లు పట్టికలోవ్రాసిన పుస్తకములలోఁ బదింటికంటె హెచ్చుగా నేను సంపాదించి సంశోధించి ముద్రింపించి ప్రకటించితిని. అపురూపములైన పుస్తకములను బ్రకటించుటలోఁ గల కష్టము దానిలోఁ బనిచేసినవారికే కాని యితరులకు దురవగాహముగా నుండును. రెండుమూఁడు ప్రతులున్న వానిని సరిచూచి సవరించు ప్రకటించుటలో నంతకష్టము లేదు. ఒక్కప్రతియే లభించి యదియు శుద్ధముకానిదయి యున్న యెడల దిద్ది ప్రకటించువానిపాట్లు దేవుఁడెఱుఁగును. శిథిలమయిన యొక్క ప్రాఁతప్రతితోనే పుస్తకప్రకటనము చేయు దురవస్థ కొన్ని విషయములలో నాపాలఁబడినది. వ్రాసెడివారు వ్యుత్పన్నులు కానందున ప్రాఁతపుస్తకములు తప్పులకుప్పలుగా నుండును. కొన్ని

చోట్ల నక్షరములును పదములును పాదములునుగూడ విడువఁబడి యుండును. అట్టి భాగములను సవరించుటకయి మాఱుప్రతి దొరకనందున కొన్ని పుస్తకములలో లుప్తభాగములను నేనే పూరింపవలసినవాఁడనైతిని. (అముద్రితములయి యున్నవానిని సంస్కరించి నేను ముద్రింపించి ప్రకటించినపుస్తకము లిరువదికంటె నెక్కువగా నున్నవి. వాని నామముల నిందుఁ జెప్పుచున్నాను—కనపర్తి యబ్బయామాత్యవిరచితమైన కవిరాజమనోరంజన మను పురూరవశ్చరిత్రము, మొల్ల విరచితమైన రామాయణము, పింగళి సూరనార్యవిరచితమైన ప్రభావతీ ప్రద్యుమ్నము, కాకుమానిమూర్తికవి విరచితమైన పాంచాలీ పరిణయము, అయ్యలరాజు రామభద్రకవి ప్రణీతమైన రామాభ్యుదయము, కేతనార్యవిరచితమైన విజ్ఞానేశ్వరము, నాచన సోమనాథ ప్రణీతమైన యుత్తరహరివంశము, చరిగొండ ధర్మనార్యప్రణీత మయిన చిత్రభారతము, నారాయణకవికృతమైన పంచతంత్రము, మాదయ్యగారి మల్లన ప్రణీతమైన రాజశేఖరచరిత్రము, కేతనకవికృతమైన యాంధ్రభాషా భూషణము, అడిదము సూరకవి ప్రణీతములైన కవిసంశయవిచ్ఛేదాదిగ్రంథములు, శంకరకవి విరచితమైన హరిశ్చంద్రోపాఖ్యానము, కోట వేంకనార్య ప్రణీతమైన యాంధ్రభాషార్ణవము, పిల్లలమఱ్ఱి పిన వీరభద్ర రచితమైన జైమినిభారతము, సింహాద్రి వేంకటాచార్య విరచితమైన చమత్కారమంజరి, నంది మల్లయ్య ఘంట సింగయ్య విరచితమైన ప్రబోధచంద్రోదయ పద్యకావ్యము, కేతనార్యకృత మైన దశకుమార చరిత్రము, తెనాలి యన్నయార్యకృతమైన సుదక్షిణాపరిణయము, అనంతామాత్యవిరచితమైన భోజరాజీయము, నంది మల్లయ్య ఘంట సింగయార్య ప్రణీతమైన వరాహపురాణము. పై వానిలో హరిశ్చంద్రోపాఖ్యానమును జైమినిభారతమును పూర్వ

మే ముద్రింపఁబడెను గాని యవి తప్పులతడికలుగా నుండినందున సంస్కరించి మరల ముద్రింపించితిని. నేను తాళపత్రపుస్తకములను విస్తారముగా సంపాదించి కట్టలుగా నుంచితిని. నేను రాజమహేంద్రవరములో నుండిన కాలములోనె చెదలు పట్టి వానిలో బహు పుస్తకములు నశించెను. మిగిలినవానిని నాతో చెన్నపట్టణమునకుఁ గొనిపోఁగా నక్కడ సహితము పురుగు పట్టి యధికసంఖ్యగల పుస్తకములు చెడిపోయెను. శేషించిన వానిని కాపాడుట కష్టముగా కనఁబడినందున సగము సగము చెడియు చెడకయు నున్న మిగిలిన పుస్తకముల నొక మిత్రుని కిచ్చివేసితిని.

# మూడవ ప్రకరణము.

## విశ్రాంతిదశ

**క్రీస్తుశకము 1900-వ సంవత్సరము మొదలుకొని 1910-వ సంవత్సరమువఱకు.**

ఈ కాలమును నేను విశ్రాంతిదశయని పిలుచుచున్నను నాకు నిజమైన విశ్రాంతి యెప్పుడును కలుగలేదు. దొరతనమువారి కొలువు మానుకొని తన్నిమిత్తముఁ జేసెడు పనిని లేకుండఁ జేసికొనుట యొక్కటియే విశ్రాంతియనవచ్చును. ఎప్పుడును నే నేదోపని చేయుచుండవలసినవాఁడనే కాని భోగము ననుభవించుచు నూరక సుఖముగా కూరుచుండుట నాస్వభావము కాదు. తనయపారకరుణచేత పరమేశ్వరుఁడు నన్నెల్లప్పుడును కష్టజీవినిగా నుంచుచున్నట్లే తోఁచుచున్నది.

1881-వ సంవత్సరమునందు గోగులపాటి శ్రీరాములుగారు ప్రథమ వితంతు వివాహమును జేసికొన్నప్పుడు తనకు ప్రథమభార్య వలనఁ గలిగిన నాలుగు మాసముల పురుషశిశువును పెంచుట కయి మావద్ద విడిచిన ట్లీవఱకే చెప్పియున్నాను. నాయందలి గౌరవముచేత శ్రీరాములుగారా శిశువున కావఱకే నాపేరును పెట్టిరి. ఆశిశువును నేనును నాభార్యయు పుత్రప్రేమతోఁ బెంచి పెద్దవానిని జేసితిమి. అతనికి మేమే విద్యాబుద్ధులు చెప్పించుటచేత నతఁడు పట్టపరీక్షయందుఁ గృతార్థుఁడయ్యెను. 'అపుత్రస్యగతిర్నాస్తి' యన్న నమ్మకము నాకు మొదటినుండియు లేదు. అందుచేత నేను కొడుకును పెంచుకోవలెనని యెప్పుడును దలఁచుకొనలేదు. నాకుఁగల యల్పమైన సొత్తును ధర్మకార్యమునకు వినియోగింపవలెనని నేను నిశ్చయించుకొంటిని. నాయుద్దేశమును నేనెప్పుడును మఱుఁగుపఱుపలేదు. వీరేశలింగమునకు తన

మేనకోడలనిచ్చి వివాహముచేసి యతనిని తనయొద్ద నుంచుకోవలెనని నాభార్యయుద్దేశము. ఆమె కోరికకు నే నడ్డుచెప్పలేదు గాని బాల్య వివాహములయం దిష్టము లేనివాఁడగుటచేత పదునెనిమిదేండ్లు దాఁటినమీఁదటనే వివాహమున కేర్పాటు చేయవలసిన దని మాత్రము చెప్పితిని. కొంతకాలము జరపి నాభార్యతమ్ముఁడు తన కూఁతు నిచ్చుట కిష్టపడక తుదకు మఱియొకరి కిచ్చి వివాహము చేసెను. వివాహవిషయమును వధూవరుల యిష్టమునకు విడువవలసినదే కాని తదితరు లందులో సంబంధము కలిగించుకొని బలవంతపెట్టరాదని నాయభిప్రాయము. అందుచేత నిరువదియొక్క సంవత్సరములు నిండువఱకును వేచియుండి తరువాత నీ యిష్టమువచ్చినవారిని వివాహము చేసికోవచ్చునని చెప్పితిని. అతఁడు తనలో నాలోచించుకొని వితంతువును వివాహమాడ నిశ్చయించుకొన్నట్టు నాతోఁ జెప్పెను. అతని యనుమతి మీఁద నిందునిమిత్తమయి యతని ఛాయాపటమును తీయించి, తన బాలవితంతు కుమారికకు వివాహము చేయఁదలఁచుకొన్న యొక పెద్దమనుష్యునకుఁ బంపితిని. వధువుయొక్క ఛాయాపట మావఱకే నాయొద్దకుఁ బంపఁబడినది. వీరేశలింగము దానిని చూచి యనుమోదించెను. వితంతు వివాహమును చేసికొన్నయెడల చెన్నపట్టణములోనున్న యిండ్లలో నొకదాని నాతని కిమ్మని నాభార్య కోరఁగా నే నందుకు సమ్మతించితిని. అన్నియు ననుకూలముగానుండి వివాహము జరుగునట్లు కనఁబడెను. అతఁ డొకపర్యాయము రాజమహేంద్రవరమునకు వెళ్ళి తనమిత్రులతో నాలోచించుకొనివచ్చి తన యభిప్రాయమును మార్చుకొని వితంతువివాహము చేసికొనుట తన కిష్టములేదనిచెప్పెను. మంచి దని నేనా ప్రయత్నమునుమాని మఱియొక సంబంధము చూచుకోవచ్చునని వధువుతండ్రికి వ్రాసితిని. అతఁడు రాజమహేంద్రవరము వెళ్ళినప్పుడే మైసూరి

లోని యొక సంబంధము నచ్చటివారు కుదిర్చినట్లు కనఁబడుచున్నది. తరువాత మైసూరినివాసులైన చెలుకుమిల్లి వేంకటరత్నముగారు నాయొద్దకువచ్చి తమ కొమారితను వీరేశలింగమున కిచ్చి వివాహము చేయ తన కిష్టమున్నదని చెప్పెను. వరుఁ డిష్టపడినయెడల నాయాక్షేపణ లేదని చెప్పితిని. వరుఁ డిష్టపడెను. నేను వేంకటరత్నముగారితో నాసొత్తు వచ్చునని వివాహము చేయవలదనియు, నేను దానిని ధర్మకార్యమునకు వినియోగింప నిశ్చయించుకొంటి ననియు స్పష్టముగాఁ జెప్పితిని. ఆయని దాని కంగీకరించి వరునిఁ దనవెంటఁ గొనిపోయెను. వీరేశలింగము బెంగుళూరిలో ప్రాయశ్చిత్తము చేయించుకొని వేంకటరత్నముగారి కొమారితను వివాహమాడెను. ఈ ప్రాయశ్చిత్తవార్త నాకుఁ గాని నాభార్యకుఁ గాని తెలియదు. వివాహానంతరము నతఁడు మరల మావద్దకు రాక వేఱుగానుండెను.

1902-వ సంవత్సరము నవంబరునెల 26-వ తేదిని రాజమహేంద్రవరములో తణుకు వేంకటచలపతిరావుగారి గృహమునందు భట్టిప్రోలు శరభయ్యగారి వివాహము జరిగినది. ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగా రీసంబంధమును కుదిర్చి కృష్ణామండలమునుండి రాజమహేంద్రవరమునకు వివాహము జరపునిమిత్తము పంపిరి. పెండ్లికూఁతురు పెండ్లినాఁటికి యుక్తవయస్సు వచ్చినది కాకపోయినను పునస్సంధానము చేయకపోయినయెడల పెండ్లికొడుకు పాఱిపోవునని భయపడి చిన్నదానిని మూఁడుదినములు వెలుపలఁ గూర్చుండఁబెట్టి భార్యాభర్తల నొక్కటిగాఁజేసి చెన్నపట్టణమునకు నావద్దకుఁ బంపివేసిరి. వధూవరులును వధువుయొక్క తల్లియు పెదతల్లియుఁ గలిసి చెన్నపట్టణమునకు రాఁగా, వారికి మాయింటనే కాపుర ముండుటకు తావిచ్చి నాచేతనైన సాయమును జేసితిని. వరుఁడు వివాహమునాటికే సర్వకళాశాలాప్రవేశపరీక్షయందుఁ గృతార్థుఁడయ్యెను. వరుఁడు ప్రథ

మశాస్త్రపరీక్షకును, వధు వింగ్లీషు ప్రాథమిక పరీక్షకును, చదువుట కేర్పాటుచేసి పాఠశాలలకుఁ బంపితిని. ఈవ్యయములన్నియు వధువు తల్లియే భరించుచుండెను. కొన్ని కారణములచేత నీకుటుంబమును మాయింటఁ గాపురముండనిచ్చుట యనుచితముగాఁ గనఁబడినందున మాయింటికిఁ గొంచెము దూరములో నద్దెకొక యిల్లు మాటాడి వీరి నక్కడకుఁ బంపివేసితిని. వరుఁడు ప్రథమశాస్త్ర పరీక్షయందుఁ గృతార్థుఁడు కాఁగా పచ్చయప్పగారి కళాశాలకుఁ బ్రధానాధ్యక్షుఁడు గానున్న వేట్సు దొరవారి కుత్తరము వ్రాసి సగముజీత మిచ్చు పద్ధతిమీఁద నాతనిని పట్టపరీక్షతరగతిలోఁ జేర్పించితిని. వీరు మా యిల్లు విడిచి వేఱుచోట నున్నను ప్రతిదినమును వీరి తగవులు తీర్ప లేక నా కాయాసము కలుగుచు వచ్చెను. ఈకాలములో దేశిరాజు బాపయ్యగారు నాకు పరిచితులయి మాయింటికి మించుమించుగాఁ బ్రతి దినమును వచ్చుచుండెడివారు. వీరి తగవులను దీర్చి సమాధానము చేయుటకయి నే నాయనను నియమింపఁగాఁ 'బుణ్యమునకుఁ బోయి నఁ బాప మెదురుగా వచ్చె' నన్నట్లు హితోపదేశము చేయఁబోయి నబాపయ్యగారిమీఁదనే నోట నుచ్చరింపరాని మృషాదోషము లా రోపించి శరభయ్యగా రాయనను దూషింపఁ జొచ్చిరి. నేను దక్షిణ హిందూస్థాన బ్రహ్మసమాజమునకుఁ బ్రధానాధ్యక్షుఁడను. బాప య్యగారు బ్రహ్మసమాజాభిమాను లయి చెన్నపట్టణములో విద్యార్థు లలో నొకసమాజమును స్థాపించి దానికి నన్ను తఱచుగాఁ దీసికొని పోవుచుండెడివారు. ఈసంబంధమునుబట్టి బాపయ్యగారు పలుమాఱు మాయింటికి వచ్చుచు నాయం దత్యంత గౌరవము గలవా రయి నేను చెప్పినపని సత్యాదరముతోఁ జేయుచుండెడివారు. ఇటువంటి కార్య ములయందు వీ రిట్లు నాకు సాయపడుట నేను చెప్పితినన్న హేతువు చేతనే కాదు; సమస్త సత్కార్యములయందును స్వతంత్రముగా

సీయనకే యత్యంత ప్రీతి యుండెను. ఈయన యుత్సాహమును సుగుణసంపదను గార్హైస్థ్యకతత్పరతను జూచి యీతఁడు ముందు నేను పూనిన సంస్కారకార్యమును సమర్థతతో నిర్వహింపఁగలవాఁడగు నని తలఁచితిని. ఒకనాటిరాత్రి రెండుజాములవేళ శరభయ్య యత్తగా రేడ్చుచు మాయింటికి పరుగెత్తుకొని వచ్చి తన యల్లుఁడు తన కూఁతును చంపుచున్నాఁడని కేకలువేసెను. నేనును నాభార్యయు నిద్రలో నులికిపడి లేచి మేడ దిగివచ్చి యామెవెంట వారి యింటికిఁ బోయితిమి. మేము పోయి చూచినప్పటికి పడకగది దీపము లేక చీఁకటిగా నుండెను. ఎన్ని పిలిచినను శరభయ్యగారు పలుకలేదు; 'రాజేశ్వరీ' యని పిలువఁగా లోపలినుండి యాచిన్నది మాత్రము పలికి మావద్దకు వచ్చినది. మేమాచిన్నదానిని మావెంటఁబెట్టుకొని మాయింటికి వచ్చితిమి. మొట్టికాయలచేత నాచిన్నదాని తలయంతయు పచ్చిపుండయి బహుదినములు పరుండుట సహితము వీలులేని స్థితిలో నుండెను. మఱునాఁడతఁడు బలవంతముగా నాచిన్నదానిని మాయింటినుండి లాగుకొనిపోవఁ బ్రయత్నించెను గాని నేను యుక్త సమయములోఁ దగిన ప్రతిక్రియచేసి వారించితిని. ఈసంబంధమునఁ దరువాత నడచినచర్యలు చిత్రవిచిత్రములయినవిగా నుండెను. వాని నిందు వివరించుట యనావశ్యకము. ఈవిధముగా నాకు పెండ్లిండ్లు చేసికొన్నవారివలనను బహువిధము లయిన శ్రమలు కలుగుచుండెను.

గోపాలపురపు మహాలక్ష్మియను కంసాలివితంతువును, ఆమె యొక్క వితంతుపుత్రియైన యన్నపూర్ణయు, రాజమహేంద్రవరము నుండి వచ్చి కొంతకాలమునుండి నావద్దనే యుండిరి. వారినిమిత్తమయి యొకగది కట్టించి వారిని మాయింటనే కాపుర ముంచి, అన్నవస్త్రములిచ్చి పోషించుచు చదువు నిమిత్త మిద్దఱిని పాఠశాలకుఁబంపుచుంటిని. తల్లిబిడ్డలు తఱచుగా తగవులాడుచుండెడివారు. కూఁతురు

తల్లిని బండబూతులు తిట్టుచువచ్చెను. నేను మంచిమాటలతో బుద్ధి చెప్పుటవలనఁ బ్రయోజనము లేకపోఁగా రెండుమూఁడుసారులు శరీరదండనము చేసిన తరువాత కుమారుఁడు తల్లిని తిట్టుట మానివేసెను. 1903-వ సంవత్సరము ఫిబ్రవరి 14-వ తేదిని గంజాము మండల నివాసుఁడైన కొత్తుర్తి నమశ్శివాయ యనునతఁడు కూఁతురయిన యన్నపూర్ణను వివాహముచేసికొనెను. ఇతఁడు పెండ్లినాటికే సర్వకలాశాలా ప్రవేశపరీక్షయందుఁ గృతార్థుఁడయి యుండెను. పెండ్లియైన తరువాత నీతనిని ప్రథమశాస్త్ర పరీక్ష తరగతిలోఁ బ్రవేశపెట్టి కొంతకాలము చదివించితిని గాని యతఁడు చదువు చాలించి యుద్యోగములోఁ బ్రవేశించి తనభార్యను వెంటఁగొని చెన్నపట్టణము విడిచి స్వస్థలమయిన గంజాము మండలమునకుఁ బోయెను. ఈతనిది స్వర్ణకారవితంతు వివాహములలో మొదటిది. ఇతఁడు సంస్కార ప్రియత్వముచేత నితరులకు తాను దారిచూపవలెనన్న పరిశుద్ధచింత చేతనే వితంతువివాహమును చేసికొనెను గాని యితరత్ర వివాహముకాకయు ధనాశకలిగియు వివాహము చేసికొన్నవాఁడు గాఁడు. ఇతఁడును చెన్నపట్టణములోనున్న కాలములో శరభయ్యగారి తగవులాటలో సమాధానముచేయఁ బోయి యాయన వలన బహుమానములు పొంది జుగుప్సతో వెనుక మరలినవాఁడే.

1904-వ సంవత్సరము మార్చినెల కడపట నుపకారవేతనము నొంది పనిచాలించుకొన్నతరువాత 'చెన్నపట్టణములోనేయుండి పని చేయుదునా స్వస్థలమయిన రాజమహేంద్రవరమునకుఁ బోయి యక్కడ పని చేయుదునా' యన్న యాలోచనతోఁ దొమ్మిదిమాసములు చెన్నపురిలోనే గడపి, జన్మభూమియందలి యభిమానము బలీయమగుటచేత రాజమహేంద్రవరమునకే రావలయునని నిశ్చయించుకొని, యక్కడి ముద్రాయంత్రము మొదలయినవి వెంటఁగొని

1905-వ సంవత్సరప్రారంభముననే రాజమహేంద్రవరమునకు వచ్చి చేరితిని. ఏడెనిమిది సంవత్సరములు చెన్నపట్టణములోనుండి వచ్చుట చేత రాజమహేంద్రవరము కొంతవఱకు నాకు క్రొత్తదిగాఁ గనబడెను. మునుపటివలె నాకు పాఠశాలవిద్యార్థుల సాహాయ్యము లేదు. నేనున్న కాలములో నుండినవిద్యార్థు లిప్పు డెవ్వరును లేరు; ఉన్నవారు నన్నెఱుఁగని క్రొత్తవారు; వారు నాబోధనమును విననివా రగుటచేత వారిలో సాంఘికసంస్కారోత్సాహము లేదు. పురములోని పెద్దమనుష్యులలోఁగూడ తొంటిసంస్కారోత్సాహము తగ్గిపోయినది. విద్యాధికులలో హిందూసమాజముయొక్క ప్రాబల్యముచేత రెండుపక్షములేర్పడి సంఘసంస్కారమునం దనాదరము గలవారిసంఖ్య యెక్కువయినది. అందుచేత సంవత్సరమునకు నాలుగైదురూపాయల చందాకు మాత్రమే రాఁదగిన హిందూసంఘసంస్కార (The Indian Social Reformer) పత్రిక పురమందిరములోని పఠనమందిరమునకు తెప్పించుటయే నిలుపుచేయఁబడినది. న్యాయవాదులు మొదలైనవా రనేకులు నేనెఱుఁగని క్రొత్తవారు. అయినను దేశిరాజు పెదబాపయ్యగారు మొదలైన కార్యశూరులు కొందఱు నాకు క్రొత్తమిత్రులైరి. సంస్కారాభిమానులయి పూర్వమునుండియు నున్నవారితోను ఈ నూతనమిత్రులతోను గలసి పనికిఁ బూనితిని. రాజమహేంద్రవరము రాఁగానే నేను మొట్టమొదట చేసినపని శ్రీ విక్టోరియా బాలికాపాఠశాల యను పేరితో నొక బాలికాపాఠశాలను స్థాపించుట; రెండవపని సత్యవాదినియను పేరితో మార్చినెల మొదటితేదినుండి యింగ్లీషు తెలుఁగుభాషలలో నొక వారపత్రికను ప్రకటింపింపఁబూనుట. ఈ బాలికాపాఠశాల 1905-వ సంవత్సర జనవరి 16-వ తేదిని నెలకు ముప్పదిరూపాయల యద్దె రాఁగల మాస్వగృహమునందే యుంచఁబడినది. నేను కాపురమున్న కొం

చెము భాగము తప్ప, ఇల్లంతయుఁ బాఠశాలనిమిత్తమే విడిచిపెట్టఁ బడినది. ఈ బాలికాపాఠశాలకు దేశిరాజు బాపయ్యగారు కార్యదర్శిగా నేర్పఱుపఁ బడిరి. నే నిక్కడ మొట్టమొదట పూనినపని బాలికాపాఠశాలా స్థాపన మనఁగానే యీపఱకు నేను చేయుచుండిన వితంతు విద్యావివాహప్రయత్నములు మానితి నని కొందఱు భ్రమపడవచ్చును. ఈ పాఠశాల వితంతు శరణాలయ సంబంధముననే స్థాపింపఁ బడినది. నేను చెన్నపురిలో నుండినప్పు డప్పటి హిందూదేశ చక్రవర్తిని పేర విక్టోరియా వితంతు శరణాలయము నక్కడ స్థాపించి దానిలోని వితంతు విద్యార్థినుల నుపాధ్యాయినీ బోధనాభ్యసన పాఠశాలకుఁ జదువునిమిత్తమయి పంపుచుంటినని వెనుకనే చెప్పియుంటిని గదా ? అక్కడినుండి నేను కాలు గదలుపఁగానే యక్కడి వితంతు శరణాలయ మంతరించినది. అంతరించిన దననేల? నాతోనే బైలుదేఱి యీ రాజమహేంద్రవరమునకు వచ్చిన దని చెప్పవచ్చును. నేను రాజమహేంద్రవరము రాఁగానే యిద్దఱు ముగ్గురు బాలవితంతువులు మాయింటి కనఁగా వితంతు శరణాలమునకు వచ్చిచేరిరి. వారికి విద్యనిమిత్తమయి పాఠశాల కావలసియుండెను. చెన్నపట్టణములోవలె స్త్రీలను బంపఁదగిన పాఠశాల యక్కడ నేదియు లేదు. ముగ్గురు నలుగురు వితంతువులకై మాత్రముపయోగించెడు పాఠశాలకంటె వితంతువులు కాని కులాంగనలకును బాలికలకును గూడ నుపయోగపడెడు విద్యాశాల నేర్పఱుచుట యుచితమని దీనిని స్థాపించితిని. ఇది ముఖ్యముగా శరణాలయములోని వితంతువులకొఱకును సామాన్యముగా విద్యాభిరుచిగల కులస్త్రీలకొఱకును బాలికలకొఱకును నుద్దేశింపఁ బడినది. ఈ పాఠశాలలోఁ జదువుకొనుటకు బాలికలను మాత్రమే కాక కొందఱు గృహస్థులు తమ భార్యలను సహితము పంపిరి. శరణాలయములోని

వారు గాక పైనుండి యొకరిద్దఱు బాలవితంతువులు చదువవచ్చు చుండిరి. వృద్ధుఁడైన యొక యుపాధ్యాయునితోడను పలుగురు బాలికలతోడను పాఠశాల నారంభించితిమి. పక్షము దినములు కనఁగా నెల కడపట బాలికలసంఖ్య 49 అయినది; సంవత్సరాంతమునకుఁ దొంబది యైనది; పది సంవత్సరములలో దాదాపుగా 150 వఱకును పెరిగినది. ప్రథమ సంవత్సరాంతమున ముగ్గు రుపాధ్యాయులును ముగ్గురుపాధ్యాయినులును బాఠశాలలోఁ బనిచేయుచుండిరి. పాఠశాల కనుకూలముగా నింటిలో కొన్నిమార్పులు చేయుటకును, బల్లలు మొదలైనవి కొనుటకును, చదువుచెప్పువారి జీతములకును, మొదటి సంవత్సరములో నేను నాచేతినుండి రు 1708-9-9 వ్యయము చేసితిని. 1905-వ సంవత్సరము మెయి నెలలో శ్రీమతి లక్ష్మీకాంతమ్మయు, ఆమెభర్త రామచంద్రరావుగారును మంగుళూరి నుండి నన్నుఁ జూచుటకయి వచ్చిరి. ఈ లక్ష్మీకాంతమ్మ నేను చెన్నపట్టణము వెళ్ళఁదలఁచినప్పుడు రాజమహేంద్రవరములోని దొరతనమువారి బాలికాపాఠశాలలో నుపాధ్యాయినిగా నుండెను. ఆమె యీవరకే ప్రాథమిక పరీక్షయందు (Primary Examination) తేఱి క్రమశిక్షితురాలయి (Trained) యుండెను. ఆమె తెలివిని సత్స్వభావమును సద్వర్తనమునుజూచి యామె నాయుద్యమములకుఁ దోడుపడఁగలదని తలఁచి, దొరతనమువారి కొలువువిడుచునట్లు చేసి యామెను నావెంట చెన్నపట్టణమునకుఁ దీసికొనిపోయి చదివింప నారంభించితిని. ఆమె నధమము ప్రవేశపరీక్ష (Matriculation) వఱకును చదివింపవలెనని మొదట నుద్దేశించితిని. ఆమె మాధ్యమిక (Lower Secondary) పరీక్ష తరగతిలోఁ జదువుచుండగా నామెను వివాహము చేసికొనుటకయి వరులు రాఁదొడఁగిరి. స్వప్రయోజనపరత్వము నటుండనిచ్చిన పక్షమున వివాహముచేయుటయే యామెకు

శ్రేయస్కరమని భావించి మంగుళూరులోని కర్ణాటకోన్నత పాఠశాలలో నలువదిరూపాయల జీతముగల యుపాధ్యాయపదములో నున్నవాఁడును, ప్రథమశాస్త్ర పరీక్షయందుఁ గృతార్థుఁడయి పట్టపరీక్షకుఁ జదివినవాఁడును, అయిన రామచంద్రరావుగారి కిచ్చి బ్రహ్మసమాజ విధుల ననుసరించి యామెకు మాలోపలనే వివాహము చేసి, 1872-వ సంవత్సరపు 3-వ శాసనప్రకారము లేఖ్యారూఢము చేయించితిని. ఈమె మాయొద్దనున్న కాలములో నెల్లవారును మాకన్నకూఁతు రనియే భావించుచుండిరి. కాని యెవ్వరును వేఱుగాఁదలఁపలేదు. ఎవ్వ రడిగినను మమ్మామె తన తల్లియుఁ దండ్రియు ననియే చెప్పుచుండెడిది. నాభార్యయు నితరులలో నామె తనకూఁతురనియే చెప్పుచుండెడిది. ఆమెయిప్పటికిని నన్నుచూచుటకయి వ్యయ ప్రయాసములకు లోనయి మంగుళూరినుండి వచ్చుచుండును. ఈదంపతులు నన్ను చూచుటకు రాజమహేంద్రవరము వచ్చి నప్పు డిక్కడనుండి పనిచేయువా రెవ్వరును లేరని నేను ప్రస్తావించితిని. ఆయన తనకు రెండువేలరూపాయల ఋణమున్నది గాని లేని యెడలఁ దామువచ్చి యిక్కడనుండి పనిచేయుదుమని చెప్పెను. నేనా ఋణము దీర్చెదననియు, వారిని రావలసినదనియు, చెప్పి, నే నుపకారవేతనమును బొందుటకుముం దొకనిధిలో నిలువచేసికొన్న వేయి రూపాయలును వడ్డితోఁగూడ రామచంద్రరావుగారి కిచ్చునట్లువ్రాసి తక్కిన వేయిరూపాయలును మరల రామచంద్రరావుగారు వచ్చినప్పు డిచ్చుటకు వాగ్దానము చేసితిని. ఆయన యందుచేత తనభార్యను రాజమహేంద్రవరములో నావద్ద విడిచి, యాఱుమాసములలోఁ దాను వచ్చి చేరునట్లు చెప్పిపోయెను. ఆయన మిక్కిలి మంచివాఁడే కాని భూములు సంపాదింపవలెనన్న పిచ్చియొకటి యాయన నాశ్రయించి విడువకుండెను. అందుచేత నేనిచ్చిన వేయి రూపాయల

తోను ఋణముతీర్చుటకు మాఱుగా మఱియొక క్రొత్తభూమినిగొని మునుపున్న ఋణమును ద్విగుణము చేసికొనివచ్చెను. 1906-వ సంవత్సరారంభమున నేనక్కడిపనిని మానుకొని రామచంద్రరావుగారు తిరిగివచ్చువరకును శ్రీమతిలక్ష్మీకాంతమ్మ ప్రధానోపాధ్యాయురాలు గానుండి మాపాఠశాలలో నత్యంతశ్రద్ధతోఁ బనిచేయు చుండెను. ఆయన వచ్చినతరువాత ప్రధానోపాధ్యాయత్వమును ఆయన వహించెను. ఇరువురకును గలిపి నెలకు నలువదిరూపాయ లిచ్చుచుంటిని. ఆయన తిరిగివచ్చులోపల వారినిమిత్తమై యాఱునూఱురూపాయలు వ్యయపెట్టి తోఁటలో నొకయిల్లు కట్టించితిని. తోఁట యెక్కడిదో ముందు తెలిపెదను. ఇప్పటికి నేను పాఠశాలలో నలుగు రుపాధ్యాయులను బెట్టితిని. వారిలో నిద్దఱు మాధ్యమిక పరీక్షయందుఁ గృతకృత్యులయి క్రమశిక్షణబొందినవారు. తక్కినవారు ప్రాథమిక పరీక్షనిచ్చినవారు. ఆయన యిక్కడఁ బనిచేయ నారంభించిన కొన్ని వారములలోనే తమకియ్యవలసినసొమ్ముఁ బంపవలసినదని యాయనకు ఋణప్రదాతలవద్దనుండి యుత్తరములు రాఁజొచ్చెను. ఆయన నాకా యుత్తరములనుజూపి మొదటవాగ్దానము చేసిన ప్రకారముగా తక్కిన వేయిరూపాయల నిమ్మనియడిగెను. నేనాసొమ్ము ఋణములు తీర్చుకొనుటకయి యిచ్చెదనంటిని గాని క్రొత్తభూములను గొనుటకయి కాదనియు, ఇక్కడ స్థిరముగా నుండఁదలఁచుకొన్న యెడల నక్కడ క్రొత్తభూములను గొనుట కావశ్యకము లేదనియు, క్రొత్తభూములను కొనుట యిక్కడ స్థిరముగా నుండక లేచిపోఁదలఁచుకొన్నట్టు సూచించుచున్నదనియు, క్రొత్తగా కొన్న భూమిని మరల విక్రయింప వలసినదనియు, అట్లు విక్రయించెడు పక్షమున మొదట వాగ్దానముచేసిన వేయిరూపాయలను మాత్రమే కాక నూఱో యిన్నూఱో దండుగవచ్చెడుచో దానినిగూడ నిచ్చెదనియు చె-

తిని. ఆయన క్షేత్రభూమిని విక్రయింపనని చెప్పెను; విక్రయింపక పోయినయెడల సామ్మీయనని నేను చెప్పితిని. ఈకలహమునుబట్టి యాయన భార్యాసహితముగా మరల స్వస్థలమునకుఁ బోవలసిన వాఁడయ్యెను. అందుచేత నేను మొదట నిలువచేసికొన్న వేయి రూపాయలును నష్టమయ్యెను. ఈదంపతుల నిక్కడకుఁ బిలిపించుటలో నాముఖ్యోద్దేశము నాకు సాయముగా నిక్కడ నింకొక యనుష్ఠానబ్రాహ్మ కుటుంబ ముండునని.

నేను చెన్నపట్టణమునుండి వచ్చినది మొదలుకొని బ్రహ్మసమాజములో ననుష్ఠానపరుఁడను గావలెనని తలఁచియుంటిని. కావున దానికిఁ దగిన ప్రయత్నములను ముందుగానే చేయ నారంభించితిని. నేను చిరకాలముక్రిందటనే యనుష్ఠానిక బ్రాహ్మఁడ నయి యుందును గాని యట్లుచేయుటవలన వితంతు వివాహకార్యమునకు భంగము కలుగునేమోయన్న భయముచేత నట్లు చేయసాహసింపక కష్టముల కోర్చుకొనియుంటిని. కష్టములకోర్చుకొనుట యేమని కొందఱు సందేహపడవచ్చును. మొదటి వివాహముచేయఁగానే శంకరాచార్యుల వారు నన్ను జాతినుండి బహిష్కరించిరి. నాపక్షమునఁ జేరినవారందఱును వరుసగా నొక్కరొక్కరే ప్రాయశ్చిత్తములు చేయించుకొని నన్ను విడుచుచురాఁగా నేనొక్కఁడనే మిగిలితిని. ఈవిషమదశలో నేను హిందువుఁడనుగా నుండినను నాతో భోజన ప్రతిభోజనాదులు చేయుచు హిందువు లెవ్వరును నాకు సహాయులుగా నుండరు; వర్ణభేదమును విడువనివాఁడ నగుటచేత నేను మతాంతరులతోఁగాని బ్రాహ్మణేతరులతోఁగాని భోజనముచేయుట కయినను వలనుపడదు. ఇటువంటి స్థితిలో నొంటిగాఁడ నైననాకు కష్టములుకాక మఱియేముండును? నేను యజ్ఞోపవీతమును విసర్జించి వర్ణభేదమును విడిచి యనుష్ఠానిక బ్రాహ్మఁడయినపక్షమున, నేనప్పుడు శూద్రాదులతో

మాత్రమే కాక క్రైస్తవ మహమ్మదీయాది మతాంతరులతోఁగూడ సుఖముగా భోజనప్రతిభోజనాదులు చేయఁగలవాఁడ నగుదును. క్రమ క్రమముగా వివాహములాడిన వారి సంఖ్య యధికమగుచు వచ్చి భోజన ప్రతిభోజనాదులు జరపఁదగిన సంఘ మేర్పడినది; మాతోఁ గలిసి భోజనములు చేయ సాహసించెడి యితరుల సంఖ్యయుఁ గాల క్రమమున హెచ్చినది. మరల నిప్పుడు వర్ణ పరిత్యాగమువలననే కష్టములు పడెడుకాలము వచ్చినది. పునర్వివాహములు చేసికొన్న వారి సంఖ్య యెక్కువగుటచేత నెవ్వరియింటనైనను వివాహములు చేయుచుండవచ్చును. వివాహము లొక్కొక్కరియింట చేయుచు వారి నలవాటు పఱుపవలెనన్న యుద్దేశ్యముతో నేను రాజమహేంద్ర వరము వచ్చిన తరువాత జరగిన కొత్త శ్రీరామశాస్త్రిగారి వివాహమును మాయూరి పురుషోత్తముగారి యింట నిన్నీసుపేటలో జర పించితిని; ఇంకొక వివాహము ప తేటసు వేంకటాచలపతిరావుగారి యింట జరపించితిని.

నేను వితంతు శరణాలయము నిమిత్తమును పాఠశాలనిమిత్తమును మాయింటి నంటియున్న మా పెదతండ్రిగారి భాగమునుగూడ నేడువేల రూపాయలకుఁగొని దానిలోని కొన్ని యిండ్లు పడఁగొట్టించి మాయింటి తోఁగలపవలెనని ప్రయత్నించుచుంటిని. ఇంతలో మంగుళూరినుండి రామచంద్రరావుగారును భార్యయు 1905 వ సంవత్సరము మే నెలలో నన్ను చూడవచ్చిరి. అప్పు డాయనయు నేనును ప్రాతఃకాలమునందు సంచారమునకుఁ బోవుచుంటిమి. ఒకనాటి విహారములో నొక తోఁటలోనుండి నడచుచుండినప్పు డీతోఁట వితంతు శరణాలయము కట్టుట కనుకూలముగా నుండునని యాయన నాతోఁ బ్రస్తావించెను. పట్టణములోని ప్రాఁతయింటిని గొనఁబ్రయత్నించుటకంటె నిటువంటి తోఁటను సంపాదించి యందు వితంతుశరణాలయాదులు కట్టించుట

యే యుక్తమని నాకునుఁ దోఁచెను. ఆతోఁట నాకు క్రొత్తది కాదు. అది నామిత్రులైన చల్లపల్లి రంగయ్యపంతులుగారిది. ఆయన ఇప్పుడు ప్రాడ్వివాక పదమునుండి యుపకార వేతనమును బొందివచ్చి స్వస్థలమైన రాజమహేంద్రవరమును జేరియున్నారు. ఆయన తమ్ముఁడును నాసహపాఠియు విధవావివాహప్రయత్నములో నన్నుఁబురికొల్పినవాఁడును అయిన చల్లపల్లి బాపయ్యపంతులుగారును నేనును గలిసి యాతోఁటకుఁ బలుమాఱు వచ్చుచుండెడివారము. రంగయ్యపంతులుగారు ధనవంతు లగుటచేత తోఁట నమ్ముకోవలసిన యావశ్యకము వారి కుండదు గనుక నాకది దొరకుట దుర్లభముగా గనఁబడెను. అయినను బ్రయత్నించి చూతమని తలచి రంగయ్యపంతులుగారి యింటికిఁ బోయి నేను వచ్చిన కార్యమును జెప్పి వితంతుశరణాలయ నిర్మాణార్థముగా తోఁట నాకిండని యడిగితిని. అన్నదమ్ముల భాగములు తెగక తోఁట యొకసారి యమ్మదలఁచినట్టును మూఁడువేల రూపాయల కెవ్వరో యడిగినట్టును చెప్పి సత్కార్యముకొఱకు నీవడుగుచున్నాను గనుక నాకు రెండువేల యేనూఱు రూపాయలకే యిచ్చెదమని వారు చెప్పిరి. నేను వెంటనే యేనూఱు రూపాయలను గొనిపోయి యాయనకిచ్చి యాయనచేతను తమ్ముని కొమాళ్ళచేతను తోఁటను నాకు రెండువేల యేనూఱు రూపాయలకు విక్రయింప నిర్ణయించి క్రయధనములో నేనూఱు రూపాయలు ముందుగా బుచ్చుకొన్నట్టు వ్రాయించి పుచ్చుకొంటిని. ఆర్బత్తునట్టు కంపెనీలో నావి రెండువేల రూపాయలుండెను. పోలవరము జమీందారుగారిచ్చిన రూపాయలు మొదలగునవి చెన్నపట్టణములోని వితంతు శరణాలయమునకును వివాహములకును అయిన వ్యయములకే చాలకపోయినను నేను దానిని ముట్టుకొనక యావ్యయముల నన్నింటిని నేనే భరించి వితంతు శరణాలయమునకు నిధి యేర్పఱుపవలెనన్న యుద్దే

శముతో పోలవరము జమీందారుగారిచ్చిన వేయి రూపాయలును క్రోలాచలము వెంకటరావుపంతులుగారిచ్చినసభాపతియంత్రములలోని మూఁడువేలరూపాయల భాగములవలన వచ్చినలాభమును, రంగయ్య సెట్టిగారు నెలనెలకిచ్చుచు వచ్చిన పదేసిరూపాయలును చందాలును గలిసి రు 1500-0-0 లు కాఁగా దానికి నావి రు 500-0-0లు చేర్చి రెండువేలరూపాయలను ఆర్బత్తునట్టుకంపెనీలో వేసితిని. ఈతోఁట కొనుటకయి యీరెండువేలరూపాయలను తెప్పించితిని. ఇందులో నాకీశ్వరుని సాహాయ్యము స్పష్టముగాఁ గానఁబడుచున్నది. ఈసొమ్ము నేను తెప్పించుకొన్నతరువాత శీఘ్రకాలములోనే ఆర్బత్తునట్టుకంపెనీ దివాలాతీసెను. ఈతోఁటను గొనవలెనన్న బుద్ధిపుట్టి సొమ్మును తీసి యుండకపోయిన పక్షమున నీ పెద్ద దివాలాలో నారెండువేల రూపాయలును నష్టమయి యుండును. చెన్నపట్టణములో నున్న యిండ్ల నిప్పటి కింకను విక్రయింపలేదు. వానివలన నెలకు రు 35-0-0 లు అద్దె వచ్చుచుండెను. ఆ యిండ్లను విక్రయించి వచ్చినధనముతో క్రొత్తగాఁకొన్న తోఁటలో వితంతు శరణాలయమును గట్టింపవలె నని నేనుద్దేశించుకొంటిని.

వితంతు శరణాలయ సంబంధమున స్థాపింపఁబడిన బాలికా పాఠశాలలో నలుగురు మాత్రమే కులస్త్రీలు పెద్దవారు చదువుచుం డిరి. పురుషు లనేకులు తమ స్త్రీలను పాఠశాలకుఁ బంపుటకు తమ కిష్టమున్నదికాని వారే యింటపని మొదలయినవి చేయవలసినవారగు టచేత, పాఠశాలకుఁ బోవలసినకాలము వారికి సరిపడకున్న దని నాతోఁ జెప్పిరి. అందుచేత వారి యానుకూల్యము నాలోచించి యట్టి స్త్రీలకొఱకయి మామేడమీఁదఁ బ్రత్యేకముగా జనానాంతర గతులనుబెట్టి వారికి నేనే చదువు మొదలయినవి చెప్పుచుంటిని.

రాజమహేంద్రవరము రాఁగానే నే నారంభించిన రెండవపని

సత్యవాదిని యనుపేరితో నింగ్లీషు తెలుఁగు భాషలలో వారపత్రిక నొకదానిని బ్రకటింపించుటయని యీవఱకే తెలిపియున్నాను. చందామూలమున వచ్చినది పోఁగా దాని కయ్యెడు మిగిలిన వ్యయములనన్నిటిని నేనే భరింపవలసినవాఁడ నయితిని. ఈపత్రిక మాస్వీయ ముద్రాశాలయందే ముద్రింపఁబడుచువచ్చుట వాస్తవమే యయినను, ముద్రాశాలాసేవకుల కియ్యవలసిన జీతములు మొదలయినవి విశేషమయ్యెను. ప్రథమభార్యవలన సంతానము లేదన్న హేతువు చేతనో మఱి యేహేతువుచేతనో ప్రథమభార్య జీవించియుండఁగానే పోలవరము జమీందారుగారు రెండవవివాహమును జేసికొనిరి. హిందూ ధర్మశాస్త్రానుసారముగా నిట్టి వివాహము దూష్యము కాకపోయినను విద్యాధికులయిన యిప్పటి వివేకులదృష్టియందు దూష్యము కాకపోదు. ఈవివాహవిషయమయి 1905-వ సంవత్సరము మార్చి నెల 29-వ తేదని ప్రకటింపఁబడిన సత్యవాదినియొక్క యైదవ సంచిక యందు నేనిట్లు వ్రాసితిని—

"పట్టపరీక్షయందుఁ గృతార్థులయి, సరస్వతియను పత్రిక కధిపతులయి, సంస్థానాధిపతులలో వివేకులని పేరొందఁదగిన శ్రీపోలవరముజమీందారుగా రీనడుమ తమవివేకమునువిడిచి విధ్యుక్తముగా వివాహమాడినభార్య విలపించుచుండఁగా విడనాడి పదేండ్లపడుచును మరల వివాహమాడిరని వినుటకెంతయుఁ జింతనొందుచున్నారము. ఈయన యారంభదశయందు సంఘసంస్కారమునం దాదరముగలవాఁడయి, బాలవితంతువివాహములను బ్రోత్సాహపఱచుచు, వితంతుశరణాలయమునకు వేయిరూపాయలనిచ్చి యుండుటను జూచి యీయనవలన నీదేశమున కెంతో మేలు కలుగునని తలఁచియుంటిమి; గాని యీయన చదువుకొన్న చదువును వయస్సుతో వర్ధిల్లవలసిన వివేకమును నిట్లు పడటఁగలిసి దేశమున కనర్థదాయకములగునని మే

మున్నెఁడును భావించియుండలేదు. ఈమధ్యనీయనయార్యమతోద్ధార కులుగా మాఱి యార్యమతబోధినికిఁ బ్రధానపోషకులైరని వింటిమి గాని యీయార్యమతాభిమాన మింతశీఘ్రకాలములోనే యీయనను సన్యస్తవివేకునిఁ జేసి యధర్మముగా సహధర్మచారిణిని త్యజింపఁ జేయునంతటి దుస్థితికిఁ దెచ్చునని యూహింపలేక పోయితిమి. ఆర్య మతబోధిని యీవివాహము నెట్లు వర్ణించి, శ్లాఘించునో చూడవలసి యున్నది. ఆర్యమతబోధిని యని నేతిబీరకాయవలె పేరు పెట్టుకొని దేశాభివృద్ధికై పాటుపడెడు సంఘసంస్కర్తలను నోరికసి దీఱ నిష్కారణముగా నిందించు దీక్షను వహించుటకంటె నీతి వృద్ధి చేయు టకయి ప్రయత్నించుట యెంత యధిక శ్రేయోదాయకముగా నుం డును! నీతిమాలినచదువుచదువు కాదు;ఎంతచదివినవాఁడైనను,నీతిలేని వాఁడైనచో నట్టివాఁడుసజ్జనపరిత్యాజ్యుఁడయిపవిత్రమైన మనుష్యనా మమునకే యనర్హుఁడగును. భ్రమప్రమాదాదులు మనుష్యులకుసహజ ములగుటచేతఁ దప్పుచేయుట వింత కాదు. చేసినతప్పుఁదెలిసికొని,మిం చినదానికనుతాపపడి, ముందుఁ దనప్రవర్తనమును బాగుచేసికొనుట బుద్ధిమంతులలక్షణము. కాఁబట్టి యుత్తములరాలైన తమ ప్రథమ భార్యను మరలఁ గొనివచ్చి యింటనుంచుకొని యాదరించి చక్కఁగా నేలుచుఁ గోరి తెచ్చుకొన్న యీక్రొత్తభార్య యెదిగి కాపురమునకు వచ్చినప్పు డీయుగ్రమహిషికిఁ గలిగించిన సౌఖ్యమునె కలిగింపక యన్య స్త్రీ విముఖతతో నాయబల నర్ధాంగి యనుటకుఁ దగినట్లుగా నాద రింతురని మాజమీన్దారుగారికి హితబోధ చేయుచున్నారము. ఇట్లు చేసినచో నీయవమానకర వివాహమువలనఁ గలిగెడు దుష్ఫలము లంతగా ననర్థదాయకములు కాకుండును. ప్రథమభార్య యిట్లు పరి తాపపడుచుండఁగా నోరెఱుఁగని తనకూఁతును మరల నిచ్చి వివా హముచేయుట కీక్రొత్తమామగారికి మన సెట్లు వచ్చినదో! ధన

మున కాసపడి లోకములో నెటువంటివారును దమ కన్న కూఁతుల నైన ధనాశాపిశాచమునకు బలియిత్తురు గదా ! ”

ఇందుఁ బేర్కొనఁబడిన యార్యమతబోధినీ పత్రికాధిపతులు ముఖ్యముగా నన్నును దత్సంబంధమున సామాన్యముగా సంఘసంస్కర్తలను సర్వదా దూషించుచుండుట కయి దీక్ష వహించి యవతరించిన మహాపురుషులు. మొట్టమొదట నేను వీరివ్రాఁతలకు మాఱు వ్రాయఁ గొంత ప్రయత్నించితిని గాని తరువాత నది యవివేకమని యు నెవ్వరికిని లాభము లేని వృథాకాలక్షేప మనియుఁ దెలిసికొని వారేమి వ్రాసినను మాఱుమాటాడక యూరకుండి యుపేక్షాపరుఁ డయి యాపత్రికను జదువుటయే మానుకొంటిని. వివాహవిషయమున నేను వ్రాసిన పయివాక్యములు పోలవరము జమీనుదారుగారికిని, ఆర్యమతబోధినీ పత్రికాధిపతిగారికిని,మనస్తాపమునుకలిగించినవి. ఆర్యమతబోధినీ పత్రికావిలేఖకులు మహాకుపితులయి దీనితో సంబంధించినట్టియు సంబంధింప నట్టియు బహువిషయములను, నన్ను దూషించుచుఁ దమపత్రికలోఁ బ్రకటించిరి. వారు వ్రాసినదాని కెల్ల నేనుత్తరము లిచ్చితిని గాని దీనితో సంబంధించిన దానిని మాత్రము కొంత యిం దుదాహరించుచున్నాను——

“ఈనడుమనే వితంతు శరణాలయమునకు వేయి రూపాయల నిచ్చిన మహోపకారిని కృతఘ్నుఁ డయి నేనేమో తిట్టితి నఁట ! ఈదూషణలపండితుని పాండిత్య మెంత శ్లాఘనీయముగ నున్నది ! ఈ యనకుఁ గృతజ్ఞతకును గృతఘ్నతకును గల భేదము తెలియదట్టున్నది. ఒకరిమేలు కోరి చెప్పిన హితవాక్యములు తిట్లఁట! హితబోధచేయుట కృతఘ్నత యఁట ! ఇటువంటి విపరీతబుద్ధులుగల పండితులు పత్రికాధిపతులయి లోకమునకుఁ దమనీతులను గఱపఁబూనినచో లోకము బాగుపడకుండునా? ఒకరిపోషకత్వములోనుండి వారు

తప్పుదారిఁ ద్రొక్కినప్పుడు చెవికిఁ జేఁదుగానుండు హితమునుజెప్ప ధైర్యములేక యిచ్చకము లాడుట కృతఘ్నత! తమకు మేలు చేసిన వారకార్యకరణమునకుఁ బూనినప్పుడు వారి యాగ్రహమునకు భయపడక యప్రియము లయినను హితవాక్యములను నిశ్శంకముగాఁ బలుకుట కృతజ్ఞత. నాకు వారియెడలఁ గృతజ్ఞత కలిగియుండుటను బట్టియే నిర్భయముగా నేను హితము చెప్ప సాహసించితిని. ఆయనకు హితముచెప్పి సన్మార్గమునకుఁ ద్రిప్పఁ జూచుట కనేక పథముల నాకు స్వాతంత్ర్యము గలదు. ఆయన నాకు బంధుఁడు; శిష్యుఁడు; మిత్రుఁడు. ఈమూఁడు సంబంధములనుబట్టి యాయన చేసిన కార్యమకార్య మనియు మించినదానికిఁ బశ్చాత్తాపపడి పాపపరిహార ప్రయత్నముచేయ వలసినదనియు, తాను చేసినపనియే మంచిదని సాధించుట యపచార మనియు, వారిక్షేమమును గోరి మరల హెచ్చరించుచున్నాను. ఆర్య పత్రికా విలేఖకుఁ డయిన యీ యసంగతబ్రహ్మ తాను చేసినపనికి సిగ్గుపడవలసినదానికి మాఱుగాఁ దను పత్రికకు జమీందారుగారు పోషకు లగుట కోర్వలేక, యిట్లు వ్రాసినట్లు నాయందు నిందారోపణ ముఁ జేయుచున్నాఁడు. * * *

ఈ యపూర్వపత్రికా విలేఖకుఁడు తన స్వభావమును నాకారోపించి తనబుద్ధిలక్షణమును వెల్లడి చేసికొనుచున్నాఁడు. వేయిరూపాయలు కాదుగదా యిటువంటి మఱి పదివేల రూపాయలయినను నిచ్చకము లాడుటకును దుర్నీతిని బోషించుటకును నిచ్చినయెడల నేను తృణ ప్రాయముగా నిరాకరించెదను. నే నధికధనవంతుఁడను కాకపోయిన ను నాకు జమీందారీ లేకపోయినను నాభోగానుభవములను తగ్గించి మిగిల్చి యీధర్మకార్యమునకయి యింతకుఁ బదిరెట్లు నే నిచ్చి యుండుట లోక మెఱుఁగును. జమీన్‌దారుగా రిచ్చిన వేయి రూపా యల నైనను వితంతు శరణాలయమున కిచ్చిరి గాని నాయుపయోగ

సము కయి కాదు. ఆయన యిచ్చిన వేయి రూపాయలను నిధిగా నుంచి యన్ని వ్యయములను నేనే యింతవఱకు భరించుచున్నాఁడను"

నేను తోఁటను కొన్నతరువాత నేను పోయి యందు కాపుర ముండినంగాని తోఁట బాగుపడదనియు, ఫలవృక్షము లెక్కువచేసి తోఁటను లాభకరముగాఁ జేయుటకై యింకొక నుయ్యియుండుట యావశ్యక మనియు నేను భావించి, ఆవఱకు పడిపోయి పాడుపడి యుండిన ప్రాఁతయింటిని బాగుచేయించి, యక్కడకుఁ గాపురమునకు వెళ్లుద మని నా భార్యతోఁ జెప్పితిని. చుట్టుపట్ల నెవ్వరును గాపురములు లేని మహారణ్యమువంటి యీ తోఁటలోఁ గాపుర ముండుట యపాయకర మనియు, అక్కడ దొంగలభయమనియు, శీతకాలములోఁ జలి యెక్కువగా నుండు ననియు, నాభార్య నాకు హితము చెప్పెను. పట్టణములోని మా యిల్లు మిక్కిలి విశాల మయిన దగుటను చుట్టుపట్ల నున్న మఱుఁగుదొడ్ల వాసనవలనను, మురికి కుండ్ల దుర్గంధమువలనను, చెన్నపట్టణములో తోఁట యింటిలో వాసము చేసివచ్చిన మాకాయింట నుండుట కొంత కష్టముగా నుండెను. మనలను రక్షించువాఁ డీశ్వరుఁడుండగా సర్పాదులకు భయపడవలసిన పనిలేదనియు, దొంగలభయము లేకుండఁ గుక్కల నుంచుకొంద మనియు, అక్కడ ననుకూలముగా నుండని యెడల శీతకాలములో మరల మనయింటికే వత్తమనియుఁ జెప్పి యొడఁబఱిచి భార్యాసహితముగా నేను తోఁటలోనికి శ్రావణ మాసములోఁ గాపురమునకు వెళ్ళితిని. శీఘ్రకాలములోనే యక్కడి నివాసమునకు మే మలవాటు పడితిమి; రాత్రులు కుక్కలు మాకు కావలిగా నుండెను. కొంతకాలమైన తరువాత తోఁట పనివాండ్రు వచ్చి రాత్రు లక్కడ పరుండుచుండిరి; అక్కడి నిర్మల వాయువు వలనను శుద్ధజలమువలనను నా దగ్గు కొంత తగ్గినది; నాభార్యకు

దేహారోగ్యము హెచ్చినది. శీతకాల మారంభమైనప్పుడు పట్టణము లోని మనయింటికీ నాలుగు నెలలును బోయి యుందమా యని నా భార్య నడుగఁగా నిక్కడనే బాగున్నది, పోవల దని యామె యుత్తరము చెప్పెను. మే మప్పటినుండియు తోఁటలోనే నివాస మేర్పఱుచుకొంటిమి. ఇఁక నుయ్యి త్రవ్వింప వలసిన పని యొకటి మిగిలియున్నది. నాయొద్ద నప్పుడు నూఱు రూపాయలు మాత్రమే యుండెను. వేయిరూపాయలకుఁగాని నుయ్యి యగునట్లు కనఁబడలేదు. నాయొద్ద నున్న నూఱు రూపాయలతోను త్రవ్వపని నారంభించి తరువాత చూచుకొందమని యీశ్వరునిమీఁద భారము వేసి నూయి త్రవ్వింప నారంభించితిని. మిస్ మ్యానింగుగారు తమ మరణశాసనములో నేఁబది పౌనులు నా కియ్యవలసినదని వ్రాసినట్టును, ఆసొమ్ము నాకిమ్మని చెన్నపట్టణములోని తమ ప్రతినిధులకు వ్రాసినట్టును, లండను నగరములోని యామె మరణశాసన నిర్వాహకు లింతలో నాకు వ్రాసిరి. వ్యయము లన్నియుఁ బోఁగా మిగత సొమ్మును రు. 659-1-0 లను చెన్నపట్టణమునుండి బెన్నీ కంపెనీవారు నాకు పంపిరి. ఆ సొమ్ముతోను మఱి కొంచెము సొమ్ముతోను నూతిపని పూర్తియయినది. నీరు నే ననుకొన్నంత లోఁతునఁ బడక కొంచెము పైగానే పడినందున రు. 800-0-0 ల లోనే నూయి ముగిసెను. ఈ సాయము కేవల భగవత్ప్రేరణమువలన వచ్చినదే కాని వేఱు కాదు. లండన్ నగరమెక్కడ? రాజమహేంద్రవర మెక్కడ? ఒక వృద్ధాంగన తన మరణకాలమందు నాకు సొమ్మిమ్మండని వ్రాయు టెక్కడ? మొట్టమొదట మక్డానల్డు దొరగారు నా రాజశేఖర చరిత్రనుగూర్చి యామెతో నా విషయమయి మాటాడియుందురు. తరువాత నామె చెన్నపట్టణమునకు వచ్చినప్పుడు మాయింటికి వచ్చి నా భార్యను కౌఁగిలించుకొని మా యింటనున్న శరణాలయము

లోని వితంతువులను జూచి సంతోషించెను. ఈమె రామమోహన రాయ లింగ్లండునకు వెళ్ళిన కాలములో మిస్ కార్పెంటరు మొదలైనవారితోఁ గలిసి వ్యాధి సమయమునం దాయన కుపచారములు చేసినవారిలో నొకతె. మరణమునకు ముందు వైద్యుఁడు రామమోహనరాయల తల కత్తిరించినప్పు డా వెండ్రుకలను సంగ్రహించి యప్పటినుండియు దాఁచిపెట్టుకొన్న దానిని నాకమె ప్రేమతో బహుమానము చేసెను. ఆ బహుమానము నమూల్యమైన దానినిగా గ్రహించి యిప్పటికిని నాయొద్దఁ బదిలముగాఁ బెట్టుకొని యున్నవాఁడను.

1905-వ సంవత్సరోత్తరార్థారంభమునందు సాధారణ బ్రహ్మసమాజ మత ప్రచారకులైన బాబూ హేమచంద్ర సర్కారుగారు రాజమహేంద్రవరమునకు వచ్చిరి. అప్పుడు నేనాయనతో నాతండ్రిగారి శ్రాద్ధకర్మను బ్రహ్మసామాజిక విధుల ననుసరించి చేయ నుద్దేశించుకొన్నట్టును, అప్పటినుండి యనుష్ఠానపరుఁడనుగా దలఁచుచున్నట్టును చెప్పితిని. తరువాత రెండుమూఁడు మాసములకు బాపయ్యగారు నాయొద్దకు వచ్చి తాము యజ్ఞోపవీతాదులను విసర్జించి యనుష్ఠాన బ్రాహ్మమతావలంబుఁడయి పితృశ్రాద్ధమును బ్రాహ్మసిద్ధాంతపద్ధతి ననుసరించి జరుపవలెనని యున్నదని నన్నాలోచన యడిగెను. నేనాయనను ప్రోత్సాహపఱిచి నేను భోజనమునకు వచ్చెదననియు శీఘ్రకాలములోనే నేనుకూడ ననుష్ఠానపరుఁడ నయ్యెదననియుఁ జెప్పి, కలకత్తా నగరమునకు నామిత్రులయిన పండిత శివనాథశాస్త్రిగారిపేర వ్రాసి శ్రాద్ధకర్మను నేనే నడిపి యితరులతోఁ గలిసి నేనక్కడ భోజనము చేసితిని. ఈ విషయమున నాకాయన మార్గదర్శకులయినందుకు మిక్కిలి సంతోషించితిని. అత్యల్పకాలములోనే పరలోకయాత్రకుఁ బ్రయాణము కట్టుకొనియున్న నాయను

స్థానపరత్వమువలన నాయంతరాత్మతృప్తి తప్ప లోకమునకు మేలు కలుగునని భావింపలేదు గాని లేఁబ్రాయమువాఁడును, జిరకాలము బ్రతుకవలసినవాఁడును నిరుపమానసద్వర్తనుఁడును సంస్కారదీక్షాదక్షుఁడును నయిన బాపయ్యగారి యనుష్ఠానపరత్వమువలన పరిశుద్ధాస్తిక మత వ్యాపనమునకును, సంఘసంస్కారాభివృద్ధికిని విశేష ప్రయోజనము కలుగునని నేను నమ్మియుంటిని.

1906-వ సంవత్సరము ఫిబ్రవరి నెల 2-వ తేదిని బాపయ్యగారియింట సంస్కార భోజన మొకటి జరిగెను. ఆవిందులో కొందఱు బ్రాహ్మణులును, వైశ్యులును, శూద్రులును, క్రైస్తవు లొకరిద్దఱును గలిసి భోజనములు చేసిరి. భోజనము చేసినవారిలో నొకఁడు విందారగించినవారి పేరుల నొతో యుత్సాహముతో; కలత్తాలోని హైందవదూత (The Indian Messeenger) యను నింగ్లీషు పత్రికకు బంపి ప్రకటించెను. ఆపేరులే యసత్యవాదినిలోఁ దెలుఁగునఁ బ్రకటింపఁబడినప్పుఁడతఁడే బాపయ్యగారు ప్రకటించినవారనుకొనియాయనను దూషింప మొదలు పెట్టెను. కోమట్లలో భోజనము చేసినవారిలో ప్రాయశ్చిత్తము చేయించుకోక నిలిచినవారొక్క కారుమూరి కామరాజుగారు.

ఈ విందు జరిగిన మూఁడు దినముల కనఁగా 1906-వ సంవత్సరము ఫిబ్రవరి నెల 15-వ తేదిని సూత్రంప్రిగారి యాబ్దికమును నేను బ్రాహ్మధర్మపద్ధతినిఁ బెట్టి నాఁడు మొదలుకొని నేను వర్ణభేదమును త్యజించి సార్వజన సౌభ్రాత్రమును వహించి యనుష్ఠానిక బ్రాహ్మ్మఁడనగుచున్నానని ఘోషించి, నాచేత నాహ్వానము చేయఁబడియుండిన క్రైస్తవులు లోనుగాఁ గలసర్వజాతులవారితోను గలిసి సహపంక్తిని భోజనము చేసితిని. అప్పుడు వితంతుశరణాలయము వేఱుగ లేకపోవుటచేత నందలి యిద్దఱు ముగ్గురు వితంతువులును గలిసి మా

యింటనే యుండిరి. నేనెవ్వరితో భోజనము చేసినను సరే జందెము తీసివేసుకుండిన యెడల వారు మాయింటనే యుందుమని చెప్పిరి. అట్లు తీసివేయకుండుటకు వలనుపడదనియు వారినిమిత్తమయి పదు నేను దినములవఱకును జన్నిదమును తీసివేయక యుంచుకొనెద నని యు, వారీలోపల నిష్టమున్నచో వేఱుచోటికిఁ బోవచ్చుననియు పోకుండెడువారికి వేఱుచోట వాసస్థాన మేర్పఱచెద ననియుఁ జెప్పితిని. పులవర్తి వేంకటసుబ్బారావను పదునెనిమిదేండ్లబాలుఁడొకఁడు కూడ నాసంరక్షణలో నుండెను. వారికిఁ జెప్పినట్లే యతనికి జెప్పితిని. అతఁడు వేఱాధారములేనివాఁడయినందున నాయొద్దనే యుండెదనని చెప్పెను. బ్రాహ్మణవితంతువు లిద్దఱును 28-వ తేదిని మాయిల్లు విడిచి వెడలిపోయిరి. ఒక్క శూద్రవితంతువు మాత్ర మట్టె యుండెను. 13 దినము లుంచిన తరువాత నే నాదినముననే యజ్ఞోపవీతమును దీసివేసి యందఱితోను జెప్పితిని. యజ్ఞోపవీతమును గొన్ని దినము లుంచుకోవలసి వచ్చిన కారణము నెఱిఁగినవారయ్యు మాయింటిలోనివారే యొకరు నేను జన్నిదమును దీసివేయలేదని యూరిలోఁ జెప్పిరి. అయిదాఱు దినము లయినతరువాత బాపయ్యగారు నాయొద్దకు వచ్చి దాని సత్యమునుగూర్చి నన్నడిగిరి. నేను కారణమును జెప్పి యజ్ఞోపవీత విసర్జనముచేసిన మఱునాఁడే యీ సంగతి యాయనకు వ్రాసి యెల్లరకును దెలుపవలసినదని కోరితిని. అందఱితోను జెప్పవలసినదని నేనితరులను గూడ వేఁడితిని. అప్పుడే యూరందఱికిని దెలిసినది. కొందఱికిఁ బరులను దూషించునప్పుడును సత్యమో, యసత్యమో, వ్రాసియితరుల మంచిపేరు చెడగొట్టఁ బ్రయత్నించినప్పుడును, కలుగు సంతసంతోషము మఱియెప్పుడును గలుగదు.

కొందఱు తామేపనిఁజేయుటకుఁ బూనుకొనినను పని చేయనివారయి పను చేయువారిని దూషించుటలోను చేసినపనిలోఁ దప్పులెన్నుట

లోను దమకుగల యసాధారణ పాండిత్యమును గనఁబఱుతురు. కొంద ఱితరులను దూషించినప్పు డెంత సంతోషమును బొందుదురో యిత రుల భూషణమును విన్నప్పుడంత సంతాపము నొందుదురు. నేను చేసిన సాహసకార్యమునకయి పత్రికావిలేఖకులు శ్లాఘించినప్పుడును దుస్సహ మయిన మనోవేదన నొంది యొకానొక రొక పత్రికలో విలపించుచు వ్రాసిరి. పై వారి మాట యటుండఁగా బ్రహ్మసామాజి కులుగా నున్నవారిలో సహితము కొంద ఱనుష్ఠాన పరులు వేగిరిపాటు కలవారనియు దూరాలోచన లేనివారనియు దూషింపఁజొచ్చిరి. నేన ప్పుడు వ్యాధి బాధచేత మంచము దిగ లేని స్థితిలోనుండియు వారి మాటలవలన చిత్తోద్రేకము కలవాఁడనయి సత్యవాదిని కొక పెద్ద లేఖ వ్రాసితిని. అది దీర్ఘమయినదిగా నున్నను నాయప్పటి మనోభా వమును దెలుపునుగాన దానినిం దుఁబూర్ణముగాఁ బ్రకటించుచున్నాను.

'రాజమహేంద్రవర ప్రార్థనసమాజము— ఈసమాజమిక్కడ దాదాపుగా 30 సంవత్సరములనుండియుండి యున్నది. అంతకాలము నుండియుండఁగా నేఁటికాలమున కా సామాజికులలోఁ గొందఱనుష్ఠాన పరులగుట తటస్థించినది. అనుష్ఠాన పరు లగుటనఁగాఁ దాము పరమ ప్రమాణములని నమ్మిన సిద్ధాంతముల ననుసరించి ప్రవర్తించువారగు ట. అట్లయిన యనుష్ఠానపరులలో నే నొకఁడను. చెన్నపురిరాజధాని యందు బొంబాయిరాజధానియందుఁగాని కాళీఘట్ట రాజధానియందుఁ గానిభరతఖండము నందలి మఱి యేయితర దేశమునందుఁగాని బ్రహ్మసమాజము లను నామమునను ప్రార్థనసమాజము లనునామము నను బరగుచున్న సమస్తసమాజములయొక్కయు, ముఖ్యసిద్ధాంతము లు రెండని చెప్పనచ్చును. అందొకటి సర్వలోకాధిపతియైన యీశ్వ రుఁడు లోకైకపితయన్న విశ్వాసము; రెండవది జాతివర్ణ మత భేద ములు లేక యీశ్వర దృష్టిలోని వారైన సర్వమానవులును సోదర

తుల్యులన్న విశ్వాసము. ఈరెండును తాననుష్ఠానపరుఁడు కాఁగలిగిన ను కాఁజాలకపోయినను పూర్వోక్తము లయిన సమాజములోఁ జేరిన ప్రతిసామాజికునియొక్కయు పరమభావనలు. కేవల శుష్కోపదేశమున కంటెఁ గార్యాచరణము శ్లాఘ్యతరమనుట నిర్వివాదాంశము గదా! తాను జేసిన యుపదేశము తనకే యాచరణమునకుఁ బనికిరానిపక్ష మున మఱి యెవ్వరికిఁ బనికివచ్చును? అట్టి వంచకుని మాటలయం దెవ్వరికి విశ్వాసము కలుగును! పరోపదేశసమయమునందెల్ల వారును పండితులే యయి యనుష్ఠానసమయము వచ్చినప్పు డాపాండిత్యమును మూలఁబెట్టెడి యీకాలములోఁ జెప్పినట్టు నడుచుకొనెడు సాహసి కుఁ డొక్కఁడు కలిగినను, తదితరులు కాకపోయినప్పటికిని సామాజికు లందఱైన నాతని గౌరవించి యాదరింపవలయునుగదా! అట్లుచేయక వాక్శూరులైన కొందరు బుద్ధిమంతులు లా కార్యశూరులపయి వేగిర పాటు గలవారనియు దూరాలోచన లేనివారనియు దోషారోపణము లు చేయుచు సౌభ్రాత్రమును విడువఁజూచుట శోచనీయముగదా? ఒకవేళ వృద్ధత్వదోషమున మతిదప్పి యన్నిటికి సాహసించి పరలోక మునకుఁ బ్రయాణము కట్టుకొని యున్న ట్టూహింపఁదగిన నావంటి వానివిషయమున నట్టిదోషారోపణము లొకవేళ నంతగా నింద్యములు కాకపోయినను బుద్ధిపటుత్వము గలిగి నిండువయస్సులోనుండి విద్యాధిక్యముచే దూరాలోచన గలవా రనఁదగి యీలోకములో చిరకాలము వర్ధిల్ల నపేక్షించియున్న క్రియాపరులవిషయముననట్టియా రోపణములు గర్హ్యములుకాకపోవునా? ఓసోదరులారా! మీలో నెవ్వ రైన నట్టియారోపణములుచేసెడివారున్నపక్షమున, ఈశ్వరుఁడొక్కసారి హృదయపూర్వకముగాఁ బ్రార్థించిమీపూర్వసిద్ధాంతములనుస్మరణకుఁ దెచ్చుకొని మీసోదరులయెడలఁ బూర్ణస్నేహమును గనఁబఱుపుడు. వ్యాధిబాధచేతఁ గదలలేనివాఁడనై కూరుచుండి వ్రాయుటకు సహి

తము శక్తుఁడనుగాక పరుండియే యీ పంక్తులనువ్రాసి మిమ్ము వేఁడుచున్నాను. మమ్మువివేకులగు వేగిరపాటు గలవారినిగా భావింపక దయాదృష్టితోఁ జూడుఁడు. సత్కార్యమునకుఁ బూనుటలోను సత్యము ననుష్ఠించుటలోను వేగిరపాటన నెట్టిది? కాలముకొఱకు వేచుట యన నెట్టిది? ఎప్పుడు సత్కార్యము తేటపడునో దానికిఁ బూనుటకప్పుడే యుక్తసమయము; ఎప్పుడు సత్యము స్పష్టపడునో దానిననుష్ఠించుట కప్పుడే యుక్తకాలము. తమ తప్పును కాలముపైఁద్రోయుట యీశ్వరునియందును సత్యమునందును దమకుఁగల భక్తిహీనతకును గౌరవాభావమునకును గుఱుతు. నిజమైనభక్తిపరుఁడెప్పుడు నిట్టిమాట లనఁడు. కొందఱు మహానుభావులు సమయము వచ్చువఱకును దామేమో లోకోపకార ధురీణులయినట్టును భక్తాగ్రగణ్యులయినట్టును నటించుచు లోకమును భ్రమింపఁజేయుచు శోధనవచ్చినప్పుడు తెరవెడలివచ్చి ప్రాపంచిక నాట్యరంగమునఁ దమ స్వాభావిక వికృతవేషములతోఁ గనుపట్టుదురు. పయిమాటలు కార్యభీరులయినట్టి వేషధారుల నోట వెడలవలసినవి గాని భక్తిలేశభూషితులైన నిష్కపట హృదయులనోట వెడలవలసినవి కావు. భక్తలోకాభీష్టప్రదాతయైన యీశ్వరుఁడు పరిశుద్ధాస్తికులైన భక్తుల హృదయములయం దట్టితలఁపులు పొడమకుండఁజేసి మానస దౌర్బల్యముచేత తాము ధర్మచరులు కాలేకపోయినను ధర్మచరుల నాదరించునట్టి సద్బుద్ధి వారికందఱికిని పుట్టించునుగాక!

నేను వర్ణభేదమును పాటింపక సర్వ వర్ణ సమభావమును పూనుటచే సామాన్యముగా సంఘసంస్కారమునకును ముఖ్యముగా వితంతు వివాహ సంస్కారమునకును నష్టము కలిగెనని కొందఱు భావించుచున్నారు. అది యెంతమాత్రమును సరికాదు. ఎప్పుడును లోకములో నేసంస్కారమును తనయొక్క న్యాయబలమునుబట్టి నిలి

చియుండువుగాని యొక్క మానవమాత్రుని జీవితమునుబట్టి ప్రబలదు. ఈశ్వరేచ్ఛచేత నావంటి దుర్బలుఁడు సహిత మొకానొకవ్వుడు సంస్కార ప్రాబల్యమున కొక పనిముట్టుగా నుండవచ్చునుగాని యాతని తోడనే యాసంస్కారము నశింపదు. ఎప్పుడును బ్రతీక్షింపని స్థలములనుండి ప్రబలులైన సంస్కారపక్షావలంబు లనేకులు బైలుదేఱి సహస్రగుణములధికముగా దానిని కొనసాగింపవచ్చును. ఈశ్వరఘటనలు దురూహ్యములుగదా! ఇంతకును వర్ణవైషమ్యమును విడుచుటచేత నేను సంస్కార పరాయణత్వము నెంతమాత్రమును విడిచినవాఁడనుగాను. ఈశ్వర పుత్రికలగుచు హిందూసుందరులను నా నూతన సంబంధమునుబట్టి నాకు మఱింత దగ్గరవారయిన తోఁబుట్టువు లగుటచేత వారిస్థితిని బాగుచేయుటకయి మఱింతయెక్కువ పూనికతోఁ బాటుపడుట నాకుఁ బరమ కర్తవ్యముగా నేర్పడియున్నది. సామాన్యముగా స్త్రీల స్థితిని ముఖ్యముగా వితంతువుల స్థితిని బాగుపఱుచు ప్రయత్నములో నికముందును నాశక్తిని యుక్తిని నాకాయమును ధనాదాయమును వలసినచో నా జీవితమును ధారపోయుటకయి నేను సంసిద్ధుఁడనయి యున్నాను. వివాహమాడ నపేక్షించువారుగాని విద్యాలాభము పొందఁగోరువారుగాని యథాపూర్వముగా నేను గట్టించిన గృహమునందు వసించి స్వాభీష్టమును బడయుచుండవచ్చును. అట్టివారు నాతోఁగలిసి భోజనముచేయక వంతుల వరుసను స్వయంపాకమును గావించుకొని సుఖించుచు నాయాతిథ్య సత్కారమును యథేచ్ఛముగా ననుభవింపవచ్చును. ఏకేశ్వరారాధనము నంగీకరించి విగ్రహారాధనమునుత్యజించి జాతివైషమ్యాభావమును భజించుటచే సంస్కార పక్షమునఁబనిచేయుటకే నాకర్హత లేదనియాస్తిక శిఖామణులైన యపూర్వ సంఘ సంస్కారప్రియులు కొందఱు ఘోషించుచున్నారఁట! వారు ఘోషించునట్లు వారి యాదరణము

క్రిందఁ బనిచేయుటకును వారి సాంగత్య భాగ్యము ననుభవించుట కును నేనర్హుఁడను కాకపోవచ్చును. ఇటువంటి పరార్థపరులు లక్షమందినన్ను త్యజించినను, నాసేవ యంగీకరించుట తమ గౌరవమున కర్హము కాదని భావించినను, ప్రభువుల కెల్లను ప్రభువైన సర్వేశ్వరుఁడు నన్ను త్యజింపక నాకభయహస్తమిచ్చి స్వదేశ క్షేమార్థముగా నాసేవ నర్పించుటకుఁ బురికొల్పుచు నాకుఁ బ్రాపయి చెంత నిలిచి యుండగా నాధర్మమును నిర్వహించు టకు నేనెట్లర్హుఁడను గాకపోదును? ఈశ్వరబలములేక లోకములో నేసత్కార్యమును సంపూర్ణసాఫల్యము నొందనేరదు. సర్వశక్తుఁడైన యీశ్వరుఁడే నాకు ముఖ్యబలమయి యుండఁగా నశక్తమానవుల తోడ్పాటు కొందఱికి లేకపోవుటవలన నాపని కేల భంగము వచ్చు ను? ఇప్పుడు ప్రతాపోక్తులు పలికెడి యీ యసహాయ వాక్శూరుల వంటివారియొక్క యౌదార్యమును ధైర్యమును నేను ముప్పది సంవ త్సరములనుండి చూచుచున్నాను. బూటకపు మాటల బంగారైన మహావాక్యశూరులు పలువురు ప్రసంగములు కావలసి వచ్చినప్పుడు సభాభవనములు మాఱుమ్రోఁగునట్లు మేఘగంభీర భాషణములతో మహాఘోషము చేసినను, కార్యములు కావలసివచ్చినప్పు డేమూలలను గానఁబడకున్నారు. ఇట్టి వాక్శూరులు కార్యశూరులయి సంస్కార దీక్ష వహించి దేశమును శతాబ్దములనాటి యగాధదురాచారపం కమునుండి యుద్ధరించుచుఁ దమశూరత్వమును గనఁబఱుచుచున్నప్పుడు పైనుండి చూచుచు నాకంటె నెక్కువ యానందమును బొందువారిం కొకరుండరు. ఈమహానీయుల కొకవేళ నాచేసెడి యల్పసేవ కూడ నంగీకార్యమైనయెడల వృద్ధుడను దుర్బలుడను నైన నేనును నాకీ శ్వరుడు ప్రసాదించిన యల్పబలమును శక్తివంచనలేక వినియోగింప సంసిద్ధుఁడనయి యున్నాను. మాటలకేమి? మూఢులముందరను,

దురభిమానదూషితుల ముందఱను పోటుమాటలెన్నియైనను బలుక వచ్చును. ఈశూరాలాపముల సత్యమును కార్యము వచ్చినప్పుడు కనఁబఱచినప్పుడు గదా యీవాగేకశూరుల మగతనము తేటతెల్లమగును; మూఢజన సమ్మతముగాని యొక సంస్కారమునకుఁ బూనినచో భూషించు మిత్రులు దూషించునప్పుడును, సేవించు సేవకులు బాధలు గావించునప్పుడును, ఆహ్వానపత్రికలు పంపు మతాచార్యులు బహిష్కార పత్రికలు బంపునపుడును, ఈశ్వరభక్తివలనఁ గలిగెడి యవమానబల మొక్కటియే తోడుపడునుగాని యదిలేని నాస్తికత్వాదులేవియు తోడుపడవు. సంఘసంస్కారుల మయితిమని సంతోషపడెడు యోమిత్రులారా, వృథాగర్వాలాపములు పలుకక కార్యపరుల యెడల నించుక సహానము వహింపుఁడు. మతసంస్కారము లేక సంఘసంస్కారముగాని మఱి యేయితరసంస్కారముగాను జయప్రదముగాసాగదని చిరకాలానుభవమువలన నేను దృఢముగాఁ దెలుపుచున్నాను. మీరు పడుచున్న భ్రమలోనే నేనును దగులుకొనియుండి తమవిషయకములయిన నావిశ్వాసములను గొన్నిటిని గార్యముఁ జూపక యాత్మవంచకుఁడనయి వితంతు వివాహ సంస్కారము చేయునని కడచిన యిరువదియైదు సంవత్సరములనుండి యీశ్వరవంచకుఁడనయి ప్రవర్తించినాఁడను. ఇట్లుచేసినను వితంతువివాహ సంస్కారమిప్పుడించుమించుగా నారంభదశలోనున్నట్లే యున్నదిగాని యెక్కువ వృద్ధిని బొందగలిగినదికాదు. ఇప్పుడును పట్టపరీక్షలం గృతార్థులయిన విద్యావివేక సంపన్నులు వితంతు వివాహములను సంస్కారకార్య పట్టికలోనుండి తీసివేయవలయునను చున్నారు; వితంతు వివాహములాడిన వారితో భోజనముచేసినవారికి స్వాములిప్పుడును బహిష్కార పత్రికలను బంపుచున్నారు. శూరాలాపములాడు సంస్కార ప్రియులిప్పుడును వెనుకటివలెనే భయపడుచున్నారు. ఇంతకాలమునాయత్నావ

నమును బలమును ధనమును విద్యను బుద్ధిని వితంతువివాహపక్షమునఁ గొంతయుపయోగించి యున్నాను. ఇఁకముందును నాదేహములో నూపిరి యున్నంతకాల మీపనిని విడువను. నాకంత్యదినములు సమీపించుచున్నవి. దక్షిణహిందూస్థాన బ్రహ్మసమాజమునకుఁ బ్రిథానాధ్యక్షుఁడనుగా నుండి యీశ్వరునియొక్క జగదేకపితృభావమును మానవులయొక్క పరస్పర భ్రాతృభావమును ఘోషించుచు నాత్మవంచకుఁడను లోకవంచకుఁడను భగవద్వంచకుఁడను నయి దేహము త్యజించుట కిష్టములేనివాఁడనయి యీ లోకసామాన్య సౌభ్రాత్రమున కీవృద్ధదశలో సాహసించినాఁడను. ఇహలోకయాత్ర నాకు నేఁటితోనే ముగింపవలసియున్నను పరవంచకత్వము విడిచి సత్యము ననుష్ఠించి యీశ్వరసామీప్యమును గొంతయెక్కువగాఁ బొందఁ గలిగితినిగదా యన్న సంతోషముతోను తృప్తితోను దేహమును చాలించెదను. ఈశ్వరుఁడు నాకు సంపూర్ణ మనశ్శాంతిని గలిగించునుగాక! నావంటివారి నిదర్శనమువలన లోకమునకు మేలు కలుగునట్లు చేయునుగాక! నామిత్రులు నన్ను మన్నించి నాయందు తొంటి సుహృద్భావమునే చూపుదురుగాక!

కం. వీరేశలింగము.”

ఇంచుమించుగా నేను కొన్నతోఁట కంటియున్న మఱియొక తోఁటనుగూడ రు 600—0—0 లకు చల్లపల్లి రామయ్యగారివద్ద కొంటిని. ఈతోఁట కారాగృహమునకుఁబోవు రథ్యకు సమీపమునం దున్నందున వితంతు శరణాలయము మొదలయినవానిని దీనిలోనే కట్టింప నుద్దేశించితిని. నేను తోఁటలోఁగాపురమున్న యారంభదశలో న్యాయవాదులయిన బ్రహ్మశ్రీ ములుకుట్ల యచ్యుతరామయ్యగా రొకనాఁడు నన్ను చూచుటకయి వచ్చిరి. ఆయనకు నేనుకొన్నతోఁటలను జూపి క్రొత్తగా కొన్నతోఁటలో ననాథశరణాలయమును వితంతు

శరణాలయమును కట్ట నుద్దేశించియున్నట్లు చెప్పితిని. ఆయన నేను కోరకయే తామాగృహములను కట్టించి యిచ్చెదమని వాగ్దానము చేసిరి. ఈశ్వరుండు మంచికార్యముల కెప్పుడును తోడుపడుచుండును. పరమేశ్వరుఁడు నాయందు ననుగ్రహముంచి నేను సంకల్పించుకొన్న మహాకార్యమునకు సాయముచేయ ప్రేరణ మొనర్చుటచేత నే యచ్యుతరామయ్యగారు తమంతనే యుదారచిత్తముతో శరణాలయములను కట్టించి యిచ్చుటకు వాగ్దానముచేసిరి. అచ్యుతరామయ్యగారు రాజమహేంద్రవర కళాశాలలో నాశిష్యులు; నాయందు విశేషగౌరవము కలవారు. చెన్నపట్టణములో నున్నకాలములో నే నొకసారి రాజమహేంద్రవరమునకు వచ్చినప్పు డచ్యుత రామయ్యగారు రాణ్యాపురములో నున్న తమయింటికి నన్ను విందుకు పిలిచి వారు నన్ను మాయింటినుండి తమయింటికి వాద్యములతోఁ గొనిపోవుటకయి యేర్పాటు చేయఁగా నేనాసంగతి నెఱిఁగి యట్లుచేసినచో పక్షమున నేను రానని చెప్పితిని. ఆయన నాప్రార్థన మంగీకరించి నన్ను గుఱ్ఱపుబండిలో నెక్కించుకొని మాయింటినుండి సుమారు మైలు దూరములోనున్న తమయింటికిఁ గొనిపోయిరి. వారు నాయందెంతో యాదరమును దయను జూపి కతిపయమిత్రసహితముగా విందు చేసిన తరువాత నభినందనవాక్యములతో నాకంఠమునందు పుష్పహారమువేసి, తెనుఁగుఁ గూర్చి నరసింహస్వామిపటముతో బిరుదగ్రహమును దీయించి, తమ యింటిముందు ఆకాశబాణములు మొదలైనవి కాల్పించిరి. నన్ను మరల మాయింటికిఁ గొనిపోవునప్పుడు నే నంగీకరింపనని తమయింటి సమీపమున నేమియు చేయక పోయినను నాబండి యంగళ్ళవీధికి వచ్చునప్పటికి బహుమతులు వాద్యములు నడచున ట్లేర్పాటుచేసి త్రోవపొడుగున నానావర్ణబాణములను పడిపించి మహాతాంబూలను చిచ్చుబుడ్లను కాల్పించిరి. దీనినిమిత్తమయి వారెంతో వ్యయముచేసి యుందురు. ఇట్లుచేసిన యీ మిత్రునియొక్క వాగ్దానమును నేను

కృతజ్ఞతాపూర్వకముగా నంగీకరించి నామీఁదఁగల యవ్యాజప్రేమ మునకు నేను వారికి వందనములు సమర్పించితిని. వారుశీఘ్రకాలము లోనే పనియారంభించి క్రొత్తకోటలో నిప్పుడు వితంతుశరణాలయ మున్న విశాలభవనమును గట్టించి యిచ్చిరి. అందు వితంతువుల వాసమునకు వరుసనైదేసిచొప్పున రెండువరుసలలో పదిగదులను నాలుగు వర్ణములవారికిని నాలుగు వంటయిండ్లను శరణాలయకార్యములను జూచువారు కాఁపురముండుటకయి మూఁడు పెద్దగదులుగల యిల్లును దానియెదుటను పాఠశాలనిమిత్తమయి విశాలమయిన మూఁడుగదులుగల యిల్లును ఉన్నవి. ఇది కట్టించుట కాయన కెంత వ్యయమయినదో నాకు తెలియదుగాని మైమువేల రూపాయలయి యుండునని నే ననుకొంటిని. అచ్యుతరామయ్యగారు కోరినదియెల్లను వితంతు శరణాలయము మొదలయినవి యేహేతువుచేతనైనను లేక పోవుట తటస్థించిన పక్షమున తాము కట్టించినయిండ్లను మరలఁ దమకిమ్మని. వారీ శరణాలయమును నాకప్పగించిన తరువాత వారారంభించి విడిచిన నూతిని త్రవ్వించి కట్టించుటకును స్నానములగదిని మఱఁగు దొడ్లను కట్టించుటకును కొన్ని యావులనావుగోడలిటుకతో కట్టించుటకును నేను మఱి వేయిరూపాయలు భవనముపై వ్యయపరచి నందున, వితంతు శరణాలయముగాని యనాథ శరణాలయముగాని పతితవనితారక్షణాలయముగాని యేవియు లేకుండపోవు దుర్దశ యెప్పుడయినను తటస్థించెడు పక్షమున నేనిచ్చిన సొమ్ములోనుండి మైమువేలరూపాయ లచ్యుతరామయ్యగారికో యుత్తరాధికారులకో యిచ్చునట్లు నేను నానిక్షేపపత్రములో నేర్పాటుచేసితిని. ఈశ్వరానుగ్రహమువలనను మాపురజనుల యాదరమువలనను ముందట్టిదైవపరీత్యమెప్పుడును కలుగకుండునుగాక!

నేనను స్థానిక బ్రాహ్మణుఁడనయిన నాలుగు మాసములకును పోలవరము జమీందారుగారి వివాహమునుగూర్చి వ్రాయఁబడిన తరు

వాత మూడు మాసములకును నన్ను తిట్టుటకయి మాపట్టణములో 'హిందూదేశాభివర్ధని' యను పేరితో నొక పక్షపత్రిక బయలు వెడలినది. ఇది పోలవరం జమీందారుగారియాదరణముక్రింద బైలు వెడలిన దని యొకరొక వృత్తాంతపత్రికకు వ్రాయఁగా వారు తమ కాపత్రికతో సంబంధము లేదని యుత్తరము వ్రాయుటచేత వారి సంబంధము లేదనియే నమ్ముదము. మొదటిపత్రిక యవతారికలో నిది హిందూసమాజము పక్షమునను మఱికొన్ని యితర సమాజముల పక్షమునను ప్రకటింపఁబడునట్లు వ్రాయఁబడెనుగాని హిందూసమాజస్థాపకులును తదధ్యక్షులును నయిన న్యాపతి సుబ్బారావుపంతులు గారు తమ సమాజమున కాపత్రికతో సంబంధములేదని తెలిపిరి. ఎవ్వరో ప్రముఖుల ప్రోత్సాహముండినఁగాని పత్రికాధిపతి యట్టిపత్రికను ప్రకటింపఁజాలియుండఁడు. పత్రికాధిపతి శ్యామారా వనునతఁడు; అతఁడే జెనిమిది రూపాయలు సంపాదించుకొని జీవనముచేయుచుండిన వీధిబడిపంతులు; అతఁడు దూరదేశమునుండి రాజమహేంద్రవరమునకు కొత్తగా వచ్చినవాఁడు; అతఁడు నన్నెఱుఁగఁడు; నేనాతని నెఱుఁగను; అతఁడు పత్రిక కచ్చుకర్చుల నిచ్చుకొనుటకైన శక్తిలేని వాఁడు ఈ పక్షపత్రికకు చందా సంవత్సరమున కంచెకూలితోఁ గూడ నొక్కరూపాయ. ఈపక్షపత్రికయొక్క మొదటిసంచికయందనఁగా 1906 వ సంవత్సరము జూలై నెల 1వ తేదీని వృత్తాంతములను శీర్షికక్రింద నీ క్రిందివి వ్రాయఁబడినవి.

'బ్రహ్మశ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యగారిచే దమకు వ్రాయఁబడిన యుత్తరమునకుఁగాని, తమగ్రంథముపై చేయఁబడిన విమర్శనమునకుఁగాని శ్రీకందుకూరి వీరేశలింగము పంతులువా రింతవఱకుఁ దగిన సమాధాన మీయలేదఁట. ఇది యెంతయు వింతగదా! ఇది నిజముగానే యుండునా ? ఏమో!'

"తమ్ముఁ బోషిత్సాహపఱిచి తమకు మిగుల సహకారులుగ నున్న తమ ముఖ్యస్నేహితులే విశ్వాసభంగకరులైరని సభలలో నిందించుచున్న శ్రీ వీరేశలింగము పంతులవారే, హిందూవివాహము హిందూశాస్త్రసమ్మతముగ జరపుచున్నారని నమ్మి వితంతు శరణాలయమునుజొచ్చిన వితంతువులకు నేమార్గమును జూపక వారినిఅధోగతిపాలుజేసి తా మెట్లు బ్రహ్మసమాజికులైరో మహాశ్చర్యముగ నున్నదని జను లనుకొనుచున్నారు. ఇది మిగుల శోచనీయముగదా! శ్రీ పంతులవారు బ్రహ్మమతావలంబు లైనతరువాత నంతకుముందే తమపాలఁబడ్డ వితంతువులు పాపము తాము చేయున దేమియులేక వచ్చినమార్గమునే పట్టిరని వినుచున్నాము."

"ఇల్లు విడిచి వచ్చిన స్వైరిణులు కొందఱు తమకు వెండియుఁ బెండ్లి చేయింపవలెనని వేఁడి యొకపుణ్యపురుషుని నాశ్రయించిరి. ఆపుణ్యపురుషుఁడా యనాథల నెల్ల నొకయింటఁ జొప్పించి వారలకు బుద్ధిజెప్పి పోషించుచు నవవరాన్వేషణము చేయుచుండునట్టియెడ నొక యువవాఁడు విధవాలంకారము చేసికొని యాయపూర్వ స్వయంవరాంగనలలోఁ గలసి వారిలో నొకరిద్దఱఁ దద్దయు నలరించుచు నలరుచుండెనఁట. ఇట్లుండ నొకనాఁడా యుఅవవాఁడుమఱుఁగునకరుగ నత్తఱి నధవల సధవలఁ జేయఁ గంకణముకట్టుకొన్నట్టి యాపుణ్యజనుం డామఱుఁగు స్థలమునకరిగి వాని మర్మావయములఁ జూచి యేవపడి మరలుటయేకాక వాని మోసకారితనమునకు నాశ్చర్యమును, కోపమును గలిగి వానిని మందలించి తొలగించుట కెంచెను. ఇంతలో వాఁడే యంతర్హితుఁ డాయెనట."

పయిని వ్రాసినవాఁ డెవ్వఁడయినను కడపటిదానివలన వితంతుశరణాలయములోని వితంతువులు వ్యభిచారిణులనియు నందులోనే వ్యభిచారము జరగుచుండుననియు లోకులనుకొనునట్లుచేయ నుద్దేశిం

చెననుట స్పష్టమగుచున్నది. ఈ దుర్వార్తలను చదివినపిమ్మట నేను న్యాయవాదిచేత పత్రికాధిపతికి పయియట్లు వ్రాసినందుకు క్షమార్పణము చేయవలసినదనియు చేయనియెడల దండవిధి ననుసరించి యభియోగము తేఁబడుననియు నివేదనపత్రికను బంపించితిని. అది యతఁడు పట్టుకొని స్వశాఖవారగుటచే న్యాపతి సుబ్బారావు పంతులవారివద్ద కాలోచనకుఁబోఁగా, ఆయన శ్యామారావును చీవాట్లుపెట్టి తత్క్షణము క్షమార్పణము చేయవలసినదని బుద్ధిచెప్పి పంపివేసిరి. అయినను లోపల సూత్రధారులుగానుండి యాతనిచేత నాటకమాడించుచున్న మహానుభావు లాహితవచనముల నతఁడనుచరింపకుండఁ జేసిరి. మేము పంపిన నివేదపత్రిక కుత్తరముగా మూఁడవసంచిక యందిట్లు ప్రకటింపఁబడినది.

"మ. తా. రా. శ్రీ రావుబహదర్ కందుకూరి వీరేశలింగం పంతులుగారిపక్షమున మాకుఁబంపఁబడిన రిజిస్టరునోటీసుకు జవాబు.

జొన్నలగడ్డ యజ్ఞమ్మగారు, పుట్టురేవు రత్నమ్మగారు మొదలగువారు కొందఱు, పంతులవారు జందెమును తీసివేసి బ్రాహ్మణత్వమును విడిచిపెట్టుకొనుటచేత వారిగొద్దనుండి లేచివెళ్ళిరని నమ్మకస్థులగు కొందఱివలన మాకు తెలిసియుండుటంబట్టియు పంతులువారట్లు తమమతమును మార్చుకొనుటచే వితంతువులు కొందఱికి నట్టియూహ కలిగియుండవచ్చునను నమ్మికనుబట్టియు మేమాసంగతి ప్రకటించితిమి.

రెండవసమాచారము పంతులవారికి నేలాగు సంబంధించునో మాకు తెలియదు. అది మేము స్వైరిణులనుగూర్చి వ్రాసితిమి గాని మఱియొకవిధమైన యోగ్యస్త్రీలను గురించి వ్రాసినదికాదు. ఇట్టిస్థితిలో పరస్పర సంబంధములేని వేర్వేరు సమాచారములు రెంటిని నిష్కారణముగ నొకటిగాఁ జేర్చి యది తమ్మే యుద్దేశించి వ్రాయఁ

బడినదని పంతులవారు భావించుకొన్నందుకు మేము మిక్కిలి విచారించుచున్నాము."

ఇంతుమీఁద నేనాతనిపైని సంయుక్త దండవిధాయకునియొద్ద నభియోగము తెచ్చితిని. నాపక్షమున ధార్వాడ కృష్ణారావు పంతులుగారు మొదలైన న్యాయవాదులు మిక్కిలి శ్రద్ధతో పనిచేసిరి. ప్రతివాదపక్షమునను న్యాయవాదులు పనిచేసిరి. నాప్రతిపక్షులారంభదశలో నాప్రతివాదికి నూఱురూపాయలిచ్చిరనియు న్యాయవాది నేర్పఱిచిరనియు వింటిని. వారు తరువాత తమపేరెక్కడబైలుపడునో యనుభయముచేత శ్యామారావుగారిని చిక్కులో తగిలించి తాము తప్పించుకొని తొలఁగిరి. విమర్శ యయినమీఁదట సంయుక్త దండవిధాయకుఁడు శ్యామారావుగారికి వేయిరూపాయలు కాఁబోలును ధనదండనమును పదునెనిమిది మాసములు కారాగృహవాసమును విధించిరి. నే నాతనికి కొంత ధనదండనము విధింపఁబడు ననుకొంటిని గాని యింత కఠినదండనము విధింపఁబడు ననుకోలేదు. ఆతని యెడల నాకును జాలికలిగినది. విచారణ సమయములో నతఁడప్పుడప్పుడు నాకు మంచినీళ్ళు తెచ్చియు పండ్లు మొదలయినవి తెచ్చియు నుపచారము చేయుచువచ్చెను. నిర్దోషిని ముందుకుత్రోసి యిందులో నిజమైనదోషులు తప్పించుకొనిపోయిరి. అతఁడా తీర్పుమీఁద మండల న్యాయాధిపతియొద్ద నుపర్యభియోగమును తేఁగా, మండల న్యాయాధిపతులైన పార్థసారథి అయ్యంగారు కరుణించి ధనదండమును మున్నూఱు రూపాయలకు తగ్గించి కారాగృహవాస మావఱకున్నదే చాలునని తీర్పుచెప్పిరి. తన్ను తాటిచెట్టెక్కించినవారు దిగువ నిచ్చెన తీసివేసి యదృశ్యులుకాఁగా నతఁడెట్లో చందాలమూలమున నెంతో కష్టముమీఁద ధనదండనమును చెల్లింపఁగలిగెను. నాపక్ష

మున పనిచేసిన న్యాయవాదులకు నే నెంతయుఁ గృతజ్ఞుడనయి యున్నాను.

1906-వ సంవత్సరము డిసెంబరునెల 15-వ తేదిని నేను మిత్రులను నాపని కామోదించు వారిని సమావేశపఱిచి నేను స్థాపిన కార్యములను నెఱవేర్పుటకయి హితకారిణీ సమాజమనుపేర నొక సంఘమును స్థాపించితిని. దానిలో నప్పుడు చేరినవారు ముప్పదియాఱుగురు. ఈ సంఘము తరువాత 1860-వ సంవత్సరపు 21-వ రాజశాసన ప్రకారముగా లేఖ్యారూఢము చేయఁబడినది. ఈ సంఘముయొక్క ముఖ్యోద్దేశము వితంతు శరణాలయములు అగతిక శిశుసంరక్షణ శాలలు, పాఠశాలలు, శిల్పశాలలు మొదలయినవి స్థాపించి వానిని జరపుట. సభ్యులలో తొమ్మండ్రు కార్యనిర్వాహకసంఘముగా నేర్పఱుపఁబడిరి. 1907-వ సంవత్సరమునందు సమాజనిబంధనలు ప్రకటింపఁబడఁగానే, నాస్తికులు కార్యనిర్వాహక సంఘములో నుండఁ గూడదన్న నిబంధనయున్నందున నిటువంటి పక్షపాతముగల సమాజమునందు తాముండమని టంగుటూరి శ్రీరాములుగారును మఱియొకరును సభ్యత్వమును మానుకొనిరి. క్రమక్రమముగా నాస్తికులు కార్యనిర్వాహక సంఘమునందుఁ జేరి నేనుస్థాపించిన యాస్తికపాఠశాల ప్రార్థనసమాజము మొదలయినవి యెత్తివేయవలెనని కొందఱియభిప్రాయమయియుండును. ఈ సమాజవిధులు పుస్తకాంతమున ననుబంధముగాఁ బ్రకటింపఁబడును గాన నిందువివరించుట యనావశ్యకము. ఈసమాజకార్యము లవిచ్ఛిన్నముగా జరుగుటకయి యల్పమయినను నాకున్న సొత్తంతయును సమాజమున కిచ్చివేసితిని. నేనిచ్చినసొత్తు లివి:—

1. రు 6500-0-0 లు వెలచేయు పట్టణములోని మాపూర్వార్జితమైన మేడయిల్లు.

2. రు 2000-0-0 లు వెలచేయు లక్ష్మీవారపుపేటలోనియిల్లు.

3. రు 1,500-0-0 లు వెలచేయు ప్రార్థనమందిరము.

4. రు 6,000-0-0 ల వెలచేయు రంగయ్యపంతులుగారివద్ద కొన్నతోట, అందులో క్రొత్తగా కట్టఁబడిన యిండ్లు రెండు.

5. రు 6,000-0-0 లు వెలచేయు రామయ్యగారివద్ద కొన్న తోట, అందులో ములుకుట్ల అచ్యుతరామయ్యగారు కట్టించి యిచ్చిన యిండ్లు.

6. రు 1000-0-0 వెలచేయు నాపుస్తకభాండారము.

7. రు 10,000-0-0 ల వెలచేయు నాపుస్తకముల ముద్రణ స్వాతంత్ర్యము.

8. రు 2,000-0-0 ల నాభీమాపత్రము.

9. రు 2,000-0-0 లు చెరుపు సోమయాజులుగారికి బదు లిచ్చినసొమ్ము.

10. రు 1,000-0-0 లు రాయవరపు రామమూర్తిగారికి బదులిచ్చినసొమ్ము.

11. రు 3,500-0-0 లు రొక్కము.

ఈ సొత్తునకు నిక్షేపత్రమును వ్రాసి 1908-వ సంవత్సరము మేయినెల రెండవతేదీని లేఖ్యారూఢము చేయించితిని. ఈ సొత్తు నాజీవితకాలములో సమాజపక్షమున నాయధీనములో నుండవలెనని మాత్రము నిక్షేపపత్రములో వ్రాసితిని. అందులోనే వితంతు శరణాలయములోని వితంతువుల వివాహములు వారి యిష్టానుసారముగా 1856-వ సంవత్సరపు 15-వసంఖ్య రాజశాసనానుసారముగా నైనను 1872-వ సంవత్సరపు 3-వ సంఖ్యరాజశాసనానుసారముగా నైనను జరపవచ్చుననియు, వితంతుశరణాలయములో విద్యనిమిత్తము వితంతువులు కానివారిని సహితము చేర్చుకోవచ్చుననియు, ఏర్పాటుచేసి తిని. ఈ నిక్షేపపత్రము దీని కనుబంధముగా కడపటఁ బ్రకటింపఁబడి

యున్నది. నాజీవితకాలములో పుస్తక విక్రయమువలన వచ్చెడిది తప్ప నా సొంతమునకయి నే నేమియు నుంచుకోలేదు. చెన్నపట్టణములో నున్న యిండ్లను సహిత మమ్మివేసి దానిని సహితము రొక్కముగా నిచ్చివేసితిని.

దేశిరాజు పెదబాపయ్యగారి దృష్టాంతమునుబట్టి యిద్దఱు ముగ్గురు తరుణవయస్కు లనుష్ఠానిక బ్రాహ్మలగుట తటస్థించినది. బాపయ్యగారియింట సార్వజనీనమైన సంస్కార భోజనము జరిగిన దినముననే భోజనమునకుముం దక్కడకు వచ్చినవారితో నేను స్థిరముగా నిలువఁగలిగిననే భోజనమునకు రావలసినదనియు లేనియెడల పోవలసినదనియు స్పష్టముగాఁ జెప్పితిని. మాకేమియు భయములేదని యప్పుడు మహాధైర్యముతో మొదటఁ జెప్పినవారే బంధువులు బాధించినప్పుడు ప్రాయశ్చిత్తము చేయించుకొనుటలోను మొదటివారైరి. బంధువులకు భయపడక ప్రాయశ్చిత్తమునకు లోనుగాక నిలిచినవారిలో నొకరు కారుమూరు కామరాజుగారు. ఆయనకు స్వగృహము లేకపోవుటచేతను కాపురమున్న యింటివారు లేచిపొమ్మని యొత్తిడి చేయుటచేతను మఱియొక యింటికి పోవలసివచ్చెను. అల్పకాల మసౌఖ్యకరమయిన యొకయింటిలోనుండి యిబ్బందిపడుచుండఁగాఁ జూచి నేనాతనికి పట్టణములోని మాయింటిలో కాపురముండుటకు తావిచ్చితిని. ఆయింటిలోనే మాబాలికా పాఠశాలలో నుపాధ్యాయునిగా నున్నయొక యువకునకు కాపురమునకు తావిచ్చితిని. వారికుపురకును సరిపడనందున కామరాజుగారికి మాతోఁట లోనే వాసమున కిల్లిచ్చితిని. అనుష్ఠానిక బ్రాహ్మలలో నింకొకరు బాపయ్యగారి మేనమామ యైన కామరాజు హనుమంతరావుగారు; ఈయన ప్రవేశపరీక్షయందు తేఱినవారు. ఈయనబంధువుల బాధచేత ప్రాయశ్చిత్తమునకు లోనయి మరల జందెము వేసికొనినవారయినను

కాముచేసినదని యయోగ్యమయినదని యంతరాత్మ బాధింపఁగా శీఘ్రకాలములోనే పరుల బలాత్కారముచేత ధరించిన యజ్ఞోపవీతమును తన యిచ్ఛాపూర్వకముగాఁ ద్యజించి బోధనాభ్యసన పాఠశాలలోఁ జేరి యుపాధ్యాయపదమునకు శిక్షితుఁ డగుటకయి రాజమహేంద్రవరమునకువచ్చెను. ఈయుద్దేశముతోనే ప్రథమశాస్త్రపరీక్షయందుఁ దేఱి యనుష్ఠానిక బ్రాహ్మఁ డయిన కవికొండల సాంబశివరావుగారును బందరునుండి రాజమహేంద్రవరమునకు వచ్చెను. వీరిరువురకును కూడ కాఁపుర ముండుటకు మాతోఁటలోనే యిల్లిచ్చితిని. 1907-వ సంవత్సరమునందు బోధనాభ్యసనశాస్త్ర పాఠశాలలోఁ జేరి చదువుకొనుచుండిరి. వీరితోఁ గలసి కొంతకాలము బాపయ్యగారును మాతోఁటలోనే యుండిరి. కాని తరువాత రోగగ్రస్తులయి వైద్యము నిమిత్తము రాజమహేంద్రవరము విడువ వలసినవా రయిరి. ఇట్లుండఁగా నాకస్మికముగా బంగాళారాజ్యాంగసముద్రమునుండి దేశీయస్వపరిపాలన మహాతరంగ మొకటి వచ్చి యీ దేశముమీఁదఁ బడి సమస్తేతర వ్యవసాయములను ముంచివేసినది.

వంగదేశపు వక్తలలో నొక్కరయిన విపినచంద్రపాలుగారు రాజమహేంద్రవరమునకు వచ్చి దేశీయస్వపరిపాలన విషయమునఁ గొన్ని యుపన్యాసములు చేసి యువజనుల యొక్కయు విద్యార్థుల యొక్కయు మనస్సులలో నొకవిధమైన యుద్రేకమును దేశాభిమానమును గలిగించిపోయెను. లోకానుభవము విశేషముగా లేనివారగుటచేత యువజనులు తాత్కాలిక వీరావేశముచేత తలలు విరియఁబోసికొని 'వందే మాతర' మని కేకలు వేయుచు చేతులలో ధ్వజములను మెడలలో స్వదేశీ పతకములను ధరించి విచ్చలవిడిగాఁ దిరుగఁజొచ్చిరి. పాఠశాలలోని బాలురు సహిత మీయల్లకల్లోలములోఁ బడి పాఠముల నుపేక్షించి యుపాధ్యాయులను దిరస్కరించి యనే

కులు పాఠశాలనుండి తఱిమివేయఁబడిరి. మాసమాజములోఁ జేరిన యీయభినవదేశాభిమానులవలన నాకును చిక్కులును మనస్తాపములును కలుగుచు వచ్చెను. ఏయీడువారి కాయీడువారి మాటలు రుచించును గాని పెద్దవారి హితవచనములు పథ్యములుగా నుండవు. వృద్ధులు బుద్ధులు లేని శుద్ధావివేకసమృద్ధు లని యువజనుల యభిప్రాయము. రాజ్యాంగవిషయములలో నాకును మాతోఁటలో నున్నవారికిని తఱుచుగా వివాదములు జరుగుచు వచ్చెను. ఈ వాదములలో నాతో వా రేకీభవించుట సాధారణముగా సంభవింపలేదు. వారిప్పుడు విద్యార్థిదశలో నున్నవారు గనుక పరీక్షలోఁ గృతార్థులయి స్వతంత్రజీవనమును సంపాదించుకొనువఱకైనను రాజ్యాంగప్రక్షోభములోఁ బ్రవేశింపక పాఠములయందే శ్రద్ధ వహించి యుండవలసినదని వారికి నేను హితోపదేశమును జేసితిని. నాయుపదేశమును బట్టి వారు నన్ను దేశాభిమానశూన్యునిగా పరిగణించి నామాటలను పాటింపక పాఠశాలాధికారుల యాజ్ఞలను ధిక్కరించి యిరువురును పాఠశాలనుండి తొలఁగింపఁ బడిరి. దొరతనమువారి పాఠశాలలోఁ గాని దొరతనమువారి సాహాయ్యమును బొందుచున్న పాఠశాలలోఁ గాని వారిద్దఱికిని కొలువు లియ్యఁగూడదని రాజకీయవ్యవహార పత్రికయందుఁ బ్రకటింపఁబడినది. మూఁడవవా రయి స్వదేశి వస్తువుల యంగడి పెట్టిన కారుమూరి కామరాజుగారు నే నింగ్లీషువారి ప్రభుత్వమువలన హిందూదేశమునకుఁ బూర్వ మెప్పుడును లేని లాభములనేకములు కలుగుచున్నవని వాదించినతప్పిదమునకయి కొంతకాలము నాతో మాటాడుటయే మానివేసెను. మాసామాజికులలో మాతోఁటలోనున్న వారియభిప్రాయమే నా విషయ మయి యిట్లుండఁగా, తక్కిన యువజనుల యభిప్రాయమును గూర్చి చెప్పవలసిన పనియే లేదు. వారు నన్ను దేశాభిమాన రహితునిగాను తమపాలిటి

దేశాభిమానమాననీయులతోడి సాంగత్యమున కసహ్యుఁడనుగాను భావించి సంఘబహిష్కృతునితోవలె నాతోఁగలసి మెలసి యుండుట విసర్జించుచు వచ్చిరి. వితంతు వివాహములు చేసికొన్నవా రనేకులు వేఱుకారణములచేత నన్ను తమలోనివానినిగా నెన్నుకొనుట మాని వేసి పరునిగాఁ బరిగణింపఁ జొచ్చిరి. ఈ విషయములనుగూర్చి ముందు వివరముగా వ్రాయఁబడినది.

పైని వ్రాసినదానినిబట్టి రాజ్యాంగవిషయములలో నా కాదరము లేనట్లు భావింపవలదు. దేశాభివృద్ధి కనుకూలములగు సమస్త విషయములలోను నా కాదరము గలదు. నేను పదునాలుగేండ్లు వివేకవర్ధనికి విలేఖకుఁడనుగా నుండి దానిలో రాజ్యాంగవిషయకములైన వ్యాసములను వ్రాసితిని. హైందవదేశీయమహాసభ యారంభమయినప్పుడు నామిత్రులైన న్యాపతి సుబ్బారావు పంతులుగారు మొదలైనవారితోఁ గలిసి నేనును గొంతపని చేసితిని. ఆమహాసభ 1887-వ సంవత్సరమున మొదటితడవ చెన్నపట్టణములో జరగుటకు ముందు రాజమహేంద్రవరములో జరగినసభలో నేనొక యుపన్యాసకుఁడనుగా నుండి చెన్నపురి మహాసభకు నేనొక ప్రతినిధిగాఁ బంపఁబడితిని. ఆసభలో నాకు ప్రతినిధులకిచ్చుస్థానమునిచ్చియు, నామిత్రులైన సభాధ్యక్షులు దొరతనమువారి కొలువులో నుంటివన్న హేతువుచేత నాపేరును ప్రతినిధులపట్టికలోఁ బ్రచురింపక విడిచిపెట్టిరి. ఈపని నాయనుమతిమీఁద జరిగినది కాదు. 1885-వ సంవత్సరమున 'దేశీయమహాసభయు దానియుద్దేశములు' నని రాజమహేంద్రవరమునందొక యుపన్యాస మిచ్చి దానిని ముద్రింపించి విద్యావిచారణాధికారి మొదలైనవారికి సహితము పంపింతిని. మతనీతి కులాచారసంస్కారములు లేక యొక్క రాజ్యాంగసంస్కారమువలననే దేశ మభివృద్ధిపొందునని నేనెప్పుడును తలఁచినవాఁడఁగాను. దేశాభివృద్ధికన్ని

టిలోను సమానముగా పనిజరగవలెనని నాయభిప్రాయము. దేశము యొక్క యిప్పటియభివృద్ధి కింగ్లీషువారి పరిపాలనమే మూలమనియు వారిపరిపాలనము నిరంతముగా సాగుటచేతనే ముందును దేశ మభివృద్ధిని గాంచుననియు నాకు దృఢమైన నమ్మకము. నాయభిప్రాయములు తేటపడుటకయి దేశీయ మహాసభనుగూర్చి నేనిచ్చిన యుపన్యాసములోని కొంతభాగము నిందు ప్రకటించుచున్నాను—

"రాష్ట్రీయ ప్రజలమయినందున మన కుండవలసిన స్వాతంత్ర్యములను పొందుటకయి ప్రయత్నించుటకొఱకును, దానినిబట్టి మన భరతఖండమునందలి ప్రజలస్థితిని క్రమక్రమముగా నభివృద్ధి పరచుట కొఱకును, గడచిన మూఁడుసంవత్సరములనుండియు హిందూదేశమునందలి ప్రధాన నగరములయందు మహాజనసభలు జరగుచున్నవనియు, ఆసభలకు రాజ్యాంగ విషయములను ప్రసంగించుటకు జాతి మత భేదములు లేక యెల్లజాతులవారును సమస్తమతముల వారును తమతమ ప్రతినిధులను బంపుచున్నారనియు, ఆసభలయందు సమష్టిమీఁద హిందూదేశమునకు క్షేమకరములయిన ముఖ్య రాజ్యాంగ విషయములు చర్చింపఁబడి బహుజనాభిప్రాయమును బట్టి దృఢనిశ్చయములు చేయఁబడుచున్న వనియు, మీ రెఱిఁగియున్నారు గదా? సమస్తవిషయములయందును అభివృద్ధిపొందుచుండుట మనుష్యునకు సహజధర్మమయి యున్నది. మృగాదులకును మనుష్యులకును గల భేదములలో నీయభివృద్ధి విషయమైన ధర్మమొకటి. మృగాదు లభివృద్ధి లేక యెప్పుడు నేకరీతిగా నుండును; ఈవిషయమున వానికి వృద్ధిక్షయము లుండవు; వేయి సంవత్సరములక్రిందట కాకు లెట్లు గూండ్లు కట్టుచుండునో యిప్పుడు నదేప్రకారముగా కట్టుచుండును; ఇఁక ముందు వేయి సంవత్సరములు దాటినతరువాతను గూటిని నిర్మించుటయందు దేనియు నభివృద్ధిని బొందక యథాప్రకారముగానే

యెల్లకాలమును గూండ్లను నిర్మించుకొనుచుండును. మనుష్యుఁ డట్లు గాక కృషిచేయుచు వచ్చినయెడల నంతకంత కభివృద్ధి నొందుచుం డును. వేయి సంవత్సరముల క్రిందట మృగప్రాయులై గుహలయందు వాసముచేయుచుండినవా రిప్పుడు పెంకుటిండ్లు కట్టుకొని యందు నివ సించుచుండవచ్చును; ఇఁక ముందు నాగరికాగ్రగణ్యులయి దివ్యభవ నములు నిర్మించుకొని యింద్రభోగము ననుభవింపవచ్చును. ఈవిధ ముగా నభివృద్ధి పొందుటకయి కృషి యావశ్యకము. జ్ఞానహీనులయి కృషి చేయక యుపేక్షించుచు వచ్చినపక్షమున మునుపున్న స్థితియం దైన నుండక క్రమక్రమముగా హీనదశను బొందుచువచ్చి కట్టకడపట నించుమించుగా మరల మృగప్రాయులగుట సంభవించును. జ్ఞానాభి వృద్ధిని జేసికొనుచు నెడతెగక కృషిచేయుచు వచ్చిన పక్షమున, మతమునందును నీతియందును విద్యలయందును కులాచారముల యందును వస్తునిర్మాణాదులయందును సుఖసాధన కల్పనమునందును తక్కిన సమస్తవిషయములయందును మన మంత కంత కభివృద్ధి నొందుచుందుము. ఇంచుమించుగా నన్ని విషయముల యందును సమానముగా వృద్ధినొందుచుండుటయే యభివృద్ధియగును గాని తక్కిన విషయములయం దధమదశలో నుండి యొక్క విషయము నందుమాత్రము వృద్ధిచెందుట నిజమైన యభివృద్ధి కాదు. అట్టి యేక దేశాభివృద్ధివలన దేశక్షేమకరములయిన ప్రయోజనములును కలుగ వలసినంత కలుగనేరవు. మనశరీరమునందలి సమస్తావయవములును వానివాని పరిమాణమునకుఁ దగినట్టుగా నెదుగుచుండుటయే క్షేమకర మయిన యభివృద్ధి యగునో, అట్లన్ని యవయవములును సమాన ముగా వృద్ధి నొందక యొక్క తలగాని కడుపు గాని కాలుగాని లావగుటయే క్షేమకరమయిన వృద్ధి యగునో తెలిసినవారికి జన సామాన్య క్షేమలాభములకయి వృద్ధి సమస్త విషయములయందును

సామాన్యముగా నుండవలసిన యావశ్యకమును గూర్చి పెంచి చెప్ప వలసిన యక్కఱ లేదు. ఒక్కతల మాత్రి మెదిగిన దయ్యపుతలయ నియు, ఒక్క బొజ్జమాత్ర మెదిగిన బానకడుపనియు, ఒక్క కాలు మాత్ర మెదిగిన బోదకాలనియు, పేరులు పెట్టి వాని వృద్ధికి సంతోషింపక యనర్థదాయకముగా భావించి చికిత్సలు చేయింపఁబూనుకొనుట యెల్లవారికి ననుభవసిద్ధ మయినదే. అనేకావయవమయ మయిన దేహవిషయమున నెట్లో యనేకాంగ విశిష్టమయిన బాహ్యవిషయ మునందును వృద్ధి యట్లే యుండును. ధనమును తిన్నగా నుపయోగిం చుకొనఁ గలుగుట కావశ్యకమైన తెలివిని గలిగింపక కాపులను మూర్ఖ త్వములో మునిఁగియుండునట్లు చేసి వారికి ధనము దశగుణము లధిక ముగా లభించుమార్గము లేర్పఱిచిన పక్షమున దానివలన నేమి ప్రయోజనము కలుగును? తినుటకు కడుపునిండ పుష్కలముగా నన్నము లభించు సాధనములను గల్పింపక ధనము నుపయోగింపవలసిన మార్గ ములను నేయిటి నుపదేశించిన పక్షమున నందువలన నేమి ప్రయోజ నము కలుగును? బయుల రాజ్యాంగ విషయకములైన స్వాతంత్ర్య ములు లక్ష లభించినను గృహమునం దానంద భంజకములయిన దుర్మ తదురాచార పిశాచములకు దాస్యము చేయవలసి యుండినయెడల నేమి సౌఖ్యము కలుగఁబోవును? ఇంట సంతోషదాయకములైన సన్మతసత్కులాచార స్వాతంత్ర్యములను గలవాఁడయి యున్నను ధన ప్రాణరక్షణము చేయని నిరంకుశ దుష్టప్రభుత్వమునకు బయలదాస్యము చేయుచుండవలసి యుండినయెడల నేమి సుఖముకలుగును? వృద్ధిసమ స్తవిషయములయందును తగిన విధముగా నున్నప్పుడే దేశమునకు నిజమైన క్షేమలాభములు కలుగును గాని యేదో యొక విషయము నందు మాత్ర మభివృద్ధి సంభవించినందునఁ గలుగవు. కాఁబట్టి రాజ్యాంగవిషయమైన స్వాతంత్ర్యములతోడిపాటుగా జ్ఞాననీతుల

విషయమును మతవిషయమునను కులాచారవిషయమునను గూడ నభివృద్ధి నొందుచుండుట యత్యంతావశ్యకము. క్రూరములైన కులాచారములకు దాసులమయి మనయింటనుండు స్త్రీలకష్టములను నివారింపలేనివారము రాజ్యాంగస్వాతంత్ర్యములనుపొంది దేశముయొక్క కష్టముల నెట్లు నివారింపఁగలుగుదుము? మతవైషమ్యమును వహించి యైకమత్యమును త్యజించి యొండొరులను ద్వేషించుచు తగవులాడుచుండెడివారము రాచరికపు సంబంధమయిన స్వాతంత్ర్యములను పొందినప్పుడు జాతిమత వైషమ్యములు విడిచి యెట్లు సర్వజన క్షేమమునకయి యైకమత్యముతో పాటుపడఁగలుగుదుము? కాఁబట్టి జాతి మత ద్వేషమూలములు గలిసి పెరుగుచున్న దురాచార వృక్షమును మూలచ్ఛేదము చేయుటకయి ప్రయత్నింపక రాజ్యాంగ విషయకములైన స్వాతంత్ర్యములను పొందుటకై లక్ష ప్రయత్నములు చేసినను వానివలన పూర్ణమైన యైకమత్యమును నిష్పాక్షిక దృష్టియుఁ గలుగ నేరవు. ఇవి రెండును గలుగకున్నంత కాలము నిజమైన దేశ క్షేమాభివృద్ధులు కలుగవు. ఈ విషయమున నే నింతదూరము చెప్పుటచేత మతాచార కులాచార సంస్కరణమునందు సంపూర్ణ దశను పొందువఱకును రాజ్యాంగ సంబంధములయిన స్వాతంత్ర్యములను పొందుటకయి ప్రయత్నింపగూడదని నా యభిప్రాయమయినట్లు మీరు భ్రమింపఁ బోకుఁడు. సమస్త విషయములయందును యుక్తరీతిని కృషిచేయుచుండవలసిన దనియే నాయభిప్రాయము. కులాచార మతాచారములయం దంతటికిని నైకమత్యము కలుగ నేరదు. పరస్పర విరుద్ధములయిన వివిధమతములును వివిధకులములును శాఖోపశాఖలుగానున్న యీ దేశమునం దెవరి మతములోను కులములోను గల దురాచారములను తొలఁగించుటకయి యాయా మతములోనివారును కులములోనివారును ప్రత్యేకముగాఁ గృషి

చేయవలసినదే గాని యన్ని మతములవారును గలిసి చేయవలసినపని లేదు. ఒక్క రాజ్యాంగవిషయమైన స్వాతంత్ర్యములు మాత్రమే సర్వజాతి మత సామాన్యాపేక్షణీయములై యున్నవి. కాబట్టి యీయొక్క విషయమునందు మాత్రమే హిందూదేశములోని సకలజనులు సంఘీభవించి జాతిమత వర్ణభేదములతో పనిలేకుండ నన్యోన్యక్షేమ సంపాదనము నిమిత్తమైకమత్యముతో పాటుపడుట సాధ్యమగును, ఇది విచారించియే మనదేశమందలి విద్యాధికులైన బుద్ధిమంతు లనేకులాలోచించి కృషిచేసి కడచిన నాలుగు సంవత్సరములనుండియు దేశీయమహాసభను స్థాపించి వ్యయప్రయాసములను పాటింపక సర్వజనక్షేమాభివృద్ధులనిమిత్తమయి పాటుపడుచున్నారు.

సర్వజనోపయుక్తమయిన యీ మహాసభయొక్క యుద్దేశములను గూర్చియు, దీనివలనఁ గలుగ నపేక్షించిన ప్రయోజనములనుగూర్చియు, దీనివిషయమయి యెల్లవారును జేయవలసిన కృత్యములను గూర్చియు ఈవఱకు సమావేశమయిన మూఁడుసభలలోను జేయబడిన నిశ్చయములను గూర్చియు నే నిప్పుడు కొంత ప్రసంగింపఁ బోవుచున్నాను. మీరందఱు సావధాన మనస్కులరయి చిత్తగింపవలయును.

ఈసభయొక్క ప్రధానోద్దేశములు ముఖ్యముగా మూఁడని చెప్పవచ్చును. అందు మొదటిది నేఁటివఱకును జాతి మత కులాచార భేదములచేత విడివడి యైకమత్యము లేక యున్న హిందూదేశములోని పలుతెగలుగా నున్న మహాజనుల నందఱి నొక్కటిగా కలిపి దేశాభిమానము పుట్టించుట. రెండవది యీ ప్రకారముగాఁ జేరిన మహాజనులలో జ్ఞాన నీతి కులాచార వ్యవహారాదులైన సమస్తశాఖలయందును గ్రమక్రమముగా నభివృద్ధిని కలిగించుట. మూఁడవది హిందూదేశముయొక్క క్షేమమునకు

భంగకరముగాను న్యాయవిరుద్ధముగాను నున్న యవస్థలయందు సవరణను కలిగించుటవలన నింగ్లాండు దేశమునకును హిందూదేశమునకును గల యనుబంధమును మఱింత దృఢపఱుచుట. ప్రభుత్వము వారియెడల ప్రజల కనురాగాభివృద్ధి చేయుట యన్న యీ యుద్దేశమిందుఁ గడపటఁ జెప్పఁబడినను, ప్రాధాన్యమునుబట్టి యీ సభవారి యుద్దేశములలో నిదియే మొదటిదని చెప్పవలసియున్నది. ఓర్వలేనివారు కొందఱీ సభకు ముఖ్యకారకులుగా నున్నవారి యుద్దేశము జనులను పురికొల్పి వారికి దొరతనమువారిమీఁద ద్వేషమును పుట్టించుట యని నిష్కారణముగా దోషారోపణముచేసి లేని యపవాదమును వేయుచున్నను, కొంచెమాలోచించి చూచు వారికందఱికిని వారివాక్యములు సత్యమునకు మిక్కిలి దూరములైనవని బోధపడకపోవు. ఇంగ్లీషువారి ప్రభుత్వమువలనఁ గలిగిన ముఖ్య ఫలముల ననుభవించువారు సాధారణముగా మన దేశములో విద్యాధికులే కదా? ఈ సభాస్థాపనమునకు ముఖ్య ప్రోత్సాహకులుగా నున్నవారును విద్యాధికులే కదా? పూర్ణప్రభుత్వమువలని యనంత లాభముల ననుభవించుచున్న యీవిద్యాధికు లకారణముగా కృతఘ్నులయి స్వలాభమునకును దేశక్షేమమునకును భంగకరముగా దొరతనమువారిమీఁద తిరుగఁబడునట్లుగా మూఢజనులను బురికొల్పుదురన్న నివేకులైనవా రెవ్వరైన విశ్వసింపఁ దగి యుండునా? కలలోను విశ్వసింపఁ దగి యుండదు. వారియుద్దేశ మెప్పుడును మూఢులయి యింగ్లీషు ప్రభుత్వమువలని లాభములను దెలిసికోలేక యతృప్తివహించుచున్న సామాన్యజనులకు వారనుభవించుచున్న లాభములు బోధపడునట్లుచేసి రాజభక్తిని బురికొల్పి మహాజనులలో నైకమత్యమును కలిగించి దొరతనమువారిని ప్రార్థించి వారి యనుగ్రహమువలన నూతన స్వాతంత్ర్యములను బొందుటకై

ప్రవర్తించునట్లు చేయుటయు, అందువలన స్వలాభమును దేశ క్షేమమును వృద్ధిపఱుపఁ గోరుటయు, నయియుండునుగాని వేఱువిధముగా నుండునా? మన దేశాభివృద్ధి నుద్దేశించి పరమదయాపరుఁడైన యీశ్వరుఁడు ప్రసాదించిన యీ యింగ్లీషు ప్రభుత్వ మహిమనుబట్టి కాని, కాకపోయినయెడల మన మీ దినమున నిట్లు సభకూడి యింద ఱ మైకమత్యముతో రాజ్యాంగ విషయములనుగూర్చి నిర్భయముగాఁ బ్రసంగింపఁ గలుగుదుమా? మన దేశమునం దింగ్లీషువారి ప్రభుత్వము నెలకొనక ముందు నిరంకుశాధికారముగల కొందఱు దుష్ట ప్రభువులు జరిగించిన దౌర్జన్యములను దుర్ణయములను దలఁచుకొన్న దేహ మిప్పుడును గంప మొందుచున్నది. ఆ కాలములో ధనమునకుఁ గాని మానప్రాణములకుఁగాని రక్షణము లేదు; న్యాయ మంతయు ధనము నాశ్రయించి యుండుటచే బీదల కది లభించుట కలలోని వార్తగా నుండెను; బండవాఁడు రాజుకంటెను బలవంతుఁడు; ఈ ఈ భరతఖండములోని చేరువ దేశములకు సహితము సరకులు మొదలయినవి కొనిపోవుటకుఁ దగిన మంచిమార్గములు లేవు; ఉన్న యడవిమార్గములు కొన్నియు వ్యాఘ్రాది ఘాతుక మృగములతోను ఘాతుకమృగములకంటెను క్రూరులైన దొంగలతోను నిండియుండుచు వచ్చెను; అందుచేత తీర్థయాత్రాపరులు సహితము తా మిల్లు వెడలునప్పుడు మరణకాలమునం దప్పగించునట్లుగా ఋణధనాదులను బిడ్డల కప్పగించి మృతులకై యేడ్చునట్లు బంధు మిత్రాదులు రోదనములు చేయుచుండఁగా బయలుదేఱుచుండిరి; కాశికిఁబోయినవాఁడును కాటికిఁబోయినవాఁడును సమానమన్న లోకోక్తి మీ రెవ్వరును వినుచుండలేదా? ఆ కాలమునందు సేవ్యముకాక సారవంతములైన భూములు సహితము అనేకములు బీడుగా విడిచిపెట్టఁబడుచుండెను; నీటిభియాధారములు క్రొత్తవి నిర్మించుట లేక పోఁగాఁ బూర్వ

కాలమునందున్నవి సహితము బాగుచేయించువారు లేక యుపేక్షింపఁబడి పాడగుచుండెను; క్షామములు సర్వసాధారణము లగుచుండెను; సామాన్యజనులు విద్యాగంధ మెఱుఁగక యజ్ఞానాంధకారములో గ్రుడ్డివారివలె సంచరించుచుండిరి. గాఢాంధకారములో మెఱుపు మెఱిసినట్లు దైవికముగా మంచి రాజొకానొకఁ డప్పుడప్పుడు వచ్చుచు వచ్చినప్పుడు జనుల కల్పసౌఖ్యము కలుగుచు వచ్చెను, ఆమేలు తడవు నిలుచునదిగాక సామాన్యముగా దేశమును విపదంధకారమే క్రమ్ముకొని యుండెను; ఆకాలమునందొకఁడు గ్రామాంతరము పోయినయెడల మరల వచ్చి కంటఁబడుదాఁక వాని క్షేమవార్త బంధువులకు తెలియకుండెను.

పురాణములయందు వర్ణింపఁబడిన చిరకాల జీవులవంటివారెవ్వరైన నుండి యీ భరతఖండముయొక్క వెనుకటి స్థితినిగూడ జూడఁ గలిగినపక్షమున అప్పటి భరతఖండమునకును మన యిప్పటి భరతఖండమునకును నరకమునకును స్వర్గమునకును ఉన్నంత వ్యత్యాసమున్నదని చెప్పకపోరు. ఆకాలపుస్థితిని జూచి యుఁడనందున నిప్పటివారి కనేకుల కా స్థితి దురవగాహ మయి యున్నది. శత సంవత్సర పరిమితమయిన యింగ్లీషువారి సత్పరిపాలనమువలన మన మిప్పు డనుభవింపఁ గలిగిన సుఖసాధనముల ననేకములను మన పూర్వులు స్వప్నావస్థ యందైనను వినియు కనియు నుండరు. కాశిలోని వారి క్షేమసమాచారమును తంత్రీముఖమున నూఱులకొలఁది క్రోసులదూరములోనున్న యిచ్చటివారు నిమిషములోఁ దెలిసికోఁ గలుగుదురని నూఱు సంవత్సరముల క్రిందట నెవ్వరూహింపఁగలరు? ఆసేతు హిమాచల పర్యంత భూభాగమునం దెక్కడనున్నను బంధుమిత్రాదుల క్షేమసమాచారములను దెలిపెడి యుత్తర ప్రత్యుత్తరములను కానిచీటితో కొన్ని దినములలోఁ దెప్పించుకొనుట సాధ్య

మగుననని నూతేండ్లక్రిందట నెవ్వ రూహింపఁగలరు? ఆవిరి సాహాయ్యముచేత నడపఁబడెడి యోడలలోను బండ్లలోను నీటిలోను మెట్టను వందలకొలదిఁ క్రోశములదూరము నొక్కదినములో ప్రయాణముచేయుట సంభవించునని శత సంవత్సరములక్రిందట నెవ్వ రూహింపఁగలరు? అప్పటివారి యూహాకందని సౌఖ్యములను సహితము మనమిప్పుడు సర్వ సాధారణముగా ననుభవించుచున్నాము. ఇప్పు డించుమించుగా ధనప్రాణములకు సంపూర్ణ రక్షణము కలిగి యున్నది; న్యాయము కోటీశ్వరుఁడు మొదలుకొని కూటిపేదవఱకును సమానమయియున్నది; ప్రతిదేశమునందును మృగచోరభయాదులు మృగ్యములైన వారు లేర్పడుటయే కాక వాయువేగమున మనుష్యులను వాణిజ్య వస్తువులను గొనిపోవు ధూమశకట మార్గములు కూడ బహుదేశములయందు వ్యాపించియున్నది; అందుచేత కాశ్యాది దూర తీర్థయాత్రలు చేయుట పొరుగూరికిపోయి వచ్చుట వంటిదైనది; నదుల కడ్డ కట్టలు కట్టి కాలువలు బహుముఖములఁ బ్రవహింపఁజేయుటవలన తొంటి యూషరక్షేత్రములిప్పుడు వరిపండెడు దివ్యక్షేత్రములయినవి; పూర్వపురీతి క్షామముల కిప్పుడు క్షామము వచ్చుచున్నది: క్షణకాలములో వేలకొలఁది యోజనముల దూరమునుండి వార్తలను మనోవేగమునఁ గొని తెచ్చెడు తంత్రీవార్తాహరణ కార్యస్థానము లన్ని గొప్పపట్టణముల యందును స్థాపింపఁబడినవి. నిరుపేదలు సహితి మత్యల్ప ధనముతో నచిరకాలములో బంధుమిత్రాదుల యోగక్షేమములను పత్రికాముఖమునఁ దెలిసికొనుట కనుకూలములైన పోషణ కార్యస్థానము లల్పగ్రామములయందు సహితము నెలకొల్పఁబడినవి; వాణిజ్యాదులు వృద్ధినొంది ద్వీపాంతరములయందలి వింత వస్తువులు సహితము కురటిపంటలైనవి. ఇవి యన్నియు నిట్లుండఁగా నెల్లయెడలఁ బాఠ

శాలలు స్థాపింపఁబడి పూర్వకాలమందు కొన్ని జాతులవారి కందని బ్రాహ్మణ పండుగా నుండెడి విద్యాధన మిప్పు డజ్ఞా నాంధకారములోఁ జిరకాలమునుండి యుండి యున్న వారికన్నులు మిఱుమిట్లు కొనునట్లుగా నెల్లయెడల వెదజల్లఁబడు చున్నది. అమూ ల్యమయిన యీవిద్యా ప్రభావముచేతనే కదా కడచిన మూఁడు సం వత్సరముల నుండియు జాతిమత వైషమ్యమును లేశమాత్రమును వహింపక, ఆసేతు హిమాచల పర్యంత హిందూదేశమునంగల హిం దువులును, మహమ్మదీయులును, క్రైస్తవులును, పారసీకులును, బౌ ద్ధులును, జైనులును, ద్విజులును, శూద్రులును ద్రావిడులును, గౌళులును దేశక్షేమమునిమిత్తమయి ధనవ్యయమునకును శరీర ప్రయాసమునకును సహించి దూరదేశప్రయాణములు చేసి యేఁటేట నొక్కొక్క పట్ట ణమున నొక్క మందిరమున సోదరులవలె సంభాషింపఁ గలుగుచు న్నారు. అయస్కాంతము సూదులు నాకర్షించునట్లుగా విద్యాబుద్ధి సంపన్నులైన సూత్రులకొలఁది భిన్న దేశీయులను భిన్నమతస్థులను భిన్నభాషలవారిని నిట్లొక్క స్థలముల కాకర్షించి యొక్క సభామం టపమున నొక్క భాషలో మృదుమధుర గంభీర వాగ్గుంభనలతో దేశలాభము నిమిత్తమయి వారిచేతఁ బ్రసంగములు చేయించుచున్నది యింగ్లీషువిద్య యను సమ్మోహనమంత్రముగాక మఱియేది? ఇంత పఱకును జాతిమత ద్వేషములచేత నొకరి నొకరు తాఁకుటకును నొక రితో నొకరు సంభాషించుటకునుగూడ సంశయింపవలసిన స్థితియం దుండిన నానావిధముల వారి నొక్కచోట సమావేశపఱచి, ఆప్త బంధువులవలె నేకాసనములఁ గూర్చుండఁ బెట్టి యేక కుటుంబములోని వారివలె జనసామాన్య క్షేమము నిమిత్తము సంభాషింపఁ జేసి, స్వ ప్రయోజన పర్వతమును పోఁద్రోలి యైకమత్యమును నేర్పుచు హిం దూదేశమునకుఁ బ్రొత్త ప్రాణము పోయుచున్నది పూజాణభాషారూప

మయిన సంజీవనీ విద్యగాక మఱియేది? ఈభాష యమృత వర్షము కురియునట్లుగా నెల్లయెడల వెదచల్లుచున్న యుత్తమజ్ఞానమును, పరిశుద్ధనీతిని, నిర్మలధర్మతత్వమును, మానుష స్వాతంత్ర్యస్వరూపమును, చవిగొన్నతరువాత నెవ్వరు తమ తొంటి యజ్ఞానజన్యమయిన వైమత్యాభావమును స్వార్థపరత్వమును దురభిమాన ద్వేషమునను త్యజించి పరస్పర భ్రాతృవాత్సల్యముతో సంఘీభవించి మానుష స్వభావార్హము లయిన స్వాతంత్ర్య ఫలములను పొందకుండఁ గోరుదురు? ఎల్లవారల హృదయములయందు నదృశ్యముగా నడుచుచున్న యీ యద్భుతమైన మార్పును జూడఁగా నిది యేమో మహేంద్రజాలమువలెఁ గానఁబడుచున్నది. ఇంగ్లీషువిద్యయొక్కయు నింగ్లీషు ప్రభుత్వముయొక్కయు ఘనతను శక్తిని ఘోషించుటకు యింతకంటె వేఱేమి కావలెను.

ఈవఱకు దేశమునకు సంప్రాప్తములయిన ప్రభుత్వములలో నెల్ల నీ యింగ్లీషు దొరతనము సర్వోత్కృష్టమయినదని భాషించుటచేత దీనియం దేవిధమయిన లోపములును లేవని నేను చెప్పఁదలచినవాఁడను గాను. ప్రపంచములోని దేదియు సంపూర్ణముగా నిర్దుష్టమయి యుండదు. ఇంగ్లీషుప్రభుత్వమునందును లోపము లనేకము లున్నవి.

పాలుగారి యుపన్యాసములవలనఁ గలిగిన దేశాభిమానము యుక్తాయుక్తవివేకము లేక యింగ్లీషువారిని వారి ప్రభుత్వమును గర్హించుటయే కాక యింగ్లీషు ప్రభుత్వపక్షమున మంచిమాట చెప్పిన వారిని దూషించునటకును వచ్చినది. ఈ యువజనుల దృష్టియం దింగ్లీషు వారిని దూషించినవాఁ డెల్లను విద్య లేనివాఁడయినను సద్వర్తనము లేనివాఁడయినను దేశాభిమానమాననీయుఁడుగాఁ గనబడుచుండెను; హత్య చేసినవాఁడయినను చేసిన హత్య

యింగ్లీషువాని నైనపక్షమున పూజనీయుఁడుగా నుండెను; ప్రార్థన సమాజ ప్రముఖులలో నొక్కరైన నాళము కృష్ణారావుగారు రాజద్రోహియు నరహంతకుఁడు నైన కుదిరాంబోసుయొక్క ఛాయాపటమును దెచ్చి పురమందరములో నాపేరిటనున్న పఠనమందిరములో వ్రేలాడఁదీయుటయే కాక యెవరు చెప్పినను దానిని తీసివేయకపోయెను. ఇది యాధారము చేసికొని నాప్రతిపక్షులుగా నున్నవారు రాజద్రోహుల సమూహమునకు నేను నాయకుఁడనని కరగ్రాహి మొదలయిన యూరపియనులతోఁ జెప్పఁ జొచ్చిరి. ఈ పటమునుగూర్చి యది యేల పఠనమందిరములో తగిలింపఁబడినదో తెలుపవలసినదని మండల కరగ్రాహి నాపేర వ్రాసెను. నాళము కృష్ణారావుయొక్క యవివేకమువలన పట మందు తగిలింపబడి తరువాత తీసివేయఁబడినదనియు, ఊరక నా పేరు పెట్టుటయే కాని యా పఠనమందిరమునకును నాకును సంబంధ మేమియు లేదనియు, స్త్రీల కుపయుక్తము లయిన పుస్తకములను వార్తాపత్రికలను వారి యిండ్లకుఁ బంపి దేశాభివృద్ధికిఁ బాటుపడెడు మనివాను నేను చెన్నపట్టణములో నున్నప్పుడు వ్రాయఁగా నమ్మి మందిరము నుపయోగించుకొనుట కంగీకరించితిననియు, పఠనమందిరమువారు తమ తొంటి యుద్దేశములను విడిచి రాజ్యాంగములలోఁ బ్రవేశించెడు పక్షమున పఠనమందిరము నందుండి వేఱుచోటికి తీసికొనిపోవలసిన దని నివేదనము నాపేర దనియు, నే నావఱకు కత్తరము వ్రాసితిని. ఇట్లు వ్రాసినందుకు నాళము కృష్ణరావుగారికి నామీఁద నెంతో యాగ్రహము వచ్చెను. పఠనమందిరమునకు నాపేరు తీసివేయవలసిన దనియు నేను కార్యదర్శికి వ్రాసితిని. ఈ విషయమయి మొదట నాకు వ్రాసిన మండల కరగ్రాహితోను తరువాత నాయొక స్థానమున వచ్చిన యింకొక మండలకరగ్రాహితోను ఉత్తర ప్రత్యుత్తరములు నడచినమీఁదట

ఛాయాపటోద్బంధన విషయ మప్పటికి ముగిసెను. 'రాజద్రోహపక్షమువారికి మీరు నాయకులఁటకారా' యని రాజమహేంద్రవరమునందలి యనుగత కరగ్రాహులైన బ్రాడ్వెటుదొరగారు నన్నడిగిరి. ప్రార్థనసామాజికులలో కొందఱప్పుడు తా మవలంబించిన మత సిద్ధాంతములనే పూర్ణముగా మఱచిపోయిరి. ఆసిద్ధాంతములలో నొకటి సర్వజన సహోదర భావము. ఈ సిద్ధాంతమునుబట్టి యింగ్లీషువారును మనసహోదరతుల్యములయి యుండఁగా న్యాయముగా నైనను అన్యాయముగా నైనను వారిని పరిహసించినవాఁడును హింసించినవాఁడును దేశాభిమానియైన మహాత్ముఁడని సామాజికులు భావించుట యెంతయు శోచనీయము. 1907 వ సంవత్సరము సాంఘికసభ కధ్యక్షతను వహించుటకు నేను కొమ్మురువల్లియు భీమవరమును వెళ్ళినప్పు డక్కడ బోడి నారాయణరావుగారును మఱికొందఱును మూఢజనుల ముందఱ నింగ్లీషువారి రక్తమును ప్రవాహములు కట్టించవలె నని యుపన్యసించుచుండఁగా వినుట నాకు కర్ణకఠోరముగా నుండెను. నాయుపన్యాసమునం దేదో సంబంధమును తెచ్చి యీవఱకింగ్లీషువారు మన దేశమునకు చేసిన మహోపకారమునకు వారియెడల మనము కృతజ్ఞులమయి యుండవలయు ననియు వారిని మనము ద్వేషింపక మన స్వాతంత్ర్య సంపాదనమునిమిత్తము ప్రభుత్వము వారికి వినయముతో విన్నవింపవలయుననియు నేను చెప్పితినిగాని నాహితోపదేశము లట్టివారి చెవుల కెక్కినవి కావు. తరువాత 1908-వ సంవత్సరము ఏప్రిల్ నెల 18-వ తేదిని నే నాంధ్ర పరిశుద్ధాస్తిక మహాసభలో నగ్రాసనాసీనత్వమును వహించుటకు బందరుపురమునకు వెళ్ళినప్పు డీనూతనావేశము మనస్సులో నుంచుకొని యిట్లు చెప్పితిని.—

"నిజమైన దేశాభిమానమునకు మాఱుగా ననేకులలో మన దేశమునం దిప్పుడొక విధమైన దురభిమానము వ్యాపించుచున్నది.

ఈదురభిమాన బలముచేత మనదేశమునందలి దురాచారములు సహితము సదాచారములుగా పొగడఁబడుచుండుటయు నితర దేశములవారి సదాచారములుకూడ దురాచారములుగా తెగడఁబడుచుండుటయు సంభవించి నిజమైన దేశాభివృద్ధికి భంగము గలుగుచున్నది. ఈ దురభిమానము పరదూషణమునకును ద్వేషమునకును గారణమయి మతధర్మమునకు శత్రువయి దేశాభివృద్ధికి భంగకరమయి యనర్థదాయకమగుచున్నది. ఈ యపూర్వ దేశాభిమానులు మూఢజనుల మెప్పునకయి స్వదేశీయమైన దానినెల్ల బట్టువలె భూషించుచు విదేశీయమైనదానినెల్ల ద్వేషించుచు దేశాభివృద్ధికయి యాత్మశ్లాఘనలు గాక సత్యమును న్యాయమును ప్రేమమును గావలెనని పలుకువారిని దేశద్రోహులనియు సత్కార్యభీరువులనియు దూషించుచున్నారు. ఇట్టివారు సత్యమత ధర్మమునకు విరోధులు. ఇట్టి దురభిమానులు వాగాడంబరము వలన మనదేశమభివృద్ధిపొంది స్వస్వాతంత్ర్యలాభములనొందఁజాలదు. దేశాభివృద్ధికి నిజమైన యీశ్వరభక్తులు కావలెను. పరిశుద్ధమైన ఈశ్వరభక్తి గలవారు మాత్రమే స్వార్థపరిత్యాగులయి కార్యశూరులయి సత్యన్యాయకారుణ్యాదులైన యమోఘ సాధనములను గొని యీశ్వరధర్మధ్వజమును దాల్చి పోరాడఁ గల్గుదురు. ఈశ్వరభటుల మున్న నమ్మకము లేక దురభిమానపూరితులైన వాక్శూరులు స్వార్థత్యాగము కావలసివచ్చినప్పుడు మూలమూలల నొదుగుచు తమ పరదూషణపాండిత్యము కష్టసమయములయందు తమకు తోడుపడక పోఁగా భీరువులయి యదృశ్యులగుదురు. ఇట్టివారి కార్యసాధకత్వమంతయు పరదూషణములతోను స్వశ్లాఘనలతోను ద్వేషప్రధానములైన పాటలతోను ధ్వజపటములతోడి యూరేగింపులతోను నిండి యుఱుములతోను మెఱుములతోను పూర్ణమై చినుకు

లేని శుష్క మేఘాడంబరమువలె క్రియాశూన్యమయి పర్యవసించును. ................పరిశుద్ధాస్తిక మతావలంబుల మని చెప్పుకొనెడు మన మెప్పుడును దేశాభిమానము పేరు చెప్పి కాని మఱియే సత్క్రియ పేరు చెప్పి గాని యన్యులను ద్వేషింపఁగూడదు.''

పయిమాటలు చెప్పినందుకయి యనుష్ఠానిక బ్రాహ్మలలో నొక రాజసభలో నాకు "పిఱికిపంద" యను నూతన బిరుదాంకము ననుగ్రహించిరి. అప్పు డక్కడి మండలకరగ్రాహి శాంతుఁ డయి సాగనిచ్చినంతవఱకు వాక్శూరులు విచ్చలవిడిగా విజృంభించిరి గాని క్రొత్తమండల కరగ్రాహి వచ్చి కొంచెము నిగ్రహప్రయోగమునకు ప్రారంభింపఁగానే మంత్రప్రయోగము చేసినట్టుగా వీ రందఱును రాజభక్తులుగా మాఱిపోయిరి. సంస్కారాభిమానులు బృందావన పురములో విందు చేయుటకు ప్రయత్నించిరి గాని శ్రీభోగరాజు పట్టాభి సీతారామయ్యగారి లోపల జరిగినవిందులో నాతిథ్యకర్తయు, ముటుకూరి కృష్ణారావుగారును, రామాచారిగారును, పావకేశ్వర రావుగారును మఱియొకరును పంచపాండవులవలె నయిదుగురు మాత్రమే నాతోఁ గలిసి సోదరప్రీతిభోజనమును గావించిరి.

అనుష్ఠానిక బ్రాహ్మల మనుకొనెడువారు కొందఱు సమాజము నందలి యితర సోదరులయెడఁ జూపెడు సౌభ్రాత్రమును ధనవ్యవహారములోని సారళ్యమును జూపుటకయి యొక చిన్నసంగతి నిం దుదాహరించుచున్నాను. నేను చెన్నపట్టణగృహములను విక్రయించి సొమ్ము తెచ్చిన క్రొత్తలో నాళము కృష్ణారావుగారు మామిడి దేవేంద్రుఁడుగారిని వెంటఁబెట్టుకొని మాతోఁటకు వచ్చి యీయన యింగ్లండునకుఁ బోనున్నాఁడు గనుక రూపాయలు కొన్ని నూఱు లప్పియ్యవలసిన దని యడిగిరి. మీవద్ద నేఁబది యఱువదివేల రూపా

య లుండఁగా మీరేల యియ్యరాదని నేనడిగితిని. తమ సొమ్ములో నుండి యిప్పుడు తీయుటకు వీలుపడదనియు, అతఁడు ధనవంతుఁడై నందున నింగ్లండు చేరఁగానే రెండు మాసములలోనే యాయన యన్నగారిచ్చట సొమ్మిచ్చివేయుదు రనియు, సొమ్మునకు భయము లేదనియు చెప్పిరి. నే వీవఱకీయన నెప్పుడును చూచియుండక పోవుటచేత మొగమెఱుఁగనివానికి నే నప్పియ్యఁజాల ననియు, కావలసిన యెడల మీరడిగినప్పుడిచ్చునట్లు వాగ్దానపత్రమును నాకు వ్రాసి యిచ్చి పుచ్చుకొని సొమ్మాయనకు మీరే బదులియ్యవచ్చు ననియు చెప్పితిని. అట్లు చేయుటకు సమాధానము లేక మిత్రుని వెంటఁగొని యాయన మాతోఁట విడిచి వెడలిపోయిరి. అటు తరువాత కొన్నిదినములకు కృష్ణారావుగారు మరల మాతోఁటకు వచ్చి మిత్రుని నావల నిలిపి తాను మాత్రము నాగదిలోనికి వచ్చి, మొదట కోరినన్ని రూపాయ లిప్పు డక్కఱ లేదనియు, ఇన్నూట యేఁబది రూపాయలు మాత్ర మిచ్చిన చాలుననియు, ఆసొమ్ము బదులీయ వలసినదనియు, నన్ను మరలఁ గోరిరి. ఎంత మొత్తమయినను తెలియనివారికి నేను బదులియ్యననియు, మీరు పత్రము వ్రాసి యిచ్చి సొమ్ము గొనిపోవచ్చుననియు, నేను మొదటివలెనే చెప్పితిని. ఆయన నేను కోరిన ప్రకారముగా అడిగినప్పుడిచ్చునట్లుగా వాగ్దానపత్రము ను వ్రాసి యిచ్చి సొమ్ముఁ గొనిపోయిరి. చెప్పిన గడువు ప్రకారముగా రెండు మూఁడు మాసములు మాత్రమే కాక దానికి ద్విగుణ త్రిగుణ కాలముకూడఁ గడచిపోయినది; సొమ్ము వచ్చు జాడ కానరాలేదు. ఎన్నిసారు లడుగఁ బంచినను వారిచ్చినప్పుడు సొమ్మిచ్చెదనని యడుగఁబోయినవారితోఁ జెప్పుచు వచ్చుటయె కాని యంతకంటె వేఱు సదుత్తరము రాలేదు, గడువుపెట్టిన రెండు మాసములును దాదాపుగా రెండు సంవత్సరము లయినవి. అడుగుట కాయన

నాకు దర్శన మియ్య మానివేసిరి, ఈలోపల దేవేంద్రుఁడుగా రింగ్లం డునకుఁ బోవుటయు నయినది; పోయి తిరిగివచ్చుటయు నైనది. ఒక నాఁటిరాత్రి నేను తటవర్తి నారాయణరావు నాయఁడుగారి చెల్లెలి వివాహసంబంధమున జరిగిన విందులో నాళము కృష్ణారావుగారిని కలసికొనుట తటస్థించెను. నేనప్పు డాయనను సొమ్ము విషయమయి గట్టిగా నడిగితిని. సొమ్ము తాను వాడుకొన లేదనియు వాడుకొన్న వారిచ్చిన ప్పుడిచ్చెదననియు వెనుకటి యుత్తరమునే చెప్పిరి. వారినితొందర పెట్టి సొమ్ము పుచ్చుకోవలసినదనియు, వారియ్యనియెడల వాగ్దానపత్ర ప్రకారముగా నాకియ్యవలసిన సొమ్ము నాకిచ్చివేసి తరువాత వారి వల్ల రాఁబట్టుకోవలసిన దనియు నేను చెప్పితిని. వెనుక నొకసారి యడిగినప్పుడు వారికి కోపము వచ్చినందున నేనిఁక వారిని సొమ్ము డుగఁ దలఁచుకోలేదనియు, తమంత వారిచ్చిన నిచ్చెద లేకపోయిన లేదనియు, ఆయన ఖండితముగాఁ జెప్పిరి. ఈప్రకారముగా ఘర్షణ జరగినమీఁదట కొన్ని దినములకు నేనాపత్రమును న్యాయవాదియొద్దకి పంపి ముందుగా కృష్ణరావుగారికి నివేదనపత్రము నంపి తరువాత న్యాయసభలో వ్యాజ్యము తేవలసినదని యుత్తరము వ్రాసితిని. న్యాయవాది కృష్ణరావుగారి బంధువులతో చెప్పఁగా వారాయనను రెండుగడువులలో నాసొమ్ము నాకుఁ బంపునట్లు చేసిరి.

ఇఁక వితంతు వివాహము చేసికొన్న వారి కథకు వత్తము. వారిలో రాజమహేంద్రవరమున నున్న కొందఱు నే ననుస్థానిక బ్రాహ్మఁడ నగుటవలని లాభమును పొంది యందువలన తాముకీర్తి ప్రతిష్ఠలను సంపాదింపవలెనన్న యుద్దేశముతో నొకమాయోపాయ మాలోచించి నాకు స్వస్త్యామంత్రణమునిచ్చు మిషమీఁదను పరస్పర సమావేశములవలన నన్యోన్యమైత్ర్యాదులు హెచ్చు నన్న నెపము

మీఁదను వితంతువివాహము చేసికొన్నవారిని వివిధస్థలములనుండి రాజమహేంద్రవరమునకు రావించి 1907-వ సం॥రం డిసెంబరు నెల 27-వ తేదీని నాటకశాలలో నొక సభచేసి నన్నభినందించుచు నీ క్రింది పత్రికను జదివిరి.

"మ. రా. రా. శ్రీ, రావుబహదూర్ కందుకూరి వీరేశలింగము పంతులువారికి—

ఆర్యా,

అనాధరక్షణమునకు ధారవోయఁబడిన మీజీవితఫల మనందగి యున్న పునర్వివాహ సంఘమయొక్క ప్రథమ సభాసమయమున మిమ్ముంజేరి కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నారము.

మీయెడ మాకుంగల భక్తిప్రేమా గౌరవంబులు ముప్పిరి గొనుటంజేసి మామనోగతంబగు కృతజ్ఞతావిశేషమును ప్రకాశంబుగాఁ జూపఁజేసిన్నను మాయుద్దేశ్యమే కార్యముగా గ్రహించి నమ్ము మన్నింపఁ బ్రార్థించుచున్నారము.

ప్రాచీనకాలంబున ప్రపంచంబునకెల్ల భూషణంబై యున అస్మద్దేశముయొక్క యభివృద్ధి నెల్లను మూలచ్ఛేదము సేయుచున్న దురాచారంబుల దూరీకృతంబులఁ జేసి దేశజను లందరియొక్కయు గౌరవాద్భుతంబుల కర్హుఁడవై యున్నాఁడవు.

హరిశ్చంద్ర నాటకాది స్వతంత్ర గ్రంథంబులును, శకుంతలాద్యాంధ్రీకృతంబులును, పద్య గద్య ప్రబంధములును, ప్రహసనంబులును, జీవచరిత్రంబులును, ఉపన్యాసంబులును, వ్యాసంబులును, శాస్త్రగ్రంథంబులును రచియించి ఏకమార్గానుగమ్యమైన ఆంధ్ర

భాషా ప్రవాహమును పలుమార్గంబులకుం ద్రిప్పి ఫలవంతంబుగఁ జేసినాఁడవు.

ఆత్మగౌరవము, స్వార్థత్యాగము, అంతరాత్మానుసరణము, అను త్రిగుణాత్మకంబైన మీ దీర్ఘజీవితము పారతంత్ర్యము, స్వోదర పూరణము, స్తోత్రప్రియత్వము, అను త్రిదోషదూషితులైన మానవుల కెల్లరకును ఆదర్శమై యున్నయది. మీరు, ఇప్పు డుద్యమించి యున్న వింతతుశరణాలయము, పాఠశాల, రక్షణాలయము, అనాథ బాలపోషణాలయము మున్నగున వన్నియు మీ హృదయ వైశాల్యమును, మీ వితరణాతిశయమును, మీ లోకశ్రేయానురక్తిని చాటుచున్నవి.

మీ కార్యాచరణ దీక్షచే ననుప్రేరితులై, మిమ్మనుసరించి, మీతోఁడ నష్టకష్టములకుం బాలికాపులై యింతవరకును మీ యండ నున్న పునర్వివాహ సంఘమువారి క్షేమము నారయుచుండుటని ప్రత్యేకముగా మిమ్ముఁ బ్రార్థింప నావశ్యకము గన్పట్టదు.

దుఃఖభాజనులకుం బ్రోపును, దీనులకుఁ బ్రాపును, నిరాశా గతులకుం గాపును, అస్వాస్థ్యులకు రాపును నగు తమకును తమకు సహధర్మచారిణియై తమ యుద్యమముల కెల్ల తోడ్పడి స్త్రీసంఘమునకు మహోపకార మొనర్చిన శ్రీమతి రాజ్యలక్ష్మమ్మగారికిని భగవంతుఁ డాయురారోగ్య ఐశ్వర్యముల నొసంగుఁ గాక అని ప్రార్థించుచున్నారము.

రాజమహేంద్రవరము,
ది 27-12-1907.

ఇట్లు భవచ్ఛ్రేయులు,
పునర్వివాహ సాంఘికులు.

ఇట్లుండఁగాను సమావేశమైన తరువాత తిరుమేళ్ళ వెంకట సుబ్బారావుగారును పుల్లాభట్ల నవరయ్యశాస్త్రిగారును నాయకులుగానుండి యందఱితోను మాటాడి తాము వేఱొక క్రొత్త సమాజమును స్థాపించుట యావశ్యకమని బోధించి యట్లు చేయ నొడఁబఱిచిరి. నాకు స్వాగతపత్రికను జదివిన రాత్రియే బందరునుండి యిందు నిమిత్తమయివచ్చి మాయింటదిగినవారిని భోజనమునకు వెళ్ళినప్పుడు, మాయింట దిగుటచే, రాఁగూడదని పురలఁ బంపివేసిరి. అట్లు పంపివేసినవా రెవ్వరని నేను విచారింపఁగా నెవ్వరును తా మెఱుఁగమని నిందను తిరుమేళ్ళ సుబ్బారావుగారిమీఁద తోసివేసిరి. నన్ను గౌరవించుట కని వేషమువేసి పిలిపించి మాయింట దిగినవారు తమతోడి పంక్తిభోజనమున కర్హులు కారని వచ్చిన యతిథులను తిరిగి పంపివేసి చేసిన యగౌరవమునకయి నా కెంతో కోపము వచ్చినది. వారు మఱునాఁడు నన్ను తమనడుమ నుంచి కూరుచుండఁబెట్టుకొని ఛాయాపటమును దీయించుకొనెదము రమ్మని యాహ్వానము చేయఁగా నేను రానని మొట్టమొదట తిరస్కారభావముతో నిరాకరించితిని గాని యొక పెద్దమనుష్యుఁడు తనమాట చెల్లింపవలసినదని మఱిమఱి బతిమాలుకోఁగా తుదకు పోవలసినవాఁడ నయితిని. నన్ను గౌరవించునట్లు నటించుచు నట్లవమానపఱిచిన ప్రబుద్ధులు నాకంటఁబడఁగా నామనస్సు నాకు స్వాధీనముగాక కోపాతిరేకముచేత నిటువంటివారితోఁగలిసి ఛాయాపటమును దీయించుకొనుట నేను గౌరవముగాఁదలఁపక యవమానముగా భావించుచున్నాననియు, ఇటువంటివారి సహపంక్తిని భోజనము చేయుటకంటె చండాలుర సహపంక్తిని భుజించుట యెక్కువ గౌరవదాయకముగా పరిగణించుచున్నాననియు, నిశ్శంకముగా నందఱి మొగములమీఁదను జెప్పితిని. ఈ సమాజమునకు ముఖ్యకారకులుగా నున్నవా రిరువురును తా మా

వఱకెక్కడఁబట్టిన నక్కడ భోజనము చేయువారును దేశీయసంస్కార సభకు చెన్నపురి వచ్చినప్పుడు మతాంతరులతోఁ గూడఁ గలిసి భోజనముచేసినవారును నయి యుండిరి. పూర్వము జాతిభేదములేక యెల్లయెడలను భోజనముచేయుచుండినవాఁడును కడపట క్రైస్తవమత మును స్వీకరించినవాఁడును నయిన యింకొక నిష్ఠాపరుఁడుకూడ పైయిరువురతోను జేరి నాతో భోజనముచేయఁగూడదని పట్టుదలతో వాదింపఁ జొచ్చెను. వీరిలో పుల్లాభట్ల గవరయ్యశాస్త్రిగారు మంచి వారేకాని నాతో భోజనప్రతిభోజనములు మాని వేఱుసమాజము స్థాపించినఁగాని వితంతు వివాహపక్షము నశించునని మిత్రులు భ్రమ పెట్టుటచేత వారిమాయలోఁబడి యట్లు పనిచేసెను. అతఁడా వఱకే వ్యాధి బాధితుఁడయియుండి యాకస్మికముగా రోగము హెచ్చు చేసినందున నన్నుఁజూచి పొమ్మని నాకు వర్తమానమంపెను. నేను పోవునప్పటికే యాతనిస్థితి యపాయకరమయినదిగానుండెను. నేను పోఁగానే యతఁడు నమస్కారముచేసి యేమేమో చెప్పనారంభించెను గాని నాలుక తడఁబడి నోట మాట రాకపోయెను. అంతట కాగిత మును సీసపు పుడకయు భార్యచేత తెప్పించి "నేను మీయెడ నప చారముచేసితిని, క్షమింపుడు" అని వ్రాసి నాచేతి కిచ్చెను. నాకే విధమయిన కోపమును లేదనియు, ఆవిషయమును మనసులో నుంచు కొనవలదనియు నేను చెప్పితిని. వితంతు వివాహసమాజము నేర్పఱిచి నందుకు నాకు నిజముగానే కోపములేదు. ఆపని కెన్ని సమాజము లేర్పడి వివాహము లెంత యొక్కువ జరిగిన నాకంత సంతోషము. ఆవఱకు తిరుమెళ్ళ వేంకటసుబ్బారావుగారును మఱికొందరును వచ్చి నన్నడుగఁగా హిందూ కాలేజీ సమాజములో చేరవలసిన దనియు చేరిన యెడల వితంతు వివాహములు చేసికొన్నవారి నొక యుపసంఘ ముగా నేర్పఱిచి వారిచేతనే వివాహములు చేయించుట కేర్పాటు

చేసెదననియు చెప్పితిని. వారు నేనిచ్చిన సొమ్మంతయు తమచేతఁ బెట్టిన నొకయాట యాడవలెననియే కాని హితకారిణీసమాజమువారి యాదరణముక్రింద వివాహములు చేయుకార్యముల నభివృద్ధి చేయఁ దలఁచుకోలేదు. అందుచేత హితకారిణీసమాజములో చేరరైరి. స్వతంత్రముగా సమాజము నేర్పఱిచి యేమోపనిచేసెదమని చందాలు పోగుచేసి కాగితము లచ్చువేసి రెండు సంవత్సరములు కొంతసందడి చేసిరికాని యిప్పుడాసమాజమేమైనదో చందాలేమైనవో తెలియదు. వారీవఱకొక్క వివాహమైనను జేసియుండలేదు. మావితంతుశరణాలయములోనే వితంతువులు చేరుచున్నారు. ఏటేట నాలుగును, అయిదును, ఆఱును వివాహములు జరుగుచునే యున్నవి.

ఈక్రొత్త సమాజము స్థాపింపఁబడిన యల్పకాలములోనే నేనొకసారి కాకినాడకు పోవలసివచ్చెను. కాకినాడలో నేనొక మిత్రుని యింట బస చేసితిని. ఆమిత్రుఁడు వితంతువివాహము చేసికొన్నవాఁడు గాఁడు. జాతివిసర్జనము చేసినవాఁడును గాఁడు. అటువంటి బ్రాహ్మణకుటుంబము నన్ను పంక్తినిఁ బెట్టుకొని భోజనము చేసి నా కాతిథ్య మిచ్చుచుండఁగాఁ జూచి, అక్కడ పునర్వివాహము చేసికొని యున్నవారు సిగ్గుపడి నన్ను తమయింట భోజనము చేసి పొమ్మని నిర్బంధపఱిచిరి. వారి బలాత్కారముచేత నేనొప్పుకొని యొకరాత్రి యొకరియింటికి భోజనమునకుఁబోయితిని. తక్కినవారి నతఁడా రాత్రి తనయింటికి విందునకుపిలిచెను. ఆదినమున రాజమహేంద్రవరములో నంతకుముందు నాతో భోజనము చేయఁ గూడదని వాదించిన మూఁడవ పురుషుఁడును కాకినాడలోనే యుండుట తటస్థించెను. అతఁడు నన్ను భోజనమునకు పిలిచినవారియింటికిఁ బోయి ముందు తన కన్నము పెట్టి పంపివేయవలెనని యడిగెను. పంక్తిని భోజనమునకు వచ్చిన రావలసినదని లేకపోయిన పోవలసినదని చెప్పి యజమానుఁ డాతనిని పంపివేసెను. అతఁడే తరువాత

రాజమహేంద్రవరములో జరిగిన నూతనసమాజముయొక్క సభకుఁ బోయి యక్కడ నాతో భోజనము చేయఁగూడదని మరల వాదింపఁ దొడఁగెను. అప్పుడా సభలో నున్నవారిలో నొకరు "అయ్యా! మీరు కాకినాడలో నెక్కడ భోజనము చేసితిరి?" అని యడిగెను. "అందఱును ఆయనతోఁ గలసి భోజనము చేసినవారే యైనప్పుడు నే నెక్కడను భోజనముచేయక చావనా?" అని యతఁ డుత్తరము చెప్పెను. అతఁడు తరువాత నొకనాఁడు మాయింటికి వచ్చి నాతో భోజనము చేయుటకు తన కేమియు నాక్షేపణము లేదనియు నందఱును కూడదన్నందున వివాహములకు విఘాతము వచ్చునేమో యని తానును నట్లంటినే కాని వే రేమియు లేదనియు చెప్పి మాయింట భోజనము చేయఁజూచెను గాని నే నంగీకరింపలేను. రాజమహేంద్రవరములో నాతో భోజనము చేయనివా రిద్ద ఱుండిరి గాని వారిలో నొక్క రీనడుమ కాలధర్మము నొందెను.

చెన్నపట్టణమునుండి నే నిక్కడకు వచ్చునప్పుడు ముద్రాక్షరములు మొదలైన సమస్తపరికరములతో చింతామణీ ముద్రాయంత్రమును గొనివచ్చి దానిలో సత్యవాదినీ పత్రికను ప్రకటింప నారంభించితి నని యీవఱకే చెప్పితిని గదా. నేను తోఁటలోనికిఁ గాపురమునకు వచ్చినను విశాలమయిన మాయి ల్లంతయు బాలికా పాఠశాల నిమిత్తమును వితంతువు కాపురము నిమిత్తమును కొంత కాలము పాఠశాలావితంతు శరణాలయ పర్యవేక్షకుని నివాసము నిమిత్తమును నొక యుపాధ్యాయుని నివాసము నిమిత్తమును ఉపయోగింపఁ బడుచుండుటచేత ముద్రాయంత్రమును పెట్టుట కందు తావు లేకపోయెను. అందుచేత ముద్రాయంత్రము నిమిత్తము కొన్ని నూఱులురూపాయలు వ్యయపఱిచి యింటిదొడ్డిలో పెద్ద పెంకుటిశాల యొకటి వేయవలసివచ్చినది. వారపత్రికను సకాలములో ముద్రించి

ప్రకటించుటకయి పెద్ద భృత్యవర్గమును పెట్టవలసివచ్చెను. నాపుస్తకములావరకే క్రొత్తగా చెన్నపట్టణములో ముద్రింపఁబడియుండుటచేత నాగ్రంథములను ముద్రించు పని లేకపోయెను. అప్పటికి పట్టణములో ననేక ముద్రాయంత్రములు స్థాపింపఁబడి యుండుటచేత నచ్చువకుపై పని యేదియు రాకుండెను. పత్రిక నిమిత్తమయి మొత్తముగా కాగితములు తెప్పించి నిలువచేయుట కయి ముందుగా కొంతసొమ్ము పెట్టుబడి పెట్టవలసివచ్చెను. ముద్రాయంత్రములో పత్రికను పైవారికి పంపువారికి సహితము కొంతజీతమియ్యవలసి వచ్చెను. పనియున్నను లేకపోయినను కూడ నేనే పనివాండ్రజీతములను నెల నెలకు నియ్యవలసి యుండెను. ఇవి యన్నియు నిట్లుండఁగా పత్రిక యొక్క ప్రథమ ముద్రణపత్రములను గూడ నేనే దిద్దవలసివచ్చెను. వృద్ధుఁడను దుర్బలుఁడను నయిన నేనీ పనుల నన్నిటిని జేయ సమర్థుఁడను గాకపోవుటయే కాక యీవ్యయముల నన్నిటిని వహించుట నాకు దుర్భర మయ్యెను. అందుచేత గున్నేశ్వరరావు సోదరులకు చింతామణీ ముద్రాయంత్రమును విక్రయింప వలసినవాఁడ నైతిని. నాపుస్తకములను విక్రయించు స్వాతంత్ర్యమును గూడ వారికే పది యేండ్లవఱకు నిచ్చితిని గాని కొన్నియేండ్లయినతరువాత కొన్నికారణములచేత వారి యనుమతితో నేనే మరల పుచ్చుకోవలసినవాఁడ నైతిని.

పనియెక్కువగుటచేత సదారోగశీలుఁడయియుండెడి నాయారోగ్యమంతకంతకు క్షీణింపఁజొచ్చెను. భగవంతుఁ డెప్పుడును నాయందు పరిపూర్ణానుగ్రహముగలవాఁడగుటచేతనతికాయకష్టపడవలదనియుపదేశించుటకోయన నాకొక హెచ్చరిక కలుఁగజేసెను. నేనంతకంతకు బలహీనుఁడ నగుచు వచ్చుచున్నను కార్యోత్సాహముచేత పని మానకుంటిని. ఇట్లుండగా నొకనాటిరాత్రి నేను వెలుపలికివెళ్ళవలెనని లేచి మంచముమీఁదినుండిదిగి నిలుచుండి యేదోవికారముగాఁగా స్మృహ

లేక విఱుచుకొని పడిపోయితిని. ఆ పడ్డచప్పుడు విని నిద్రపోవుచున్న నాభార్య యులికిపడిలేచెను. నాకు కొంతసేపటికి మరల స్మృతివచ్చి కన్నులువిప్పి చూచునప్పటికి నాభార్య నావద్ద కూరుచుండి యేడ్చుచుండెను. తలక్రింద నొక్క తలగడ యుండెను. నాభార్యకు ధైర్యము చెప్పి యోదార్చి దుఃఖముడిపి 'యీదిండు తలక్రిందపెట్టి నన్నిట్లు పరుండఁబెట్టితివా' యని యడిగితిని. 'లేదు మీరు పడుటయే యీలాగునఁ బడితి'రనియామె యుత్తరముచెప్పెను. ఆమాట వినఁగానే భగవంతుఁడు నావిషయమునందు చూపుచుండిన ప్రేమకును రక్షణమునకును నాకత్యాశ్చర్యము కలిగినది. తోఁటలోమేమువసించెడి యిల్లు మిక్కిలి చిన్నదగుటచేత మేము పరుండు గదిలోనే పెట్టెలు మొదలయినవన్నియు పెట్టఁబడి యుండెను. అప్పటికి నేనిప్పుడు పరుండు మేడయిల్లు కట్టబడియుండలేదు. నేను పరుండు గదిలోనే యొక ప్రక్క పెట్టెలును,ఇంకొకప్రక్క బిందెలును దీపస్తంభమునుఉండెను వానిలో దేనిమీఁదపడినను తల బద్దలు కావలసినదే. అట్టి స్థితిలో వాని నన్నిటిని తప్పించుకొని నేనెట్లు రెండుపెట్టెలనడుమ నెవ్వరో జాగ్రత్తతో పరుండఁబెట్టినట్టు దెబ్బ తగులకుండ పడఁగలిగితినో, గోడచెంతనున్న దిండెట్లు నాతలక్రిందకు వచ్చెనో, యూహించుట కశక్యమయియున్నది. అది యంతయు నీశ్వరరక్షయని నిశ్చయించుకొని పరుండియేప్రార్థనచేసి యీశ్వరునకు నాకృతజ్ఞతాభివ్యంజకములైన వందనములను సమర్పించితిని. పిమ్మట నాభార్యనన్ను లేవఁదీసి వెలుపలికిఁ దీసికొనిపోయి మరల లోపలికిఁ దీసికొనివచ్చి మంచము మీఁద పరుండఁబెట్టెను.

రామచంద్రరావుగారును భార్యయును మంగుళూరునుండి రాకమునుపుకొంచెము కాలముగుంటూరునుండివచ్చి ఉన్నవలక్ష్మీనారాయణగారును భార్యయును పట్టణములోని మాయింటిలోనుండి విలంబు శర

శాలయమును జూచిరి కాని తత్కార్య నిర్వహణ విషయముల వారి యభిప్రాయములకును నాయభిప్రాయములకును నేకీభావము కలుగనందున వారు మరల గుంటూరికి వెళ్ళిపోయిరి. పాఠశాలలో నాలుగురుపాధ్యాయినులను ఒక యుపాధ్యాయునిఁ బెట్టి విశేషధనవ్యయము చేయుచుంటిని. అట్లయ్యును పాఠశాల వలనఁ గలుగవలసినంత ప్రయోజనము కలుగకుండెను. నేనే యుద్దేశముతో పాఠశాలను స్థాపించితినో యాయుద్దేశము నెఱవేఱినదికాదు. ఎంతో కష్టముమీఁద నిద్దఱు పిల్లలు రెండవఫారమునకు వచ్చిరి; వారిలో నొకామె కన్యక; రెండవయామె బాలవితంతువు. వారిరువురను గూడ తల్లిదండ్రులు బడి మానిపించిరి. మొదటి యామెకు వివాహమయి మామగారు కోడలిని బడికి పంపఁగూడఁదని నిషేధించుట చేత మాన్పబడినది; రెండవయామె బడికి పంపుటవలన బంధువులు నిందించుచున్నారన్న హేతువుచేత మాన్పఁబడినది. వీరిని చదివించి ప్రవేశ పరీక్షకు కాకపోయినను మాధ్యమిక పరీక్షకయినను వీరిని బంపవలెనని యాశపెట్టుకొనియున్న నాకీవిషయమున గొప్ప యాశాభంగము కలిగెను. ఈపాఠశాలను క్రమక్రమముగా స్త్రీల యున్నతపాఠశాలను జేయవలెనని మొదట నా సంకల్పము. ఇట్లు నా సంకల్పమునకు ప్రథమముననే వికల్పము సంభవించెను. దీనినిబట్టి యీపాఠశాలకయి పెట్టెడు సొమ్మంతయు వ్యర్థవ్యయమనియు యుక్తవయసు వచ్చిన తరువాత తమ బాలికలను పాఠశాలకు పంపి తల్లిదండ్రులు చదివింప రనియు, ప్రాథమిక విద్యను నేర్పుటకయి పట్టణములో రెండు దొరతనమువారి బాలికాపాఠశాలలును కొన్ని క్రైస్తవసంఘ బాలికాపాఠశాలలునుండఁగా దీని యావశ్యకము లేదనియు, ఎప్పుడైనను స్త్రీల యున్నతపాఠశాల యేర్పడవలెనన్న వితంతు శరణాలయములోని వితంతువులవలనను అగతిక రక్షణశాలలోని బాలికలవలనను నేర్పడవలసినదేకాని వేఱు విధముగా నేర్పడ

నేరదనియు, తలఁచి యొక యగతిరక్షణశాలను గూడ స్థాపింప నిశ్చయించితిని. సాధారణముగా సద్వర్తనముగల యుపాధ్యాయినులు ప్రస్తుతస్థితిలో దొరకుట కష్టము. మాపాఠశాలలోని యుపాధ్యాయినులు కొందఱొండొరులతో తగవులాడియొకరితప్పులొకరు బయలఁబెట్టుచు కాగితములువ్రాసి పాఠశాలలోను వీధిగోడలకును దీపస్తంభములకును నంటింపసాగిరి. వారిని వదల్చుకొనుటకూడ కర్తవ్యమని నాకు తోఁచినది. అందుచేత మాపాఠశాలను పట్టణమునుండి రప్పించి 1908-వ సంవత్సరము వేసవికాలపు సెలవుల తరువాత మాతోఁట లోని రామచంద్రరావుగారి యింటిలోఁ బెట్టితిని. దూరమగుటచేత పట్టణములోని బాలిక లక్కడకు వచ్చుటకు మానివేసిరి. అందుచేత తగవులాడిన యుపాధ్యాయినుల సందఱిని దీసివేసితిని. వితంతు శరణాలయములోని వితంతువులు తోఁటలోని యీ క్రొత్త యింటిలోనే యుండిరి. వారికి విద్యచెప్పుటకయి ప్రవేశపరీక్షయందుఁ గృతార్థులయిన వయస్సు చెల్లిన యుపాధ్యాయులను బెట్టితిని. పాఠశాలకు పట్టణగృహామునుండి తొలఁగించిన తరువాత నాయింటి కిం పవిం చుగా నెలకు ముప్పదిరూపాయలయద్దె వచ్చుటవే నదియొక క్రొత్త యాదాయముగా నేర్పడెను. తోఁటలో నగతిక శిశు సంరక్షణాలయ (Orphanage) గూడఁ బెట్ట నుద్దేశించితినిగాని దానిని శ్రీపిఠాపురపు రాజుగారు పెట్టఁబూనినందున నేనా ప్రయత్నము మానివేసితిని.

నేను చెన్నపట్టణమునకు వెళ్ళకముందు శాస్త్రీక పాఠశాలా స్థాపనమునకయి ప్రయత్నించి లబ్ధమనోరథుఁడను గాకపోయినట్లు చెప్పియుంటినిగదా? నేను సంకల్పించిన పనిలో నాప్రయత్నము సాగకపోయినను నేనంతటితో విడిచిపెట్టక మరల మరల ప్రయత్నము చేయుచునేయుందును. చెన్నపట్టణము పోకుండుటయే తటస్థించియుండినయెడల మరల కృషిచేసి దాని నీవఱకే స్థాపించియుందునేమో!

నేను చెన్నపట్టణమునుండి తిరిగివచ్చినతరువాత నా హృదయక్షేత్రమునం దడఁగియుండిన యాస్తిక పాఠశాలా స్థాపనబీజము మరల నంకురించెను. మనసున్న పక్షమున మార్గముండకపోదు. శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు పట్టణములో నొకమాధ్యమిక పాఠశాలను స్థాపించి కొన్ని సంవత్సరములనుండి జరపుచుండిరి. ప్రథమోపాధ్యాయులైన సత్యవోలు లక్ష్మీపతిగారు దానిలో జీతము గైకొనకయే ధర్మార్థముగా పనిచేయుచుండినను దానివ్యయములకై లక్ష్మీనరసింహముగారు కొంత చేతిది పెట్టవలసి వచ్చుచుండెను. నే నాపాఠశాలను హితకారిణీ సమాజమున కిమ్మని కోరఁగా వారు సంతోషపూర్వకముగా పాఠశాలను మాకిచ్చుట కంగీకరించి బల్లలు దేశపటములు మొదలయిన సమస్తసామగ్రితోను 1907-వ సంవత్సరము సెప్టెంబరునెలలో దానిని స్వాధీనము చేసిరి. పాఠశాల మా యధీనము కాఁగానే యావరకు చితవుగా పనిచేయుచుండిన లక్ష్మీపతిగారక్కడ పనిచేయుట మానివేసిరి. తక్కిన మూఁడుమాసములకు ననఁగా సంవత్సరాంతమువఱకును పాఠశాలావ్యయముల కయి మున్నూఱు రూపాయలు పైని చేతి నియ్యవలసివచ్చినను, లక్ష్మీనరసింహముగారు మాకిచ్చిన యుపకరణములవెల యంతకంటె నెక్కువగానే యుండును. ఇఁక దీని నున్నత పాఠశాలనుగా మార్చవలెను. పాఠశాల క్రొత్తకార్య నిర్వాహకత్వమునకు వచ్చుటచేత పాఠశాల నున్నది యున్నట్లుంచుటకే పూర్వాంగీకారము పనికిరాక విద్యాశాఖవారివలన నూతనాంగీకారమును బడయవలసివచ్చెను. నాకు చెన్నపట్టణములోఁ బూర్వపరిచితులును ఉత్తర మండలముల పాఠశాలాపరీక్షకులును అయిన వేంకటస్వామి గారిసాహాయ్యమువలన విద్యావిచారణాధికారి మాపాఠశాల నంగీకరించెను. దాని నున్నత పాఠశాలనుగాఁ జేయు విషయమునఁ గృషిచేయ నారంభించితిని. ఈ విష

యమునైన పాఠశాలా పరీక్షకులయిన వేట్సుదొరగారితోను, రాజకీయ కళాశాలాధ్యక్షు లగు హంటరు దొరగారితోను, మాటాడి రాజమహేంద్రవరములో నింకొక యున్నతపాఠశాలను స్థాపించుట కావశ్యక మున్నదని వారిని సహేతుకముగాఁ జెప్పి యొప్పించితిని. పాఠశాలామందిరమును గట్టించుటకయి యించుమించుగా రెండు వేల రూపాయల కొక యింటిని, చెరువు సోమయాజులుగారివద్ద కోట సమీపమునఁ గొనుటయే కాక దాని చుట్టుపట్లనిండ్లను గొనుటకుఁ గూడ బేరమాడుచుంటిని. మాపట్టణములో నున్నతపాఠశాలలు రెండుండెను; ఒకటి క్రైస్తవమతాచార్యులది, రెండవది దొరతనము వారిది. మొదటిదంత యభివృద్ధిలో లేదుగాని రెండవదియయిన రాజకీయ బోధనాభ్యసన పాఠశాల మిక్కిలి మంచిదశ యందుండెనది. ప్రతిపక్ష పాఠశాల యొకటి బైలుదేఱనున్నప్పుడు మునుపున్న పాఠశాలవారికి భయమును మాత్సర్యమును గలుగుట యస్వాభావికము కాదుగదా? అందుచేత బోధనాభ్యసనపాఠశాలోపాధ్యక్షు లయిన మల్లాది వేంకటరత్నము గారు మాపాఠశాల తమ పాఠశాలకుఁ బ్రతిస్పర్థిగా నుండునని భయపడి మాదానిని విద్యావిచారణాధికారిగా రంగీకరింపకుండఁ జేయవలెనని హంటరు దొరగారితోఁ జెప్పిరి. రాజకీయ బోధనాభ్యసన పాఠశాలకు హంటరు దొరగా రధ్యక్షులు; వేంకటరత్నముగా రుపాధ్యక్షులు. పట్టణములోని యితరులు గూడఁ గొందఱు మాపాఠశాలకు వ్యతిరిక్తముగాఁ జెప్పిరి. అందుచేత మాపాఠశాల నున్నత పాఠశాలనుగా నంగీకరించుటకు నేము విద్యావిచారణాధికారులకు ప్రార్థనపత్రమును బంపినప్పుడు హంటరుదొరగారు వ్యతిరేకముగా వ్రాయుటనుబట్టి వా రంగీకరింపక పాఠశాలయొక్క స్థిరత్వమును గూర్చి యేవేవో వ్రాసిరి. అందుపైని నేను చెన్నపట్టణమునకుఁ

బోయి పాఠశాలాస్థాపనము నిమిత్తమయి నా యుద్దేశ్యములను నే నవలంబింపఁ దలచుకొన్న మార్గములను వారికి విన్నవించితిని. నా మాటలు విన్నపిమ్మట వారు తాము చూపిన న్యూనతలను సరిపఱుచుకున్న పక్షమున పయిసంవత్సర మంగీకరించెదమని చెప్పి హంటరు దొరగారితోఁగూడ నాయుద్దేశములు చెప్పుమనిరి. నేనాపాఠశాలను ధనముసంపాదింపవలెనన్న యుద్దేశముతోను, నామనుష్యులకందుద్యోగము లియ్యవలెనన్న యాలోచనతోను స్థాపించితి ననియు, విద్యాశాఖవా రాపాఠశాల నంగీకరించినపక్షమున విద్యార్థులు చెడిపోవుదురనియు, హంటరుదొరగారితో నెవ్వ రెవ్వరో యేవేవో చెప్పిరి. నే నాయనను కలసికొని మాటలాడి యాయనకు కలిగిన దురుద్దేశములను కొంతవఱకు తొలగించి, పాఠశాలాకార్యనిర్వహణమునకయి నే నొక యుపసంఘ మేర్పఱిచెదననియు దానియం దాయననుగూడ నుంచెద ననియుఁ జెప్పితిని. అందుపైని దొరగారు కొంతవఱకు నా పక్షమునకు తిరిగి, ఉపసంఘములోఁ దా నొకఁడుగా నుండుట కంగీకరించెను. శాస్త్రపాఠశాలాధ్యక్షుఁడును పాఠశాలా సహాయ పరీక్షకుఁడును పాఠశాలా ప్రధానోపాధ్యాయుఁడును నేనును మఱి యిద్దఱు హితకారిణీ సామాజికులను కాకినాడ కాలేజీ యధ్యక్షు లయిన వేంకటరత్నమునాయఁడుగారును గల యొక యుపసంఘము నేర్పాటు చేసి, వేంకటరత్నము నాయఁడుగారు శ్రమపడి చేసినవిధు లాయనకుఁ జూపి యాయన యంగీకారమును బడసితిని. ఇట్లేర్పడిన పాఠశాలా కార్యనిర్వాహక సంఘముయొక్క కార్యదర్శి తనకొక భటుఁడు ప్రత్యేకముగా కావలెనని కోరఁగా హితకారిణీ సమాజము వారొక భృత్యుని కార్యదర్శియొద్ద పనిచేయుట కిచ్చిరి. అతనికి పాఠశాలతో సంబంధించిన పని యంతగాఁ గనఁబడలేదు. ఒక దినమున హితకారిణీ సమాజముయొక్క యాధరణము క్రింద తోఁటలో

నొక వితంతువివాహము జరుగనున్నప్పుడు సాయముచేయుట కయి యాభృత్యుని వివాహదినము బంపవలసిన దని కార్యదర్శిగారిని కోరితిని. ఆయన వానిని బంపలేదు. ఇంకొకదినమున నేను పాఠశాలను జూడఁబోయినప్పుడు కార్యదర్శిగారిని గలిసికొని హితకారిణీ సమాజము పేరిటఁ బ్రకటింపఁబడుచున్న సత్యవాదినితో సంబంధించిన యుత్తరములను పరివర్తన పత్రికలను ఆ భటునిచేత పోషణ కార్యస్థానమునుండి తోఁటకు పంపుచుండుఁడని యాయనను మిత్రభావముతో నడిగితిని. ఆయన యాభృత్యునిఁ బంపుటకువలనుపడ దని చెప్పెను. అందుపైనే నది సమాజముపని గాన నాసొంతపని గాదనియు, సమాజాధ్యక్షుఁడ నైన నాకు విధించుట కధికార మున్నను మిత్రభావముతో వేఁడుచున్నాను గనుక పంపవలసిన దనియు చెప్పితిని. మీరు మిత్రభావముతో వేఁడుచున్నారు గనుక నే నేను పంపనంటి ననియు, మీరు విధించి యుండినయెడల పంపియుందు ననియు, ఆయన యుత్తరమిచ్చెను. నే నీసంగతిని సమాజముయొక్క కార్యనిర్వాహకసంఘమునకు వ్రాసితిని. ఈయన పాఠశాలోపసంఘమునకు మాత్రమే కాక సమాజకార్యనిర్వాహక సంఘమునకును కార్యదర్శిగా నుండెను. నేను వ్రాసిన యుత్తరమాలోచన నిమిత్తము కార్యనిర్వాహకసంఘముముందు పెట్టఁబడినప్పుడు తనకు భృత్యుఁడే యక్కఱలేదని చెప్పి, తరువాత తన కా పనియక్కఱలేదని పరిత్యాగ పత్రమును పంపెను. ఇంతకుముందే యీయన ప్రశంసించిన పట్టపరీక్షాసిద్ధుఁడయిన యొక మిత్రుని పాఠశాలాప్రధానోపాధ్యాయునిగా నియమించువిషయమయి యుత్తరప్రత్యుత్తరములను జరపుచుంటిని. ఇది యిట్లుండఁగా నేను వేసవికాలములో బెంగుళూరికి వెళ్ళి మూఁడు మాసములకు తిరిగి రాజమహేంద్రవరమునకు వచ్చితిని. తరువాత రెండు మూఁడు మాసములలో వేంకటరత్నమునాయఁడు

గారిని కలిసికొనుట తటస్థించినప్పు డాయన నాతో హంటరుదొర గారు పాఠశాలోపసంఘమునుండి తాము మానుకోఁ దలఁచినట్లు తమ పాఠశాలా పరీక్షాసమయమున యేట్సుదొరగారు తమతోఁ జెప్పినట్టుచెప్పిరి. నేనాశ్చర్యపడి నేను విన్నసంగతి నిజమేమో, నిజమైనయెడల కారణమేమో, తెలుపవలసినదని హంటరుగారికి వ్రాసితిని. ఉపసంఘమువారు చేసిన నిర్ధారణములను నేను వ్యవహారములోనికిఁ దీసికొనిరానట్టును, వారి యాలోచన లేకుండ ప్రధానోపాధ్యాయుని నియమించినట్టును, ఉపాధ్యాయులకును పాఠశాలోపసంఘములోని యితరులకును గూడ నతృప్తికలుగుటచేత కార్యదర్శి తన పనిని మానుకొన్నట్టును, ప్రధానోపాధ్యాయుఁడు తన పనికిఁ బరిత్యాగపత్రమును పంపినట్టును, చేసిన నిర్ధారణములు చెల్లనియుపసంఘములో నుండనొల్లక తాను పనిని పరిత్యజింపఁ దలఁచినట్టును, వారు నాకు పెద్దయుత్తరమును వ్రాసిరి. ప్రథమోపాధ్యాయుని పరిత్యాగపత్రమునుగూర్చి నేనడుగఁగా తానది బుద్ధిపూర్వకముగా పంపినది కాదనియు పనిని మానుకొనుట తన కిష్టములేదనియు నతఁడు చెప్పెను. ఉపసంఘమువారుచేసిన నిర్ధారణములలో నొక్కటి తప్ప వ్యవహారమునకు తేఁబడనివేవియులేవనియు, ఆయొక్కటియు కార్యదర్శి చేయవలసిన దతఁడు చేయునందుకు నేనుత్తరవాదినికాననియు, ప్రథమోపాధ్యాయపదము నిమిత్తము కార్యదర్శి నాకు శ్లాఘించి వ్రాసిన యతనితో నాకర్హుఁడనితోఁచినయెడల నుపసంఘమునకుఁ దెలుపుటకయి నేనుత్తరప్రత్యుత్తరములను జరపుచుంటినే కాని నేను ప్రధానోపాధ్యాయునిగా నాతనిని నియమింపలేదనియు, కార్యదర్శి మానుకొనుటకుఁగల కారణ మిది యనియు, ఉపాధ్యాయులలో నతృప్తి యెంతమాత్రమును లేదనియు, ప్రథమోపాధ్యాయుఁడు పంపిన పరిత్యాగపత్ర మొకరి ప్రేరణమువలనఁ బంపబడినదే కాని బుద్ధి

పూర్వకమయినది కాదనియు, నేను ప్రత్యుత్తరము వ్రాసి హంటరు దొరగారికి పంపితిని. అప్పుడాయన సత్యమును తెలిసికొని దురుద్దేశముతో స్వార్థపరాయణులు తన్ను భ్రమపెట్టిరని గ్రహించి తరువాత జరిగినసభలో నాపక్ష మవలంబించి కార్యదర్శి యుద్యోగపరిత్యాగ మంగీకరించుటయేగాక మనలను బెదరింపఁజూచిన ప్రథమోపాధ్యాయుని పరిత్యాగ పత్రమునుగూడ నంగీకరింతమని పలికెను. తత్త్వమును దెలిపి దానిని నేను వారించితిని. పరిత్యక్తోద్యోగి యైన కార్యదర్శి యీపాఠశాల విద్యావిచారణాధికారిచేత నంగీకరింపఁబడినపక్షమున తాను చెవికోయించుకొనెదనని శపథముపలికినట్లు నాకొక పెద్దమనుష్యుఁడు చెప్పెను. అయినను విద్యావిచారణాధికారి మఱుసటి సంవత్సరము నాలవఫారమును తరువాతి సంవత్సర మయిదాఱు ఫారములను నంగీకరించి మాపాఠశాలను సంపూర్ణోన్నతపాఠశాలను జేసెను.

ఇఁక పాఠశాలా భవనమునుగూర్చి కొంత వ్రాయవలసియున్నది. మంచిపని కెప్పుడును మంచివారిని ప్రేరేపించి దేవుఁడు సాయము చేయుచుండును. ఈశ్వరప్రేరణమువలన శ్రీపిఠాపురసంస్థానాధిపతులైన శ్రీరాజా కుమారమహీపతి సూర్యారావు బహద్దరుగారు పాఠశాలాభవన నిర్మాణార్థముగా మొదట నరువదివేలరూపాయల నిచ్చెదమని దయాపూర్వకముగా వాగ్దానముచేసిరి. ఏహేతువు చేతనో కాని శ్రీరాజావారికి నామీఁద నిర్హేతుక జాయమానానుగ్రహము కలిగినది. ఈ యనుగ్రహముచేతనే నేను మొట్టమొదట తోఁటనుగొని యందు వసింప నారంభించినకాలములో వారు రాజమహేంద్రవరము వచ్చినప్పుడు మాతోఁటకు దయచేసి నాకుదర్శనమిచ్చిరి. వీరిసాహాయ్యముచేత నేను క్రొత్తగా కొన్నస్థలములో పాఠశాలాభవనమునుగట్టుట కుద్యమించితిని. కట్టఁదలఁచిన భవనము

యొక్క చిత్రపటమును వ్రాయించి పాఠశాలాపరీక్షకులైన యేట్సు దొరగారికి చూపి వారామోదించిన మీఁదట సంగీకారార్థముగా విద్యావిచారణాధికారిగారికిఁ బంపితిని. మూఁడు నెలలు దాఁటినది; వారు దాని నంగీకరించినట్లే కనఁబడినది. అయినను "శ్రేయాంసి బహువిఘ్నాని" యన్నట్లు దానికిఁ గ్రొత్తవిఘ్నములు రాఁ దొడఁగెను. ఆకాలమునందు "వందేమాతరము" కోలాహలము దేశమునం దంతటను వ్యాపించెను. ఈనూతన దేశాభిమాన ప్రకటన మితరస్థలములకంటె మారాజమహేంద్రనగరమునందు తక్కువగాఁ జూపఁబడ లేదు. అవివేకుల ప్రేరణముచేత నేమియు నెఱుఁగని బడిపిల్లలకును మూఢులకును యూరపియనులు వీధిని బోవునప్పుడు వెనుక వందేమాతర మని కేకలు వేయుట యొక యాటయయ్యెను. దీని నాధారము చేసికొని గిట్టనివారు కొందఱు మాపట్టణములోని యుపకరగ్రాహియైన బ్రెడ్డువుడ్డు దొరగారితో నామీఁద నే నేమో చెప్పి పాఠశాలాభవనము నాస్థలములోఁ గట్టనిచ్చిన యెడల విద్యార్థులు గుమికూడి యూరపియనులను చప్పటలను గొట్టి గేలి చేయుదు రని చెప్పి యాయనకు నమ్మకము పుట్టించిరి. యూరపియనుల నివాసమునకు సమీపమున నున్న యాస్థలములో పాఠశాలా భవనము కట్టఁగూడదని వారు నాతోఁ జెప్పిరి. అందు నిమిత్తమయి యాస్థలము కొనఁబడినందున పాఠశాల నందుఁ గట్టింపకుండుటకు వీలులేదని చెప్పితిని. ఆదొరవారి నావఱకు మాపాఠశాలోపసంఘములో నొక్కఁడుగా నుండవలసినదని గోరియుంటిని. పాఠశాల నక్కడ కట్టక పోయిన పక్షమున తా ముండెదమని వారు చెప్పిరి. మీ రుండకపోయిన సరే పాఠశాల నక్కడ కట్టకమాననని నేనంటిని. తరువాత దొరగారు నగరపారిశుద్ధ్య సంఘమువారిని పాఠశాలాభవనము నందుఁ గట్టుట కంగీకార మియ్యకుండు నట్లు చేయుటకయి ప్రయత్నము

చేసిరి. ఆరోగ్యావహవిధులకుఁ బ్రతికూలముగా నుండనప్పుడు నాస్థలములోఁ బాఠశాలను గట్టనియ్యక వారేహేతువుమీఁద నిరాకరింతురో చూతమని నేనును పట్టుపట్టితిని. అక్కడను తమ ప్రయత్నము కొనసాగ దని తెలిసికొని దొరగారు కడపటి ప్రయత్నముగా పాఠశాల కట్టఁబోయెడు స్థలము యూరపియనుల నివాసములకు చేరువగా నున్నదనియు, అందుచేత పిల్ల లల్లరిచేసి యూరపియనులకు తొందర కలుగఁ జేయుదు రనియు, పాఠశాల నక్కడ కట్టినయెడల దానికి మీ రంగీకార మియ్య వలదనియు, వ్రాసి మండలకర్తగారి ద్వారమున విద్యావిచారణాధికారిగారికి పంపిరి. ఇక్కడ వారి ప్రయత్నము సఫలమయినది. ఈదొరగారు వ్రాసిన హేతువుచేతఁ గాక విద్యావిచారణాధికారులు పాఠశాలాభవనము సందుఁ గట్టిన పక్షమున బాలుర యాటలకు చాలినంత స్థలము లేదన్న వేఱు హేతువుచేత నా స్థలమున పాఠశాలను కట్టుకొనుట కంగీకరింపక వేఱుచోట విశాలమైన స్థలములో కట్టవలసినదని వ్రాసిరి. బ్రైయుడు వృద్ధు దొరగారట్లు వ్రాయుట పిల్ల లల్లరిచేయుదు రన్న నిజమైన విశ్వాసముచేతనేకాని నాయందలి ద్వేషము చేతఁగాదు. నేను కొన్న రెండవతోఁటలోనికి పుంతలోనుండి తప్ప ప్రధానరథ్యకు వేఱు దారి లేకపోవుటచేత నా పొరుగువారైన రివరెండు మెక్రిడీగారిని దారికయి తమ స్థలములో నుండి కొంత క్రయమున కియ్యవలసినదని కోరియు కార్యము కానప్పుడు బ్రెయిడువృద్ధుడు దొరగారు శ్రమచేసి స్వయముగా మాతోఁటయొద్దకు వచ్చిచూచి రివరెండు మెక్రిడీగారి స్థలమును కొలత వేయించి చూచి కొంత స్థలమును వారాక్రమించుకొన్నట్లు కనిపెట్టి యందలి బ్రహ్మజెముడు మొదలయినవి కొట్టించి నేను కోరిన స్థలములో నుండి దారి వేసికో వచ్చునని నాతోఁ జెప్పిరి. అంతే కాక దానినంటియున్న పుష్పాల చెట్లవును

నాకోరికమీఁద హితకారిణీ సమాజమున కిమ్మని యాదొరవారే మండలకరగ్రాహికి వ్రాసిరి.

ఇప్పుడు పాఠశాల నిమిత్తమయి క్రొత్త స్థలమును వెదకవలసిన చిక్కొకటి సంప్రాప్తమయినది. ప్రాఁతపట్టణములో విశాలమయిన స్థలము మఱియెక్కడను లేదు. ఇన్నీసుపేటలో రెండుమూఁడు వేలగజముల స్థల మొకటి గజ మొకటికి నాలుగు రూపాయలచొప్పున వెలకు దొరకెను గాని యదియు నాటలకుఁ జాలదు. ఇట్లు విచారించుచుండఁగా నిన్నీసుపేటతోఁ జేరియున్న యాఱెకరముల హుకుముపేట పొల మొకటి యమ్మకమునకు వచ్చెను. అప్పుడు పాఠశాలల పరీక్షనిమిత్తమయి రాజమహేంద్రవరమునకు వచ్చియున్న పాఠశాలా పరీక్షకులగు మెట్సుదొరగారిని రాజకీయశాస్త్రపాఠశాలాధ్యక్షులయిన హంటరుదొరగారిని నేనాపొలమునకుఁ బిలుచుకొనిపోయి చూపఁగా, వారది కొనవచ్చునని చెప్పిరి. పండ్రెండువందల రూపాయలకు నేనాపొలమును గొంటిని. ఆపొలముయొక్క మధ్యనుండి యినుపదారి పోయినందున దాని గట్టున కీవలనున్న యెకరముపైచిల్లర మాత్రమే యిన్నీసుపేటలోచేరి పాఠశాలాభవన నిర్మాణమున కర్హమైనదిగా నుండెను. ఇనుపదారిగట్టున కావలివైపుననున్న నాలుగైదెకరముల భూమియు దారి లేకపోవుటచేత వ్యాయామ భూమిగా నుపయోగించుటకైన పనికిరాక వ్యర్థమయ్యెను. తరువాత మొదటిపొలము నంటియున్న యింకొక పొలములో నినుపదారిగట్టున కీవల నున్న యెకరమున్నర భూమిని నన్నూటయేఁబది రూపాయలకు కొని మొదటిదానిలోఁ జేర్చితిని. ఈ రెండు పొలములును మొదట నేను చెరువు సోమయాజులుగారివద్ద కొన్నదానివంటి గట్టిభూములు కావు. ఇవి నల్లరేగటి నూని గడ్డభూములగుటచేత గృహనిర్మాణమునకంతగా నర్హములైనవి కావు.

అయినను పట్టణములో నింతకంటె మంచిస్థలము దొరకకపోవుట చేత పాఠశాలాభవనము నిందులోనే కట్టవలసివచ్చెను. పునాదులు మొదలైనవి వేయుటలో నెంతజాగ్రత్తపుచ్చుకొని గట్టిపని చేయించి నను ముందెప్పుడయిన గోడలు బీటలువాఱు నేమో యని నాకిప్పటి కిని భయముగానే యున్నది.

మా పాఠశాలలోని విద్యార్థులు యూరపియనులను గేలిచేసి పరిహసింతురని ప్రెయిడువూడు దొరగారు భయపడినను మా పాఠ శాలోద్దేశము విద్యార్థులలో నీశ్వరభక్తియు, ప్రభుభక్తియు, సద్వర్త నమును పెంపు చెందింప వలయుననియే కాని వేఱొకటి కాదు. మా పాఠశాలలోని విద్యార్థులు ప్రతిదినమును విద్యారంభమునకు ముందు చేయవలసిన ప్రార్థనములో సంగ్రహభాగ మిది—

"ఓ సర్వకారుణ్యా! మేమెల్లప్పుడును శ్రద్ధాభక్తులతో విద్యనభ్య సించుచు, జ్ఞానాభివృద్ధిని జేసికొనునట్లు ప్రసాదింపుము. విద్య వలన మేము వినయపరులమును, నీతిమంతులమును, అయి సర్వకార్యములయందును నీకుఁ బ్రీతికరముగా వర్తించునట్లు మమ్ము నడుపుము. మేము పొందిన విద్యాలాభమును ఇతరు లకుఁ గూడఁ గలిగించుచు, స్వార్థపరత్వమును మాని సాధ్య మైనంతవఱకుఁ బరోపకార పరాయణత్వమును బూని, ఈశ్వరభక్తియు ప్రభుభక్తియు కలవారమయి, మమ్ముఁ గన్న తల్లిదండ్రులకును, మేము చదివిన పాఠశాలకును, మేము జన్మించిన దేశమునకును ఖ్యాతితెచ్చునట్టి సద్వర్తన మును బడయుటకయి సదా ప్రయత్నించుచుండు బుద్ధిని మాకు కరుణింపుము. ఓం తత్సత్!"

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు పాఠశాలనుంచిన పట్టణ ములోని గృహము, వృద్ధిపొందుచున్న మాపాఠశాలకు చాలనందు

నను, గృహస్వాములు తమకాయిల్లు కావలెనని కోరినందున 1908వ సంవత్సరమునందు ఎడ్వర్డుపాఠశాలనుగూడ మాపాఠశాలలోఁ జేర్చుకొని యాపాఠశాలయున్న గృహమునకు నెల కిరువదిరూపాయల యద్దె యేర్పఱుచుకొని మాపాఠశాలను పట్టణమునుండి యిన్నీసుపేటకుఁ దీసికొనిపోయితిమి. దినదినాభివృద్ధి నొందుచున్న మాపాఠశాల కాగృహము చాలకపోవుటచేత నయిదాఱువందల రూపాయలు వ్యయపెట్టి దొడ్డిలో మూఁడు పెద్దపాకలను వేసి కొన్నితరగతుల నందుంచితిమి. పిమ్మట నవియు చాలకపోఁగా నిరువదిరూపాయల కింకొక యిల్లాసమీపముననే యద్దెకు పుచ్చుకొని క్రిందితరగతుల నందుంచితిమి. బల్లలు మొదలైనవానినిమిత్తమును శాస్త్రోపకరణముల నిమిత్తమును పుస్తకభాండారము నిమిత్తమును శిక్షకుల వేతనాదులలో సంభవించు న్యూనతను పూర్తిచేయు నిమిత్తమును శ్రీపిఠాపురపు రాజుగారు రెండువేలరూపాయ లిచ్చినందున వారు దయచేసిన యాసొమ్ముతో బల్లలు మొదలయినవి సమగ్రముగాఁ గొంటిమి. ఈ యాస్తికపాఠశాలకు మాసమాజమున కత్యంత సహాయుఁడుగా నుండిన దేశిరాజు పెదబాపయ్యగారిని ప్రధానోపాధ్యాయునిగా నియమింప నిశ్చయించుకొంటిమి. ఆయనయు హితకారిణీ సమాజ పాఠశాలా విషయమున నెంతో యుత్సాహముతో పనిచేయఁ గృతనిశ్చయుఁడయి యుండెను. ఆయనయే యీపాఠశాలకు ప్రధానాధ్యాపకుఁడైనపక్షమున పాఠశాల యత్యున్నతస్థితికి వచ్చుటయే కాక పట్టణములోని లోకోపకారక సమాజములన్నియు మహోచ్ఛదశ నొందియుండును. అటువంటి విద్యావినయ సద్గుణసంపన్నుని యుపదేశ లాభము పొందు భాగ్యము మాపాఠశాలకు లభించినది కాదు. తానొకటి తలఁచిన దైవమొకటి తలఁచును. ఆయన వ్యాధిబాధితుఁడయి యౌషధసేవ నిమిత్తము చెన్నపట్టణము పోయి

యుండి యక్కడ 1908 వ సంవత్సరము మార్చినెల 9 వ తేదిని ఈశ్వర సాన్నిధ్యము నొందెను.

నేను కొన్న హుకుముపేట భూములలో పాఠశాలా మందిరమును కట్టించుటలో శ్రీ కంచుమర్తి వేంకటసీతారామచంద్రరావుగారు నాకత్యంత సహాయులయి పనిచేయించిరి. పని నేననుకొన్నంత శీఘ్రముగా జరిగినదికాదు. ఎండకాలములో నేను బెంగుళూరికి వెళ్ళుటకుముందు నేను బెంగుళూరినుండి తిరిగి వచ్చులోపల పనిని విశేషభాగమును ముగించెద మని శ్రీ రామచంద్రరావుగారు సెల విచ్చిరి. అయినను పనివాండ్రు తగినంతమంది దొరకకపోవుట చేతనో యెండలలో పనిచేయుట కష్టమగుటచేతనో పని విశేషముగా సాగినదికాదు. అందుచేత నేనుదయాస్తమానములయందు ప్రతి దినమును పోయి పనిని చూచుచు నెక్కువ చురుకుదనముతో పని చేయింప నారంభించినితి. గృహనిర్మాణ సంబంధమునఁ గొన్ని విషయములలో నేనును రామచంద్రరావుగారును నేకాభిప్రాయము గలవారము కాకపోయితిమి. నే నెప్పుడును నామనసు వచ్చినదారిని పోయెడివాఁడనే కాని యితరులు చూపిన దారిని పోయెడివాఁడను గాను. ఇద్దఱు యజమానుల యాజ్ఞక్రింద కార్య మెప్పుడును సరిగా సాంతము నొందదు. అందుచేత నేను రామచంద్రరావుగారి సాహాయ్యలాభము వదలుకొని స్వేచ్ఛగా నే నొక్కఁడనే కార్యభారమును పూనవలసినవాఁడ నయితిని. ఇటుకలు, రాళ్లు, సున్నము, కఱ్ఱలు మొదలయిన పరికరములనన్నిటిని నేను స్వయముగానే చేరమాడి సాధ్యమైనంత చౌకగా కొని నా పర్యవేక్షణము క్రిందనే పని చేయించితిని. మా పాఠశాలలో సహాయాధ్యాపకుఁడుగా నున్న కుందూరి వేంకటరత్నముగారు పనివాండ్రకు కూలి యిచ్చుట జీతము లిచ్చుట యాదానికలు పుచ్చుకొనుట నియమపత్రములను

వ్రాయించుకొనుట మొదలయిన పనులలో నాకు మిక్కిలి సహాయు లుగా నుండిరి. ఈపనిలో నాకు సహాయులుగా నున్నవారి కందఱి కిని నా కృతజ్ఞతాభివందనములను చేయుచున్నాను. మొట్టమొదట నిరువదివేల రూపాయలతోఁ గృహమును నిర్మింపవలె ననుకొంటిమి గాని నలువదివేల రూపాయలతోఁగాని సుందరవిశాలభవన నిర్మా ణము కానట్టు కనఁబడెను. మాకోరికలను సఫలముచేయుటకయి కల్పతరువువలె శ్రీపిఠాపురపు రాజుగారు మాపెరటిచెట్టయి నిలిచిరి. అందుచేత మాయభీష్టములు నిరంతరాయముగా సిద్ధింప నారంభించి నవి. వారా నలువదివేల రూపాయలు నియ్య ననుగ్రహింపఁగా నలు వదివేల రూపాయల యిల్లఱువదివేల రూపాయలయి ల్లయ్యెను. ముందువైపున మాత్రమే రెండవయంతస్తు వేయఁ దలఁచుకొన్న దన్నివైపులను రెండస్తులుగల దివ్యసౌధ మయినది. ఈశ్వరానుగ్రహ మువలనను రాజుగారి దయవలనను మా యీ పాఠశాలా భవనము పట్టణమున కలంకారభూతమయిన గృహరాజ మయిన దని చెప్ప వచ్చును. మంచిదాత లభించినప్పు డర్థుల యాసకు మేర యుండదు. గదా ? అట్లని విద్యాలయమును కట్టించుటలో వ్యయమయిన ధన మంతయు నా సొమ్మయినట్లే భావించుకొని బద్ధహస్తుఁడ నయి యుపయోగించితినిగాని పరులసొమ్మని యుదారహస్తుఁడనయి విని యోగింపలేదు. ఈభవనమును చూడవచ్చిన యొక యనుష్ఠాన నియుక్త వాస్తువిద్యావిశారదుఁడు (Executive Engineer) దీని నిర్మాణమునకు లక్షయిరువదియైదువేల రూపాయ లైనవా యని యడిగెను. ఈపాఠశాలా భవనములో రెండవ యంతస్తుమీఁద వేయేసిమంది పట్టఁదగిన రెండు సభా సదనము లున్నవి. ఈపాఠ శాలా మందిరము నీతిధర్మ విద్యానిలయమయి సదా శ్రీ రాజావారి కీర్తిని బ్రకటించుచుండును గాక ! ఈ పాఠశాలలో స్త్రీలు వేఱుగా

విరామకాలములో వచ్చికూరుచుండుటకయి యొక విశాలమైనగది విద్యార్థినుల యుపయోగార్థమయి కట్టఁబడియున్నది.

తక్కిన పాఠశాలలకంటె హితకారిణీసమాజమువారి యీ పాఠశాలలో రెండు విశేషము లున్నవి. అందొకటి పురుషులతోడి పాటుగా విద్యాభిలాషగల స్త్రీలనుగూడఁ జేర్చుకొని ప్రవేశపరీక్షవఱకును జదివించుట. బాలురపాఠశాలలో బాలికలను జేర్చుకొనుట యనర్థదాయకమని ప్రారంభములో కొందఱు భావించి సందేహపడిరి. వారి సందేహమునకు కొంత యవకాశ మున్నను పరీక్షించి చూతమని స్త్రీలను గౌరవించెడు సద్గుణమును పురుషులకు చిన్నతనములోనే నేర్పవలెనన్న యాశతోఁ గలిపి స్త్రీలను చదివించెడు పద్ధతికి దారి యేర్పఱిచితిని. స్త్రీలు పురుషులతోఁ గలిసి యేకాసనము మీఁదఁ గూరుచుండక వేఱు ప్రక్కను తమకయి యేర్పఱుపఁబడిన బల్లలమీఁద ప్రత్యేకముగాఁ గూరుచుందురు. ఒకరిద్దఱు దుష్టబాలు రారంభదశలో కొంచెమల్లరి చేయ నారంభించిరి. కాని యుక్తసమయములో కనిపెట్టి వారివ్యతిక్రమమునకుఁ దగిన దండన చేయుటచేత బుద్ధి తెచ్చుకొని తమ యవినయమును మానివేసిరి. ఇప్పుడు బాలురకు బాలికలయందు గౌరవము చూపుట యభ్యాసమైనది. బాలిక లెదురుపడినచో బాలురు ప్రక్కకుఁ దొలఁగి బాలికలకు దారి యిత్తురు. ఒకయువతి క్రమముగా నాలవదైదవ యాఱవ ఫారములలో మూఁడు సంవత్సరములు చదివి పాఠశాలాంతిమ పరీక్షలోఁ (School Final Examination) గృతార్థురాలయినది. మొదటి రెండవ మూఁడవ నాల్గవ ఫారములలో బాలిక లిప్పుడు చదువుచున్నారు. వీరిలో యుక్తవయస్సు వచ్చినవారును కొందఱున్నారు. ఇప్పుడు మాపాఠశాలలో నింగ్లీషువిద్య నపేక్షించిన బాలిక లిరువది ముప్పది మందిచదువుచున్నారు. బాలికలకు బాలురవలన నే విధ

మయిన తొందరలును గలుగకుండ నుపాధ్యాయులు కనుగలిగి చూచు చుందురు. విరామసమయములో బాలికలు కూరుచుండుగది కేవల నుపాధ్యాయులగదియుండుటచేత బాలురెవ్వరును స్త్రీలగదివంక పోవుటకైనను సాహసింపరు. సాధ్యమయినయెడల నెప్పుడైనను బాలికల యున్నత పాఠశాలగాఁగూడ నుపయోగపడవలెనన్న యాలోచనతోనే నేనింత పెద్దభవనమును గట్టించుటకుఁ బ్రయత్నించితిని. సాధారణముగా బాలికలు బాలురతోఁ గలిసియే మూఁడవ ఫారమువఱకును జదువవచ్చును. అప్పటికి బాలికలు కొంత యెదుగవచ్చునుగాన పయిమూఁడుతరగతులలోను స్త్రీలేయుపాధ్యాయినులుగానుండి విద్యచెప్పుట యుక్తముగానుండును. స్త్రీలకుఁ బ్రత్యేకముగా నయిదాఱు తరగతుల నుంచుటకుఁగూడ పాఠశాల తగియున్నది. మాపాఠశాలలో స్త్రీ కందఱికిని ధర్మార్థముగానే చదువు చెప్పెదము. ఇట్లు మేము చూపిన మార్గము ననుసరించి కాకినాడ కాలేజీవారును స్త్రీలను దమపాఠశాలలోఁ జేర్చుకొనుట కారంభించి యున్నారు.

మా పాఠశాలలోఁగల రెండవ విశేషము పంచమబాలురను గూడ నాయాతరగతులలోఁ జేర్చుకొని చదువుచెప్పుట. కొన్ని సంవత్సరములనుండి యయిదాఱుగురు పంచమబాలురు మాపాఠశాలలోని యున్నతవర్గములలో చదువుచున్నారు. వారికిని తక్కినబాలురకును భేదమేమియుఁ గనఁబడదు. వారును మంచివస్త్రములను గట్టుకొని శుచిగానుండి వినయ వినమ్రతలతో వర్తించుచుందురు. తక్కిన బాలురును వారిని దూషింపక ద్వేషింపక వారియెడల సౌభ్రాత్రమును జూపుచున్నారు. ఎటుఁగనివారికి వారిని చూపి పంచమబాలురని చెప్పినఁగాని యితరులకును వారికిని భేదము తెలియరాదు. బాలికలకు వలెనే మొదటిఫారము మొదలు పయితరగతులలోఁ జదువు పంచమ

బాలురకును జీతములు గైకొనక ధర్మార్థముగాఁ చదువు చెప్పఁబడును. క్రైస్తవపాఠశాలలోఁ గూడ క్రైస్తవులుకాని మాలబాలురను జేర్చుకోరని నేను కొంతకాలముక్రిందట విన్నప్పుడు నాకత్యాశ్చర్యము కలిగినది. మా యున్నతపాఠశాల స్థాపింపఁబడిన తరువాత మాపట్టణములోని క్రైస్తవ మతాచార్యులు తమ యున్నత పాఠశాలను దీసివేసి దానిని మాధ్యమికపాఠశాలనుగా మార్చిరి.

అన్నియు బాగుగానే యున్నవికాని మాపాఠశాల యిరుగు పొరుగులు మాత్ర మంత మంచివికావు. దాని సమీపములోనున్న వానిలో విశేషభాగము బీదలు వసించు తాటియాకులయిండ్లు. మాపాఠశాల యిక్కడ కట్టఁబడిన తరువాత చుట్టుపట్టుల స్థలముల వెలలు హెచ్చినవి. మాపాఠశాలకు దక్షిణమునసున్న నాలుగువందలకు లోపల రాఁదగిన యైదువేల గజములస్థలమును మేము నాలుగు వేలరూపాయలిచ్చి కొనవలసివచ్చినది. ఈ నాలుగువేల రూపాయలనుగూడ శ్రీ పిఠాపురపురాజుగారే దయచేసిరి. స్థలముల కయిన నేమి మందిర నిర్మాణమున కయిన నేమి యుపకరణ సంపాదనమున కయిన నేమి యీవఱకీ పాఠశాల విషయమున శ్రీ పిఠాపురపురాజు గారు డెబ్బదివేలరూపాయలను వ్యయపెట్టిరి. ఇంతటి మహౌదార్యమును జూపిన శ్రీరాజావారిపేరీ పాఠశాలకుంచిన నెంతో సముచితముగా నుండియుండును. అట్లు జరగనందుకు నే నెంతయు జింతిల్లుచున్నాఁడను.

1911 వ సంవత్సరము నవంబరునెల 27 తేదీని పాఠశాలాగృహప్రవేశోత్సవము మహావైభవముతో జరపబడినది. కలకత్తానగరము నుండి సిటీకాలేజి యధ్యక్షులైన హేరంబచంద్రమైత్రగారువచ్చి గృహప్రవేశోత్సవము నడిపి యం యుపన్యాసముచేసిరి. నాఁటి సాయంకాలము పట్టణములోని ప్రముఖులందఱును దయచేసి యానందించిరి.

శాలలో నిప్పుడాస్తిక ప్రబోధమేమియు జరుగుచుండలేదు. ఈ పనిని సమర్థతతో నిర్వహించుటకు శాస్త్రికు లుపాధ్యాయులలో నెక్కువగా నుండవలెను. పాఠశాలకు చుట్టును గోడ లేకపోవుట యిప్పు డొక కొఱఁతగానున్నవి. ఈకొఱఁత శీఘ్రముగానే తీరవచ్చును. రు 1200 లకు కొన్నపొలములో నినుపదారిగట్టున కావలనున్న భాగము రు 1250 లకు విక్రయింపఁబడి యాధనముతోను మఱికొంత ధనముతోను పాఠశాలకుత్తరపు వైపుననున్న తాటాకుల యిండ్లవరుస యొకటి కొనివేయఁబడినది.

1907-వ సంవత్సరము వేసవికాలపు సెలవులకు దరువాతఁ వితంతు శరణాలయమును పట్టణములోని మాయింటినుండి తోఁట లోనికిఁ దీసికొనివచ్చితి నని యీవఱకే చెప్పియుంటినిగదా! శరణాలయములోనివారికి విద్య చెప్పుటకయి ప్రవేశపరీక్షయందుఁ గృతార్థులయిన పురుషులనిద్దఱిని కుట్టుపని నేర్పుటకయి యొకస్త్రీనిబెట్టి పాఠశాలను సరిగా జరపుచుండుటయేకాక నేనును పాఠశాలలో పనిచేయు చుంటిని. నాభార్య వారికి సంగీతము నేర్పుచుండుటయేకాక క్రొత్తగా తోఁటలో గట్టఁబడిన యానందాశ్రమములోఁ బ్రతిదినమును ప్రాతస్సాయంకాలములయందు వారిని గొనిపోయి ప్రార్థనము జరపుచుండెను. వారికిఁ జిత్రలేఖనము నేర్పుటకయి కొంతకాల మొక యుపాధ్యాయుని సహితము పెట్టితిని. శరణాలయములోఁ జేరినవారు సాధారణముగా వివాహాపేక్షచేతనే వచ్చువారగుటచేత వారికిఁ జదువునందంత శ్రద్ధ యుండదు. వారిలో నెవ్వరికైన విద్య చెప్పించి బాగుచేసి వితంతుశరణాలయకార్యములను నిర్వహించుట కానక్తికలవారినిగాను సమర్థురాండ్రనుగాను దిద్దవలెనని నేనెంతో ప్రయత్నము చేయుచుంటిని. ఇట్లుండఁగా నాబాల్యసఖుఁడైన కనపర్తి యోగానందముగారి కొమారిత సుందరమ్మయను పదునాలేండ్ల ప్రాయముగల బాలవితం

తువు 1907-వ సంవత్సరమున వితంతు శరణాలయమును జేరెను. ఆమె మాయింటనే యుండఁగోరినందున నామె తండ్రిగారి యెడల నాకుండిన మిత్రభావమునుబట్టి యక్లేయుంచుకొని యామెను నేనును నాభార్యయుఁ బుత్రికాప్రేమతోఁ జూచుచుంటిమి. ఆమె విద్యయం దాసక్తికలదయి సద్వర్తనకలదయి మాయం దాదరము గలదయి మాకుటుంబములోని దానివలెనేయుండి, తాను మమ్మెప్పుడును విడువ ననియు వివాహమునైనను మానివేసి వితంతు శరణాలయమును జూచుట మొదలయిన పరోపకారకార్యములయందేతనకాలము కడపెద ననియు బాల్యోత్సాహముచేత పలుకుచుండెను. ఆమె విషయమయి నేనును విశేషశ్రద్ధపహించి యామెకు బ్రాహ్మమత సిద్ధాంతములను బోధించుచు పరోపకారమునకుఁ బురికొల్పునుపదేశములను జేయుచు పాఠశాలకుఁబోవనప్పు డింటివద్ద స్వయముగా నేనే యామె కింగ్లీషు నేర్పుచు సంవత్సరకాలములో నింగ్లీషునందు రెండవఫారమునకుఁ దగి యుండునట్లు చేసితిని. ఆవఱకు శరణాలయములోనున్న వితంతువుల కొక్కొక్కరికి భోజనముల నిమిత్తము నెల కయిదేసి రూపాయల చొప్పున నిచ్చుచు, ఆసొమ్ముతో వారికిఁ గావలసినభోజనపదార్థములను దెప్పించియిచ్చుచు, బట్టలు పుస్తకములు మొదలయినవి వేఱుగా నిచ్చుచు, వైద్యవ్యయములను మేమే భరించుచుంటిమి. వితంతు శరణాలయకార్యభారము నిర్వహించుట పయివారికి సులభముగానే కనఁబడినను పనిచేయువారి కంత సులభముకాదు. కేవల విద్యా దానము నిమిత్తమే యేర్పడినచోఁ గొంతసులభ మగునేమో కాని మే మవలంబించిన పద్ధతిప్రకార మెంత మాత్రమును సులభముకాదు. దానికార్యనిర్వహణమునం దనేకకష్టము లున్నవి. వచ్చిన వితంతు వులు నానాప్రదేశములవా రయి, నానా గుణములు కలవా రయి యుందురు, వారిలో కొందఱు సత్స్వభావము గలవారును కొందఱు

పక్షము మాటాడలేదని భోజనము చేయక యలిగి కూరుచుండురు; రోగమువచ్చినప్పుడు తెచ్చియిచ్చిన మందులు పుచ్చుకోక యల్లరి చేయుదురు. ఇటువంటి బాధకము లెన్నెన్నియో యుండును. ఈ సంబంధమున జరగిన వృత్తాంతమొకటి చెప్పెదను. హనుమాయమ్మ యను వితంతు పోకతె కృష్ణామండలమునుండి వచ్చి శరణాలయము లోఁజేరెను. ఆమె కన్నులు కొంత జబ్బుగా నుండెను. రాజమహేంద్రవరములో మందులు వేయించితిమి గాని కుదురలేదు. అందుచేత మేమా సంవత్సరము (1908-వ సం॥) బెంగుళూరి ప్రయాణమును మానుకొని యామెనిమిత్తమయి నేనును నాభార్యయు నామెను వెంటఁబెట్టుకొని చెన్నపట్టణము పోయి యామెకంటివైద్యము చేయించుచు వేసవికాలములో నక్కడ నుంటిమి. మే మెక్కడకయిన వెళ్లినప్పుడు మాబండిలో నామె నెక్కించుకొని తీసికొనిపోయి చూపఁదగిన విశేషములను జూపుచుంటిమి. ఇట్లుండగా నామెకు కంటి చికిత్స చేయుచుండిన వైద్యుఁడామెను గాలిలోను ఎండలోను బైటఁద్రిప్పవలదని విధించెను. అందుచేత మే మొకనాఁ డామె నింట దిగవిడిచి బయట బండిలోఁ బోయితిమి. తన్ను మావెంటఁ దీసికొని పోనందున నాదినమున నామె యేడ్చిన యేడుపును చేసినయల్లరియుఁ జెప్ప శక్యముకాదు. ఆయేడుపుచేత నామెకన్నులు వాచి మరల మొదటికి వచ్చెను. ధనవ్యయమును గూర్చుండఁబెట్టి యుపచారము చేయుటయు నట్లుండగాఁ గృతజ్ఞత లేక యీయామె చేసినయల్లరికి మేమేల యీయామెను దీసికొని వచ్చితిమా యనిమామనస్సుల కెంతో విచారము కలిగెను. ఇది యంతయు మూఢత్వముయొక్క ఫలముగాని వేఱుకాదు. ఈమె కన్నులు బాగుచేయించి మేము చెన్నపట్టణమునుండి తిరిగివచ్చిన తరువాత నీమెయు మఱియిద్దఱును కలిసి యొకదినమున వంట మాని రొట్టె

చేయుటకుఁ బ్రయత్నింపగా వలదని వారించి యన్నమే వండుకొండని వితంతు శరణాలయమును చూచుచుండిన సుందరమ్మ విధింపఁగా నన్నములోని కేమియు లేదని వండుకొనక తగవు పెట్టిరి. ఈముగ్గురే యొక నాఁడు నా వద్దకు వచ్చి తమకు తక్షణము పెండ్లిచేయనియెడల లేచిపోయెద మని బెదరించిరి. నేను వీరిని వదల్చుకొనుటయే క్షేమకరమని తలఁచి యామెకొక సంబంధమును గూర్చి కరగపురమునుండి దండపాణిగారు నాపేర వ్రాసియుండినందున హనుమాయమ్మను పొగబండిలో నెక్కించి యాయనకు తంతి వార్తనునంపి పంపివేసితిని. తక్కిన వారిద్దఱినిమఱియిద్దఱికిచ్చివివాహములు చేసి వారిని వదల్చుకొని పంపివేసితిని. వారిట్లు తొందరపడకుండినపక్షమున వారి కింతకంటె మంచివరులు లభించియుందురు. తరువాత కష్టములు పడుచు వారిలో నిరువురు తాముపడిన వేగిరపాటునకుఁ బశ్చాత్తాప పడుచు నాకు వ్రాసిరి. వంటవిషయమయి పయియట్లు జరిగినదానికి చిలువలు పలువలు కల్పించి యాకాశవాణిలో శ్రీమతి సుందరమ్మను నిందించుచు వ్రాసి ప్రకటించిరి.

వితంతుశరణాలయములోనివారి కొక్కరొక్కరికి నెలకై దేసి రూపాయలిచ్చుచు వారికిఁ గావలసినవాని నారూపాయలతోఁ గొని యిచ్చుచుండినప్పుడు సుందరమ్మ పెత్తన మేమున్నదని యెవ్వరైన నడుగవచ్చును. కొంతకాల మాప్రకారముగానే జరిగెనుగాని తరువాత నీవిషయమునఁ గొంతమార్పు కలిగెను. దానివిషయమైన చరిత్రము నిచ్చటఁ గొంత చెప్పవలసియున్నది. వివాహము చేసికొన్న వారిలోనే యొకరు వితంతు శరణాలయములోని కొక వితంతువును బంపిరి. ఆవితంతువు గర్భిణియయి యుండిన ట్లల్పకాలములోనే తెలియవచ్చినది. అప్పుడా వితంతువు నేమి చేయుదమా యని నేనును నాభార్యయు నాలోచించితిమి. పూర్వము మేము చెన్నపట్టణమునకు

వెళ్ళకముం దిట్టి వితంతువే యొకతె మాయింటికివచ్చెను. కొన్నిదినములలో నేకడుపుతోనున్నట్టు తెలియరాఁగా మేమావితంతువును మాయింటినుండిపంపివేసితిమి. ఆవితంతువుతమయూరికిపోవక రాజమహేంద్రవరములోనే యుండి గర్భపాతమునకయి యొక యెఱుకలదాని దగ్గఱ మందు పుచ్చుకొని చచ్చిపోయెను. ఆదుర్మరణవార్తను విన్నప్పుడు మాకెంతో దుఃఖము కలిగెను. అట్లే యీ వితంతువును గూడ వెడలఁగొట్టినయెడల నీమెగతియునట్లే యగునని మాకుఁదోఁచినది. ఇటువంటి వితంతువును శరణాలయములో నుంచుటనీతిగాదు. వితంతు శరణాలయములోనివా రందఱును కళంకములేని శుద్ధవర్తనము కలిగియున్నవారేయని నేను చెప్పలేనుగాని యెవ్వరైనరహస్యముగా స్వభావదౌర్బల్యమునకు లోఁబడినవారుండ వచ్చినను గర్భవతులైనవా రెవ్వరు నుండరు. ఈమెను వెడలగొట్టుటకును మాకు మనసుగొలుపలేదు. అందుచేత నేమిచేయుదమా యని యాలోచించి యట్టి వారినిమిత్తమయిపతితయువతీరక్షణశాల (Rescue Home యొకటి స్థాపింపవలెనని నిశ్చయించి యామెను వితంతుశరణాలయమునుండి తొలగించి వేఱొకచోట నొకగదిలోనుంచి కాపాడితిమి. ఆమెకు నాభార్యయే పురుడు పోసెను. మగశిశువుగలిగి చచ్చిపోయెను. ఆపయిన గుంటూరులో వితంతువివాహము చేసికొని భార్య బలవన్మరణము నొందఁగా విధురుఁడైయున్న యొక బ్రాహ్మణపురోహితుఁ డామెను వివాహము చేసికొనెదనని రాఁగా నాతనికిచ్చి వివాహము చేసి పంపివేసితిమి. తరువాత నీపతితయువతీ రక్షణశాలకు (Rescue Home) ఒక కోమటి వితంతువు వచ్చెను. ఈకోమటివితంతువు గర్భవతియైనది కాదు. చెడిపోయినదే. ఈబాలవితంతువు కాకినాడలో తన పుట్టినింటినుండి కొన్ని నగ లెత్తుకొని యొక తూర్పువాని (శూద్రుని) వెంట లేచిపోయెను. బంధువులు

దండవిధాయకునియొద్ద నభియోగము తేఁగా, నిసుపనారిబండి నెక్కుటకు పోవుదారిలో రక్షకభటులా యిద్దఱిని నగలతో పట్టుకొనిరి. విమర్శలో నా బాలవితంతువు తానే నగల నెత్తుకొని వచ్చితినిగాని వారి కేమియు సంబంధము లేదని నాయకుని తప్పింపఁ జూచెనుగాని దండవిధాయకుఁ డిద్దఱిని దోషులనుగా నిశ్చయించి వాని కాఱునెలలును కోమటి వితంతువునకు నాలుగు నెలలును కారా గృహవాస దండనమును విధించెను. వారి నిరువురను శిక్ష ననుభ వించుటకయి రాజమహేంద్రవరమునకు తీసికొని వచ్చిరి. వారి వెంట వైశ్యవితంతువు బంధువులు పినతండ్రి మొదలైనవారు కలవరించుచు రాజమహేంద్రవరమునకు వచ్చిరి. వారు నాయకుని దూషణఁ జేసి నాయికను విడిపింపఁ బాటుపడిరి కాని న్యాయసభలో వారి ప్రయ త్నము నెఱవేఱినది కాదు. వారు తమ బాలవితంతువును కారా గృహప్రవేశము చేయించి వచ్చి చెఱనాలుగు నెలలు గడచి విడుదలయయి వచ్చినతరువాత తమ పిల్లను రక్షింపవలెనని నన్నును నా భార్యను బహువిధముల దీనముగా వేఁడుకొనిరి. వారిప్పుడు నిట్లు పలు సారులువచ్చి మమ్ము బ్రతిమాలుకొనుటచేఁ గాక యా బాలవితంతువును కారాగృహ విమోచనానంతరము మాయింటికిఁ దీసికొనివచ్చి నా భార్య కాళ్లమీఁదఁ బడవేసిరి. ఇఁకముందు మంచినడతఁ గలిగి యుండెదవా యని యా వితంతువు నడిగి, యుండెదనని చెప్పినమీఁ దట మే ముభయులమును సంవత్సరకాలము పరీక్షించి చూచెద మనియు నీలోపల నెప్పుడైన మరల చెడునడతలోఁ బ్రవేశించిన పక్షమున వెంటనే వెడలఁగొట్టెద మనియుఁ జెప్పి యీవితంతువును పతితయువతీరక్షణశాలలోఁ జేర్చుకొంటిమి. ఈ వితంతువు పేరు కనకరత్నము. ఈకనకరత్నమునునాభార్యకనిపెట్టిచూచుచు చదువు చెప్పి హితబోధలు చేయుచుండెను. రెండుమాసము లగునప్పటికి

కనకరత్నముయొక్క ప్రియుఁడు చెలసాలనుండి విముక్తుఁడయివచ్చి తన ప్రియురాలిని తనవెంటఁ బంపుమని యడిగెను. నేను వానిని తోఁటలోనికి రాకుండ జేసి కనకరత్నమును మఱింత జాగరూకతతో గనిపెట్టుచుంటిని. వాఁడయిదాఱుసారులు తోఁటవద్దకు వచ్చి చూచుచువచ్చెనుగాని మాసేవకులు వానిని తోఁటలోనికి వచ్చిన పక్షమున రక్షకభటులకొప్పగింతు రని భయపెట్టినందున నిరాశచేసి కొని వాఁడు రాజమహేంద్రవరమును విడిచిపోయెను. ఇట్లు కొన్ని మాసములు జరిగినతరువాత కాకినాడనుండి సలాది కృష్ణమూర్తి కనకరత్నమును వివాహము చేసికొనెదనని వచ్చెను. ఈకృష్ణమూర్తి పునర్వివాహము చేసికొన్న కోమటి వితంతువునకు పుట్టినవాడు. నేనా కోమటి వితంతువును కృష్ణమూర్తికిచ్చి వివాహముచేసి వారి నిద్దఱిని పదినెలలు నా గృహశాలలోనే యుంచి మేముభయులమును కనిపెట్టి చూచుచుంటిమి. ఈతనికి నగరపారిశుధ్య విచారణ కార్య స్థానములో పన్నులు రాఁబట్టెడు పని దొరకినది.

వీరు తమకు వచ్చెడు జీతము తమ భోజనమునకే సరిగా చాలకున్నదనియు, తామింట నొకయంగడిపెట్టి భోజనపదార్థముల నంగళ్ళవాడలో నిచ్చెడు వెలలకే యమ్మెదమనియు, వితంతు శరణాలయములోని వారికిఁ గావలసిన వస్తువులను తమవద్ద నేకొనునట్లు చేయవలసినదనియు, నన్నడిగిరి. నేనందున కంగీకరించి తమకుఁ గావలసిన పదార్థములను వీరివద్దనే కొనవలసినదని వితంతు శరణాలయములోనివారితోఁ జెప్పితిని. వారాప్రకారముగాఁగొనుచు, తమ కిచ్చెడి మైదుపాయలును భోజనమునకుఁ జాలకున్నవని మొట్ట పెట్ట నారంభించిరి. వారు వీరివద్ద సరకులను రొక్కమిచ్చి కొనుచుండిరి. ఇట్లు కొన్నిమాసములు జరిగినది. ఒకనాఁటి యుదయమున నేనొక మిత్రునితో మాటాడుటకయి పట్టణమునకుఁ బోవుచుండఁగా, పంచదార లేదు తెమ్మని నాభార్య నాతోఁజెప్పెను. అక్కడి వెలకే యిచ్చును గనుక కృష్ణమూర్తి యంగడిలో రొక్క మిచ్చికొనుమని చెప్పి నే నూరిలోనికిఁ బోయితిని. నేను మిత్రునితో

మాటాడి వచ్చునప్పుడంగళ్లవాడలో బండినిలిపి మైదణాలిచ్చి వీసెడు పంచదారను కొని తెచ్చితిని. మీరుకూడ తెచ్చితిరా నేనిక్కడ కనకరత్నమువద్ద పంచదారను కొంటినని నాభార్య చెప్పెను. ఎట్లుకొంటివని యడుగఁగా నేణణాలిచ్చి వీసెడు పంచదార కొంటినని చెప్పెను. అప్పుడేమియు ననక కృష్ణమూర్తి యింటికి వచ్చినతరువాత పంచదార యెట్లుకొనుచున్నానని యడిగితిని. వీసె యాఱణాలకుకొని యొక యణాలాభమున కమ్ముచున్నా మనియు, మీకుఁ గావలసినయెడల నాఱణాలకే యిచ్చెదమనియు నతఁడు చెప్పెను. శ్రీమతి సుందరమ్మను మాకు సహాయముగా వితంతు శరణాయములోఁ బనిచేయుచుండునట్లు నియమించితిని. అయిదు రూపాయలును భోజనమునకు చాలకున్నవని వితంతువుల మొట్ట లెక్కవకాఁగా నొక నెల స్వయముగావస్తువులను కొని తెప్పించి వాడి చూతమనియు, అయిదు రూపాయలును నిజముగానే చాలనిపక్షమున వారికిచ్చెడు మాసదక్షిణను లెక్కవచేయుదుమనియు, ఉద్దేశించి, వారికి రూపాయ లియ్యక సరకులను నేనే తెప్పించి యొకగదిలోవేసి తాళమువేసి వాడ కోరినప్రకారముగా భోజనపదార్థముల నిచ్చుచుం డవలసినదని శ్రీమతి సుందరమ్మగారిఁ జెప్పి యొప్పగించితిని. ఆమె యాప్రకారముగా నిచ్చి పద్దు వ్రాయఁగా మొదటినెలలో చాలక పోవుటకు మాఱుగా మొత్తముమీఁద నొక్కొక్కరి కయిదురూపా యలలోకొన్ని యణాలు మిగిలెను. మిగిలిన సొమ్ము పెట్టివారికి రవి కలగుడ్డలు కొనియిచ్చితిని. రెండవ నెలలోకూడ నాప్రకారముగానే చేయఁగా మఱి కొంచెము మిగులుచుండెను. ఆగిమిలిన సొమ్ములో వారికా నెలలో మఱికొన్ని వస్తువులనుకొని యిచ్చితిని. అప్పటినుండి వారికి రొక్కముగానిచ్చుట మాని వేసి కావలసిన భోజనపదార్థము లను మేమే కొనియిచ్చు పద్ధతిని బెట్టితిని. ఆవఱకు నేను వారికి నెల కైదేసి రూపాయలచొప్పున నిచ్చినప్పుడు చాలకపోవుటకు కారణము

వస్తువుల నెక్కువవెలల కిచ్చుటమాత్రమే కాక తప్పుతూనికలు తూచుట తప్పుకొలతలు కొలుచుట కూడనయియున్నది. వారి తూచెడు తూనిక రాళ్ళను కొలిచెడుకొలతపాత్రములనునేనారంభము లోనే తెప్పించి పరీక్షించి చూచితిని. వీసెరాళ్ళను కుంచములును సరిగానే యుండినను చిన్న గుండ్లును కొలతపాత్రములును పిచ్చవిగా నుండెను. ఏబులపు రాళ్ళైదు వేసినగాని వీసె తూగదు; తవ్వలు తొమ్మిది పోసినఁగాని కుంచము నిండదు. ఇటువంటి కార్యముల యందు కనకరత్నము ప్రవీణురాలు; కృష్ణమూర్తి యంతసమర్థుఁడు కాకపోయినను భార్య నడపునట్లు నడచువాఁడు. వీరివద్ద వస్తువులు కొనుట మానివేయఁగానే కనకరత్నము నాయం దత్యంతాగ్రహము గలదయి తోఁటలోఁ దాము కాపురముండుట మాకేమో మహోప కారమయినట్టుగా మేము తోఁటవిడిచి లేచిపోయెదమని నాభా ర్యతోఁ జెప్పెను. తోఁటలోనుండి లేచిపోయెదరా యని నేనుకృష్ణ మూర్తి నడుగఁగా లేచిపోయెదమని యతఁడును జెప్పెను. ఎప్పుడు లేచిపోయెదరని యడిగినప్పు డానెల కడపటనని యుత్తర మిచ్చెను. అందుచేత నేను మాపట్టణగృహములోనున్న నాపుస్తకములను తెప్పించి వారున్న గదులలోనొకదానిలో పెట్టించుటకు నిశ్చయించి యానెలకడపట నొకపుస్తక మంజూషను దెప్పించి గదిలో పెట్టింప నారంభింపఁగానే 'మేమెక్కడకుఁ బోయెదము? మమ్మాదరిలో నెవ్వరు చూచెదరు? అని వారంగలార్చ మొదలుపెట్టిరి. నేను తరువాత నాపుస్తకములను బెట్టించుటకై తోఁటలోని మామేడయింటిని జేర్చి యొక పెద్దయింటిని గట్టించితిని. కృతఘ్నులయినను నాభార్యయు నేనును నిట్టివారియందు దయచూపుచునే యుంటిమి. నేనెక్కడకు పోయినను నాభార్య నావెంటరాక నన్నెప్పుడును విడిచియుండెడిది కాదు. కడసారి నేను కాకినాడకు వెళ్ళినప్పుడీకనకరత్నమునకు

పురుడు పోయుటకయి యామె నావెంటరాక నిలిచినది. పైని పేర్కొనఁబడిన యిరువురునుగాక మఱి నలుగు రప్పుడీ పతిత యువతీ రక్షణశాలలోఁ జేరిరి. వారిలో నింకొకరికి వివాహమయ్యెను. తక్కిన వారు బిడ్డలనుగని చెప్పియుఁ జెప్పకయు పాఱిపోవుచు వచ్చిరి. నాభార్య యవసానకాలమునం దొక బ్రాహ్మణ వితంతువు బిడ్డను గని విడిచి పాఱిపోఁగా నాభార్య యాబిడ్డను పెంచుచుండెను.

వితంతు శరణాలయవిధులిక్రింద నుదాహరింపఁబడుచున్నవి.—

"శ్రీరాజమహేంద్రవరపుర విక్టోరియాహిందూవితంతుశరణాలయము.

అనాథయువతుల యుపయోగార్థముగా రాజమహేంద్రవరమున వితంతుశరణాలయ మొకటి పెట్టఁబడియున్నది. నిరాధారలయి యున్న యనాథకాంతల కష్టములను గొంతవఱకు తొలగించి, విద్యాదానమువలన వారిని సగౌరవజీవనమున కర్హురాండ్రనుగాఁ జేయుట యీ శరణాలయముయొక్క ముఖ్యోద్దేశ్యము. అందు నిమిత్తమయి ఇంగ్లీషు తెలుఁగు భాషలు నేర్పెడి పాఠశాలయొకటి స్థాపింపఁబడి యున్నది. అందు కుట్టుపనికూడ నేర్పఁబడును.

1. మనలో స్త్రీలు కొందఱు కొంచెము విద్య రాఁగానే గర్వము కలవారయి పనిపాటు చేయుట తమ గౌరవమున కర్హము కాదని భావించి సోమరులయి చెడుచున్నారు! ఈ వితంతు శరణాలయమునం దిటువంటి దురభిప్రాయము లెంతమాత్రమును బ్రోత్సాహ పఱుపఁబడవు. ఇందుఁ జేరినవా రందఱును పాటుపడుట యభ్యాసముఁ చేసికొనవలెను. వారు నంతుల వరుసను వంటచేసి తక్కినవారికి వడ్డించుచుండవలెను. ఒకరు వంట చేయునప్పు డింకొకరు పై పనులనుచేయుచుండవలెను. ఈప్రకారముగా వంటచేయుట, తెచ్చిన పదార్థములను జాగ్రత్తచేయుట, వెచ్చముల లెక్కలుంచుట, చిల్లరపనులను చక్కబెట్టుట మొదలయినవి వంతులవరుసను జేయుచుండుటవలన, నెల్ల

వారును చదువునుమాత్రమే కాక గృహకృత్యముల తీర్పను గూడ నేర్చుకొందురు. ఇందు, చేరినవారి వర్ణభేదమునకు భంగము గలుగ కుండ కాపాడుటకయి, ఆయావర్ణములవారికిఁ దగినట్లుగా వేఱువేఱుగా వంటలు, భోజనములు చేసికొనుటకు స్థలము లేర్పఱుపఁబడియున్నవి. ఇందుండువారు ప్రతిదినమును ఎవరి బట్టలు వా రుతుకుకొని యారఁ వేయుచు నెవరి పక్కలు వారు వేసికొని తెల్లవాఱి యెత్తివేయుచు ఉండవలెను.

2. ఈ శరణాలయమునం దున్నవారిలో నెవ్వరికయిన వ్యాధి వచ్చుట తటస్థించిన పక్షమున మందు లిచ్చుటకయి వైద్యుఁడేర్పఱు పఁబడును గాని యందున్న వితంతువులే యుపచారములను పథ్యపాన ములను వంతులవరుసను జేయవలెను.

3. విద్యయం దాసక్తి గల బీదబాల వితంతువుల కీశరణాల యమునందు ధర్మార్థముగా అన్న వస్త్రాదులును పుస్తకములు మొద లయినవియు నిచ్చి విద్య చెప్పింపఁబడును. ఆఱు నెలల కొక పర్యా యము రెండేసి బట్ట లియ్యఁబడును.

4. ఈ వితంతు శరణాలయమునందుఁ జేరినవారు సత్ప్రవర్త నము కలవా రయి యుండవలెను. వారి నడతవిషయమయి తగినంత శ్రద్ధ చేయఁబడును. ఇం దుండువారిలో నెవ్వరయిన కలహశీల లయి తఱుచుగా నితర తరుణులతో తగవులాడుచున్నను, శరణాలయమువిధు లను మీఱి ప్రవర్తించుచున్నను, సత్ప్రవర్తనము గలవారు కాకపో యినను, పాఠములను జదువక తఱుచుగా నశ్రద్ధచేయుచున్నను, అట్టి వారు వితంతు శరణాలయమునుండి పంపివేయఁబడుదురు.

5. ఎల్లవారును తెల్లవాఱు జామున నైదు గంటలకు తప్పక నిద్రనుండి లేవవలయును. ఏడుగంటలలోపల దంతధావనస్నానాదిక మును ప్రాచిపనులను, ప్రార్థనమును ముగించి చదువుకొనుటకు సిద్ధ

ముగా నుండవలెను. ప్రాతఃకాలమున 6 1/2గంటలకును సాయంకాల మున 4 1/2 గంటలకు, శరణాలయమునుండి సూపరింటెండెంటు వెంట ఆనందాశ్రమమునకు ప్రార్థనకు పోవలెను. సోమవారము మొదలుకొని శుక్రవారమువఱకును ప్రతిదినమును ఏడు గంటలు మొదలుకొని యెనిమిది గంటలవఱకును పాఠములను జదువుకొనవలె ను. ఎనిమిదిగంటలు మొదలుకొని పది గంటలలోపల వంట, భోజ నము మొదలయిన పనులుచేసికొని పాఠశాలకుఁ బోవుటకు సంసిద్ధు రాండ్రయి యుండవలెను. భోజనవిషయమున నెవ్వరికిని ఆవశ్యక పదార్థములే కాని భోగములుజరుపఁబడవు. శరణాలయములోనున్నంత కాల మెవ్వరును మాంసాహారమును తినఁగూడదు. పదిగంటలన్నర మొదలుకొని యొంటిగంటవఱకును శరణాలయములోనే స్థాపింపఁబడి యున్న పాఠశాలకుఁ బోయి చదువుకొనవలెను. ఒంటిగంటకును రెండు గంటలకును మధ్య మధ్యాహ్న భోజనము చేయవలెను. రెండు గంటలు మొదలుకొని నాలుగు గంటలన్నరవఱకును మరలఁ బాఠశాలకుఁబోయిచదువుకోవలెను. నాలుగుగంటలన్నర మొదలుకొని యైదుగంటలవఱకునుఆనందాశ్రమములోప్రార్థన చేసికొని, పిమ్మటపుస్త కములను వార్తాపత్రికలను జదువుటలోఁగాని బ్యాడ్మింటను మొద లయిన యాటలాడుటలోఁగాని వ్యాయామము చేయుటలోగాని సూపరింటెండెంటు వెంటనో వేఱొక పెద్దవారివెంటనో తోఁటలో తిరిగి కాని విశ్రాంతి ననుభవించుటలోఁ గా ని కాలము గడుపవచ్చును. రాత్రి యాఱుగంటలు మొదలుకొని యేడుగంటలన్నర లోపల వంట చేసికొని భోజనములుచేసి మఱునాటి పాఠములను జదువుకొనుటకు సంసిద్ధురాండ్రయి యుండవలెను. ఏడుగంటలన్నర మొదలుకొని తొమ్మిది గంటలవరకును దీపముల వెలుతురున మఱునాటి పాఠము లను జదువుకొనవలెను. రాత్రి తొమ్మిదిగంటలన్నరకు నిద్రకు పోవ

చ్చును. శనివారమునాఁడు ప్రాతఃకాలకృత్యములను యథాప్రకారముగా తీర్చుకొన్నతరువాత ఏడుగంటలు మొదలుకొని తొమ్మిదిగంటల లోపల తలంటిపోసికోవలెను. అటుతరువాత పదిగంటలన్నర లోపల వంట, భోజనము మొదలయినవి ముగింపవలెను. రెండుగంటలు మొదలుకొని నాలుగుగంటల లోపల పాఠములను ఇతర గ్రంథములను జదువుకొనవలెను. ఆదివారమునాఁడు ప్రాతఃకాలమున 7 గంటలు మొదలు 8 గంటలవఱకును ప్రార్థనకు వచ్చి, ధర్మోపదేశమును విని, తక్కిన కాలములో ఇష్టమువచ్చిన రీతిని యుక్తమార్గమున విశ్రాంతి ననుభవింపవచ్చును.

6. వితంతు శరణాలయములోనివారు పయివారితో మాటలాడఁదలఁచుకొన్నను ఇతరవ్యవహారములు జరుపఁ దలఁచుకొన్నను పయివారి కుత్తరములు వ్రాయఁ దలఁచుకొన్నను సూపరింటెండెంటు సెలవుపొందిచేయవలెను. ఆవశ్యకమని తోఁచినయెడల సూపరింటెండెంటు ఇతరులతో మాటాడునప్పుడు తాను దగ్గఱ నుండవలెను. శరణాలయములోనివారు వ్రాసెడి యుత్తరములనుగాని వారికివచ్చెడు యుత్తరములనుగాని సూపరింటెండెంటు విప్పించి చదివి చూడవచ్చును. అట్టియుత్తరములలో వారి నడతనుగాని న్యాయబుద్ధిని గాని సందేహించుట కవకాశ మున్నయెడల, అట్టియుత్తరమును వెంటనే ప్రెసిడెంటుగారికి పంపి వారి యుత్తరవు ప్రకారము చేయవలెను. ఆయన అట్టినడత విశేషమైనది కాదని తలఁచినయెడల, సందలించి మొదటి తప్పిదముక్రింద క్షమింపవచ్చును.

7. వితంతు శరణాలయమందున్నవారు తమకుఁ గావలసిన వస్తువులను సూపరింటెండెంటుద్వారా తెప్పించుకొనవలయునే కాని స్వయముగాఁ గాని సేవకులవల్లఁగాని తెప్పించుకొనఁగూడదు. వారు

శరణాలయముతోఁ జేరిన సేవకులతో నే విధమైన సంబంధమును పెట్టుకొనఁగూడదు.

8. పెండ్లియైనవారిని గాని కానివారిని గాని వితంతువులను గాని వారి సంరక్షకులు బోర్డింగు స్టూడెంట్లనుగా నుంచఁ గోరిన యెడల, భోజనములకును ఇతర వ్యయములకును గావలసిన సొమ్మిచ్చు పద్ధతిమీఁద అట్టివారు వితంతు శరణాలయములో చేర్చుకొనఁబడు దురు. అట్టివిద్యార్థులు వేసవికాలపు సెలవులలో తమ యిండ్లకు పోవ వచ్చును. అట్టివారి సంరక్షకులు సూపరింటెండెంటు సెలవును పొంది యప్పుడప్పుడు వచ్చి తమ బాలికలతో మాట్లాడి పోవచ్చును. బోర్డింగు విద్యార్థినులు శరణాలయనిబంధనల కన్నిటికి లోఁబడియుండి ఇతరులు వంట మొదలయినపని చేసికొనెడు సమయములో తమకాలమును పాఠములనో సద్గ్రంథములనో చదువుకొనుటలో వినియోగపఱుపవలెను.

9. వితంతు శరణాలయములోనివారు వ్యాయామమున కయి యేర్పాటు చేయఁబడిన స్థలమునందును వేళయందును తప్ప, తక్కిన స్థలములయందును, వేళలయందును ఆటలాడుకొనఁగూడదు.

10. వితంతు శరణాలయములో నుండువారందఱును సూపరింటెండెంటుగారి యుత్తరువులకు లోఁబడి ప్రవర్తింపవలెను. సూపరింటెండెంటుగారి యుత్తరువునకు వ్యతిరిక్తముగా ప్రవర్తించినను, వారిని తిరస్కరించినను, నిందించినను, అట్టివారు ప్రెసిడెంటుగారి యుత్తరువు మీఁద వితంతు శరణాలయమునుండి వెడలఁగొట్టఁబడు దురు. అట్టివాడు వితంతుశరణాలయములోఁ జేరినపాఠశాలయందుఁ జదువుకొనుటకు సహిత మర్హులు కారు. సూపరింటెండెంటుగా రిచ్చెడు యుత్తరువులలోఁగాని, వారుచేసెడి యాదరణలోఁ గాని, లోప మున్నట్టు శరణాలయములో నున్నవారికి తోఁచినయెడల, అట్టి

లోపములను వ్రాతమూలముగా ప్రెసిడెంటుగారికి తెలుపవలెను. ప్రెసిడెంటుగారు విమర్శించి స్వయముగాఁ గాని, కమిటీవారితో ఆలోచించి గాని, తీర్మానము చేయువఱకును సూపరింటెండెంటుగారిచ్చిన యట్టి యుత్తరువునకు లోఁబడియే ప్రవర్తింప వలెను గాని, వ్యతిరేకించి నడుచుటగాని, మఱి యేవిధమైన యనాదరణనుజూపుట గాని చేయఁగూడదు.

11. సత్ప్రవర్తన విషయములోను శుచిత్వ విషయములోను తప్ప నితర విషయములలో నధికారమును జూపక సూపరింటెండెంటుగారు వితంతు శరణాలయములోనివారి స్వమతాచారములను కులాచారములను మన్నింపవలెను.

12. తమభార్యలతోఁగలిసి చూడ వచ్చెడు తగుమనుష్యులను, ఇతర స్థలములనుండి వచ్చి చూడఁ గోరెడు పెద్ద మనుష్యులను తప్ప, నితరుల నెవ్వరిని వితంతు శరణాలయములోనికి రానియ్యఁ గూడదు.

వితంతు శరణాలయమునందుఁ గ్రొత్తగాఁ జేరఁ దలఁచుకొన్నవారు రావుబహాదూరు కందుకూరి వీరేశలింగము పంతులుగారికివ్రాసికాని, వారితో స్వయముగా మాటాడికాని చేరవచ్చును."

శ్రీములుకుట్ల అచ్యుత రామయ్యగారు దయాపూర్వకముగాఁ గట్టించి యిచ్చిన క్రొత్తవితంతు శరణాలయమునందు గృహప్రవేశోత్సవము 1908–వ సంవత్సరము నవంబరు నెల 15–వ తేదిని జరిగినది. అప్పుడు పట్టణములోనివారనేకులు దయచేసిరి. ఆసమయమునందు నేను చదివినదాని నిందుక్రిందఁ బొందుపఱుచుచున్నాను.—

రాజమహేంద్రపుర వితంతు శరణాలయ నూతన గృహప్రవేశము.

సర్వకారుణ్యపూర్ణుఁడవును, సర్వశుభ ప్రదాతవును, సర్వనియామకుఁడవును, అయిన యోపరమేశ్వరా! నీకు హృదయ పూర్వకములైన నావందన సహస్రములను సమర్పించుచున్నాను. ఈదీనుని కరు

ణించి యాదరపూర్వకముగా నంగీకరింపుము. లోకములో సమస్త సత్కార్యములును సమస్త ధర్మములును నీకు ప్రీతికరము లయి నీయనుగ్రహవిశేషముచేత సదా వర్ధిల్లుచున్నవి. అట్టి సత్కార్యములకు విఘ్నములను విఘాతములను గలిగించుటకయి యెంతటి బలవంతు లెంతమంది యెన్ని ప్రయత్నములు చేసినను తుదకా నరకీటకముల కృషి యంతయు విఫలమయి నీ బలముచేత సత్కార్యములే సఫలములయి లోకమున కనంతఫలదాయకము లయి సుఖాభివృద్ధికరము లగును. నీవు సకలార్తిహరుఁడవు; ఆర్తజనరక్షణ పరాయణుఁడవు. ఈ దేశమునందుఁ జిరకాలాగతమైనదురాచార బలముచేత సామాన్యముగా స్త్రీలును ముఖ్యముగా బాలవితంతువులును దుస్స్థితియందుండి భయార్తాంత్రంగులయి యభయము ప్రసాదింప నిన్ను దీనముగా వేఁడుచున్నారు. వారి మొఱ్ఱలాలకించి యనేక సజ్జన హృదయములను కరఁగించి యనాథకాంతల సంతాపములను దొలఁగించుటకయి వారిని ప్రేరేచుచున్నావు. ఈ సాయంకాలము గృహప్రవేశము జరుపుచున్న యీ వితంతు శరణాలయము నీ ప్రేరణమును నీ యార్తరక్షణపరత్వమును సహస్ర ముఖముల ఘోషించు చున్నది. విద్యయందును బుద్ధియందును ధనమునందును బలమునందును దరిద్రుఁడ నయి యున్న నావంటి యనామకుఁడు తలపెట్టిన యీ కార్యమునకు వేలకొలఁది రూప్యములను వ్యయపఱిచి యొక మహానుభావుఁడు గృహమును కట్టించి యిచ్చుటయు, ఇంకొక మహానుభావుఁడు సంవత్సరమున కంతకు పట్టిన వ్యయముల నన్నిటిని భరింప నయాచితముగాఁ బూనుకొనుటయు నీ నిర్హేతుక జాయమానకటాక్ష విశేషముచేతను ప్రేరణముచేతను గాక మఱి దేనివలన సంప్రాప్తము లయ్యెను? అనాథజనార్తిహర మయిన యీ వితంతు శరణాలయము నెట్లు వృద్ధిలోనికిఁ దేవలయునో, యెట్లు నిరంతరాయముగా కొనసాగింప

వలయునో, సర్వజ్ఞుఁడవయిన నీవే యెఱుఁగుదువు. ఓ భక్తజనాభీష్ట ప్రదాయకా! పరోపకారపారీణులను బంపి పని చేయించియు, దీనజన శోకనివారణాయత్తచిత్తులను బ్రేరేచి ధనదానము చేయించియు, ఈ వితంతు శరణాలయము దినదినాభివృద్ధినొంది శుభదాయక మగునట్లు కరుణింతువు గాక !

ఓ సోదరీసోదర రత్నములారా ! మీ రందఱును నా యాహ్వానము నంగీకరించి యీగృహప్రవేశోత్సవమునకు దయచేసి నన్ను గౌరవించినందునకు మీకు కృతజ్ఞతాపూర్వకములైన వందనములు చేయుచున్నాను. ఆహ్వానపత్రిక నా పేరిటఁబంపఁ బడినను, దీనినిబంపుటకు నాకెంత యధికారమున్నదో యంతయధికారముమీకునుగలదు. ఈ యుత్సవము మనయందఱిదిగాని నాదిమాత్రమే కాదు. ఈ గృహమును మన కిచ్చి యీ సమావేశ సంతోషమును గలిగించినవారు బ్రహ్మశ్రీ మహారాజశ్రీ ములుకుట్ల అచ్యుతరామయ్యగారు. కాఁబట్టి మొట్టమొదటఁ గృతజ్ఞతాసూచకములైనవందనములను మనమాయనకు సమర్పింపవలసియున్నది. ఇట్లు వేలకొలఁదిరూపాయలను గవ్వలవలె వ్యయపెట్టి పురుషుల యర్ధాంగులనఁదగిన యగతికలైన యబలల దురవస్థను నివారించుటకయి పరోపకారబుద్ధితో నీగృహములనుగట్టించియిచ్చిన యచ్యుత రామయ్య గారికి వందనము లర్పించుటలో మీరందఱును సంతోషపూర్వకముగా నాతోఁ జేరుదు రని నమ్ముచున్నాను. సజ్జనసౌఖ్యసంధాయకుఁడైన పరమేశ్వరుఁ డీయుదార పురుషునకు దీర్ఘాయు రారోగ్యైశ్వర్యములను బ్రసాదించును గాక! భరతవర్షీయ దీనానాథ కాంతాజన దుర్దశా నివారణార్థమైన మన యీ యుద్యమములో నీశ్వరునిసాహాయ్యము మొదటినుండియు స్పష్టముగాఁ గానవచ్చుచున్నది. 1905-వ సంవత్సరారంభమునందు నేను చెన్నపురిని విడిచి స్వస్థల మయిన యీ రాజమహేంద్రవరమునకు

మగల వచ్చి యిచ్చుటి మిత్రులసాహాయ్యముచేత నొక వితంతు శర ణాలయమును తత్సంబంధమున నొక బాలికా పాఠశాలను స్థాపించి పనిచేయ నుద్యమించి పట్టణములోని మాగృహమునందే బాలికల కొఱకొక మధ్యమపాఠశాలను బెట్టి యం దింగ్లీషు సహితము నేర్పింప నేర్పాటు చేసితిని. ఆ బాలికాపాఠశాల నెప్పటికైన నున్నత పాఠశా లనుగాఁ జేయవలెనని సంకల్పించుకొని యుంటిని. ఈరీతిగా బాలికా పాఠశాలను సంవత్సరకాలము నడుపునప్పటికిఁ గొందఱు బాలవితంతు వులు చేరుటయే కాక బాలికల సంఖ్యయు హెచ్చయ్యెను. కాని పది పండ్రెండు సంవత్సరముల యీడు రాఁగానే పయి తరగతుల బాలికలను తల్లిదండ్రులు పాఠశాలను మాన్పించుచు వచ్చుట తట స్థించినందున నున్నత పాఠశాలావిషయమైన నాసంకల్పమునకు వికల్ప ము కలుగునేమో యని నేను భయపడఁ జొచ్చితిని. వితంతు శరణా లయములో బాలవితంతువులవలనను, అగతిక బాల రక్షణశాలను స్థాపించినయెడల నందలి బాలికలవలనను మాత్రమే స్త్రీల యున్నత పాఠశాల సాధ్యమగు నని నాకు తోఁచినది. అంతటఁ గొందఱు మిత్రుల ప్రేరణముచేత వితంతుశరణాలయము నిమిత్తమును స్థాపింప నుద్దేశించుకొన్న యగతిక బాల రక్షణశాల నిమిత్తమును పట్టణ సమీపమున నొక విశాలస్థలమును సంపాదింపవలెనని నా కీశ్వరుఁడు బుద్ధిపుట్టించెను. అందునిమిత్తమయి కృషిచేయగా శీఘ్రకాలము లోనే నా కీతోఁట లభించెను. అప్పటికి నేను అర్బత్తు నట్టుకంపెనీ వారివద్ద రెండువేల రూపాయలు నిలువచేసి యుంటిని. ఈ తోఁటను కొనుట నిమిత్తమయి యా రెండువేల రూపాయలను దెప్పించితిని. ఇట్లు జరిగిన యల్పకాలములోనే యా కంపెనీ దివాలాతీసినట్లు వార్తా పత్రికలయందుఁ బ్రకటింపఁబడెను, ఈసొమ్ము పోకుండఁ గాపాడినది, యీశ్వర సాహాయ్యముగాక మఱి యేమని చెప్పవచ్చును? ఈ పని

కీశ్వరుఁడు తోడుపడుచున్నందునకింకొక చిన్న నిదర్శనమును జెప్పెదను. ఈతోఁటను గొన్నతరువాత శీఘ్రకాలముననే యావఱకు శిథిలమై పడిపోయియున్న చిన్నయింటిని బాగుచేయించి యందు ప్రవేశించి తోఁటనువృద్ధిచేయు మార్గము నాలోచింప నారంభించితిని. ఇంకొక నుయ్యి యున్నఁగాని తోఁట వృద్ధి కాఁజాలదని భావించి, క్రొత్త నూతి నొకదానిని త్రవ్వింప నిశ్చయించుకొంటిని గాని వేయి రూపాయలకంటె నెక్కువగాఁ గావలసియుండు ననుకొన్న మొత్తములో నావద్ద నప్పుడు నూఱురూపాయలకంటె నెక్కువగా లేవు. అయినను నేను వెనుకదీయక తక్కిన రూపాయ లెక్కడనైనను బదులుచేయ వచ్చునన్న ధైర్యముతో నూయిత్రవ్వింప నారంభించి మట్టిపనిచేయించుచుంటిని. ఇంతలో నాకస్మికముగా నింగ్లండులో మిస్. మ్యానింగు గారి మరణ శాసన నిర్వాహకుల నద్దనుండి నా కొక లేఖ వచ్చెను. ఆ లేఖను విప్పి చదువఁగా నందు మృతినొందు నప్పుడు మిస్. మ్యానింగుగారు తమ మరణశాసనములో నాకేఁబది పౌను లియ్యవలసినదని వ్రాసినట్టును అక్కడి వ్యయములు మొదలైనవి పోఁగా మిగిలిన సొమ్మును నాకిచ్చునట్లు చెన్నపురిలోని తమ ప్రతినిధికి వ్రాసినట్టును వ్రాయఁబడి యుండెను. ఈ లేఖ చేరిన వారము దినములోపలనే బిన్నీ కంపెనీవారు నా కాఱువందల యెనుబది రూపాయలను బంపిరి. ఎన్నఁడో కొన్ని సంవత్సరముల క్రిందట నన్నొక్కసారి చెన్న పట్టణములోఁ జూడఁ దటస్థించిన వృద్ధురాలైన మిస్. మ్యానింగెక్కడ? ఇంగ్లండులో తాను మృతినొందునప్పుడు నన్ను మఱచిపోక యేఁబది పౌనులు నా కిమ్మని మరణశాసనములో వ్రాయు టెక్కడ? ఇది యంతయు నీశ్వర ప్రేరణమని గాక మఱి యేమని యూహింప శక్యమగును? ఈశ్వరానుగ్రహమువలన నూయియు నే ననుకొన్నంత లోఁతు త్రవ్వనక్కఱలేక పయినే శుద్ధమధురజలము పడి యెనిమిది వందల రూపాయలతోనే ముగిసెను.

నా శిష్యులును మిత్రులును మొదటినుండియు నాయెడల సదభిప్రాయము గలవారునునైన బ్రహ్మశ్రీ ములుకుట్ల అచ్యుత రామయ్యగారు నన్నుఁ జూచుటకై యీతోఁటకు వచ్చినప్పుడు వితంతు శరణాలయమును, అనాథబాల రక్షణశాలయుఁ గట్టించు విషయమయి ప్రస్తావన రాఁగా వారు తత్క్షణమే తాము కట్టించి యిచ్చెద మని చెప్పి తమ వాగ్దానమును చెల్లించుకొనిరి. ఈయన మనస్సునందుఁ జొచ్చి యీయన నీసత్కార్యమునఁ బురికొల్పినదియు నీశ్వరుఁడే యనుటకు సందేహములేదు. ఇంక నెందఱిని ప్రేరేచి యీశ్వరుఁడీ సదుద్యమమును స్థిరపఱుపనున్నాఁడో యెవ్వరెఱుఁగుదురు ? ఇప్పటికి భగవదనుగ్రహమువలన వాసగృహ మేర్పడినది? ఇఁక వితంతు శరణాలయాదులను శాశ్వతముగా జరుపుటకుధనమును, పనిచేయుటకు మనుష్యులును గావలసియున్నారు. ఈ కొఱఁతలనుగూడ నత్యల్ప కాలములోనే యీశ్వరుఁడు తప్పక పూరించునని నాకు సంపూర్ణ విశ్వాసము గలదు. బీదవాఁడనైన నేను పూనిన యీ ఘనకార్యము నెఱవేఱకపోవునేమో యన్న భయము నా కణుమాత్రమును లేదు. సర్వశక్తుఁ డయిన యీశ్వరుఁడే చేయూఁత యిచ్చి నడపుచుండఁగా నేల నెఱవేఱకపోవును? ఈ సందర్భమున నొక్క పుణ్యపురుషుని నిందుఁ బేర్కొనవలసియున్నది. ఆయన శ్రీ పిఠాపురపు జమీందారు గారు. నేను మొదటనుండియు దరిద్రుఁడనే; ఆ పయిని నాకున్న చిన్నసొత్తును వితంతు శరణాలయమున కిచ్చివేయుటచేత నే నిప్పుడు మఱింత దరిద్రుఁడ నయినాను. నావద్దనున్న రొక్కమంతయు హితకారిణీ సమాజమున కిచ్చివేసినప్పుడు కావలసినయెడల దానిలోనుండి వడ్డి యిచ్చి బదులు పుచ్చువచ్చునని తలఁచి నా సొంతమున కేమియు నుంచుకొనకపోతిని. ఇచ్చినతరువాత నాపుస్తకములను సంపుటములనుగా మరల నచ్చువేయింపవలసిన యావశ్యకము తటస్థిం

చెను. అప్పుడు హితకారిణీ సమాజమున కిచ్చిన సొమ్ములోనుండి బదులు పుచ్చుకొనఁ జూడఁగా, ఇండ్లు మొదలైన స్థిరవసతిని తాకట్టు పెట్టినగాని సమాజనిధిలోనుండి బదులియ్యఁగూడ దని రాజశాసనమున్నట్టు తెలియవచ్చినది. ఇప్పుడు నాదియని చెప్పుకొనఁదగిన స్థిరవసతి నా కేమియు లేదు. నే నిట్టిదుర్దశలో నున్నట్టు విని శ్రీరాజావారు పుస్తకముద్రణము నిమిత్తము నాకు పండ్రెండువందల రూపాయలిచ్చి నన్ను నాకష్టములనుండి విముక్తునిఁ జేయననుగ్రహించునట్టు వారియాంతరంగిక కార్యదర్శిగారు నా పేర వ్రాసిరి. నేను శ్రీ రాజావారియెడల మిక్కిలి కృతజ్ఞత గలవాఁడనయినను, వారు నాయెడలఁ జూపినయవ్యాజ దయకు మిక్కిలి యానందించినవాఁడ నయినను నా సొంతమునకయి యితరుల వద్దనుండి సొమ్ము పుచ్చుకోఁగూడ దన్న దురభిమానముచేత నే నా మొత్తము నంగీకరించుటకు సంశయించు చుంటిని. శ్రీరాజావారు నా యభిప్రాయము నెఱిఁగి యా మొత్తమును వితంతు శరణాలయ వ్యయముల క్రిందఁ గైకొనవలసినదని వ్రాయించి యున్నారు. వితంతు శరణాలయముక్రిందను తోఁట మొదలైనవాని క్రిందను నెలకు దాదాపుగా నిన్నూఱు రూపాయలు వ్యయమగుచున్నవి. ఈప్రకారముగాఁ దమ సహజౌదార్యముతో నయాచితముగాఁ దమంత తాము యుక్తసమయములో వితంతు శరణాలయమునకు తోడు చూపిన శ్రీ రాజావారికి మన మందఱమును గృతజ్ఞతాభి వ్యంజక వందనములను సమర్పింతము. మొదటినుండియు నాయం దవ్యాజ ప్రేమమును గౌరవమును గనఁబఱుచుచు సర్వవిధముల నాయుద్యమములకుఁ దోడుపడుచున్న శ్రీ రాజావారి ఋణమును దీర్చుకొనుటకు నే నెన్నఁడును శక్తుఁడనుగాను. వారి నీశ్వరుఁడు దీర్ఘాయురారోగ్యోపేతులనుగాఁ జేయునుగాక!

ధర్మము తనతో నారంభము కావలెనను న్యాయమును బట్టి మొదట నేను జేయఁగలిగినది చేసి పిదప ధర్మనిమిత్త మితరులను బ్రార్థింపవలయునని యింతవఱకు నుపేక్ష చేసితిని. అత్యల్పమే యైనను నేను జేయఁగలిగినది చేసితినిగాన నే నిఁక ముందు మన హితకారిణీ సమాజము పక్షమున ధన సాహాయ్యము నిమిత్తము దేశాభిమాన మాననీయుల కందఱకిని శీఘ్రకాలములోనే విజ్ఞాపన పత్రికలను బంపఁ బ్రయత్నించెదను. ఈశ్వరాను గ్రహమువలన ధన సాహాయ్యమునకు లోపముండదని దృఢముగా నమ్ముచున్నాను.

ఇప్పుడు ముఖ్యముగాఁ గావలసినది మనుష్యసాహాయ్యము. స్వార్థపరిత్యాగమును జూపుచు పరోపకారార్థముగా స్వజీవితమును ధారపోయఁ గంకణము గట్టుకొను మనుష్యులము కార్యనిర్వాహణమున కవశ్యముగాఁ గావలసియున్నది. అట్టిత్యాగపరులనుగూడ యుక్తసమయమునందు దేవుఁడు ఈశ్వరుఁడు పంపునను సందేహము లేదు, ముం దెప్పుడో పంపుననేల? ఇప్పుడే పంపనారంభించియున్నాఁడు. ఇప్పుడే వితంతుశరణాలయములోనే యుండి వారియభివృద్ధి నిమిత్తమై తమ శరీరములను ధారపోయ నిశ్చయించిన యొకరిద్దఱు పరోపకార పారీణులగు యువతులనుగూర్చి యించుక ముచ్చటించెదను. వారిలోఁ బ్రథమగణ్యురాలు శ్రీమతి కనపర్తి సుందరమ్మ. ఈమె వయస్సుచేత చిన్నదేయైనను బుద్ధిచేత చిన్నదికాదు. ఈమె కీశ్వరభక్తియుఁ బరోపకారచింతయు విశేషముగాఁగలవు. ఈమె విద్యయందు దత్యంతాసక్తియుఁ దెలివి తేటలును జాఱుకుఁదనమును గలదియయియున్నది. ఇట్టి యీయామె వితంతుశరణాలయములోఁ బనిచేయుచుఁ దనజీవితమును దనతోడి యనాథకాంతల యభివృద్ధి నిమిత్తము ధారపోసి పరోపకార కృత్యములయందుఁ గడప నీశ్వర సన్నిధానమునందు దీక్ష వహించియున్నది. భక్తాభీష్టప్రదాత యైనపరమేశ్వరుఁ డీమె కాయు

రారోగ్యభాగ్యమును బ్రసాదించి సత్కార్యాచరణమునందుఁ దగి నంత యుత్సాహమును ధైర్యమును బూనికను కరుణించును గాక! ఈమె కిప్పుడు లోకానుభవ మంతగా లేకపోయినను గాలక్రమమున ననుభవజ్ఞురా లయి కార్యనిర్వహణమునందు సమర్థురా లగుననుటకు సందేహ ముండదు. ఈ శరణాలయమునందున్న వా రందఱును నాకుఁ బుత్రికలే యైనను గుణసంపత్తిచేతను బరోపకారపరత్వముచేతను నా కీమె యీశ్వరదత్తయైన ప్రియపుత్రికయైనట్టు భావించుచున్నాను. ఈమె తండ్రియైన యోగానందముగారు నాకు బాల్యమిత్రుఁడు; పాఠశాలయందుఁ జదువుకొనుచుండి నేను "రసికజనమనోరంజనము" ను రచించుచుండినప్పు డతఁడు దాని శుద్ధప్రతిని వ్రాసెను; మొదటి రెండు వితంతువివాహములును జరిగినపిమ్మట శంకరాచార్య స్వాము లవారి బహిష్కార పత్రికలు బయలుదేఱి యెల్లవారిని భయపెట్టి మరల వివాహములు జరుగుట దుర్ఘటమని తోఁపఁజేసిన కాలములో మూఁడవ వివాహమున కీయనయు నీయన మిత్రుఁడగు మనోహరము పంతులుగారును నా కెంతో సాయము చేసిరి. ఇట్టి నా బాల్య స్నేహితుని పుత్రిక యగుటచేతఁ గూడ నాకీమె మఱింత యాదరణ పాత్రురా లగుచున్నది. ఇట్టి యీమెకు సహాయురా లయి శ్రీమతి కాటుమూరి మల్లమ్మ వితంతు శరణాలయాభివృద్ధి కయి పని చేయఁ బ్రతిజ్ఞ చేకొనియున్నది. ప్రస్తుత మీ యిరువురను వితంతు శరణాలయభారనిర్వహణమున కయి యీశ్వరుఁడు ప్రసాదించినట్టు తోఁచుచున్నది. ఈ యిరువుర చిత్తవృత్తులును సదా సత్కార్య పరాయత్తము లగునట్లు పరమపిత ప్రసాదించునుగాక! సత్కార్య నిర్వహణమున కిప్పుడు స్త్రీలు పూనుకొనుచున్నారు గనుక కార్యము జయప్రదముగా సాగఁగలదని నిశ్చయముగఁ జెప్పవచ్చును. స్త్రీలు పూనుకొని తోడుపడినం గాని యే సాంఘికసంస్కారమును సంపూర్ణ

విజయము నొందనేరదు. స్త్రీలు పూనుకొన్న యీ మహో కార్యము సాఫల్యము నొందక మానదు. స్త్రీల ప్రతిజ్ఞలయం దంత కంతకు నాకు విశ్వాస మెట్లు హెచ్చుచున్నదో యట్లే యిప్పుడిప్పుడు నా కంతకంతకు మనయావనపురుషుల ప్రతిజ్ఞలయందు విశ్వాసము తగ్గుచున్నది. కొందఱు జుట్లును బొట్లును తీసివేసినంత మాత్రముననే తాము ఘనులమైతిమనుకొని సత్కార్యాచరణమును సరకుకొనకున్నారు. కొందఱుభోజనములును బోడితలలుమాత్రమే ప్రధానములనుకొని లోకోపకారచింతను దూరము చేయుచున్నారు. ఇట్టిబుద్ధిమంతులుబాహ్య వేషములకంటె మన సౌందర్య మధికమైనదిగా నెఱిఁగి సత్యాదుల యం దధికగౌరవమును జూప నేర్చుకొందురుగాక! పరార్థపరత్వమునకయి స్వార్థపరత్వమును త్యజింప నభ్యసింతురు గాక!

నాకాల మంతయు నిట్లు సంచరించుచుగాఁ గడచిపోయినది. నేనిఁక ధనార్జనపరత్వమునువీడి నాశరీరాయుశ్శేషమును స్త్రీజనాభివృద్ధినిమిత్తమయి వినియోగింప నిశ్చయించుకొన్నాఁడను. వితంతు శరణాలయములో విద్యనేర్పు పురుషులు తగిన స్త్రీలు దొరకువఱకును వృద్ధులుగా నుండుట యావశ్యకమగుటచేత నావృద్ధత్వయోగ్యతను బట్టి విద్యాదానవిషయమున నాకు శక్తియున్నంతవఱకుఁ బనిచేయఁ గృతనిశ్చయుఁడనై యున్నాను. నాకృషివలన నొక స్త్రీయైనను బరోపకార పారీణురాలును విద్యావతియు నైన పక్షమున నాజన్మము సార్థకమయినట్లు భావించుకొనెదను. ఈశ్వరుఁడు నాయభిమతమును సిద్ధింపఁ జేయును గాక!

అనుష్ఠానిక బ్రాహ్మలలో నొక్కఁడయిన కారుమూరి కామరాజగారు రోగపడి యిక్కడినుండి గంజాము మండలములోని శ్రీకాకుళమునకుఁబోయి దేశరాజు పెదబాపయ్యగారి వలెనే యక్కడ నకాలమరణము నొందెను. అనంతర మాయన భార్యయైన మల్లమ్మ

వితంతుశరణాలయములోఁ జేరి దాని యభివృద్ధి కయి తన జీవితకాల
ము గడపవలెనన్న మహోత్సాహముతో నుండి 1909-వ సంవత్సర
మున నేను బెంగుళూరిలో నుండినప్పుడు కాలధర్మము నొందెను.

1908-వ సంవత్సరమునందు దొరతనమువారునన్ను 1873_వ సంవత్సరము 3-వ సంఖ్య రాజశాసనానుసారముగా వివాహములు జరుపుటకు గోదావరి మండలమునకు వివాహలేఖ్యారూఢకునిగా (Registrar of Marriages) నియమించిరి. ఆ సంవత్సరమునందు పూర్వోక్తశాసనానుసారముగా నాయెదుట జరగవలసిన మొదటి వివాహము శ్రీయుత కామరాజు హనుమంతరావుగారి దయి యుండవలసినది. నేను పుత్రికాప్రాయనుగాఁ జూచుచున్న శ్రీమతి కనపర్తి సుందరమ్మ తానుగూడ బ్రాహ్మసామాజికురాలయి నాతోఁగలసి పని చేయుటకును తా ననుష్ఠానిక బ్రాహ్మ్యుని వివాహము చేసికొనుటకును సమ్మతిపడెను. పరస్పరానుమతిపైని శ్రీమతి సుందరమ్మకును శ్రీయుత హనుమంతరావుగారికిని వివాహము నిశ్చయింపఁ బడెను. వివాహ దినముకూడ నిర్ణయింపఁ బడెను. ఈ వివాహముతోఁగలిపి నాచే బోధింపఁబడి మాయింటనున్న చిరంజీవి పులవర్తి వేంకటసుబ్బారావు వివాహముకూడ చేయుట కేర్పాటుచేసితిని. అన్నియు సిద్ధమయిన తరువాత హనుమంతరావుగారు వివాహదినమున స్త్రీపురుషులందఱును మాలవానితోఁగలసి భోజనముచేయవలెనని పట్టుపట్టెను. అట్లుచేయుటకు నాభార్య మొదలయినవా రొప్పుకొనలేదు. స్త్రీలను వదలిపెట్టవలసిన దనియు మఱియొక దినమున పంచమునితోఁ గలిసి మన మందఱమును భోజనముచేయుదుమనియు నేను బహువిధములఁ జెప్పితిని గాని నామాట లాయన యంగీకరింపలేదు. అందుచేత సిద్ధమయిన వివాహ మప్పటి కాగిపోవలసివచ్చినది. క్రొత్త వైష్ణవునకు నామములు మెండన్నట్లు నూతన బ్రాహ్మధర్మస్వీకర్తకును బాహ్య

చారములయందుఁ బట్టుదల యెక్కువగా నుండును. అంతే కాక యీయన దేశీయస్వపరిపాలన పక్షావలంబుఁడయి బోధనాభ్యసన పాఠశాలనుండి తీసివేయఁబడినవాఁడు; దొరతనమువారిపాఠశాలలలోఁ గాని పనియియ్యఁగూడదని నిషేధింపఁబడినవాఁడు. దొరతనమువారిప్పుడు నిగ్రహప్రయోగమున కారంభించి స్వపరిపాలనోన్మాదులయిన వారిని కారాగారప్రవిష్టుల జేయుచుండుటచేత దేశీయస్వపరిపాలన వీరావేశవ్యగ్రు లయినవా రేనిమిషముననైనను కారాగృహదర్శన ప్రాప్తిఁ బడయవచ్చును. ఇట్టి స్థితిలో 1908-వ సంవత్సరము అక్టోబరు నెల 18-వ తేదీని జరగవలసిన యీ వివాహము తప్పిపోయి, ఆదినమున నొక్కపులవర్తి వేంకటసుబ్బారావు వివాహముమాత్రమే జరిగి శ్రీపిఠాపురము రాజుగారు చెన్నపట్టణమునుండి పంపిన యుంగరము గడియారము మొదలయిన బహుమానము లాతనికే యియ్యఁబడినవి. హనుమంతరావుగారు వితంతు శరణాలయములోని తమయుపాధ్యాయపదమును విడిచి బృందావనపురమున కరిగి యక్కడ పనిచేయ నారంభించిరి. ఈలోపల నేను శ్రీమతి సుందరమ్మకు విద్యాభివృద్ధి చేయుచు, 1909-వ సంవత్సరము వేసవికాలములో నేను బెంగుళూరు వెళ్ళినప్పుడు నావెంటఁగొనిపోయి ప్రతిదినమును నేనింగ్లీషు స్వయముగా చెప్పుచుంటిని. ఈలోపల హనుమంతరావుగారు తన పూర్వపు పట్టుదలనువిడిచి, నాకోరిక ప్రకారముగా రాజ్యాంగోద్యమ పరిశ్రమమును విడిచి సాంఘిక ధార్మికోద్యమములయందే పనిచేయుచునుండుట కొప్పుకొని, మరల రాజమహేంద్రవరమునకు వచ్చిరి. ఈయిరువురకు 1909-వ సంవత్సరము జూలై నెల 25-వ తేదీని వివాహము జరిగినది. వివాహానంతరమున శ్రీమతి సుందరమ్మ వితంతు శరణాలయ పర్యవేక్షకురాలుగాను శ్రీయుత హనుమంతరావుగారు హితకారిణీ సమాజసహాయకార్యదర్శిగాను నియమింపఁబడి యుభయులును గలిసి

యిరువదియైదు రూపాయల వేతనమును బడయుచు పనిచేయుచుండిరి. ఈ రెండు వివాహములునుగాక మూఁడవశాసనానుసారముగా మఱి యైదు వివాహములయినవి.

1907-వ సంవత్సరమునం దొకనాఁటిరాత్రి మూర్ఛవచ్చి పడిపోయి లేచిన తరువాత కొంతకాలము నేను దుర్బలుఁడనయి రోగపీడితుఁడనయియే యుంటిని. ఆసమయమునం దిక్కడకు పండిత శివనాథశాస్త్రిగారు వచ్చిరి. కలకత్తా చూడవలెనని యున్నదని నేనా తనితో చెప్పితిని. నా దేహస్థితిని జూచి యిప్పుడు ప్రయాణము చేయుట యుక్తము కాదని యాయన నాతోఁ జెప్పిరి. తలఁచుకొన్న పని చేయుట నాస్వభావము. అందుచేత నేను నాభార్యను వెంటఁగొని శివనాథశాస్త్రిగారితోఁ గలిసి ఏప్రిల్ 4 తేదిని కలకత్తాకు బైలుదేఱి, త్రోవలో భువనేశ్వరమువద్ద నిలిచి యచ్చటి దేవాలయములను వాని సమీపమ్మునున్న బౌద్ధగుహామండపములను జూచి, కలకత్తా చేరి యక్కడనున్న దినములలో శివనాథశాస్త్రిగారి యతిథినిగా నుండితిని. నా పేరావఱకే కలకత్తాలో విశేషముగాఁ దెలిసియుండుట చేత సాధారణబ్రహ్మసమాజమువారు మాత్రమే కాక యాది బ్రహ్మ సమాజమువారును భరతవర్షీయ (నవవిధాన) సమాజమువారును గూడనన్ను గౌరవించిరి. నాకక్కడివారు స్వాగతమిచ్చినప్పుడు మూఁడుసమాజముల ముఖ్యులునుగూడి నాయం దాదరముచూపిరి. నేనక్కడ వారముదినములుండి చూడవలసినవాని నెల్లజూచి కలకత్తానువిడిచి త్రోవలో కటకములో రావుబహదూరు మధుసూదన రావుగారి యతిథిగా నొకదినముండి మరల సురక్షితముగా భార్యా సహితముగా రాజమహేంద్రవరము చేరితిని. ఈయాత్ర చెఱుపు చేయుటకు మాఱుగా నాకుఁ గొంత మేలే చేసినది. కొంచెము కాలము రాజమహేంద్రవరములో నుండి యాసంవత్సరము వేసవికాలములో

మొదటిసారి నేను బెంగుళూరునకు వెళ్ళితిని. మైసూరిలోని వార్తాపత్రిక లన్నియు నన్నభినందించుచు వ్యాసములు వ్రాసెను. బెంగుళూరులోని వర్ధమాన సమాజము (Progressive Unior) వారు నాకు సత్కార్యముచేసి తమతోఁ గలిసి నాఛాయాపటము నెత్తించి నన్ను గౌరవించిరి. అక్కడకొన్ని దినములనుండి మైసూరునకుపోఁగా 'మహారాణీకాలేజీ'లో నాకు స్వాగతమిచ్చి యాదరించిరి. శివసముద్రమునకుఁ బోయి యక్కడ కావేరి నదీపతనమును దానివలన విద్యుచ్ఛక్తిని కలిగించు రీతిని జూచితిని, కోలారునకుఁ బోయి యక్కడి బంగారు గనులు పనిచేయు రీతిని జూచితిని. ఇట్లక్కడక్కడఁ జూడఁదగినవిశేషముల నన్నిటిని జూచి మరల బెంగుళూరును జేరితిని. అక్కడి పౌరులు సభచేసి నాలుగు భాషలలో నాకు స్వాగతపత్రికలను జదివిరి. ఈక్రింది దింగ్లీషులో జూన్ 15-వ తేదిని చదివిన స్వాగతపత్రిక;—

***An Address***

PRESENTED TO RAO BAHADUR,
K. VEERESALINGAM PANTULU GARU
BY TAE CITIZENS OF BANGALORE.

**Dear sir,**

We citizens of Bangalore, have pleasure in availing ourselves of the opportunity offered by your temporary sojourn in this city to give expression to the sentiments of respect and admiration with which we have been inspired by your writings and your personal example.

You have created and embellished modern Telugu Literature and your works are a living source of inspiration to the vast Telugu section of the population of India.

Your labours in the cause of social reform entitle you to rank with those noble souls who are unflinchingly loyal to their sincere convictions and who dare to do where many are content with preachin.g.

The world is full of people who call others to work, but there are very few indeed who, like you, set the example themselves by silent, patient, self-sacrificing performance of duty.

We trust that you will be able to pay frequent visits to Bangalore so that the young men of this place may learn how quiet and unostentatious are the ways of the real Poineers of Progress.

We pray to God Almighty that you may be blessed with long life and sustained health and vigour to continue your labours for the benefit of your fellow-countrymen.

We remain,
Dear Sir,

Bangalore }
June, 15 1917. }

Your Sincere well wishers and
Admirers in Bangalore.

(రావుబహదూరు. కే. వీరేశలింగముపంతులుగారికి బెంగుళూరు పురజనులచేత నియ్యఁబడిన విజ్ఞాపనము.

ప్రియార్యా!

బెంగుళూరు పురవాసులమైన మేము మీవార్తలచేతను మీ స్వీయదృష్టాంతముచేతను మాలోఁ బుట్టింపఁబడిన గౌరవముయొక్కయు సశ్లాఘాశ్చర్యముయొక్కయు భావములను వెల్లడించుటకయి యీపట్టణములోని మీ యల్పకాల నివాసము మాకు కలిగించిన యవకాశము నుపయోగించుటయందు మేమానందము నొందుచున్నాము.

మీరు నూతనాంధ్ర వాఙ్మయమును సృజించి యలంకరించి యున్నారు; మీ గ్రంథములు హిందూదేశ ప్రజలలోని పెద్ద తెలుఁగుశాఖకు జ్ఞానావేశమునకు సజీవాధారము లయి యున్నవి.

సాంఘికసంస్కారపక్షమందలి మీ పరిశ్రమములు పలువురితరుల కుపదేశకులై యుండుటతోఁ దృప్తిపడువారై యుండ, తమ నిర్వ్యాజ నిశ్చయములకు నిర్భయముగా దృఢానురక్తు లగునట్టియు

ననుష్ఠించుటకు సాహసించునట్టియు నుత్తమాత్ములలో పరిగణింపఁ బడుటకు మి మ్మర్హులను జేయుచున్నవి.

ప్రపంచము పరులను పనిచేయఁ బిలిచెడు మనుష్యులతో నిండియున్నది. కాని మీవలె నిశ్శబ్దక్లేశకరము స్వసుఖ పరిత్యాగ యుక్త ధర్మనిర్వాహణమువలన స్వయముగా మార్గదర్శు లయ్యెడు వారు నిశ్చయముగా నత్యల్పముగా నున్నారు.

అభివృద్ధికి నిజమయిన యగ్రేసరులుగా నుండువారి మార్గము లెంత శాంతముగాను నిరాడంబరముగాను నుండునో యిక్కడి యువ జనులు నేర్చుకొనుటకయి మీరు బెంగుళూరునకు పునఃపునర్దర్శనముల నియ్య శక్తు లగుదు రని మేము నమ్ముచున్నాము.

మీస్వదేశజుల లాభముకొఱకు మీ పరిశ్రమల నవిచ్ఛిన్నముగా జరుపుటకు మీకు దీర్ఘాయుస్సును నిరంతరారోగ్యమును బలమును ప్రసాదించును గాక యని మేము సర్వశక్తుఁడయిన దేవునిఁ బ్రార్థించుచున్నాము.)

బెంగుళూరినుండి రాజమహేంద్రవరమునకు వెళ్లినతరువాత నేను శీఘ్రకాలములోనే శరణాలయములోని యొక వితంతువునకు వివాహము చేయుటకయి కళత్రసహితముగా నేను బరంపురం వెళ్ళితిని. అక్కడ జరిగిన వితంతు వివాహమునకు పట్టణములోని పెద్దమనుష్యు లనేకులు వచ్చిరి. అక్కడి పురజనులును 1907-వ సంవత్సరము జూలయినెల యేడవ తేదిని నాకు స్వాగత మిచ్చి యీ క్రింది సంబోధన పత్రికను జదివిరి.—

To Rao Bahadur,
K. Veeresalingam Pantulu Garu,
Fellow of the Madras University, etc.,

Respected and beloved sir,

We, the townsmen o Berhampore (Ganjam) approch you to give expression to the feelings of pride and pleasure

which your advent has given us, affording us an opportunity of welcoming you, the Pioneer of social reform movement in Southern India, into our midst. Though we are not so far advanced in education and other respects as several other districts of this Presidency, we are behind none in our appreciation of the silent but practical work done by you in the cause of our Mother-land. You, Sir, are the apostle of Hindu widow re-marriage movement in this Presidency. You are ever pleading for the poor, helpless Hindu widow and without possessing any of the advantages, power, position or fortune, you have been to us, what the late Pandit Iswara Chandra Vidyasagara was to Bengal or Madhava Das to Bombay. Your heroic and single minded devotion, to the cause, your unflinching courage in braving the opposition and calumny of influential sections of the community, your tremendous sacrifices, your fearless preaching and exposure of the fallacies of your adversaries and you daring practical efforts, are now matters of history. Sir, it must be of great consolation to you in the evening of your life to see that all this opposition has died out and that an increasing public is veering round to your views. Not content with your work in this direction, you have earned the undying gratitude of your contrymen by your several attempts at ameliorating the condition of Hindu widows. We need only mention one such attempt, *i. e*, the foundation of Hindu widow's Home, the first of it kind in this Presidency.

2. We are not unconscious of your energies in other fields. You always gloried in redressing human wrong. We know you as a hater of sham and a fearless opponent of social tyranny; your trenchant pen was a terror to corrupt officials and evil administration.

3. We are not blind to your services in the cause of Telugu literature; you have raised it to a vehicle of expression for conveying modern science and modern thought in chaste and simple prose; as the author of Rajasekhara, your fame is not confined to this country, while as a poet, novelist, biographer, essayist, pamphleter and humourist, you have enriched it more than any other living man. In thousands of Hindu homes, your works are now daily read, especially by ladies, and it must cheer your heart to learn

that your works serve to dispel ignorance and are the source of enlightenment, innocent mirth and laughter.

May the Almighty, the Disposer of all things,
Give you many more years of useful activity
In the cause of our country and
May many more of our countrymen be
Animated by your spirit and walk in your footsteps.

We remain,
Respected and beloved Sir,
Yours sincerely.
The Townsmen **of Berhampore**

చెన్నపురి సర్వకలాశాలా సభ్యత్వములుగల రావుబహదూరు
కే. వీరేశలింగము పంతులుగారికి.

గౌరవింపఁబడి ప్రేమింపఁబడెడి యార్యా!

బరంపురము (గంజాము) పట్టణవాసులమైన మేము దక్షిణ హిందూస్థానములో సాంఘికసంస్కార వ్యాపారమునకు మార్గదర్శకులయిన మీకు మా నడుమున స్వాగతమిచ్చుట కవకాశము కలిగించుచు మీయాగమనము మాకిచ్చిన గర్వముయొక్కయు సంతోషముయొక్కయు మనోవృత్తులను తెలుపుటకు మిమ్ము సమీపించుచున్నాము. విద్యయందును ఇతరవిషయములయందును ఈరాజధానిలోని యనేకేతరమండలములవలె మే మంత వృద్ధిగాంచినవారము కాకపోయినను, భాగ్యహీనమైన మన మాతృభూమిపక్షమున మీచేతఁ జేయఁబడిన శాంతమైనదైనను క్రియావంతమైనపనియొక్క గుణగ్రహణమునందు మే మెవ్వరికిని వెనుకఁబడినవారము కాము. అయ్యా! మీరీ రాజధానిలో వితంతు పునర్వివాహ వ్యాపారమున కీశ్వరదూతలు. దీనులు నసహాయులునైన హిందూవితంతువుల పక్షమున నెల్లప్పుడును మీరు వాదించుచున్నారు; అధికారము గాని ప్రాబల్యముగాని సంపదలుగాని లాభములేవియు లేకయే కలకత్తాకు కీర్తిశేషులయిన యీశ్వర చంద్ర విద్యాసాగర పండితులుగాని బొం

బయికి మాధవదాసుగారుగాని యెట్టివారో మీరు మాకట్టివారయి యున్నారు. కార్యమునకై మీ వీర్యవంతమైన యేకాగ్ర తత్పరత్వమును, ప్రజాసంఘములోని ప్రబలపక్షవాగివలన ప్రాతికూల్యములను మిథ్యాపవాదములను ప్రతిరోధించుటలో మీనిశ్శంకమైన ధైర్యమును, మీ యమిత స్వసుఖపరిత్యాగములును, మీ ప్రతిపక్షుల యొక్క పక్షాభాసములను ప్రకాశపఱుచు మీ నిర్భయప్రవచనమును, మీ సాహసికములైన యాచరణ ప్రయత్నములును, ఇప్పుడు చరిత్రాంశములుగానున్నవి. అయ్యా! మీజీవితాస్తమానదశయందు ఈ ప్రాతికూల్యమంతయు చచ్చిపోయి యంతకంతకు వృద్ధియగుచున్న ప్రజాసముదాయము మీ యభిప్రాయములకు చుట్టుకొనుచున్నట్లు చూచుట మీకెంతో సమాశ్వాసనముగా నుండవలయును. ఈ విషయమైనపనితో తృప్తిఁగొంది యుండక హిందూ వితంతువుల యవస్థను బాగుపఱుచుటకయి మీ దేశప్రజలయొక్క యెన్నఁడును చావనికృతజ్ఞతను మీరు సంపాదించియున్నారు. అటువంటి ప్రయత్నములలో నొక్కదాని ననఁగా నీరాజధానిలో నటువంటివానిలో మొదటిదైన హిందూవితంతు శరణాలయస్థాపన మాత్రము మేము పేర్కొనవలసియున్నది.

2. ఇతర క్షేత్రములలో మీ వ్యవసాయములను మే మెఱుఁగకున్నవారము కాము; మీ రెల్లప్పుడును మానుషాన్యాయములను విమోచనము చేయుటలోఁ బ్రమోదించుచుంటిరి. మాయ వేషమును ద్వేషించువారినిగాను సాంఘిక పీడనమునకు నిర్భీకప్రతిపక్షినిగాను మిమ్ము మే మెఱుఁగుదుము; మీ కఠినమైనకలము దుష్టోద్యోగులకును దుష్పరిపాలనమునకును భీతిదాయకమయి యుండెను.

3. ఆంధ్రభాషావాఙ్మయ పక్షమున మీసేవకు మేము కన్న

లను పరిశుద్ధమైనసులభవచనములో తెలుపుటకు నివేదనవాహనముగా మీరు దానిని పైకిలేవఁదీసి యున్నారు; రాజశేఖర గ్రంథకర్తగా మీకీర్తి యీదేశమునకే నిబద్ధమయినది కాదు; కవిగాను, వచన ప్రబంధకర్తగాను, చరిత్రకారుఁడుగాను, నిబంధలేఖకుఁడుగాను, లఘు పుస్తకనిర్మాతగాను, ప్రహసనప్రణేతగాను జీవించియున్న యే యితర మనుష్యునికంటెను నెక్కుడగా మీరు వానిని సంపన్నముగాఁ జేసి యున్నారు. వేలకొలఁది హిందూగృహములలో ముఖ్యముగా స్త్రీల చేత మీగ్రంథము లిప్పుడు చదువఁబడుచున్నవి; మీగ్రంథము లజ్ఞానమును దొలఁగఁద్రోలుట కుపయోగపడుచున్నవనియు జ్ఞానోద్దీపనమునకును నిష్కళంకమయిన కౌతుకమునకును హాసనమునకును కారణమగుచున్నవనియు తెలిసికొనుట మీయుల్లమున కుల్లాసజనకముగా నుండవలెను.

సమస్త పదార్థములకును నియంతయైన సర్వాత్ముఁడు మన దేశపక్షమున నుపయుక్తములయిన యుద్యమములుగల యనేకాధికతర సంవత్సరములను మీకు దయచేయునుగాక! మన దేశస్థులలో ననేకులధికముగా మీచిత్తోన్నతిచేఁ బ్రోత్సాహపఱుపఁబడి మీపదచిహ్నములలో నడుతురు గాక!

1908-వ సంవత్సరములో నేను వెళ్ళినప్పుడు బందరు పురజనులు నాకీ క్రిందిరీతిని ఏప్రిల్ నెల 17-వ తేదీని స్వాగత మిచ్చిరి.

“బ్రహ్మశ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారికి

బృందావన పురజను లిచ్చు అభినందనము.

ఆర్యవర్యా!

భారతమాతపుత్రవతంసులరగు తమ యాగమనమున కెంతయు సంతసించుచు బృందావనపుర జనుల మగు మేము నేఁడు తమకు మనఃపూర్వక మగు స్వాగతము నిచ్చుచున్నారము.

అభినవగద్యకావ్యములకు మార్గదర్శకులును, ప్రకృతి శాస్త్ర గ్రంథరచన కగ్రేసరులును, ఆంధ్రకవి యశశ్కర్పూరకరండ నిర్మాణమున కాదిపురుషులును, నగుటయే కాక వివిధముల 'దేశభాషల యందెల్లఁ దెలుఁగు లెస్స' యని వన్నెకెక్కిన యాంధ్రభాషామతల్లికి కవలంబనమును, అంతరాత్మచోదనల కవహితులరై కార్యశూరత్వమును నెఱపి దుర్ఘటమగు సంస్కరణవల్లికిఁ బట్టుగొమ్మయి వితంతు శరణాలయ స్త్రీవిద్యాలయస్థాపనాది దేశోద్ధరణల సాధనల ననువుపఱుపఁజాలు నిస్సీమదయ కాలవాలమును ధర్మనిష్ఠ కలిమి నిష్కల్మషమానసముచేతను, నిష్కళంక జీవితముచేతను, నిరవధికౌదార్య సాహసములచేతను, దేశజనులకెల్ల నాదర్శమును, అగుచు ఆంధ్ర దేశమునకుఁ దారొనర్చిన మహోపకారమును ఆచంద్రార్కముగ వర్ధిల్లఁజేయుటకును, దమ కాయురారోగ్యముల నొసంగుటకును కరుణామయుఁడగు సర్వేశ్వరుఁ బ్రార్థించుచున్నారము."

ఈప్రకారముగానే బాపట్లమొదలయిన స్థలములకు నేను వెళ్ళినప్పు డక్కడివారు నాకు స్వాగతమిచ్చి పత్రికలు చదివిరి. దూషించి తాళ్లువేసెడి పూర్వకాలము పోయి యిప్పుడు భూషించి పూవులు వేసెడి క్రొత్తకాలము వచ్చినది. అయిన నాకా పూర్వకాలమే యెక్కువ సంతోషకరముగా నుండెను. ప్రతిపక్షులు దూషించిన కొలఁదిని రోషమును తన్మూలమున శౌర్యోత్సాహములును నెక్కువయయి యెక్కువపట్టుదలతోను శ్రద్ధతోను పనిచేయఁగలిగితిని.

నేను చెన్నపట్టణమునుండి వచ్చినతరువాత మరల నేనొకసారి పురపారిశుద్ధ్యవిచారణసంఘములో సభ్యుఁడనుగా రెండుసంవత్సరము లుండవలసినవాఁడ నయితిని. మొట్టమొదట మాపట్టణములోని యుపకరగ్రాహిగారు పారిశుద్ధ్యవిచారణ సంఘములో సభ్యుఁడవుగా నుండుమని కోరినప్పుడు రెండుసారులు నేనంగీకరింపక నిరాకరిం

చితిని. తరువాత మండలకరగ్రాహిగారు నేను సభ్యుఁడనుగా నుండ నంగీకరించుట తమ కనుగ్రహముచూపిన ట్లుండునని యాంతరంగిక లేఖను వ్రాసినమీఁదట మోటుతనము చేయుట యుక్తము కాదని యొప్పుకొంటిని. ఆ ప్రకారముగానే రాజమహేంద్రవరములోనున్న మధ్యస్థకారాగారమునకు (Central jail) ననన్యాధికారిక ద్రష్టనుగా (Non-official visitor) నియమించిరి కాని దానియందును నేను శ్రద్ధ వహించి పనిచేయలేదు.

చెన్నపురిరాజధానీ పరిపాలకులయిన లాలీదొరగారు 1909-వ సంవత్సరమున రాజమహేంద్రవరము వచ్చినప్పుడు నాకు దర్శన మిచ్చి చాలసేపు నాతో నత్యంతాదరముతో మాటాడిరి. మా సంభాషణములో దొరవారు తాము వచ్చి మా వితంతు శరణాలయ మును చూచెదమని సెలవిచ్చిరి. అక్కడకు దారి లేదని తప్పించు కొనుటకయి చూచితినిగాని బండి రానియెడల తాము బండిదిగి నడిచియే వచ్చెదమని వారు సెలవిచ్చిరి. అందుపైని నే నింటికివచ్చి నడుమ నాదివార మొకటి వచ్చినందున తత్క్షణమే నలువంద్ర కూలి వాండ్రను బెట్టి రాత్రియుఁ బగలును పనిచేయించి సోమవారము నాఁడు ప్రాతఃకాలమున దొరగారు వచ్చునప్పటి కొకవిధముగా బండి వచ్చుటకుఁ దగినబాటను వేయించితిని. వారా దినమున ప్రాతఃకాల మునం దేడుగంటలకు విజయంచేసి వితంతు శరణాలయమును చూచి సంతోషించి పోయిరి.

1908-వ సంవత్సరము ఏప్రిల్ నెల 14-వ తేదీతో నా కఱువది సంవత్సరములు నిండినవి. నాభార్యయొక్క ప్రేరణముచేత నేను షష్టిపూర్త్యుత్సవమును తలపెట్టి మిత్రులు మొదలయినవారి కాహ్వానపత్రికలను బంపితిని. నా యాహ్వానము నంగీకరించి దూర ప్రదేశములనుండి సహితము పలువురు మిత్రులును, వితంతు వివాహ

ములు చేసికొన్నవారును, శ్రమచేసివచ్చినన్ను గౌరవించిరి. పట్టణములోని పెద్దమనుష్యులును పలువురువచ్చి నన్నాదరించిరి. అందుచేతనాటియుత్సవము మిక్కిలిజయప్రదముగానే జరిగెను. మామండలన్యాయాధిపతిగారయిన పార్థసారథిఅయ్యంగారును! దయచేసి నాకానందము కలిగించిరి. ఆసమయమునందు నామిత్రులును శిష్యులునయిన గోపిశెట్టి నారాయణస్వామినాయుఁడుగారు నాకొక శాలువను బహుమానము చేసిరి. అప్రకారముగానే విజ్ఞానచంద్రికామండలివారిసమక్షమున కొమర్రాజు లక్ష్మణరావుగారొక శాలువను బహుమతిచేసిరి. ఆదిపూడి సోమనాథరావుగారు నూతనవస్త్రములను కట్టఁబెట్టిరి. పీటరుగారు నాఛాయాపటమును పెంచిపెద్దదిచేసి బహుమానముచేసిరి. శ్రీపిఠాపురము రాజుగారు మొదలయినవారనేకులు తంతివార్తలను, అభినందనలేఖలను బంపిరి. కొందఱు పద్యములనువ్రాసితెచ్చియిచ్చిరి. వితంతువివాహములాడినవారి బిడ్డలును మంగళగీతములను పాడిరి. అక్కడకు వచ్చినవారి ఛాయాపటము తీయఁబడిన తరువాత నాటిదినమానందాశ్రమములో జరిగినయుత్సవము సంపూర్ణమయినది.

1909-వ సంవత్సరమునందు వేసవికాలములో నేను బెంగుళూరు వెళ్ళవలెనన్న యుద్దేశముతో నాభార్యను చి॥ సుందరమ్మను జానకమ్మను వెంటఁగొని బైలుదేఱి దారిలో చెన్నపట్టణములోఁ గొన్నిదినములు నామిత్రులయిన సమర్థి రంగయ్యసెట్టిగారి యాదరముచేత నిలిచితిని. ఈ రంగయ్యసెట్టిగారు నాయం దత్యంత గౌరవమును ప్రేమయుఁ గలిగినవారు. నేనేమి చేయుఁడని కోరినను శిరసావహించి నాకార్యమును ముందుగాఁజేసి తరువాత తమ పనిని జూచుకొనెడువారు. నేను చెన్నపట్టణములో నుండినకాలములో నేను కోరకయే వితంతుశరణాలయ పోషణార్థముగా నెలకు పదేసిరూపాయలు పంపుచువచ్చిరి. నేను చెన్నపట్టణము విడిచి రాజమహేంద్ర నివాస

మును స్థిరముగా నేర్పఱుచుకొన్న తరువాత నే నాయన నొకసారి కలిసికొన్నప్పు డిట్లు నెలనెలకు పదేసిరూపాయ లిచ్చుచుండుటకంటె శాశ్వతనిధిగా నేమైన పెట్టుట యుచితముగా నుండునని చెప్పితిని. ఆయన తాను చెన్నపురి పారిశుద్ధ్యసమాజమువారికి బదులిచ్చిన పత్రములలోనుండి వేయిరూపాయలు విడఁదీసి హితకారిణీ సమాజమువారిపేర వ్రాయించి వెంటనే నాకోరికను చెల్లించిరి. నేనాయన నిట్లు చేయఁగోరినప్పుడు శీఘ్రకాలములో నామిత్రునకు మృత్యువు తటస్థించునని నేననుకోలేదు. ఆయన యావేసవికాలములో నెలదినములు బెంగుళూరిలో నాతోఁ గడపవలెనని నిశ్చయించుకొనెను. ఆయన నిమిత్తమయి నేనొక యిల్లక్కడ కుదిర్చితిని. ఇట్లుండఁగా దొరతనమువారి పక్షమున హరిసర్వోత్తమరావుగారి దేశీయస్వపరిపాలనవిషయమున వ్రాఁతలను గూర్చి సాక్ష్యమిచ్చుటకు కృష్ణామండలమునకుఁ బోవలసినవారైరి. అట్లు సాక్ష్యమిచ్చి తిరిగివచ్చినప్పుడు జూన్ నెల 19-వ తేదిని సంభవించిన [illegible]మార్గమహావిపత్తులో నా మిత్రున కకాలమరణము సంభవించెను. రేపు రానున్న విపత్తు నేఁడు మనకుఁ దెలియదు. జీవితము క్షణభంగురమయినది. ఈమిత్రుని యాకస్మిక బలవన్మరణమువలన నాస్వాంతమున కెంతో సంతాపముకలిగి బహుదినములవఱకు నాకదే చింతగా నుండెను. బెంగుళూరి యన్నదానసమాజమువారు తమ సమాజమున కొక యిల్లిమ్మని వేఁడఁగా నేను వ్రాసిన సశ్లాఘన లేఖవినాఁడ శ్రీరంగయ్యసెట్టిగారు వారికి నేను వ్రాసినట్లు సాయముచేసెదనని తమ మరణమునకు ముందు కొన్నిదినములక్రిందటనే నాకు వ్రాసిరి. ఈశ్వరచిత్త మెట్లుండునో యెవ్వరికిని దెలియదు. ఈసారి నాతో బెంగుళూరికి వచ్చినవారిలో శ్రీమతి సుందరమ్మనుగూర్చి యీవఱకే కొంత వ్రాయఁబడినది. రెండవయామెయైన శ్రీమతి జానకమ్మ వితంతువివాహ

మును చేసికొన్న న్యాపతి శేషగిరిరావు పంతులుగారి ప్రథమభార్య కూఁతురు. తండ్రి పునర్వివాహము చేసికొన్నప్పటి కీమెకు వైధవ్యము రాలేదు. పితంతె వయిన కొంతకాలమున కీమె రాజమహేంద్రవరములో నున్న తన పినతండ్రియింటినుండి మూత్రాఁటలోనికి వచ్చెను. అప్పటి కీమె తండ్రిగారు సజీవులయియే యుండిరి. నేను బెంగుళూరికి వచ్చినప్పుడెల్ల నాతో నొకరో యిద్దఱో వితంతువులు వచ్చుచుందురు. ఇది నేను బెంగుళూరికివచ్చుట రెండవసారి. 1907-వ సంవత్సరమున నేను మొదటిసారి వచ్చినప్పుడు శ్రీమతి మాగంటి వెంకటసుబ్బమ్మ నావెంట వచ్చెను. ఆమెను చెన్నపట్టణములో నుండిన యమ్-యస్-సిన్నరిసేగాడు వివాహము చేసికొనిరి. ఈసారి బెంగుళూరులో నున్నప్పుడు నా యారోగ్యము చక్కఁగా నున్న[illegible] ప్రవాస[illegible]ము[illegible]వాసము లిక్కడనే యుండ[illegible] నివాసము[illegible] యిల్లు కొనవలసి దనియు నాభార్య నాతోఁ జెప్పెను. ఆ సంవత్సరమునందే నాభార్య యిష్టానుసారముగా చామరాజపేటలో మంచిభాగమున నొక స్థలమునుగొని దానిలో నిల్లు కట్టుటకయి మేము రాజమహేంద్రవరమునకు తిరిగి రాకముందే మిత్రులద్వారమున నేర్పాటుచేసి మరలి వచ్చితిమి. ఈ యింటికయి నేను కొంత యప్పుచేసితిని. రాజమహేంద్రవరములోని వింతతు శరణాలయనాయకులకొఱకును నా కప్పగుచుండెను. ఆకాల కే మూఁడువేల రూపాయ లందు నిమిత్తమయి ఋణమయ్యెను. హితకారిణీసామాజికులవలన నెలనెలకు వచ్చెడు చందాలు చందాలు పోగుచేసెడు భృత్యునిజీతమునకే చాలిచాలమిగా నుండెను. ఇంటియద్దెలు మొదలైనవానివలన వచ్చెడిది గాక మిగిలిన దంతయు నేనే భరింపవలసినవాఁడనైతిని. నే నిప్పుడు బెంగుళూరులో నిల్లుకట్టించుచుండుటచేత రెంపుపనులకును సొమ్ము తెచ్చుటకు నే నస

రూపాయల కొక్కమిచ్చి, దాని యసలు ముట్టుకొనక వడ్డిని మాత్ర ముపయోగించుకొనవలసిన దని నియమ మేర్పఱిచితిని. ఆ సొమ్ములో నుండి రెండువేలరూపాయలు చెఱువు సోమరాజుగారికిని, వేయి రూపాయలు [illegible] రాజుగారికిని, బదు లిచ్చితిని. మిగిలిన మూడువేల యేనూరు రూపాయలును నాయొద్ద నిలువయుండెను. చేతిలోనికి సొమ్మువచ్చినప్పు డియ్యవచ్చునని యప్పులో వ్రాసి యీ సొమ్ములోనుండి హితకారిణీ [illegible] ములను జరపువచ్చితిని. ఇప్పటికా రూపాయలన్నియు [illegible] నిమిత్తమయి హితకారిణీ సమాజముక్రిందనే [illegible]. ఇది హితకారిణీ [illegible]. ఇప్పుడు సమాజమువారికి [illegible] చేయవల [illegible] నెట్టపుట్టినది. అందుచేత వారు [illegible] విన్నపము వ్రాసి [illegible]. దాని నిందుక్రింద ప్రకటించుచున్నాను—

OM!

## THE RAJAHMUNDRY HITHAKARINI SAMAJ.

THE RAJAHMUNDRY HITHAKARINI SAMAJ owes its origin to the wise desire of the venerable Rao Bahadur K. Viresalingam pantulu Garu to give permanence to, and to enlarge the scope of the great work to which he has dedicated his heroic life. A gathering convened by him, on 15-12-06 of some of those in sympathy with his life-work having unanimously suggested the formation of a corporate body the RAJAHMUNDRY HITHAKARINI SAMAJ was started with 36 members and was registered as a Company, under Act XXI of 1870, on 23-11-0[illegible]. The affairs of the Samaj are managed by a Committee of *nine* members, with the honoured Founder as the Life President.

The Samaj has been munificently endowed by its Founder, who has, with exemplary self-sacrifice, given away with a duly registered Trust, all his Property—the entire savings of a lifetime from a very modest income. This property estimated at Rs. 41,500, consists of 6,500 rupees in cash, some houses, and splendid gardens calculated to be the source of a handsome income before long.

The institutions entrusted to the Samaj by the Founder are a Widow's Home and a school for young ladies, besides an Anglo-Telugu weekly, which last has had to be discontinued.

Mr. Ch. Lakshminarasimham, an ardent admirer and co-worker of the Founder, having kindly made over a Lower Secondary School to the Samaj, in 1907, the institution has since been worked up to a complete High School controlled by a small committee appointed by the managing body of the Samaj.

The three insititutions bolonging to Samaj are in a promising condition, by the grace of God.

1. The High School, known as the Rajahmundry Hithakarini High School and worked on a Theistic basis, is flourshing. It has on its rolls over four hundred pupils, with ten girls If only it could provide accommodation adequate to the demand nothing will be left to desire in numbers. The staff is pronounced quite efficient. The School has enviable good fortune in looking up, for its patron, to the enlightened and liberal-minded Rajah of Pithapuram who besides already granting Rs 7,000 for initial outlay. has provided Rs. 20,000 in the Estate budget for the current year. The Samaj is prayerfully confident that under the fostering care of this esteemed nobleman—the rising hope of many a good cause in these parts—the School has a very bright future.

2. The Widow's Home is making encouraging progress At present there are fourteen inmates. Every one of them has to receive systematic education in English and Telugu, and is trained in household mangement. Due care is bestowed on suitable physical exercises and on nourishing a religious spirit. Four of the inmates attend the Hithakrini High School; the rest are educated in the school for young ladies attached to the Home. Five of the inmates were mar-

ried in the course of last year. The Home is located in the beautiful Ananda gardens given by the Founder.

3. The school for young ladies, though chiefly used by the inmates of the Home, is also meant for, and has on its rolls, other young ladies as well. It has a staff of three qualified teachers, and is under the direct supervision of the esteemed President. It will shortly be converted into a recognised Lower Secondary School. It is trusted that this is the nucleus of a High School for young ladies in due course of time.

In connection with the last two institutions—the Home and the school for young ladies—the Samaj has to acknowledge, with much gratitude, the very liberal gift of Mr. M. Atchutaramayya First Grade Pleader of Cocanada who has presented the home and the School with a fine block of buildings, consisting of ten rooms for inmates quarters, besides residence for the Superintendent of the Home and accommodation for the School:— the Samaj having had to dad a fresh-water well and a compound wall the cost on which, it is hoped, will be defrayed by the same generous gentleman. Likewise the donations of Rs. 3,000, in the form of Mill shares. from Mr. K. Venkata Rao of Bellary, and of Rs. 1,000, in Madras Municipal Debentures, by the late Mr. S. Rangiah Chetty, and a contribution, for 'current expenses of Rs 1,200 from the Rajah of Pithapuram, have to be thankfully acknowledged.

The prospects are thus cheering in every way. The scope of the work open to the Samaj to do, God willing, is vast and varied. If only adequate funds should be available, there may be no limit to the good that could be done through the Samaj. But the Samaj is already burdened with a debt of about Rs 3,060; and thus the need for financial help from the general community is pressing. Apart from the High School for boys, which is believed, under God, to be safe with the princely patronage of the Rajah of Pithapuram, the monthly demand for the other institutions managed by the Samaj stands at Rs. 160, at least. Against this imperative charge there is an income of only Rs 60 a month from subscriptions, rents, and investments. Thus a clear

*hundred* a month—Rs. 1,200 a year—must be forthcoming regularly to make both ends meet. For this amount the Managing Committee of HITHAKARINI SAMAJ now tenders this appeal to the generous public. It is confidently hoped that, in view of the nature—the objects and the scope—of the institutions managed by the Samaj and in grateful appreciation of the noble work and the magnificent self-sacrifice of the revered President-Founder, Rao Bahadur K. Viresalingam Pantulu Garu, this appeal will be graciously accorded a prompt and generous response in all parts ot the country.

All contributions, however small, may kindly be remitted to Rao Bahadur K. Viresalingam Pantulu Garu, President, Hithakarini Samaj, or to the undersigned.

Rajahmundry,
October 1909.

R. VENKATA RAMAIYA,
*Secretary,*
HITHAKARINI SAMAJ.

ఇంగ్లీషునందు వ్రాయఁబడిన విజ్ఞాపనముయొక్క సారము నిందు తెలిగించుచున్నాను—

హితకారిణీ సమాజము 1906 వ సంవత్సరము డిసెంబరు నెల 15 వ తేదిని వీరేశలింగముగారిచేత 86 గురు సామాజికులతో స్థాపింపఁబడి 1907 వ సంవత్సరము నవంబరు నెల 28 వ తేదిని 1860 వ సంవత్సరము 21 వ సంఖ్య రాజశాసనప్రకారము లేఖ్యారూఢము చేయఁబడినది. తొమ్మండుగురు కార్యనిర్వాహక సామాజికులు దీని కార్యములను నిర్వహింతురు.

సమాజస్థాపకులు రు. 41500 వెల చేయునటువంటి యిండ్లు, తోఁటలు రు. 6500 ల రొక్కమును గల తమ సొత్తునంతను దీని వ్రాసియిచ్చి లేఖ్యారూఢము చేయించియున్నారు. అందున సమాజమున కొప్పగించినవి వితంతు శరణాలయము, బాలికాపాఠశాల, ఒక యింగ్లీషు తెలుఁగు వారపత్రిక. ఈకడపటి దిప్పుడు నిలిపివేయఁబడినది. 1907 వ సంవత్సరమునందు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు సమాజమున కిచ్చిన మాధ్యమిక పాఠశాల యిప్పు

డున్నత పాఠశాల యయి యొక యుపసంఘమువారి నిర్వహణము క్రింద వర్ధిల్లుచున్నది.

సమాజముయొక్క యీ మూఁడు ధర్మాలయములును ఈశ్వరానుగ్రహమువలన మంచిదశయందున్నవి.

1. రాజమహేంద్రవర హితకారిణ్యున్నత పాఠశాల యనఁబడెడి యున్నతపాఠశాల యాస్తికపద్ధతుల ననుసరించి నడుపఁబడుచు వర్ధిల్లుచున్నది. దానిలో నన్నూఱుగురికంటె నెక్కువమంది విద్యార్థులున్నారు. ఉపాధ్యాయులును తగినవారుగా నున్నారు. పదుగురు బాలిక లున్నారు. తగినభవన మున్నచో విద్యార్థులసంఖ్య యింకను ఎక్కువగును. పాఠశాల పిఠాపురపు రాజగారి పోషకత్వమును సంపాదించుట కిప్పు డీభాగ్యమును బడసినది. వారిప్పుడు కేవలము వేయి రూపాయలను ప్రారంభధనముగా నిచ్చుటయే కాక యిరువదివేల రూపాయలు సంవత్సరమునకు నూరుచొప్పున నిర్మాణమున కిచ్చిన యేర్పాటులు చేసి యున్నారు. వారి పోషణముక్రింద నీపాఠశాల మహోన్నతదశకు రానున్నదని సమాజమువారు నమ్ముచున్నారు.

2. వితంతుశరణాలయము ప్రోత్సాహకరమైన యభివృద్ధిని పొందుచున్నది. ప్రస్తుత మిందులో పదునలుగు రున్నారు. వారిలో సంవత్సరాలు ఇంగ్లీషు తెలుఁగు విద్యలు చెప్పుచుటయే కాక గృహకృత్య నిర్వహణము కూడ నేర్పఁబడును. అవసరమైన దేహపరిశ్రమము చేయుటకును శక్తిభక్తిని కలిగించుటకును, తగిన శ్రద్ధ చేయఁబడుచున్నది. అక్కడివారిలో నలుగురు హితకారిణ్యున్నత పాఠశాలకు పోయి చదువుచున్నారు; తక్కినవారు శరణాలయముతోఁ జేరియున్న పాఠశాలలో చదువుచున్నారు. శరణాలయము సమాజస్థాపకునిచే నిర్మింపఁబడిన సుందరానందారామములో నున్నది.

8. పాఠశాల ముఖ్యముగా వితంతు శరణాలయములోని స్త్రీలకే యుపయోగింపఁ బడుచున్నను, అది యితర యువతుల కొఱకుఁ గూడ నుద్దేశింపఁ బడినందున కొందఱితర సుందరులును నందు చదువుచున్నారు. అది తగినయుపాధ్యాయులను ముగ్గురను గలదయి సమాజాధ్యక్షునియొక్క స్వీయవిచారణక్రిందనే యున్నది. ఇది శీఘ్రకాలములోనే దొరతనమువారిచే నంగీకరింపఁబడిన మాధ్యమిక పాఠశాల చేయఁబడును. ఇది కాలక్రమమున నేర్పడఁబోయెడు స్త్రీల యున్నత పాఠశాలకు బీజమగునని నమ్ముచున్నాము,

ఈ కడపటి రెంటి విషయములోను అనఁగా వితంతు శరణాలయ బాలికాపాఠశాలల విషయములో కాకినాడలోని యొకటి తరగతి న్యాయవాదులయి (శ్రీ) ముంగర్ల? అమృతరామయ్యగారు వితంతువ్రుల [illegible] [illegible] [illegible] [illegible]. [illegible] విచారణచేయువారు [illegible] [illegible] [illegible] [illegible] [illegible] పాఠశాల నుంచుటకై తగిన [illegible] [illegible], గల గృహము [illegible] మహౌదార్యముతో కట్టించి యిచ్చినందుకు [illegible] సమాజము వారు మిక్కిలి కృతజ్ఞులయి యున్నారు. వేయిరూపాయల వ్యయము చేసి సమాజమువారు త్రవ్వించిన మంచినీళ్ళ బావికిని, కట్టించిన ప్రాంగణకుడ్యమునకును అయిన వ్యయమును గూడ నాయుదార పురుషులే భరింతురని నమ్ముచున్నాము. ఈ ప్రకారముగానే సభాపతి యంత్రములలోని భాగముల రూపమున మూఁడు వేలరూపాయలను దయచేసిన బళ్ళారిలోని కోలాచలము వేంకటరావుగారి యెడలను చెన్నపురి నగరపారిశుధ్య విచారణ సంఘమువారి ఋణపత్ర రూపమున వేయిరూపాయలను దయచేసిన కీర్తిశేషులయిన సమర్థి రంగయ్యసెట్టిగారి యెడలను, వర్తమాన వ్యయములకయి పంద్రెండు వందల రూపాయలను దయచేసిన శ్రీ పిఠాపురపు రాజాగారియెడలను సమాజమువా రత్యంత కృతజ్ఞతగలవారయి యున్నారు.

అభివృద్ధిచిహ్నము లిట్లన్నివిధముల చేతను ప్రోత్సాహకరము లుగానే యున్నవి. ఈశ్వరానుగ్రహ మున్నయెడల సమాజమువారు చేయవలసిన మంచిపనికిఁ గావలసినంత యవకాశ మున్నది. తగినంత సొమ్ము మాత్రము సమకూరెడు పక్షమున సమాజద్వారమున జరుపఁబడెడు సత్కార్యమునకు పరిమితి లేకపోవచ్చును. సమాజమున కీవఱకే మూఁడువేల రూపాయల ఋణ మయినది; కాఁబట్టి మహాజనులవలన ధనసాహాయ్య మత్యంతాభ్యర్థనీయ మయి యున్నది. ఈశ్వరానుగ్రహమువలన శ్రీపిఠాపురపు రాజాగారి పోషణముక్రింద సురక్షితముగా నున్నతపాఠశాలమాట యటుండ నిచ్చినను, సమాజమువారిచే నిర్వహింపఁబడుచున్న యితర ధర్మస్థాపనములనిమిత్తమే నెల [illegible] రూపాయలు కావలెను. దీనిలో చందాలమూలమునను, వడ్డీమూలమునను, దా[illegible]ల మూలమునను, నెల [illegible] రూపాయలు [illegible] వచ్చుచున్నది. అందుచేత సరిగా [illegible] రూపాయల [illegible] పంపుచుండెడు [illegible] రూపాయలు సరిగా [illegible]. [illegible] సమాజము [illegible] స్థాపనమును జేయుచున్నారు. సమాజమువారిచే [illegible] యీ ధర్మప్రతిష్ఠల యొక్క యుద్దేశమును [illegible] స్వభావములను విచారించి దేశ[illegible] భాగ[illegible] మావిన్నప మాలకించి [illegible] తగినంత [illegible] చేయుమని వినయముతోఁ బ్రార్థించుచున్నాము. ఎంత యల్పమయినను తమసహాయద్రవ్యమును పీ[illegible] పంతులుగారికిఁ గాని యీ క్రింద వ్రాలుచేసినవారికిఁ గాని దయాపూర్వకముగాఁ బంపుదురుగాక !

రాజమహేంద్రవరము, } అక్టోబరు 1909. }

రా- వేంకటరామయ్య,
హితకారిణీ సమాజ కార్యదర్శి.

ఇట్లు విత్తము నిమిత్తము విన్నపము వ్రాయఁబడి ముద్రింపఁబడినది. ఇఁకను దేశాటనము చేసి చందాలు పోగుచేయువారు కావలెను. నావెంట నెవ్వరైనను వచ్చెడు పక్షమున నేను భార్యాసహితముగా బొంబాయి పోయి పని చేసెదనని చెప్పితిని. కార్యనిర్వాహకసంఘమువారు సహాయకార్యదర్శులైన హనుమంతరావుగారిని వెంటఁగొని సకళత్రముగా నేను బొంబాయి పోయి చందాలు సమకూర్చవలసినదని నిర్ధారణము చేసిరి. అది నాకు దగ్గు వచ్చెడి శీతకాలమయినను నేనఱువదియేండ్లు దాటినవాఁడనయినను నిర్వాహకసంఘనిర్ధారణానుసారముగాఁ బోవఁ బ్రయాణమయితిని. చి॥ సుందరమ్మ తనభర్త నా వెంటఁ బోవుట కష్టపడక నేను చెప్పఁబోయినప్పుడు నాతో మాటాడకపోయెను. అయినను హనుమంతరావుగారు [illegible] మాటను నాబండిలోఁ బెట్టి పయనమగుచు నావెంటను బైలుదేరి వచ్చిరి. మేము మఱునాఁడు సికందరాబాదు చేరి నాఁటి కక్కడ నిలిచిపోయితిమి. అక్కడ శాస్త్రుల. [illegible]గారు నన్ను చూచి నేను పోవుచున్నపనిని [illegible] చందాను పదునేను రూపాయలు నాచేతికిచ్చిరి. నేను [illegible] బోయినప్పుడు కవయిత్రియైన సరోజినీనాయఁడు [illegible] మంచముమీఁదఁ బరుండియుండి బిడ్డలను తనవద్దకుఁ బిలిచి మామగారు వచ్చినారు చూడుఁడని నన్ను చూపెను. వారి వివాహమును చెన్నపట్టణములో నేను చేసియుండుటచేత నాకు నన్నట్లు పిలిచినది. సరోజినీదేవిగారి తండ్రి తన కొమార్తెల వివాహమును మాయింటనే చేయవలసినదని నన్ను కోరెను. గాని నేను [illegible] చేయక సమాజమందిరములో జరిపితిని. సికందరాబాదులో ది శ్రీమతి కొటికలపూడి సీతమ్మ తన యన్నగారియొద్ద నుండఁగా నేము వారియింటను బస చేసితిమి. రాజమహేంద్రవరంబులో నాభార్యచేత స్థాపింపఁబడిన స్త్రీప్రార్థన సమాజ

మును మేము చెన్నపట్టణములో నున్న కాలములో చి॥ సీతమ్మయే జరుపుచువచ్చెను. ఆమె గర్భవతియై మిక్కిలి బలహీనురాలుగా నుండునప్పుడు భర్త యామెను చెన్నపట్టణము మాయింటికిఁ బంపెను. నావద్ద నున్న కాలములో నేనామెకు ఛందస్సును వ్యాకరణమును నేర్పితిని. అక్కడ నున్నప్పుడే యామె యొక శతకమును జేసెను. ఆమెకు నాయందు పితృభావము; ఆమెయందును నాకు పుత్రికావాత్సల్యము. ఆమె కూఁతురు చి॥ చంద్రమతి చెన్నపట్టణములో మాయింటఁ బుట్టినదే. ఇట్లు సికిందరాబాదులో నొకదిన మామె యున్నగారియింటనుండి మఱునాఁటియుదయమున బైలుదేఱి భార్యామిత్రసహితముగా బొంబాయికిఁ బోయితిని. అక్కడ నా మిత్రులును హైందవ సాంఘికసంస్కార పత్రికాధిపతులు నైన నటరాజయ్యరుగారు మమ్ము తమయింటికిఁ గొనిపోయిరి. చదువుకొన్న వారిలోను సంస్కార పక్షమువారిలోను ప్రార్థన సామాజికులలోను నాపేరక్కడ సహితము చక్కఁగాఁ దెలిసియున్న దగుటచేత నక్కడివారును నాకు స్వాగత మిచ్చి నన్ను గౌరవించిరి. న్యాయమూర్తి చంద్రవార్కరుగారు నన్నొకసభలో నభినందించిరి. యంత్రకారశాఖయందున్నవారును నాశిష్యులును నయిన గంటి లక్ష్మినరసింహముగారును నామిత్రులైన న్యాయమూర్తి గణేశనారాయణ చంద్రవార్కరుగారును నాకు విందులు చేసిరి. నేనక్కడకు విందుల నిమిత్తము గాక చందాల నిమిత్తమయి పోయియుండినవాఁడ నగుటచేత మఱికొందఱు మిత్రులు భోజనములకుఁ బిలిచినను బోవక మిత్రసాహాయ్యమున చందాలు పోగుచేయ నారంభించితిని. నేనక్కడనున్న వారము దినములలోను తొమ్మిదివందల రూపాయల చందాలు వేయించితిని. ఈ విషయములో నాంధ్రపత్రికాధిపతులైన కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారును హైందవసాంఘిక సంస్కారపత్రికాధిపతు

సమకూర్చితిని. అక్కడ బ్రహ్మశ్రీ ములుకుట్ల అచ్యుతరామయ్యగారు రు 500-0-0 లును, దివాన్‌బహదూరు దురిసేటి శేషగిరిరావుపంతులుగారు రు 200-0-0 లును రావుబహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణ నాయఁడుగారు రు 100-0-0 లును, రావుసాహేబు పైడా వేంకటచలపతిగారు రు 1166-0-0 లును, నాళము రామలింగయ్యగారు రు 250-0-0 లును, నాళము పద్మనాభముగారు రు 50-0-0 లును, బ్రహ్మశ్రీ దగ్గిరాల వేంకట సూర్యప్రకాశరావుగారు రు 116-0-0 లును చందాలు వేసిరి. ఇట్లు సమకూర్పఁబడిన ధనముతో హితకారిణీ సమాజముయొక్క ఋణము కొంత తీఱినది.

1910-వ సంవత్సరము వేసవికాలములో మేము మరల బెంగుళూరికిఁ బోయితిమి. ఈసారి మాతో న్యాపతి జానకమ్మను కామరాజుగడ్డ మంగమ్మను దీసికొనిపోయితిమి. మేము చెన్నపట్టణములో దిగినప్పుడు దొరతనమువారి తెలుఁగు భాషాంతరీకర్తయయిన గోటేటి కనకరాజుగారు రయిలుమార్గ కార్యస్థానమునకువచ్చి మమ్ముఁ గలిసికొని తమ యింటికిఁ దీసికొనిపోయి సూకరించిరి. అక్కడఁ గొన్నిదినము లుండి మేము బెంగుళూరికిఁ బోయితిమి. ఈ సారి మేమక్కడ మా స్వగృహములోనే ప్రవేశించితిమి. మేము పోవునప్పటికి నామిత్రులు గృహమును గట్టించి నివాసమున కర్హమగునట్లుచేసిరి. మేము వెళ్ళినతరువాత లోపలికి మంచినీళ్లు వచ్చుటకు గొట్టములు పెట్టించితిమి. విద్యుద్దీపముల కేర్పాటు చేసితిమి. దొడ్డి చుట్టును గోడలను పెట్టించితిమి. ఆయిల్లన్నివైపులనుండియు మంచి గాలి వచ్చుట కనుకూల్యములు గలదయి యుండెను. ఈయన్ని సౌఖ్యములను విచారించియు ముఖ్యముగా మా కక్కడ నధికారోగ్యము కలుగుచుండుటనుబట్టియు నాభార్య సంవత్సరములో నాలుమాసము లాయింటనుండి సుఖింపవలెనని నిశ్చయించుకొనెను. ఆమె

కోరిక ప్రకారముగా నక్కడ నాలుగునెల లుండుటకు నేనును సమ్మతించితిని. ఈ సంగతి నామె మా యిరుగుపొరుగువా రందఱితోను జెప్పి సంతోషించెను. మే మక్కడ స్థిరముగా నుండుటకయి కావలసిన పాత్రసామగ్రిని బల్లలు మంచములు కోళ్లు రోళ్లు మొదలైన వానిని సమస్తమును గొంటిమి. ఈసారి మావెంటఁ గొని వచ్చిన శ్రీమతి న్యాపతి జానకమ్మను వివాహముచేసితిమి. ఇది బెంగుళూరిలో జరిగిన మొదటివితంతువివాహము. వితంతువివాహశాసనము మైసూరు రాజ్యమునందు వ్యవహారములో లేదు. అందుచేత మేమీ వివాహమును స్వగృహమునందు చేయుటకు వీలులేదు. ఇంగ్లీషురాజ్యమయిన దండుపట్టణములోనికి వధూవరులను దీసికొనిపోయి యక్కడ చేయవలసినవార మయితిమి. ఈ వివాహ మక్కడ నూతనమయిన దగుటచేత బెంగుళూరులోని పెద్దమనుష్యులు విశేషముగా వచ్చి తాంబూలాది సత్కారములను గైకొని సంతోషించి పోయిరి. మాతో వచ్చిన శ్రీమతి మంగమ్మ వితంతు శరణాలయములో నుండినవారిలో నెల్ల నా భార్య కధిక ప్రియురాలు. అందుచేత నే యీసారి యామెను నాభార్య వెంటఁ గొనివచ్చినది; నాభార్య కామెయందు పుత్రికావాత్సల్యము. ఆమెకును నాభార్యయందు మాతృస్నేహము. ఆమె వితంతు శరణాలయములోనే యుండినను తఱుచుగా మాయింటికి వచ్చి నాభార్యకు సమస్తోపచారములను జేసి పోవుచుండెడిది. కాఁబట్టి వీ రిరువురును తల్లిబిడ్డలవలె నుండెడివారు. నాభార్య నాతో మన మంగమ్మను వివాహముచేసి పంపివేయవలసినదనియు, పెండ్లి చేసి మనయొద్దనేయుంచుకొందమనియు, పలుమారులు చెప్పుచుండెను. శ్రీమతి జానకమ్మ వివాహమయిన తరువాత బెంగుళూరు విడిచి వచ్చినవారము మంగళమును సుఖముగా మరల రాజమహేంద్రవరము చేరితిమి.

# నాలుగవ ప్రకరణము

## అసహాయదశ

క్రీస్తుశకము 1910 మొదలు 1913వ సంవత్సరము వఱకు

1910-వ సంవత్సరమునం దీసారి నేను బెంగుళూరునుండి వచ్చి నతరువాత రెండుమాసములైనను గడవకమునుపే యాకస్మికముగా నాకొక్క ఘోరవిపత్తు సంభవించి నన్నీలోకములో నసహాయునిం జేసినది. బెంగుళూరునుండి నాభార్య యిక్కడికి సంపూర్ణారోగ్యము తో వచ్చినది. తరువాతనైనను రోగచిహ్నములేవియు కనంబడలేదు. ఆగష్టు నెల 11 వ తేదీని పైకి నాభార్య యారోగ్యవతి యయిసుఖముగా నున్నట్టే కనంబడినది. ఆదినమునం బ్రాతఃకాలమునను సాయంకాలమునను తానే స్వయముగా వంటజేసి పెట్టినది. రెండుదినముల క్రిందట మామిడికాయలు యీనంగా గతదినమునందువలెనే నాడును జున్నుచేసి నాకుం గొంచెము పెట్టి యితరులకుం బెట్టి తానింత తినెను. నాటిసాయంకాలము కనపర్తి శ్రీరాములుగారు నన్ను చూచుటకయి మాయింటికి రాంగా తా నాయనతో కొంతసేపు మాటాడి కొంచెము జున్ను పెట్టెను. నాటిరాత్రి మేమిద్దఱమును కలిసియే భోజనము చేసితిమి. భోజనము చేయునప్పుడు మఱునాడు తా నుదయమునందే చలిదియన్నమును తిని ప్రేమావతిని వైద్యశాలకుం దీసికొనిపోయి మందిప్పించి వచ్చెదనని నాతోం జెప్పెను. ప్రేమావతి పతితయువతీరక్షణశాలలోని యొక బ్రాహ్మణవితంతువు కని విడిచి పోయిన బిడ్డ. ఆబిడ్డను నాభార్య పెంచుచుండెను. నేను భోజనము చేసి మేడమీఁదికిం బోయినతరువాత నింట పనులన్నిటిని దీర్చుకొని పశువులకు గడ్డి వేయించి తాంబూలము వేసికొని రాత్రి పదిగంటలకు మేడమీఁదికి వచ్చి యీశ్వరప్రార్థనము చేసి తాను బోయి

వసారాలోనున్న మంచముమీఁదఁ బరుండి నిద్రపోయెను. నాభార్య మేడపైకి వచ్చినప్పటికే గదిలో నేను నిద్రపోయితిని. నేను సాధారణముగా రాత్రి యెనిమిదిగంటలకే భోజనము చేసి తొమ్మిది గంటలకు నిద్రపోవుట వాడుక. తెల్లవాఱుజామున నాభార్య నాలుగు గంటలలో నిద్రలేచి గంటసేపు నాతో మాటాడుచుఁ గూరుచుండి యైదుగంటల కీశ్వరప్రార్థనము చేసికొని క్రిందికి దిగిపోవుట యాచారము. నేనారాత్రి మూడుగంటలు కాకముందే లేచి తలుపుతీసి క్రిందికి పోయితిని. నేను తలుపుతీసిన చప్పుడు వినఁబడఁగానే "క్రిందికి పోవుచున్నారా? దీపమున్నదా? జాగ్రతగా చూచిపొండి" యని పలుకరించుట వాడుకయైనను నాఁడట్లు పలుకరింపలేదు. నేను దొడ్డిలోనికి వెళ్ళివచ్చి నాభార్య మంచమువద్దకు పోయి మెల్లఁగా 'నిద్రపోవుచున్నావా' యని యడిగితిని. బదులు పలుకక పోవుటచేత నేనుపోయి నామంచముమీఁద మేలుకొనియే పరుండిటిని. కొంతసేపటికి గడియారము నాలుగు కొట్టినది. నా భార్య లేచివచ్చి పడక కుర్చీమీఁద కూర్చుండి నాతో మాటాడ మొదలుపెట్టువేళ యయినది. ఇంకను లేచి రాలేదు. నేనప్పుడు నా మంచముమీఁదనుండి దిగి నాభార్య మంచమువద్ద నిలుచుండి "ఇంకను నిద్రమెలఁకువ రాలేదా?" యని యడిగితిని. నాపలుకునకు మాఱుపలుకలేదు. రాత్రిపొద్దు పోయినదాఁక పనిచేసి వచ్చియలసి గాఢనిద్రపోవుచున్నదని తలఁచి నిద్రాభంగముచేయుట కిష్టములేనివాఁడ నయి లేపక నేను మడత కుర్చీమీఁద గూరుచుండి యుంటిని. ఇంతలో గడియారము యైదుగంటలువేసెను. నాభార్య యప్పటికిని లేచిరాలేదు. ఆమె యైదుగంటల తరువాత నెప్పుడును పరుండెడిదికాదు. అందుచేత నేనుపోయిపిలిచి లేపి పలుకక పోఁగా మీఁద చేయివేసి కదల్చితిని. దేహము చేతికి చల్లగా తగిలి లేవకపోఁగా నేమియుఁదోఁచక యొట్లో మేడదిగి వైద్యుని (డాక్టరును)

పిలుచుకొని వచ్చుటకయి వితంతు శరణాలయమువద్దనుండి పోవుచు నందు కాపురమున్న దిలవర్తి సుబ్బారావును లేపి "నాకు వేగముగా నడవ కాళ్లాడకున్నవి, నీవు పరుగెత్తుకొనిపోయి పొరుగుతోఁటలో నున్న డాక్టరును లేపు" మని పంపి నేను వెనుకపోయితిని. నేనుపోవు నప్పటికి డాక్టరు లేచి యీవలకు వచ్చె. నాభార్యకు మూర్ఛవచ్చి నది తత్క్షణము రావలెనని నేనుకోరఁగా నతఁడు లోపలికి పోయి మందుబుడ్లు మొదలయినవి తీసికొని నావెంట వచ్చెను. అతఁడు నాతో మేడయెక్కి నాభార్యను పరీక్షించి చూచి యేమియు చెప్పక యూరకయుండెను. "ఏమి? యూరకుంటిరేమి?" యని నే నడుగఁగా "ప్రాణముపోయిన" దని మెల్లగా నతఁడు చెప్పెను. నే నా మాట నమ్మక చక్కఁగాఁ బరీక్షింపవలసినదని యడిగితిని. ప్రాణముపోయి మూఁడు నాలుఁగు గంటలసేపయి యుండుననిచెప్పి యాయన లేచెను. ఆయన వెంట నేను పడకగది గుమ్మమువఱకును నాలుగయిదడుగులు నడిచితిని. ఆయన గుమ్మముకడ నిలువఁబడి నన్నోదార్చి ధైర్యముగా నుండవలసినదని బోధించి మెట్లు దిగెను. నేనును గోడకుఁ జేరగిలఁబడి నిలువఁబడి యుండఁగా లోపలనుండి యేదో వికారమారంభమయి కాళ్లు తడఁబడ జడపట్టెను నేను పడిపోవుదునని తత్క్షణమే నేలపైఁ గూలఁబడి కన్నులుమూసికొని యీశ్వరునిఁదలఁచి ప్రార్థింప వలెనన్న చింతతో 'ఓ యీశ్వరా! వృద్ధదశలో నాకిట్టి మహాపదను దెచ్చి పెట్టితివా?" యని మొదటివాక్యము నంటిని. అనునప్పటికి "ఓయీ! దుఃఖపడఁబోకుము, ఇది మీ యుభయుల మేలుకొఱకే జరిగినది" అన్నమాటలు నాకు విస్పష్టముగా వినఁబడినవి. క్రిందినుండి యెవరో వచ్చి నన్నూఱడించుచున్నారని తలఁచి కన్నులువిప్పి నలుదిక్కులుచూచితిని. ఏప్రక్కను ఎవ్వరును కనఁబడలేదు. ఇది యంతయు నాభ్రమయే యయియుండవచ్చునుగాని నాకు మాత్రమవ్వ

యీశ్వరవాక్యమని దృఢముగా తోఁచినది. అవఱకు నాకున్న విచారమంతయు క్షణములో నదృశ్యమయి నామనస్సు నిర్మలమయి నిర్విచారమయ్యెను. అప్పు డేమియు నాపద రానట్టుగానే నేను ధైర్యముతోలేచి నాభార్య మంచమువద్దకుఁబోయి పరీక్షించి చూడఁగా నామె మొగమునందు జీవకళ యేమియుఁ దొలఁగక హాయిగా పరుండి నిద్రపోవుచున్నట్టే నాకంటికిఁ గనఁబడెను. ముక్కువద్ద వ్రేలుపెట్టి చూచితినిగాని యూపిరియాడుచున్నట్టు కనఁబడలేదు. పక్కనుప్పటి యేమియుఁ జెదరక వేసినది వేసినట్టే యుండెను. తలలో పెట్టుకొన్న గులాబిపువ్వు వాడక యప్పుడు పెట్టుకొన్నట్టుగానే యుండెను. పరుండఁబోవునప్పుడు నోటిలో వేసికొన్న లవంగపుమొగ్గ పండ్లసందున యథాప్రకారముగానే యుండెను. రాత్రి మేడమీఁదికి వచ్చిన తరువాత నాతఱుసెఁగట్టుకొనియుండిన బట్టను విడిచి కట్టుకొన్న విలువగల చీర యేమియు నలుగక తొలఁగక కట్టుకొన్నది కట్టుకొన్నట్టుగానే యుండెను. పెట్టుకొనియుండిన నగలు పెట్టుకొన్నట్టుగానే యుండెను. వీని నన్నిటినిబట్టి విచారింపఁగా నాభార్య యించుకైన నాయాసపడలేదనియు కొట్టుకొనలేదనియు మూలుగలేదనియు రాత్రి యొంటిగంటకో రెండు గంటలకో నిద్రలోనే ప్రాణముపోయెననియు స్పష్టమయినది. కొంచెమయినను మూలిగియుండినయెడల నేను తప్పక లేచియుందును. సర్పదంశన చిహ్నములుగాని విషప్రయోగ లక్షణములుగాని యణుమాత్రమును గనఁబడలేదు. పెద్దతనములో స్వప్రకారముగా హృదయవ్యాపార మాకస్మికముగా నిద్రలో నిలిచిపోవుట కలదని డాక్టరుగారు చెప్పిరి. ఎందుకో వైద్యుఁడు వచ్చె ననుకొనుటయేకాని యిట్టి వైపరీత్యము జరగెనని యెవ్వరు నెఱుఁగరు. మరణమునకు సందేహములేదని నేనును నిశ్చయముచేసికొన్న తరువాత క్రిందికి దిగివచ్చి, యక్కడనున్నవారితో నాభార్య మరణవార్తను

తెలిపి, పట్టణమునకుఁబోయి కొందఱి మిత్రులతోఁ దెలుపవలసినదని మనుష్యులను బంపి, నేను మరల పైకిపోక మేడక్రిందనున్న పడక కుర్చీలోనే కూరుచుంటిని. అప్పుడు వితంతు శరణాలయములోని వారం దఱును విలపించుచువచ్చి పయికిఁ బోయి చూచి యేడువ దొడఁగిరి. ఇంతలో పట్టణమునుండి పలువురు మిత్రులువచ్చి నా భార్యను మేడమీఁదినుండి క్రిందికిదింపి మేము వాసముచేసెడి యింటిముందు వసారాలో పడకకుర్చీమీఁదఁ గూర్చుండఁబెట్టిరి. ఆమె యప్పుడా కుర్చీమీఁద జీవించి కూర్చుండి యున్నట్టుగానే యుండెను. అప్పుడామె పెంచిన పిల్లియొకటి వచ్చి పైకిదూఁకి యామె యొడిలోఁ గూరుచుండెను. ఆమె మనుష్యుల విషయమయి మాత్రమే కాక పశువులు కుక్కలు పిల్లులు మొదలయిన గృహ్యజంతువుల విషయమయి కూడ నపారదయ కలదయి వానిని బెంచి సంరక్షణము చేయుచు వానికి రోగములు వచ్చినప్పుడు మనుష్యులకుఁ జేసినట్లే యుపచారములు చేయుచుండెడిది; తాను బజారుమార్గమునఁ బోవ తటస్థించినప్పు డెల్లను వాని నిమిత్తమయి యేదో కొనితెచ్చి వానికిఁ దప్పక పెట్టుచుండెడిది. అందుచేత నాభార్య బండిదిగఁగానే తమ కేదో తెచ్చిపెట్టునని యెఱిఁగి తోఁకలాడించుచు కుక్కలును మ్యావని యఱచుచు పిల్లియు వెంట బడుచుండెడివి. మేము తోఁటలో నొంటిగా నుండిన కాలములో మాకు కుక్కలే ధనప్రాణములకు రక్షకములుగా నుండెను. మావద్ద బ్రౌనని యొకకుక్క యుండెను. అయోమార్గ యంత్రకారుఁ డొకఁడు రాజమహేంద్రవరము నుండి స్థానాంతరమునకు మార్పఁబడినప్పుడు దానిని నామిత్రుని కొకని కియ్యఁగా నతఁడు నాకిచ్చెను. అది మాదగ్గఱ మచ్చికపడినను విప్పినప్పుడెల్లను పాఱిపోయి తన పూర్వయజమానుఁడున్న యింటివద్ద నుండుచువచ్చెను, ఇట్లు రెండుమూఁడు మాసములు గడచిన పిమ్మట

దాని పూర్వయజమానుని స్థానమునవచ్చిన క్రొత్త యంత్రకారుఁడు మీకుక్క మాయింటికి వచ్చిన యెడల తుపాకితోఁ గాల్చి చంపి వేసెదనని నాకు వర్తమానము పంపెను. అది నిష్కారణముగాఁ జచ్చిపోవునని జాలిపడి దానిని నాకిచ్చిన మిత్రునికడకుఁ బంపి మఱి యెవ్వరికైన నిచ్చివేయుమని కోరితిని. అతఁడు దానిని గోదావరి కావల కొవ్వూరిలోనున్న యొక యఱోమార్గోద్యోగి కిచ్చివేసెను. వారముదినము లయిన తరువాత నొక నాఁటిరాత్రి నేను భోజనము చేయుచుండినప్పుడు చేయి కడుగుకొనుటకయి నాభార్య దొడ్డి లోనికిఁబోఁగా నొకకుక్కవచ్చి నాభార్యముందు తోఁకయాడించుచు నిలిచెను. "మన బ్రౌని వచ్చినదంసోయి" యని నాభార్య కేకవేసి నన్నుఁ బిలిచి చూపెను. నాఁటినుండియుఁ గుక్క తోఁటవిడిచిపోవక విశ్వాసము కలదయి యుండెను. ఒకనాఁటి రాత్రి నాభార్య యేదో పని నిమిత్తముయి యావలకుఁ బోఁబోవుచుండఁగా, ఈ కుక్క యడ్డమువచ్చి నిలిచి ముందుకు పోనీక వెనుక కామెను ద్రోసివేసెను. కుక్క యల్లరిల చేయుచున్నదా యని ముందుప్రక్క నిదానించి చూడఁగా దీపము వెలుతురున పెద్ద పా మొకటి సమీపముననే ప్రాఁకుచుండెను. పాము పామని నాభార్య కేకలు వేయఁగా నేనును సేవకులును బరుగెత్తుకొనివచ్చి పామును జంపివేసితిమి. తన ప్రాణము కాపాడినదని దానియందు నాభార్య యధికప్రేమ కలదయి దానికి పుండుపడి రోగము వచ్చినప్పుడు పుండు తాను స్వయముగా కడిగి మందు వేయుచు దానికి మరణము సంభవించినప్పు డెంతో సంతాపము నొందెను.

నాభార్య మరణవార్త పట్టణములో తెలియఁగానే యేడుగంటలు మొదలుకొని జనులు తీర్థప్రజవలె గుంపులు గుంపులుగా మా తోఁటలోనికి రాఁదొడఁగిరి. ఆవచ్చినవారిలో హిందువులును మహమ్మ

దీయులును, క్రైస్తవులును, బ్రాహ్మణులును, శూద్రులును, శుద్ధ శ్రోత్రియులును, సంస్కారప్రియులును, పుణ్యస్త్రీలును, వితంతువులును, వృద్ధులును, పిన్నవయసువారును కూడ నుండిరి. వచ్చినవారిలో కొందఱు తమ కుటుంబములోనివా రెవ్వరో పోయినట్టుగా నాభార్య నిమిత్తమయి విలపింపఁజొచ్చిరి. ధైర్యము చెప్పి యేడుపుడిపి నన్నోదార్ప వచ్చిన వారు కొందఱు నన్నుఁ జూచి యేడువ సాగఁగా నేనే వారి యేడుపుడుపవలసినవాఁడ నయితిని, నేను పైకెంత ధైర్యము గలవాఁడనుగా నున్నను పోగలేని నిభృతాగ్నివలె హృదయాంతరాళమును దహించుచు శోకాగ్ని దుర్భరమయినప్పు డెల్లను మేడ మీఁదికి బోయి యొంటిగా నీశ్వరుని ప్రార్థించి తద్దయామృతప్రసారమువలన లోపలి దుఃఖానలమును కొంత శాంతపఱుచుకొని వచ్చుచు వచ్చితిని. పదునొకండు గంటలప్పుడు మిత్రులు మొదలయినవారు బలవంతపెట్టి భోజనమునకు విస్తరిముందు నన్నుఁ గూరుచుండఁబెట్టిరి కాని నేను భోజనము చేయలేను. నాభార్యయెడలఁ గల గౌరవమును దెలుపుటకయి క్రైస్తవపాఠశాలయు హితకారిణీ పాఠశాలయు నా దినమున మూసివేయఁబడినవి; ఇంగ్లీషున ప్రకటింపఁబడెడియొక పక్షపత్రిక తక్క తక్కిన వార్తాపత్రిక లన్నియు నాభార్య మృతివిషయమున యనుబంధములను బ్రకటించినవి; ఆపత్రికలు ముద్రింపఁబడెడు ముద్రాయంత్రము లన్నియు నాదినమున మూసివేయఁ బడినవి. ప్రాడ్వివాకులు సహితము తమ సభను మూసివేసి కొందఱు న్యాయవాదులతోఁ గూడ మాతోఁటకు వచ్చిరి. ఇట్లు పురజను లెల్లరును నాయాపదకు వగచి తమ సానుభూతిని గనఁబఱిచినందునకయి నే నెంతయుఁ గృతజ్ఞుఁడనయి యున్నాను. నాభార్యకు దహన సంస్కారమును తోఁటలోనే చేయించుటకు నిశ్చయించి మూఁడుగంట లయిన తరువాత ప్రేతమును ప్రార్థనాదికమును నిర్వర్తించుటకయి యానం

దాశ్రమమునకుఁ గొనిపోయితిమి. ప్రార్థనములు మొదలైనవి జరిపిన పిమ్మట శవమును తోఁటలోనే యొక చివరను దహనము చేసితిమి. దహనము ముగియునప్పటికి రాత్రి యేడుగంటలయినది. అంతవఱకును జూడవచ్చినవారు తోఁటలో నేనూఱుగు రుండిరి. ప్రాతఃకాలము నుండి యప్పటివఱకును తోఁటలోనికి వచ్చుచుఁ బోవుచు నచ్చినవారి సంఖ్య రెండువేలకుఁ దక్కువ యుండదు. ఈ మరణవార్త సెన్వారో చెన్నపుర వృత్తాంత పత్రికలకుఁ దంత్రీ ముఖమునఁ దెలుపుటచేత మఱునాఁటినుండియు నాకు దుఃఖోపశమన తంత్రీవార్తలును లేఖ లును రాఁదొడఁగెను.

ఈ దుఃఖవార్తను కనపర్తి శ్రీరాములుగారు కాఁబోలును తంత్రీముఖమునఁ దెలుపఁగా నాభార్య ప్రేమతోఁ బెంచి పెద్దవానిని జేసిన గోగులపాటి వీరేశలింగము శీఘ్రకాలములోనే వచ్చెను. అతని భార్య కిచ్చుటకయి నాభార్య పెట్టెను దీసి బనారసుచీరను బైకిఁ దీయునప్పటి కెంత యాపుకొన్న నాగక లోపలినుండి దుఃఖము పొర లివచ్చి నాకన్నులనుండి నీరు కాలువలు గట్టెను. అతఁడును పెద్ద పెట్టున నేడ్చెను. అతనిభార్య కిమ్మని బనారసు చీర నతని చేతికిచ్చి, తక్కిన చీరలలో ముప్పదిరూపాయల వెలచేయు చీరయొకటి పులవర్తి సుబ్బారావు భార్యకును, ఇంకొక వెలగల పట్టుచీరను నాభార్యమఱఁ దలికిని, ఇచ్చి మిగిలిన చీరలను రవికలను వితంతుశరణాలయములోని వారికందఱికిని బంచిపెట్టితిని. ఈకడసారి బెంగుళూరినుండి వచ్చున ప్పుడు చెన్నపట్టణములో బట్టలయంగళ్ళకుఁబోయి కొన్నిచీరలు కొంటిమి. మాతో వచ్చినమంగమ్మ కామెయన్నగారు పంపిన పదిరూ పాయలతో నొకచీర కొంటిని. అప్పుడు నాభార్య మంగమ్మవంక జూచి, 'నాకు బాబయ్యగారు చీరకొనియిచ్చినారని మీయన్నగారికి వ్రాయు' మనిచెప్పెను. ఆమాటల కర్థము మంగమ్మవద్ద సొమ్ము

పుచ్చుకొనక నాసొమ్ముతోనే యాచీరను కొని యియ్యవలసిన దన్నట్టు గ్రహించియు నప్పటి కేమియు ననక యూరకుంటిని. చీరలను వితంతు శరణాలయములోనివారి కిచ్చునప్పుడు నాభార్య మాటలు నాకు స్మరణకు రాఁగా, నాభార్య బొంబాయివెళ్లి నప్పుడు కొన్న పండ్రెండు రూపాయలచీరను మంగమ్మ కిచ్చితిని. సమాధికట్టించెడి యుద్దేశముతో నాభార్యయస్థికలను గొన్నిటిని నే నొక పెట్టెలోఁబెట్టి జాగ్రత్తచేసియుంచి, వితంతు వివాహములు చేసి కొన్న వారడుగఁగా తక్కినవానిని వారిని దీసికొని పోనిచ్చితిని. గోగులపాటి వీరేశలింగము నాయొద్దనున్న యస్థికలలోఁ గొన్నిటిని దనకిమ్మని యడుగఁగాఁ గొన్నిటి నతని కిచ్చితిని. మేము పెంచి పెద్ద వాని జేసినవారి గోగులపాటి వీరేశలింగ మొకఁడు, ఫులవర్తి సుబ్బారా వొకఁడు. వీరేశలింగము తన నాలవమాసముననే మా యింటికివచ్చి మమపాజ్ఞలలోఁ బెరిగినవాఁడు; సుబ్బరా వెనిమిదేండ్ల వఱకును దండ్రియుంచుకొన్న వారాంగనయొద్ద పెరిగి చెడుమాటలకును చెడునడవడికకును నలవాటు పడినవాఁడు. వీరేశలింగము నాభార్యను కన్నతల్లివలెఁ జూచి ప్రేమించుచు చెప్పినట్టు వినుచుండెడివాఁడు; సుబ్బరావు నాభార్యను సపతితల్లివలెఁ జూచి యెరువుగాఁ దలఁచుచు చెప్పినట్టు వినక ధిక్కరించుచుండెడువాఁడు. అందుచేత నాభార్య యొకనిని తనవాఁడన్న యనురాగముతోను, రెండవవానిని దిక్కులేనివాఁడన్న జాలితోను బెంచెను. కన్న మోహమున కంటెఁ బెంచినమోహ మధికమగుటచేత వీరేశలింగమును పుత్రాధికముగాఁ బ్రేమించుచు తన మేనకోడలి నిచ్చి వివాహముచేసి తనయొద్దనే యుంచుకొనవలెననియు వృద్ధదశలో తన కతఁడు ప్రాపుగా నుండుననియు తలఁచి యుండెను. తనమేనకోడలిని వివాహముచేయు ప్రయత్నము సాగక యతఁడు మైసూరులోని సంబంధమును కుదుర్చుకొన్నప్పుడు

సహితము వివాహానంతరమున్న నతఁడు తనయొద్దనే యుండుననుకొనె నుగాని ప్రాయశ్చిత్తము చేయించుకొని తన్నువిడిచి పోవునని యెఱుఁగదు. అతఁడు ప్రాయశ్చిత్తము చేయించుకొని వివాహమాడి తన్ను విడనాడెనన్నసంగతి తెలిసినప్పు డామె మనస్సునకు దుఃఖము కలిగి కొన్ని వారములు మనస్స్వాస్థ్యము లేనిదయి యుండెను. ఆకాలములో నామెచే రచియింపఁబడిన యీ క్రింది కీర్తనమువలన నప్పటి యామె మనస్స్థితి తేటపడును.

జంఝూటి రాగము— చాపుతాళము.

పల్లవి.

దేవ! నీవునాకు మనస్థిమిత మొసఁగవే
కావుమనుచు వేఁడితి కనికరము చూపవే.

చరణములు

1. తల్లి తండ్రీవనుచు నిను సత్యధర్మముపై బుద్ధినుంచి
తల్లితోడను విడనాడిన నీతనయ నాదరింపవే—దేవ!
2. కల్లగాదు సుతుని బాసి తల్లడిల్లుచుంటిని
ఉల్లమందునిలిచి నీవు నామనసు చల్లచేయవే—దేవ!
3. భర్తగారే దైవమనుచు పాటుపడుచుంటిని
భర్తగారికారోగ్యమొసఁగి భక్తవత్సల! కావవే—దేవ!
4. ఇతరదుశ్చింతలనువిడిచి యిఁకను నీపై భక్తినుంతు
సతము సంసారవార్ధికి సహాయముగానుండవే—దేవ!
5. జన్మమెత్తిలోకముసుఖము నెన్నఁడెఱుంగనైతిని
ఎన్నరానికష్టములకు నెన్నికగానుంటిని—దేవ!
6. కష్టసుఖము లితరులకుఁ జెప్పిన కార్యమేమిలేదుగా
కష్టములను బాపి నీపట్టి నాదరింపవే—దేవ!

7. మనసుకలఁకనొందుచుండిన మరకార్యము లేదుగా
మనసునందు కలఁతదీర్చి మన్నించి కావవే— దేవ!
8. మోక్షమునకుదారిఁజూపి మోహపాశములనుగోయు
దీక్షను వహించినట్టి దీనరక్షక కావవే— దేవ!
9. నినుఁదలంప నామనంబు నెమ్మదిని బొందెఁగా
ఘనుఁడ! నాదుపరితాపము గడియలోఁ బాపితివిగా— దేవ

ఈశ్వరభక్తిచేత నామె యల్పకాలములోనే యాదుఃఖమును మఱచి స్వస్థచిత్తురా లయి సత్కార్యకరణమునందు తనకాలము నుత్సాహముతోఁ గడపఁ జొచ్చెను. ఇఁక నామె పెంచిన రెండవ వాఁడగు సుబ్బరావు మాయింట నుండెను. అతనిని తనవద్ద నుంచుకొనవలెనని కాని, యతఁడు తనయొద్దనుండి తన్ను తిన్నఁగాఁజూచుననికాని, యామె యెప్పుడును తలఁపను నమ్మను లేదు. అతనిని బాగు చేసి పెండ్లిచేసి పంపివేయవలె ననియే యామెకోరిక. అతఁ డామెకు తఱుచుగా మనస్తాపమును గలిగించుచునే యుండెను. వితంతుశరణాల యమునకు గణపవరమునుండి గ్రామపాచకుని తోఁబుట్టువైన మంగమ్మయను పదునాలేండ్లప్రాయముగల బాలవితంతువు వచ్చెను. ఆవితంతువు చదువుకొన్నదియు తెలివి గలదియు కాకపోయినను చిన్నదిగానుండుటచేత సుబ్బరావునకిచ్చి వివాహము చేయుటకు తగినయీడు కలదిగా నుండునని యెంచి యతనితోఁ జెప్పఁగా నతఁడందునకు సమ్మతించెను. తరువాత నాతోఁ జెప్పి యాబాలవితంతువును మాయింటనే యుంచి పదిగంటలనుండి పాఠశాలకుఁ బంపి చదివించుచు ప్రతిసాయంకాలములయందు తానే వంటమొదలైన పనులయందు దిద్దుచుండెను. ఇట్లుండఁగా నొకనాఁడు సుబ్బరావు తాను చదువుచెప్పుటకు అవకాశము లేదన్న మిషమీఁద నెప్పుడును వంటపనియేనా యని [illegible] కోపపడి యేవోమాటలనెను.

నాభార్య యప్పటికూరకుండి జరగినవృత్తాంతమును నాతోఁ జెప్పెను. వివాహముచేసి వేగిరమే పంపివేయుఁద మంతవఱకును కొంచె మోపిక పెట్టుమని నేను నాభార్యతోఁజెప్పితిని. తరువాత నామె యాచిన్న దానిని వంటలోనికిఁ బిలువక తానే రెండుపూటలును వంటచేసి పెట్టుచుండెను. 1908 వ సంవత్సరమునందు వారికి వివాహముచేసి వేఱుగా కాపురముపెట్టి వాసముచేయుటకు మాతోఁటలోనే యిల్లి చ్చితిని. అతని కిన్నిసుపేటలో తండ్రియిల్లున్నది. ఆయిల్లుసహితము తండ్రికి స్త్రీపునర్వివాహసమాజమువా రిచ్చినదే. అయింటిమీఁద వచ్చెడు నాలుగురూపాయల యద్దెను అతఁడు నెలనెలకు వసూలు చేసికొని యావఱకే రక్షణనిధిలో వేసికొనుచుండెను. పెండ్లి కాఁగానే యిన్నూఱు రూపాయలను రక్షణనిధిలో వేసికొనుటకిచ్చి, నా పుస్తక విక్రియస్వాతంత్ర్యమును గున్నేశ్వరరావు సోదరుల వద్దనుండి పుచ్చుకొని నెలకు పదునేను రూపాయల జీతమేర్పఱిచి పుస్తకముల విక్రయించుపని కీతనిని నియమించితిని. ఆవఱ కీతనిని నేను పదు మూఁడేండ్లనుండి పోషించుచు నన్నవస్త్రములకు కాక చదువుకొఱ కును విశేషముగా వ్యయము చేసితిని. రెండుసారులు సర్వకళాశాలా ప్రవేశపరీక్షకు పోయినను పరీక్షయం దితఁడు కృతార్థుఁడు కాక పోయెను.

నాభార్య యప్పుడప్పుడు తన ప్రార్థనలయందు "భర్తగారి కంటె ముందుగా నన్ను నీసాన్నిధ్యమునకుం గొనిపొమ్ము" అని యీశ్వరునిఁ బ్రార్థించుచుండుట గలదు. మరణమునకుముందు రెండు మూఁడు వారములక్రిందట నిట్టిప్రార్థన మొకటి పట్టెపట్టని నిద్రలో నాచెవినిబడెను. నేనప్పటికూరకుండి పెల్లవాఱుజామున లేచినప్పుడు మేముచేయు సంభాషణములో నీప్రస్తావనను దీసికొనివచ్చి దైవవశ మున నా కేమైన ప్రాణాపాయము సంభవించు సూచనలు కనఁబడి

నప్పు డాత్మహత్యకుఁ బ్రయత్నింపఁ గూడదని నొక్కి చెప్పితిని. తా నట్టిపాపకార్యమున కెప్పుడును బ్రయత్నింప ననియు, ఈశ్వరుఁడు తనప్రార్థన నంగీకరించి తన్ను ముందుగానే తనసాన్నిధ్యమునకుఁ దీసికొనిపోవు ననియు, నాకంటెముందుగానే తనకు స్వాభావిక మరణము సంభవించునని తనకు దృఢముగాఁ దెలియు ననియు, నాభార్య చెప్పెను. అయినను నే నామాటలు నమ్మలేదు. నాభార్య యారోగ్యశీలురాలును. దృఢకాయురాలును, అయి యుండుట చేతఁ జిరకాలము జీవించుననియు, నేను సదా రోగశీలుఁడును గాను దుర్బలకాయుఁడనుగాను ఉండుచుండుటచేత నే నెప్పుడో యేనిమిషముననో యీలోకమును విడుతుననియు, నమ్మియుంటిని. అందుచేత నేనీవిషయమును దలఁచుకొనునప్పుడెల్ల నామనస్సును రెండువిచారములు బాధించుచుండెను. అందొకటి నాభార్యకుఁగల దృఢానురాగమునుబట్టి నాకుఁ బ్రాణాపాయదశ తటస్థించినప్పు డేనూతిలోనో గోతిలోనో పడి బలవన్మరణము నొందునేమో యని. రెండవది నా యనంతరమున నాభార్య జీవించియుండినపక్షమున నేనున్నప్పటివలె జరగక యేమికష్టములపాలగునో యని. ఈమరణమువలన నామనస్సులోని యీరెండువిచారములును దొలఁగెను గాని నావిషయమున నొక్కగొప్ప విచారము పట్టుకొనెను. అది స్వప్రయోజన పరత్వముతోఁ గూడినదగుటచేత ప్రాజ్ఞునకు కలుగవలసినది కాదు. రక్షకులకెల్లను రక్షకుఁడైన యీశ్వరుఁడే నాకు సహాయుఁడయి యుండఁగా నే నసహాయుఁడ నైతినని చింతిల్లనేల? ఆనందాశ్రమమునకు సమీపములోనే తోఁటలో రాజ్యలక్ష్మి నివాసమను నొక గృహమును కట్టించి దానిలో పాలరాతితో చేయఁబడిన సమాధిని బెట్టి యందులో నాభార్య యస్థికలను నిక్షేపించితిని. ఈపాలరాతిసమాధి కలకత్తాలో మిక్కిలి సుందరముగా చేయఁబడినది. సమాధి కిరుప్ర

క్కలను నాభార్యయొక్క జన్మదినమును మరణదినమును దెలిపెడు వ్రాఁతలు పాలరాతి పలకలమీఁద చిత్రింపఁ బడినవి. అం దొకటి యింగ్లీషులోను, రెండవది తెలుఁగులోను ఉన్నవి. నాభార్యకు పుష్పములయం దత్యంత ప్రీతి కలిగియుండెను. అందుచేత సమాధిచుట్టు నురాజ్యలక్ష్మి ప్రమదావన మను పేరితో పుష్పవనము వేయఁబడినది. ఈ పువ్వులతోఁటలో వివిధ స్థలములనుండి తెప్పింపఁబడిన వింత వింతలయిన పూవులచెట్లును, పూవుల దీవెలును గలవు. దీని కంతకును వేయి రూపాయ లయినవి. నాభార్య పేరితో తోఁటలో నొక నుయ్యికూడ ధర్మార్థముగాఁ ద్రవ్వింపఁబడినది. మేము కడసారి బెంగుళూరునుండి వచ్చి జామిపేటమీఁదుగా బండిలో మా తోఁటకుఁ బోవుచుండినప్పుడు జామిపేటలోని కొందఱు స్త్రీలు మాబండివద్దకు వచ్చి "అమ్మా! మేమునీళ్లులేక చచ్చిపోవుచున్నాము. మహారాజులు మీ రున్నప్పుడు నీళ్లు తోడుకో నిచ్చెడువారు. మీరు వెళ్ళినతరువాత మీమనుష్యులు మమ్ము తోఁటలోనికి రానియ్యలేదు." అని చెప్పుకొని దండములు పెట్టిరి. ఈదినమునుండి పూర్వమువలెనే మీరు యథేచ్ఛముగా నీళ్ళు తోడుకొనవచ్చునని వారితోఁ జెప్పి, జామిపేటకు సమీపమున నొక మంచినీళ్ళనుయ్యి యుండిన బాగుండునని నాభార్య నాతో ననెను. ఆమాటలు మనస్సులో నుంచుకొని మఱుసటి సంవత్సరమునందే మాతోఁటలో జామిపేటకు సమీపమున నాభార్యపేరట నొక నుయ్యి త్రవ్వించుట కేర్పాటుచేసి వేసవికాలములో నేను బెంగుళూరికిఁ బోయితిని. ఇక్కడ నేను నూతిపని నప్పగించినవారు పదియిరువది రూపాయల నిమిత్తము నూతిపనివాండ్రతోఁ దగవులాడి ముప్పాతికపనియైనతరువాత పనిని నిలుపుచేసిరి. అంతట వర్షము లారంభమయి నూయి యంతయు కూలిపోయి చేసినపని వ్యర్థమయ్యెను. 1912 వ సంవత్సరములో వేసవి

కాలములో మరల నుయ్యి త్రవ్వించుట కేర్పాటుచేసి పులపర్తి సుబ్బారావుచేతికి సొమ్మిచ్చి నేనుమరలవచ్చులోపలనుయ్యిపూర్తిచేయింపవలసినదని చెప్పి నేను బెంగుళూరికిపోయితిని. నేను మరల వచ్చునప్పటికేదోవిధమున పనిపూర్తిచేయఁబడెను గాని కట్టుపని తిన్నఁగా చేయింపకపోవుటచేతను అరవడి తిన్నగా పూడ్పింపక పోవుటచేతను రెండుమూడు వర్షములు కురియఁగానే నుయ్యి మొదలంటఁ గూలి నేలమట్టమయి చేయించినపనియు వ్యయపడిచిన ధనమును సర్వమును వ్యర్థమయి పని మొదటికి వచ్చెను. ఈ రెండు తడవలకును రు. 1350-0-0 లు వ్యయ మయినవి. నూతిపని యంతయు నేనే దగ్గర నుండి చేయించి యుందునుగాని త్రవ్వుపని మండువేసవికాలములో చేసినంగాని తగినంత నీ రుండదని యితరులు చెప్పుటచేతను, వేసవి కాలములో నెండవేఁడిమికి తాళి నేనుండలేక పోవుటచేతను, ఈపని నొరుల కొప్పగింపవలసివచ్చెను. ఒరుల కప్పగించుటకునుతానుస్వయముగా చేయించుటకును గల భేద మీనూతిపనిలో నాకుఁ బూర్ణముగా బోధపడినది. ఇట్లు తలఁచుకొన్న ధర్మకార్యమునకు రెండుసారులు విఘ్నము వచ్చినది. నేను విఘ్నములకు వెఱచి పూనిన సత్కార్యమును నడుమ విడిచిపెట్టెడు స్వభావము కలవాఁడను గాను. అందుచేత నీసారి స్వయముగా నూతిపనిని చేయించి, ముగించి మఱి బెంగుళూరు పోవలెనని నిశ్చయించుకొని పని యారంభించి యీ 1913వ సంవత్సరము ఏప్రిల్ నెల 7 వ తేది వఱకును రాజమహేంద్రవరములోనుండి పనిముగించి మఱి బెంగుళూరికి వచ్చితిని. ఈసారి పూర్వపుపని యేమియు పనికిరాక యంతయు క్రొత్తపనియే యయి పనికి రు. 900-0-0 లు పట్టినవి. వచ్చెడి వర్షముల కీసారి నూయి కూలక స్థిరముగా నుండునని నమ్ముచున్నాను. ఈశ్వరుఁడు నానమ్మక మును

నిజము చేయునుగాక! * ఈ నూతిలో సగము జామిపేటప్రజల యుపయోగము కయి విడిచిపెట్టఁబడినను తక్కినసగము తోఁట కుపయోగపడును. ఈ నూతితో నేను త్రవ్వించిన మూఁడు నూతులును పూర్వమున్న దొకటియుఁ గలిసి తోఁటలో నాలుగు మంచినీళ్ళ నూతులున్నవి. ఇట్లు మంచినీళ్లనూతు లెక్కువగుటయే కాదు. నేనుపోయి యందు కాపురముండి పనిచేయుచుండుటచేత తోఁటయంతయు నెంతయు నభివృద్ధిచెందినది. నేను కొన్నప్పుడు నూతిసమీపమున నున్న కొంచెము భాగము తప్ప విశేషభాగము చీపురు ముళ్ళయడవిగా నుండి పొదలతోను పుట్టలతోను నిండి యుండి పాములును తేళ్లును సంచరించుచుండఁగా మనుష్య సంచారమున కనర్హమయి "వనవాసమునకుఁ బోవుచున్నాము" అని నాభార్య యన్న మాటకు సరిగానుండెను. అప్పుడు తాటిచెట్లును ప్రాఁతమామిడి చెట్లును చింతచెట్లును కొన్ని యుసిరికచెట్లును నారింజచెట్లును తప్ప విశేష ఫలవృక్షము లేవియు లేవు. ఈ చెట్లవలన సంవత్సరమునకు ముప్పదిరూపాయలు వచ్చుచుండెను. తాటిచెట్లవలన మఱి డెబ్బదిరూపాయలు వచ్చుచుండెను గాని యాయాయము తోఁటను నేనుగొనుటవలన పోయినది. త్రాగుఁబోతుతనము దేశములోని యనేకానర్థములకు మూలమనియు, దానిని సాధ్యమైనంతవఱకు మాన్పింపఁ జూచుట ప్రజాక్షేమమును గోరెడు దేశాభిమానులకెల్ల కర్తవ్యమనియు, నాయభిప్రాయము. అందుచేత నేను తోఁటలోని తాటిచెట్లను కల్లుగీచుట మానిపించి యందువలనవచ్చెడు ధనాగమమును బోఁగొట్టితిని. తోఁటలో నడుమగానున్న యీతచెట్లను తాటిచెట్లను కొట్టించి వేసి, చీపురుముండ్లయడవిని ఛేదించి

* ఈశ్వరుఁడీ నా ప్రార్థనమును సఫలము చేసెను. ఈసంవత్సర వర్షములకది జంకక నిలిచి పుష్కలముగా నిర్మల మధురజలమును గలదై యా తోటకంతకి మహోపయుక్తముగా నున్నది.

పుట్టలను, పొదలను త్రవ్వించివేసి, వాని స్థానమున ఫలవృక్షములను నానా దేశములనుండి తెప్పించి వేయించితిని. అలమండ, బందరు, సేలము, చిత్తూరు, బెంగుళూరు, మద్రాసు, బొంబాయి, కలకత్తా దుర్భాంగ మొదలయిన ప్రదేశములనుండి తెప్పించి యంటుమామిడి చెట్లను వేయించితిని. నూఱు బత్తాయినారింజ చెట్లను వేయించితిని. ఇదియది యననేల? ఇప్పుడు మాతోఁటలో లేని ఫలవృక్షమే లేదని చెప్పవచ్చును. కొన్ని ఫల వృక్షములు కాపునకు రాపచ్చినవి; కొన్ని రానున్నవి. అవియన్నియు ఫలమునకు వచ్చినప్పుడు మంచి యాదాయము వచ్చుచు వితంతు శరణాలయము మొదలైన వాని సంరక్షణమునకు తోడుపడు ననుటకు సందేహము లేదు. ఇట్లు తోఁట వేసినవాఁడను నేను; దీని ఫల మనుభవించువారు ముందువారు. ఈ తోఁట యిప్పుడు రాజమహేంద్రవరములోని తోఁటలలో నుత్తమమయినదిగాఁ బరిగణింపఁ బడుచున్నది. దీనిని జూచుటకయి సమీపగ్రామములనుండి సహితము జనులు వచ్చుచున్నారు. దీనివెల యిప్పుడు నేను కొన్నప్పటికంటె నాలుగయిదు రెట్లయినను హెచ్చియి యుండును.

తోఁటను గూర్చి చెప్పినప్పుడు నాకు నాభార్య పొలము సంగతి యొక్కటి స్మరణమునకువచ్చుచున్నది. వివాహకాలమునందు నాభార్యకు మేనమామ యేదుమునేల యరణముగా నిచ్చెను. అది వరిపండెడు పొలము. దానివలన సంవత్సరమునకు పంద్రెండు రూపాయల యాదాయము వచ్చుచుండెను. ఆ మాన్యము నెవ్వరికో యమర్చి మొదట నేర్పడిన పంద్రెండురూపాయలనే నాభార్యతమ్ముఁడు తెచ్చి యిచ్చుచుండెను. నేను చెన్నపట్టణమునుండి వచ్చినతరువాత రెండు మూఁడేండ్లకు నాభార్య యొకనాఁడు రెండేండ్ల సొమ్ము తన మాన్యముమీఁద రావలసియున్నది. రాలేదని నాతోఁ జెప్పెను.

నీకా సొమ్ము లేక జరగడా నీపుట్టినింటివారికే యిది యిచ్చివేయ రాదా యని నేనంటిని. నాభార్య కది యిష్టముగానే యున్నందున నట్లే చేసెదమని చెప్పెను. తరువాత వెంటనే ముద్రకాగితమును తెప్పించి దానపత్రమును వ్రాయించి యందులో నేను చేవ్రాలు చేసి సబ్ రిజిస్ట్రారును రుసు మిచ్చి మాతోటకుఁ బిలిపించఁగా తన. మేనల్లురలో నొకని కాభూమిని నాభార్య రిజిష్టరు చేయించి యిచ్చివేసెను. ఇట్లు జరగవలసిన దంతయు నాభార్య మరణమునకు ముందే జరిగినది. నాభార్య జీవితచరిత్రము నించుక తెలుపుట యిచ్చుట ననుచితము కాదని భావించి ద్వితీయ సాంవత్సరిక శ్రాద్ధదినమున నేను చదివినదాని నిందుఁ బొందుపఱుచుచున్నాను.—

"రెండేండ్లక్రిందట కీర్తిశేషురాలైన నాధర్మపత్ని యగు శ్రీమతి కందుకూరి రాజ్యలక్ష్మి రాజమహేంద్రవరమున కుత్తరదిశను మూఁడుమైళ్ళ దూరములోనున్న కాతేరు గ్రామమునందు బ్రహ్మశ్రీ అద్దంకి పట్టాభిరామయ్యగారికిని తద్ధర్మపత్నియగు కొండమాంబగారికిని విరోధికృన్నామ సంవత్సర కార్తికశుద్ధద్వాదశీనాఁ డనఁగా 1851-వ సంవత్సరము నవంబరునెలలో జననమొందెను. ఈసాధ్వి సాధారణ సంవత్సర శ్రావణశుద్ధ సప్తమీశుక్రవారమునాఁ డనఁగా 1910 వ సంవత్సరము ఆగస్టునెల పండ్రెండవతేదిని తెల్లవారుజామున పరమపదము నొందెను. అందుచేత మరణదినమునకీమెవయస్సు ఏబదియెనిమిది సంవత్సరముల యెనిమిదిమాసముల యిరువదియైదు దినములు. పట్టాభిరామయ్యగారి కీమె రెండవ కుమారిత: ఈమెతల్లి మఱియొక మగశిశువును ప్రసవించి మరణము నొందుట తటస్థించెను. ఇట్లు శైశవమునందే మాతృమరణము నొందిన యీమెను మేనమామయు కాతేరుకరణమును నగు వెన్నేటి వేంకటరత్నముగారును భార్యయగు లచ్చమాంబగారును పెంచి పెద్దదానిని

జేసిరి. ఈయుత్తమదంపతులు సంతానము లేనివారగుటచేతఁ దమ మేనగోడలిని పుత్రికాధికమైన ప్రేమతోఁ జూచుచు పెట్టుపోఁతల యందుఁ గాని మఱియేవిషయమునందుఁగాని యేవిధమైన కొఱఁత యుఁ గలుగకుండఁ గాపాడుచు వచ్చిరి. పుట్టినింటివా రీమెకు పెట్టిన పేరు బాపమ్మ; వారీమెను మరణమువఱకును బాపాయియని పిలుచు చుండెడివారు. ఆకాలమునందు సాధారణముగా స్త్రీవిద్యయన్న దూష్యముగాను తలకంటకముగాను కనఁబడుచుండినను తాముండి నది పల్లెయయినను మేనమామ యేహేతువుచేతనో యీమెను బడికి పంపి చదివించుచుండెను. ఈమేనమామయే యీమె నెనిమిదవయేటను పండ్రెండేండ్ల ప్రాయముగల నాకిచ్చి వివాహము చేసెను. పెండ్లినాటికే యీమె కొంతవిద్య నేర్చి రుక్మిణీ కళ్యాణమును ముఖస్థముగా చదివిన దగుటచేత ముద్దున కయి మమ్మిద్దఱను పెండ్లిదినములలోనే యొకయరుగుమీఁద కూరు చుండఁ బెట్టి మాచేత రుక్మిణీకళ్యాణములోని పద్యములను చదివించుచు వచ్చిరి. ఈమె తరువాత నమకచమకములను, పురుష సూక్తమును, నారాయణమును ముఖస్థముగా నేర్చుకొని యింట పురుషులులేని దినములలో తానే దేవతార్చనము చేయుచుండెను. పండ్రెండేండ్లప్రాయమున పునస్సంధానము చేసి యీచిన్నదానిని మాయింటికిఁ బంపివేసిరి. నాతల్లి పూర్ణమాంబ నాభార్యకుపుట్టినింటి వారు పెట్టినపేరు మార్చివేసి రాజ్యలక్ష్మమ్మయని తనతల్లిపేరు పెట్టి పిలువఁ జొచ్చెను. ఈ క్రొత్తపేరే నాభార్యకును ఇష్టమయిన దయి నందున మరణమువఱకును తా నాపేరితోనే వ్యవహరింపఁ బడుచు వచ్చెను.

పదమూడవయేట కాపురమునకు వచ్చినది మొదలుకొని యంతకంతకు మాయిరువురకును పరస్పరానురాగము ప్రబలి యుద్ధ

లము నేకాభిప్రాయులము కాఁజొచ్చితిమి. ఆమెకు నాయందుఁ గుదిరిన యవ్యాజప్రేమనుబట్టి నాయెడల పరమవిశ్వాసము కలదయి నాతోడిదే లోకమని మంచికయినను చెడ్డకయినను సర్వమునందు నన్ననుసరించుచు భ్రమరకీటన్యాయమున నామె నావలె మాఱిపో యెను. అందుచేత నే నేసాహసకార్యమునం దడుగు పెట్టినను తాను వెనుకంజ వేయక నన్ను వెనుక కీడ్వక తోడునీడయై యుండి ప్రోత్సాహవాక్యములు పలుకుచు నన్ను ముందుకు నడిపించుచుండెను. నాది కొంత కోపస్వభావము; నాభార్యది శాంతస్వభావము. ఎప్పుడైన చిత్తోద్రేకము కలిగినప్పుడు నేనెవ్వరిని లక్ష్యముచేయక ముందు విచారింపక తొందరపడి మత్తగజమువలె సంచరింపఁ జూచినప్పుడు తా నంకుశమయి నన్ను మరలించి యుక్తసమయమున శాంత వాక్య సుధారసముతో నన్నప్పుడ మరల స్వస్థచిత్తునిఁ జేయుచుం డును. ఆమె మాతృస్నేహముతో చేసెడి యుపచారము సదా నా శరీర సంరక్షణమున కత్యంతసహకారిగా నుండుచు వచ్చినట్లే మంత్రి వలెఁ జేసెడి యుపదేశముకూడ నాయాత్మ సంరక్షణమునకు నత్యంత సహకారిగా నుండుచు వచ్చెనని చెప్పవచ్చును.

శ్లో. కార్యేషు మంత్రీ కరణేషు దాసీ
రూపేచ లక్ష్మీః క్షమయా ధరిత్రీ.
స్నేహేచ మాతా శయనేచ రంభా
షట్కర్మయుక్తా ఖలు ధర్మపత్నీ.

అని మనపెద్దలు. "కార్యాలోచనమునందు మంత్రివలెను, పనులు చేయుటయందు దాసివలెను, రూపమునందు లక్ష్మివలెను, ఓర్పునందు ధాత్రివలెను, ప్రేమమునందు తల్లివలెను, పాన్పునందు రంభవలెను, ఉండెడి యీ షట్కర్మయుక్తురాలే ధర్మపత్ని" యని ధర్మపత్నిలక్షణమును నిర్వచించి యున్నారు. ఇంచుమించుగా

నీలక్షణము లన్నియు నాభార్యకు వర్తించు ననియే నాకు సంపూర్ణ మైన నమ్మిక మున్నది. నాకుఁగల యీపూర్ణవిశ్వాసమున కొకవేళ నా కామెయెడఁగల దృఢానురాగము కారణమయి యుండవచ్చును. అయినను దీనిసత్యాసత్యములను సదా యామెతో చెలిమి సలిపిన సఖులే నిర్ణయింపఁ దగినవారు.

తనవారు నాకిచ్చి వివాహము చేసిన దోషముచేత నామూలమున నాభార్య యెన్నియో కష్టములకు లోఁబడ వలసిన దయ్యెను. అయినను నాభార్య మాత్రము తా నాకష్టములను కష్టములనుగా భావింపక తన్ను ధన్యురాలినిగాఁ జేయుటకయి యీశ్వరుఁడు పంపిన యనుగ్రహములనుగా నెంచి సదా సంతుష్టాంతరంగురాలయి నవ్వు మొగముతో వానిని సహించుచుండెను. నేను వితంతువివాహ ప్రయత్నము నారంభించినప్పటినుండియు నాభార్యకు కష్టము లారంభమయినవి. నేనుపన్యాసము లియ్య నారంభించినప్పుడే సాధారణముగా నాంధ్రదేశమునం దంతటను ముఖ్యముగా రాజమహేంద్రవరమునందును సంక్షోభ మారంభ మయ్యెను. నేను సరిగా వివాహములు చేయఁ బూనినప్పు డాసంక్షోభము శతగుణములు సహస్రగుణములధికమయ్యెను. నాబంధువులును, మిత్రులును, పురజనులును, పూర్వాచారపరాయణు లైన పండితులును తా మకార్యకరణ మనుకొన్న యీకార్యమునుండి నన్ను మరలింప సర్వవిధములఁ బ్రయత్నించి చూచి దారి గానక కడపటి యుపాయముగా నా భార్యను పట్టుకొనిరి. కాని యక్కడను కార్యసాఫల్యము గలుగలేదు. తన్ను పెంచి పెద్దదానిని జేసి విద్యాబుద్ధులు చెప్పించిన మేనమామయు బంధువులును వచ్చి యేదో ఘోరవిపత్తు సంభవించినట్టుగా నేడ్చుచు నీభర్త నీకార్యమునుండి మరలింపు మని నేను లేనిసమయమున నాభార్యను దీనముగా వేడికొనిరి. శాంతిగుండెను సహితము కరఁగించెడి య్యా

దీనాలాపములకు సంచలింపక పర్వతమువలె నిలిచి, "ఆయన పూనిన దది మంచికార్య మని నేనును నమ్ముచున్నదాన నగుటచే నే నాయనతో వల దని చెప్పకపోవుటయే కాక యెన్నికష్టములు వచ్చినను నే నాయనను విడువక తోడ్పడియెద" నని దృఢముగాఁ జెప్పెను. అప్పు డందఱును జేరి మమ్మందఱను విడిచిపెట్టెదవా యని యేడ్వఁ జొచ్చిరి. నేను మి మ్మెప్పుడును విడువను. మీరే నన్ను విడిచెద రేమో యని యామె ప్రత్యుత్తర మిచ్చెను. "నీవు భర్తను విడువ వద్దు గాని విడిచెద నని బెదరించినఁ జాలును. అప్పు డాయన తన పట్టును విడుచు" నని వారు చెప్పిరి. నే నాపనియుఁ జేయఁజాల నని మొగమోటమి లేక తెలియఁజెప్పి వారిని నిరాశులఁ జేసిపంపి వేసెను. నేను పూనితి నన్న హేతువుచేతనే కాక యీయనాథ బాలికా కష్టనివారణమునం దామెకును నవ్యాజమైన యాదర ముండెను. చేర్చుకొందురో నిరాకరింతురో యన్నభీతిచేత వివాహాపేక్షతో మా యింటికి వచ్చిన బాలవితంతువులను నే నింట నుండినను లేకుండినను లోపలికిఁ గొనివచ్చి తనచెంతఁ గూరుచుండఁబెట్టుకొని పూర్వపరిచితి గలదానివలె ప్రియవచనములు పలికి ధైర్యము చెప్పి భయ ముడిపి ప్రోత్సాహపఱిచి యాదరించు చుండెను. వచ్చినవారు చదువు రాని వారైనయెడల వారి కక్షరాభ్యాసము చేసి వచ్చిన మఱునాటినుండి యు ప్రతిదినమును పలకమీఁద వారిచేత నక్షరములు వ్రాయించి తాను తప్పులు దిద్దుచు, మీరు వివాహములు చేసికొని భర్తలయిం డ్లకు పోవులోపల చదువు నేర్చుకొని మీకష్టసుఖముల నుత్తరముల మూలమున మాకు తెలుపుటకు శక్తురాండ్రు కావలె నని పురికొల్పి వారికి విద్యాబుద్ధులు చెప్పుచుండెను. వచ్చినవారిలో నెవ్వరైన నజ్ఞానముచేతను పూర్వదురభ్యాసములచేతను కొంచెము కానిమార్గ మున సంచరించినను లోఁగొని కోపపడక వారి తప్పు పైకి తెలియ

నీయూక కన్నతల్లివలె రహస్యమున మందలించి వారికి మంచిబుద్ధులు చెప్పి తమ నడతకు తామే సిగ్గుపడునట్లు చేసి వారిని నీతిమార్గమునకుఁ ద్రిప్పుచుండెను. క్రొత్తగా వివాహములైన దినములలో నావలను వివాహములు చేసికొన్నవారు వచ్చి పనిపాటులలో సాయపడక వంటచేసి వచ్చి భోజనములకు లేవవచ్చునని పిలుచువఱకును విద్యార్థులవారివలె గదులలోఁ గూర్చున్నను విసుఁగుకొనక వారియెడల నవాదరము చూపక తానొక్కతెయే పను లెల్లఁ జేసి తరువాత నెప్పుడైన సమయము వచ్చినప్పుడు మాటలధోరణిని సోమరితనము సర్వానర్థదాయక మని వారి మనస్సులకు నాటుకొనురీతిని బోధించి తమ యవివేకమునకు తామే లోపల సిగ్గుపడునట్లు చేయుచుండెను. ఇంటికి వచ్చెడు బాలవితంతువులయెడల నామె యెట్టి యౌదార్యమును జూపెడిదో తెలిపెడి యొక చిన్నసంగతిని మాత్ర మిం దుదాహరించి యీవిషయము నింతటితో విరమించెదను. రాజమహేంద్రవరమున స్త్రీపునర్వివాహములు జరుగుచున్నవన్న వార్తను విని యెంతో యాశతో దూరదేశములనుండి సహితము బాలవితంతువులు శ్రమకోర్చి బహుదినప్రయాణములు చేసి మావద్దకు వచ్చుచుండిరి. ఒకసారి యిద్దఱు బ్రాహ్మణబాలవితంతువులు గంజాము మండలములోని అస్కాపురమునుండి వివాహేచ్ఛతో బంధువుల నేమఱించి తప్పించుకొని యూరువిడచి బైలుదేఱిరి. వారు విశాఖపట్టణ మండలములోని విజయనగరము చేరునప్పటికి వారిలో నొకరికి స్త్రీజన స్వాభావికమైన భీరుత్వముచేత ధైర్యము చెడి మనస్సు చెదిరిపోఁగా ముందు సాగుటకు సాహసము చాలక యామె యచ్చట నిలిచిపోయెను. ఎక్కువ ధైర్యశాలినియైన రెండవ వితంతువు తనవూనికను విడువక సాహసించి యొంటిగా బైలుదేఱి తనచేతి రాగి పట్టెలలోని బంగారమును సహిత మమ్ముకొని కొంతవఱకు మోటుబండ్లమీఁదను కొంతవఱకు

కాలినడకను ప్రయాణముచేసి యొకనాఁడు రెండు గంటలవేళ గమ్య స్థానముచేరెను. ఆసమయముననే నాభార్య తన మిత్రురాండ్రతోడఁ గూడ క్రొత్తగా కట్టఁబడిన పురమందిరమును జూచుట కావలె నే ర్పఱుచుకొన్న యేర్పాటునుబట్టి యిల్లు విడుచుటకు సంసిద్ధురాలయి యుండెను. ఇట్టిసమయములో మాసినకట్టుబట్టతోను మార్గాయాస ముచేత సడలి శుష్కించిన వికారరూపముతోను మాయింటికాబాల వితంతువు వచ్చెను. రాఁగానే తన కుత్సాహభంగమును మిత్రురాండ్ర కాశాభంగమును కలిగినను సరకుచేయక నాభార్య తన మిత్రురాం డ్రను బ్రార్థించి కొంతసేపు ప్రయాణమును నిలిపి యాచిన్నదానిని లోపలికిఁ గొనివచ్చి యాదరించి స్నానము చేయించి కట్టుకొనుటకు మంచిబట్టనిచ్చి మాయింట నప్పు డన్నము సిద్ధముగా లేకపోఁగా పొరుగింటికి పోయి యన్నము తెచ్చిపెట్టి స్వస్థపఱచి పిమ్మట సఖీస ముదాయముతోఁ గలిసి పురమందిరమును జూడఁబోయెను. ఇప్పుడు పిఠాపురసంస్థానములో నున్న ఆదిపూడి సోమనాథరావుగారిచిన్న దానిని పిమ్మటఁ దాము వివాహమాడిరి. ఈ ప్రకారముగానే యింటి కే వితంతువు వచ్చినను నేను పాఠశాలకుఁ బోయి యుండినప్పుడు సహితము లోపలఁ జేర్చుకొని యాదరించి నే నింటికి వచ్చి బట్టలు తీయుచుండగానే నవ్వు మొగముతో దాపునకు వచ్చి మీ కొక శుభవార్త చెప్పెద నని చెప్పి లోపలికి గొనిపోయి నాకా చిన్నదా నిని జూపుచుండెను. వివాహముల నిమిత్తమయి మాయింటికి వచ్చిన వితంతుకాంతల నందఱిని పుత్రికాప్రేమతోఁ జూచి యాదరించుచు వారికి విద్యాదానము చేసియు మంచిబుద్ధులు చెప్పియు మంచివారి నిగాఁ జేయుటకయి పాటుపడుచు, వివాహానంతరమున వారితో నుత్తరప్రత్యుత్తరములను జరిపి వారి యోగక్షేమములను విచారిం చుచు, అవశ్యమైనచో వారికి పురుళ్ళుపోసియు వ్యాధి సమయమునం

దుపచారములు చేసియు స్వస్థపఱిచి వారి నిండ్లకుఁ బంపుచు, సర్వవిధములచేతను వారియెడల నత్యంత సానుభూతిని గనఁబఱుచు చుండెను.

పరిణయాభిలాషతో పరితెంచెడు వితంతు యువతులయెడల నెట్టి యాదరమును దయను జూపుచు వచ్చెనో యట్టి యాదరమును జాలినే యింద్రియ దౌర్బల్యముచేతను వంచకులైన పురుషులమోస ముచేతను మానమును గోలుపోయి పతిత లయి పశ్చాత్తప్త లైన యనాథమానినులయెడలను నాభార్య చూపుచు వచ్చెను; అట్టివారి నిమిత్త మయి "పతిత యువతీ రక్షణశాల" పతిత విధవాశ్రమము నొకదానిని మాయింటి యెదుటింటిలోనే స్థాపించి తానే తద్వ్యాచా రణమును పైని వేసికొని వారిని పూర్వ దుర్వృత్తినుండి మరలించి బాగుచేయఁ బ్రయత్నించుచుండెను. నాభార్య జీవితకాలములో నట్టి వా రేవురు రక్షింపఁబడిరి. వారిలో ముగ్గురకు వివాహములు చేయ బడెను. తక్కినవా రిరువురు బిడ్డలను గని శిశుహత్యాదోషమువలన విముక్తురాం డ్రయి స్వగృహములకుఁ జేరిరి. కడపట గర్భవతి యయి వచ్చిన యొక బ్రాహ్మణవితంతువును ప్రసవము నిమిత్తము నాభార్య యిచ్చటి క్రైస్తవ ప్రసవ వైద్యశాలకుఁ బంపెను. ఆ వితంతువును తాను గన్న యాడుబిడ్డను వైద్యశాలాధికారులకిచ్చి లేచిపోవఁబ్రయ త్నించుచున్న దన్న వర్తమానము నాభార్యచెవి సోఁకఁగానే తాను బండిచేసికొనివైద్యశాలకుఁబోయి వెంటనేతనబిడ్డలను మాయింటికిగొని వచ్చెను. తరువాతమాతశిశువునుమాయింటదిగవిడిచి నిర్దయురాలయి తన్నుఁ గొనిపోవచ్చిన తనవృద్ధమాతవెంట గంజాము మండలము లోని స్వగ్రామమునకుఁ బోయి బంధువులలోఁ జేరెను. ప్రేమావతి యని పేరుపెట్టి నాభార్య యాశిశువును తానే ప్రేమతోఁ బెంచుచుం డెను. ఆశిశువు మలమూత్ర విసర్జనము చేసినగుడ్డల నుతకనని కూష

నికత్తె నిరాకరించినను సంకోచింపక నాభార్య యాపనిని సహితము తానే చేయుచు బిడ్డకు సమస్తోపచారములును స్వయముగానే చేయుచువచ్చెను. ఆమె కింతలో నాకస్మికముగా పరలోకప్రాప్తి కలిగినందున సంరక్షణము చేయువారు లేక నేనాశిశువును పూర్వోక్తవైద్యశాలాధికారులకే పెంచుకొనుట కిచ్చివేయవలసినవాఁడ నైతిని. ఆశిశు విప్పుడు వారియొద్ద సురక్షితమై సుఖముగా పెరుగుచున్నది.

ఒక్క విగతభర్తృకలయెడల మాత్రమే కాక స్త్రీజాతియం దెల్లను ప్రేమకల దయి నాభార్య వారి కష్టనివారణమునకును సుఖాభివృద్ధి ప్రసారణమునకును సమయము తటస్థించినప్పు డెల్లను తన శక్తికొలఁదిని పాటుపడఁ జూచుచుండెను. మరణమునకు మూఁడు నాలుగు మాసములుముందు మేముభయులమును బండిలో నెక్కి పురమందిర సమీపమునుండి ధర్మవైద్యశాలవంకఁ బోవుచుంటిమి. మా కెదుటిప్రక్కను భోగమువాండ్ర సందులోనుండి యొకగుంపు మావైపునకు వచ్చుచుండెను. ఆగుంపునుజూచి నాభార్య బండినక్కడ నిలిపించి యాసంక్షోభకారణ మేమని విచారించెను. ఆ గుంపునడుమ యౌవనవతియైన యొక వేశ్యాంగన దొడపగిలి చెంపనుండి రక్తము ప్రవాహముకట్టి కట్టుకొన్నబట్ట తడియుచుండఁగా వృద్ధవేశ్య లిద్దఱు పరివేష్టించి నడిపించుచుండఁగాబీభత్సరూపముతోఁగానఁబడెను. జారత్వశంకచేత విటుఁ డెవ్వఁడో దానిని దొడ పగులఁగొట్టఁగా నభియోగము తెచ్చుటకయి యారక్షక భటాగారమునకుఁ బోవుచున్నట్టు చెంతనున్నవారు చెప్పిరి. ఆమాట వినఁబడిన తత్క్షణమున నేనాభార్య నావంకఁ దిరిగి యిట్టివారి స్థితిని బాగుచేయుటకయి మన మేమైన తప్పక చేయవలెనని నాతోఁ జెప్పెను. వృద్ధత్వముచేత నశక్తులమయి యున్న మనమిప్పు డేమిచేయఁగలుగుదు మని నేను పలుకఁగా, ఆమె నామాటను సందేహింపక యధైర్యపడక ప్రైని దేవుఁడు చేయించు

వాఁడు మనకు సహాయుఁడయి యుండ మన మేల వెనుకతీయవలెనని తత్క్షణమే నాకుత్తర మిచ్చెను.

స్త్రీజాతియం దింత దయారసము కలదయి యుండినట్టు చెప్పినప్పు డామెకు పురుషజాతియందు దయ తక్కువని మీ రెంత మాత్రమును భావింపఁగూడదు. పురుషులైనను స్త్రీలైనను దీనులయి యాపన్నులయి యున్నవారియం దెల్లను సమానముగానే యామె దయారసము ప్రసరించుచుండెను. దీనికి నిదర్శనముగా చిరకాలముక్రిందట నడచిన యొక వృత్తాంతము నిం దుదాహరించుచున్నాను. వేసవికాలములో నొకనాఁడు మధ్యాహ్నమున నేను పాఠశాలకు పోయియుండినప్పు డొకపంచముఁడు మా వీధిలోని యిసుకలో స్మృతితప్పి పడిపోయెను. ఎండ వేడిమిచేత కాలుచున్న యిసుకలో నొడలెఱుఁగక పడిపోయిన యా మాలవాని దురవస్థకు జాలినొంది నా భార్య వీథిలో నిలుచుండి యిరుగు పొరుగులవారిని దారినిబట్టి పోవువారిని పిలిచి వానిని నీడను మా యరుగుమీఁద పెట్టుటకు తనకు తోడుపడుఁడని ప్రార్థించెను. కాని, వాఁడు మాలవాఁడగుటచేత శూద్రులు సహితము వానిని ముట్టుకొన నొల్లక మాట వినిపించుకొనక తమదారిని పోవఁజొచ్చిరి. ఇట్లు కొంతసేపు జరిగిన తరువాత బసవరాజు గవర్రాజుగారి యింటనుండి ప్రథమశాస్త్ర పరీక్షతరగతిలో చదువుకొనుచుండిన కనపర్తి శ్రీరాములుగా రొంటిగంటకును రెండుగంటలకును మధ్య నప్పు డాదారిని ఇంటికిఁ బోవుచుండుట తటస్థించెను. నా భార్య యప్పు డితరులను జేసిన ప్రార్థననే యాయనను సహితము చేయఁగా, అతఁడు తన చేతిలోని పుస్తకములను క్రిందఁబెట్టి తోడుపడఁగా నా భార్యయు నతఁడును చెఱియొక వైపునను బట్టి యా మాలవానిని మా యరుగుపైని బెట్టిరి. అత డంతట తనదారిని పోయెను గాని నా భార్య లోపలికిఁబోయి

స్నానము చేసివచ్చి వానియొద్దనుండి కావలసిన సాయము చేయుచుండెను. ఈశ్వరుఁడు పరమపిత యనియు, ఈశ్వరుని సంతాన మనఁదగిన స్త్రీపురుషు లందఱును సోదరీ సోదరతుల్యులనియు, అందుచేత పరోపకారమే పరమధర్మ మనియు, హృదయమునందుఁ గల దృఢ విశ్వాసమే నాభార్యను పరోపకార కార్యములందు పరమ సంతోషముతో పాటుపడునట్లు చేసినది.

నాభార్య నిజమైన యీశ్వరభక్తురాలు; ఆమెకుఁగల యీశ్వరభక్తి యవ్యాజమైనది. ఈశ్వరునియందుఁగల నిశ్చల భక్తిచేతనే యామె సమస్తకష్టములను సంతోషపూర్వకముగా సహింపఁ గలుగుచు వచ్చెను. స్త్రీపునర్వివాహ సంబంధమున పామరజనులు బహువిధముల బాధించినప్పుడును వంటలవారు మొదలయిన పరిజనులొక్కసారిగా మమ్ము విడిచిపోయినప్పుడును గోదావరికిపోయి యుచ్చటియల్లు లాడెడి యవమానవాక్యములకు కోపింపక స్వయముగా నీళ్ళు మోచుకొనివచ్చుట మొదలైన పనులను నిశ్చింతతోను నిత్యసంతోషముతోను నిర్వహింపఁ గలుగుట యీశ్వరభక్తిచేతఁ గాక మఱి దేనిచేత సాధ్యమగును? ఆమెకు విగ్రహారాధనమందలి విశ్వాసము చిరకాలముక్రిందటనే పోయెను. ఆమెచుట్టుపట్లనుండెడు స్త్రీలను వారమున కొకసారి మధ్యాహ్నము మాయింట గుమికూర్చి యేకేశ్వరోపాసనమునకు పురికొల్పి స్త్రీప్రార్థన సమాజమును స్థాపించుటయు, పరిశుద్ధాస్తిక భావమును ప్రోత్సాహపఱుచు కీర్తనలను రచియించి వానిని తమ సమాజమునందు ప్రతివారమును పాడుచుండుటయు ఆమెకు కలిగియుండిన యేకేశ్వరవిశ్వాసమును సహస్ర ముఖముల ఘోషించుచున్నవి. స్త్రీలకు ప్రత్యేక ప్రార్థనసమాజమును ప్రత్యేక ప్రార్థనామందిరమును ఈపట్టణమునందుతప్ప మన చెన్నపురి రాజధానిలో మఱి యెక్కడను లేవు. ప్రార్థన సమాజమునకు తనఁలోద

గూడ వితంతుశరణాలయములోనివారిని కొందఱిని వెంటఁ బెట్టుకొని ప్రతిశనివారమును తప్పకపోయి ప్రార్థనలుజరుపు చుండుటయు ప్రతిదినముప్రాతస్సాయంకాలముల యందువింతతుశరణాలయములోని వారితోఁగలిసి యానందాశ్రమములో ప్రార్థనను జరుపుచుండుటయు మాత్రమేకాక ప్రతిదినమునను రాత్రి తాను శయనింపఁ బోవునప్పుడును తెల్లవాఱుజామున నిద్రనుండి లేచి పనికిపోవుటకు ముందును తప్పక యేకాంతప్రార్థనను జేసికొనుచుండెడిది. ఆమె యీప్రార్థన సమాజ సంబంధమున ప్రతిసంవత్సరమును సంవత్సరోత్సవమును జరిపి చందాల మూలమున కుంటివాండ్రు గ్రుడ్డివాండ్రు వృద్ధులు మొదలయినబీదల కన్నప్రదానము చేయుటలో నెంతో పాటుపడుచుండెడిది. అంతేకాక. తాను తోఁటవిడిచి యూరిలోనికి పోవునప్పుడుగాని గ్రామాంతరమునకు పోవునప్పుడుగాని తప్పక డబ్బులను మూట కట్టుకొనిపోయి దారిలో కనఁబడిన వికలాంగులకు దానము చేయుచుండెడిది.

ఆమెకు సోమరితన మన్న తల కంటగించును. ఆమె సదా యేదో యుపయుక్త మయినపనిని చేయుచు కాలము నించుకేనియు వ్యర్థముగా పోనీయక సత్కాలక్షేపమున సార్థకపఱుచు చుండెను. ఆమెకు గృహకృత్య నిర్వాహణమునందును పాకరచనమునందును నిరుపమానమైన సామర్థ్యముండెను. పరులకు పెట్టుట యన్న నామెకు పరమసంతోషమే యయినను రాగికాసైనను వ్యర్థముగా పోవుటకు మాత్ర మిష్టము లేనిదయి యుండెను. ఆమె తెల్లవాఱు జామున లేచినది మొదలుకొని గృహకృత్యనిర్వాహణావసరములయందు విరామము లేక పాటుపడుచు తీఱికయైనప్పుడెల్ల నేదో వ్రాయుచుండుటలోను చదువుచుండుటలోను కాలము గడుపుచుండెను. తాను చేయవలసిన కృత్యములలో నెల్ల నాసంరక్షణము తనకు ప్రథమ కర్తవ్యముగా భావించి నన్ను పసిబిడ్డను పెంచినట్లు పెంచుచుండెడిది. నే నేమంచి

పనికిఁ బూనినను నాకు సహాయురా లయి యుండి సమ స్తవిషయ
ములలోను ఛాయవలె నన్ననుసరించుచు సహధర్మచారిణి యనిపిలువఁ
బడుటకు సర్వవిధముల నర్హురాలయి యుండెను. వితంతువివాహప్రి
యత్నమువలన నేను జాతిబహిష్కృతుఁడనయినను బ్రహ్మమతాను
ష్ఠానపరుఁడయి యజ్ఞోపవీత విసర్జనము చేయుటవలన కొన్ని నూతన
కష్టములకు పాత్రుఁడ నయినను నన్ను నిరుత్సాహపఱుపక హృదయ
పూర్వకముగా నన్ననువర్తించుచుండెను. నాకుఁగల యల్పద్రవ్యము
నంతయు నేను హితకారిణీ సమాజమున కిచ్చివేసినప్పుడు కొందఱసూ
యాపరులయిన కలహప్రియులు నాభార్యయొద్దకు పోయి యామె
దురవస్థకు పరితపించుచున్న వారివలె దుఃఖము నభినయించుచు దీన
ముఖములతో "అయ్యో! నీభర్త నీజీవనమునకైనను లేకుండ సమ
స్తమును పరులపాలుచేయుచున్నాఁడు. ఆయనతో నీవు చెప్పి కాపుర
ముండుట కొకయి ల్లయినను నిలుపుకొమ్ము." అని యంగలార్ప
మొదలుపెట్టిరి. వారిపలుకుల కామె యొంతమాత్రమును విషాదము
నొందక ప్రసన్నముఖముతో "ఆయన యేమిచేసినను నాకు సంతో
షమే. నాతో నేమియు చెప్పక మీరు చెప్పవలసిన దాయనతోనే
చెప్పి చేయింపుఁడు." అని వారిని పంపివేసెను. వా రామెతో చెప్పిన
మాట లేవియు సత్యములు కావు. నాయనంతరమున నామెకు తన
మనసు వచ్చినట్లు చేసికొనుటకయి వేయిరూపాయలు రొక్కమిచ్చు
టకును సుఖజీవనార్థమయి నెల యొకటికి ముప్పదేసి రూపాయల
చొప్పున యావజ్జీవము నిచ్చుచుండుటకును తోఁటలోఁగాని యూరి
లోఁగాని యామెకిష్టము వచ్చినచోట కాపుర ముండుట కిల్లిచ్చుట
కును దానపత్రములోనే నేను తగినయేర్పాటులను చేసితిని.

ఆమెకు పువ్వులయం దత్యంతప్రీతి. అందుచేత తాను ప్రతి
దినమును తలలో పుష్పములు ధరించుచుండుటయే కాక వితంతు

శరణాలయములోని బాలవితంతువుల కందఱికిని స్వయముగా నొక్కొక్క పువ్వు తలలో పెట్టుచుండును. అంతే కాక తగినన్ని పువ్వులున్నప్పుడెల్లను శనివారము మధ్యాహ్నమున బుట్టలో వేసి కొని కొనిపోయి సమాజములో ప్రార్థనకు వచ్చుతరుణుల కెల్ల నిచ్చుచుండును. నావలెనే యామె వేషభాషలయందంతగా క్రొత్త మార్పుల నవలంబింపక పూర్వకాలపు నగలను వస్త్రములను బొట్టును దాల్చి పూర్వకాలపు ముత్తయిదువవలె నుండుచుండును.

మనుష్యమాత్రులగుటచేత నాభార్యయందును కొన్నిలోపములున్నను గుణబాహుళ్యముచుబట్టి యామెను స్త్రీరత్నమని చెప్పవచ్చును. అట్టిస్త్రీరత్నము మందభాగ్యుఁడనైన నాకు కడవఱకును దక్కనందుకు ఖేదమునొందుచున్నాను.

మంచివారికి మరణమే సాక్షియని పెద్దలు చెప్పుచున్నారు.

శ్లో. అనాయాసేన మరణం, వినా దైన్యేనజీవనం
దేహి మే కృపయా దేవ, త్వయి భక్తి రచంచలా.

అని యనాయాసమరణమును, దైన్యహీనమైన జీవనమును, నిశ్చలమయిన దేశభక్తిని, దయచేయవలెనని తొల్లిటి మహాత్ములు దేవుని ప్రార్థించియున్నారు.

ఈకోరికల నన్నిటిని కరుణాస్వరూపుఁడైన పరమేశ్వరుఁడు నాభార్యవిషయమున ప్రసాదించెను. రాత్రి పదిగంటలవఱకును పని చేసివచ్చి యీశ్వరుని ప్రార్థించి పక్కమీఁద పరుండి యాయాసలేశమైనను లేకుండ నామె నిద్రలోనే యీశ్వరసాన్నిధ్యము చేరెను. ఆమె మొదట నెన్నికష్టముల నొందెనో కడపట నన్నిసుఖముల ననుభవించుచు నెక్కడకు పోయినను పోయినచోటనెల్ల గౌరవమునొందుచు దైన్యము లేని జీవనము చేసెను. మృతినొందిన దినమున నూ

అసంఖ్యాకులగు జనులు సమస్తమతములవారును సమస్తజాతులవారును వచ్చి చూచి తమదుఃఖములు దెలుపుటయు పరస్థలములనుండి తంత్రీవార్తలును రాజధానీపరిపాలకులు సంస్థానాధిపతులు మొదలయినవారి యొద్దనుండి పరామర్శలేఖలును వచ్చుటయు తెలుఁగుదేశములోని సమస్తవార్తాపత్రికలును సమాజములును తమ సానుభూతి దెలుపుటయు నామె మంచితనమునకు సాక్ష్యములుగా నున్నవని చెప్పవచ్చును. ఈశ్వరునియందలి నిశ్చలభక్తి నామె స్థాపించినప్రార్థనాసమాజమును రచించిన భగవత్కీర్తనలును చాటుచున్నవి. మనుష్యజన్మ మెత్తినవారు కోరవలసిన దింతకంటె మఱి యేమి యుండును! ఈశ్వరుఁడామెకు నిత్యశాంతియు శాశ్వతానందమును కలిగించును గాక!"

ఇంతవఱకును నాభార్యనుగూర్చియు తోఁటనుగూర్చియు చెప్పితిని. ఇఁక నాభార్యమరణకాలమునుండియు నాకు సంభవించిన దుర్దశనుగూర్చి కొంచెము చెప్పుకొనవలసియున్నది. నాభార్యపోయిన మఱునాటినుండియు నాకు వంటచేసి పెట్టువారు లేరు; నాకు సంరక్షణముచేయువారు లేరు. పులవర్తి సుబ్బారావుగారియింట రెండుమూఁడు కులుతిని యెట్లో కాలక్షేపము కొన్నిదినములు చేసితిని. నాకష్టమును జూచి జాలిపడి రాచర్లరత్నమ్మ నా సంరక్షణము చేయఁబూనుకొని మాతోఁటలోనికివచ్చెను, ఈమె మిక్కిలి మంచిది; నాయందుభక్తి విశ్వాసములుకలది. ఈమె వితంతువివాహమును చేసికొన్నవారిలో రెండవవాఁడగు రాచర్ల రామచంద్రరావుగారిభార్య. భర్త 1888-వ సంవత్సరమునందు మరణమునొందగాఁ గొన్నిసంవత్సరములు మాకొమారితవలె మాయింటనేయుండినది. అందుచేత నాకు వంటపెట్టులు చేయురీతియు, నాసంరక్షరణము చేయుక్రమమును, చక్కఁగా తెలిసినదయి యుండెను. ఈమె నాసంరక్షణమునకుఁ బూనుకొనుటచేత

మొలబంటి దుఃఖములో మోకాలిబంటిసంతోష మన్నట్లు నా భార్య పోయిన దుఃఖములోఁ గొంత సంతోషమును బొందఁగలిగితిని. నా భార్యపోయినలోపమంతగాఁ గనఁబడకుండ నీమె శరణాలయములోని వితంతువులను సహితము చూచుచుండునని నమ్మితిని. అందుచేత నే నీమె సాయముతో వితంతుశరణాలయములోనే వాసముచేయఁదలచి నాపాత్రసామగ్రిని పందిరిపట్టెమంచమును నేనక్కడకే తెప్పించుకొని సుబ్బారావున్నయింటి కెదురుగా క్రొత్తగా హనుమంతరావుగారు విడిచిపోయిన యింటిలో ప్రవేశించి నాకక్కడనే వంటచేయుట కేర్పాటుచేసితిని. రత్నమ్మ నాకు వంటచేసి పెట్టుచు, వితంతు శరణాలయము పనిచూచుచు, అందలివారిని ప్రతి శనివారమును ప్రార్థన నిమిత్తమయి పట్టణములో నున్న స్త్రీల ప్రార్థనమందిరము నకు తీసికొనిపోయి తీసికొని వచ్చుచు, రాత్రులు వారితోడ పరుండి వారిని కనిపెట్టి చూచుచు, సర్వవిధముల నేను చేయు పనికి సాయపడుచు, ఉండెను. ఈమె నాయొద్ద నుండుట సుబ్బారావున కని ష్టముగానుండెను. రత్నమ్మ నాయొద్దనుండి నాకుసంరక్షణము చేయుట చిరకాలము సాగినదికాదు. అల్పకాలములోనే పట్టణములో నున్న యీమె తల్లి తనకు జబ్బుగా నున్నదనియు తనపద్దకు వచ్చి తనకు నిమ్మళించినతరువాత మరల పోవలసినదనియు వర్తమానములు పం పుచు వచ్చెను. ఈవర్తమానముల నీమె లక్ష్యముచేయక కొంతకాల మూరకుండెనుగాని గతదినమున తల్లి మంచముమీఁదినుండి లేవలేక పోఁగా కాచిపోయువారు లేకపోయిరని వర్తమానము రాఁగా విధిలేక వెళ్ళవలసిన దయ్యెను. ఆమెను తల్లి మరల నావద్దకు రానియ్యలేదు. తోఁటలోనేవచ్చిప్రత్యేకముగా కాపుర ముండవలసిన దనియు అక్కడ నీకూఁతురే నీసంరక్షణము చేయుననియు ఏలోపమును లేకుండ మాతోఁటలోని సేవకులు కావలసిన పనులను

చేయుదు రనియు, చెప్పి తల్లిని నేను బహువిధముల ప్రార్థించితిని గాని యేమియు కార్యము లేకపోయెను. అందుచేత నేను గత్యంతరము లేక సుబ్బారావుగారి యింటనే మరల చేరవలసినవాఁడ నైతిని. అక్కడ నున్నకాలములో నేను నాభోజనము నిమిత్తమయి నెలకు పదేసి రూపాయలను రొక్కముగా నిచ్చుచుంటిని. కట్టెలు కొననక్కఱలేక మాతోఁటలోనివే పంపుచుంటిని. పాలు పెరుగులు నావే యిచ్చుచుంటిని. తఱచుగా కూరలు సహితము నేనే కొనితెచ్చుచుంటిని. నేను జీత మిచ్చెడు మాపనికత్తెయే యింట నూరక పనిచేయుచుండెను. ఊరుఁగాయలు మొదలైనవి మాయింట పెట్టినవే యుండెను. ఒక్కకూర చేసి వేళ కింతయన్నము పెట్టినఁజాలును. నాకది యు సరిగా జరిగినది కాదు. పగలు పదిగంటలకు లోపల నెప్పుడును వంట కాలేదు. పదిగంటలయిన తరువాత నేను స్నానముచేసి భోజనార్థము పోయినను కొన్ని సమయములందప్పటికిని వంటకాక యరగంట సేపును గంటసేపును వేచియుండవలసి వచ్చుచుండెను. అన్నము మేము తినెడు మంచిబియ్యముతో వండినదిగాక ముతకబియ్యముతో వండినదిగాను, ఒకనాఁడు పలుకు గలదిగాను, ఒకనాఁడు చిముడు నదిగాను, ఉండుచువచ్చెను. కూరయు నుప్పెక్కువ యయియు తక్కువయియు పెట్టిన యన్నమునకు తగినదిగానే యుండుచు వచ్చెను. చేతఁగాని వారితో బాగులేదని తగవులాడుట యుచితము గాదని యూరకుండి పెట్టినదానిలో సైచినది తిని లేనిది మానివేసి లేచిపోవుచుంటిని. ఇందులో సుబ్బారావు తప్పిదము లేదు. ఒకానొకప్పుడు భార్యచేసినది బాగులేదని తాను స్వయముగానే కూరలు మొదలయినవి వండిపెట్టుచు వచ్చెను. ఒకనాటిరాత్రి కూర నాకు కలుపుకొనుటకు చాలకపోయెను. ఇఁక కొంచెము కూర వేయుమని నేనడుగఁగా నామె లే దనెను. నేను వట్టియన్నమే తిని లేచిపోయితిని.

సుబ్బారా విది ప్రక్కగదిలోనుండి వినెను. నేను వెళ్ళినతరువాత నతఁడు భోజనమునకు వచ్చినప్పుడు కూరవడ్డింపఁగా, ఆయన యడిగినప్పుడేల లే దన్నావని భార్యను కొట్టెను. స్త్రీ స్వయముగా శ్రద్ధ యుండి చేయవలెను గాని పురుషుఁడు బలవంతపెట్టి యెంతకాలము చేయింపఁగలుగును? కూర వండుట నేర్పవలసిన దని శరణాలయములో నున్న కామరాజుగడ్డ మంగమ్మతో నేను జెప్పఁగా నామె రెండు మూఁడు దినములువచ్చి తాను దగ్గఱనుండి కూర చేయించుచుండఁగా "నెంత కాలము నేర్పుట? నీవిఁక రావల" దని సుబ్బారా వామెను పంపివేసెను. నాకు వారింట జరిగెడు సంరక్షణ మంతయు నింతే. ఒక్కనాఁ డయినను నేనభ్యంగనస్నానము జేయలేను. ఇట్టి నాదురవస్థనుజూచి జాలినొంది యొకనాఁడు నేను స్నానముచేయుటకుఁ బోయినప్పుడు శరణాలయములో నుండిన దుర్గమ్మయు మంగమ్మయు తమ తలయంట్లకిచ్చిననూనెయు నలుగుపిండియు మిగిల్చి యుంచి యావఱకే నీళ్ళు కాచియుంచి నాకు తలంటెద మని బలవంతపెట్టిరి. మొదట వలదని వారించితిని గాని తరువాత వారి నిర్బంధమునకు లోఁబడినవాఁడనయి తలయంటించుకొని నీళ్లు పోయించుకొంటిని. వారు చమురు రాచి నాతలచిక్కు తీయఁజూచిరి కాని నా జుట్టంతయు నొక్కటేయట్టకట్టినందున దువ్వెనకు సాధ్యము కాకపోయెను. మఱునాఁడు నేను నాజుట్టును మంగలివానిచేత కత్తిరింపించితిని. నాభార్యపోయిన తరువాత నాలుగునెలల కిదియే నా మొదటి యభ్యంజన స్నానము. ఒకానొకప్పుడు నేను వారిమీఁద కోపపడుచు వచ్చినను వితంతుశరణాలయములోనివారు నన్ను తండ్రివలెఁ జూచుకొని ప్రేమించు చుండిరి. వా రందఱు నన్ను బాబయ్యగా రని పిలుతురు. నేనును వారిని నాపుత్రికలవలె భావించి ప్రేమించుచు వారి కేవిధ మయిన లోపమునుకలుగకుండ సాధ్యమయినంతవఱకుఁ జూచుచుందును. ఆకస్మి

కముగా నా భార్య పోవుటచేత శరణాలయములోనివారు తమయోగ క్షేమముల నారయుతల్లి పోయినట్టుగాఁ గొంతకాలము వఱకును విచారగ్రస్తు లయి దీనముఖములతో నుండుచు వచ్చిరి. వారిలో ముఖ్యముగా నాభార్యకు ప్రియతమురా లయి యుండిన మంగమ్మ యామె నిమిత్తము బెంగపెట్టుకొని రోగపడెను. నే నామెకు మందు లిప్పించుచు వచ్చితిని గాని మనోవ్యాధికి మందు లే దన్నట్టు చిర కాలమునకుఁ గాని యామె స్వస్థపడినది కాదు. నాకు వేళకు సరిగా భోజనము లేకపోవుటచేతను, తిన్న పదార్థములుసరిపడకపోవుటచేతను, తిన్నయన్న మఱగక విరేచనము లారంభమై నన్ను రాత్రియుఁ బగలును బాధింపఁ జొచ్చెను. నే నన్నము మానివేసి రెండుపూటఁ లును జావతోనే తృప్తినొందవలసిన వాఁడనయితిని. నాపథ్యపానము లను సరిగా చేయవలసినదని తొందరచేసినప్పుడు తనభార్య యాత్మ హత్య చేసికొనదనని బెదరించినట్లు సుబ్బరావే నాతో చెప్పెను. సుబ్బ రావు స్వయముగా తానే జావచేసి రాత్రియుఁబగలును నాకుఁదెచ్చి యిచ్చుచుండెను. ఔషధసేవచేత నా విరేచనములు కొంత తగ్గఁగా నేను పదునేనుదినములకు బెంగుళూరికి బోవుచుననఁగా మరల నొక పూఁట యన్నము తినుటకారంభించితిని. ఇది 1911-వ సంవత్సరము మార్చినెల మధ్యభాగము. విరేచనములు వెళ్లుటచేత బలహీనపడి నను మంచమెక్కక తిరుగుచునేయుండుటచేత విశంతుశరణాలయము నకుఁబోయి ప్రతిదినమును వారికి భోజనపదార్థములు పంచియిచ్చి మంచి మాటలతో వారిని ప్రోత్సాహపఱుచుచుండుటకును కట్టఁ బడుచుండిన పాఠశాలభవనమువద్దకు బండిలో ప్రతిదినమును పోయి యుదయసాయంకాలములయందు పని విచారించి వచ్చుచుండుటకును మ నినవాఁడను గాను.

ఈ ప్రకారముగాఁ గష్టపడుచుండినకాలములో నావద్ద స్థిరము గానుండి నాకుపచారము చేయఁగలవారి నెవ్వరినైనను సంపాదించు

కొనుట యత్యావశ్యకమనియు, తడవుగా సుబ్బరావువద్ద నుండుట సముచితము కాదనియు భావించి, వివాహము చేసికొని వితంతు శరణాలయములోనివా రెవ్వరైన యావజ్జీవమును నావద్దనుండి నాసంరక్షణము చేసెడుపక్షమున నట్టివారికి వేయి రూపాయల నిచ్చెదనని చెప్పితిని. అప్పు డందుండినవారిలో దుర్గమ్మయు, మంగమ్మయు, వేంకట సుబ్బమ్మయు నాకు వంటచేసిపెట్టి నా సంరక్షణము చేసెదమని ముందుకువచ్చిరి. వీరిలో వేంకటసుబ్బమ్మ తాను వివాహమేచేసికొనని చెప్పెను; దుర్గమ్మ తాను కులములోనుండువానినే వివాహము చేసికొనెద ననెను; మంగమ్మ తానిక్కడనుండ నొప్పుకొన్న వానినే బ్రహ్మసమాజవివాహవిధుల ననుసరించి వివాహము చేసికొని యావజ్జీవమును నాకుసంరక్షణము చేయుచుండుదు నని చెప్పెను. ఆమె హృదయమును పరీక్షించుటకయి నా కప్పు డొక యవకాశము సహితము తటస్థించెను. వయస్సునఁ బెద్దవాఁడు కాక మంచిస్థితియందున్న విధురుఁ డొక్కఁడు తాను నియోగివితంతువును వివాహము చేసికొనెదనని బరంపురమునుండి నాతో నుత్తర ప్రత్యుత్తరములను జరపుచుండెను. శరణాలయమునం దున్నవారిలో మంగమ్మ యొక్కతెయే నియోగివితంతువు. మంగమ్మనుగూర్చి నేనాతని కావలకె వ్రాయఁగా నతఁడామెను వివాహమాడుట కంగీకరించెను. ఈసంగతిని మంగమ్మతోఁ దెలుపఁగా, తాను నా సంరక్షణమును మాని వెళ్ళిపోవలసివచ్చునుగనుక తన కాసంబంధ మక్కఱలేదని యామె నిరాకరించెను దీనిని బట్టి యామెమాటలు మనఃపూర్తి యైనవే కాని బూటకములు కావని నేను నమ్మి యామె సంరక్షణములోనుండవలెనని నిశ్చయించుకొంటిని. నాసంరక్షణమునకు బూనుకొనెదమని పయికి వచ్చిన వీరు మువ్వురును నేనిచ్చెదనన్న ధనమునిమిత్తము కాక నా యందలి యాదరముచేతను, నా యసహాయస్థితివలనఁ గలిగిన జాలిచేతను, నాసంరక్షణమునకుఁ బూనుకొనఁ దలఁచిరి.

అప్పటి నా దేహస్థితినిబట్టి నా యవసానకాలము సమీపించుచున్నదని నాకుఁ దోఁచెను. ఈశ్వరచిత్త మెట్లుండునో యట్లుజరుగుటయే నాకు సంతోషకరమయినను, ఆరంభింపఁబడిన పాఠశాలాభవనమును బావియు ముగియువఱకును నేను జీవించియుండిన బాగుండునని మాత్రము మనసులోఁ దలఁచుచుంటిని. నా యప్పటి దేహస్థితిని నేను బెంగుళూరు వెళ్ళినతరువాత తీయించుకొన్న ఛాయాపటము తెలుపుదు చేయును. నేను బెంగుళూరు వెళ్ళుటకు నెలదినములుముందు రాజమహేంద్రపురములోని దొరతనమువారి బోధనాభ్యసన పాఠశాలలో శిక్షితుఁడగుచుండిన తెన్నేటి వేంకటదీక్షితులుగారు మాతోఁటకు వచ్చి యాచంటలో తనమిత్రుఁడొకఁడు వితంతువివాహమును జేసికొన నభిలషించుచున్నాఁడనియు, అతఁడచ్చటి పాఠశాలలో వ్యాయామబోధకుఁడుగా నున్నాఁడనియు, చెప్పెను. ఆపనియే యిక్కడ దొరకినయెడల నతఁడిక్కడ నుండునాయని నే నడిగితిని. సంతోషపూర్వకముగా నుండునని యతఁడుత్తరమిచ్చెను. అందుమీఁద నేను మంగమ్మ సంగతిని దీక్షితులుగారితోఁ జెప్పి యామె వివాహముచేసికొని నాయొద్దనే యుండి యావజ్జీవమును నాసంరక్షణమును జేయ నిశ్చయించుకొన్నదనియు, ఆమెను వివాహముచేసికొని నాయొద్దనేయుండెడుపక్షమున నే నాతని కిక్కడనే పని చెప్పించి యిల్లు కట్టించియిచ్చి భార్యకు మున్నూఱు రూపాయల నగలును ఇన్నూఱు రూపాయల రొక్కమును ఇచ్చెదననియు, చెప్పితిని. ఆయన యుత్తరము వ్రాసి తనమిత్రుని నిక్కడకుఁ బిలిపించిరి. అతని పేరు పోతరాజు సూర్యప్రకాశరావుగారు. అతనిని కందుకూరి వేంకటరత్నముగారి యొద్దకుఁబంపి, అతని స్థితిగతులను విచారించి తెలుపవలసినదని వ్రాసితిని. ఆయన విచారించి నాకు వ్రాసిపంపెను. అందుమీఁద నేనొకరి నొకరికిఁ జూపి వారంగీకరించినమీఁదట దీక్షితులు

గారితో చెప్పినమాటలనే సూర్యప్రకాశరావుగారితోఁ జెప్పి, మార్చి నెల మధ్యభాగమునందు దీక్షితులుగారియెదుటనే యిరువురను మరల మాటాడించి వివాహనిశ్చయము చేసి, నేను బెంగుళూరినుండి తిరిగి రాఁగానే వివాహము చేసెదనని చెప్పి పంపివేసితిని. ఇక నేను బెంగుళూరికి మూఁడు దినములకుఁ బోవుదుననఁగా శ్రీమతి మంగమ్మ నాకు వంటచేసిపెట్టుట కారంభించెను.

1911-వ సంవత్సరము మార్చి నెల 27-వ తేదీని మంగమ్మతోఁ గలిసి నేను బెంగుళూరికిఁబోయి స్వగృహమునఁ బ్రవేశించితిని. నాకు మంగమ్మ శక్తివంచనము లేక సంరక్షణ చేయుచుండినను నాదేహ మస్వస్థముగా నేయుండెను. మాయిల్లుసమస్తసౌఖ్యములును గలదియే యైనను నాకక్కడనుండుటకు మనసుగొలుప లేదు. ఎక్కడఁజూచినను గత సంవత్సరమున నేనును నాభార్యయు విహరించిన విహారము లును, సంభాషించిన సంభాషణములును, స్మరణకు వచ్చి నాభార్య యప్పుడు మృతినొందినట్లే మనస్సుకు నొప్పికలిగింపఁ జొచ్చెను. ఆగృహమునందుండుటనాకు నరకమునందున్నట్లుగాఁ గనఁబడినందున దానిని విక్రయించివేయుటకు నిశ్చయించుకొంటిని. అందుచేత వెం టనే యింటి నమ్మివేసి బైలుదేఱి చెన్నపురిమీఁదుగా రాజమహేం ద్రవరము చేరితిని. శ్రీమతి మంగమ్మ వివాహము వెంటనే జరగవల సినదే కాని వరుఁడు తోడనేరాక జాగుచేసినందున నక్టోబరు నెల 8 తేదీనిగాని యీలోపల జరగలేదు. నేను కొన్న రెండు బనారసుచీర లలో నొకదానిని వివాహసమయమున ధరించుటకయి మంగమ్మ కిచ్చి, దాని జతచీరను సుబ్బారావుభార్యకిచ్చితిని. వితంతు శరణా లయములోనున్న వారి కందరికిని అవికల గుడ్డలు కొని తీసికొనివచ్చి యిచ్చితిని. నేను బెంగుళూరిలోనున్న మూఁడు మాసములును వితంతు శరణాలయములో నున్నవారికి భోజనపదార్థములను పంచి

యిచ్చినందుకయి సుబ్బారావునకు నెలకాతేసి రూపాయలచొప్పున ప్రత్యేకముగానిచ్చితిని. ఆకాలములో తమయెడల సుబ్బారావుచూపిన కఠినత్వమునకయి తగవులాడి వితంతుశరణాలయములోనివారంఱును లేచిపోయెదమని నాకుసంఘవిజ్ఞాపనమునుబంపిరి. విచారించిమంచిమాటలు చెప్పి వారిని శాంతిపఱుచుటకయి కుందూరి వేంకటరత్నముగారు మొదలైనవారి పేరవ్రాసి, వారి మనసులు కరఁగునట్లుగా వారికి నేనొక పెద్దయుత్తరమును వ్రాసితిని. నాయుత్తరమును జదివినపిమ్మట వారు శాంతచిత్తులయి తమయుద్యమమును మానుకొనిరి. 1872 వ సంవత్సరపు మూఁడవ సంఖ్యశాసన విధులననుసరించి శ్రీమతిమంగమ్మ వివాహమయిన తరువాత వితంతు శరణాలయ కార్యములను జూచుటకై యామెకు నెల కాఱు రూపాయలును, తోఁటపనిచూచుటకయి యామె భర్తకు నెలకాఱు రూపాయలును, జీతము లేర్పఱిచి సమాజమువారు నిర్ధారణము చేసిరి. డిశంబరు నెల నుండి పాఠశాలోప సంఘమువారు పంౘ్రెండు రూపాయల జీతముమీఁద సూర్యప్రకాశ రావు గారికి సహాయ వ్యాయామ శిక్షకోద్యోగము నిచ్చిరి. ఇట్లు నాకు స్థిరముగా నన్నపానాములు జరిపి సంరక్షణము చేయువారేర్పడి వారితోడ నేను వాసముచేయ నారంభించినను శ్రమలు నివారణమయినవి కావు. వానినెల్ల నిందు వివరించుట యనావశ్యకము,

1911- వ సంవత్సరము డిసెంబరునెల కడపటను కాకినాడ నుండి రావు బహద్దరు వేంకటరత్నమునాయుఁడుగారు నన్ను చూడ వచ్చిరి. వారి నెదుర్కొని యింటికిఁ దీసికొనివచ్చుటకయి నాఁటి ప్రాతఃకాలమున నేను రాజమండ్రి యయోమార్గస్థానమునకు బండి మీఁద వెళ్ళితిని. వారిని కలిసికొని యింటికి మరల వచ్చునపుడు వారును నేనును త్రోవలోనున్న మా యున్నతపాఠశాలను జూడఁ బోయితిమి. మేడక్రింది భాగమునంతను వారును నేనును గలిసి తిరిగి

చూచితిమి. వారు మేడమీఁదికెక్కినప్పుడు కొంచెమాయాసముగా నుండినందున నేను మేడమె క్కలేను. క్రిందనేయుండి యాయన చూచివచ్చిన తరువాత బండిలోనెక్కి మే ముభయులమును మాతోఁటకు వచ్చితిమి. ఎండఁబడుటచేతను భోజనమునకు ప్రొద్దెక్కుటచేతను బడలికగా నుండి నాకాదినముననే కొంచెము జ్వరమువచ్చెనుగాని నే నెవ్వరికిని జెప్పలేను. నాయుఁడుగారు భోజనముచేసి సాయంకాలము వఱకును నాతో నుండి మరల కాకినాడకువెళ్ళిరి. నాకు జ్వర మంత కంతకు హెచ్చఁజొచ్చినది. ఈజ్వరవార్తవిని 1912-వ సంవత్సరము జనవరి నెల 3-వ తేదీని మధ్యాహ్నమున నన్నుఁ జూచుటకయి రెబ్బాప్రెగడ పాపయ్యగారును, జయంతి గంగన్నగారును, కుందూరి వేంకటరత్నముగారును వచ్చి, నేను మేడమీఁద వసారాలో పడక కుర్చిమీఁద పరుండియుండఁగా వారు నావద్ద కూరుచుండి యుండిరి. ఇంతలో నైద్యుఁడు నియమించిన ప్రకారముగా లోపలివారు నాకు కాఫీచేసి తెచ్చి యియ్యఁగా కొంచెముత్రాగితిని. తరువాత నత్యల్ప కాలములోనే నేను స్మృహతప్పి వెనుకకొరగితిని. అప్పుడు నాపెదవులు నల్లపడినవఁట! శ్వాసమాడలేదఁట! చేతిలో నాడి కనఁబడలేదఁట. హృదయము కొట్టుకొనుట మానివేసెనఁట! అక్కడ నున్న వారంద ఱును నాప్రాణము పోయినదనియే భావించి తొందరపడఁ జొచ్చిరి. ఇట్టిస్థితిలో నేను పావుగంటసే పుంటినని గడియారము చూచినవా రొకరు చెప్పిరి. తక్కిన వారును పదినిమిషముల కాలమునకు తక్కువ లేదని చెప్పిరి. అంతట నే నీశ్వరానుగ్రహముచేత నేలాగుననో తేఱుకొని కన్నులు విప్పిచూచితిని. అప్పుడు నేనొక ప్రక్కనుండి యొకప్రక్కకు తిరిగిలుటకైన శక్తుడను గాకపోయితిని. నాయవయవ ములు నాకు స్వాధీనముకాకుండెను. నామిత్రులు నన్ను గదిలోనికిలేసి కొనిపోయి మంచముమీఁదఁ బరుండఁబెట్టిరి. అటుతరువాత సహితము

నే నొక ప్రక్కనుండి ఇంకొక ప్రక్కకు త్రిగిలవలెనన్న నితరుల సాయములేక యొత్తిగిల లేకపోయితిని. ఆరాత్రి గంగన్నగారును వేంకటరత్నముగారును వచ్చి మేడమీఁద నాకు సాయముగా పరుండిరి. జనేవరి నెల 24-వ తేదీ వఱకును మంగమ్మగారు భర్తయు మేడమీఁద నాగదిలోనే పరుండుచువచ్చిరి. నాకు దినదినక్రమమున కొంచెము శక్తి రాఁదొడఁగినది గాని పదునేను దినములపైనిగాని నేను మంచముదిగి మేడమీఁద నైనను కొంచెము నడయాడలేక పోయితిని. ఇట్టిస్థితిలో మంగమ్మ నా కుపచారములు చేయుచు వేళకు పథ్యపానము లమర్చుచు మిక్కిలి కష్టపడెను. ప్రకాశరావుగారును నానిమిత్తము మిక్కిలి శ్రమపడిరి. నేను వ్యాధి బాధితుఁడనయి యున్న కాలములో నాయందు దయయుంచి యితర స్థలములలోని వారును రాజమహేంద్రవరములోనివారును గూడ మిత్రు లనేకులు మాతోఁటకు వచ్చి నాక్షేమమును విచారించిపోవుచు వచ్చినందుకు వారియెడల నే నెంతయుఁ గృతజ్ఞుఁడనయి యున్నాను. రాజమహేంద్రవరములోని వారిని మాత్రమే కాక పరస్థలములనుండి వచ్చిన భిషఙ్మణి పండిత డి. గోపాలాచార్యులు మొదలైనవారిని సహితము మావారు మేడమీఁదికివచ్చి నన్నుచూచి పోనియ్యనందున కెంత యుఁ జింతిల్లుచున్నాను. ఫిబ్రవరి నెల 14 వ తేదీనాటికి నాకు కొంతబలము వచ్చి తిరుగుచు నే నప్పటినుండి కొంత పనిచేయఁగలుగుదునేమో యనుకొన్నాను. ఆదినమున నాదినచర్య పుస్తకములో నిట్లు వ్రాయఁబడియున్నది.

"The All-merciful Father has kindly given me a fresh lease of life for some use. I am sorry I have been sinning against my God by spending my time in idleness. I repent for the past and solemnly promise to try to do something useful every day however small it may be from tomorrow. May God help in my resolve" సర్వకారుణ్యుఁడైన తండ్రియేదో

ఉపయోగము నిమిత్త మనుగ్రహపూర్వకముగా నాకొక నూతనజీవ పట్టప్రదానము చేసియున్నాఁడు. నాకాలమును సోమరితనములోఁ గడపుటవలన నాదేవునియెడల నేను పాపము చేయుచున్నవాఁడ నని చింత నొందుచున్నాను. జరిగినదానికి పశ్చాత్తాపపడి రేపటినుండి ప్రతిదినమును నే నెంతయయినను ఉపయోగకరమైనదానిని కొంత చేయఁ బ్రయత్నింతునని దృఢప్రతిజ్ఞ చేయుచున్నాను. నానిశ్చయములో భగవంతుఁడు నాకు సహాయుఁడగును గాక!)

మఱునాఁడు కొంచెము వ్రాయవలెనని ప్రయత్నముచేసితిని గాని చేయి వడఁక వ్రేళ్ళుపట్టీయకపోఁగా నేమియు వ్రాయలేకపోయితిని. తరువాత సహితము రెండుమూఁడుత్తరములు వ్రాయునప్పటికే నా కాయాసము కలుగుచు వచ్చెను. బెంగుళూరు వెళ్ళుటకుముందు మిత్రబృందమును సమావేశపఱిచి యానందాశ్రమములోనాకు రోగశాంతి చేసినందునకు దేవునకుఁ గృతజ్ఞతా పూర్వకములైన వందనముల సమర్పించితిని. ఈసమయమునందు నాయాహ్వానము నంగీకరించి పట్టణములోని పురుషులును స్త్రీలును పలువురు వచ్చి నాతోఁ గలిసి యీశ్వరునకు వందనముల నర్పించి ప్రార్థనము చేసిరి. ఇట్లు వితంతు శరణాలయములోనివారును పట్టణములోనివారును స్త్రీలెంతోమంది యీ ప్రార్థనసమయమునందును నంతకుముందు వ్యాధిదశయందును వచ్చిచూచి నన్నాదరించిపోయినను, పదుమూఁడేండ్లు నాచేత పోషింపఁబడి విద్యాబుద్ధులు పడసిన పులవర్తి సుబ్బారావు భార్య మాత్రము మాతోఁటలోనే యుండియు నా వ్యాధిసమయమునఁగాని రోగశాంతియగుచున్న దినములలోఁగాని ప్రార్థనదినమున గాని యొక్కసారివచ్చి నన్ను చూచినపాపమునఁ బోయినది కాదు. ఒక్కపర్యాయము చూచిరమ్మని సుబ్బరావయినను పంపినవాఁడు కాఁడు. కృతజ్ఞతయనఁగా నిట్లు గదా యుండవలెను? పాతకాలపు

సెలవులియ్యఁగానే మేమందఱమును గలిసి బెంగుళూరికి పోవలెనని నేననుకొంటినిగాని ప్రకాశరావుగారు బెంగుళూరికిఁ బోయినఁ గాని యారోగ్యము కలుగదనియు, గర్భవతియైయున్న తన భార్యనుపచారమునకయి వెంటఁగొని ముందుగానే పోవలసినదనియు, ఎండకాలపు సెలవులియ్యఁగానే తాను వచ్చి మమ్ముఁ గలసికొనెద ననియు, మార్చినెల మధ్యనుండియు నన్ను త్వరపెట్టుచు వచ్చినందున మంగమ్మతో ఏప్రిల్ నెల 8-వ తేదిని బైలుదేఱి బెంగుళూరికి పోయితిని. ప్రకాశరావుగారా నెల 27-వ తేదిని మమ్మక్కడఁ గలిసికొనిరి.

నాభార్య మృతినొందిన సంవత్సరములోపలనే నే నామెకు సమాధిని గట్టించితిని. నామిత్రుఁడైన దేశిరాజు పెద బాపయ్యగారు నాభార్యకంటె రెండు సంవత్సరములు ముందుగానే మృతుఁడయ్యెను. అప్పుడొక సంఘముచేరి యాయన పేరు శాశ్వతపఱుచుటకయి నిర్ధారణములుచేసి చందాలు సమకూర్చిరి. అంతేకాని క్రియ శూన్యమయ్యెను. నాభార్య కాలధర్మము నొందినతరువాత రెండేండ్లు గడచిపోయెను. అయినను సమాధియైనను కట్టించుజాడ కానఁబడకపోయెను. మనలో నెవ్వరైన నొక్కఁడుపూనుకొని పనిచేసిననే పనిజరుగునుగాని సమాజమునకు విడిచిపెట్టినయెడల నేమియు జరగదు. అందఱును కలిసి సంఘీభవించి కార్యము నడుపుసద్గుణమును మనవారింకను నేర్చుకొన వలసియున్నది. నాలుగేండ్లు గడచియు సమాధియైనను కట్టించు ప్రయత్నము లేకపోవుటచేత నేను పూనుకొని 1912-వ సంవత్సరాంతమున సమాజముయొక్క నిర్ధారణానుసారముగా సమాధి సుంచుటకయి కావలసిన యింటిని మాతోఁటలోనే కట్టించి, చందాలవలన వచ్చిన ధనము పోఁగా శేషించిన వ్యయమును నేను పెట్టుటకు నిశ్చయించుకొని సమాధి నిర్మాణము నిమిత్తమయి కలకత్తా కుత్తరువు చేసితిని. అది కలకత్తాలో చేయఁబడి యిచ్చటకు

వచ్చియున్నది. శీఘ్రకాలములోనే కాపయ్యాగారి యస్థికలందుంచఁబడి దానికొఱకయి కట్టింపఁబడిన యింటిలో సమాధి ప్రతిష్ఠింపఁబడును. కీర్తిశేషులయిన నామిత్రులు బసవరాజు గవర్రాజుగారు తమమరణమునకుముం దప్పుడుండిన వితంతు వివాహ సమాజమునకు తమ సొత్తులోఁ గొంత యియ్యవలెనని తమ మరణశాసనములో వ్రాసిరి. పెత్తల్లి సొత్తు విషయమున గవర్రాజుగారు నడపిన వ్యాజ్యములో మండల న్యాయసభలోను ఉన్నత న్యాయసభలోను ప్రతివాదికయిన వ్యయములనన్నిటిని గవర్రాజుగారే యియ్యవలసినట్లుగా తన్మరణానంతరమున తీర్పగుటచేతను, ఆయన చేసియుండిన ఋణములను తీర్చవలసి వచ్చుటచేతను, వాని క్రిందనే యాయనకప్పుడుండినసొత్తును వినియోగింపవలసినచ్చి మరణశాసనము నాచరణమునకుఁ దెచ్చుట కవకాశము లేకపోయెను. అయినను తన్మరణానంరమున వేఱొకసొత్తు కొంత యాయన భార్యకుచేరుటచేతను అయోమార్గమును వేయుటకయి స్థలమును దీసికొన్నప్పుడు ప్రతిఫల మనుకొన్నదానికంటె నెక్కువగా వచ్చుటచేతను, దానిలోనుండి వితంతు వివాహాభివృద్ధికయి కొంత ఇచ్చి భర్తగారికోరిక నెఱవేర్పవలెనని యాయన భార్య మొదటినుండియు సంకల్పించుకొని యుండెను. ఆమెయు నామె యల్లుడయిన దాసువిష్ణురావుగారును గలిసి 1910 సంవత్సరాంతమున రు 900-0-0 ల రొక్కమును రు 1100-0-0 లకు కనపర్తి శ్రీరాములుగారు వారి పేర వ్రాసియిచ్చిన వాగ్దానపత్రము మొత్తము రెండువేల రూపాయలు నావశమున నిచ్చిరి. శ్రీరాములుగారియ్యవలసినది యింకను రావలసియున్నది.

హితకారిణీసమాజమున్నను వితంతు శరణాలయము మొదలయినవానిక్రింద నయ్యెడు వ్యయములలో విశేషభాగము నేనే పెట్టుబడి పెట్టవలసినవాఁడ నగుచున్నాను. సమాజము పక్షమున నేను

వ్యయపెట్టినది యావఱకే యాఱువేల రూపాయలకు మించిపోయినది. సమాజమువారి కది తీర్పుమార్గము లేకపోఁగా పైపెచ్చు సమాజ వ్యయములకయి మాసమాసమును నూఱేసి రూపాయలు నేనే పెట్టవలసినవాఁడ నగుచున్నాను. నా కాయము తగ్గుచున్నది. ఋణము హెచ్చుచున్నది. సమాజ పక్షమున వ్యయపెట్టిన యాఱువేల రూపాయలలో మూఁడువేలరూపాయలు * ఋణములచేత వచ్చినవే. నెల కిరువది నాలుగు రూపాయల యుపకారవేతనమును పొందెడి నీవు వేలకొలదివ్యయము చేయుటకు నీకుసొమ్మెక్కడనుండి వచ్చుచున్నదని యడుగవచ్చును. ధనాగమమునకు నాకు రెండుమార్గములుండినవి—ఒకటి మద్విరచిత పుస్తకవిక్రయము; రెండవది సర్వకలాశాలా పరీక్షకత్వము. అశక్తతవలన నేను క్రొత్తపుస్తకములను చేయలేనివాఁడ నగుటచేతను బుద్ధిమంతులయిన పిన్నవారు పలువురు బైలుదేఱి వివిధవిషయములలో క్రొత్తక్రొత్తపుస్తకములను రచియించి ప్రకటించుచుండుటచేతను, నాపుస్తకములయమ్మక మిప్పుడు తగ్గిపోయినది.

1887-వ సంవత్సరమునుండి యవిచ్ఛిన్నముగా నిరువదియైదేండ్లు నేను సర్వకలాశాలాపరీక్షకుఁడనుగానుండి దానివలనదాదాపుగా నిరువదివేల రూపాయల నార్జించి యంతయు పరార్థముగానే యుపయోగించి నాభార్య మరణానంతరమున 1911-వ సంవత్సరమునుండి పరీక్షకత్వము నాకక్కఱలేదని మానివేసినందున నాకిప్పుడా యాయ

* సమాజముయొక్క యీ ధనవిషయకాఠిన్యమును విని జాలిపొంది యుదార స్వభావులును దయాళువులును నైన శ్రీ పిఠాపురము రాజాగారు ఋణవిముక్తికయి యిటీవల సమాజమునకు మూఁడువేల రూపాయలను దయచేయుటయే కాక మాసవ్యయములకయి నెల కిరువదేసి రూపాయలను బంపుచున్నారు.

మసలే పోయినది. నాభార్య జీవించియుండినప్పుడే నేను రాత్రులు మేలుకొని దగ్గుతో బాధపడుచు పరీక్షాపత్రములను దిద్దుచు కష్టపడు చుండుటచూచి యామె యాపనిని మానుకొవలసినదని బహుసంవత్సరములు నన్ను నిర్బంధపెట్టెను. ఇదిగో పయి సంవత్సరమునుండి మానివేసెదనని జరుపుచు వచ్చితిని గాని యామె జీవితకాలములో మానివేసినవాడనుగాను. నేనట్లు శ్రమపడి ధనమార్జించుచువచ్చుట వితంతు శరణాలయాదుల పోషణార్థమే కాని స్వోదరపోషణార్థము గాదు. నాభార్యపోయిన విరక్తిచేతను శరీరాశక్తతచేతను పరీక్షకపదవిని విడిచిపెట్టితిని. అంతే కాక నేను ప్రతి సంవత్సరమును మృత్యువును ప్రతీక్షించుచున్నాఁడను. ప్రతి సంవత్సరమును మృత్యుదేవత నాకత్యంత సామీప్యమునకు వచ్చుచుండియు నెందుచేతనోగానినన్ను విడిచి మరల వెనుకకు నడుచుచున్నది. ఈశ్వరాజ్ఞ యెప్పుడగునో తెలియకున్నది. ఈ దుర్బలసేవకునిచేత నీశ్వరుఁ డింకను నేమైనఁ జేయింపఁ దలఁచుకొన్నాఁడేమో! నాయిచ్ఛగాక సర్వవిషయముల యందును నీశ్వరేచ్ఛయే నెఱవేఱునుగాక! ఒకటి రెండుపుస్తకములు వ్రాయుటయో తప్ప నేను తలపెట్టిన కార్యము లన్నియు నీశ్వరానుగ్రహమువలన నెఱవేఱినవి. ఇఁక నే నీలోకములోనుండవలసిన ప్రయోజన మంతగా నాబుద్ధికి పొడకట్టదు. పైని చెప్పినట్లు నా ధనాగమము మట్టుపడినందున వితంతుశరణాలయ వ్యయాదులకు తెచ్చుటయే నా కతిభారముగానున్నది. అందుచేతనే యస్మద్దేశీయులకును పురవాసులకును నే నీక్రిందివిజ్ఞాపనమును జేసికొనియున్నాను. దీనిగతి యెట్లయినను నాముక్కున నూపిరి యుండఁగా నే నీవితంతుశరణాలయాదులను విడిచి పోఁగొట్టజాలను. నావయఃకాలమునంతను దేశాభివృద్ధి ప్రయత్నములోఁగడపి యసహాయుఁడ నయి యశక్తుఁడ నయి బీదపడియున్న నా సాయమునకు వచ్చి యస్మద్దేశీయులు వితంతుశర

గాలయాదిక సంరక్షణభారమును వహింతురని నమ్ముచున్నాను. స్వోదరభరణార్థమయి నే నితరులను వేఁడను. దానికిఁ జాలిన యల్ప విత్తమును దేవుఁడు నా కుపకారవేతన రూపమున ననుగ్రహించి యున్నాఁడు. ఈధనాభావముచేతనే యిప్పుడమ్ముడుపోయిన నాపుస్తకములను పునర్ముద్రితములను గావింపశక్తుఁడనుగా కున్నాను. భక్తవత్సలుఁడైన పరమాత్ముఁడు నా యీశక్తిలోపమును బాపునుగాక!

## విజ్ఞాపనము.

అస్మద్దేశీయులైన యాంధ్రమహాజనులారా! రాజమహేంద్రపుర వాస్తవ్యులగు భ్రాతృవరులారా!

మీవాఁడ నైన నేను నాకడపటిదైన చిన్నవిన్నపము నొకదానిని మీకుఁ జేయుచున్నాను. మీరింతవఱకును నాయెడలఁజూపుచువచ్చిన యాదరమునే యిప్పుడును జూపి నాప్రార్థనను సఫలము చేయక మానరన్న సంపూర్ణ విశ్వాసమును గలవాఁడనయిమిమ్మిప్పుడీ విజ్ఞాపనముతో సమీపింప సాహసించుచున్నాఁడను. ఆంధ్రదేశాభివృద్ధికై యిప్పుడు పనిచేయుచున్న సమర్థతములలోఁ బరిగణింపఁబడుటకుఁ దగినవాఁడను కాకపోయినను, చెట్టు లేని దేశములో నాముదపుచెట్టే మహావృక్ష మన్నట్లు విద్యాధికు లంతగా లేనికాలమునం దాంధ్రదేశాభివృద్ధికై పాటుపడ నారంభించినవారిలో నేనొక్కఁడనని చెప్పుకొనుట కేవల ప్రగల్భోక్తిగా నెన్నఁబడదని తలఁచెదను. నే నెప్పుడును ధనవంతుఁడను గాను; బలవంతుడను గాను; అధికారవంతుడను గాను; అధికవిద్యావంతుడను గాను; ఇట్లు మహాకార్య విజయనిర్వహణములకుఁ గావలసినవానిలో దేనినిగలవాఁడను కాకపోయినను, దేశాభిమాన మొక్కటి మాత్రము కొంచెము కలవాఁడ నగుటచేతఁ దత్ప్రేరణమువలన శక్యాశక్యవిచారముచేయక దేశసంస్కరణోద్యమములో నడుగుపెట్టసాహసించితిని. నేను పూనిన

యీకార్యము నెంతవఱకు నిర్వహింపఁగలిగితినో చెప్పలేనుగాని దాని నిమిత్తమయి నాకుండిన యల్పధనమును యౌవనమును బలమును విద్యను బుద్ధిని ధారవోసి మీయాదరమునకుఁ బాత్రుఁడను గాఁగలిగితి ననిమాత్రము చెప్పఁగలను. నేను చెన్నపట్టణమునకుఁ బోఁబోవునప్పుడు నాకుమీరు చేసినగౌరవమును నాభార్యస్వర్గస్థురాలయినప్పుడు మీరుచూపిన సమదుఃఖభావమును దీనికి దృష్టాంతము లని చెప్పవచ్చును. మీవలెనే మనదేశస్థులితరులను నిర్హేతుకజాయమాన కటాక్షముచేత నన్ను గొప్పచేయుచు వచ్చుటచే నాయల్పసంస్కార ప్రయత్నమునుబట్టి తెలుఁగుదేశములో రాజమహేంద్రవరము సంస్కారములకు జన్మభూమియని పేరుపడినది. ఈప్రఖ్యాతికి నేనే కారణము గాదు; నేనునాటిన సంస్కారలతాంకురమును బయికి లేవఁదీసి పట్టుకొమ్మలయి నిలిచి నానాముఖముల తీఁగలు ప్రాఁకఁ జేసిన న్యాపతి సుబ్బారావుపంతులుగారు మొదలైన మహనీయులు దీనికి ముఖ్యకారకు లని చెప్పవలసి యున్నది. పేరెట్లువచ్చిన నేమి యింతవఱకును ప్రతికూల జంఝూమారుతాటోపముచేతను బాధకలోక సూర్యాతప తాపముచేతను వేళ్ళతోఁ బెల్లగిల్లి యెండిపోకుండ ప్రాణముతో నిలువఁబెట్టఁబడిన యీసంస్కారవల్లీమతల్లిని కొనలు సాగించి సఫలము జేయవలసిన భారమిప్పుడు మీరు వహింపవలసిన యవసరము తటస్థించినది. దేశాభిమానమాననీయులైన మీరు మీపాలఁబడిన యీభారమును సంతోషపూర్వకముగాఁ బైని వేసికొని యధికసమర్థతతో నిర్వహించి రాజమహేంద్రవరమున కీవఱకుఁ గలిగిన కీర్తికంటె నెక్కువకీర్తిని దెత్తురని మిమ్ము మీవృద్ధసోదరుఁడ నైన నేను వినయపూర్వకముగా వేఁడుచున్నాను. పై యట్లు పలుకుటచేత వచ్చినకీర్తి యొక్క రాజమహేంద్రవరముదే యని నేను చెప్పిన ట్లనుకొనఁగూడదు. ఈకీర్తి తెలుఁగుదేశ మంతటిది గాని రాజమహేంద్రవ

రము దొక్కదానిదే కాదు. నేనఱవదేశమునందును కన్నడదేశము నందును సంచారము చేసినప్పు డక్కడివారు సంఘసంస్కారాది విషయములలో తమ దేశములకంటె తెలుఁగుదేశ మెక్కువ యభివృద్ధి పొందినదని చెప్పుకొనుచుండఁగా నేను పలుమాఱు విని యాంధ్రదేశముయొక్క యభ్యున్నతి కానందించి గర్వపడుచు వచ్చినాఁడను. ఓయాంధ్రమహాజనులారా! పైని చెప్పిన దొక్క రాజమహేంద్రవరమునకే వర్తించునని తలంపఁబోకుఁడు. అది రాజమహేంద్రవరమున కెట్లు వర్తించునో యట్లే యాంధ్రదేశమున కంతకును వర్తించును. తగిన సంరక్షణము లేక శోషిల్లియున్న సంస్కారవల్లికను దయారసామృతధారతో తడిపిసాహాయ్యసంశ్రయశాఖని జూపవలసిన భారము రాజమహేంద్రవర మెట్లో యట్లే యాంధ్రదేశమంతయు పూనవలయునమట ధర్మమయియున్నది. ఓ యాంధ్రమహాజనులారా! సంఘసంస్కారాభిలాషులారా! మీ రనంతసత్ఫల సంధాయకమైన సాంఘిక సంస్కారవల్లరీ పోషణభారమును వహింపుఁడు. నే నిప్పుడు తొంటి జవసత్వములను గోలుపోయి పేదపడినవాఁడ నయి దేశమాతృసేవనమున కనర్హమయిన దురవస్థలో నున్నాఁడను. ప్రస్తుతశోచనీయ దురవస్థలో నున్న తన యీపేదపుత్రునియెడల సౌభ్రాత్రమును వెలిపి, అశక్తతచే నలసి సొమ్మసిల్లి సంస్కార భారవహనమునకుఁ జాలక తడఁబడుచున్న దయనీయుఁడైన మీబీదసోదరునకి విశ్రాంతి నిచ్చి మీ రాభారమును పూర్ణముగా భరింపుఁడని యాంధ్రమాత తన ప్రియపుత్రులైన మిమ్ము వేవిధముల వేఁడుచున్నది. మాతృస్నేహతత్పరు లైన మీరు తదాజ్ఞను శిరసావహింతురుగాక!

అస్మద్దేశీయులారా! సహజన్ములారా! (వళిభి ర్ముఖ మాక్రాంతం పలితే నాంకితం శిరః। గాత్రాణి శిథిలాయంతే తృష్ణైకా తరుణాయతే. "ముఖము ముడుఁతలు పడుచున్నది; తల తెల్లబడుచున్నది.

సర్వావయవములును శిథిలము లగుచున్నవి. కాని యొక్క తృష్ణ మాత్రమే పడుచుతనము నొందుచున్నది" అని భర్తృహరి చెప్పినట్లుగా నాకు వృద్ధత్వముచేత సమస్తశక్తులు నుడుగుచున్నను సంస్కారాశ మాత్ర ముడుగుచుండలేదు. వయస్సు పోయినను వాంఛ పోలేదు. ఈసంస్కారవిషయకాత్యాశయే నన్నిప్పుడు మీకీవిన్నపమును జేయఁ బురికొల్పుచున్నది. సావధానచిత్తతతో నావిన్నపమాలకింపుఁడు. దేశాభివృద్ధికి సంస్కార మన్నివిషయములలోను సమానముగా నుండవలయును గాని యొక్కవిషయములో మాత్రమే నడచుచుండుట చాలదు. ఏకవిషయాభివృద్ధి యెప్పుడును నిజమయిన యభివృద్ధి కానేరదు? ఈసత్యమును మనవారి మనస్సులలో దృఢముగా నాటింపవలెనని యీవఱ కెన్నియో సారులు నాయుపన్యాసములలో చెప్పుచు వచ్చినను తనివి చెందక చెప్పినదానినే కడసారి మీకిప్పుడు మరలఁ జెప్పుచున్నాను, శరీరమందలి సమస్తాంగములును పరస్పరానుకూలముగా నెదుగక యొక కడుపో కాలో యెక్కువగా నెదిగినప్పుడు దానిని మహోదరశ్లీపదాది నామములతో నశుభదాయకమైన రోగచిహ్నముగా నెట్లు భావింతుమో యట్లే ధార్మిక సాంఘికాభివృద్ధి ప్రయత్నము నుపేక్షించి యొక్క రాజ్యాంగస్వాతంత్ర్యాభివృద్ధినిగూర్చియే యుద్యమించుటయు సంపూర్ణసుఖసాధకము కాఁజాలదని భావింప వలయును. బయట సుఖదాయకము లైన రాజ్యాంగ స్వాతంత్ర్యములను సంపూర్ణముగా పొందఁగలవార మయినను మనయింట కుటిలకులాచారభూతమునకు దాసులమయి కడుపునఁ బుట్టినబిడ్డల స్వాతంత్ర్యములనైన నియ్యఁజాలక యనాథబాలలు సంతత దుస్సహ వైధవ్యదుఃఖములపాలయి బాధపడు చుండగాఁ జూచుచు మనమేమి సుఖ మనుభవింపఁ గలుగుదుము? ఇంట సుఖదాయకము లైన సత్కులాచారస్వాతంత్ర్యములను సంపూర్ణముగాఁ

బొందగలవార మయినను బయట ధనప్రాణములకు రక్షణము చేయని క్రూరనిరంకుశ ప్రభుత్వమునకు నిరంతర దాస్యము చేయవలసిన యెడల నేమి సుఖమనుభవింపఁగలుగుదుము? ఇంటను బయటనుగూడ హేయ దాస్యమునుండి విముక్తుల మయి యుభయస్వాతంత్ర్యములను బొందఁ గలిగినప్పుడు గదా మనము నిష్కళంక సౌఖ్యము నొంది యవ్యా జానందము నొందఁ గలుగుదుము? కాఁబట్టి నిజమైన దేశక్షేమము నపేక్షించిన పక్షమున దేనిని నుపేక్షింపక సమస్త స్వాతంత్ర్యముల నిమిత్తమును సమస్తాభివృద్ధుల నిమిత్తమును సమానముగా కృషి చేయుఁడు. అప్పుడు మీరు మీ దేశమును సౌఖ్యవంతముగాను సం తోషవంతముగాను నభ్యుదయవంతముగాను జేయఁగలుగుదురు.

ఇప్పుడు మన యాంధ్రదేశము మేలుకొని కన్నులు తెఱచి మాంద్యమును మాని చుఱుకుఁదనమును పూని దేశాభివృద్ధికరము లైన నానాక్షేత్రములయందు మహోత్సాహముతో కృషి చేయు చున్నందుకు నే నెంతయు సంతోష మొందుచున్నాను. ఇది మన దేశముయొక్క పురోభివృద్ధికి శుభసూచకముగానున్నది. ఇటువంటి స్థితి మనమాతృభూమికి కలుఁగగాఁ జూడవలెనని నేను ముప్పదినలు వదిసంవత్సరములక్రిందట నభిలషించుచుంటిని. అప్పుడాకోరిక దివా స్వప్నసదృశముగాఁ గనఁబడినది; ఇప్పుడది ప్రత్యక్షసిద్ధమైనది. అప్పుడు రాజమహేంద్రవరమువంటి పట్టణములలో సహితము యువజనులు సభలు చేయుటయే సామాన్యజనుల దృష్టికి తప్పిదముగాఁ గనఁబడు చుండెను; ఇప్పుడు చిన్నపల్లెలయందు సహితము సభలు జరుగుచు నందు వివిధవిషయములు వితర్కింపఁబడి జనసామాన్యముచే మెప్పొం దుచున్నవి. అప్పుడు స్త్రీవిద్య పేరు చెప్పినంతమాత్రనె తలకంటకముగా నుండి బహుజనులచే దూషింపఁ బడుచుండెను. ఇప్పు డెల్లయెడల బాలికాపాఠశాల లేర్పడి స్త్రీవిద్య యభివృద్ధి నొంది సభలు ప్రసంగ

ములు పుస్తకములు చేయఁగల స్త్రీలచేనొప్పి భూషింపఁబడుచున్నది. అప్పుడు దేశభాషలో పురుషులు చదువుటకు సహితము తగిన పుస్తకములు లేకుండినవి; ఇప్పుడు పుస్తక రచనకయి సమాజము లేర్పడి పురుషుల కుపయుక్తములైనవి మాత్రమే కాక స్త్రీలు చదువఁదగిన పుస్తకములు గూడ దినదినాభివృద్ధి నొందుచున్నవి. అప్పుడు విద్యాభిరుచిగల ధనవంతులకే పుస్తకసంపాదనము బహు వ్యయప్రయాస లభ్యమగుచుండెను; ఇప్పు డూరూర పఠనమందిరములు ప్రబలి బీదలకును పుస్తకసంపాదన మత్యల్పవ్యయసాధ్య మగుచున్నది. అప్పుడాంధ్ర వార్తాపత్రిక లంతగా లేకయు, ఉండిన యొకటి రెండును జదువువారు లేకయు, దివానక్షత్రములవలె తేజరిల్లకుండెను; ఇప్పుడు దేశభాషావృత్తాంత పత్రికలసంఖ్య యధిక మయి వేలకొలఁది చదువరులను గలవయి కొన్ని పట్ట పగటి సూర్యునివలె ప్రకాశించుచున్నవి. అప్పుడు సముద్రమునొకమీఁద విద్యాగమముకొఱకు చెన్నపురికి వెళ్ళినవారికే ప్రాయశ్చిత్తములు విధింపఁబడుచుండెను; ఇప్పుడు విద్యా వాణిజ్య శిల్ప శాస్త్రాభ్యాసార్థ మయి ఖండాంతరములకును ద్వీపాంతరములకును బోయి వచ్చినవారికిని ప్రాయశ్చిత్తము లక్కఱ లేకపోవుచున్నవి. ఇటువంటివి చెప్పఁబూనినచో ననేకములు చెప్ప వచ్చును. ఈసంవత్సరము బాపట్ల మొదలయిన స్థలములయందు జరిగినసభలును సభలలో జనులు చూపిన యుత్సాహమును మనదేశము యొక్క వర్ధమాన స్థితిని, కర్తవ్యనిర్ణయ వ్యగ్రతను, నూతనోద్యోగానురాగమును, సహాసప్రముఖములఁ జాటుచున్నవి. అయినను సాంఘిక సంస్కారాదులయందు మనవారికి మాటలలోఁగల శూరత్వము కార్యములలో నింకను నే నభిలషించినంత కనఁబడుచుండ లేదు. ఈ యుద్యమములలో, మాట లెక్కువగాను కార్యములు తక్కువగాను కావలసినవి కొన్ని; మాటలు తక్కువగాను కార్య

ము లెక్కువగాను కావలసినవి కొన్ని. రాజ్యాంగ సంస్కారప్రయత్నమిందు మొదటి తరగతిలోనిది; సాంఘిక సంస్కారప్రయత్నమిందు రెండవ తరగతిలోనిది. మొదటి దానికంటె రెండవ దానిలో ప్రయాస మెక్కువయున్నది. ఈ రెంటిలో సంఘ సంస్కారము మన చేతిలో నున్నది; రాజ్యాంగ సంస్కారము దొరతనమువారి చేతిలో నున్నది. ప్రయత్నము చేసినయెడల స్వాధీనమయి యున్న సంఘ సంస్కారమునందు జయమొందుట నిశ్చయము; పరాధీనమయియున్న రాజ్యాంగ సంస్కారమునందు జయమొందుట సందియము. మనచేతిలోనుండి మనము చేయవలసినది నిర్భయముగా చేసినప్పుడు గదా మనము నిర్మల మనస్కులమనియు విశ్వాసపాత్రులమనియు, లోకమునకుఁ దేటపడును. కాఁబట్టి రాజ్యాంగ స్వాతంత్ర్య సంపాదనోత్సాహముచేత సంఘ సంస్కరణ ప్రయత్నము నుపేక్షింపకుండ వలయునని మనవారిని వినయపూర్వకముగా వేఁడుచున్నాను. ఓ విద్యార్థికులారా! మన సంఘస్థితి బాగుపడినం గాని ప్రభుత్వమువా రనుగ్రహించెడు రాజ్యాంగ స్వాతంత్ర్యఫలములను మనము నిర్విచారముగా ననుభవింపఁజాలము. ఈసత్యమును మీరు దృఢముగా మనస్సునం దుంచుకొని సంఘ సంస్కారోద్యమమునందు గూడ సమానశ్రద్ధను వహించి పనిచేయుఁడు. ఈ పనిలో నెక్కువ కష్టము లున్నవనుటకు సందేహము లేదు. ఉన్ననేమి? ఉండనిండు. ఏకార్యమునందును కష్టపడినంగాని ఫలముగలుగదు. ఎక్కువఫలముల ననుభవింపఁ గోరువా రెక్కువకష్టములను పడవలెను. ఈ పనియందిప్పుడు పామరులవలనిబాధ మునుపున్నంత లేదు. కాని పూని నిలిచి నిశ్శంకముగాఁ బనిచేయువారి కింకొకవిధమైన బాధ లిప్పు డధికమగుచున్నవి. ఫలించిన వృక్షమునకే రాతిదెబ్బ లన్నట్లు పనిచేసి సత్ఫలములఁ గాంచనెంచినవా రట్టి బాధలకు భయపడక వాని నోరి

ములో సహించుటకు సంసిద్ధులయి యుండవలెను. ఒక రేవిషయమున నైనను పనిచేసి పేరు పొందుచున్నప్పుడీర్ష్యాళువులయినవారు కొందఱు బైలుదేఱి యోర్వలేమిచేత వారిపైని లేనిదోషముల నారోపించుచు వారిపేరునకు భంగము కలిగింపఁ బాటుపడుదురు. మఱి కొందఱు వారికీర్తికి మాలిన్యము కలిగించి వారి నడఁగఁ ద్రొక్కుటచేతనే తాము పైకి రావలెనని ప్రయత్నము చేయుదురు. ఈ యిరుతెగలవారివలని యుపద్రవము సంఘసంస్కార దీక్ష వహించి నాయకు లయి పనిచేయువారికెట్లో యట్లే రాజ్యాంగ సంస్కార ప్రయత్న ప్రతిజ్ఞనుపూని నాయకులై పనిచేయువారికిని గలదు. రాజ్యాంగ విషయములలోఁ బనిచేయు నాయకులను గూర్చి వారిమూలమున పరిపాలకుల యనుగ్రహమును సంపాదించి యున్నతపదములను బిరుదములను బొందవలెనన్న యపేక్షతో వేషము వేసిన స్వార్థపరులనియో, మూఢజనులను బుఱికొల్పి దొరతనమువారిమీఁద వారికి ద్వేషము పుట్టించి ప్రజలలో గొప్పవాఁడని మెప్పొందగోరు రాజద్రోహులనియో, యీయసూయాశీలురు సమయమునకుఁ దగినట్లు నిష్కారణముగా దేశసేవాపరులమీఁద మిథ్యాదోషారోపణములు చేయుదురు. ఈ దేశసేవాపరులు దేశమునకుఁ జేసిన యుపకారమునకై చెన్నపట్టణము మొదలైన దూరస్థలములయందు సహితము సభలుచేసి మహాజనులు తమకృతజ్ఞతను బ్రకటించుచు నభినందన పత్రికలను జదువుచుండఁగా స్వస్థలములోని యసూయాపరులు తారొక్కరే యుచితానుచిత వివేకముగల బుద్ధిమంతులయినట్టుగా సభలు చేసినవారిసభలలోఁ బ్రసంగించినవారిని యుక్తాయుక్తవివేకశూన్యులైన బుద్ధిహీనులని పత్రికలలోఁ దెగడుచుందురు. ఈదోషైక దృక్కులు జనులకుఁ జేసెడిది యుపకారలేశమయినను గావఁబడదు. లోకాధికార ధూర్వహు లనేకులు తమకన్నులయెదుట లంచములు పుచ్చుకొని ధనికు లగుచుండఁగా వారియశా

